వేంకట్రామ గ్రంథమాల - చతుర్థ ప్రచురణ,

శ్రీరస్తు.

# ప్రభావతీ ప్రద్యుమ్నము

మహాకవి పింగళి సూరనార్య ప్రణీతము

సవ్యాఖ్యానము

: వ్యా

'కవితాభూషణ, విద్వత్కవి శేఖర'

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి




: ప్రకాశకులు :

వేంకట్రామ గ్రంథమాల

విజయవాడ - మద్రాసు - హైదరాబాదు

స్వామ్యములు మా యధీనము]　　1962　　[మూల్యము రు 8—0—0

శ్రీ గురుమూర్తయేనమః

# పీఠిక

"కవీనాం మానసం నౌమి తరంతి ప్రతిభాం బుధా
యత్ర హంసవయాం సీవ భువనాని చతుర్దశ".

ఈ విశ్వము నామాత్మకమును, రూపాత్మకము నని ద్వివిధమనియు, నందు నామాత్మక విశ్వమునకు నిర్మాత కవి యనియు, రూపాత్మక విశ్వమునకు నిర్మాత చతుర్ముఖబ్రహ్మ యనియు-

"నామరూపాత్మకం విశ్వం దృశ్యతే య దిదం ద్విధా
తత్రాద్యస్య కవిర్వేధా ద్వితీయస్య చతుర్ముఖః.

అను నభియుక్తోక్తి తెలుపుచున్నది." దృగ్గోచరమగు నీపాంచభౌతిక జగత్తును బ్రహ్మ సృష్టించినట్లే కవి యీజగమునఁగలపదార్థములకెల్ల నామములను (సంజ్ఞలను) సృజించి వ్యవహార యోగ్య మగు నొక పెద్ద నామాత్మకజగత్తు నక్షరరూపమున బ్రహ్మనిర్మితమగు రూపాత్మక జగత్తును మించినదిగా సృజించినాఁడు. కాన కవి బ్రహ్మతో సమానస్థానము నొందినాఁడు.

కవి సృజనకర్తృతాసామ్యమున బ్రహ్మ యంతవాఁడు కావచ్చును. కాని యీ యిరువు రలోఁ బ్రథముఁడు కవి యెట్లయ్యెనో యరయవలసియున్నది. "ధాతా యథాపూర్వ మకల్పయత్, దివం చాంతరిక్షమథోస్వః" అనిశ్రుతి. బ్రహ్మ తనకు పూర్వమెట్లుండెనో యట్లే యీ పాంచభౌతికజగమును సృజించెనని తెలియుటచే సృజనక్రియయందు బ్రహ్మ యస్వతంత్రుఁ డయినాఁడు. లాను జన్మింపకము న్నీజగమెట్లుండెడిదో ధాతకు తెలియు టెట్లనిన మహా ప్రళయమున సైతము వేదములు యథాపూర్వముగనే యుండు ననియుఁ, బరమాత్మ ధాతను సృజించి, యతనికి వేదముల నిచ్చె ననియు, నా వేదశబ్దముల నుచ్చరించుచు బ్రహ్మ వెనుకటి వలెనే విశ్వమును సృజించె ననియు 'యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' అను శ్రుతివలనను, 'వేదశబ్దేభ్య ఏ వాదౌ నిర్మమే స మహేశ్వరః' అను స్మృతివలనను బూర్వోత్తరమీమాంసావేత్తలు నిర్ణయించిరి. దీనిచే బ్రహ్మసృష్టి స్వతంత్రము కా దని తేలినది.

కవిసృష్టి యట్లు గాక స్వతంత్రమైనది. ఏవేదము బ్రహ్మసృష్టి కాధారమో యదియే కవికిని బ్రమాణమైనను, దనసృష్టి కా వైదికశబ్దము లుపయోగింప రాని వగుటచే, వేదమందలి ధర్మమును మాత్రమే గ్రహించి, దానియందలి నామాత్మకజగత్తునకుఁ బ్రతిబింబముగా వేఱొక నామాత్మకజగత్తు సృజించుకొనెను. ఆ కవిసృష్టి నియతికృత నియమము లేనిదియు, దుఃఖస్పర్శమే లేక విగళితవేద్యాంతర మగు నానందమయమును, నెట్టి యుపాదానకారణము నపేక్షింపనిదియు, నవరస రుచిరమునై-నియతిబద్ధమును, సుఖదుఃఖ మిళితమును, పరమాణ్వాద్యుపాదాన కారణమును, షడ్రసమాత్రము నగు బ్రహ్మసృష్టి నతికరించుటచేఁ బ్రథమస్థానము కవికి లభించినది.

'కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః' అని పరమాత్మనే కవిగా నీశోపనిషత్తు చెప్పినది. పిదప వేదశబ్దముల నుచ్చరించుచు రూపాత్మకజగత్తును సృజించు బ్రహ్మ కవి యయ్యెను. 'ఆదికవయే' అని భాగవతము బ్రహ్మను స్తుతించెను. 'ఏకో భూ న్నళినా త్వరస్తు పులినా ద్వల్మీకత శ్చాపర, స్తే సర్వే కవయ స్త్రిలోకగురవ స్తేభ్యో సమస్కుర్మహే' యనుటయు, గల్గెను. 'కవిః క్రాంతదర్శీ' (కవి దివ్యదృష్టిగలవాఁడు) అను శ్రుత్యుక్తి చొప్పున వేదమును సాక్షాత్కరింపఁ జేసికొనిన వ్యాసాదులు కవు లైరి. ఆ ఋషులకావ్యము లుపనిషత్తు లైనవి. క్రమముగా నాశ్రుతిధర్మములనే వ్యంగ్యమర్యాదచే నుపదేశింప నిపుణులైన కాళిదాస భవభూతి ప్రభృతులును కవు లైనారు.

అట్టిమహాకవుల కావ్యములు ధర్మార్థకామ మోక్షములందును, కళలయందును విచక్షణత్వమును, కీర్తిని నానందమును నిచ్చునని యొక రనఁగా - కీర్తిని, ధనమును, లోకవ్యవహార జ్ఞానమును, నమంగళనివృత్తిని, స్వానుసంధాన సమనంతరమే విగళితవేద్యాంతరమగు నానందమును గూర్చుచుఁ బ్రియురాలువోలె సరసమగువాక్కుచే వ్యంగ్యమర్యాదతోఁ జతుర్వర్గోపదేశమును గావించు నని మఱికొందఱు పెద్ద లనిరి.

కేవల ధర్మోపదేశమునకే యగుచో వేదములు, పురాణములును జాలును. కావ్యమెందులకు? అనువిషయమున 'ప్రభుశాసనము లగు వేదోదితధర్మములను, అర్థప్రవణములై మిత్రుని హితోపదేశములవంటివగు పురాణకథితధర్మములను, సుకుమారమతు లగురాజపుత్రాదులకు, రోగికి మధుశర్కరాది మధురవస్తు మిళితమైన కటుతిక్తౌషధముల సేవింప నిచ్చినటుల-రసస్యందిని యగు వాక్కుచేఁ జమత్కారచ్ఛన్న మొనర్చి యుపదేశించు శక్తి కావ్యమునకే కలదని నిర్ణయ మొనర్చిరి. వేదపురాణాదులవలె వట్టిధర్మమునే కాక బ్రహ్మానంద సబ్రహ్మచారి యగు నానందముతో ధర్మమును, ధర్మములో నానందమును మేళవించి చెప్పవలె నన్న నొక్క కావ్యమునకే చెల్లును. కాన కావ్య ముత్తమకోటి కెక్కినది.

అట్లగుచో 'ధర్మాధర్మ నిర్ణయమున 'కావ్యాలాపాంశ్చ వర్జయే' త్తను నిషేధ మేల పొడసూపినది? కావ్యమే సర్వోత్కృష్టము గదా!' యని యందు రేమో, ఆత్మబుద్ధిప్రమాణులై యిహసుఖలాలసులై యాముష్మికచింతనాతిదూరులైన వారి కావ్యములకే యా నిషేధము కాని 'వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా' యనియు, 'భారతం పంచమో వేద' యనియు, 'నిగమకల్పతరో ర్గళితం ఫల'మ్మనియు వినుతింపఁ బడుచు వేదచ్ఛాయలందుఁ బ్రవర్తింప నేర్చిన రామాయణ, భారత భాగవతాదులగు నార్షకావ్యములకుఁ గాని, వాని యడుగుజాడలలోనే నడచిన కాళిదాసాది కవీంద్రుల లౌకికకావ్యములకుఁ గాని యా నిషేధము తగులనే తగులదు.

యథేష్టవర్తనులై సుకుమారబుద్ధు లగునట్టి రాజపుత్రాదుల మనస్సును సులభముగాఁ దనవంకకుఁ ద్రిప్పుకొనుటకై, లోకమున శృంగారరసమునకు వశము కాని ప్రాణి యొకటియు సామాన్యముగా నుండఁబోవ దని గ్రహించియే-శబ్దము శరీరముగాను, రస మాత్మగాను నవతరించిన కావ్యలక్ష్మి నవరసములందును శృంగారమునే ముఖ్యముగాను, నావశ్యకముగాను స్వీకరించుచు వచ్చినది. కాని యా శృంగారమును బురుషార్థములతో మేళవించువేళ ఋషివలె మనస్సంయమము కలిగి వర్తింపవలసిన కవి తా నుపదేష్ట ననెడి మాట మఱచి యాశృంగార రసప్రవాహమునఁ బడి మునుఁగుచుఁ దేలుచుఁ గొట్టుకొనిపోయెనా! ప్రయోజన మటు లుండఁ దనకును లోకము

నకును శాశ్వత మగుహాని మాత్రము తప్పక చేసినవాఁడగును. అట్టి ప్రమాదము కలుగకుండుటకే ప్రతివిషయమందును ననఁగా వస్తు నాయకగుణాలంకార రీతి వృత్తి ప్రభృతులందు దోషములను దెలియఁజెప్పి సరియైనమార్గమున నడుపుటకై కవికి నొకశాసనము కావలసియుంటచే కావ్యముతో పాటు శాస్త్రమును బుట్టవలసి వచ్చినది. మఱియు కావ్యమున ధర్మ ముపసర్జన మట్లును, నుపనిషత్ప్రతిపాదిత మగు బ్రహ్మానందమునకు సబ్రహ్మచారి యగు రసానందము ప్రధాన మట్లును గనవచ్చుటంజేసి, పురుషార్థము మాట మఱచి, "యానంద మాత్రపర్యవసాయి కావ్య"మనుకొను కవుల నుద్దేశించియే 'నిరంకుశాః కవయః' అనుటయు సంభవిల్లెను.

ఇంతటి గంభీరాశయముతో, నెన్నియో కట్టుబాట్లతో నొప్పారు కావ్యసృష్టి తొలుదొలుత మనభారతదేశమునకు సామాన్యభాష యైన సంస్కృతమునఁ బూర్వోక్త మహాకవి పరంపరయొక్క యవ్యాజకృపను వెలువడఁగా తత్కవితలందుఁ దళుకు తళుకు మని మెఱయు చమత్కార బీజములను సంగ్రహించి, యాలంకారికులు శాస్త్రరూపమున నొకమార్గ మేర్పఱచిరి. ఆమార్గమున సంస్కృతమువెంబడినే ఆంధ్ర, ద్రావిడ, కర్ణాటాదిభాషలును బయనింపఁజొచ్చెను. అందు మన తెలుఁగునకు, సంస్కృతమును దానివికృతులగు ప్రాకృతములును, బ్రతివేశిని లగు ద్రవిడ కర్ణాటాది భాషలును కొంతపదజాలము నందిచ్చినవి. కాని కవిత్వమునఁ బరిపాక మాదినే కలుగక కాఁబోలును, తెలుఁగువారు "గాసట బీసటే చదివి గాథలు త్రవ్వుచుండువారైరి". యుద్ధమల్లుని శాసనపద్యములు తెలుఁగుకవిత్వ మప్పుడే యవతరించినట్లు సూచించుచున్నను, అంతకు ముందే పొడసూపియుండు నని యూహింపఁ దగియున్నది.

అట్టిదశయం దాంధ్రులభాగ్యంబున నవిరళ జపహోమ తత్పరుఁడు, విపులశబ్దశాసనుఁడు, సంహితాభ్యాసుఁడు, నుభయభాషా కావ్యరచనాభిశోభితుఁడు, మత్యమరాధిపాచార్యుఁడు నగు, నన్నపార్యుఁడు తగినసాధనసంపత్తి గొని యాంధ్రకవితకు ఘంటాపథ మేర్పఱచెను. పిమ్మట నామార్గమందే నన్నయకుఁ గల సంస్కృతభాషా మార్మికలను మఱపించు తెలుఁగునుడికారపు సొంపుసంపదల నింపి తిక్కనసోమయాజి కవిబ్రహ్మ యనిపించుకొని, తరువాతి కవులకుఁ బూజ్యుఁ డయ్యెను. ఈ యిరువుర సృష్టినైపుణ్యమును సమీకరించుచు నెఱ్ఱాప్రగడ మహాభారతమునకుఁ ద్రివేణీ సంగమ ఖ్యాతిని నెలకొల్పి మూర్తిత్రయ సంఖ్యను బూరించెను. వీరికి నడుమను, తరువాతను, నన్నెచోడ, నాచనసోమనాథాది మహాకవులు వారి వారి యభిరుచుల ననుసరించి సంస్కృతాంధ్రపద సంయోజన విశిష్టతచే నాంధ్రకవిత కొకపరిపూర్ణతను, నిత్యదీప్తిని, నిరుపమ గౌరవమును గలిగించిరి. భాస్కరుఁడు, పినవీరన మున్నగు కొందఱు సంస్కృతపద భూయిష్ఠముగా రచన సాగించినను, మాధుర్య ముట్టిపడునట్టి విశేషమును జూపుచునే వచ్చిరి. పిదప శ్రీనాథునికవిత నన్నయమార్గమును దాఁటిన సంస్కృతసమాస భూయిష్ఠతయును, తిక్కన మార్గమును మించిన తెలుఁగునుడికారపుసొంపును గబళించి జీర్ణించుకొని గట్టిని త్రేఁచినది.

శ్రీనాథునియుగ మారంభమైనది. పురాణములనుండి కవులదృష్టి కావ్యములమీఁదఁ బడినది. నైషధాంధ్రీకరణముతో సంస్కృత శ్రవ్య దృశ్య కావ్యములును, గద్యకావ్యములును గూడఁ దెనుఁగునఁ బద్యప్రబంధములై యవతరించినవి. శ్రీనాథుని కాశీఖండ, భీమఖండములు స్కాందపురాణాంతర్గతము లైనను బురాణలక్షణములకంటెఁ బ్రబంధలక్షణములే వానియం దెక్కువగఁ గనవచ్చుటంజేసి వర్ణనప్రీతి కవులలో నెక్కువ యైనది. భాగవ తాష్టమస్కంధమందు గజేంద్రమోక్షణ, వామన, నృసింహావతారాది ఘట్టము లందలి పెద్దపెద్ద గద్యములు దానికిఁ దార్కాణ యగుచున్నవి. 'పింగళి సూరనకుఁ బూర్వమం దున్నకవుల కందఱకు శ్రీనాథుని

సంస్కృత దీర్ఘసమాసప్రీతి వదలలేదని యొకరనిరి. కాని సూరనకు మాత్రము లేదనుట యెట్లు ? "తలఁపన్ జొప్పడి యొప్పె నప్పుడు" అనుకథ నిజమైనను, గాకున్నను, సూరనకుఁ గల సంస్కృతసమాసప్రీతి కది సాక్షి గాదా ? అది కాదు. సూరన తెలుఁగుజాతీయములు హెచ్చుగా వాడినాఁ డందురా ? భాషాంతరీకరణమునఁ గూడ శ్రీనాథుఁడు వాడిన తెలుఁగుజాతీయములు తక్కువగా నున్నవా ? సంస్కృతమునఁగలభావమును తెలుఁగుజాతీయమునందు వెల్లడించు పాటవము శ్రీనాథునిసొమ్మై యుండ నట్లు స్థూలముగాఁ దేలఁ బలుకుట యుచితము కాదు. ఎట్లయిన నది యంతయు నాంధ్రీకరణయుగమే యైనది.

రాయలయుగ మారంభ మైనది. ఆంధ్రసరస్వతికి నది వసంతకాల మైనది. అందాఁకఁ బ్రాయశః సంస్కృతమునుండి పరివర్తనముగా వెలసిన తెలుఁగుకవిత స్వతంత్ర మార్గమునఁ బయనింప నుత్కంఠితయై కృత్రిమరత్నములని కేవల కల్పనాకథల నెన్నుకొనక, గనినుండి త్రవ్వియెత్తిన రత్నము లని యాద్యసత్కథలను గాదని, సానఁబట్టి దీరిన జాతిరత్నము లని సత్కవి కల్పనా విభూషావహ పూర్వవృత్తములను స్వీకరించి, చతుర్విధాహార్యములతో నూతన ఫక్కిని రంగస్థలమున నర్తకియై, గండపెండారములు, రత్నహారములు, నగ్రహారములు, హయవేదండాదులు కానుకలుగఁ గైకొని ధగధగ మెఱసి తారాపథ మంటినది. ఆంధ్రశారద కానాఁడు కల్గిన వైభవము 'న భూతో నభవిష్యతి'. సాహితీ సమరాంగణ సార్వభౌముఁ డగు కృష్ణరాయని రసజ్ఞతకు, నౌదార్యమునకును నాయుగము ముకురాయమాణమైనది. రాయలు స్వహస్తమునఁ దొడిగిన గండపెండారము డాకాల మెఱయఁగా - కోకట గ్రామా ద్యనేకాగ్రహారములఁ బడసిన యల్లసాని పెద్దన యా యుగమున కాచార్య పురుషుఁడు. పురాణాంతర్గత మగు నితివృత్తము నెత్తికొని, యందుఁ దననాఁటి యాచారవ్యవహారాదికమును మేళవించి రసమొలుక ప్రబంధ మెట్లురచింపవలెనో శిరీషకుసుమ పేశల సుధామయోక్తులతో మనుచరిత్రము నట్లు రచించి చూపి యాంధ్ర కవితా పితామహుఁడైనాఁడు. ఆంధ్ర ప్రబంధరచనకు త్రోవచూపె నే కాని యాతని కావ్యము వర్ణనాదికమందు మారన శ్రీనాథుల సారస్వతమునకుఁ బ్రతిబింబమే యని విమర్శకుల యభిప్రాయము. ఔఁగాక ! అతఁ డాంధ్రకవితాపితామహుఁడే. పారిజాతాపహరణమున నంది తిమ్మనార్యుఁడు నూతన పథమునఁ దన కవితను నడపినాఁడు. తెలుఁగు నుడికారమున కొక క్రొత్తతియ్యఁదనము గలుగ ముద్దులొలికించి మధురకవి యైనాఁడు. తాజ్ మహలు శిల్పమును కవితాశిల్పముచేఁ బరిహసించు పస గలుగ వసుచరిత్రమును రచించి శ్లేష కవులకు మార్గదర్శియై రామరాజభూషణుఁడు భారతీకర్ణభూషణమై భాసిల్లినాడు. ద్వ్యర్థి కావ్యమైనహరిశ్చంద్ర నలోపాఖ్యాన మాతనికొక లీలాసృష్టి యైనది. మఱియు మాదయ్యగారి మల్లన, సంకుసాల నృసింహకవి, కంసాలి భద్రయ్య మున్నగు నెందఱో మహామహులు రాయలవారి యాస్థానమున నుండెడివా రని చారిత్రకులు నిర్ధరించినారు. భట్టుమూర్తి, పింగలి, తెనాలివారు మాత్రము నాఁడు లేకపోవుటే కాదు. తరువాతఁ గూడ భిన్నభిన్నదేశములలో వేర్వేఱు కాలములలో నుండువా రని కూడఁ గొందఱు చారిత్రకులు సిద్ధాంతమొనర్చి, రాయలనాఁటి యష్టదిగ్గజములలోని వా రనుట పొసఁగ దని తేల్చిరి. కృష్ణరాయనికి ఆంధ్రభోజుఁ డని బిరుద మున్నప్పుడు భోజుని యాస్థానమున నున్నట్లే యాతని యాస్థానమునను 'అష్టదిగ్గజము' లనిపించుకొను మహాకవు లుండి యుందురనియు, నట్టివా రీయెనమండ్రే యైయుందు రనియు నిటీవలి బుద్ధిమంతుల యూహయై యుండును. కాని 'విద్యాఖేలనభోజ' బిరుదాంకితుఁ డగురాయ లాంధ్రభోజుఁడును కాఁదగును. వాఙ్మయజగత్తునవలీలవహించిన యీయెనమండ్రుసుదిగ్గజములును కావచ్చును. ఈదిగ్గజము లేకాలము నుండి యేకాలముదాఁక వ్యాపించి యున్నారో యాకాల మంతయును ప్రబంధయుగ మని

సంకేతింపను వచ్చును. ఆముక్తమాల్యద, సత్యభామాప్రీణనము, మదాలసాచరిత్రము మున్నగు మహాకావ్యములను రచించి, ప్రభువైన రాయలవారిని సేవించుచు నిట్టి యష్టదిగ్గజము లేమి యష్టోత్తరశత దిగ్గజము లుండవచ్చును. ప్రతివత్సరము వసంతోత్సవములం దెందఱో మహాకవులను రాయలవారు సమ్మానించుచుండువారని పారిజాతాపహరణమునందుఁ దిమ్మనార్యుఁడు చెప్పియున్నాఁడు. 'కుండలిపతిశయన కర్ణకుండలిత రసాఖండ కవికావ్యుఁడు' అని పెద్దన మనుచరిత్రమునఁ బల్కెను. కావున శ్రీకృష్ణరాయల యుద్బోధమున తనకాలముననే కాక యనంతరము కొన్ని శతాబ్దులదాఁకఁ దెలుఁగునాఁటఁ బ్రబంధరచనాస్రవంతి ప్రవహించుచునే వచ్చిన దనుట సత్యము.

రాయలయుగము ప్రబంధయుగ మనుటకు నేఁటి విమర్శకులు కొంద ఱర్ధాంగీకారము చూపుచున్నారు. నన్నయతిక్కనల మధ్యకాలమువాఁ డగువన్నెచోడమహాకవి ప్రథమస్వతంత్ర ప్రబంధకర్త యనుచున్నారు. ఆతని కుమారసంభవము కాళిదాసుని కుమారసంభవముతో నామమాత్రసామ్యమే కాని యింకెందును సంబంధము లేకపోవుటయు, స్వతంత్రము లగు వర్ణనములతో నిండియుండుటయు హేతు వనిరి. ఒక్క కుమారసంభవమే కాదు. నాచన సోముని యుత్తరహరివంశము, ప్రబంధపరమేశ్వరుని హరివంశ, నరసింహపురాణములు, స్వతంత్ర రచనలే యైనను, ఆంధ్రీకరణములు హెచ్చైన నాకాలమునకు ఛత్త్రిన్యాయమున పురాణయుగ మని యాంధ్రీకరణయుగ మని పేళ్లు వచ్చి యుండును. అట్లే రాయలయుగమున ప్రబంధరచనము హెచ్చుగా నుండుటచే దానినే ప్రబంధయుగ మనినారు.

ఈ ప్రబంధయుగమున రాయలయనంతరము దిగ్గజము లని యెన్నఁబడి, యితరరాజుల యాస్థానముల నలంకరించిన రామరాజభూషణ, తెనాలిరామకృష్ణ పింగళిసూరనలు మువ్వురు నాంధ్రవాగ్దేవతకు నముఁగుబిడ్డలనుట కెవ్వరును విప్రతిపన్నులు కారు. రామరాజభూషణుఁడును, పింగళిసూరనయు సమకాలికులా విషమకాలికులా యనునంశముపై వాదప్రతివాదములు చిరకాలమునుండి జరుగుచునే యున్నవి. ద్వ్యర్థికావ్యరచన కగ్రతాంబూల మా యిరువురలో నెవరి కిచ్చుటా యనువిషయము హృదయమున నుండుటయే దీనికి హేతు వని తోఁచుచున్నది.

ప్రకృతము ప్రభావతీప్రద్యుమ్నము కావునఁ దత్కర్త యగు పింగళి సూరనార్యునిగూర్చి నాలుగుమాటలు వ్రాయఁబూన నీవాదప్రతివాదములు కంటఁ బడక మానుటలేదు. అందలిసత్యాసత్యనిర్ణయము చరిత్రాభిజ్ఞులు చేయనర్హు లని యావిషయమును వారికే వదలి కాలనిర్ణయమున నింతకు ముందు వెలువడిన సిద్ధాంతములను రేఖామాత్రముగా సూచించి, యమ్మహాప్రబంధమునకు వ్యాఖ్యసేయఁ బూనుటచే నాకావ్యమునందలి ప్రశస్తిని గూర్చి తరువాత విన్నవించుకొందును.

## సూరన దేశము - కాలము

సూరన పూర్వులు కృష్ణామండలములోని పింగళి యను గ్రామమున నుండుటఁజేసి యదియే గృహనామ మైనది. ఈ విషయమీపద్యమున స్పష్టపడుచున్నది.

మ. తరముల్ నాల్గయి దెందు నెందు నగుఁ దత్తద్గ్రామనామంబులన్
బరఁగున్ వంశము లెల్లఁ బూర్వపునిజప్రఖ్యాతి మాయంగ నే
మరుదో పింగళినామ మందుఁ జిరకాలావాసులై యున్న సు
స్థిరతన్ గోకనమంత్రివంశజులకున్ జెన్నొందు మి న్నందుచున్. 1-10

అట్లు పింగళి గృహనామముతో గోకనమంత్రివంశము నాల్గయిదు శాఖలయి దేశము నలు వంకల వ్యాపించినదఁట.

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు లలిన్ బలనాఁటను బాకనాటనున్
బింగళి గాదయాదు, లిటఁ బెంపు వహించిన యస్మదాదులున్
బింగళి గోకమంత్రి యిలుపేరనె చాలఁ బ్రసిద్ధు లెల్లచోన్. 1. ౹౹.

పింగళి గోకనమంత్రి యిలుపేరను - గౌతమీ మండలమునను కృష్ణామండలమునను పింగళి రామయ మొదలగువారు స్థిరపడిరి. పలనాఁటను, పాకనాఁటను పింగళి గాదయ మొదలగువారు స్థిరపడిరి. ఇట నస్మదాదులు నెలకొనిరి అని కలదు. 'ఇట' అనగా ఎక్కడనో స్పష్టము కాలేదు.

రచించినవి నాలుగు గ్రంథములు. గారుడపురాణ, రాఘవపాండవీయ, కళాపూర్ణోదయ, ప్రభావతీప్రద్యుమ్నములు. గరుడపురాణ మెచట నుండి రచించెనో యెవరికేని కృతి యిచ్చెనో లేదో తెలియకుండ నది నామావశేషమే యైనదిగదా! ఇఁక రాఘవపాండవీయము కర్నూలు మండలమందలి యాకువీటిరాజగు వేంకటాద్రిప్రభునకును, కళాపూర్ణోదయము నంద్యాల సంస్థానాధిపతియగు కృష్ణరాజునకును నంకితముచేసి యుండుటచేత కొంతకాల మాకువీటను, కొంత కాలము నంద్యాలయందును సూరన వసించెనని చెప్పవచ్చును. ప్రభావతీప్రద్యుమ్నరచనాకాలము నాఁటికి నారెండు పురములం దేయొకదానియందే నుండెడివాడో లేక మరెందునే నుండువాఁడో స్పష్టముగాఁదెలియుటలేదు. కాని రాయలసీమ యందలివాఁడనుట నిర్వివాదము. తరువాత నాతని వృత్తము కనుఁగొనుటకుఁ బ్రభావతీ ప్రద్యుమ్నమే యతని తుది గ్రంథము. అది యెవరికిని కంకితము చేయక తండ్రి యగు నమరనమంత్రికే కృతియిచ్చుటచేత సూరన నివాసస్థల ము శృంగగ్రాహికచేఁ జెప్ప నాధారములు కనఁబడుటలేదు. ఒకవేళఁ గళాపూర్ణోదయకృతి సమర్పణానంతరము నంద్యాలయందే నెలకొనె నేమో యనియు ననిపించుచున్నది. సూరన చిన్నతనమునఁ జదువులేక తిరుగుచుండెడివాఁ డనియు, నంతఁ దండ్రి యౌన్నత్యము పురస్కరించు కొని పెద్దన్నగారి దౌహిత్రి నిచ్చి పెండ్లిసేసి రనియు, విద్యావతి యగు నామె వైదుష్యమునకు సిగ్గుపడి కాశి కేఁగి శాస్త్రములు బాగుగాఁ జదువుకొని రాఘవపాండవీయము రచించుచు స్వదేశమునకు వచ్చి పెద్దన్నగారిని జూడ వారియింటికివెళ్లి ప్రసంగవశమున రాఘవపాండవీయము రచించుచున్నా నని చెప్పి "అందలి పద్య మొకటి చదువు" మని పెద్దన్న యడుగఁగా "తలఁపన్ జొప్పడి యొప్పె నప్పుడు" అని చదువుచుండ "నప్పుడే నాల్గు విఱుపులా" యని పెద్దన యన, వినుఁ డని సూరన "తదుద్యజ్జైత్రయాత్రా" యను దీర్ఘసమాసము చదువ పెద్దన యచ్చెరువొంది

మెచ్చుకొనెనని యొక జనశ్రుతి కలదు. అది నిజమోకాదో కాని మొదట విడివిడి పదములతో నందికొని తరువాతఁ బద్యమంతయు నొక్కటే సమాసమునఁ బూరించుటమాత్రము సూరనకవిత యందు హెచ్చుగాఁ గనఁబడును. పెద్దనార్యుని దౌహిత్రి పరాభవించుట నిజమగునో కాదో కాని ఆతఁడు కాశి కేఁగి తర్కవ్యాకరణాది శాస్త్రములను గూలంకషముగాఁ జదువుకొని వచ్చి యుండు ననుట కాధారముగా నాకథ కనఁబడుచున్నది. శాస్త్రనిష్ణాతుఁ డని యాతని కావ్యములును జెప్పుచున్నవి.

ఆంధ్రకవుల చరిత్రమునుబట్టి సూరనార్యుఁడు క్రీ. శ. 1560 సంవత్సరము లోపలనే రాఘవపాండవీయ, కళాపూర్ణోదయముల రచనమును, 1570 ప్రాంతమున నీ ప్రభావతీ

ప్రద్యుమ్న రచనమును జేసినట్లు తెలియుచున్నది. ఈ నిర్ణయమువలన సూరనయు, రామ భూషణుఁడు (భట్టుమూర్తి) ను సమకాలికు లగుచున్నారు. పదియాఱవశతాబ్దివాఁ డను నీ నిర్ణయమునే రాఘవపాండవీయ పీఠికారచయితలగు శతఘంటము రంగనాథశాస్త్రులవారును, ప్రభావతీ ప్రద్యుమ్నమున కింతకు మున్ను గద్యవ్యాఖ్య వ్రాసిన శ్రీ పురాణపండ మల్లయ్య శాస్త్రులవారును నంగీకరించిరి. కవితరంగిణియు, నా కాలమునే ధ్రువపఱచినది. శ్రీ మల్లయ శాస్త్రులవారు "ఒకానొక రీవిషయము చర్చించి యీ కవి పదాఱవశతాబ్దమున లేఁ డనియుఁ బదునేడవశతము నాదిభాగమున నుండె ననియు వ్రాసిరి" అని పీఠికయందు వ్రాయుటఁబట్టి యాయొకానొక రెవరో యని పరిశీలింపఁగా- క్రీ. శ. 1910 లో కాకినాడ శ్రీ సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రితమైన కళాపూర్ణోదయమునకుఁ టీక వ్రాసిన శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రులవా రని తెలియవచ్చినది. సూరనార్యుని రాఘవపాండవీయము చూచి భట్టుమూర్తి హరిశ్చంద్ర నలోపాఖ్యానము వ్రాసె నని కవులచరిత్రపక్షము వా రందురు. బ్రహ్మయశాస్త్రుల వారు హరిశ్చంద్రనలోపాఖ్యానమే తొలుతటిది యందురు. ఈ రెండు పక్షములవారు నాధారముగా శాసనములను, గ్రంథస్థవంశవృక్షములను, మఱియు మండల చరిత్రలను గ్రామ చరిత్రలను, కట్టుకథలను జూపుచున్నారు. ఇఁక రాఘవపాండవీయ హరిశ్చంద్రనలోపాఖ్యానము లలో నొండొంటినామములు స్మరింపఁబడలేదు. కావుననే పౌర్వాపర్య నిర్ణయమున నీవాదప్రతి వాదముల కవకాశము చిక్కినది. వాదిదౌర్బల్యమే కాని వాదదౌర్బల్య ముండదుగదా!, బ్రహ్మయశాస్త్రులవారి పదునేడవ శతాబ్దారంభ వాదము నెత్తుకొని శ్రీ వజ్ఝల చినసీతారామ స్వామి శాస్త్రులవారు వంశవృక్షమునఁ దరముల నిర్ణయము సముచితముగా లే దని త్రోసిపుచ్చి కవులచరిత్ర నిర్ణయమునే సిద్ధాంత మొనర్చిరి. దానిపైని వాదము నొనరింపఁ బూనినచో మతిమంతుల కేదేని భేదాభిప్రాయము కలుగవచ్చును. కావున మాదృశుల కగాధ మగుచుట్టి యా విషయము తొలుత వెలువుకొన్నట్లు చారిత్రకులకువదలి సూరనార్యుఁడు పదియాఱవ శతాబ్దముననో పదియేడవశతాబ్దముననో యుండినవాఁడు కావచ్చు నని మనస్సును సమాహిత మొనర్చుకొని సూరనార్యుని ప్రతిభావ్యుత్పత్తులనుగూర్చి ప్రకృత మగునీగ్రంథమునుండియు, నాతని యితర కావ్యములనుండియుఁ గొన్ని విశేషముల నాబుద్ధికిఁ దోఁచినవి స్థాలీపులాకన్యాయమునఁ జూపింప యత్నింతును.

## సూరనార్యుని ప్రతిభ

ప్రతిభ యన నవనవోన్మేషశాలినియగు బుద్ధివిశేషము. అయ్యది పూర్వజన్మ వాసనాగుణాను బంధము గలది కాని పౌరుషసాధ్యము కా దని దండ్యాచార్యాదుల యాశయము. కాని రాజ శేఖరుఁడు 'దేవతానుగ్రహమున ప్రతిభ నేఁడునుగలుగు నవకాశమున్నది, కానఁ బౌరుషసాధ్యమును నగునని. దేవతానుగ్రహము తపస్సుచేఁగాని సిద్ధింపదు. తపస్సుచేయుటకు ఋషి కావలెను. అట్లు ఋషివలె నింద్రియనిగ్రహము చిత్తైకాగ్రత కలిగి తపస్సుచే నిష్టదేవతను మెప్పించి యాదేవత యనుగ్రహము నార్జించుట పౌరుషమే యగుటచే నట్లు నిరూపించెను. జన్మసిద్ధమైనను, పౌరుషసిద్ధమైనను నెట్లు లభించినను సరే కవిత్వమున కీప్రతిభ బీజము. అట్టిప్రతిభ యొక్కటియే చాలదు. వ్యుత్పత్తియు, నిరంతరాభ్యాసమును గూడఁగావలె నని దండ్యాచార్యుఁడు-

"నైసర్గికీ చ ప్రతిభా శ్రుతంచ బహునిర్మలమ్
అమంద శ్చాభియోగోఽ స్యాః కారణం కావ్యసంపదః"

అనెను. ఆ యభిప్రాయమునే బలపఱచుచు మమ్మటుఁడు మున్నగు వేత్తలు శక్తి (ప్రతిభ)

యును, లోకశాస్త్రకావ్యాద్యవేక్షణమువలనఁ గలుగు నైపుణ్యమును, కావ్యజ్ఞులవలన శిక్ష నొందుచు నిరంతరము నొనర్చురచనాభ్యాసమును కలిసి కవిత్వమునకు హేతువు (జనకము) అగు ననిరి. దండి 'కారణము' అనియు, మమ్మటాదులు 'హేతువు' అనియు నేకవచనముగా చెప్పుట వలన సామూహికముగా కలిసి హేతు వగును. కాని యొక్కొక్కటి కవిత్వకారణములు కానేర వని వారియాశయమైనట్లు స్పష్ట మగుచున్నది.

రాజశేఖరుఁడు 'ప్రతిభా వ్యుత్పత్తిమాంశ్చ కవిః' అని దుస్సాధ్యములగు ప్రతిభయు, శాస్త్ర జన్యజ్ఞానవిశేషమును కలవాఁడు కవి యగు నని పైవానిభావములే భంగ్యంతరమునఁ జెప్పెను. ఈయన్నిలక్షణములకు లక్ష్యముగా ప్రతిభను వ్యుత్పత్తిని గడించుకొన్న మహాకవి సూరనార్యుఁడు. ఆంధ్రకవులం దింతటి ప్రతిభాశాలి యింకొకఁడు లేఁ డని విమర్శకులు బహువిధముల శ్లాఘించిరి. అట్టిలోకోత్తర మగు ప్రతిభ ప్రఖ్యాతేతివృత్త మగు రాఘవపాండవీయమునందే కథాద్వయ సంఘటనమునను, సంస్కృతాంధ్రభాషా మిశ్రణ మందును దళతళ మెఱుపువలె మెఱసినదే! ఇఁక నుత్పాద్యేతివృత్త మగు కళాపూర్ణోదయమున మిన్నుముట్టె నని వేఱ చెప్పవలెనా? మిశ్రమగు నితివృత్తముగల ప్రభావతీప్రద్యుమ్నమునఁ బ్రాచిన ప్రబంధధోరణినే రచన మొనర్చి నట్లు పైకిఁ గనఁబడినను నామూలాగ్రము నాటకీయత యంతర్వాహిని యగునట్లు రచన గావించుట ప్రతిభామూలక మని వేఱ చెప్ప నక్కఱలేదు. అష్టాదశ వర్ణనములలో నించుమించుగా నన్నియుఁ జేసినాఁడు. కాని యన్నిటను నవీనతయో లేక యావర్ణనానంతరము వానిపైని వ్యాఖ్యానమో చక్కఁగా సంఘటించుటయు ప్రతిభామూలకమే యగును. సూరన ప్రతిభను గూర్చి చెప్ప నెంచినపు డప్రకృతమైనను గళాపూర్ణోదయమును ముందుగా స్పృశింపక తప్పదు. ఇతివృత్తము కల్పితమే కావచ్చును. కాని కావ్యరూపమున దానిని వరుసగాఁ జెప్పక, యాఱింన మెచ్చుటనో తెలిసికొన నసాధ్యముగాఁ గల్పించుట యెంతటి ప్రతిభయో కదా! కళాపూర్ణోదయమున నెన్నియో యవాంతరకథలు కనఁబడును. అవి యన్నియు నితివృత్తమున కంగములైనను నట్లు కనఁబడవు. ఆయితివృత్తమునకు మొద లేది? తుద యేది? యని పరిశీలింప నాఱాశ్వాసములు పూర్తిగాకుండ నొకయెడ్డునకే చేర దాకథ. అచటినుండి వెనుకకుఁ జూచినచో వరుసగాఁ గనఁబడు కథ లన్నియు నెక్కడ కక్కడే యారంభ మనిపింపఁగలవు. ప్రథమాశ్వాసమున నాకాశవీథిని గన్పట్టు నారదమణికంధరుల కథ కావ్యమునకు మొద లనిపించును. తరువాత సుగాత్రీశాలీనుల కథ మొద లని భ్రాంతిగొల్పును. ఇట్టి వెన్నియో గడచి వెళ్లినపిదప సరస్వతీ బ్రహ్మల ప్రణయగాథ కథ కంతకు మూల మనిపించును. ఆగాథ నంతయుఁ జెప్పిన పాత్రులలోని పసిపాప వృత్తాంత మాగాథలోనే యదుకుకొని పోవును. కళాపూర్ణున కాగాథ నంతయు నాపసికందు చెప్పుకాలమున నెందఱవృత్తముల నా గాథయం దదుకునో, వా రంద ఱాసభలోనే సభ్యులై యుండుట గూడ వారలకే యానందాశ్చర్యము లానాఁడు కల్గె ననుట వింత గాదు. ఆఘట్టము నేఁటికిని శ్రోతలను బఠితలను నానందాశ్చర్యముల ముంచి తేల్చుచున్నది.

ప్రతిభావిశేష మొక్కయితివృత్తముననే కాదు. సంభాషణములందును, సన్నివేశము లందును, కంటికిఁ గనఁబడునట్లు పాత్రల తాత్కాలికావస్థలతోఁ జిత్రించుటయందును వర్ణనము లందును, లోకోత్తరమై కనఁబడును. ఆ యితివృత్తమును బెక్కురు నవలలుగా వ్రాసిరి. అశ్రమముగా నాటకరూపమున వ్రాసిరి. ఇట్టి విచిత్రతమ మగు నితివృత్తమును జేకొని, ప్రబంధమార్గమునకు దూరము గాకుండఁ గావ్యముయొక్క పరమప్రయోజన మగు పురుషార్థములు చెక్కుచెదరకుండ, నామూలాగ్ర మానందమయ మొనర్చి విడిచిన సూరన ప్రతిభ యనుపమాన మనిన

నత్యుక్తి కానేరదు. అందలిపాత్ర లించుమించు రెండు మూఁడు జన్మము లెత్తినవి. స్వర్గ మర్త్య పాతాళములతో వానికి సంబంధము. వాని కిడినపేర్లు రెండేసి జన్మములచరిత్ర కనువుగా నుండుట. ఏమి సృష్టి !

'అపారే కావ్యసంసారే కవి రేకః ప్రజాపతిః
యథా స్మై రోచతే; విశ్వం త థేదం పరివర్తతే'.

అను సూక్తికి లక్ష్యభూతుఁడైనాఁడు సూరనకవిరాజు. శాఖాచంద్రమమగు నను సంకోచమున నాకావ్యసృష్టి మాట యటుపెట్టి, ప్రకృత మగు ప్రభావతీ ప్రద్యుమ్న కథాసంవిధానాదులఁ గూర్చి పరిశీలింతము. ఇందును సూరన యసాధారణ శేముషీవిశేషము కనఁబడుచునే యున్నది. ఇది మిశ్రకథ. దీని కాధారము హరివంశమనియుఁ బాపసంహారకమనియును "అఘహరణ హరివంశ కథా శ్రయ ంబు," 5 ఆ. 221 అను పద్యమువలనఁ దెలియు చుండఁగా - "అఘహరణ అను పద్యమునుబట్టి ఇయ్యది హరివంశమునందలి కథనుబట్టి వ్రాసినట్లు లూహింపఁ దగియున్నది. కాని హరివంశమునం దీకథ కనుపట్టుట లేదు. ఈకథయందలి ముఖ్యమగు పట్టు లన్నియును బరికించి చూచినచో అనిరుద్ధచరిత్రయందలి కథపట్టులే పెక్కులు గానంబడియెడును. ఆ యనిరుద్ధచరిత్ర హరివంశములోనిది. ఆ కథయందలి శోణపురమే యిందలి వజ్రపురము. అచ్చటిపార్వతీ వర మాహాత్మ్యమే యిచ్చటి పార్వతీవర మాహాత్మ్యము. అందలి స్వప్నమే యిందలి స్వప్నము. అచ్చటి బాణాసురవధయే యిచ్చటి వజ్రనాభవధ...అను నిట్టి విచారణముతో శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు వావిళ్లవారి ప్రభావతీ ప్రద్యుమ్న "గ్రంథవిమర్శనము"న వ్రాసియున్నారు. ఆంధ్ర హరివంశమునం దీకథ లేనిమాట వాస్తవమే. హరివంశమున నెఱ్ఱనయు, ఉత్తర హరివంశమున నాచనసోమనయు దీని నేలవిడిచిరో తెలియదు. మూలమగు సంస్కృత హరివంశమున - విష్ణుపర్వము 91 వ అధ్యాయము మొదలుకొని 97 వ అధ్యాయము తుదదాఁక 7 అధ్యాయములం దీకథ యెంతయు విపులముగా నున్నది. దానిని శ్రీ సూర్యనారాయణరావుగారు చూచి యుండ రనుకొందును.

మూలకథాసారము ముందుగా నిందుఁ బొందుపఱచి పిదప సూరనార్యుఁ డెట్టిమార్పొన రించెనో సహేతుకముగా నితివృత్తమును బరామర్శింతము.

## హరివంశమునందలి ప్రభావతీ ప్రద్యుమ్న వృత్తాంతము.

భారతాంతర్గతమైన ఖిలములోని హరివంశము వైశంపాయనుఁడు చెప్పుచుండ వినుచున్న జనమేజయుఁ డామునిని జూచి మున్ను నికుంభవధ ప్రస్తావమునందు వజ్రనాభవధ వృత్తాంతము సంక్షేపముగాఁ జెప్పితివి. నాపై ననుగ్రహమున దానిని విస్తరించి చెప్పినచో విన వేడ్క యగుచున్నది యన వైశంపాయనుఁ డిటుల చెప్పఁ బూనెను.

పూర్వ మొకప్పుడు వజ్రనాభుఁ డను మహాశూరుఁ డగు రాక్షసుఁ డొకఁడు మేరుతట మందు బ్రహ్మను గూర్చి ఘోరతపస్సు చేసి ప్రసన్నుఁడైన బ్రహ్మవలన దేవతలచేతఁ దన కవధ్యత్వమును, తనయాజ్ఞ లేనిదే వాయువునకు సైతము ప్రవేశింపరానిదియును, సువర్ణరత్న మయంబును నగు వజ్రపురమును, దానిచుట్టు పెక్కుశాఖా నగరములును, కోరకుండనే సర్వ వాంఛితసిద్ధియును, గావలెనని గోరెను. అట్లే బ్రహ్మవర మొసఁగెను. వరలబ్ధమైన యాపురమున

హాఁడు సుఖముగ నుండెను. లబ్ధవరుఁడైన వజ్రనాభు నాశ్రయించి పెక్కురు రక్కసు లాపుర మందును శాఖానగరములందును నివసించుచు సుఖముగా కాలము పుచ్చుచుండిరి.

ఇట్లు కొంచెముకాలము గడవ దుష్టుఁ డగు వజ్రనాభుఁడు వరగర్వమున జగముల బాధింపఁ బూని యొకప్పుడు స్వర్గలోకమున కేఁగి యింద్రుని గాంచి "పాకశాసనా! కశ్యపసంతానముల కీమూఁడులోకముల యాధిపత్యమున సమానస్వత్వముకలదు. నేనీత్రిలోకముల నేలఁగోరుచున్నాను. కాన నీయాధిపత్యము నా కిమ్ము. లేదా యుద్ధమునకు రమ్ము" అనెను. ఇంద్రుఁ డది విని బృహస్పతితో నాలోచించి "వజ్రనాభా! మన తండ్రియగు కశ్యపుఁ డిపు డొకయజ్ఞమున దీక్షఁ బూని యున్నవాఁడు. ఆ యజ్ఞదీక్షానంతరము మనవివాద మాయన న్యాయముగఁ దీర్పఁ గలఁడు" అనఁగా - వాఁడు తండ్రియొద్దకుఁ బోయి యాతనిచేత నట్లే యనిపించుకొని వజ్ర పురంబును జేరి యందు సుఖ ముండెను.

ఇంద్రుఁడును ద్వారకానగరమున కేఁగి శ్రీకృష్ణున కీవృత్తాంతము తెలుప నాతఁడు "వసుదేవుఁడు హయమేధము చేయ నున్నాఁడు. అది పూర్తి నొందఁగనే వజ్రనాభుని సంహరింతు" నని పలికి, అతనియనుజ్ఞ కానిదే వానిపురము వాయువేని చొర నశక్యమఁట. కాన దానికి తగునుపాయము తరువాతఁ జింతింతము పొమ్ము" అనుటయు, నింద్రుఁడు నాకమున కేఁగెను.

తరువాత వసుదేవుని యశ్వమేధము జరుగునప్పు డింద్రోపేంద్రులు వజ్రపుర ప్రవేశోపాయమును వెదకుచుండ, నచటికి భద్రుఁ డనునటుఁ డొకఁడు వచ్చి తననాట్యకళానైపుణ్యమున నచ్చటిఋషులను సంతోషపెట్టి వారినిర్బంధముపై నానటుఁ డింద్రోపేంద్రుల యభిప్రాయమున సరస్వతీప్రేరితుఁడై, మునులకు మ్రొక్కి, తాను బ్రాహ్మణుల కెల్లరకు భోజ్యుఁ డగుటయు తనకుఁ జరాచరప్రాణులవలన నవధ్యత్వమును, కామగమనమును, జరారోగరాహిత్యమును, మృతునిగాని జీవితుని గాని మఱొకనిని గాని, ఎవ్వని నైన ననుకరించు మహిమయును, గోరి వా "రట్ల యగునుగాక" యన సంతసించి భద్రాశ్వాదివర్షములందును గాలాభ్రాది ద్వీపములందును స్వేచ్ఛముగఁ జరించుచుఁ బర్వదినంబుల ద్వారకకు వచ్చుచుఁ బోవుచు నుండెను.

ఇంద్రుఁ డది చూచి దేవలోకంబున నున్నహంసలను రావించి "మరాళములార! మీరును గశ్యపసంతానమే కావున మనము సోదరులము. మఱియు దేవవిమానములను మీరు వహింతురు. శత్రువధార్థం బైన కార్యమొకటి మా కిపు డవశ్యకర్తవ్యమై వచ్చినది. మీ రందుఁ దోడ్పడ వలెను. దేవతలయాజ్ఞ మీఱినచో మీ కుగ్రమగుదండ మగును. వజ్రపురంబు దేవతలు ప్రవేశింప రాని దని మీరు నెఱుఁగుదురు. హంసలకుఁ జొరరాని తావు లేదు. కావున మీరు వజ్రపురము చొచ్చి, రహస్యము బయలుపడకుండఁ దగురీతి వజ్రనాభుని యంతఃపురమందలి బావులందు మెలఁగుఁడు. వజ్రనాభున కొకకూఁతురు గలదఁట. మూఁడులోకములం దెందును లేని సొగసు గలిగి యామె ప్రభావతి యని పిలువఁబడు ననియు, నామెతల్లికి గౌరీదేవి యిచ్చిన వర మునఁ బుట్టె ననియుఁ, దలిదండ్రులచే స్వయంవరగాఁ జేయఁబడిన దనియుఁ దనయిచ్చ వచ్చిన పతిని వరింప నున్న దనియు వింటిని. కావున మీ రచట నుండి తగువేళలఁ బ్రద్యుమ్నుని కులశీల సౌందర్యాదికము లామెకడ వర్ణించి, యామె యనురక్త యైనయెడ రహస్యముగా నా సంగతి ప్రద్యుమ్నునకుఁ దెలియఁ జెప్పుఁడు. సమయానుసారంబుగా మీ బుద్ధిబలము నుపయోగించి మాకు మేలు చేయుఁడు. ప్రద్యుమ్నునియందుఁ బ్రభావతి మనస్సు దృఢలగ్న మగునట్లు వాని

రూపరేఖావిలాసాదులు సదావర్ణించుచుఁ, బ్రతిదినము నచటివృత్తాంతమును నాకును ద్వారక నున్న నా తమ్మునకును దెలుపుచు, ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని పరిగ్రహించు పర్యంతము యత్నింపుఁడు. వజ్రనాభుఁడు దేవతల కవధ్యుఁడు. కాన వానిని జంప యదుకుమారుఁడగు ప్రద్యుమ్నుఁడు సపరివారముగా మునిజనదత్తవరుఁ డైనభద్రునిరూపముతో నటకు రాఁగలఁడు ? అని పలికెను.

ఆ పలుకులు విని హంసలు వజ్రపురంబు చేరి యంతఃపురోపభోగ్యములును, కనకపద్మో త్పలావృతములు నగు దీర్ఘికలందు విహరించుచు, సంస్కృతములు నపూర్వములు నైన మధుర భాషణములు పలుకుచు, నింతకు మున్ను వచ్చుచున్నవయ్యును వింతగొల్పుచు నుండ - వజ్ర నాభుఁడు చూచి 'మా కుత్సవము చేయఁ గోరినపు డెల్ల మీ రిటకు వచ్చి స్వగృహమందువలెనే నిశ్శంకముగా నీ నాగృహమున విహరింపవచ్చు'నని యనుమతి నీయ 'మహాప్రసాద' మని యందుఁ బ్రవేశించి దేవకార్యముకొఱ కందలివారితోఁ బరిచయము గలిగించుకొనుచుండెను. అంతఃపుర కాంతలు గుములై మనుజులవలె మాటాడు నా హంసల చతురకథాలాపంబులకుఁ జొక్కి వినుచుందురు. పిమ్మట నాహంసలు చారుహాసినియు, సర్వాంగసుందరియు నగుప్రభావతిం జూచి పరిచితను జేసికొనఁగా, వానిలో శుచిముఖి యనుహంసిని దనకుఁ జెలిగా నామె పరిగ్రహించెను. పిమ్మట నొకప్పుడు శుచిముఖి మనోహరము లైనకథలు చెప్పి విశ్వాసము పుట్టించి, యామెను జూచి "ప్రభావతీ నీవు త్రిలోకసుందరివి. యౌవన మతిక్రమించి పోవుచున్నది. నదీప్రవాహము వలెఁ బోయినది తిరిగిరాదు గదా ! కళ్యాణీ ! ఒక్కనిజము చెప్పెదను. ఈ లోకములో యువతు లకుఁ గామోపభోగతుల్య మైన సుఖము మఱొకటి లేదుగదా ! నీవు తండ్రిచే స్వయంవరగా నొనర్పఁబడినదానవు. కాని దేవతలలోఁ గాని రాక్షసులలోఁ గాని రూపశీలాదులచే నీకుఁ దగినవాని నొక్కని వరింపవైతివి. ఎందఱో నేఁడును వచ్చి ప్రత్యాఖ్యాతులై సిగ్గుపడి మరలి పోవుచున్నారు. కాని యెవ్వరిని నీవు పరిగ్రహింపకున్నావు. అని పలికి ప్రద్యుమ్నుని సౌందర్య మును వర్ణించి, శంబరాసురుని సంహరించె నని శౌర్యమును జెప్పి, అతఁడు నరులలో నరుఁడు, దానవులలో దానవుఁడు, దేవతలలో దేవుఁడు. అన్ని మాయలు నేర్చియు శీలంబు కాపాడు కొనును. తేజమున సూర్యుని, గాంతి నగ్నిని, గాంభీర్యమున హ్రదమును, నోర్పున భూమిని బోలును. ఏ యే సుగుణము లెచట నెచటఁ గల వని నీవు విందువో, అందఱు నే యే సుగుణంబు లను వాంఛింతురో యట్టి సర్వసుగుణములరాశి యైన రుక్మిణికన్నకొడుకు ప్రద్యుమ్నుఁ డిటకు రాఁడుగదా" యనఁగా ప్రభావతి శుచిముఖిని జూచి "సఖీ ! శుచిముఖీ ! విష్ణువు కృష్ణ రూపమున మనుజలోకమున నున్నవాఁ డని మాతండ్రి చెప్పెను. నారదుఁడును జెప్పెను. అతఁడు రక్కసులకు పగతుఁ డనియు వర్జనీయుఁడనియు, చక్ర శార్ఙ్గగదా ద్యాయుధములచే నసురకులములఁ బెక్కిటిని గూల్చెననియు శాఖానగరముల నున్న యసురులతో మా తండ్రి చెప్పుచుండును. స్త్రీలకుఁ దండ్రి కులముకంటె భర్తృకుల మధికము కావలెనని కోరిక యుండును. కాన వృష్ణికులుని రప్పించు నుపాయ మున్నయెడ నా కది యుపదేశింపుము. నా కది మహోప కారము. ప్రద్యుమ్నుఁడు పతియగునేని నా వంశము పావన మగును. రాక్షస వృద్ధాంగనలు పెక్కండ్ర వలన కృష్ణుఁడు రాక్షస పీడాకరుఁ డనియుఁ, బ్రద్యుమ్నుఁ డాతనికొడుకనియు, శంబరా సురుని వధించినవాఁ డనియుఁ దఱచు విందును. ప్రద్యుమ్నుని మనస్సునందు నిచ్చలు తలంతును. కాని యాతఁడు వచ్చు నుపాయము కనఁబడదు. చెలియా! నేను నీకు దాసురాలను. నిన్ను దూత్య మున నియోగింతును. అతనిని గలియు నుపాయము ఘటింపు మనెను. ఆ పలుకుల కలఁతిగ నగుచు హంసి "చారుహాసినీ ! దూతిగాఁ బ్రద్యుమ్ను నొద్దకేఁగి నీభక్తి విశేష మాతనికిఁ జెప్పి తోడ్తొని

వత్తును. కాని నీతండ్రితో నేను కథాకుశల ననని సమయము వచ్చినప్పుడు చెప్పి యతఁడు నన్నుఁ బిలుచునట్లు చేయుము. తరువాత నేను చేయు మేలు పొందుదువు" అనెను. తండ్రితో నామె యట్లే చెప్పి శుచిముఖిని తండ్రిచేఁ బిలిపించెను. వజ్రనాభుఁ డట్లు వచ్చిన హంసిని గౌరవించి, 'ప్రభావతి నీ కథాకథన కౌశలము చెప్పినది. నీవు చూచిన వింతలేమి గల' వన నా హంసి "అయ్యా! మేరువు ప్రక్క నత్యద్భుత కృత్యమొనర్చు శాండిలి యను దానిని జూచితిని. దానికిని పార్వతికిని సఖియగు కౌసల్య యనుదానిం జూచితిని. మఱియు మునులచే దత్తవరుఁ డైన భద్రుఁ డను నాటకౌనిని జూచితిని. వాఁడు కామ రూపి. దేవ గంధర్వుల యాటపాటలు నేర్చినవాఁడు. వాఁ డెల్లదేశములం దిరుగుచు నందఱకు సమ్మతుఁడై నృత్యముచేతను, గానము చేతను దేవతలకుఁ గూడ నచ్చెరువు గల్గించుచున్నవాఁ"డని చెప్పఁగా వజ్రనాభుఁ 'డౌనౌను హంసీ! ఆనటుని గూర్చి చారణులవలన నేను విని యున్నాను. ఆతని నెట్లయిన రప్పించి యా నాట్యము చూడవలె నని యిచ్ఛ కలదు. కాని వాని పరిచయములే'దన హంసి 'అతఁ డెల్లదీవులు తిరుగుచుండును. గుణవంతుఁ డగుజనునిగూర్చి వినినచో తప్పకవానిని జూచును. నీ గుణగణములు విన్నచో నానటుఁ డిచటికి వెంటనే వచ్చు ననుకొ'మ్మనెను. అది విని వజ్రనాభుఁ 'డాతని నిటకు నేయుపాయమున నైనను రప్పింతువేని నీకు మేలు చేసెద' నన శుచిముఖియుఁ దన తోడిహంసలును వానినిమిత్తమే వెళ్లుచున్నట్లు చెప్పి యా సంగతియెల్లఁ గృష్ణునకు నింద్రునకును విన్నవించెను. కృష్ణుఁ డది విని ప్రభావతిని గూడుటకును వజ్రనాభుని వధించుటకును బ్రద్యుమ్ను నాజ్ఞాపించి, దేవసంబంధమగు మాయచే ప్రద్యుమ్నుని నటునిగాను, గద సాంబులను పారిపార్శ్వక విదూషకులనుగాను జేసి వారముఖ్యలకుఁ గొందఱకు నటీవేషంబులు కల్పించి ; భద్రుని సామగ్రివంటి సామగ్రి యెల్లను గల్పించి సైనులను గొందఱ సాయ మిచ్చి పంపెను.

అంత వా రందఱును మాయచేఁ బ్రద్యుమ్నుఁడు నిర్మించిన విమాన మెక్కి వజ్రపురము చేరి రాక్షసులతోఁ నిండియున్న సుపుర మను దాని శాఖానగరమందు విడిసిరి. వజ్రనాభుఁ డది తెలిసికొని తనపురమందలి యసురులను బిలిచి వారికిఁ దగినవసతులను విచిత్రమగు వస్త్రములను మణులను గాన్కలుగ నిచ్చి యాతిథ్య మిం డని యనుప, వా రట్లే చేసి మున్నెన్నఁడు వినని నటుఁడు వచ్చె, మనకు వేడ్క కావించు నని వేషధారణార్థ మతని కనేక మణుల నిచ్చిరి. నటుండును వానిని గ్రహించి -యచటిరాక్షసులకు సంతోషము గల్గింప నాటకముగా రామాయణము నభినయించుచు, నందు రావణుని వధింప విష్ణువు రాముఁడై పుట్టుటచూపి దశరథ లోమపాద ఋశ్యశృంగులను వేశ్యల సాయమున శాంతను, రామలక్ష్మణులను, వారి వారి రూపములతోఁ గల్పింప, పూర్వ మావృత్తాంతము కనులారఁ జూచి యందాఁక జీవించియున్న దానవవృద్ధులు నాఁటి దశరథాదులకు వీరికి నేమియు భేదము లే దని తక్కినవారికిఁ జెప్పుచు మిగుల నాశ్చర్యపడిరి. వారి వేషధారణము, నభినయమును, ప్రస్తావనమును, పాత్రప్రవేశమును జూచి విస్మితులై యెల్లవారును నడుమ నొక్కొక్కవిషయమునకై లేచి వస్త్రములను, బంగారు కంకణములను, హేమవైడూర్యాదులచే నిర్మితములగు చక్కనిహారములనుగాన్కలుగ నొసఁగుచుండ నటులు వారివారి వంశములను బేళ్లను బేర్కొని పొగడుచుండిరి. ఇట్లు కొన్నాళ్లు జరుగ నుపపురములందలి రాక్షసు లెల్లరు దివ్యరూపుఁ డగునటునకు ప్రభుదర్శనమునకు రా ననుజ్ఞ యీయవలె నని రాజునకు విన్నవించిరి. వజ్రనాభుఁడు మున్నె తెలిసినవాఁడు గాన ముదితుఁడై యా నటుని వజ్రపురమునకుఁ దెం డని యాజ్ఞ నొసఁగ శాఖానగరవాసులు నటవేషముల నున్నయాదవులను వజ్రపురికిఁ దీసికొని వెళ్లిరి. దానవరాజును వారు వసింప విశ్వకర్మనిర్మిత మగు మేలిభవనంబుల నిచ్చి, కోరినవాని నెల్ల సమృద్ధిగా నొసఁగి విశ్రాంతులైనపిదపఁ గాలోత్సవంబు

చేయింపఁ దలపెట్టి, దానిని జూడ సైనికులకు రమ్యమగు చోటు కల్పించి, యంతఃపురస్త్రీలను జాలాదిచ్ఛన్నమును లోచనదృశ్యమును నగుచోట నుంచి, బంధువులఁ గూడి తాను గూర్చుండి పెక్కురత్నములను గాన్కగ నిచ్చి నృత్య మొనర్ప నటుల కనుజ్ఞ నిచ్చెను. యాదవులును దేవకార్యార్థమై నటవేషధారులై చతుర్విధవాద్యముల ప్రోఁగించిరి. యాదవులు తీసికొని వచ్చినవారస్త్రీలును, జెవులకును మనస్సునకును మిగుల నింపుగలిగించు స్వరసందోహముతో దేవగాంధారమును జాలిక్యమును బాడిరి. గాంధారగ్రామరాగమునందే గంగావతరణము, మున్నగువానిని బాడి రక్కసులను సంతసపెట్టిరి. తరువాత గదుఁడు మొదలగువారు నాంది యనుపేరిటి చర్మకోశమయం బగువాద్యమును వాయింపఁగాఁ బ్రద్యుమ్నుఁడు గంగావతరణాశ్రితమై తనవినయమును దెలుపు నొకశ్లోకము పఠించి, రంభాభిసారమును దెలుపు కౌబేరమైన నాటకము నారంభించెను. అందు శూరుఁ డనువాఁడు రావణవేషమును, మనోవతి యను వేశ్య రంభారూపమును, ప్రద్యుమ్నుఁడు నలకూబరవేషమును, సాంబుఁడు విదూషకవేషమును, ధరించి యాయా సందర్భోచితముగాఁ గైలాసకల్పనమును, నలకూబరుఁడు రావణుని శపించుట, రంభ ననునయించుట మున్నగువిధముల నభినయించిరి. దానవులు వారి యభినయాదులు మెచ్చి ప్రశస్తవస్త్రహారములను, గజవిమానాది యానములను, వాంఛితార్థముల నిచ్చు మణులను, నగురు చందనాది సుగంధద్రవ్యములను నిచ్చి ధనరత్నశూన్యులై పోయిరి. దానవీసంఘము నట్లె యైనది.

ఇట్లు నాట్యము కొన్నాళ్లు జరుగ నొకనాఁడు శుచిముఖి ప్రభావతిని గాంచి "కాంతా! నేను భైమగుప్తమగు ద్వారకకుఁ బోయి యేకతమున నున్న ప్రద్యుమ్నునకు నీ యనురాగమును దెలిపితిని. అతఁడు సంతసించి "నేఁటి సాయంకాలము నిన్నుఁ గవయ సంకేతించె" నని చెప్ప నాకన్య సంతుష్టయై "హంసీ! నీవును నావసతియందే శయనింపుము. నీ సాయమునఁ బ్రద్యుమ్నుని నిర్భయముగాఁ జూడఁగల న" ని వేడ, హంసి 'యట్లే' యని విశ్వకర్మ నిర్మించిన మేడపై కెక్కి ప్రభావతి చేసిన సంకేతము తెలిసికొని ప్రద్యుమ్నునికడ కరిగి యతఁడు సంకేతించిన దిన మిదె యని తెల్పి, యతఁ డంగీకరించినవిధము ప్రభావతికిఁ జెప్పి, యచటనే యుండెను.

తరువాతఁ బ్రద్యుమ్నుఁడు ప్రభావతికై కొనిపోవుచున్న భ్రమరావృతంబగు పూలదండను గాంచి దానియందుఁ దా నొక తుమ్మెదయై యణఁగియుండి, యంతిపురమును జేరి సంజవేళదాఁక నందే యుండి యందలి తుమ్మెదలు తొలఁగిపోవునపుడు ప్రభావతి చెవియందలి కలువపూవును జేరి యణఁగియుండెను. పిమ్మటఁ బ్రభావతి హంసితో "నాయవయవములు తపించిపోవుచున్నవి. నో రెండుచున్నది. మనస్సున నౌత్సుక్యము కలుగుచున్నది. మందు లేని రోగ మేదియో కల్గినది. అనుచు నెంతయు విరహాసహిష్ణుత్వము వెలువరించుచు మనసు నిలువకున్నది. మేనఁ గంపము పుట్టుచున్నది. దృష్టి భ్రమించుచున్నది. నేను దప్పక క్షయింతు" ననుటయు - ప్రద్యుమ్నుఁడు తనయం దామెకుఁ గల గాఢానురాగము తెలిసికొని హంసితో "నేను దుమ్మెదరూపును దాల్చి మాల్యమున నణఁగి వచ్చియేయుంటిని. ఈకన్యకకు విధేయుఁడ" నని పలుకుచు నిజస్వరూపమున నాసౌధమును మెఱయించుచు సిగ్గునఁ దలవంచుకొనిన యా ప్రభావతినిఁ జేతితోఁ దాఁకి "మనోరథశత లబ్ధుఁడ నైన న న్నేల యుపేక్షింతువు? భయపడకుము. తడవుండ వీలుగాదు. కృతాంజలినై యాచించుచుంటిని. కాలానుసారము గాంధర్వమున నన్నుఁ బరిగ్రహింపు" మని చెప్పి మణియందలి యగ్నిని స్పృశించి మంత్రములను జదువుచు నందుఁ బువ్వులను వేల్చి, యా చెలువచే నాయగ్నికిఁ బ్రదక్షిణముచేయించి దక్షిణహస్తముగ్రహించి శుచిముఖిని ద్వారరక్షణమున

నియోగించి శయనోత్తమమున కాం ప్రభావతిని గొనిపోయి, భయ ముడిపి, యిష్టకేళి సలరించి సుఖముగా నారాత్రి గడపి, యరుణోదయమున మేల్కాని ప్రియ నొడంబఱచి నటాలయమున కరిగెను.

జనమేజయా! యాదవులు నటవేషమున నింద్రోపేంద్రులు చెప్పినరీతిని – కశ్యపయజ్ఞావసానము ప్రతీక్షించుచు వజ్రనాభుఁడు త్రిలోకీ విజయ యత్నము చేయుదాఁక నట నుండిరి. మనోవేగము గల హంసలు ప్రతిదినము వారి వృత్తాంతము నింద్రునకును, హరికిని దెలుపుచుండెను. వా రిట్లు కాలము నిరీక్షించుచుండ వర్షాకాలము వచ్చెను. ప్రద్యుమ్నుఁడు మాయాబలమున శరీరచ్ఛాయను నటాలయమున నిలిపి రాత్రిందివములు శుద్ధాంతమందు నంతర్హితుండై యుండి కలహంసీ రక్షితుఁడై ప్రభావతిని గూడి విహరించుచుండెను. దానవు లందఱును హంసల వృత్తాంతము గాని యా నటులు యాదవు లని కాని తెలియరైరి. వారిశీలమును వైదుష్యమును తమ కబ్బవలె నని కోరుచుండిరి. రాక్షసాంగనలు యాదవాంగనల రూపవిలాసగంధాదులకును, నార్యభావంబునకును ముచ్చటపడుచుండిరి.

ఇట్లుండ వజ్రనాభునితమ్ముఁడగు సునాభుని కూఁతులు చంద్రవతీగుణవతు లనువా రిరువు రొకనాఁడు ప్రద్యుమ్నాసక్తయై యున్న ప్రభావతిని జేరి నమ్మకము పుట్టించి 'యిది యెట్లు కల్గె'నని యడిగిన నామె యి ట్లనెను. 'కోరినపతిని సౌభాగ్యము నిచ్చునట్టి యొకవిద్య నాకు లభించినది. దేవాసురాదులలో నెవనిందలఁచిన,నావిద్య వానినే తత్క్షణమున వశునింజేసి తెచ్చును. దానిమహిమచేతనే దేవపుత్రుఁడైన యితనితోఁ గ్రీడించుచుంటిని' అని చూపిన వారు రూప సంపన్నుఁడైన యతనిని జూచి యచ్చెరు వొందుచుండ నాచారుహాసిని దేవతల ధర్మాసక్తియు, రాక్షసుల దంభము సుఖాసక్తిని దెలిపి 'ధర్మాసక్తులకు జయంబు గలుగు నని యెఱుఁగుదురు గాన మీరు నావిద్యను గ్రహించి తగినదేవపుత్రుల వరించి సుఖింపు'డన వారు సంతసమున నంగీకరింపఁగా, నాప్రభావతి ప్రద్యుమ్నునిగాంచి 'వీరికిఁ దగినవారిని జెప్పు' మన రూపశీలయుతు లగు గదసాంబులను జెప్పెను. అంతఁ బ్రభావతి చెలియండ్రను జూచి "మున్ను దుర్వాసుండు సంతుష్టుఁడై సౌభాగ్య సదాకన్యాత్వములును, కోరినపతియుఁ గల్గునని నా కీమంత్రము నుపదేశించెను. దీనిని మీరు స్వీకరించి ప్రియసమాగమ మొందుఁ డని యుపదేశింప, వా రామంత్రమును బొంది గదసాంబులను దలఁచినంత మాయావి యైన ప్రద్యుమ్నునిసాయంబున ప్రచ్ఛన్నులై వారు వచ్చిరి. చంద్రవతి గదుని, గుణవతి సాంబుని గాంధర్వవిధిని బరిగ్రహించిరి. అది వర్షఋతువు కావున వారు రేలుంబవళ్ళును దమప్రియులం గూడి, తనపతితోఁ గూడి సుఖించుచున్న ప్రభావతి వలెనే సుఖించుచుండిరి.

యాదవకుమారు లి ట్లుండ – వజ్రనాభుఁడు కశ్యపుని యజ్ఞావసానము విని యేఁగి యా మునిని దర్శింప నాయనయుఁ డింద్రకేశవుల సుశీలమును, తపమును, పరాక్రమమును జెప్పి, అందుఁ గృష్ణుఁడు భూలోకాధిపతి. నీ కజయ్యుఁడనియు, వారి నిరువుర నలిగించుట కాల సర్పమును గాలఁ దన్నుటసుమీ! కావున నీ వజ్రపురమున కరిగి సుఖముండు మనియు నన, వాఁ డాపలు కాదరింపక చని దుర్బుద్ధియై త్రిలోకజయేచ్ఛచే బంధుమిత్రుల రావించి యింద్రుని జయింపఁగోరి యమరావతీయాత్రకు సన్నాహము చేయించెను. అపు డింద్రకేశవులు హంసలను బిలిచి వజ్రనాభుని వధింపుఁ డని యదుకుమారులకుఁ దెల్పుటకై యంప నవి పోయి వారి నొకచోటఁ జేర్చి యాసందేశము విన్నవింప, వా రాలోచించి రాక్షసరాజు ప్రద్యుమ్నునకు హంతవ్యుఁ డని నిశ్చయించి, తమభార్యలు గర్భవతు లనియు, శీఘ్రకాలముననే ప్రసవింతు

రనియు, నాహంసలచేతనే యింద్రకేశవులకుం దెలిపిరి. వారును వెంటనే యాహంసలచేత "మీరు భయపడవలదు. మీ కచిరకాలముననే కామరూపులును, శ్లాఘ్యగుణులును, గర్భస్థు లయియే సాంగవేదములు, శస్త్రవిద్యలు నేర్చినవారును, పుట్టుకతోడనే యౌవనము కలవారు నగు పుత్రులు పుట్టఁగల రని వార్త నంపిరి. వారు చెప్పినట్లే తగుసమయమున, ప్రభావతికిఁ గొడుకు గల్గెను. తరువాత నొకనెలకు చంద్రవతీగుణవతులును చంద్రప్రభుఁడు, గుణవంతుఁడు నను కుమారుల గనిరి. వారు సద్యోయౌవనులును సర్వజ్ఞులునై హర్మ్యమునందు విహరించు చుండ నింద్రోపేంద్రులయిచ్ఛచే నంతఃపురరక్షకు లగు రక్కసులు వారినిగాంచి స్వర్గమును జయింపఁ గోరుమన్న వజ్రనాభున కెఱిఁగించిరి.

వజ్రనాభుఁ డది విని మండిపడి 'నాగృహమునకు హాని తలపెట్టినవారి వధింపఁ బట్టితెం' డని సైనికుల కాజ్ఞాపింప పట్టుఁడు, కొట్టుఁడు, చంపుఁ డనుచు వా రెల్లదిశల నావరించిరి. పుత్రవత్సలలగు ప్రభావతియుఁ జెలియండ్రు నది విని, రోదనము చేయుచుండఁ బ్రద్యుమ్నుం డు చిఱునవ్వుతో "మేము జీవించి యుండ రాక్షసు లేమిచేయఁగలరు ? వెఱవకుఁ డని ప్రభావతితో "సీకతంబున నాకు మాన్యు లయిన నీతండ్రియును నీపినతండ్రియును, బంధువులును, నాయుధ పాణు లయి హననముఁ గోరి యుద్ధసన్నద్ధు లయి వచ్చిరి. మరణమునకు వెఱవక తెగించి యుద్ధ మొనర్చువారికి విజయంబు గలుగును. నీవు నీచెల్లెండ్రతో నాలోచించి కర్తవ్యము చెప్పు మనెను." అంత నాప్రభావతి మోఁకరించి శిరసున నంజలి ఘటించి దుఃఖించుచు శస్త్రము గ్రహించి "నిన్ను రక్షించుకొమ్ము. నీవు జీవించినచో దారపుత్రులను గావఁ గలవు. మున్ను సూర్యాగ్నిప్రభుఁ డైన దుర్వాసుఁడు వైధవ్యరహితవు, జీవత్పుత్రవు నగుదు వని నా కిచ్చిన వరము హృదయమున నాశ్వాసము కలిగించుచున్నది. పూజ్యురా లగురుక్మిణీదేవిని అనిరుద్ధుని స్మరించి యీయసిపుత్రిక గొను" మని నమస్కరించి యీయఁగా ప్రద్యుమ్నుఁడు ప్రహృష్టుఁడై దానిని గైకొనెను. చంద్రవతియు గుణవతియు నారీతిగనే తమపతులకుఁ గత్తుల నిచ్చిరి. పిమ్మటఁ బ్రద్యుమ్నుఁడు గదుని జూచి "సాంబునితోఁ గలిసి నీ విందే యుండి యుద్ధము చేయుము. నే నాకసమున నెల్లదిశలను జరించుచు రణ మొనర్తు" నని మాయచే నొకరథము కల్పించుకొని యనంతవీర్యుఁ డగుశేషుని సారథిగా నియమించి ప్రభావతికి హర్షము గలుగఁ దృణములనడుమ నగ్నివలె దానవులందు సంచరించుచు విరోధుల కేయూరకంకణ భూషితములగు హస్తములను, గిరీటకుండలాలంకృతము లైన శిరస్సులను నర్ధచంద్రాది బాణములచే నఱుకుచు క్షురికాస్త్రముల చేత తునియలైన రాక్షసుల దేహములచే రణభూమిని గప్పివైచెను. గదసాంబులతోఁ బోరుచున్న పెక్కురు రక్కసులు సముద్రమందు జలజంతువులవలె నెచ్చటివా రచ్చటనే మడిసిరి.

ఇట్లు పోరాడుచుండ నింద్రుఁ డాకసముననుండి చూచి యుద్ధము విషమ మని తలఁచి, రాక్షసునితపస్సు క్షీణించిన దని యెఱిఁగి యెల్లవారు పురంబునఁ బ్రవేశింపవచ్చు నని యెంచి మాతలి కొడు కగుసువర్చసుడనువానిని సారథిని జేసి తనరథము గదునకును, బ్రవరాధిష్ఠిత మైన యైరావతమును సాంబునకును బంపి, ప్రద్యుమ్నునకుఁ దోడ్పడ జయంతు ననిపెను. ప్రద్యుమ్నుఁ డంత జయంతునితో సౌధము చేరి బాణాసారమున దానవులను ముంచుచుఁ గృష్ణానుజుఁ డగు గదునిఁ జూచి దేవేశ్వరుఁ డీసువర్చస్సారథిక మగు రథము నీకును, మిత్రుఁ డగు బ్రాహ్మణ పుత్రుఁడు నడుపునైరావతమును సాంబునకును బంపెను. నేఁడు ద్వారకలో రుద్రునకు మహోప హారము జరుగుచున్నది. శ్రీహృషీకేశుఁ డిచటికి వచ్చును. దేవతల వధింప యత్నించుచున్న వజ్రనాభుని మహాత్ముఁ డగు తండ్రి యనుజ్ఞ నొంది చంపుదము. కళత్రరక్షణమున మిగుల

మెలఁకువ గలిగి యుండుము" అని చెప్పి, సాంబునకును నట్లే యానతిచ్చి రణోన్ముఖుఁడై యసురమాయాకల్పిత మగు చీఁకటి విరియించి దివ్యమగు మాయచేఁ గోటిప్రద్యుమ్నులను సృష్టించి యెటు చూచినఁ దానయై దానవులను వధించుచుండెను. ఇంద్రుఁ డా రిపునాశకుని జూచి క్షేత్రజ్ఞుఁ డొకఁడే యయ్యు సకల దేహంబుల నున్నట్లు ప్రద్యుమ్నుఁ డెల్ల శత్రువుల యెదుటఁ గనంబడుచుండె నని సంతసించెను.

ఈరీతిగాఁ బ్రద్యుమ్నుఁడు పోరుచుండ రాత్రి యెల్లను గడచెను. రాక్షససేన మూఁడవ భాగము మడిసెను. అంతఁ బ్రద్యుమ్నుఁడు రాక్షసులతో యుద్ధము చాలించునంతలో నాకాశ గంగాజలముల సంధ్యోపాసన గావించుకొని జయంతుఁడువచ్చి రాక్షసులతోఁ దలపడునప్పటికిఁ బ్రద్యుమ్నుఁడును గగనగంగయందు సంధ్యోపాసన చేసికొనెను. అంత జగచ్చక్షు వగు సూర్యుఁ డుదయించునప్పటికి శ్రీకృష్ణుఁడు గరుడారూఢుఁడై యింద్రునొద్దకు వచ్చి రక్కసులకు భీతి పుట్టించు పాంచజన్యమును బూరించెను. పరవీరహంతయగు ప్రద్యుమ్నుఁ డది విని యటువంక కేఁగ, వాసుదేవుఁడు కొడుకును జూచి యీ గరుడునెక్కి వేగమే రక్కసుని సంహరింపు మని యానతియీయ, నాప్రద్యుమ్నుఁ డింద్రోపేంద్రులకు మ్రొక్కి గరుడు నెక్కి వజ్రనాభుని సమీపించి గదచే వాని వక్షమున మోదెను. వాఁడు రక్తము గ్రక్కుచు, సొమ్మసిల్లి గతప్రాణుఁ డట్లు రథముపైఁ బడెను. అది చూచి ప్రద్యుమ్నుఁ డాశ్వసి ల్లుమనుచుండనే తేరుకొని వాఁడు "యాదవబాలకా ! వీర్యంబున నాకు శ్లాఘ్యుఁడవైతివి. ఇది ప్రతిప్రహారకాలము. కాచికొ"మ్మని ఘోరముగా గర్జించి బహుకంటక మైన గదను విసరెను. అది నొసటఁ దాఁకి ప్రద్యుమ్నుఁడు రుధిరము గ్రక్కుచు మూర్ఛిల్లెను. తోడనే భగవంతుఁ డగు కృష్ణుఁడు పాంచజన్యము పూరింప యదుకుమారుఁడు తేలుకొని తండ్రి యిచ్చానుసారము తన హస్తమున నిల్చిన సుదర్శనము చూచి, యింద్రునకును హరికిని మ్రొక్కి క్షురనేమిసహస్రారం బైన యాచక్రమును బ్రయోగించి వజ్ర నాభుని శిరస్సును ఖండించివైచెను. గదుఁడును హర్మ్యపృష్ఠంబున రణము చేయుచున్న సునాభుని సంహరించెను. సాంబుఁడును మిగిలిన రక్కసులందలి పెక్కురకూరులను జంపివైచెను. వజ్రనాభ సోదరుఁడు నికుంభుఁ డనువాఁ డొక్కఁడు మాత్రము నారాయణునకు భయపడి షట్పురమున డాఁగెను.

ఇట్లు సురారి యగువజ్రనాభుఁడు హతుఁడు కాఁగా నింద్రకేశవులు వజ్రపురిఁ జొచ్చి భయపీడితు లైన పౌరుల నెల్లఁ బ్రియాలాపములచే నాదరించి, లబ్ధప్రశమన మొనర్చి, విస్తీర్ణ మగు వజ్రనాభుని రాజ్యమును రాంకవకంబలాది వస్త్రములును, వివిధము లగు రత్నములను నాలుగుభాగము లొనర్చి జయంతాదుల పుత్రులు నలువురకును సమముగా నిచ్చి, గంగా జలములచే ఋషులయెదుట నభిషేకించిరి. దేవేంద్రుఁడు జయంతుని బిలిచి ప్రద్యుమ్నాదుల పుత్రులను జూపి "వీరు నీకు రక్షణీయులు, నీకొమరుఁడు నాకును తక్కిన మువ్వురు కృష్ణునకును వంశకరులు. వీరు సకలభూతములకు నవధ్యులై నాయానతిని నిటనుండి స్వర్గమునకును, ద్వారకకును నటనుండి యిటకు నాకాశమార్గమున వచ్చుచుఁ బోవుచునుందురు. వీరికి దిగ్గజసంభవము లగు గజములను నుచ్చైఃశ్రవోజాతములైన గుఱ్ఱములను గోరినన్ని యిమ్ము. ఐరావత జనితము లైన శత్రుంజయ పురంజయము లను గజములను రెంటిని గదసాంబులకు నిమ్ము. వా రాయేనుఁగుల నెక్కి యిచ్చ వచ్చినపుడు గగనమార్గమున నేఁతెంచి కొడుకులను జూచి పోవుచుందురు." అని యుపదేశించి యమరావతికిఁ బోయెను. కృష్ణుఁడును బ్రద్యుమ్నుని వీడ్కొని ద్వారవతి కరిగెను. జనమేజయా ! ప్రద్యుమ్నాదులు నచట నాలునెల లుండి రాజ్యము రూఢము గాఁగా -

ద్వారక కరిగిరి. విజయాదుల రాజ్యము లిప్పుడును మేరుతటంబున నున్నవి. లోకము లున్నంత కాలము నుండఁగలవు. మఱియు మౌసల మగు యుద్ధమునందు వృష్ణు లెల్లరు నాకమున కేఁగిన వెనుకఁగూడ గదప్రద్యుమ్నసాంబులు కృష్ణప్రసాదమున వజ్రపురమునకు వెళ్లుచు స్వర్గపురమునకు వచ్చుచుండిరి.

ఇది భారతాంతర్గతం బైన ఖిలములలోని హరివంశోత్తర భాగమునందున్న విష్ణుపర్వము నుండి తెనిఁగింపఁబడిన ప్రభావతీ ప్రద్యుమ్న వృత్తాంతము. మూలమున నిట్లున్న కథను సూరనార్యుఁడు తన ప్రబంధమున కనుకూలముగాఁజేసికొనిన మార్పులను నట్లు చేసికొనుటలోని యౌచిత్యమును జూతము. మొదటఁ బేరుపెట్టుటయందే భేదము కన్పట్టుచున్నది. మూలమున నే డధ్యాయములు వ్యాపించియున్న కథ "వజ్రనాభవధ" అను పేర నుండెను.

శ్లో. వజ్రనాభవధం యుక్తం నికుంభవధకీర్తనే
తస్మై కౌతూహలం శ్రోతుం ప్రసాదా ద్భవతో మునే
వైశంపాయనః:— శ్లో. హంత తే వర్తయిష్యామి వజ్రనాభవధం నృప !
విజయం చైవ కౌమస్య సాంబస్యైవచ భారత.

(నికుంభవధ వర్ణించు సందర్భమున వజ్రనాభవధమునుగూర్చి యంటివి. నీ దయచే దానిని విన వేడుకపడుచున్నాను - అని జనమేజయుఁ డడుగఁగా వైశంపాయనుఁ "డాహా ! అట్లే వజ్రనాభవధను ఆ సందర్భమున ప్రద్యుమ్నవిజయమును, సాంబునివిజయమునుగూడ జెప్పెదను.) అని కలదు. అట్లు వీరరసప్రధాన మగువజ్రనాభవధ వృత్తమును శృంగారప్రబంధముగా రచింపఁ గోరి సూరనార్యుఁడు ప్రభావతీప్రద్యుమ్న మనుపే రిడుటలోనే తనయిచ్ఛ కనువుగా మార్పు చేయు నని తెలియుచునే యున్నది. అట్లే చేసినాఁడు.

మూలమున:—వజ్రనాభుఁ డనురాత్మసరాజు గలఁడు. అని యారంభింపఁబడి, వాఁడు తపస్సు చేసి బ్రహ్మవలన వరములు వడయుట. వరగర్వమున స్వర్గమును జయింప దండెత్తి వచ్చి యింద్రునితో 'మనము కశ్యపసంతతులము కావున లోకత్రయపాలనాధికారము నాకును రావలసి యున్నది కాన నిమ్మని యడుగుట. ఇంద్రుఁడు బృహస్పతి యాలోచనపై 'మనతండ్రి కశ్యప మహర్షి యెట్లు చెప్పిన నట్లు చేయుద'మన వాఁడు కశ్యపు నడుగ, నాయన యిపుడు నేను యజ్ఞదీక్షలో నున్నాను. యజ్ఞావసానమున ర మ్మనట. వాఁ డట్లే యని వెడలఁగనే యీ విష యము భూలోకమున నున్నశ్రీకృష్ణునొద్దకు నింద్రుఁడు వచ్చి తెలుపుట. అచట వసుదేవుని యశ్వమేధము, భద్రనామఁ డగు నటునిరాక. కృష్ణునియానతిపై యింద్రుఁడు మరలి స్వర్గమునకుఁ బోయి దివ్యహంసలను రావించి ప్రభావతికిఁ బ్రద్యుమ్నునియం దనురక్తిఁబుట్టించి యాతని దోడ్కొని పోయి వజ్రనాభుని జంపుయత్నము చేయ నాజ్ఞాపించుట గలవృత్తము వైశంపాయనుఁడు చెప్పిన ట్లుండ-నాకథనే తీసికొని వజ్రనాభవృత్తాంతము చెప్పక నాటకఫక్కిని ద్వారకలో శ్రీకృష్ణుఁ డుండఁగా నతనినిజూడ నొకనాఁ డింద్రుఁడు తనసారథి యగుమాతలితో నాకాశమార్గమున వచ్చుచు-అని సారథి ద్వితీయుఁడై దుష్యంతుఁడు కణ్వాశ్రమప్రాంతమునఁ గనఁబడినట్లు ప్రవేశ మొనర్చి, మూలమున లేని ద్వారకాపుర వర్ణనమును - భూగతుఁడై కవి వర్ణించునట్లు తెలుపుచుండు ప్రబంధఫక్కిని గాక, యాకాశమునుండి చూచినచో భూగత మగుద్వారక యెట్లు గోచరించునో యట్లు మాతలి మహేంద్రునితోఁ జెప్పుచున్నట్లు నాటకఫక్కిని నడపెను. సూరనార్యుని

ప్రతిభాప్రదర్శనమున కీచటనుండియు నారంభము. స్వర్లోకమునుండి భూమికి దిగివచ్చు దుష్యంతుఁడు, మాతలియు నిచ్చట స్ఫురింపకమానరు. కాని యీ వర్ణనము వేఱు. ఇది ఆకాశమున నిల్చి భూమిపై నుండు ద్వారక బింబగ్రాహి యంత్రమున (కెమెరాచేత) చిత్రరూపము దీసినట్లు వర్ణించును. ఇది యొక యద్భుతమగు ఘట్టము.

అట్లు వచ్చి యింద్రుఁడు ద్వారకాపురమునఁ బ్రవేశించుట. కృష్ణుని ప్రత్యుత్థానాదికము. కోటలోఁ బ్రవేశించి పూజితుఁడైనపిదప కుశలమా యని కృష్ణుఁడడుగుట. ఆచటనుండి నాటకములోని సంభాషణమువలె 'ఇప్పుడు నీ దర్శనంబనియెడు కుశలము కలిమి ప్రత్యక్షమే కాన నది చెప్ప నక్కఱలేదుగదా! అటుమునుపటి కుశలమా? అది యటమటము. అఖిల విదుఁడవు నీ వెఱుఁగని దేముండును? అయినను నానోట విన వేడుక యైన దేమొ? కుశలము కాదు. నా మనోవ్యథ చెప్పెదను. విను'మని యొక దాని వెంబడి నొకటిగా వజ్రనాభుని తపస్సు, వర లాభము, గర్వము, త్రిలోకాధిపత్యము గోరి అమరావతికి వచ్చుట. మూలమున లేని – వాని యనుచరుల యాగాత్యములు వర్ణించి కృష్ణుని మనసున నాటుకొనునట్లు దీనముగాఁ జెప్పి వజ్రనాభ వధోన్ముఖుని జేయును. ఇంతకంటె నాటకీయత యేమి యుండును? నాటకమగుచో ముఖసంధి యందలి 'బీజముగా నీఘట్టము గణింపఁబడును. ఇట్లే యితివృత్తము చాల భాగము పరివర్తన మొందింపఁబడెను.

ఇంద్రుఁడు వచ్చిననాఁటికి వసుదేవుని యశ్వమేధము సన్నిహిత మగుటచే, శ్రీకృష్ణుఁడు వజ్రపురప్రవేశమున కుపాయ మేమో యజ్ఞానంతర మాలోచింతము. 'వసుదేవుం డిపుడధ్వరం బొకటి నిర్వర్తింప నుద్యుక్తమానసుఁడైనాఁ, డదియున్ ద్వదర్థమకదా' యని క్రతుభుక్పతి యగు నాతనికి హృదయశాంతి యగుమాటను జెప్పి 'నీవు నుపాయాన్వేషణము గావింపుచుండుము' మని – 'అది యల్పకార్యము గా, దేవెరవునఁ దత్పురిఁ జొరఁగా వలయునో? ఎవ్వరోర్వఁగలరో వానిన్' అని చెప్పి పంపెను. వసుదేవుని యాగవేళకు మరల నింద్రుఁడు వచ్చి వజ్రపుర ప్రవేశమున కుపాయ మాలోచించుచుండ భద్రుఁడను నటుఁ డచటికివచ్చి తన నాట్యకౌశలమున నచటి మునులను మెప్పించి వారివలన వరములు గొనును. ఈ భాగము మూలముకంటెఁ గొంచెము మార్పు లున్నను దాని ఛాయనే నడచినది.

ఈ సన్నివేశము చూచి వెళ్ళిన తరువాత ఇంద్రుఁడు దివ్యహంసలను రావించి "మీరు వజ్రపురి కరిగి, వజ్రనాభుని కూఁతురు గౌరీవరమున జన్మించినది. మిగులఁ జక్కని దఁట. దానిని బ్రద్యుమ్నునం దనురక్త యగునట్లు చేయుఁడు. తరువాత నా సంగతి ప్రద్యుమ్నునకుఁ జెప్పినచో భద్రునిరూపముతో నతఁడచటికి వచ్చు" నని యింద్రుఁడే యుపాయము కనిపెట్టినట్లు మూలమునఁ గలదు.

ద్వారకకు వచ్చి యాగకాలమునఁ గృష్ణునితోఁ గలిసి యాలోచించినను నుపాయము తోఁపక చనిన యింద్రున కంతలోఁదోఁచిన దనుటకంటె – భద్రుని వటువు లాక్షేపించిన పలుకు లలోఁ గృష్ణునకే నటరూపమున నెవ్వనేని బంపినచో వాఁడు మాయాబలమున శత్రుపురమున సులభముగాఁ బ్రవేశింపఁగలఁడని స్ఫురించినట్లును, దాని కర్హుఁ డెవ్వఁ డాయని యాలోచించు చుండెననియు మార్చుట యెంతయు సహజముగ నున్నది. శుచిముఖి ప్రభావతికిఁ బ్రద్యుమ్నునం దనురక్తి కలిగినదని చెప్పినపిదపఁ బ్రద్యుమ్నుఁ డర్హుఁడని తోఁచి 'కంజదళాక్షుఁడు వజ్రనాభవధ ధూర్వహుఁ డిపు డేర్పడియె ననుచు సంతసిల్లెను' మఱియు 'నీపలుకులచంద మారయఁ

ప్రభావతికిం బతి కాఁగలాఁడు రుక్మిణీసుతుఁడు వజ్రనాభు నవశ్యము చంపు' నని పల్కెను, కాని కృష్ణుని యాలోచనమున వజ్రనాభవధ ముఖ్య మనియు గౌరీదేవివరమహిమమును మన్నించుటకై ప్రభావతిని బెండ్లియాడు ననియు నున్నట్లు స్ఫురించును. నటులరూపమునఁ బ్రద్యుమ్నాదులను బంపునపుడుగూడ వజ్రనాభుని బ్రహ్మవరబలోద్ధతుని దేవహితార్థమై త్రుంపవలయుటయును, దన్మహాత్వంబును, దత్పట్టణ ప్రవేశం బన్యులకు నసాధ్యంబగుటయుఁ, దాను మరాళిచేఁ దగ ఘటింపించిన తదుపాయమును విశదముగఁ జెప్పి యంపెనఁట.

మూలమున 'అధోక్షజేన ప్రద్యుమ్నో నియుక్త స్తత్ర కర్మణి। ప్రభావత్యాశ్చ సంసర్గే వజ్రనాభవధే తథా' అని ప్రభావతితోడి సంసర్గకృత్య మందును వజ్రనాభవధవిషయమునను కృష్ణుఁడు ప్రద్యుమ్నుని నియోగించె ననుటను - శుచిముఖితో ప్రభావతికి పతి కాఁగలాఁ డని యని, నట్లే కాని ప్రద్యుమ్నునితో నవినట్లు లేకుండ మార్చుట యెంతయు నుచితముగా నున్నది.

ఇంద్రునానాజ్ఞచే హంసలు వజ్రపురవాపికలందు విహరించుచుండ సంస్కృతము లగు వాని పలుకులకు మెచ్చి హంసలు విహరించుటకు వజ్రనాభుఁ డనుమతింప, వానిలో శుచిముఖి యను హంసిని బ్రభావతి సఖిగాఁ బరిగ్రహించెననియు నది ప్రద్యుమ్నుని గుణములను, సొగసును వర్ణింప రాక్షసాంతకుని కొడుకని భయపడిన ప్రభావతికిఁ దగురీతి బోధించి, ప్రద్యుమ్నానురక్తను గావించెననియు మూలమున నున్నది.

సూ [illegible]యే యీకథలో ముఖ్యపాత్ర మని గ్రహించి సూరనార్యుఁడు దివ్యహంసలను రప్పించునప్పుడు వజ్రనాభరాజ్యావసానసూచన నాభార్యవలన వింటినని శుచిముఖిమగనిచేఁ జెప్పించి, యింద్రుఁడు శుచిముఖిని పిలిపించునట్లుచేసి యెంతయో యుదాత్తముగా నా హంసిచే మాటాడించును. ఆసందర్భమునఁ బ్రభావతి జన్మవృత్తాంతమును, స్వప్నమున గౌరీదేవి చిత్తరు విచ్చుట చెప్పించును. కృష్ణునొద్దను, ప్రద్యుమ్నునొద్దను గంభీరముగా దానిచే మాటాడించి యందుఁ బ్రద్యుమ్నునితో మాటాడునపుడు ప్రసంగవశమునఁజెప్పినట్టు ప్రభావతీసౌందర్యము పుష్కలముగా వర్ణించును. అతని హృదయమున రాగాంకురము నాటి, పిదప రాగవల్లరితోఁగూడి గౌరీదత్త చిత్రపటమును ప్రత్యక్షముగాఁ జూచుచు ఆమె చెప్పిన ప్రద్యుమ్నుఁ డెవ్వరో తెలియక, వారు కలఁగుచున్న [illegible] నతినిపుణముగా ప్రభావతితో పరిచయము చేసికొని, మాటలచే నూరించి యూ[illegible] నమ్మకొని ప్రాణసఖియై యంతకుమున్న ప్రద్యుమ్నునితో మాటాడినట్లు చెప్పక, [illegible] వా రిరువుర సంధానమునకుఁ బూనుకొనినట్లు నటింపఁజేయును. ఇది సూరనార్యుని ప్రతిభకు నికషోపల మనవలెను.

మూలమునఁ బ్రద్యుమ్నుఁడు చక్కనివాఁ డని విని యున్నను కృష్ణుఁడు రాక్షసకుల నాశకుఁ డనియు, ప్రద్యుమ్నుఁడు శంబరాసురహంత యనియు రాక్షసాంగలవలన బ్రభావతి విని [illegible] మనసు మార్చుకొనలేక తపించుచున్న ట్లున్నది. అది రసానుకూలము కా దని కృష్ణుఁ[illegible] [illegible]నుఁడని వినియుండుటయే కాని యాతనికొడుకు ప్రద్యుమ్నుఁ డని యెఱిఁగి నట్లు చెప్పక, చిత్రపటదర్శనముచే నందు దృఢ మగు ప్రేమ మంకురింపఁజేసి, యేది యెట్లైన నితనిని దక్కక [illegible]వలె నను దృఢసంకల్పము ప్రభావతికిఁ గలిగించి, యామీఁదనైనను శుచిముఖిచే కృష్ణుని [illegible] చెప్పింపక 'ప్రకృత యువకథా విలంబమున కోర్వ వేమె' యను సొల్లుంకిసమునఁ బ్రభావతి మనసునఁ గృష్ణవిషయము స్ఫురింపకుండఁ జేసి, అతని భార్యలను

జెప్పించి, యందు రుక్మిణి యనుదాని కొడుకని తెలిపి, ప్రద్యుమ్నుని శౌర్య ధైర్య రూప రేఖాది విశేషములను విశేషించి చెప్పించుట మెచ్చఁ దగినది.

మూలమున ప్రభావతితోఁ బ్రద్యుమ్నుఁడు కలసి ఆమె యంతఃపురమున నుండఁగాఁ గొన్నాళ్ళకుఁ జంద్రవతీగుణవతులు ప్రభావతిని జూడ వచ్చి, యచట నుండు ప్రద్యుమ్నుని గాంచి యీ మనోహరాకారు నెట్లు పొందఁగలిగితివి యని వా రడుగ, నామె తనకు దుర్వాసుఁ డిచ్చిన మంత్రమహిమవలన లభించె నని చెప్పినట్లును, దమకును ననుకూలపతులు కావలె నని కోరఁగాఁ బ్రభావతి వారి కామంత్ర ముపదేశించి, ప్రద్యుమ్నుని గాంచి వీరి కనుకూలు రగు పతులను జెప్పు మనినట్లును, అట్టివారు గదసాంబు లగుదురని యాతఁడు వారిని రప్పించినట్లును గలదు. అందు రసౌచితి కనఁబడదు. రసమునకు దర్శన శ్రవణ ధ్యానాదులచేఁ గ్రమాభ్యున్నతి కావలెనుగదా ?

దానికై సూరనార్యుఁ డేదినమునఁ బ్రభావతికిఁ బ్రియునిచిత్తరువును గౌరీదేవి కలలో నిచ్చినదో, ఆనాఁటికిఁ గొంచె మివ్వలనో, అవ్వలనో ఒకనాఁడు నారదుఁడు వచ్చినట్లును, ఆయనకు మ్రొక్కిన చంద్రవతీగుణవతులకు గదసాంబులు భర్త లగుదు రని యాముని చెప్పినట్లును గల్పించి యాకన్యలయనురాగమును గూడ నాటకమున అవాంతరబిందువువలెఁ గల్పించి, చిలుకరాయబారముచే చక్కఁగ అటు నాయకులకును, ఇటు నాయికలకును సమముగా హృదయములందుఁ బ్రణయబీజములు నాటి పోషించుకొనుచు వచ్చెను. వలలోఁ జిక్కిన చిలుకచే నారహస్యము శుచిముఖికి మాత్రమే చెప్పించి, చంద్రవతీగుణవతులను గూడ నా శుచి ముఖికిఁ జెలుల నొనర్చి, ప్రభావతీప్రద్యుమ్నుల యనురాగముతో వారియనురాగమును విశేషించి కాకున్నను ఛాయగాఁ బ్రదర్శించుచు వచ్చెను. భవభూతి మాలతీమాధవమున మాలతీమాధవుల యనురాగముతోపాటు మదయంతీ మకరందుల యొక్కయు, మందారికా కలహంసులయొక్కయు ననురాగమును ఛాయగాఁ జెప్పి యా మూఁడుజంటల వివాహములతో ముగించినకల్పన మీ దంపతిత్రయ సంఘటనమున సూరన స్ఫురింపఁ జేసెను.

చిలుకరాయబారమే లేకున్నచో వజ్రపురమునకు వచ్చి నాట్యము జరుగుచున్నంత కాలము గదసాంబులు చంద్రవతీ గుణవతుల నెఱుఁగరుగదా! ప్రద్యుమ్నుఁడు గదసాంబులు వీరి కనుకూలపతు లగుదు రని చెప్పుదాఁక నాకన్యల కీగదసాంబు లెవ్వరో తెలియదుగదా! ఒండొరులను జూచుకొనినంతమాత్రమున వారు కలిసికొని రనుట రసదృష్టిని సొగసుగ నుండదు. కాన మూలమున లేని శుకసందేశాదికము సూరనార్యున కావశ్యకమైనది. ప్రభావతీప్రద్యుమ్నుల రతియంత గాకున్నను, వారలరతియు విభావానుభావ సాత్వికవ్యభిచారిభావములచే స్వాదుత్వము నొంది ఛాయామాత్రముగా నైనను రసరూపము నొందునట్లు చేసి మాలతీమాధవక్రమమును సూరన స్ఫురింపఁజేసినాఁడు.

భద్రుని వేషముతోఁ బ్రద్యుమ్నుఁడు వజ్రపురమునకు హంసి యాహ్వానముపైని వచ్చినట్లే మూలమునను, కావ్యమునను సమముగానే యున్నది. కాని మూలమున వజ్రనాభవధ ప్రధానము. కావ్యమునను వజ్రనాభవధయు, ప్రభావతీపరిగ్రహమును సమప్రధానములవలెఁ గనఁబడినను సూక్ష్మముగాఁ జూడఁ బ్రభావతీపరిగ్రహణమే ప్రధాన మనిపించును. యాదవకుమారులు తొలుఁత శాఖానగరములందు నాట్యము చేయుచుండ, నది తెలిసి వజ్రనాభుఁడు తనయొద్దకు

పిలిపించుట రెంటను సమమే. వారు గంగావతరణాదినాటకము లాడుటయు సమమే. అంతః పురస్త్రీలు నాటకము చూచుటకు ప్రత్యేకస్థల మేర్పఱచుటయు సమమే.

మూలమున వజ్రనాభవధకును, ప్రభావతీసంసర్గమునకును ప్రద్యుమ్నుఁడు కృష్ణునిచే నియుక్తుఁడై వజ్రపురమునకు వచ్చినది మొదలు నాట్యమున నైపుణిప్రదర్శించుటయే తక్క, శుచిముఖి వచ్చి నీవు సంకేతించినరాత్రి నేఁడే యని జ్ఞప్తికిఁ దెచ్చుదాఁకఁ బ్రద్యుమ్నుఁడు ప్రభావతీస్మరణము చేసినట్లే లేదు. కాని 'నీవు సంకేతించినరాత్రి' యనుటచే నింతకు మున్న శుచిముఖితోఁ బ్రభావతిని గూర్చి ప్రద్యుమ్నుఁ డేదో కొంతప్రసంగము కావించిన ట్లూహించుకోఁ దగి యున్నది. కావ్యమునం దీ సందర్భమునఁ జేసినమార్పు మిగుల రమణీయము. శుచిముఖి యెప్పటి కప్పుడే యేకతమునఁ బ్రద్యుమ్నుని గలసికొనుచుఁ బ్రభావతియెడ నాతని మనసున నున్నయనురాగమును దృఢపఱుచుచు, 'నీ దినము నీ కొంత నాట్యము చూచుటకు వచ్చును. ఆమె చూచెడిగవాక్ష మిదియే' యని చూప నాతఁడు నాట్యమొనర్చుచు నడుమ నడుమ నటువంకఁ జూచుట, సభాపతి స్తుతివ్యాజమున 'నీరాత్రి నీకడకు వత్తు'నని ప్రభావతికి సూచించుట - నాటకమున నాటకీయత యనవచ్చును. 'సకలవిశేషశోధనకు' అనుపద్యము చదువుటలోఁ బ్రద్యుమ్నుని చాతుర్యమును, 'కామాతురాణాంన భయం న లజ్జా' యనునట్లు లజ్జాభయరాహిత్యమును, దాని నెఱిఁగి ప్రభావతి మిగుల భయపడుట, దానిని జెంగట నున్న శుచిముఖి వ్యాఖ్యచేయుట యెంతయు స్వాభావికముగను, సమయోచితముగను గనఁబడును. సంకేతించిన ప్రకారము నాఁటిరాత్రి తుమ్మెదరూపమునఁ బూలమాలయందుఁ జొచ్చి యంతిపురి కేఁగి ప్రద్యుమ్నుఁడు ప్రభావతీ విరహవేదన కనులారఁ జూచుట, ఆమె మూర్ఛిల్లు సమయమున స్వస్వరూపముతోఁ గనఁబడుట యించుమించు రెంటను సమానమే. మూలమునఁ జంద్ర మందానిలానలవలని పీడ భరింపలేకున్నా నని పలికి ప్రభావతి,

శ్లో. విమనస్కాస్మి ముహ్యామి వేపథు ర్మే మహాన్ హృది
బంభ్రమీతి చ మే దృష్టిః హా హా యామి ధ్రువం క్షయమ్.

నామనస్సు చెదరిపోయినది. మూర్ఛిల్లుచుంటిని. మనసునఁ బెద్దగాఁ గంపము పొడము చున్నది. నాచూపు తిరిగి పోవుచున్నది. హా! హా! నేను క్షయ మొందుచుంటిని. అని వగచుచుండ,

శ్లో. "ఆవిష్టేయం మహా బాలా సర్వథే త్యవగమ్య చ
కార్ష్ణి ర్హృష్టేన మనసా హంసీ మిద మువాచ హ
వైశ్యేంద్రతనయాం ప్రాప్త మవగచ్ఛస్వ మా మిహ.
షట్పదై స్సహ షట్పాదో భూత్వా మాల్యే నిలీయ హి
విధేయోఽస్మి ప్రభావత్యా యథేష్టం మయి వర్తతాం
ఇత్యుక్త్వా దర్శయామాస సురూపో రూప మాత్మనః"

ప్రద్యుమ్నుఁ డీమె నాయందు బద్ధానురాగయే యని తెలిసికొని సంతసించి శుచిముఖితో "నేను తుమ్మెదలతోఁ గూడ మాల్యమునం దొకతుమ్మెదనై యణఁగియుండి యిచటికి వచ్చితిని. నేను ప్రభావతికి విధేయుండను. నాయెడ నామె యిచ్చవచ్చినట్లు ప్రవర్తింపవచ్చును." అని పలుకుచు సుందరమగు తన రూపమును జూపెను అని కలదు.

ఈ ఘట్టమునఁ జంద్రాదుల నుపాలంభించి మదను నుపాలంభింపఁబోయి 'ఎటాడఁ బోఁగా నెటువచ్చునో' యను వెఱపున కరముల్ మొగిడ్చెదన్' 'అనుచున్ ఱెప్పలు ఁదేలవైచుచు విశుష్యత్కంఠయై రుక్మిణీ తనయా! మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ యను పల్కుంచుక నాలుకన్ దడుపుచున్ బ్రాణార్తి దీపింప నొయ్యనఁ బూబాన్పున వ్రాలఁ బోవుటయుఁ మీనాంకుండు చిత్రంబుగన్' సంభ్రమంబునఁ గర్ణోత్పలంబు వెలువడి, 'హా తాలిమి నదలెదు సు, మ్మేఁ తెంచియ యున్నవాఁడ నిదె! నీపతి నన్నో తరుణీ చూడుమని తానా తల్పమునందు నిలిచి యక్కన్యఁ జేర్చెన్' అని మూలమునకు లోఁబడియే యుండాఁక సున్నది. ఈపయిని మూలమున లేని యొక చిత్రమగు ఘటనను. 'అతిశీఘ్రంబున నాలతాంగియుఁ దదీయాలింగన స్పర్శనామృతసేకంబున మూర్ఛదేఱుచునె, యున్మీలన్మహానంద మూర్ఛిత యయ్యెన్ మగుడన్' అని విరహముచేఁ గలిగిన మొదటి మూర్ఛనుండి పతిసంస్పర్శమునఁ దేఱుకొన్న దఁట కాని యాయపూర్వస్పర్శము వలని సుఖముచే మరల మూర్ఛిల్లినదఁట. అని యొక లోకోత్తర భావన నిట కవి చూపెను.

ప్రద్యుమ్నుఁ డట్లు స్వస్వరూపముతోఁ బ్రత్యక్షము కాఁగానే సిగ్గునఁ దలవంచికొని యున్న యాకన్యను గరమునఁ దాఁకి మనోరథశతంబున లబ్ధుఁడ నైన నన్నుపేక్షింతు వేల? భయపడక నన్ను గాంధర్వమునఁ బరిగ్రహింపుము. నే నిటఁ దడవుండఁగాదు. అని కృతాంజలియై వేడుకొని మణియందలి యగ్నిని స్పృశించి మంత్రములు చదువుచుఁ బుష్పముల నందు వేల్చి, యామెచే నాయగ్నికిఁ బ్రదక్షిణము చేయించి దక్షిణహస్తము గ్రహించి తమ్ముఁ గాపాడ ద్వారమున శుచిముఖిని నియమించి, శయన మందిరమున కేఁగి స్వేచ్ఛా విహారంబుల వర్తిల్లి యరుణోదయమున మేల్కొని, యామె నెట్టకేల కొడంబఱచి నటాలయమున కేగెను. అని మూలమున నుండ—సూరనార్యుఁడు 'చిరకాంక్షిత నిజపరిరంభరస స్థితిఁ జొక్కి యున్న పతిచేతులు సత్వరత విడిపించుకొని యోవరిలోనికిఁ బాఱిపోయె వనజాక్షి వడిన్' అని ప్రభావతి యెట్లు సిగ్గిల్లినదో కన్నులకుఁ గట్టినట్లు చెప్పి, యామెను రాగవల్లరీశుచిముఖు లతి శ్రమమునఁ దెచ్చినట్లును, ప్రద్యుమ్నుఁడు కన్యావిస్రంభణ మెఱిఁగినరసికుఁ డనుటకు నిదర్శనముగా రమారమి యేఁబదిపద్యములలో సంభోగశృంగారమును వర్ణించెను.ఆవర్ణన మంతయుఁ గామశాస్త్రమునకు లక్ష్యమగును. కాని మూలమునఁగల గాంధర్వవివాహమున మంత్రములు చదువుచు మణియం దగ్నిని బుట్టించి దానియందుఁ బువ్వులు వేల్చి వధువుచేఁ బ్రదక్షిణము చేయించి పాణిగ్రహణముచేసె నను నంశమును—రాగవల్లరి 'చెలి కే ల్గదియించె రతీశుచేతితోన్.' ప్రమదంబున రాకొమరుఁడు కమలాక్షిఁ బరిగ్రహించె గాంధర్వవివాహముచే 'నయం ముహూర్తగ స్సుముహూర్తో ఽ స్తంచుఁ గొలన శుచిముఖి నవ్వన్' అని అమంత్రకముగా ననగ్నికముగా గాంధర్వవివాహము జరిగినట్లు సూరనార్యుఁడు చెప్పెను. 'గాంధర్వ స్సమయా న్మిథః' అని యాజ్ఞవల్క్యస్మృతి ననుసరించియు, భారతమున శకుంతలా వృత్తాంతమునందు - 'వనజనేత్రఁ గాంధర్వవివాహ మతిరహస్యమును నమంత్రకమును నగుచు నొప్పు.' అని యుండుటను బట్టియు నట్లు చెప్పియుండును. అట్లయిన హరివంశమున నెట్లు కుదురును? అనినయెడల వికల్పవిధిగా దెలియఁ దగును. లేకున్న ఋషివాక్యనకు వైయర్థ్యము కలుగును. శాకుంతలమునఁ గాళిదాసుగూడ ననగ్నికముగను, నమంత్రకముగనే గాంధర్వమును సూచించినాఁడు.

నేఁటివిమర్శకులు కొందఱు 'పునస్సంధానమును గూర్చి చెప్పవలసినచో నూతన వధూ వరులను శయనగృహములోనికిఁ బంపి పురోహితుఁడును జెలికత్తెలును వెడలిపోవుదురు. కాని వారు క్రీడించుచున్నను, నిద్రించుచున్నను కవిమాత్రము వారిని విడువక తాను నిద్రింపక

తెల్లవాఱుదాఁక శయనగృహమునందే యుండు' నని యేవగించుకొనుట గలదు. కవి తనమనోమయ ముకురమునఁ గానఁబడిన వస్తువులలోని సౌందర్యమును భావనామహిమచే రసమయ మొనర్చి చెప్పును. ఆతని స్వాతంత్ర్య మీనాఁడు మనకు నచ్చకపోవచ్చును. అట్టివి దోషమే యగునేని ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యము లన్నియు నసత్కావ్యములును, మహాకవులు కుకవులును గావలసినదే, కావున కవిసమయముల నెఱిఁగి, వానియం దెందైన నౌచిత్యభంగము వాటిల్లినచో నాని నెత్తిచూపుట యుచితము.

బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు ప్రభావతీప్రద్యుమ్న పీఠికలోఁ గథాంశము నందు రెండు లోపము లున్న వని సూచించిరి.

(1) వజ్రనాభుఁడు స్వర్గరాజ్యాధికారము విషయమునఁ గశ్యపమహర్షిని ధర్మనిర్ణేతగాఁ గోరి యాయనను సమీపించి చెప్పఁగా నే నిపుడు యజ్ఞదీక్షలో నున్నాను. యజ్ఞావసానమున రమ్మనఁగా వాఁడు ప్రభావత్యాదులు ప్రసవింపనున్నపుడు మరలఁ గశ్యపునొద్దకు వచ్చెను. అంత నా మహర్షి యింద్రునియోగ్యతను జెప్పి నీ వీ యత్నము మాను మని హితము చెప్పఁగా నాతని మాటను నిరాకరించి, యమరావతిపైకి జైత్రయాత్రకు సమకట్టెననియు, నంతకు మున్న యింద్ర కేశవుల యానతిని నటవేషంబుల నున్న ప్రద్యుమ్నాదులకు వజ్రనాభుని సంహరింప నంచలచే వార్త నంపి రనునదియు, మొదలగు కథ సంస్కృతమున మిగుల సుందరముగ నుండ, నీ కవి తెనుఁగున వజ్రనాభుఁడు కశ్యపునొద్దకుఁ బోవుట కొంచెము మార్పుతోఁ జెప్పి, తరువాతఁ బోయినట్లే చెప్పలేదు. అని యొక లోపమును జూపి శ్రీశాస్త్రిగారే "ఇది కథాంశమునకుఁ గొఱఁత గావించినట్లు కాన్పించునుగాని మొదటి యాశ్వాసములో నొక వచనమున 'వాఁడు ప్రాభవాభిమానంబునఁ గన్నుఁ గానమిఁ దన్నుఁ దా నెఱుంగకున్నవాఁడు నాకుంజూడ నిప్పటికి గా చెప్పటికిని నప్పరమతాపసుం డింక నీ వంకకుఁ గదలిరా నెఱుంగఁ డని తోఁచుచున్నది.' యని హంసి ముఖంబునఁ జెప్పుటచే నంత కొఱంత గాన్పింప దని తలంచెదను, అని సమాధానము చెప్పి అయిన నీకథ యిట్లు మార్చుటకుఁ దగిన యుపపత్తి మృగ్యము అనిరి.

(2) ప్రద్యుమ్నుఁడు ప్రభావతియొద్దకుఁ బోయినపుడు సంస్కృతమునన్నట్లే పూలదండ నాశ్రయించిన తుమ్మెదలతోఁ గూడ నొకతుమ్మెదయై వెళ్లినట్లు...సమయానుసారంబుగ సాక్షాత్కరించినట్లు నీకవి యీగ్రంథమునం జెప్పి, పిమ్మట సంస్కృతమున లేని సారంగము నొకదానిని ద్రవ్వినట్లు కల్పించి తన్మార్గంబునఁ బ్రతిదినంబు వచ్చుచుఁ బోవుచుండె నని చెప్పెను. ప్రద్యుమ్నునకు మాయాపాటవము గల దనియు మాయచే సాధ్యము గాని దేదియు లే దనియుఁ బూర్వమే 2-25 (కావలసిన మాయలన్ దివిజవైరులకంటెఁ గరంబునేర్చు.) 4-102 పద్యము లందుఁ జెప్పియు శ్రమసాధ్య మగు సురంగమార్గమునం బోయెననుటకుం దగినయుపపత్తి యేదియుం గాన్పింపదు. తరువాత గదసాంబులను సయితము తనమాయాబలంబుననే రాత్రి సాంతఃపురమునకు రప్పించె నని సంస్కృతమున స్పష్టముగ నుండుటం బట్టి సురంగకల్పనమునకు హేతువు మృగ్యమే యని తోఁచును అని యింకొక లోపమును జూపిరి.

ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుని జంప వచ్చుచున్నాఁ డని కాని, వచ్చినాఁ డని కాని ప్రభావతితో సూచనగ చెప్పి యుండలేదు. వజ్రనాభవధకై తాను వచ్చినట్లు ప్రద్యుమ్నుఁడు గూడ ప్రాణేశ్వరిగాఁ దలంచుచున్నను ప్రభావతితోఁ జెప్పలేదు. కావునఁ దమ గుట్టెప్పుడైన వజ్రనాభునకుఁ దెలిసినచోఁ బ్రభావతి తండ్రివలన నెట్టి హానియుఁ బొందకుండఁ బ్రాణరక్షణ

గావించుకొనవలె ననియే యాసంగతి యామెకుఁ జెప్పక, నేను సారంగము త్రవ్వుకొని వచ్చుచుఁ బోవుచుందును. ఆ బిలముఖమునను నీవు కప్పింపు మని యామెకుఁ దెలియఁ జెప్పి, యామెకుఁ జూపుటయుఁ గలిగినది. తరువాత గదసాంబుల నామార్గముననే తెచ్చుటకుఁ గారణము : ప్రథమ దినమునఁ దనమాయాబలమునఁ దెచ్చినట్లున్నను, గదసాంబులు రావలె నన్నను, బోవలె నన్నను ప్రద్యుమ్నాపేక్ష తప్పదు. వారికి మాయాపాటవ మున్నట్లు సంస్కృతమునఁ గాని తెనుఁగునఁ గాని లేదు. కావునఁ బ్రద్యుమ్ను నివలెనే వారును తమప్రియలకొఱకు స్వేచ్ఛగా వచ్చి పోవు చుండుటకుఁ గూడ నుపయోగించు నని కవి సురంగకల్పనముచేసిన ట్లూహింపవచ్చును.

మూలమున వర్షర్తువర్ణనము సొగసుగ నున్నది. కాని ప్రకృతమున కంత ముఖ్యము కాదనియో గ్రంథవిస్తృతి కాకుండుటకో మానియుండవచ్చును. ఇందుబుడువర్ణన మేదియు జేయఁబడలేదు. యుద్ధవర్ణనము మూలమందువలెనే సంగ్రహముగా నున్నదే కాని పెంపఁబడలేదు. ఇం దష్టాదశ వర్ణనములు తప్పక చేయవలె నని కవి పూనిన ట్లగపడదు. కథకు సంబంధించిన తావులందు విడువలేదు. అందుఁ గొన్ని పెంచియుఁ గొన్ని కుదించియుఁ జేసెను. సూర్యాస్తమయ చంద్రో దయ చంద్రాస్తమయ సూర్యోదయాది వర్ణనములు విరివిగ నొనర్చెను. ఆవర్ణించిన వర్ణనములుచిత రీతిని ప్రకృత మగుకథకు సంబంధించిన చోట్లనే యారీతిగాఁ జేసెను. ప్రద్యుమ్నుని నెఱ కౌతుఁదనమును సహజోత్సాహమును దెలుపుటకే యశ్వారోహకళను విస్తరించి వర్ణించెను. ఈరీతిగాఁ జేసిన కల్పనలకును వాకోవాక్యములకును 'నొకటఁ బూర్వోత్తరవిరోధ మొదవకుండ' నత్యద్భుతముగాఁ గావ్య మంతయు సందర్భశుద్ధితో నడచెను.

మఱియు నిందలి రచనావిధానము పరిశీలింపఁ బ్రబంధరీతికంటె నాటకరీతియే యథక ముగాఁ గనఁబడు నని పెద్దలు పెక్కురు వ్రాసిరి. ఆదృష్టితోఁ జూచినయెడ వజ్రనాభవధ రూప మగు నవాంతరబీజము ఇంద్రునిచేఁ గృష్ణుని హృదయమునను, హంసిచేఁ బ్రద్యుమ్నుని హృదయమునను దొలుత నిక్షిప్తమైనను, ప్రభావతీ సౌందర్య కథనముచే నాయకుఁ డగు ప్రద్యు మ్నుని హృదయమున శుచిముఖిచేతనే నాయికావిషయక రతిరూపమగుబీజము నాటఁబడినది. అట్లే గౌరీదేవి కలలోఁగనఁబడి నీకుఁ బ్రద్యుమ్నుఁడు భర్త కాఁగలఁ డని చెప్పి చిత్రము నిచ్చుట ప్రభావతీ హృదయమునఁ బ్రద్యుమ్న విషయక రతిరూప మైనబీజము నాటుటయే యగును. బీజారంభములకలయిక ముఖసంధి లక్షణము – కాన నిది నాటకీయతకు స్ఫోరకము. ఇట 'రతి' యన శృంగార రసమునకు స్థాయియగు 'రతి' కాని సురతపర్యాయపదము కాదు.

> శ్లో. సంపన్నైశ్వర్యసుఖయో రశేష గుణయుక్తయోః
> నవయౌవనయోః శ్లాఘ్యప్రకృత్యోః శ్రేష్ఠరూపయోః
> నారీపురుషయో స్తుల్యా పరస్పరవిభావికా
> స్పృహాహ్వయా చిత్తవృత్తీ రతి రి త్యభిధీయతే.

సమృద్ధమగుప్రాభవమును, భోగములును, సకలసద్గుణములును, నవయౌవనమును, ప్రశస్త మగుస్వభావమును, మంచి రూపమునుగల స్త్రీ పురుషు లొండొరులను సమముగా భావించుకొను స్పృహ (ఇచ్ఛ) యనుపేరిటి చిత్తవృత్తి రతి యనఁబడును. అని భావప్రకాశిక – శుచిముఖి వాక్యారంభముతోఁ గూడి యది ముఖసంధియైనది.

ఆ బీజము నాయికానాయకులు పరస్పరము గలియుటకై శుచిముఖి చేయు యత్న మను నవస్థతోఁ గూడి పరస్పరసమాగమేచ్ఛారూపబీజము - "నీవు గంటివె నన్నట్టి శుభాంగుఁ డీ రమణి యాసల కాస్పదము" అని వ్యక్తమొనర్చుట యను బిందువుతోఁ గూడి - ప్రతిముఖసంధి యగును. 'అవాంతరార్థవిచ్ఛేదే బిందు రచ్ఛేదకారణమ్.' కావున శుచిముఖి "ఏ నిట నున్న నివ్వనము సోషణ గన్గొని చన్నదాన్నై... అతని యొద్దఁ బ్రసక్తి వెంబడిన్, వచియించిన నాఁగా దనువచనం బఖ్ఖ జేమియు నాడువకయుండె నతండు" ...... అని బీజవిచ్ఛేదము కలుగఁ బలికి "మనసు చివుక్కురు మనఁగఁ బ్రభావతి వివర్ణ మగు వదనముతోఁ గనుపట్టుడు" కొంత ప్రతికూలముగానే మాటాడి, యామె దృఢనిశ్చయము దెలిసికొని - "మది తమిఁ జూడఁ గొన్ని వెడమాటలు పల్కితి - నీవు నమ్మమే నిదె భవదీశుఁ దెత్తు" అని పలుకుట అచ్ఛేదకారణమై ప్రతిముఖసంధి యైనది.

ఉపాయాపాయశంకలచేఁ గార్య మూహించుట ప్రాప్త్యాశ. అట్టి ప్రాప్త్యాశ యను నవస్థతోఁ గూడి ప్రతిపాద్య కథాంగ మగు పతాక యను నర్థప్రకృతితోఁ గూడినది గర్భసంధి. ప్రద్యుమ్నుఁ డుద్యానవనమున కేఁగి ప్రభావతి లభించునో లేదో యనుచు "కలుగునొకో కనుంగవకు వాల్గఁ గనుంగొను భాగ్య ? మెక్కడన్ గలుగు" నిత్యాది శంకాసమాధానములందు స్ఫుటమైన ప్రాప్త్యాశ. - ప్రధానకథ కంగభూతమగు చంద్రవతీగుణవతు లంపిన చిలుకవృత్తాంతము చేత ప్రభావతివిరహతాపోపశాంతియు, ప్రద్యుమ్నుని నాట్యమున కంగభూతు లగు గదసాంబుల సాహాయ్యమును పతాకారూపములగును. కావున మీఁది ప్రాప్త్యాశ అట్టిపతాక యను నర్థప్రకృతితోఁ గూడి గర్భసంధియగుచున్నది.

ఆశా సమాభావముచేఁ గార్యనిశ్చయము నియతాప్తి. అట్టి యవస్థ ప్రకరి యనునర్థప్రకృతి కూడుట విమర్శసంధి. 'అవ్యాపిని ప్రకరి.' అనఁగా నల్పప్రయత్న మన్నమాట. వజ్రనాభుఁడే శుచిముఖిచేత నాట్యమునకుఁ బిలిపించుటవలన శత్రువు లైనను ప్రద్యుమ్నాదులకు వజ్రపురము నిరపాయముగాఁ బ్రవేశింప నర్హ మగుటచేఁ బ్రభావతితోడి సంయోగము నిశ్చయ మనుయత్నమునకై వారు వెడలుట నియతాప్తి. అది నాట్యరూప మగు అవ్యాపిని యగు (కథగల) ప్రకరితోఁ గలిసి విమర్శసంధి యైనది.

సమగ్రఫలసంపత్తి యను నవస్థ కార్య మను నర్థప్రకృతితోఁ గూడుట నిర్వహణసంధి - ఇట నాట్యకాలమున నాయికానాయకు లొకరి నొకరు చూచుకొని సంకేతకాలమున సకలభోగవస్తుసంపన్న మగు శయనమందిరము చొచ్చి వారలయిచ్ఛ సమగ్రఫల యగునట్లు క్రీడించుట - వారలతోపాటు చంద్రవతీగుణవతులతో గదసాంబులు యథేష్టముగాఁ గ్రీడించుట యను కార్యములతోఁ గూడి నిరఁ

ఇట్టుల శృంగారరసము అంగిగాను, వీరరసము ప్రధానాంగముగాను, తదితరరసము లప్రధానాంగములుగాను బంచసంధివ్యాపి యగునీప్రబంధవస్తువున నాటకీయత గల దనవచ్చును.

'నాటకలక్షణముల ననుసరించి ప్రస్తరించినచో - వజ్రనాభవధ ప్రధాన మని హరివంశము వలనఁ దెలియుటచేతను, తొలుత నింద్రుఁడు వచ్చి వజ్రనాభుని చంపు నుపాయమాలోచింపు మని కృష్ణుని వేడుటచేతను, కృష్ణుఁడు నాయకుఁడుగా వీరరసప్రధాననాటక మగును. ఈ కావ్యమునఁ దుదకుఁ గలిగినఫలము వజ్రనాభవధయే కావున దానికై "శౌరే రుపస్థితో దేవ!

వాజిమేధో మహాక్రతుః, తస్మిన్ వృత్తే వజ్రనాభం పాతయిష్యామి వాసవ" దేవా వాసవా! వసుదేవుని యశ్వమేధక్రతువు సమీపించినది. అది పూర్తికాఁగానే వజ్రనాభుని జంపెదను అని ప్రతినచేసి, ప్రద్యుమ్నాదుల నంపి, వారు యుద్ధము చేయుచున్నతఱిని సన్నిధిచేసి, తనచేతిచక్రాయుధముకృష్ణుఁడుప్రద్యుమ్నునకందించి దానిచే వజ్రనాభునిజంపించుటచేతను, వేణీసంహారనాటకమున దుర్యోధన వధాదికృత్యములొనర్చి నాయకునివలె భీముఁడు భాసించినను, ధర్మరాజే నాయకుఁడైనట్లును, ముద్రారాక్షసమున సర్వమునకు నాయకునివలెఁ జాణక్యుఁడు సర్వత్ర కనవచ్చుచున్నను రాజ్యలాభము చంద్రగుప్తునందు విశ్రాంత మగుటచే నాతఁడే నాయకుఁ డైనట్లును, శ్రీకృష్ణుఁడే నాయకుఁడు. అంగి వీరము. ప్రధానాంగరసము శృంగారము. ప్రద్యుమ్నుఁడుపతాకానాయకుఁడగు నని కొంద ఱందురు. ఎట్లు చూచినను నిది శ్రవ్యకావ్యమే కాదు. దృశ్యకావ్యలక్షణోపేతముగూడ నైయున్నదనుట నిస్సందేహము. అదియే సూరనార్యుని ప్రత్యేకత.

సంభాషణములందుఁ బాత్రానుగుణమగు జాతీయములను వాడుటలో సూరనార్యుఁ డందెవేసినచేయి.

1. ఆశ్వాసమున:— "ఎంత పాపంబు చేసిన జంతు వొక్క యింద్రుఁడగు నని యపు డాత్మ నెన్నుకొంటి" "పులినోరికండ విడివడ్డ గతిన్" 'తలపట్టి చూచుకొనుచు' తలనిండఁగ నర్థముపోసితేని నేనడుగటు పెట్టఁగా వెఱతు' - "ఎంత మాటాడితి ఓడలు బండ్లవచ్చు, బండ్లోడలవచ్చు"-"ఎంతవారలడ్డమైనఁ జక్కడఁచుచుఁ బేను గ్రుక్కిన పాటిగా" "మతిచాలమిన్ గడుపుకక్కఱితిన్," వాని వీటికిఁబోదుము. ఒట్టిడు కొంటివిగద "అట్టే తప్ప" దన - "ఒండు పోతు టీఁగకున్, బాలయఁగ రానిచోటు" 'చిచ్చు లేక చిముడు మచ్చరీఁడు "నీవే చూచు చేను జూచుట" "జీవకళ యుట్టిపడన్" "అంచన వ్రాసెనో" "ఇచ్చక మాడుమాట లివి యెల్ల నటుండఁగనిచ్చి" "నీకు నీ నెచ్చెలితోడుసుమ్ము" "సఖి నిక్కము చెప్పుము".

2. ఆశ్వాసమున:—'కొంతసేపు పెనుఘాకను జేతుల కొటి నిల్చువాఁడు' 'పిఱికికండ లేని బిరుదుమగలు,' 'చనఁ డెత్తు లిడక'.

3. ఆశ్వాసమున:—'వట్టి దొరతనంపునీటు ప్రకటించితి' 'నను నొత్తిచూచి' అక్కట యే నడుగంగ లేన, యేమని ననుఁ దిట్టికొందు'.

'కఱదలపులుఁ గిది' 'ఏమేమీ యిఁక నొక్కమాటు చెపుమా' 'ఈ యెఱుక మఱచెదరు నూ పోయివత్తు' పోయెదఁ బోయెదనం చిట్లోయంచలతల్లి యేల యుడ్డాడింపన్' ఇది యెల్లభేరి జోకొట్టుట "మిగులఁ గతరాజవు" "అన విని మనస్సు చివుక్కురు మన" "నీహృదయంబు నందుఁ గల యట్లు చెప్పుమా" "కల్ల లాడిన నీకు నాతోడుసుమ్ము" ఆశ తెగఁగోయుము" "ఇఁకఁ జూడుము అతండు విరాళిఁ గుండెడున్" "ఏమిటికి హితవుగఁ జెప్పి యెందు నదికితి" మిక్కిలిన్ బచ్చిగాఁగ వలపు తేటపఱచి వ్రాసినాఁడో" "ఆర్చి తేల్చఁ దలఁబెట్టెన్".

4. ఆశ్వాసమున:—"నీళ్లు నమలుచు" "మాట పట్టీయక చెప్పను" "మెడలమీఁదఁ గత్తి యిడినను" "కుడిచి కూర్చుండి వెతఁదెచ్చుకొంటిమి" "ఇది నాకు నిజము చేసినది" "నీకడుపు కందవిత్తుగ హంసీ" అతఁ డనిచిన పత్త్రిక దొరకె నొరులచేఁబడ "కిదియే మనకుం బదివేలు" "ఎట్లట చన ని" మ్మాచిలుక "గుమ్మడి కాయలోన నావగింజయుఁ బోదు" అనుఁగుఁగూఁతు

మాట లోకముద్దు సేయుచు "బోటిఁ బనిచి యమ్మ బిలిపింపవే యమ్మరాళి" "కాకరకాయ రీతిగాఁ గిసలయపాణి చన్నుఁగవ త్రేవ గగుర్పొడిచెన్ బొరింబొరిన్" "ఇతరవస్తురుచు లన్నియుఁ గాని వావి యయ్యె" "నిమిష మేడై తోఁచున్" "గ్రక్కునఁ జనిత్రావలుదునో ఱెక్కలు గట్టుకొని" "తోలఁగుబావయె కాఁడె తమ్ముల వరించునట్టి సతులకు నతఁడు ముస్నెట్టిఁడైన" "సందిట సంచెఁడు వెండ్రుకలు" "ఇవి యేటెఱఁగున ముడిచినను నీకున్ గొఱఁతగలదె" "ఇవియ జట్టి గొనును నీవిభున్" కడవలఁ బో మొత్తమియె చలిపందిరి పెట్టుట" వెలుగు చేనుమేసిన, మలయానిల యెద్ది కాఁపు" "చండాల వాటిలోన బ్రాహ్మణ గృహంబు వెదకుట భ్రాంతి గాదె".

5. ఆశ్వాసమున:— "ఎటాడఁ బోఁగా నెటువచ్చునో" "పీఁపుగాన రా డాఁగుట" "తలిరుఁబోఁడి మంచిదానవు గల్గితి ట్లరుగుదెంతురమ్మ" "రోళ్లా రోఁకళ్లా పాడినకూరుములు" "బిసి బిసిమాటలు" "కొంత మెత్తఁబడఁగ" "ఏనుఁగుఁ గంబానకుఁ దిగిచినట్లు" "రాత్రి యెద్దియో కొంత విశేష మబ్బినది కోమలికిన్" "ఇట్టటు గ్రుక్కుచున్నట్టి లాగు" "ఇది యెంత పేర్చెదరు" "మీచదివిన యాకునసే తాను జదివినయది మాసుదతియు," "వీరల గుట్టును నీపోఁగు నకుఁ దగుల్పడినదియే" "ఈరుదువ్వఁగఁ బేనును వచ్చు "మునిముచ్చులార!" "నాతోడిదొంగ లైతిరి" "కొంగు ముడివేసికొనుండు" "అందఱకున్ దలాయొకటి" "యౌవనపుంజిందఱ" "భావజు సివమెత్తి" "బయ లీఁదించెదవు" "తడిపాఁత గుత్తుకఁ గోయుట" "వెఱికింపఁబోయి వెఱచినతెఱఁగున" "నీకనుసన్నలో వత్తు" "ఆట మానియొడ్డించు కొనంగా వలసె" "ఏడు విఱుగులన్ విఱిగెనొకొ ప్రియుని చిత్తము" "తెగి తెగని చిఱుకత్తికోతగ" "నాయింటికి ద్రోహము పలఁచి" "ముక్కంటి వెలుంగుకంటఁ జణకంబులు వేఁచుకొనంగఁ బూనరే" "కుడుములపేట్లాటలు గావు రణంబు లన"—

ఇట్టి జాతీయము లెక్కడ కక్కడనే మొలచినట్లు కళాపూర్ణోదయమునఁ గూడఁ గుప్పలు కుప్పలు కదా! ఆతని కిట్టి తెలుఁగుపదములే కావు. శాస్త్రములందుఁ బారిభాషికము లగు సంస్కృత పదములును న్యాయములును గోటికొనలం దుండు ననిపించును. అభ్రకుసుమ సౌరభ సాధనార్థహేతు, వాశ్రయా సిద్ధ మనియెడి నయ్యా లెల్ల "విప్రవాక్యం జనార్దనః" "శృంగ గ్రాహికాన్యాయము, స్థూలారుంధతీన్యాయము" "అనుభవ సంస్కారమునకుఁ బ్రసంగ ముద్బోధకము" "అనుపక్షం బొండు భావించినన్," "అన్యథాసిద్ధి గలుగును" "అప్రతిషిద్ధ మనుమతం భవతి" "అభిధాప్రయుక్తి" "బుధులకు శాస్త్రము లన్నియును బ్రత్యయానర్థాతను వృధాభరము" "నహి మాయాయా మసంభావ్య మస్తి" మున్నగునవి యందందుఁ జక్కఁగ నదికికొనిపోయి సహజము లటు గోచరించును.

సూరనార్యుని వ్యుత్పత్తి:— వ్యుత్పత్తి యనఁగా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణము వలనఁ గలుగు నిపుణత యని శాస్త్రకారు లనినారు. "ప్రతిభా వ్యుత్పత్తిమాంశ్చకవిః" అను లక్షణ మందలి యాతని యలౌకికమగు ప్రతిభను గూర్చి స్మరించినట్లే రేఖామాత్రముగా వ్యుత్పత్తిని గూర్చియు స్మరింప యత్నింతము. లోకశాస్త్ర కావ్యాద్యులలోని లోకమును గూర్చిన యాతని యవేక్షణ మెంత నిపుణమో ముం దరయఁదగినది.

సూరన లోకజ్ఞత:— లోకజ్ఞుఁడు కావుననే ప్రబంధములందలి పురవర్ణన పద్ధతి మార్చి నాఁడు. అది కవివాక్కుగాఁ గాక మాతలి యింద్రునితో నాకాశమునుండి క్రిందికి దిగి భూమి మీఁదికి వచ్చుచుఁ గాలక్షేపమునకు వచించినట్లు వర్ణించును. ఆ చెప్పుటలో భూగతవస్తువు

లోకసమున నున్నవాని కెట్లు కనిపించునో యట్లు చెప్పుట వింతగాదా? మొదట వారికి సముద్ర మధ్యమున మినుమినుకు మనుచు ద్వారక కనఁబడినది. ఇంకను గొంచెము క్రిందికి దిగి చూడ నంతయు సముద్రము కాదు. పడమటివైపుననే సముద్రము. తక్కినది వనసముదయ మని తెలిసినది. ఇంకను దిగిరాఁగా పట్టణ సౌధములనుండి వెలువడు ధూపధూమములును మేఘములును గలిసిపోయి, వివరింప నసాధ్యముగాఁ దోఁచినవి. మఱికొంత క్రిందికి దిగఁగా నొకదానివెంబడి నొకటిగా, వలయాకారముగాఁ గోటలు పాముచుట్లువలెఁ గనఁబడినవి. అందలి రత్నాలమేడలు శేషాహి యొక్క ఫణాసహస్రమున వెలుఁగురత్నకిరీటములవలెఁ దోఁచినవి. పిదప మేడలమీఁది కేతువులు కనఁబడినవి. పట్టనము చేరువయైనకొలఁది మరకత రత్నమయకుట్టిమస్థలులు నుద్యానములు కలిసి యున్నట్లు తోఁచినవి. ఆ పైని వెండిక్రీడాపర్వతము, సంపంగిపూలతోఁట, ఇంద్రనీలపుమెట్ల వరుసలు, పగడాలతో నిర్మించిన యావరణపుఁగంచె, యాతోఁటయందలికొలను, ఆకొలనిలో నున్న విహారార్థపునావ, వరుసగా స్ఫుటముగాఁ జొచ్చినవి. మఱియు నగరము దగ్గఱ కాఁగా, నాఁచు తోడను, పెద్దయలలతోడను, సుడివులతోడను తరంగఘూర్ణనముగ లేచునీటితుంపురుల తోడను, పెద్దపెద్దయగడ్తలు కోటచుట్టును స్పష్టముగాఁ గనఁబడెను. ఇంకను సమీపింపఁ బూవులతోఁటల లోని పువ్వులు, వానినుండి భూమిమీఁదస్రవించు తేనెకాలువలును గనఁబడినవి. వానిని ప్రబంధ ఫక్కిలో ఉపమోత్ప్రేక్షాతిశయోక్త్యాద్యలంకారములతో బహువిధముల చమత్కరించుచుఁ బ్రస్తావవశమునఁ జెప్పినట్లు వర్ణించుచు "లలితపు వేడుకెత్తి భ్రమియింగని - భూస్థలి మింట నుండి - ద్యోస్థలి నిలనుండి కాంచుఁ గవితల్లజునేత్రము" (The poets eye in a fine frenzy rolling, Doth glance from heaven to earth from earth to heaven) అను షేక్స్పియరు కవిసూక్తి సర్థవంత మొనర్చెను. కోటలు పరిఖలు నున్నవనుట లేని యీకాలపు వారి కీవర్ణనము ఛాందసముగాఁ గనఁబడవచ్చును. కాని నూఱేండ్లనాఁటి కాలమువఱకు రాజధానులం దట్టివియుండుటయుఁ బ్రబంధపఠన పరిపాటీ జనితసంస్కార సంస్కృతహృదయులగు సహృదయుల కయ్యది యాస్వాద్యమగు నని యూహింపఁ దెలుఁగుటయు హేతువులు కావచ్చును. తరువాత బంధుత్వమును, దానిని మించిన మైత్రియుఁగల యిరువురు మహారాజులు కష్టసుఖములు లొండొరులు వెళ్లబోసికొనినట్లు లింద్రోపేంద్రసంభాషణము. అందుఁ బ్రతిపదమునను లోకస్వభావము మెదలుచుండును.

శుచిముఖి హంసజాతిలోనిది. కాని యది యసామాన్య మతిమతి. భూమిహంస కాదు. దివ్యహంసి. అందును బ్రహ్మకు వాహనమైనసారంగముఁ డనుమరాళరాజు బిడ్డ. సరస్వతిచేతిలోఁ బెరిఁగి సకలవిద్యలు కరతలామలక మొనర్చుకొని, వాణిచేతిచిలుకతోఁ గవిత్వమున పోటీచేసి గెలిచి గండపెండారము బిరుదుగాఁ గొన్నదిట్ట. ఈకావ్యమున కంతకును నాహంసి రత్నదీపిక వంటిది. అది లేకున్నచో వజ్రనాభవధయు లేదు. ప్రభావతి ప్రద్యుమ్నులకుఁ బెండ్లియును గాదు. అది యింద్రునితోఁ గృష్ణునితోఁ బ్రద్యుమ్నునితోఁ బ్రభావతితో, వజ్రనాభునితోఁ, జంద్రవతీగుణవతులతో నందఱితోడను అవసరమువెంబడిని మాటాడును. ఇంద్రునితోఁ బ్రభువు నొద్ద సేవకురాలివలె విధేయతతో మాటాడును. శ్రీకృష్ణునితో మాత్ర ముత్కృష్టప్రభువుతో మాటాడినరీతిని వినయము విడువక, [illegible] మిత్రునిగా నాంతర్యవిషయములు మాత్రమే మాటాడును. ప్రద్యుమ్ను నొద్ద యువరాజులతోడివారివలె సంతసమో చనవుగా మాటాడి యాతనిని వశముచేసికొనును. ఇఁకఁ బ్రభావతితో వక్రోక్తిచాతుర్యము మెఱయఁబలికి వశమొనర్చుకొని తనచేతిలోని కీలుబొమ్మనుజేసి, తనయిచ్చ వచ్చినట్లాడించి, యామె గుట్టంతయుఁ దెలిసికొనునే కాని పరిపూర్ణముగా నెందును తనగుట్టీయదు. కాని చంద్రగుప్తుని చాణక్యుఁడును

మాలతీమాధవులను కామందకియును, గాపాడినట్లు ప్రభావతిని ప్రద్యుమ్నుని గలుపు పర్యంతము నెన్నియో పన్నుగడలు పన్ని, వారిరువురను గాపాడుచుండును. అట్లు వారిరువురను గలిపికొని, యిష్టవిహారముల నుండుకాలమునఁగూడఁ జెలికత్తెవలెఁ బ్రవర్తించును. ప్రభావత్యాదులు గర్భిణులైనది మొదలు మఱికనఁబడదు. వారికి బిడ్డలు పుట్టినప్పుడు గాని వజ్రనాభుఁడు కన్యాంతఃపురమును జుట్టుముట్టినపుడుగాని యుద్ధము చేయునపుడుగాని శుచిముఖియే మైనదియుఁ దెలియదు. కాని యుద్ధము తీవ్రముగా జరుగుచున్నసమయమున "అంతన్ గేశవుఁ డంచవేగురులచే నాదైత్యసంగ్రామ వృత్తాంతంబున్ విని" నప్పు డావృత్తాంతమును జెప్పు నంచవేగురులలో నున్నదో లేదో రూఢిగాఁ దెలియదు. భరతవాక్య మీ శుచిముఖిచే సూరన చెప్పించునని యనిపించును. కాని మూలానురోధమునఁ జెప్పింప లేదని తృప్తిపడవలెను.

శుచిముఖి ఇంద్రునొద్దకుఁ దనంతటఁ దాను రాదు. వజ్రపురమునుండి వచ్చుచు వజ్రనాభుని మరణ మాసన్నమైనదని తనభార్య చెప్పినట్లు, ముందు తనభర్తచేతఁ జెప్పించి వజ్రనాభవధ కుపాయము తోఁపక యటమటించుచున్న యింద్రుఁడు పిలిపించిన యనంతరము వచ్చును. వచ్చినపిదపవాలె శత్రుపురమున కేఁగుటకు ముందు క్షమాపణము చెప్పి, ప్రభావతి సంగతి చెప్పుచు ప్రద్యుమ్నుఁడు ప్రభావతికి మగఁడగును. ప్రభావతికొఱకు వజ్రనాభ సంహారమైనఁగాని, యారాజ్యమునకు నేలిక కాఁడని గౌరీదేవిపలుకు హేతువుగా ప్రద్యుమ్నుఁ డల్లుఁడగుట సాధనముగా వజ్రనాభవధ సాధ్యమని యనుమాన ప్రమాణమున ప్రసవపఱచును. "ఆసందర్భమున నింద్రుఁ డా వాక్చాతురికి మెచ్చుకొని "నీవు వాణివో లేక యామె దిద్దిన కవివో" యనఁగా వాణిని గాను గాని, యామె దిద్దిన కవినే యని చెప్పనెంచి యాత్మస్తుతి కాకుండ నింద్రుని గౌరవించినట్లు నే ననిన రెండవపక్షము మాత్రము నిజము. బుధుఁడ వగు నీమాట యన్యథా యెట్లగునని తాను సరస్వతికి శిష్యురాల నని తన పూర్వవృత్తాంతము మాత్రమే చెప్పును. అతనిచే సాయపడు మని ప్రతిమాలించుకొనును. ఆతనియాజ్ఞను బొంది యా వృత్తాంతము చెప్ప శ్రీకృష్ణునొద్దకు శుచిముఖి యంచబలగముతో వచ్చును. అష్టమహిషీయుతుఁడగు కృష్ణుని యొద్దకు "బెదరు లేకిట్లు మిక్కిలి గదియవచ్చి యున్న తనదిట్టతనమున కువిద లెల్ల, నరుదుపడఁ గృష్ణుఁ జూచి నన్నమరవిభుఁడు పనిచె నీ కొక్కమాటఁ జెప్పంగ" ననియు, మఱియు "తన తనయుఁడు రాక్షసుపైఁ జనియెడునని రుక్మిణి కసమ్మతమగునో యని" యామె నొక్కతెను దూరముగాఁ బొమ్మనిన విరసముగా నుండు నని యామె మాటయే యెత్తక, ఏకాంతపుమాట గలదని పలికెను. ఆ మాటతోఁ బరుండియున్న కృష్ణుఁడు లేచి కూర్చుండెను. మహిషీజనమందఱును దూరముగాఁ దొలఁగిరి. అందు రుక్మిణియు నుండెఁ గదా? ఏమినైపుణ్యము! పిదప నింద్రసందేశము చెప్పి కృష్ణు ననుమతి నొంది వెడలును.

ఇఁకఁ బ్రద్యుమ్నునితోఁ బరిచయము. వాహ్యాళివిహారసారస్యంబున ద్వారకాపురబాహ్యప్రదేశమునఁ బ్రద్యుమ్నుఁడు, హంసపరివారముతో నాకసమున నెగిరిపోవుచున్న శుచిముఖి కగపడెను. అతనితో నంతలోనే పరిచయమెట్లు? ఆతఁడు యువరాజు. అందును గుఱ్ఱము నెక్కి స్వారిచేయుటలో మునిఁగి యున్నాఁడు. చుట్టు నెందఱో సేవకులును, మిత్రులు నున్నారు. అట్టితఱి శుచిముఖి ఆకసమం దేఁగుచునే తోడిహంసలతో 'అల్లయతం డితండ కావలయు నవశ్య మీవరపురుషుతో మాటాడి చనుట మనకు మేలు' అనెను. ఆమాటలు విని యతఁ డచ్చెరువడుచుండ దనబలగముతో భూమికి దిగినది. ప్రద్యుమ్నుఁడు వానిని జూచి మీ రెవరితోడనో మాటాడవలె ననుకొంటిరే! వానితో మాటాడుఁడన శుచిముఖి 'యిచట నీవుగా కెవ్వరున్నారు?'

అని మాటలో మాట కలిపి 'యొకపనిమీఁద ఇంద్రుఁ డుపేంద్రునొద్దకు వచ్చి యాయనతో మాటాడి సెలవొంది యొకచోటికి వెళ్లుచు నీవు కనఁబడ నిన్ను సేవింపక పోరాదని వచ్చితిమి. నీయనుగ్రహము మాకుఁ బ్రయోజనసిద్ధి హేతువు' అని యింద్రోపేంద్రుల నమ్మినబంట్ల మని చెప్పి, పోయి వచ్చెద మంపు మనెను. దానిపై గంభీరహృదయుఁ డని తెలియునట్లు ప్రద్యుమ్నునిచె మీరు వెళ్లుపని రహస్య మేమొ? అది వలదు లెండు. 'అల్లయపట డితఁ డనుకొంటి రాదినెచట నాప్రసంగంబు రాఁ గారణంబు గలిగె' అని యతనిచేత నడిగించుకొనునది. ఆవెంటనే యది చెప్పినదా? అది రహస్యమే యైనను నీకడ దాఁపతిక మే మున్నది అని యిట్టట్టు పలుకఁ గొంకి నలువంకలు పాఱఁ జూచినది, అనఁగా నిందఱిలోఁ జెప్ప రె ట్లని. వెంటనే ప్రద్యుమ్నుఁడు దీపితైకాంతకాంక్ష మగుచూపునఁ జూడఁగనే పరిజన మంతయుఁ గడుదూర మేఁగ నపుడు చెప్ప మొదలిడినది. శుచిముఖిచేష్ట, దానిని మించి ప్రద్యుమ్నునిచూపు, రెండును లోకస్వభావమును జాటుచుండుటలేదా? ఆహా యదియే సూరనయందలి విశేషము. పిదప వజ్రనాభవధను గూర్చిన యింద్రోపేంద్రుల యాలోచనను సూచించును. దానిపై నాయకున కుండఁదగిన శౌర్య, ధైర్య, సాహస, వివేకాద్యుత్తమ గుణములను వర్ణించినట్లు గాక ప్రద్యుమ్నుని మాటలో ధ్వనింపఁ జేయును.

పిదప నీప్రసంగము మున్ను వచ్చిన తెఱంగును విన్నవించెదను. అని ప్రభావతి పేరెత్తికొని యామెసౌందర్యము నతిమనోహరముగ వర్ణించి చెప్పి, వాణి దిద్దిన కవి నైన నేనే యామెచక్కఁదనములోని యొకలేశమును జెప్ప లేనైతి నని తనగొప్పఁదనము సూచించి, తరువాతఁ దాను వాణిచేతఁ గల్పింపఁబడిన యామెచేతిచిలుకతోఁ గవిత్వము చెప్పపందెమునఁ దనగెలుపును, నామె 'ఉపమాతిశయోక్తికామధేను' బిరుదముతో గండపెండార మిచ్చుటయు శుచిముఖి యని యామె పే రిడుటయుఁ జెప్పి, ఇట్టినాకుఁ గూడ నామెచక్కఁదనము వర్ణింప నలవి కా దని ప్రభావతీశ్లాఘామధ్యముననె తనయుత్కృష్టత యుక్తియుక్తముగఁ బలిక, తరువాత నిట్లే యూరించుచు నామెగౌరీవరమునఁ బుట్టినది కాని బ్రహ్మసృష్టిలోనిది కా దనియు ఆమెకు గౌరీదేవి కలలోఁ గనఁబడి "వ్రాసి దయ నిచ్చె నని యొక రమ్యపురుషుఁ జిత్రఫలకాభిలిఖితు నెచ్చెలియుఁ దాను వేడుకఁ జూడ నేఁ గంటి ననఘా!" ఆచిత్రరూపమందలి పురుషుని సొగసు నీయందుఁ గనఁబడుటచే అతఁడే యితఁ డనుకొంటిమి. అని మొదటఁ దా ననుకొన్న మాట కలిపినది. ప్రద్యుమ్నుఁడు వినుచున్నాఁడే కాని ప్రభావతినిగూర్చి యంతగా వర్ణించి చెప్పుచున్నప్పు డేమియు నన లేదు. అది యతనిగాంభీర్యమును సూచించుచున్నది. అది కనిపెట్టినది. బుద్ధిమంతుఁడు గాని సామాన్యుఁడు కాఁడు గదా! విమర్శించుకొని యేల ప్రోవకు రా కుండు నని మనసున ననుకొని, ప్రసంగవశమున నాకన్యసౌందర్యము చెప్పిన ట్లుండవలెను గాని తాను రాయబారము వచ్చినట్లుండఁ గూడ దని "మాకు నిక్కడఁ దడయుట యుచితంబుగాదు పోయి వచ్చెద మనుప నవధరించితే" యని యెగిరి పోయినది. ప్రద్యుమ్ను నిదే గంభీరహృదయ మనుకొన - నంతకంటె శుచిముఖిహృదయము గంభీరతర మని పించినాఁడు కవి.

ఆపైని ప్రద్యుమ్నుని మనసునఁ గలుగుమార్పులును, వరసను బట్టి ప్రభావతిరూపము నెట్లు ప్రద్యుమ్నుఁడు ధ్యానింపఁ గల్గెనో యచటఁ గవి చేసినవ్యాఖ్యానము శ్రవ్యకావ్యముల కన్నింటికిని జీవనౌషధ మని తెలియఁదగును. కన్యాంగసౌందర్యకథనమున సూరన ప్రత్యేకము తానొకకవి. ప్రద్యుమ్నుం డావర్ణనము ననుసరించి ప్రభావతియొక్క నిజమైనరూపు గుర్తించె నని

సహేతుకముగాఁ జెప్పునపుడు వ్యాఖ్యాత. అట్లు వినినంతమాత్రముననే వాస్తవ స్వరూపము తెలియునా? అను విషయమున పెద్దవిమర్శకుఁడు. ఔరా! ఈ రీతి రచన యపూర్వమన శంక యేల? రెండవయాశ్వాసము 107, 108, 109, 110 పద్యములు సహృదయు లవహితహృదయులై పరిశీలించుకొందురు గాక!

ప్రభావతి తోడి పరిచయము:— చెలికత్తె యగు రాగవల్లరియుఁ బ్రభావతియు నంబ యిచ్చిన చిత్తరువు చూచుచున్నారు. ప్రద్యుమ్నుని పేరు గౌరీదేవి చెప్పినది. కాని యతఁ డెవరో వారికిఁ దెలియదు. తెలియదని విడువ నసాధ్యముగా నున్నస్థితిలో వారు చూచుచిత్తరువు నాశుచిముఖి "యదృచ్ఛనపోలె నా తెఱవ యెదుట నడ్డముగ నల్లనల్లన యరుగుచు సవిమర్శదృష్టిని బలుమఱు మరలి మరలి కొంతసరి గడచుదాఁక నొక వింతసరణిని జూచె". ఆ చూచునపుడు ప్రభావతి మన సెట్లుండునో చిత్రించుచున్నాఁడు. మనమే యీచిత్తరువుసంగతి తెలియక కలఁగుచుండఁగా - కఱఁదులపులుగు ఇది యేమి యెఱుఁగునే యనినది. శుచిముఖి యామాటలకుఁ గినియలేదు. అవునమ్మా మావంటితిర్యక్కుల కేమి తెలియును? కాని మున్నొక్కచోట నొక్క పురుషుని జూచి యట్టివాని నెందుంగానక, ఇప్పు డిందు నతని కైవడిదోఁచిన నిది యతనిచిత్రమా? లేక యట్టివాఁ డింకొకఁ డెందేని గలఁడా యని చూచితి నని యామెను, జెలికత్తెను నుచ్చులోఁ బడ్డపక్షులను జేసినది.

ఇఁక నే మున్నది వా రిరువురును దానికి దాసులైపోయిరి. ఆ పయిని వక్రోక్తులచే నూరించి యూరించి, వారిగుట్టంతయు సమగ్రముగా లాగుకొని 'నీకంటె మాకు దిక్కు లేదు' అని వారిచే ననిపించుకొన్నది. ఈ కావ్యమున కీ ఘట్టము హృదయస్థానము. (తృతీయాశ్వాసము 45 మొదలు 85 పద్యముదాఁక.) - తరువాత 'భావన చేసి చూడ క్షణభంగుర మింతులతాల్మికల్మి వాతావిలపల్లవాంచలహిమాంబు కణంబును నంతకంటె మేల్' (4-84) కావునఁ బరీక్షింపవలయు నని రాగవల్లరితో శుచిముఖి 'అతనియొద్ద నీయంగనయంగకముల చక్కఁదన మెల్ల నొక్క ప్రసంగవశత నేను మున్ను వర్ణించినదాన...వచియించిన నాఁగా దనువచనం బపుడేమియు నుడువక యుండె నతం డచలస్థితి...కాన నాతనిగాక నింకొకని చెప్పము. ఏలోకమువాని నైనఁ దెత్తు నని యామెచేఁ దప్పక ప్రద్యుమ్నునిగా కన్యుని వరింపనని శపథపూర్వకముగాఁ జెప్పించుకొనుదాఁకఁ గార్యరంగమున నడుగు వెట్టదు. లోకజ్ఞత కింతకంటె నేమి కావలయును?

వజ్రనాభునితోడిపరిచయము:—ప్రభావతిచేఁ దన్నుగూర్చి చెప్పించి, యాతఁడు పిలువ నంపినతరువాతఁ గాని వానియెదుటికిఁ బోవదు. ఆపైని భద్రునిగూర్చి ప్రసంగవశమునఁ జెప్పినట్లు చెప్పి, వజ్రనాభునికోరికపైఁ దెచ్చెద ననును. కాని తనంతఁ దా ననదు. శాస్త్రార్థముల నుపన్యసించునపుడు పండితులు సభలయందుఁ బూర్వపక్షసిద్ధాంతములతో వాదించు తీరు స్పష్టపఱిచెను. లోకజ్ఞత యీ రీతిగా నిందు లేనితావే లేదు.

శాస్త్రావేక్షణనైపుణి:—తర్కశాస్త్ర వివేకమునకు ద్వితీయాశ్వాసము 84. చతుర్థాశ్వాసము 61, 62 పద్యములును దార్కాణములు.

వ్యాకరణశాస్త్రజ్ఞతకు - సౌవరమాధురి, పూతక్రతాయి, ఆఢ్యంభవిష్ణువు, సన్నిధాపితము, దందమ్యమానము, శబ్దాయమానము, పద్ధతీవర్తనున్, వ్యాచక్షాణులు, మైత్రీచుంచువు మున్నగు ననేకప్రయోగములు దృష్టాంతములు.

మఱియు సూరనకుఁ గల వ్యాకరణశాస్త్ర మార్మికతయును, స్వాతంత్ర్యమును, రాఘవ పాండవీయము. 2. 119 లోని ప్రాసస్థలమునఁ బ్రయోగించిన 'బుధ్న' శబ్దమునఁ దెలియును. అందలి బ్రధ్న, బుధ్న - అనునవి. 'బంధే ర్బ్రధి బుధీచ' అను ఉణాది. 3. 28 సూత్రముచే 'బంధ' ధాతువునకు 'బ్రధి, బుధి' యను నాదేశములును, నక్ప్రత్యయమును రాఁగా సిద్ధించినవి. ఇఁక బుధ్న శబ్ద మేరీతిని సిద్ధించెనో శాస్త్ర మేదియుఁ గనఁబడదు. కాని మహాభాష్యకారు లీ ఉణాది విచారమున 'సంజ్ఞాసు ధాతురూపాణి ప్రత్యయాశ్చ లతః పరే। కార్యా ద్విద్యా దనూబంధ మేత చ్ఛాస్త్ర ముణాదిషు' అని యిచ్చిన యభ్యనుజ్ఞ ననుసరించి, 'బుధువృద్ధౌ' అను స్వాదిగణపఠిత 'బుధు' ధాతువునకు, బంధి ధాతువునకు వలెనే నక్ప్రత్యయము చేర్చి 'బుధ్న' అను రూపమును స్వతంత్రముగా సృష్టించె నని తోఁచుచున్నది.

ఇఁకఁ గావ్యరచనానియమములను కథయందలి పాత్రలచేతనే సందర్భానుసారముగాఁ గళాపూర్ణోదయమునను, నిందును జెప్పించుట యరయ నాతని యలంకారశాస్త్రజ్ఞత తెలియును. కళాపూర్ణోదయమున మణికంధరుఁడు శ్రీకృష్ణునిగూర్చి చెప్పినదండకము నేకసంథనే గ్రహించి, బుద్ధిని ధరించిన కలభాషిణి నారదునికోర్కెపై మరలఁ జదివి, కృష్ణుఁ డద్దానికి మెచ్చుకొని మణిహారము కానుగ నిచ్చె నని చెప్పి యామెయే యాకవిత్వమును శ్లాఘించుచున్నట్లు.

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించునట్లఁ, దమలోనఁ దొరయు శబ్దములఁ గూర్చి
యర్థంబు వాచ్య లక్ష్య వ్యంగ్య భేదంబు, లెఱిఁగి నిర్దోషత లెసఁగఁజేసి
రసభావములకు నర్హంబుగా వైదర్భి, మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
యుచితంబులై తనరారెడు, ప్రాణంబు లింపుగాఁ బొదుకొల్పి

గీ. యమర నుపమాదులును యమకాదులును నగు, నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు, వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె.

అని కావ్యరచనాలక్షణమును జెప్పించినాఁడు. అట్లే యిందును శచీముఖి వాక్చాతురిని మెచ్చుకొనుచు నింద్రుఁడు పలికినట్లుగా ద్వితీయాశ్వాసము ౪ పద్యమున జక్కఁగా వివరించినాఁడు.

ఇట్లే వేదమతము (పూర్వమీమాంసామతము) దీనియందు సూచించినాఁడు. దీనిని మించి కళాపూర్ణోదయమున నాద్యంతము ధ్వనింపఁజేయుచు వచ్చెను.

'సమయాభిజ్ఞత కుక్కుటంబు వివిధచ్ఛంద స్త్రియామాంత రంతిమయామో భగవాన్ ఋషిః కుసుమధన్వీ దేవతామానినీ రమణాయాం వినియోగ అంచు' ... (5-56) అను పద్యమున మంత్రశాస్త్ర సంప్రదాయము సూచించెను.

'శబ్దసంస్కార మెచ్చుటను జాఱఁగనీక పలుక నేర్చుట బహుతపఃఫలము గాదె' అని పలికిన సూరన వ్యాకరణవిరుద్ధప్రయోగములు చేసి యుండఁ డనియే యనుకొనవలెను. అట్టియెడ రాఘవపాండవీయమున 'మహాగోదావరీ తీరసత్' అను ప్రయోగమునందు రామాయణార్థమున 'మహాగోదావరీ + తీర' యనియు, భారతార్థమున మహోగః + దావరీతీ + రసత్ అనియుఁ బదచ్ఛేదము. రీతి శబ్దము క్తిన్నంత మగుటచే 'రీతి' యని హ్రస్వాంత మయియే యుండవలెను. కాని రీతీ యని దీర్ఘాంత మగుట కాధారము లేదు. క్తిజంతము కాని క్తిన్నంతము కా దని

వ్యాఖ్యాత యనెను. కాని యాధారము చూపలేదు. పద్ధతి, పద్ధతీ యనినట్లే చెప్పవద మనిన బహ్వాదిగణమున రీతిశబ్దము కానరాదు. అది యాకృతిగణముగాఁ గనఁబడదు. కావున రీతీశబ్దము సంశయాస్పదముగాఁ దోఁచుచున్నది.

ఇఁకఁ దెలుఁగుపదములందు 'పోచున్' అని కళాపూర్ణోదయమునను 'పోవుచున్నారు' అని ప్రభా - లోను ప్రయోగించెను. చువర్ణకము పర మగునపుడు 'పోవు' లోని వు లోప మేవ్యాకరణమును జెప్పినట్లు లేదు. రారు + కదా - రారుగదా - అనియు, 'గతానుగతికోలోకో యటంచున్' అనియుఁ గళాపూర్ణోదయప్రయోగములను దనబాలవ్యాకరణమున నుదాహరణ ముగాఁ జూపిన చిన్నయసూరి 'పోచున్' అను కళా ప్రయోగమును చూడలే దనవలెనా? చూచినయెడ దానిని దప్పని కాని, యొప్పని కాని యనియుండఁడా? అను నూహచే సూరి పాఠమున నట "చంచున్, చన్చున్" అను రూపములలో నేదియో యొకటి కనఁబడఁగా నందు విశేషము లేమి తనవ్యాకరణమున నెత్తికొనలే దనుకోవలెను. ఈ రెంటను గూడ యతిప్రాస స్థలములు గావు. నిర్ధరించుట కవకాశము కనఁబడదు. కావున 'చంచున్, చన్చున్' అనియుండ దనియో యుండదా దనియో ప్రాయసగాంధ్రము సవరించినపాఠమా యని సంశయము కలుగుచున్నది. 'రోళ్లారోకళ్లాపాడిన' యనునది గ్రామ్యమేయైనను జనవ్యవహారమున నైన నున్నది. కాన ప్రకరణము ననుసరించి చమత్కారమున కాగ్రామ్య రూపము వాడె ననినను గొంత నయ మనిపించును. 'పోచున్' అని వ్యవహారమునను లేదు. శాస్త్రానుమతియును లేదు. అచటవలెనే యిచటను జమత్కారార్థము గ్రామ్యమే ప్రయోగించె ననినచో 'పోతూ, పోతున్నారు.' అని యైన నుండవలెను గాని 'పోచున్, పోచున్నారు' అనుట యెట్లు? ఈ రెండు ప్రయోగములకును ప్రాచీనపాఠము లెట్లున్నవో చూచిగాని నిర్ణయింప వలను పడదు. ఇఁక ఛందోవిషయమున రేఫసంయుక్తాక్షరమునకుఁ బూర్వాక్షరము గురువు కావలసి యున్నను లఘువు చేసి ప్రయోగించెను. షష్ఠ్యంతములలో "పింగళిసూరప్రధానప్రియ పుత్రు నకున్" అనియు, చతుర్థాశ్వాసాంతపద్యమున అమలమప్రియసూనున్ అనియుఁ గనఁబడుచున్నవి. ఈ రెండు తావులందును సిద్ధసమాసములే కాని, సాధ్యసమాసములు సర్వసామాన్యముగా నెవ్వ రును గూర్పరు. సిద్ధసమాసమధ్యమున నిట్టి లఘుత్వము లేకపోలేదు. "సర్వాస్స్వపిచ భాషాసు రహాయుస్తే ద్వరే పరే, పూర్వస్య లఘుతా వేతి" అనుదానిని బట్టి వికల్పమగు లఘుత్వము నితఁడు నంగీకరించె ననుకొనఁదగును. కాని పింగళిసూరప్రధానప్రియపుత్రునకున్, అని సవరించుట యుచితము కాదు. ఇంతకుఁ బూర్వపుగ్రంథములం దెందేని షష్ఠ్యంతములు సాధ్యసమాసములతో నితఁడు గాని, మఱెవ్వరుగాని చెప్పినట్లు కనఁబడదు. కావున రేఫసంయుక్తాక్షర పూర్వవర్ణమునకు లఘుత్వవికల్ప మితని కంగీకార్య మనుకొనఁదగును.

ఆశ్వాసాంతపద్యములును, ఆశ్వాసాదిపద్యములును సాధారణముగా సంబోధనాంతము లుగా నుండుట యాచార మైనను, నన్నెచోడమహాకవి కుమారసంభవమునను, తిక్కన సోమ యాజి నిర్వచనోత్తరరామాయణమునను, విన్నకోట పెద్దనార్యుఁడు కావ్యాలంకార చూడామణి యందును సంబోధనేతర విభక్త్యంతములతో నాశ్వాసాంతములను జెప్పి, పూర్వాశ్వాసాంతము లందలి విభక్తితో, మీఁది యాశ్వాసాది పద్యములను జెప్పుట కనఁబడును. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున ప్రథమాశ్వాసాంతము 'రాయవేశ్యాభుజంగున్' మున్నగు ద్వితీయాంత విశేష ణములతో ముగించి తృతీయాశ్వాసాదిని '...మనుమ జగతీపాలున్' అనియు, తృతీయాశ్వాసాంత, చతుర్థాశ్వాసాదులందు ప్రథమాంత విశేషణములతో 'హృత్ప్రియుఁ డుర్విన్, మనుమజనపతి'

అనియు చతుర్థ్యాంతముననుు, పంచమాని 'ప్రసన్నాత్మచేతన్, వల్లభుచేన్' అని తృతీయా విభక్త్యంతముగాను ముగించి, తరువాతవాని కన్నిటఁ బ్రథమాంత విశేషణములను బ్రయోగించెను.

సూరన రాఘవపాండవీయమునను, కళాపూర్ణోదయమునను, కృతిపతిని సంబోధనాంత విశేషణములతోఁ జెప్పియు, ప్రభావతీ ప్రద్యుమ్నమున చతుర్థాశ్వాసాది పద్యముదాఁకఁ బ్రథమాంత విశేషణములతోఁ జెప్పి, చతుర్థాశ్వాసాంత పద్యములందును, పంచమాశ్వాసాది పద్యమునను మాత్రము ద్వితీయాంత విశేషణములతోఁ జెప్పెను. ఇట్లాశ్వాసాంత పద్యములు భిన్నవిభక్తులలోఁ జెప్పుట చూడఁగా - అట్టిపద్యము లేవిభక్తులలో నున్నను నుండవచ్చుననియు, పూర్వాశ్వాసాంత పద్యము లెన్నియుండునో అవి యన్నియు నేకవిభక్తికములుగానే యుండు ననియు దెలియుచున్నది. ఇట్లు మార్పుచేయుటవలన ఛందోవిషయమునఁ గూడఁ బూర్వకవుల కావ్యములను సవిమర్శముగాఁ జదివి యందందుఁ గనఁబడిన విశేషముల నెల్ల గ్రహించినవాఁడని తెలియఁదగును. నాట్యవిషయమున నిందలి నాల్గవయాశ్వాసమున మూఁడు నాలుగు పద్యములలో లక్ష్యమునఁ గలిపి చెప్పెను. అందు 96 పద్యమునను, 100 పద్యమునను రూపకలక్షణములే కనఁబడును. 93 పద్యమున పంచమహాశబ్దములు చెప్పఁబడెను.

ఇఁక 99 పద్యమునఁ దాళప్రస్తారమును దత్తద్భేదములును, గీతికాభేదములును సంగీతశాస్త్రసమ్మతముగాఁ గూర్పఁబడెను. చంచత్పుట, చాపపు, టోద్ఘట్ట, షట్పితాపుత్రకము లన నొప్పుతాళభేదము లావేళ్లతో నేఁడు ప్రచారమున లేమింజేసి శబ్దకల్పద్రుమము ప్రమాణముగాఁ జూపుచు వచ్చిన సంగీతదామోదరము, శ్రీ మల్లయశాస్త్రిగారి లఘుటీకయందుఁ జూపఁబడిన సంగీతరత్నాకరము అను గానశాస్త్ర ప్రాచీన గ్రంథములనే యవలంబించి యా (99) పద్యము వ్యాఖ్యానింపఁబడినది. సమ విషమ తాళములనఁ జతురస్ర త్ర్యస్ర జాతులని సంగీతదామోదరమున నున్నది. కాని త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ జాతులను తాళములు నేఁటి గాయక వ్యవహారమునఁ గనఁబడును. ఆ భేదము లీపద్యమున లేకపోవుటయుఁ దరువాత వచ్చుటయుఁ జూడఁ బ్రస్తారనైపుణ్యమున నర్వాచీన గాయకోత్తంసులు సృష్టించిన వేమో యనిపించును. ఈ యూహ పొరపాటైనను గావచ్చును. కాని వృత్త ప్రస్తారమునకు ఛందశ్శాస్త్రమువలె, స్వర ప్రస్తారమునకును దాళ ప్రస్తారమునకును గానశాస్త్ర మవకాశ మొసంగినది. కాన నట్లు ప్రస్తరించి యుందురని యూహింపవచ్చును.

ఇఁకఁ గావ్యాద్యవేక్షణమువలని నిపుణత సూరనార్యున కెంత గలదో యూహింప నలవికాదు. తనకుఁ బూర్వులగు నాంధ్రకవుల ఛాయల నంతగాఁ గ్రహింపకున్నను సంస్కృత కవుల ఛాయ లందందుఁ గ్రహించె ననవచ్చును. "ఉత్పత్స్యతే మమతు కోఽపి సమానధర్మా" యని భవభూతి సూరనార్యు నుద్దేశించియే యనినట్టు లాతని ఛాయలు సూరన కావ్యములందు లేకపోలేదు. ఇతి వృత్తస్వీకారమున - ప్రఖ్యా తోత్పాద్య మిశ్రము లను విభాగమునకు లక్ష్యములుగా మహావీరచరిత, మాలతీమాధవీ, యోత్తరరామచరితములను భవభూతి రచించినట్లే, సూరనయు రాఘవపాండవీయ, కళాపూర్ణోదయ, ప్రభావతీ ప్రద్యుమ్నములను రచించినట్లు గోచరించును. పాత్రల మానసికప్రవృత్తుల కెక్కువ ప్రాధాన్యమిచ్చు భవభూతివలెనే సూరనయు మానసికప్రవృత్తులను దెలియజెప్పుటయే కాక, పాత్రలయొక్క చేష్టలను, అప్పటి స్థితియుఁ గన్నులకుఁ గట్టును (చూ. 5-53). అట్టివాని నన్నిటి నుదాహరించిన నింకను గ్రంథము విస్తరిల్లు నని యా విషయమును బాఠకలోకమునకు వదలి యింతతో విరమించుచున్నాను.

# స్వ వి ష య ము

ఈ ప్రబంధమునకు వ్యాఖ్య చేయఁబూనిన నేను ముందుగాఁ బాఠనిర్ణయము చేసికొన వలసి యున్న దని యెఱుఁగుదును. దానికై ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమునకుఁ గాని, తంజావూరు సరస్వతీపుస్తక భాండాగారమునకుఁ గాని వెళ్ళి, తాళపత్రప్రతులు చూచి పాఠములు నిర్ణయింప నెంచితిని కాని పల్లెటూరియం దుండుటచేతను, దైవము కలిసి రాకుండుట చేతను, నాయత్నము సాగక, వావిళ్ళవారి ప్రతిని, శ్రీ మల్లయశాస్త్రిగారి ప్రతిని సంప్రదించు కొనుచు వ్యాఖ్యానించుచు వచ్చితిని. సందేహములు కల్గినచోట్ల నీవిషయము సూచించుచు వచ్చితిని. ప్రాచీనతాళపత్త్రప్రతుల పాఠములను జూడలేని నాయశక్తతను బాటింపవల దని విజ్ఞులను బ్రార్థించుచున్నాను.

లోకోత్తరప్రతిభావంతుఁడు మహాకవి పింగళి సూరనార్యుఁడు. ఆతని పరిణతవాక్కు—ప్రభావతీప్రద్యుమ్నము. అట్టికావ్యమునకుఁ బరిమితమతి నగు నేను వ్యాఖ్యానింప సాహసించుట యనుచిత మని యెఱుఁగుదును. అయినను దమ యిలువేలుపైన శ్రీరామున కంకితముగా నాచే శంకరవిజయము రచింపఁజేసి నన్నెల్లవిధముల ధన్యు నొనర్చిన సుచరిత్రులును, నవాప్తకాములును, సుదారమానసులును - శ్రీ వేంకట్రామా కంపెనీ ప్రొప్రయిటర్లు నగు శ్రీ ఈదర వేంకటరావు పంతులుగారు నాకుఁ జిరకాలపరిచితు లగుటచే - వారి పుత్త్రరత్నము, శ్రీ వేంకటరామయ్య పంతులుగారు, పురాణవిద్యాపట్టభద్రు లగుటయే కాక, యాంధ్రభాషా పోషణైకతానమానసులై, వేంకట్రామా గ్రంథమాలను స్థాపించి, యా గ్రంథమాలాపక్షమున నీమహాకావ్యమునకు సంపూర్ణ వ్యాఖ్య యొనర్పఁ బ్రోత్సహించుటచేఁ బూనక తప్పినది కాదు. అంతర్వాణి చూడామణులును, శ్రీ పిఠాపురమహారాజాస్థాన భూషణులును, బ్రహ్మణ్యులు నగు శ్రీ పురాణపండ మల్లయ శాస్త్రులవా రింతకు మున్ను రచించిన లఘుటీక కొంతవఱకు నాకు సాయ మొనర్చినది. గురుతుల్యు లగు నాపూజ్యపాదులను భక్తితో స్మరించి, కృతజ్ఞత వెల్లడించుకొనుచున్నాను. నాయొనర్చిన యర్థనిర్ణయాదులం దెందైనఁ బ్రమాదము లుండవచ్చును. అట్టివి గ్రంథకర్త వని కాని, శ్రీమల్లయ శాస్త్రిగారి వని కాని తలంపక, నాయవియే యని యెంచి కృపఁ జూపఁ బండితలోకమును, బాఠకలోకమును సవినయము ప్రార్థించుచున్నాను.

ఈ ప్రబంధము శ్రీ వేంకట్రామా గ్రంథమాలలోని చతుర్థ పుష్పము. ఇంతకు మున్ను శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమునకును, శ్రీ సుందరకాండమునకును వ్యాకరణ విద్యా ప్రవీణ శ్రీచిలుకూరి పాపయ్య శాస్త్రిగారిచే వ్యాఖ్యలు రచింపఁజేసి ప్రకటించుటయే కాక శ్రీ భగవద్గీత-ఆంధ్రానువాదముతోఁ దాత్పర్యయుతముగాఁ బ్రకటన మొనర్చి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులై, యింకను నిట్టిమహాగ్రంథములను వరుసగా గ్రంథమాలాపక్షమున నాంధ్రుల కందఁజేయ సంకల్పించిన మాతృభాషారాధన తత్పరు లైన యుదారులును, శాంతులు నగు శ్రీ వేంకట్రామయ్య పంతులుగారికిని, వారికుటుంబమునకును, బరిపూర్ణాయు రారోగ్యైశ్వర్య సౌభాగ్యభాగ్యములను, శ్రీకృష్ణపరమాత్మ యనుగ్రహించుఁగాక యని కోరుచున్నాను. ఈ వ్యాఖ్యాన మొనర్ప నాకు ధైర్యము గలిగించిన రసజ్ఞులును, గవితాలోలురును, నస్మన్మిత్రులు నగు శ్రీ పాలుట్ల పాలంకయ్యగారికి నాహృదయపూర్వక ధన్యవాదములు.

కొమానపల్లి
అమలాపురము తాలూకా
కోనసీమ

ఇట్లు బుధవిధేయుఁడు
వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి

# పరిశిష్టము

1. వాదున గెల్వలేక పురవైరి లలాటముకన్ను చూపఁ దాఁ బాదమునందుఁ గన్నుఁ బ్రతిపక్షతఁ జూపెను......గౌతముఁ బోల నేర్తురే. (1-2) అను పద్యమునందలి గౌతముని గూర్చిన వృత్తాంతము:—

వ్యాసమహర్షి గౌతమునితో తర్కశాస్త్రమునందు వాదముజేసి యోడిపోయి శివునితో విన్నవించుకొనెనఁట. అంతట భక్తపరాధీనుఁ డగు శివుఁడు వ్యాసునిపక్ష మవలంబించి గౌతమునితో వాదించి తానుగూడ నోడిపోవ నుండునెడఁ జేయునదిలేక కోపమున మూఁడవకన్ను చూపఁబోవ, గౌతముఁడు నీవు ఫాలాక్షుఁడ వైనచో నేను పాదాక్షుఁడను జుమీ చూడుమని పాదమునఁ గన్ను కల్పించుకొని చూపెనఁట. అంత శివుఁడు కోప ముడిగి గౌతముని మెచ్చుకొనెనని యొక యైతిహ్యము కలదు.

పద్మపురాణమున నీకథ యింకొకరీతి నున్నది. గౌతమతర్కమును వ్యాసుఁడు ఖండింపఁగా గౌతముఁడు కోపించి, యాతని నీకంటితోఁ జూడనని ప్రతిజ్ఞచేసి, వ్యాసుఁ డది యెఱిఁగి ప్రసన్నుడుగ రాఁగా గౌతముఁడు పాదమునఁ గన్ను కల్పించుకొని చూచెను. అప్పటినుండియు నాతఁ డక్షపాదుఁ డయ్యెను అని, ఈ కథనే సర్వదర్శన సంగ్రహవ్యాఖ్యాత అభ్యంకర వాసుదేవ శాస్త్రిగారు అక్షపాదదర్శన వ్యాఖ్యావసరమున "గౌతమో హి స్వమతదూషకస్య వ్యాసస్య ముఖదర్శనం చక్షుషా న కర్తవ్య మితి ప్రతిజ్ఞాయ, పశ్చా ద్వ్యాసేన ప్రసాదితః పాదే నేత్రం ప్రకాశ్య తం దృష్టవాన్ తదారభ్య తస్య అక్షపాదనామ్నా ప్రసిద్ధి రభూత్" అని యిట్టి పద్మపురాణకథ ననుసరించియే వ్రాసినారు.

కాని సూరనార్యుఁడు శివునితో వాదించె నను నైతిహ్యము నాధారము చేసికొనియే పైపద్యమును రచించుకొనెను.

2. పింగళివారిపేకి. (1 ఆ. 14. పద్యము) అమరనిధి యగు పింగళిగోకనమంత్రి యడవి త్రోవ నొకప్పుడు వచ్చుచు నొకమఱ్ఱిక్రింద విలువయగు గాజుపూస పడియుండ - దానిని గైకొని యింటికిఁ జేరి, యది యొకపెట్టెలో దాఁచి యుంచెనఁట. ఆ మఱ్ఱి నాశ్రయించి యుండు పేకి యనునొకగంధర్వస్త్రీ (కొందఱు యక్షి యందురు) ఆ గాజుపూసకై దాసీరూపమున గోకన యింటికి వచ్చి ఎట్టి యసాధ్యపుఁబని చెప్పినను సునాయాసముగఁ జేయుచు నాయింటిని విడువక యుండెనఁట. కొన్నాళ్లకు గోకనమంత్రిభార్య బాలెంతరాలుగా నుండ నామెకు రాత్రి సాయముగా పరుండిన యాగంధర్వి తాను బరుండినచోటనుండియే నాలుక చాపి, దీప మెగద్రోయుచుండుట బాలెంతరాలు చూచి, భయపడి, కన్నులు మూసికొని, తెల్లవారినపిదప గోకన కాసంగతి చెల్ప, దాని నెట్లయినను వదల్చుకొనుటకై కాశి కేగి గంగాజలము తెమ్మని పంపి, కుటుంబముతో - దూరపుటూరు కొండపురమున కేఁగెనఁట. అంత నాగంధర్వి యాజలమును దెచ్చి యట నెవ్వరు లేకుండుట చూచి, వారు దిగవిడిచిన యొక పెద్దరాతిరోలు నెత్తిని బెట్టుకొని గోకన యున్నయూరికిఁ జేరుకొనె నఁట. అది చూచి నీ వెట్లు మమ్మును విడిచి వెళ్లెద వని భీతుఁడై గోకన యడుగఁగా - నీవద్ద నున్న గాజుపూస నాది. అది యిచ్చినచో పోదు ననె నఁట. అపుడు గోకన యది తెచ్చి యీయ, వెడలిపోయినదఁట. అని యొకజనశ్రుతి. ఈ చివర భాగము నింకొక రీతిగా కొందఱు చెప్పుదురు. అసాధ్య మగుపని చెప్పి దానిని (ఆపేకిని)

వదలించుకో నెంచి గోకన యొకతలవెండ్రుక నిచ్చి దీని వంకరలు తీర్చి తెమ్మని యిచ్చెననియు, అది గోటితో సరిచేయుచుండ నింకను జుట్టఁబెట్టుకొనుటచే సరిచేయుట యసాధ్యమై యెవరి తోడను జెప్పక ఆపేకి తనంతఁ దానే పాఱిపోయె ననియుచెప్పుదురు. గోకనమంత్రి మనుజుల చేతనే కాక తనమహామంత్రమహిమవలన యక్ష గంధర్వాది దేవతలచేతఁ గూడ దాస్యము చేయించుకొనువాఁ డని యీకథ తెలుపుచున్నది.

౩. తృతీయాశ్వాసము 82 వ పద్యవ్యాఖ్యానమున రూపకము, ఉల్లేఖము అని వ్రాయఁబడి నది. దీనిని మాలానిరవయవరూపకమనియుఁ జెప్పుదురు. ఆ యపూర్వసౌందర్యత కెంత యెంత యుచితంబగు నంతయుఁగల్గి శోభిలున్ అను నుత్తరార్ధమున "సమాలంకారముకూడ కలదు. అపూర్వసౌందర్యతకు కారణము లయిన యవయవ సంవిధానము లెంతెంత యుండిన నుచితముగా నుండునో అంతంతగా నుండిన యీకారణసహకారముచేత కార్యమైన అపూర్వసౌందర్యత సిద్ధించె ననుటచేతఁ గారణసారూప్యవర్ణనద్వారమునఁ గార్యమగు నపూర్వసౌందర్యము సిద్ధించె నని భావము. కావున నిట కారణసారూప్యవర్ణనరూప మయిన 'సమాలంకారము' ఇందుఁ గారణము సాక్షాత్తుగా వాచ్యము కాలేదు. కావున సమాలంకారము ప్రతీయమాన మగుచున్నది. ఈరెం డలంకారములకును సంసృష్టి అనియును గ్రహింపఁదగును.

—వ్యాఖ్యాత.



శ్రీగురుమూర్తయే నమః

# ప్రభావతీ ప్రద్యుమ్నము

## సవ్యాఖ్యానము

### ప్రథమాశ్వాసము.

ఉ. శ్రీమదుమామహేశు లతిచిత్రవిలాసులు దారు మున్ వియో
గామితచింత నొండొరులకై సగమౌటలు నిచ్చఁదెల్పు కాం
క్షామహిమంబుచేఁ జెఱిసగంబుగ నొక్కయొడల్ ధరించు స
త్ప్రేమపుదంపతుల్ కృతిపతిన్ దనరింతురుగాతఁ గీర్తులన్. 1

అర్థము:—అతిచిత్రవిలాసులు = మిగుల నాశ్చర్యమగు శృంగారచేష్టలుగలవారు, (కావుననే) మున్ = తమవివాహమునకుఁ బూర్వము, వియోగా...చింతచేన్ - వియోగ = ఎడబాటువలని, అమిత = అధికమైన, చింతచేన్ = విచారముచేతను, ఒండొరులకున్ + ఐ = ఒక రొకరికొఱకు, సగము + ఔటలు = సగము భాగము మిగులునట్లు కృశించుటలను, నిచ్చన్ = ఎల్లప్పుడును, తెల్పుకాంక్షామహిమంబుచేన్ = (తమలోఁదాము) తెలియజెప్పుకొను కోరికల యాధిక్యముచేతను (వలె) ఒక్కయొడల్ = ఒకశరీరమునే, చెఱిసగంబుగన్ = ఒక్కొక్కరికి సగపాలగునటుల, ధరించు = తాల్చిన, సత్ప్రేమపు దంపతుల్ = శాశ్వతప్రేమగలిగిన యాలుమగలైనట్టి, శ్రీమ...మహేశులు — శ్రీమత్ = శోభాయుక్తులగు, ఉమామహేశులు = పార్వతీపరమేశ్వరులు, కృతిపతిన్ = ఈ కృతికధిపతియగు 'అమరయ' మంత్రిని, కీర్తులన్ = యశస్సులచేత, తనరింతురుగాతన్ = విలసిల్లఁజేయుదురుగాక.

తాత్పర్యము:—తమపెండ్లికిఁ బూర్వ మొకరినొక రెడఁబాయుటవలనఁ గలిగిన వ్యథచేతఁ జిక్కి సగమైపోయిన తమస్థితిని నొకరికొకరు తెలుపుకొను పెద్దకోరికచేతనో యనునట్లు మిగుల నచ్చెరువగు శృంగారచేష్టలుగలవారు గాన చెఱిసగంబుగ నొకదేహమునే ధరించిన శాశ్వతప్రేమరూపులై, యనాది దంపతులైన పార్వతీపరమేశ్వరులు కృతిపతియగు అమరామాత్యునకుఁ గీర్తుల నొసంగి తనరింతురుగాక.

వివరణము:—ఏతత్ప్రబంధరచయిత యగు పింగళిసూరన మహాకవి పితృభక్తుఁడగుటచేత పితౄణము తీర్చుకొనుతలంపుతో రచింప నెంచిన యీ ప్రబంధమును తండ్రియగు నమరయమంత్రి కంకితముసేయుచు నిర్విఘ్నపరిసమాప్తికై యిష్టదేవతా స్మరణపూర్వకమును గృతిపతియగు తనతండ్రి కాశీరూపమునగు మంగళాచరణము తొలుదొల్తఁ జేయుచున్నాఁడు. ఇం దర్ధనారీశ్వరరూపము చమత్కారముగా వర్ణింపఁబడెను. లోకమునందెంత యనురాగముగల దంపతులైనను వియోగము కలిగినచోఁ గృశించి, కృశించి, మరల గలిసినప్పుడావియోగవ్యథ తీఱునట్లు గాఢముగా నొండొరులను గొంతకాలమే కౌఁగిలించుకొందురు. కాని యీ పార్వతీపరమేశ్వరు లట్లుగాక వెనుకటి వియోగమున కృశించుటగాక సరిసమానముగ సగపాలయిపోయి, యిఁకనెన్నఁడును నెడయకుండ నొక్కశరీరముగా నేర్పడుటచే శాశ్వతగాఢాశ్లేషముగలవారైరి. కావుననే వారిశృంగారవిలాసము లాశ్చర్యకరములును, శాశ్వతప్రేమసూచకములు నగుచున్నవి. సత్ప్రేమపు దంపతులనుటవలన దంపతిరూపమున భాసిల్లుచున్న సచ్చిదానంద స్వరూపుఁడగు నర్ధనారీశ్వరుఁడు స్ఫురించు

చున్నాఁడు. మఱియుఁ "కీర్తింస్వర్గఫలామాహుః" అనునభియుక్తోక్తిచే నెంతకాలము భూమియందుఁ గీర్తియుండునో యంతకాల మాకీర్తిమంతుఁడు స్వర్గమున సుఖించుచుండును. కానఁ దనతండ్రికి శాశ్వత స్వర్లోకసుఖావాప్తికై శివుఁడట్టికీర్తుల నెలకొల్పుఁగాక యని కోరఁబడినది. "పరస్పరతపః సంపత్పరస్పర ఫలాయితౌ, నిజతపఃఫలాభ్యాం" అను సూక్తులసారమును సూరన యీ పద్యమునఁ బొందుపఱచి తనశివ పారమ్యమును, రాఁబోవు కథయందలి నాయికానాయకుల గాఢానురాగమును ధ్వనింపఁజేసెను. శివదాంపత్య మతి చిత్రవిలాసము కావుననే రాక్షసరాజగు వజ్రనాభుని పుత్రికకు రాక్షసాంతకుఁడగు శ్రీకృష్ణుని కొడుకైన ప్రద్యుమ్నుని భర్తగా శక్తిస్వరూప యగు నంబిక సంఘటించుట కల్గె ననియు ధ్వని.

అలంకారము:—ఉత్ప్రేక్ష. కాని సంభావనాద్యోతకములగు వలె మున్నగు నుపమావాచకపదములం దేదియు లేకుండుటచే వాచ్యము గాక ధ్వని యగుచున్నది. ఉత్ప్రేక్షాలంకారధ్వని.

వ్యాకరణవిశేషము:— సత్ప్రేమపు దంపతులు - సత్ప్రేమము + దంపతులు - అమహద్విశేషణమగు "సత్ప్రేమము" అనుపదము, మహద్వాచక "దంపతి" పదముతో సమసించుట విశేషము. సూ. కర్మధారయంబు స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు. బాల. సమాస. 5. సూత్రము "విశేషణమునకు విశేష్యంబుతోడ సమాసంబు కర్మధారయంబు" అను వృత్తిగత వాక్యరూపలక్షణమునకు నియామకమై, కర్మధారయమునఁ బూర్వపదంబు విశేషణమగు నప్పు డది స్త్రీసమమే, ముగంతమే, ధాతుజ విశేషణమే యయి యుండవలెనని నియమించుటచేత, డుమంత ప్రాతిపదికమైనను "సత్ప్రేములు" అను దానికి ముగంతత్వయోగ్యత గల దగుటచే "సత్ప్రేమము" అను రూపముననే దంపతి శబ్దముతో సమాసము కలిగినది. ఈయర్థమే "మహద్విశేషణంబు సమాసంబున ము వర్ణకాంతంబు గలదు" అను ఆంధ్రశబ్దానుశాసనము - ప్రకీర్ణ పరిచ్ఛేదమందలి సూత్రము స్పష్టపఱచినది. కావ "సత్ప్రేమపు దంపతులు, అనామధేయపు దైత్యుఁడు. (1. ఆ. 78.) మున్నగునవి సాధువు లగుచున్నవి.

ఉ. అంగజహేతుకంబు లరయన్ మిథునంబుల ప్రేమ; లిట్టిచో
నంగజు తల్లిదండ్రు లగునట్టి యనన్య సమాన హార్దసం
సంగు లనాది దంపతులు సత్కృప నిత్తురుగాక సౌఖ్యముల్
పింగళి సూరధీరవరు బిడ్డకు మా యమరేశ మంత్రికిన్. 2

అర్థము:— అరయన్ = ఆలోచింపఁగా; మిథునంబుల ప్రేమలు = స్త్రీ పురుషరూపమగు జంటల (ఒండొరుల యెడఁగలుగు) అనురాగములు; మన్మథ హేతుకంబులు = మదనుఁడు కారణముగాఁగలవి. మదనునివలననే కలుగుచున్నవి అని భావము. ఇట్టిచోన్ = ఇట్టియెడ, అంగజు తల్లిదండ్రులు = మన్మథుని గన్నవారు, అగునట్టి = అయిన, అనన్య...సంగులు - అనన్యసమాన=ఇతరుల ప్రేమతో సాటిగాని, (లేదా, అనన్య = ఇతరుల కెవ్వరికిని లేనట్టిదియు,) సమాన = (ఇరువురకు) సమమైనదియూ నగు, హార్ద = ప్రేమము యొక్క, సంసంగులు = ఎక్కువ కలయికగలవారును, అనాది దంపతులు = మొట్టమొదటి యాల్మగలును (అగు లక్ష్మీనారాయణులు), పింగళి సూరధీరవరు = పింగళి సూరనయను పండితోత్తమునియొక్క, బిడ్డకున్ = కొడుకైన, మా+అమరేశ మంత్రికిన్ = నా తండ్రియగు అమరయమంత్రికి, సౌఖ్యముల్ (పరలోకమున) ఎల్లసుఖములను, సత్కృపన్ = స్థిరమగు దయతో, ఇత్తురుగాక = ఇచ్చెదరుగాక.

తాత్పర్యము:— లోకమున స్త్రీ పురుష ప్రాణుల కన్నిటికిని ననురాగము పుట్టించువాఁడు మన్మథుఁడు. అట్టి మన్మథుని గన్నదంపతులు లక్ష్మీనారాయణులు. కావుననే వారి పరస్పరానురాగము లోకసామాన్యము కానిది. అట్టి యలోక మహిమ గలిగి యనాది దంపతులగు నా జగన్మాతాపితలు మా తండ్రియైన యమరయ మంత్రికి సౌఖ్యముల నిత్తురుగాక.

అలం:— విభావన.

గీ. 'కారణము కార్యమువలనఁ గలిగెనేని, వేఱొక విభావన యటంద్రు' ఆంధ్ర చంద్రాలోకము.

మఱియు సాధారణ రూపమునఁ జెప్పఁదగిన లక్ష్మీనారాయణులను అనాది దంపతిత్వ స్వరూపమున వర్ణన మొనర్చుటచే పర్యాయోక్త్యలంకారము. శ్లో. 'పర్యాయోక్తంతు గమ్యస్య వచో భంగ్యంతరాశ్రయమ్' (సం. చం.) గీ. అమర భంగ్యంతరమున గమ్యార్థసిద్ధి, యది చెలంగుఁ బర్యాయోక్త మనఁగఁ గృతుల. (ఆంధ్ర చంద్రాలోకము.)

చ. అమల నవీన హైమ నిజయానగరుద్ద్యుతిఁ బ్రోచు సద్వపు
ర్విమల రుచిన్ స్వభక్తులకు వెండియుఁ బైఁడియుఁ గీర్తియున్ సుతే
జము, నెప్డుఁ డెప్పుడే యొసఁగు సర్గనిధానముఁ దాల్చియున్న య
ట్లమరెడు వాగ్విధాత లమరార్యున కిత్తురు నిత్యసౌఖ్యముల్. 3

అర్థము:— అమల = తెల్లనైనది (హంసరంగు), నవీన = క్రొత్తదియగు, హైమ = బంగారు వికారమైన, (అనగా పుటము వేసిన బంగారము వికారమైన అనిభావము. ఇది హంస ఱెక్కల తుదనుండు బంగారురేఖలకాంతి), నిజ=తమ దగు, యాన=వాహనమగు హంసయొక్కయు, గరుత్=దానిఱెక్కల యొక్కయును, ద్యుతిన్ = కాంతిని, ప్రోచు...రుచిన్, ప్రోచు=వృద్ధిపొందించెడు, సత్ = శ్రేష్ఠమైన (లేక శాశ్వతమైన), వపుః = (ఇరువుర) శరీరములయొక్క, విమల రుచిన్ = స్వచ్ఛమగు కాంతిచే, స్వభక్తులకున్ = తమ్ము భజించువారికి, వెండియున్=వెండిని, పైఁడియున్ బంగారమును, కీర్తియున్ = యశస్సును, సుతేజమున్ = మంచి ప్రతాపమును, ఒసఁగు = ఇచ్చునట్టి, నిధానమున్= సృష్టియను ద్రవ్య రాశిని, తాల్చియున్న యట్లు = (శరీరకాంతి రూపమున) ధరించినట్లు, అలరెడు = ప్రకాశించునట్టి, వాగ్విధాతలు = సరస్వతీ బ్రహ్మలు, అమరార్యునకున్ = కృతిపతియగు అమరయమంత్రికి, నిత్య సౌఖ్యములు = శాశ్వతమగు సుఖములను, ఇత్తురుగాక = ఇచ్చెదరుగాక.

తాత్పర్యము:—సరస్వతిదేహము తెల్లనిది, బ్రహ్మదేహము ఎఱ్ఱనిది, హంస తెల్లనిది, దానిఱెక్కల తుది బంగరురేఖ లెఱ్ఱనివి, కీర్తి తెల్లనిది, ప్రతాము ఎఱ్ఱనిది. అను కవిసమయములచే నీ పద్యములోని భావ మెఱుఁగవలయును. హంసవాహనమెక్కియున్న సరస్వతీ బ్రహ్మ లిందు వర్ణ్యము. స్వచ్ఛమగు తెల్లని సరస్వతి శరీరకాంతిచే హంసయొక్క ధావళ్యము హెచ్చుచున్నది. బ్రహ్మమేని యెఱ్ఱనికాంతిచే హంసఱెక్కలతుది బంగరురేఖల కాంతి హెచ్చుచున్నది. అట్టి యా యిరువుర దేహకాంతులును, తమ్ము సేవించువారికి వెండిబంగారములను, కీర్తిప్రతాపములను నిచ్చుటకై తాల్చిన సృష్టియను ద్రవ్యరాశియా అను నట్లుండె నన్నమాట. అట్టి తెలుపు, నెఱుపు కాంతిగల మేనులతో హంసవాహనారూఢులగు నా వాణీ, బ్రహ్మ లమరార్యునకు నిత్యములగు సుఖముల నిత్తురుగాక! అని నారికేళపాకమున ఈ పద్యము చెప్పఁ బడెను. ఇందు క్రమాలంకారము, ఉత్ప్రేక్షయును.

వ్యా. వి. ఇత్తురు అను తద్ధర్మార్థకముననే ఆశీరర్థ ముండుటచేత 'గాక' అనునది ద్యోతకమాత్రము. "ఇచ్చు. ధా. చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు" బాల.క్రియా. 108. సూత్రమున చకారము జాతిపరముగా గ్రహింపఁదగును. కాన ఇ + తు + రు. కాఁగా "త్రికంబుమీఁద యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు" ననుసూత్రమునందలి బహుళగ్రహణముచే సమాసము గాకున్నను, నిచట ద్విత్వమువచ్చి "ఇత్తురు" అను రూపము సిద్ధించును.

వ. అని సకలభువన వర్తనహేతువులైన పురాతన మిథునంబులం గొనియాడి. 4

అర్థము:—అని = ఇట్లని, సకల = ఎల్ల, భువన = లోకములయొక్క, ప్రవర్తన = నడవడికి, హేతువులు = కారణములు, ఐన = ఐనట్టి, పురాతన = మిగులపూర్వమువారు, తొలుదొల్లటివారలైన

మిథునంబులన్ = ఆలుమగలను, (రమానారాయణులు, ఉమామహేశ్వరులు, వాణీబ్రహ్మలు అనుపేళ్ళ నొప్పు నాదిమదంపతులను) కొనియాడి = నుతించి, (కొనియాడు. రూపాంతరము కొండాడు, శబ్ద పల్లవక్రియ).

తాత్పర్యము:—పదునాలుగులోకముల సృష్టి స్థితి లయములకు హేతువులయి, శక్తిత్రయముతోఁ గూడిన మూర్తిత్రయమును స్తుతించి — అని కవి మంగళ మాచరించెను.

గీ. ఆదికవులఁ బ్రాచేతస వ్యాసమునులఁ, దలఁపులోన భజించి య త్యంత సరస
మగుప్రభావతీప్రద్యుమ్నమనుప్రబంధ, మాచరింపుచు నొక్కనాఁడాత్మలోన. 5

అర్థములు:—ఆదికవులన్ = మొదటికవులగు, ప్రాచేతస వ్యాసమునులన్ = వాల్మీకిమునిని వ్యాసమునిని (ప్రచేతసుని యపత్యమగు పురుషుఁడు ప్రాచేతసుఁడు అనియు, చిక్కుపడియున్న వేదముల నేర్పఱించినవాఁడు వ్యాసుఁడు అనియు వ్యుత్పత్త్యర్థములు.) తలఁపులోనన్=మనస్సులో, భజించి = కొలిచి, అతి + అంత — అత్యంత = మిక్కిలి, సరసము = శృంగారాది రసములతోఁ గూడినది, అగు = అయినట్టి, ప్రభావతీప్రద్యుమ్నము = ప్రభావతి నాయికగాను, ప్రద్యుమ్నుఁడు నాయకుఁడుగానుగల, ప్రబంధము = మహాకావ్యమును, ఆచరింపుచున్ = రచించుచు, ఒక్కనాఁడు = ఒకదినమున, ఆత్మలోనన్ = మనస్సులో, "అనుకొంటిని" అధ్యాహారము.

వ్యా. వి. తలఁపు - తలఁచుధాతువునకు పువర్ణకము, సూ. "పువర్ణకంబు మాయ్యాదులకగు" బాల. కృదంత. (తలఁపునకు మొదటియర్థము "ధ్యానము" అనియే. దానినుండి ధ్యానమున కధికరణమగు 'మనసు' అని మఱొక యర్థము వచ్చినది.)

"ఆచరింపుచున్" అనుదానిలోని ఇంచుక్ప్రకారమునకు పకారము శాబ్దికసమయ విరుద్ధము. ప్రాచీనులమతమునఁ గూడ ఇంచుక్ "అనుబంధము కాకపోవుటచే" అనుబంధ ప్రార్థనయో ర్ణా వ్యతిరేకాడకేచ చోఽపః స్యాత్" అను చింతామణి సూత్రమునను పత్వము రాదు, కాన "ఆచరించుచున్" అని యుండుట సమంజసము. కాని "పకారంబు కొన్నియెడల శత్రర్థపరక చువర్ణకంబునకుం గానంబడియెడి" అను ప్రౌఢ. క్రియా. 17 సూత్రముచే సాధు వగుచున్నది. ఇట్టిదే యీకవి కళా. 7. 162 లోను ప్రయోగించియున్నాఁడు.

మ. జనముల్ మెచ్చఁగ మున్ రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుంగబ్బము లెన్నియేనియును మత్పిత్రాది వంశాభివ
ర్ణనలేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల వత్యంతమున్. 6

అర్థము:—మున్ = ఇంతకుఁ బూర్వము, జనముల్ = లోకులు, మెచ్చఁగన్ = కొనియాడునట్లు, ఉదంచ ద్వైఖరిన్=విజృంభించిన ఫక్కితో (అనఁగా స్ఫుటమగురచనతో ననిభావము) గారుడంబును = గరుడపురాణమును (ఇది అష్టాదశ మహాపురాణములలోనిది) శ్రీరాఘవ పాండవీయమును = రామాయణ భారతములలోని రెండర్థములును జోడింపఁబడిన శ్లేషకావ్యమును, కళాపూర్ణోదయంబును=కళాపూర్ణుఁడు నాయకుఁడుగాఁ గల్గి, కేవల కల్పిత వస్తువుగల కావ్యమును, మఱిన్ = ఇంకను, తెనుఁగుం గబ్బములు = తెలుఁగు కావ్యములు, ఎన్నియేనియును=పెక్కులు, రచించితిని=నిర్మించితిని, (కాని, అందున్—అనునవి యిట నధ్యాహార్యములు,) మత్పిత్రాది = నా తండ్రులు మున్నగువారియొక్క, వంశ = వంశములయొక్క

(తన తండ్రుల వంశముయొక్కయు, తల్లివంశముయొక్కయు) అభివర్ణన=పెద్దగాఁ జెప్పుటయొక్క, లేమిం జేసి = లేకపోవుటచేత, అవి=పూర్వోక్తములగు నా మూఁడు రచనలును, నాకున్, పరితుష్టిన్ = సంతోషమును, అత్యంతమున్=ఎక్కువగా, ఒనర్పంజాలవు=కలిగింపలేకున్నవి.

తాత్పర్యము:—ఇంతకుమున్ను గరుడపురాణ, రాఘవ పాండవీయ, కళాపూర్ణోదయములును, మఱియును బెక్కు తెలుఁగు కావ్యములను రచించియుంటిని. కాని వానియందు నా తలిదండ్రుల వంశవర్ణన లేకపోవుటచేత నవి నాకు సంతోషము కలిగింప వాయెను.

క. తండ్రియు సుతులకు దైవం, బండ్రుగదా వేదవాదు ♦ లది వినియును నే
వీండ్రును వాండ్రునుబలె మా,తండ్రిఁ బరమపూజ్యుఁగాఁగఁ ♦ దలఁపమి తగునే? 7

అర్థము:—వేదవాదులు=వేదమునుజదివి చెప్పు పెద్దలు, సుతులకున్=కొడుకులకు, తండ్రియున్ = తండ్రికూడ, దైవంబు = దేవుఁడు, అని, అండ్రుగదా = అన్నారుగదా, నేన్ = నేను, అది = ఆవేద ధర్మమును, వినియును, వీండ్రును, వాండ్రును బలెన్ = వీరు వారు వలె - సామాన్యజనులవలె, మాతండ్రిన్ = మాతండ్రియగు అమరయను, పరమపూజ్యున్+కాఁగన్ = మిగులఁ బూజింపఁదగినవానినిగా, తలఁపమి = తలపోయకుండుట, తగునే? తగదని భావము.

తాత్పర్యము:—తల్లి, తండ్రి, ఆచార్యుఁడు, అతిథి - గృహస్థునకు దేవతలు అనుభావమును 'మాతృదేవోభవ, పితృదేవోభవ' ఇత్యాదిశ్రుతి చెప్పుచుండుట వినియుఁగూడ వారు వీరువలె నేనుగూడ నాతండ్రిని పూజనీయునిగాఁ దలఁపకపోవుట ధర్మముకాదు. -తండ్రియున్ అనుసముచ్చయము తల్లిమున్నగువారినిగూడ స్ఫురింపఁజేయుచున్నది.

వ్యా. వి. "వాండ్రును వీండ్రునుబలె" అనునెడ "బలె" అనునది వాండ్రునుబలె, వీండ్రునుబలె అని ప్రత్యేకముగా నన్వయించును. "కొన్నియెడల నుపమానములు పెక్కులగుచోనివి కడదాని కొక్కటిక చూపట్టెడి ప్రౌఢ. సమా. 40. "తండ్రియ" అనుపాఠమున "తండ్రియే" అనిచెప్పనగును. కాని శ్రుతియం దట్టియర్థముగాక, సముచ్చయార్థమే యుండుటంజేసి పైపాఠమే సమంజసముగా నున్నది.

మ. గయలోఁ గాశిఁ బ్రయాగ శ్రీగిరిని గం ♦ గాద్వార నీలాచలో
జ్జయనీ ద్వారకలం దయోధ్య మధురన్ ♦ సంస్తుత్య పుణ్యస్థలా
గ్రియతన్ వెండియు మించునైమిశ కురు ♦ క్షేత్రాదులం దర్పణ
క్రియచే నాపినతమ్ముఁ డెఱ్ఱన యొనర్చెన్ దండ్రి కాహ్లాదమున్. 8

అర్థము:—గయలోన్=గయయందును, కాశిన్=కాశీపురమునందును, శ్రీగిరిని=శ్రీశైలమునందును, గంగాద్వార = హరిద్వారమునందును, నీలాచల = జగన్నాథ క్షేత్రమందును, ఉజ్జయనీ = అవంతిపురమందును, (ఉజ్జయిని. రూ.) ద్వారకలందున్=ద్వారకాపురమందును, అయోధ్యన్ = అయోధ్యయందును, మధురన్ = (ఉత్తర) మధురయందును, సంస్తుత్య ... అగ్రియతన్ - సంస్తుత్య = కొనియాడఁదగిన, పుణ్యస్థల = పుణ్యక్షేత్రములందు, అగ్రియతన్ = శ్రేష్ఠత్వముచే, వెండియున్ + మించు = అత్యంతము ప్రసిద్ధికెక్కిన, (సకల పుణ్యక్షేత్రములందు నుత్తమములని ప్రశస్తినందిన-అని భావము) నైమిశ = నైమిశవనము, కురుక్షేత్ర=కురుక్షేత్రము, ఆదులందున్ = మున్నగు పవిత్రక్షేత్రములందును, నాపినతమ్ముఁడు= నాతమ్ములిరువురలో చిన్నవాఁడగు, ఎఱ్ఱన, తర్పణ క్రియచేన్ = పితృదేవతలకు తృప్తిని కలిగించు తిలోదకపిండదానాదులగు కర్మములచే, తండ్రికిన్ = మాతండ్రియగు అమరయ్యకు, ఆహ్లాదమున్ - సంతోష

మును, ఒనర్చెన్ = కలిగించెను. ("ఒనరు" ధాతువునకు ప్రేరణార్థమున చుగాగమము రాఁగా నైన రూపము, ఒనర్చు.)

తాత్పర్యము:— "క్షేత్రమహిమచే కర్మఫల మనంతము నక్షయము నగు" నను నట్టి శాస్త్రప్రమాణములచొప్పున తనచిన్నతమ్ముఁ డెట్టిన తండ్రికిఁ దృప్తి కలిగించినాఁడనియు, ఆ క్షేత్రము లసాధారణములును బెక్కులు ననియు, స్మృతిప్రోక్తములగు అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచ్యవంతికా, ద్వారావతు, లనుసప్త మోక్షప్రదాయక క్షేత్రములే కాక, గయా ప్రయాగాదు లగు పెక్కు పుణ్యక్షేత్రములు గూడ సేవించినాఁడనియు నీపద్యమున తమ్మునికిం గల పితృభక్తిని గ్రంథకర్త వివరించెను.

క. ఏనుం బితృపూజన నా, చే నైన నెద్దియైనఁ జేయఁగవలయున్
గానఁ గృతి యిచ్చి మేదిని, పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశుకృపన్. 9

అర్థము:—ఏనున్ = నేనుగూడ, నాచేనైనట్లు = నాకు శక్యమైనట్లు, పితృపూజనన్ = తండ్రియొక్క పూజను, ఎద్దియైనన్ = ఏదియేనొకదానిని, చేయఁగవలయున్ = తప్పక చేయవలెను, కానన్ = కాఁబట్టి, పరమేశుకృపన్ = ఈశ్వరునియొక్క దయచేత, కృతియిచ్చి = అంకితముగా నొకగ్రంథ మాతని పేర రచించి సమర్పించి, అతని కీర్తిన్ = తండ్రియొక్క యశస్సును, మేదినిపైన్ = భూమిమీఁద, నిలుపుదును = స్థిరముగానుండునట్లు చేయుదును.

తాత్పర్యము:—నాపినతమ్ముఁ డెట్టిన తండ్రిని తర్పణాదులచే సంతోషపెట్టెను. కాన పెద్దవాఁడనగు నేనును నా చేతనైనరీతిని సంతోషపఱుపవలెనుకదా? నే నట్లు తమ్మునివలె తీర్థయాత్రలు చేయఁజాలక పోయినను, కృతి నొకదాని నిచ్చి తండ్రికీర్తిని లోకమున సుస్థిర మొనర్తును. (కీర్తివలన మృతుఁడగు తండ్రికేమి లాభమని శంకింపరాదు, "కీర్తిం స్వర్గఫలా మాహు రాసంసారం విపశ్చితః" అనుసూక్తిచే కీర్తివలన శాశ్వతస్వర్గఫలము కలుగును. కావున నే కృతి యిచ్చి భూమిపై స్థిరముగాఁ పేరు నిలుపుటవలన నా కృతిపతికి స్వర్గసుఖములు తప్పక కలుగునని కవి యభిప్రాయము.)

వ. అని నిశ్చయించి ప్రభావతీ ప్రద్యుమ్నంబు మద్గురుం డైన యమరామాత్యునిపేర నంకితంబుగ రచియింపం గడంగి, తత్కావ్య లక్ష్మీముఖంబునకుం దిలకాయమానంబుగ నావంశావతారం బభివర్ణించెద. 10

అర్థము:—అని = మనసున నిశ్చయించి, ప్రభావతీప్రద్యుమ్నంబు - ప్రభావతినాయికగా, ప్రద్యుమ్నుఁడు నాయకుఁడుగా నేనురచింపఁబూనిన ప్రబంధమును, మత్ + గురుండు = నాయొక్క తండ్రి, ఐన = అయినట్టి, అమరామాత్యునిపేరన్ = అమరయమంత్రియొక్క పేరిచేత, అంకితంబుగన్ = చిహ్నితమగునట్లు, రచియింపన్ = నిర్మించుటకు, కడంగి = పూని, తత్కావ్య లక్ష్మీముఖంబునకున్ = ఆప్రబంధమను లక్ష్మియొక్క మొగమునకు, తిలకాయమానంబుగన్ = బొట్టువలె నాచరించుచున్నదానినిగా - (బొట్టగునట్లుగా అని భావము) నావంశావతారంబు = నావంశముయొక్క పుట్టుకను, అభివర్ణించెదన్ = విశేషించిచెప్పెదను.

కావ్యలక్ష్మి = కావ్యశోభయనెడి లక్ష్మియొక్క, ముఖంబునకున్, అని శ్లిష్టరూపకమును జెప్పుకొనవచ్చును - గురువు (నానార్థములు), 1. బృహస్పతి, 2. శ్రేష్ఠము, 3. తండ్రి, 4. బరువైనది.

ఆ. గంగ తనదుపేర గౌతమీనామ వి, ఖ్యాతిఁ బరఁగఁ దెచ్చె భూతలమున
కేమహానుభావుఁ డామునిసింహుఁడు, గౌతముఁడు తపోధికతఁ దలిర్చు. 11

అర్థము:—ఏ మహానుభావుఁడు = గొప్పమహిమగల యేఋషి, తనదుపేరన్ = తనయొక్క పేరు వెలయునట్లు, గౌతమీ = గౌతముని పుత్రికయను, నామ = పేరుతోడ, విఖ్యాతిన్ = ప్రసిద్ధిచే, పరఁగన్ = ఒప్పునట్లు, గంగన్ = గంగానదిని, భూతలమునకున్ = భూభాగమునకు, తెచ్చెన్ = తీసికొనివచ్చెనో, ఆమునిసింహుఁడు = అట్టి మునిశ్రేష్ఠుఁడగు, గౌతముఁడు, తపోధికతన్ (తపః + అధికతన్) తపస్సుయొక్క గొప్పతనముచే, (గొప్పతపస్సుచేత నని భావము) తలిర్చున్ = ప్రకాశించును.

"మునులపన్నుగడచే మాయగోవు మరణింప, మునులు తనకు గోహత్యాపాప మంటఁగట్టుటయు, ఆపాపము వాపుకొన గౌతమమహర్షి, శివు నుద్దేశించి తపమొనర్చి గంగను దెచ్చి యామృతధేనుకళేబరముపైఁ బ్రవహింపఁజేసి, క్షామబాధ తొలఁగించుటయు, దాన నానది గౌతమి (గౌతమకన్య) యగుటయుఁ గలకథ యిం దనుసంధించుకోఁదగును."

ఉ. వాదున గెల్వలేక పురవైరి లలాటముకన్ను సూపఁ దాఁ
బాదమునందుఁ గన్ను ప్రతిపక్షతఁ జూపెను; శాస్త్రమున్ బ్రమా
ణాది పదార్థ తత్త్వ కథనాత్మకమున్ రచియించె నాత్మసం
వేదముకై; మునుల్ కులపవిత్రుని గౌతముఁ బోల నేర్తురే? 12

అర్థము:—పురవైరి = పురములకు విరోధియగు శివుఁడు, వాదునన్ = శాస్త్రమునుగూర్చిన వాదమునందు, గెల్వలేక = (గౌతముని) గెలువఁజాలక, లలాటము కన్ను = నొసటనున్న మూఁడవ కంటిని, చూపన్ = చూపింపఁగా, తాన్ = ఆ గౌతముఁడు, ప్రతిపక్షతన్ = ప్రతివాది ధర్మముచే (ఎదిర్చినిలిచి అని భావము), పాదమునందున్ = అఱకాలియందు, కన్ను = కంటిని, చూపెను. ఆత్మసంవేదముకై = జీవాత్మ పరమాత్మలయొక్క స్వరూపము తెలిసికొనుట కొఱకు; ప్రమాణాది...ఆత్మకమున్, ప్రమాణాది = ప్రమాణము, ప్రమేయము మున్నగు, పదార్థ = పదియాఱు పదార్థములయొక్క, తత్త్వ = వాస్తవముయొక్క, కథన = చెప్పుటయే, ఆత్మకమున్ – స్వరూపముగాఁ గలిగినట్టి, శాస్త్రమున్ = తర్కశాస్త్రమును, రచియించెను = నిర్మించెను. (ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాంత, అవయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండా, హేత్వాభాస, చ్ఛల, జాతి, నిగ్రహస్థానములు అని గౌతమన్యాయశాస్త్రమున పదాఱు పదార్థములు.) మునుల్ = ఇతరులగు మునులు, కులపవిత్రున్ = వంశమును పావనమొనర్చిన, గౌతమున్ = గౌతమమహర్షిని, పోలనేర్తురే = సరిపోలఁగలరా?

తాత్పర్యము:—న్యాయశాస్త్రమున వాదము తటస్థింప శివుఁడు గౌతమునితో వాదింప శక్తి చాలక, కోపించి నొసటఁ గన్ను చూపఁగా, ప్రతిపక్షము వహించిన గౌతముఁడు నొసటఁగాక, అఱకాలియందే కన్నుచూపి శివుని గెలిచెను. అంతియకాదు. ఆత్మతత్త్వమును ప్రతిపాదించుటకై షోడశపదార్థబోధ సంకలిత మగు తర్కశాస్త్రమును స్వయముగా నిర్మించినాఁడు. అట్టి గౌతమునితో గోత్రకర్తలును, పవిత్రచరిత్రులు నగు నితర ఋషులు సాటియగుదురా? అని కవి తన గోత్రకర్తయగు గౌతముని యసామానుషశక్తిని బురాణముల ననుసరించి నిరూపించినాఁడు.

క. ఆ గౌతమగోత్రంబున, నాగమనిధి పుట్టె గోకనామాత్యుఁడు స
ద్భోగ క్షేత్రస్వామ్యా స, మాగతిఁ బింగళిపురాంకుఁడై యతఁ డొప్పెన్. 13

అర్థము:—ఆ గౌతమగోత్రంబునన్ = ఆగౌతమమునియొక్క కులమందు, ఆగమనిధి - శాస్త్రములకు స్థానము అగు, గోకనామాత్యుఁడు = గోకన్నయనుమంత్రి, పుట్టెన్, (అట్లుపుట్టి) సత్...సమాగతిన్...

సత్ = మంచివియును, భోగ = ఫలమనుభవించుటకై యీయఁబడినవియు, (అగు) క్షేత్ర = పొలముల యొక్క, స్వామ్య = హక్కులయొక్క, సమాగతిన్ = పొందుటచేత, పింగళిపుర = పింగళియను గ్రామము, అంకుఁడు + ఐ = వాసముగాఁ గలవాఁడై, ఒప్పెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:— ఆ గౌతమముని గోత్రమునందు శాస్త్రముల నెల్లఁ జదువుకొనిన గోకన్నమంత్రి తోలుతఁ బుట్టెను. అతఁడు పింగళి యను గ్రామమున ఫలవంతములగు పెక్కు మాన్యక్షేత్రములు గలిగి యుండువాఁడు. 'గోకన్న' యనుపేరు గోకర్ణేశ్వరుని పేరై యుండనోపును 'ఆగమము' అనఁగా (1) శాస్త్రము (2) వేదము అనియు నర్థములు గలవు. ఇట నం దేదియేని చెప్ప నొప్పును. 'పురము' బహుగ్రామముల వ్యవహారమునకు స్థానమై పెక్కులు హట్టాదులు కలిగియున్న ప్రధానగ్రామము. (అని. సూ. ని.)

ఉ. పే ర్వెలయంగ నాఘనుఁడు ♦ పింగళి గోకబుధోత్తముండు గం
ధర్వి నొకర్తుఁ బేకి యను ♦ దానిని దాసిగ నేలె యోగితా
గుర్వనుభావుఁడై; నెఱపె ♦ గోపకుమారుని ఖడ్గవర్ణనన్
బర్వపు నిండువెన్నెలల ♦ పై నెఱిఁ జూపెడు కీర్తిసంపదన్. 14

అర్థము:— ఆ ఘనుఁడు = ఆ గొప్పవాఁడగు, పింగళి గోకబుధోత్తముండు = పింగళిగోకన పండిత శ్రేష్ఠుఁడు, పేరు+వెలయంగన్ = పింగళివారిపేరు లోకమున ప్రసిద్ధికెక్కునట్లు, పేకియను దానిని='పేకి' అను పేరుగలదియు, ఒకర్తున్ = ఒకతెయగు, గంధర్విన్ గంధర్వస్త్రీని, యోగితా = యోగిధర్మము యొక్క (యోగసంబంధమైన అని భావము), గురు+అనుభావుఁడు = గొప్ప మహిమగలవాఁడు, అయి, దాసిగన్ = సేవకురాలుగా, ఏలెన్ = పాలించెను. గోపకుమారుని = శ్రీకృష్ణునియొక్క, ఖడ్గ = కత్తియగు నందకముయొక్క, వర్ణనన్ = స్తుతిచేత, (నందకస్తుతి యను గ్రంథరచనముచేత అని భావము), పర్వపు = పున్నమనాఁటి, నిండువెన్నెలలపైన్ = పరిపూర్ణమగు వెన్నెలలమీఁద, నెఱిన్ = పరాక్రమమును, చూపెడు = ప్రకటించునట్టి (పున్నమ వెన్నెలలవంటి అని భావము), కీర్తిసంపదన్ = కీర్తులయొక్క అతిశయమును, నెఱపెన్ = వ్యాపింపఁజేసెను.

తాత్పర్యము:— గోకన్నమంత్రి పండితుఁడే కాక, యోగాభ్యాసమున మహిమల నార్జించుకొనిన వాఁడు, కావున "పేకి" యనుపేరుగల యొకగంధర్వస్త్రీని దాసిగాఁ జేసికొని, దానిచే మనుజుల కసాధ్యము లగుపనులనుగూడఁ జేయించుకొనువాఁడు. అంతియకాదు, లోకమున పేరుప్రతిష్ఠలు గలుగ "నందకస్తవము" అనుగ్రంథమునుగూడ రచించెను. అలం. ఉపమ.

"పింగళివారిపేకి" అని లోకోక్తి కూడఁగలదు. దానింగూర్చిన జనశ్రుతి పీఠికయం దరయునది.

ఉ. సంతతి లేక ము న్నతనిజాయ సభక్తిని సూర్యసేవ య
శ్రాంతముఁ జేయఁగా – నతఁడు ♦ సద్ద్విజుఁడై కల వచ్చి, దొండచె
ట్టింతికి నిచ్చి, "బాల! ఫలి ♦ యించును నీ కిది ప్రోదిచేసికో
మ్మెంతయు" నంచుఁ బల్కె నఁట; ♦ యింతియు నాకల గాంచి ధన్యయై. 15

అర్థము:—మున్ను = పూర్వము, అతనిజాయ = ఆగోకనమంత్రిభార్య, (తనకు) సంతతి = బిడ్డలు, లేక = కలుగకపోవుటచే, సభక్తిని = భక్తితోఁగూడినట్లు, సూర్యసేవ = సూర్యునియారాధనము - సూర్యోపాసనము, అశ్రాంతమున్ = ఎల్లప్పుడును, చేయఁగాన్, అతఁడు = ఆసూర్యదేవుఁడు, కలన్ = ఆమెయొక్కస్వప్నమున, సత్ + ద్విజుఁడు + ఐ = ఉత్తముఁడగు బ్రాహ్మణుఁడై, అనఁగా బ్రాహ్మణ

రూపముదాల్చి, వచ్చి = తోఁచి, కనఁబడి, దొండచెట్టు (ఒకటి) ఇంతికిన్ = అగోకనపెండ్లామునకు, ఇచ్చి, బాల = ఓచిన్నదానా! నీకున్, ఫలియించును = ఫలవంతమగును, (కావ)ఇది = దీనిని (జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగానగు.) ఎంతయున్ = మిక్కిలిశ్రద్ధగ, ప్రోదిచేసికొమ్ము = పెంచికొనుము, అంచున్ = అని, పల్కెనఁట = చెప్పెనఁట, ఇంతియున్ = ఆ యిల్లాలును, ఆకల=అట్టికలను, కాంచి= కనుటచేత (క్త్వార్థకమునకిట హేత్వర్థము) ధన్యయై = చరితార్థురాలై, ప్రయోజనము నెఱవేఱినదై - మీఁదిపద్యముతో సమన్వయము.

తాత్పర్యము:—ఆ గోకన్నమంత్రిభార్య తనకు సంతతి లేక భక్తిశ్రద్ధలతో సూర్యుని సేవింపఁగా, ఆదేవుఁడు బ్రాహ్మణరూపమున కలలోఁ గనఁబడి యొకదొండమొక్క నిచ్చి "బాలా! శ్రద్ధతో దీనిని పెంచుకొనుము. ఇది ఫలించును అని చెప్పెనఁట. ఆమెయు నట్టికల గాంచుటచే కృతార్థురాలై" (మీఁది పద్యముతో నన్వయము.)

గీ. సకలదిశలకు శాఖోపశాఖ లిడుచుఁ, బొదలి ఫలియించు దొండయుఁబోలి ప్రబలి,
యాత్మసంతతి పుత్రపౌత్రాది బహు ప,రంపరల నొప్ప వెలసె భర్తయును దాను.16

అర్థము:—సకలదిశలకున్ = అన్నిదిక్కులకు, శాఖ + ఉపశాఖలు = కొమ్మలు రెమ్మలు, ఇడుచున్ = పెట్టుచు, పొదలి = పెంపొంది, ఫలియించు దొండయుఁబోలి = కాయునట్టి దొండపాఁదును బోలి, ఆత్మసంతతి = తనసంతానము, ప్రబలి = వర్ధిల్లి, పుత్ర = కొడుకులు, పౌత్ర = మనుమలు, ఆది = మున్నగువారియొక్క, బహు = పెక్కు, పరంపరలన్ = వరుసలతో అనఁగా - పెక్కుశాఖలై, ఒప్పన్, భర్తయును = మగఁడగు గోకనమంత్రియు, తాను = ఆమెయును, వెలసెన్ = ప్రసిద్ధికెక్కిరి.

తాత్పర్యము:—కలలో సూర్యుఁ డిచ్చినదొండమొక్కవలెనే తనసంతానము పెక్కుశాఖ లయి యన్నిదిక్కుల నలముకొనఁగా ఆగోకనమంత్రియు అతనిభార్యయు ప్రసిద్ధి కెక్కిరి. అలం. ఉపమ.

వ్యా. వి. :—దొండయుఁబోలి - "ప్రథమాంతములమీఁద పోలె బలె పోని శబ్దంబులు ద్రుతపూర్వ కంబులు విభాష నగు - ప్రౌఢ. సమాస. 39 -

"భర్తయును దానును వెలసె" "వెలసిరి" అని బహువచనమునకు మాఱుగా ఏకవచన ముండుట విశేషము. "ఆత్మార్థం బభిహితం బగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయివచనంబులు ధాతువిశేషణంబులకగు. బాల. క్రియా. 120 సూ. ఆత్మార్థము అనఁగా తాను అను శబ్దము.

మ. తరముల్ నాల్గయి దెందు నెందు నగుఁ దత్తద్గ్రామ నామంబులన్
బరఁగున్ వంశము లెల్లఁ బూర్వపు నిజప్రఖ్యాతి మాయంగ నే
మరుదో? పింగళినామ మందుఁ జిరకాలావాసులై యున్న సు
స్థిరతన్ గోకనమంత్రివంశజులకున్ జెన్నొందు మి న్నందుచున్. 17

అర్థము:—ఏమి + అరుదో = ఏమి యాశ్చర్యమో (కాని), ఎందున్ + ఎందున్ = ఎక్కడెక్కడ, నాలుగు అయిదు = నాలుగుగాని, అయిదుగాని, తరముల్ = పురుషాంతరములు, అగున్ = ఉండునో, (అట్టి) వంశములు+ఎల్లన్ = అట్టి వంశము లన్నియును, పూర్వపు = వెనుకటి, నిజ = తమయొక్క ప్రఖ్యాతి = ప్రసిద్ధి, మాయంగన్ = పోవఁగా, తత్తత్ = ఆయాయి, గ్రామ = ఊళ్లయొక్క, నామంబులన్ = పేళ్లతో, పరఁగున్ = ప్రసిద్ధములగును. అట్లే-అందున్ = ఆ పింగళి గ్రామమందు, చిరకాలా

వాసులు = పెద్దకాలము కాఁపురముగలవారు, ఐ యున్న సుస్థిరతన్ = అయియున్నట్టి స్థైర్యముచేత, (అనఁగా చాలకాల మా గ్రామమున స్థిరముగా కాఁపురమున్న హేతువుచేత ననిభావము) గోకనమంత్రి వంశజులకున్ = గోకన్నయొక్క వంశమునఁబుట్టినవారికి, పింగళినామము = పింగళియనుపేరు, నిన్ను + అందుచున్ = ఆకసమంటఁగా, ప్రకటముగా—చెన్ను + ఒందున్ = ఒప్పును.

తాత్పర్యము:— నా ల్గయిదు తరము లేయే గ్రామముల వసింతురో, ఆ వసించినవారి వంశముల కాయా గ్రామ నామములతో వ్యవహారము ప్రసిద్ధమై, అంతకు మున్ను వారికిఁ గల ప్రసిద్ధనామము చిత్రముగా తొలఁగిపోవును. కావుననే గోకన వంశమువారి కా పేరు తగ్గిపోయి, స్థిరముగా చిరకాల మా గ్రామమున నుండుటచే పింగళి యను నుపనామము సర్వత్ర వ్యాపించెను. అలం. అర్థాంతరన్యాసము.

ఉ. రంగుగ గౌతమీపరిస౯రంబులఁ, గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు, ల౯లిన్ బలనాఁటను బాకనాఁటనున్
బింగళిగాదయాదు, లిటఁ౯బెంపు వహించిన యస్మదాదు, లా
పింగళిగోకమంత్రి యిలు౯పేరనె చాలఁ బ్రసిద్ధు లెల్లచోన్. 18

అర్థము:—రంగుగన్ = సొంపుగా (సుఖముగా), గౌతమీపరిసరంబులన్ = గోదావరీనది యొడ్డునఁ గల యూళ్ళయందును, కృష్ణకెలంకులన్ = కృష్ణానది పార్శ్వములఁగల యూళ్ళయందును, ఘనుల్ = గొప్పవారగు, పింగళిరామయాదులును = పింగళిరామయ మొదలగు నొకశాఖవారును, పలనాఁటన్, పాకనాఁటనున్=పల్నాడు పాకనాఁడు అనుసీమలయందు, లలిన్ = సుఖముగా, పింగళిగాదయాదులును= పింగళిగాదయ మొదలుగాఁగల వేఱొక శాఖవారును, ఇటన్ = ఇక్కడ (అనఁగా కర్నూలు మండలి యందలి కృష్ణరాయసముద్రమను గ్రామమున - ఇదియే సూరన జన్మస్థానమని చారిత్రికుల నిర్ణయము) పెంపు = అభివృద్ధిని, వహించిన = పొందిన, అస్మదాదులును = మేము మొదలుగాఁగల శాఖవారును, (ఈరీతిగా) ఎల్లచోన్=(దేశమున) అన్నిచోట్లను, ఆపింగళిగోకమంత్రి యిలుపేరన్ + ఏ = గోకనమంత్రి యింటిపేరగు "పింగళి" అనుసంజ్ఞతోనే, ప్రసిద్ధులు = ప్రఖ్యాతులము—అయితిమి అని అధ్యాహారము.

వ. అది యట్లుండె, నమ్మహావంశంబునందు నస్మజ్జనక జని జీవంతికాత్యంత కమనీయం
బైన శాఖావిశేషం బెట్టి దనిన : 19

అర్థము:—అది = ఆ పింగళివంశోత్పత్తిక్రమము, అట్లు = ఆరీతిగా, ఉండెను, అమ్మహావంశము నందున్ = ఆ గొప్పకులమున, అస్మత్ ...కమనీయంబు, అస్మత్ = మాయొక్క, జనక = తండ్రియగు అమరయామాత్యునియొక్క, జని = పుట్టుటయనెడు, జీవంతికా = బదనికచేత (పురాతనములగు చెట్ల కొమ్మలమీఁదఁ బుట్టి యచటనే వ్యాపించునది బదనిక). - అత్యంత = మిగుల, కమనీయంబు = అందమైనది అయిన, శాఖావిశేషంబు = ఒకానొకశాఖ - (మాది అన్నమాట) ఎట్టిది = ఎటువంటిది, అనినన్ = అనునెడ.

తాత్పర్యము:—కృష్ణాగోదావరీమండలములను, పల్నాఁడుపాకనాఁడులయందును, కర్నూలు మండలమునను, పింగళివంశము వ్యాపించి గొప్పదిగా నయ్యెను. అందు అమరామాత్యునికుటుంబము పొడసూపి, కర్నూలుమండలముననె వ్యాప్తిచెందుట కాధారభూత మగుతమ ప్రత్యేకశాఖను గూర్చి ముందు వివరింతును. అని కవి అనుచున్నాఁడు. — అలం. రూపకము.

క. గంగయ నా వెలయుచు శుచి,తం గడు శోభిల్లె నొకఁడు ౯ తద్వంశములో
గంగయ నా వెలయుచు శుచి,తం గడు శోభిలెఁ దదూర్జి౯త యశశ్శ్రీయున్. 20

అర్థము:—తద్వంశమునన్ = ఆపింగళియను కులమునందు, గంగయ = గంగయ్య, నాన్ = అనఁగా, వెలయుచున్ = ప్రసిద్ధుఁడగుచు, ఒకఁడు = ముఖ్యుఁడగు పురుషుఁడు, శుచితన్ = పావనత్వముచేత, కడున్ = మిగుల, శోభిల్లెన్ = ప్రకాశించెను, తత్+ఊర్జిత+యశః+శ్రీయున్, తత్ = ఆ గంగయ్య యొక్క, ఊర్జిత = గొప్పదగు, యశః = కీర్తియొక్క, శ్రీయున్ = సంపదయును, గంగయ = గంగానదియే, నాన్ = అనఁగా, శుచితన్ = స్వచ్ఛతచే, తెల్లఁదనముచే, కడున్ = మిగుల, శోభిలెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:—ఆపింగళివంశశాఖయందు గంగయ్య యనుపావన చరిత్రుఁడు మిగులఁ బ్రసిద్ధుఁడయ్యెను. అతనికీర్తియును 'గంగానదియే యిది' యనునట్లు స్వచ్ఛముగానుండి మిగులఁ బ్రకాశించెను. ఆశాఖకు మూలపురుషుఁ డగు గంగయ్య పుణ్యశ్లోకుఁడును, సుప్రసిద్ధుఁడు నయ్యెను.
అలం:—తుల్యయోగిత, యమకము.

క. మాంగల్యశోభి యగు నా, గంగయకును ముగురు వంశకరు లైరి సుతుల్
రంగత్కీర్తులు మహి నె, న్నంగన్ సూరనయుఁ గుప్పనయు రామనయున్. 21

అర్థము:—మాంగల్య = సౌభాగ్యముచేత (క్షేమముచేత), శోభి = ప్రకాశించువాఁడు, అగు నా గంగయకున్ = అయినట్టి యా గంగయ్యకు, మహిన్ = భూమియందు, ఎన్నంగన్ = స్తుతించునట్లు (ఇట-మహి = భూమిఅన భూజనము, ఎన్నంగన్ = ప్రశంసించునట్లు - అనియుండుట సమంజసము), రంగత్కీర్తులు = ప్రకాశించుచున్న యశస్సుగలవారు, అగు, సూరనయు, కుప్పనయును, రామనయును, అను, ముగురు సుతులు = ముగ్గురు కొడుకులును, వంశకరులు = వంశమును వర్ధిల్లఁజేయువారు (తమ తమ పేరిటి యొక్కొక్క యుపశాఖ కాధారభూతు లన్నమాట) అయిరి = అయినారు, గంగయకు 'సూరన, కుప్పన, రామన' లను ముగ్గురుకొడుకులు గలిగిరని భావము.

క. కనియెన్ గుప్పన సూరన, యనుపుత్త్రిని - నతని పుత్త్రకులగు బాపయ భ
ద్రన కుప్పార్యుల కాత్మజు, లనేకు లెఱ్ఱయ్య పాపయాదులు ప్రాజ్ఞుల్. 22

అర్థము:— కుప్పన = గంగయ రెండవ కొడుకు, సూరన యను పుత్త్రినిన్ = సూరన పేరిటి కొడుకును, కనియెన్ = కనెను, అతని పుత్త్రులగు = ఆ సూరనకుఁ గొడుకులైన, బాపయ, భద్రన, కుప్పార్యులకున్ = బాపయ్య, భద్రన్న, కుప్పయ్య అను వారికి, ఎఱ్ఱయ్య పాపయాదులు = ఎఱ్ఱయ్య, పాపయ్య మున్నగు, ప్రాజ్ఞులు = పండితులు, అనేకులు = పెక్కురు, ఆత్మజులు = కొడుకులు, కల్గిరి అని అధ్యాహార్యము - పుత్త్ర పుత్ర శబ్దములు రెండును గలవు. పుత్ అను నరకమునుండి రక్షించువాఁడు అను వ్యుత్పత్తిచే పుత్+త్ర = పుత్త్రి - యగును. - పూఞ్ ధాతువునకు "క్త్రి" అనుప్రత్యయము రాఁగా "పుత్ర" అని యేకతకారరూపము వచ్చునని - "అమి చిమి దిశి సిభ్యః క్త్రిః" పువో హ్రస్వశ్చ" అను ఉణాది 603, 604 సూత్రములచే సాధింపఁబడినది. ఇట్లు "పుత్త్రి, పుత్ర" శబ్దములు రెండును సిద్ధములు.

క. జనియించెను రామనకుం, దనయుఁడు గంగన్న - గంగనకు గాదన - గా
దనకుం బెద్దయ మొదలగు, ననేకు లీగతిఁ దదన్వయము శోభిల్లున్. 23

అర్థము:— రామనకున్ = గంగయ్య మూఁడవ కొడుకునకు, తనయుఁడు = కొడుకై, గంగన్న = గంగన్నయను నాతఁడు, జనియించెన్ = పుట్టెను, గంగనకున్ గాదన, ఆ గాదనకున్, పెద్దయ, మొదలగు ననేకులు - జనియించిరి. (అని - వచన విపరిణామమున నన్వయము) ఈ గతిన్ = ఈ రీతిగా, తదన్వయము = రామనయొక్క వంశోపశాఖ, శోభిల్లున్ = ప్రకాశించును.

ఈ పద్యమునను, వెనుకటి పద్యమునను రామన కుప్పనల వంశోపశాఖలు ప్రకృతమునకు దూర మని భావించి వివరింపక స్థూలముగాఁ జెప్పి యీ పైని తన వంశోపశాఖ కవి వర్ణించుచున్నాఁడు.

గీ. ఇట్లు పుత్త్రపౌత్త్రాదుల • నెసఁగు నట్టి, సోదరులు దన్ను మిక్కిలి • నాదరింప,
నలఘు సాద్గుణ్యసౌభాగ్య • కలితుఁ డగుచు, గంగనామాత్యు సూరయ • కరము వెలసె.

అర్థము:—ఈరీతిగా, పుత్త్ర పౌత్త్రాదులన్ = కొడుకులు, మనుమలు మున్నగువారిచే, ఎసఁగునట్టి = వర్ధిల్లుచున్నట్టి, సోదరులు = తోఁబుట్టువులు, (కుప్పన, రామనలు) తన్నున్ = (పెద్దవాఁడగు సూరనను) మిక్కిలి = అధికముగా, ఆదరింపన్ = మన్నింపఁగా, గంగనామాత్యుసూరయ = గంగనమంత్రి కొడుకగు సూరయ, అలఘు...కలితుఁడు, అలఘు = గొప్పదగు, సాద్గుణ్య = మంచిగుణముల కలిమిచేతను, సౌభాగ్య = మంచి భాగ్యము కలిమిచేతను, లేక, చక్కఁదనముతోడను, కలితుఁడు = కూడుకొన్నవాఁడు, అగుచున్, కరము = అత్యంతము, వెలసెన్ = ప్రసిద్ధుఁడయ్యెను.

ఉ. పింగళిగంగమంత్రివరు • బిడ్డకు సూరనకుం బదాబ్జరే
ఖం గలకాంతికే వలచి • కైవస మయ్యెను రాజ్యలక్ష్మి దా
బంగరు కామకుంచెలును • బల్లకియున్ మొదలైన యాత్మస
ర్వాంగ సమృద్ధితోడ, సిరి • కంబుజరేఖల ప్రేమ వింతయే? 25

అర్థము:—రాజ్యలక్ష్మి = రాజ్యసంబంధమగు లక్ష్మి, తాన్ = స్వయముగా, బంగరుకామకుంచెలును = బంగారుకామలతోడి వింజామరలును, పల్లకియున్ = సవారియును, మొదలైన = మొదలుగాఁగల, సర్వాంగ సమృద్ధితోడన్ = రాజ్యలక్ష్మి కంగములగు నన్నిటితోడను, పింగళి గంగమంత్రివరు బిడ్డకున్ = పింగళి గంగమంత్రి కొడుకగు, సూరనకున్ = సూరన మంత్రికి, పదాబ్జరేఖన్ = పాదమందున్న తామరపూవువంటి రేఖ (గీఱ) యందు, కలకాంతికే = ఉన్న తేజస్సునకు మాత్రమే, వలచి = ప్రేమించి, కైవసమయ్యెన్ = వశ్యయైనది, సిరికిన్ = లక్ష్మికి, అంబుజరేఖల ప్రేమ = పద్మపంక్తులయందలి ప్రేమ, (పద్మాకారమైన రేఖలని యర్థాంతరము) వింతయే = అద్భుతమా ? అద్భుతము కాదనిభావము.

తాత్పర్యము:—గంగయకొడు కగు సూరనకు పాదములందు పద్మరేఖ లుండెడి వనియు, వాని మహిమచే నాతనికి బంగారుకామలు గలచామరలు, పల్లకి మొదలగు రాజలాంఛనములతో ప్రభుత్వము కల్గిన దనియుఁ జెప్పఁదలఁచి యిట్లు కవి చమత్కరించుచున్నాఁడు. సూరనమంత్రిపాదములందలి పద్మరేఖలకాంతికి మోహపడి, రాజ్యలక్ష్మి బంగరుకామలుగల చామరములు, పల్లకి మున్నగురాజ లాంఛనము లనెడు తనసర్వాంగముల సమృద్ధితో స్వయముగా సూరనమంత్రికి వశ్యురాలైనది. లక్ష్మికిఁ బద్మరేఖలయందు - అనఁగా పద్మపంక్తులయందుఁ బ్రేమ యుండుట సహజగుణమేకదా! -

అలం:—"పద్మరేఖ" అనునప్పుడు శ్లేషము - తుదిని అర్థాంతరన్యాసాలంకారము.

పద్మ, శంఖచక్రాదిరేఖ లెవనిపాదములందు, హస్తములందు నుండునో యాతఁడు చక్రవర్తియగునని సాముద్రికశాస్త్రము.

గీ. సూరనిభుఁ డైన పింగళి • సూరవిభుని, దొరయఁ బోఁ డొరుఁ-డలవేల్పు • దొరయకాని
యతనిదానము సిరికి ని • యతనిదాన, మర్థు లప్పుడు దాన స • మర్థులైరి. 26

అర్థము:—సూరనిభుఁడు = సూర్యునితో సమానుఁడు (సూర్యునివలె మహాతేజశ్శాలియని భావముఁ) అయిన పింగళిసూరవిభునిన్ = అయినట్టి పింగళిసూరనప్రభుని, అలవేల్పు దొరయకాని = దేవతలకు)

ప్రభువగు నా యింద్రుఁడే కాని, ఒరుఁడు = ఇతరుఁడు, దొరయఁబోఁడు = పోలఁడు, అతని దానము = ఆ సూరన యీవి, సిరికిన్ = లక్ష్మికి, నియత నిదానము=తప్పనియాదికారణము (అనఁగాఁ దప్పక స్థిరముగా లక్ష్మినిగల్గించునది అని భావము), కావుననే, అర్థులు = (ఆతనికడకువచ్చు) యాచకులు, అప్పుడు = ఆ సమయమందు, దానసమర్థులు = దానమిచ్చుటకు శక్తిగలవారు, ఐరి = అయినారు, అనఁగా నా యాచకులు మహాదాత లైరి యనిభావము.

అలం:--ఇందు పూర్వార్థమున "త్వన్ముఖం కమలేనైవతుల్యం నాన్యేన కేనచిత్ । ఇత్యన్యసామ్యవ్యావృత్తేరియంసా నియ మోపమా" అను దండాచార్యుని మతమున - "నియమోపమ" యగును. నవీనులు దీనిని "ప్రతీపము" అనిరి. ఇంక నుత్తరార్థమున "అత్యుక్తి" గీ. తనరు నత్యుక్తి యద్భుత తథ్యశౌర్య, వితరణాదిక వర్ణనాన్వితమగుచు, దాత నీ వగుచుండంగ ధరణినాథ, యాచకులు కల్పశాఖు లన్నట్లు గృతుల. ఆంధ్ర చంద్రాలోకము. 149. కొందఱ మతమున కావ్యలింగము.

క. సూరయమంత్రికిఁ గలిగెను, సూరయమంత్రియ యనంగ సుతరత్నము; కం
ఠీరవమున కెందును గం,ఠీరవము జనించునట్టి నియమము దోఁపన్. 27

అర్థము:—సూరయమంత్రికిన్ = గంగయకొడుకగు సూరయ (న) మంత్రికి, సూరయ మంత్రియ = ఈతఁడు తండ్రియగు సూరయమంత్రియే (సర్వవిధముల నగును), అనంగన్ = అనునట్లు, సుతరత్నము=ఉత్తముఁడగు కొడుకు - కంఠీరవమునకున్ = సింహమునకు, ఎందున్ = ఎల్లప్పుడును, కంఠీరవము = సింహమే, జనించునట్టి నియమము = పుట్టునట్టి యేర్పాటు, తోఁపన్ = కనఁబడునట్లు, జనించెన్ = పుట్టెను.

తాత్పర్యము:—సింహమునకు తప్పక సింహమే పుట్టునట్లు సూరయమంత్రికి సూరయమంత్రియే పుట్టెనను కొనఁదగిన పుత్రరత్నము కలిగెను. ఇందు సూరయమంత్రికొడుకు సూరయమంత్రియను పేరివాఁడే యగుటచే నాతఁడే "ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుత్యనుసారము కొడుకై జనించెనను ధ్వని.

అలం:—దృష్టాంతము, కొందఱమతమున ఉపమాలంకారధ్వని.

ఉ. సూరయసూరమంత్రి కతిశుద్ధిఁ దలిర్చిన యక్కమాంబయం
దౌరసు లుద్భవించిరి మహాత్ములు నల్వురు సజ్జనస్తుతో
దారగుణాభిరాము లయి యన్నయభవ్యుఁడు సూరసూరియున్
ధీరుఁడు వల్లశౌరియును నీతయశస్కుఁడు లింగనార్యుఁడున్. 28

అర్థము:—సూరయమంత్రికిఁ గొడుకగు సూరయకు, అతిశుద్ధిన్ = మిక్కిలి పవిత్రతచే, తలిర్చిన= ఖ్యాతికెక్కిన, అక్కమాంబయందున్ = అక్కమ్మయను నామెయందు, మహాత్ములు = విశాల హృదయులును, (అనగా సంకుచితాశయములు లేనివారు అని భావము), సజ్జన...అభిరాములు, సజ్జన = ఉత్తమ జనులచే, స్తుత = కొనియాడఁబడిన, ఉదారగుణ = ఔదార్యముచేత, (దానగుణముచేతనని భావము - 'ఉదారోదాత్తమహతోః' అని అమరము), అభిరాములు = మనోహరులును, అయి, భవ్యుఁడు = యోగ్యుఁడగు, అన్నయ = అన్నయయు, సూరసూరియున్ = పండితుఁడగు సూరనయును, ధీరుఁడు = పండితుఁడగు, వల్లశౌరియున్ = విష్ణువునుబోలు వల్లయయును, నీతయశస్కుఁడు = పొందఁబడినకీర్తిగల, లింగనార్యుఁడున్ = లింగనయును, (అను) నల్వురు = నలుగురు, ఔరసులు = (కడుపునఁగన్న) కొడుకులు, ఉద్భవించిరి=పుట్టిరి, ఉరసా నిర్మితః, ఉరసోఽణ్ 4. 4. 94. ఇత్యణ్, స్వస్మాజ్జాతః - అని సుధ. 'సవర్ణాయాం సంస్కృతాయాం స్వయ ముత్పాదిత మౌరసం విద్యాత్' అని బోధాయనసూత్రము. "అంగా

దంగా త్సంభవసి హృదయా దధిజాయసే" అని శ్రుతి. దీనివలన "వివాహసంస్కారము నొందిన ధర్మపత్ని యందుఁ దానుగన్నకొడుకు ఔరసుఁడు" అని తెలియనగును.

తాత్పర్యము:—సూరయమంత్రికొడుకగు సూరయకు అక్కమాంబయందు (1) అన్నయ (2) సూరన (3) వల్లయ (4) లింగన అను నలువు రౌరసపుత్రులు కలిగిరి.

వ. వారిలోన, 29

క. వల్లయమంత్రికిఁ బుత్త్రుఁడు, పుల్లయమంత్రి యనఁ బుట్టె ♦ భువి లింగన కు
త్ఫుల్లయశుఁడు సూరయయును, సల్లాలితనీతి యక్క ♦ సచివుఁడుఁ దనయుల్. 30

అర్థము:—వల్లయమంత్రికిన్, పుల్లయమంత్రియనన్ = పుల్లయమంత్రియనుపేర, పుత్రుఁడు = కొడుకు, పుట్టెను — లింగనకున్, ఉత్ఫుల్లయశుఁడు = వికసించిన కీర్తిగలవాఁడగు, సూరయయును, సల్లాలితనీతి - సత్ = ఉత్తమజనులచే, లాలిత = ఆదరింపఁబడిన, నీతి = న్యాయముగల, అక్కసచివుఁడును - అక్కమంత్రియు, తనయుల్ = కొడుకులు - "అయిరి" అనునది యధ్యాహారము.

తాత్పర్యము:—వల్లయకొడుకు పుల్లయ. లింగనకొడుకులు "సూరయ, అక్కయ" అని యిద్దఱు.

క. వారలకు నగ్రజుం డగు, సూరయ సూరప్రభుండు ♦ సుకవిత్వ సదా
చార శివభక్తి వినయో,దారత్వాదులఁ బ్రసిద్ధ ♦ తముఁడై మించెన్. 31

అర్థము:—వారలకున్ = ఆవల్లయకును, లింగనకును, అగ్రజుండు = అన్న, అగు - సూరయ = సూరయమంత్రి (కర్త) సూరప్రభుఁడు = సూర్యుని ప్రభవంటి ప్రభగలవాఁడును, సుకవిత్వ = మంచి కవిత్వము, సదాచార = ఉత్తమమగు నాచారము, శివభక్తి = శివునియందు భక్తి, వినయ = (పెద్దలయెడ) అడఁకువ, ఉదారత్వ = దాతృత్వము, ఆదులన్ = మొదలగువానిచేత, ప్రసిద్ధతముఁడు=మిగుల పేరెక్కిన వాఁడును, అయి, మించెన్ = ఒప్పెను.

క. వేడుక నాయన పెండిలి, యాడె వెలగలేటి యమర ♦ నామాత్య సుతన్
వ్రీడావతులందును గొని,యాడం దగిన యమలాంబ ♦ నఖిలగుణాఢ్యన్. 32

అర్థము:—ఆయన=ఆ సూరయమంత్రి, వెలగలేటి యమరనామాత్య సుతన్=అమరన్న కూఁతురును, అఖిలగుణాఢ్యన్ = సకల లక్షణములతో నిండినదియును, వ్రీడావతులయందున్=సిగ్గుగలుగు గరితలయందు, కొనియాడందగిన = స్తుతింప నర్హురాలైన, అమలాంబన్='అమలమ్మ', అను పేరిటి యామెను, వేడుకన్= తమితో, పెండిలియాడెను.

క. అమల మహాగుణనిధి యా, యమలమ హారిప్రకార ♦ యశమునఁ దనరెన్,
గమలాలయా సరస్వ, త్యుమ లాలలితాంగిఁ బోల్ప ♦ నొనరెడు గరితల్. 33

అర్థము:—అమల...నిధి-అమల = స్వచ్ఛమైన, మహా = గొప్పదగు, గుణ = స్వభావమునకు, నిధి = స్థానమైన,ఆ యమలమ = అమలమ్మయను నామె, హారి = మనోహరమైన, ప్రకార = రీతిగల, యశమునన్ = కీర్తితో, తనరెన్=ఒప్పెను-ఆలలితాంగిన్=సుందరమగు నవయవములుగల యా యమలమ్మను, పోల్పన్ = సాటిసేయుటకు, ఒనరెడు = తగినట్టి, గరితలు = ఇల్లాండ్రు, కమలాలయా = తామరలు గృహముగాఁగల లక్ష్మియు, సరస్వతియు, ఉమలు = పార్వతియును (మాత్రమే) (అగుదురు.)

తాత్పర్యము:—నిర్మలమగు నుత్తమగుణములుగల యీ యమలమ్మ మంచిఖ్యాతి కెక్కినది. ఆమెను లక్ష్మీ, సరస్వతీ, పార్వతులే సాటియగు నిల్లాండ్రు కాని వేఱెవ్వరును గాఁజాలరు.

అలం:—నియమోపమ.

ఉ. ఆ యమలమ్మయందును గృహస్థశిరోమణి సూరశౌరి య
త్యాయతశీలురం గనియెనాత్మజులన్ ముగురన్ సుధీజన
ధ్యేయగుణప్రశంసు నమరేశ్వరమంత్రిని, ధర్మనిర్మలో
పాయుని మల్లనార్యు, నతిభవ్యత మించిన యక్కధీరునిన్. 34

అర్థము:—గృహస్థశిరోమణి = గేస్తుల తలమానికమగు, సూరశౌరి = విష్ణుసముఁడగు నా సూరన, ఆ యమలమ్మయందును = అమలమ్మయను నామెయందు, సుధీ...ప్రశంసున్ - సుధీజన = పండితసమూహమునకు, ధ్యేయ -చింతనసేయఁదగిన, గుణ = మంచిలక్షణములయొక్క, ప్రశంసున్ = స్తుతిగలవాఁడైన, (ఆతని గుణస్తుతివిషయమున పండితులు ధ్యానించుచుందురని భావము.) అమరేశ్వరమంత్రిని=అమరయ్య(ను), ధర్మ = న్యాయముచే, నిర్మల = స్వచ్ఛమగు - అనఁగా స్వచ్ఛమగు న్యాయముగల - ఉపాయునిన్= సామాద్యుపాయములు గలవాఁడగు, మల్లనార్యున్ = మల్లన (ను), అతిభవ్యతన్ = మిగుల యోగ్యతచే, మించిన = వన్నెకెక్కిన, అక్కధీరునిన్ = పండితుఁడైన అక్కయ్య (ను) - అను - అత్యాయతశీలురన్ = మిక్కిలి గొప్పప్రవర్తనగల, ముగురన్ = ముగ్గురను, ఆత్మజులన్ = కొడుకులను, కనియెన్ = కనెను.

తాత్పర్యము:—సూరయమంత్రికి అమరయ్య, మల్లన్న, అక్కయ్య యని ముగ్గురుకొడుకులు గలిగిరి.

వ. అందు, 35

క. ఇమ్ముగ నుదయించిరి జన, సమ్మతుఁ డగు మల్లనకును ◊ జగ్గన యనఁగా
దమ్మయ సూరయ చిన్నయ, తిమ్మయ లనఁబరఁగు సుతులు ◊ ధృతిబలసహితుల్.

అర్థము:— జనసమ్మతుఁడు = ప్రజల కిష్టుఁడు, ధృతి = ధైర్యముతోను, బల = శక్తితోను, సహితుల్ = కూడినవారు - (తక్కినది సుగమము.)

క. ఆ మల్లనకును జన్మము,చే మంత్రులకెల్ల గుణ ◊ విశేషంబులచే
భూమిన్ జ్యేష్ఠుఁడనంగ మ,హామహిమాదార్యుఁ డమరనార్యుఁడు వెలసెన్. 37

అర్థము:— జన్మముచేన్ = పుట్టుకచేత, ఆ మల్లనకును, గుణవిశేషంబులచేన్ = ప్రశస్తమగు గుణములచేత, మంత్రులకున్ + ఎల్లన్ = మంత్రులందఱకును, జ్యేష్ఠుఁడు = పెద్దవాఁడు, అనంగన్ = అనునట్లు, మహామహిమాదార్యుఁడు = విరివియగు గొప్పదనమును, దాతృత్వమునుగల, అమరనార్యుఁడు = అమరయమంత్రి, భూమిన్ = భూలోకమున, వెలసెన్ = ప్రసిద్ధుఁడయ్యెను.

తాత్పర్యము:—అమరామాత్యుఁడు జన్మముచే మల్లనకును, ప్రశస్తగుణములచే మంత్రులకందఱకును బెద్దవాఁడు - అని ప్రజలనుకొనునట్టి గొప్పకీర్తియు, దాతృత్వమును గలిగి లోకమున ప్రసిద్ధుఁడయ్యెను.

అలం:—తుల్యయోగిత.

సీ. *చిఱువన దేచిరా ◊ జెఱుక మించిన బుధో, త్తముఁ దేవభూమణి ◊ తాతతండ్రి
యనవరత మునికి ◊ నాయూరిపేరఁ దా, వెలయు కేసయ్య యే ◊ వెలఁది తాత

* (చిఱుమనఁ దెచ్చి రాచతీక మిచ్చిన - అని పాఠాంతరము)

యన్నయ బాపయ్య లగ్రజానుజులుగాఁ, బరఁగుభావయ్య యేగరిత తండ్రి
జయనయోన్నతులు కొండయరాఘవార్యు లేసతి కన్నదమ్ములై నుతులు గనిరి
పృథివి నేపురంధ్రి పెదతండ్రికొడుకు సత్కీర్తిశోభితుండు కేసవిభుఁడు
తనరు నేగుణాఢ్య పినతండ్రిసుతుఁడు గంగయ్య బహుసహోదరాంచితుండు

గీ. రమ్యగుణనిధి యన్నమ్మ రాచపూడి, గణపతిసుపుత్త్రి యేసాధ్వి గన్నతల్లి
యట్టియంబమ్మఁ బింగళియమరమంత్రి, పెంపు నింపును మెఱయంగఁ బెండ్లియాడె.

ఈ రెండుపద్యములందు అమరామాత్యుని భార్య యగు అంబమ్మ పుట్టినింటివారి యౌన్నత్యము చెప్పఁబడుచున్నది. ఈ రెండుపద్యములకు నలుబదిరెండవపద్యము భేదించుచున్నది. ఆధారములు కనిపింపమి యున్న దున్నట్లు వ్యాఖ్యానింపఁబడుచున్నది.

అర్థము:—ఎఱుకన్ = జ్ఞానము (లేక యాత్మజ్ఞానము) చేత, మించిన=పేర్వడిన, బుధోత్తముఁడు= పండితులలో శ్రేష్ఠుఁడగు, చిఱువనదేచిరాజు = ఆ పేరుగలవాఁడు, ఏ వధూమణితాతతండ్రి = ఏ యిల్లాలి మిన్నకు ముత్తాతయో, (పాఠాంతరమునఁగల "చిఱుమనఁ దెచ్చి" - అనన్వితముగాఁ దోఁచుచున్నది, మఱియు - రాచఱికమిచ్చిన బుధోత్తముని పేరు గానరాదు), అనవరతము = ఎల్లప్పుడును, ఉనికిన్ = ఉండుటచేత, ఆ యూరిపేరన్ = ఆ 'చిఱువన' యనుగ్రామముయొక్క పేరితో, తాన్ = స్వయముగా, వెలయు = ప్రసిద్ధుఁడగు, కేసయ్య, ఏవెలఁదితాత = ఎవతెకుఁ బితామహుడో, అన్నయ్య బాపయ్యలు = ఆ పేర్లవారు, అగ్రజానుజులు = మొదటివాఁ డన్న, రెండవవాఁడు తమ్ముఁడు, కాన్ = కాఁగా, పరఁగు = ప్రసిద్ధుఁడగు, భావయ్య, యే గరిత తండ్రి = ఏ సాధ్వికిఁ దండ్రియో, జయనయోన్నతులు = గెలుపులచేతను, నీతిచేతను గొప్పవారగు, కొండయరాఘవార్యులు = కొండయ్య, రాఘవయ్య అనువారు, ఏ సతికిన్ = ఏ పతివ్రతకు, అన్నదమ్ములై = వరుసగా అన్నయును తమ్ముఁడునై, నుతులు = జనుల పొగడ్తలు, కనిరి = పొందిరో, పృథివిన్ = భూమియందు, సత్కీర్తిశోభితుండు = మంచి యశస్సుచే ప్రకాశించునట్టి, కేసవిభుఁడు = కేసన, ఏ పురంధ్రి = ఏ సుచరిత్రయొక్క, పెదతండ్రికొడుకు (అగునో), బహుసహోదరాంచితుండు = పెక్కుమంది సోదరులతో నొప్పెడు, గంగయ్య, ఏ గుణాఢ్య = మంచి గుణములచేనిండిన యెవతెకు, పినతండ్రిసుతుఁడు, (అయి) తనరున్ = ఒప్పునో, రమ్యగుణనిధి = మనోహర మగు లక్షణములకు స్థానమును, రాచపూడి గణపతిసుపుత్రియును, అగు అన్నమ్మ, ఏ సాధ్వన్ = ఏ పతివ్రతను, కన్నతల్లి, [సూరనకవి రాచపూడి గంగన్న దౌహిత్రుఁ డని 42 వ పద్యమున నుండుటచేతను, రాచపూడి గణపతిసుపత్ని = గణపతి అనుకూలభర్తగాఁగల, రమ్యగుణనిధి యగు అన్నమ్మను, ఏసాధ్వి = పతివ్రతయగు నే అంబమాంబ, కన్నతల్లి = కన్నట్టితల్లియో, అనిన - ఇచటను, 42 వ పద్యమందును, చక్కఁగఁ గుదురును, కాని ముద్రితపాఠములందు 'సుపుత్రి' అనియే కలదు సుపత్ని = అనుకూలభర్త గలస్త్రీ యని ఆప్టేనిఘంటువున కనఁబడుచున్నది - ఇంకను విచార్యము] (అయ్యెనో), అట్టి యంబమ్మను = అటువంటి అంబమ్మయను పేరిసాధ్విని, పింగళి యమరమంత్రి, పెంపు = గౌరవమును, ఇంపును = ప్రేమయును, మెఱయంగన్ = బయల్పడ, పెండ్లి యాడెన్ = వివాహమయ్యెను.

తాత్పర్యము:—అమరామాత్యునిభార్య యగు అంబమ్మకు, చిఱువనదేచిరాజు అను నాత్మజ్ఞాని ముత్తాత. చిఱువనకేసయ్య పితామహుడు. "అన్నయ్య" అన్నగారు, బాపయ్య తమ్ముడుగానుగల భావయ్య తండ్రి. కొండయ్యరాఘవయ్యలు అన్నయును తమ్ముఁడును. కేసనమంత్రి పెదతండ్రికొడుకు. పెక్కురు సోదరులుగలగంగయ్య పినతండ్రికొడుకు. ఆమెను కన్నతల్లి రాచపూడి గణపతిపుత్రిక. ఇంతపుట్టింటిబలగము గల అంబమ్మను అమరయ్య మంత్రి పెండ్లియాడెను,

గీ. అనఘ సౌభాగ్యవర్తనార్థాంగలక్ష్మి, పింగళియమరామాత్యు నర్ధాంగలక్ష్మి
యంబమాంబిక భోగభాగ్యముల మరుని, యంబకును నంబికకు సాటియనఁగ వెలసె.

అర్థము:—అనఘ = పాపరహితములైన (అనఁగా పవిత్రములైన), సౌభాగ్య = చక్కఁదనమును, వర్తన=నడవడియును, అర్థ = ప్రయోజనముగాఁ గల, అంగలక్ష్మి=శరీరశోభగలది, పింగళియమరామాత్యు+అర్ధాంగలక్ష్మి = పింగళి యమరయమంత్రికి భార్య, అగు, అంబమాంబిక = అంబమ్మ, భోగభాగ్యములన్= సుఖములచేతను, ఐశ్వర్యముచేతను, వరుసగా - మరునియంబకును = మన్మథునితల్లియగు లక్ష్మికిని, అంబికకున్ = పార్వతికిని, సాటి = సమానమైనది, అనఁగన్ = అనునట్లు, వెలసెన్ = ప్రసిద్ధికెక్కెను.

అలం:—ఉపమ, యథాసంఖ్యము.

(భర్తశరీరమునందర్ధభాగము భార్య. కావున 'అర్ధాంగి', యనియు, 'అర్ధాంగలక్ష్మి' యనియు భార్యా పర్యాయములు వాడఁబడును.)

క. ఆ జంపతులకుఁ బుత్రుల,మై జనియించితిమి సూరనాఖ్యుఁడ నేనున్
భ్రాజితమతి యమలార్యుఁడు, రాజితబోధార్థనాభిరతుఁ డెఱ్ఱనయున్. 41

అర్థము:—ఆ జంపతులకున్=అంబమ, అమరన యను నాయాల్మగలకు (జాయాచ-పతిశ్చ, జంపతీ-జాయాయా జంభావో దంభావోనిపాత్యతే - అనువిధిననుసరించి, జంపతులు, దంపతులు - అనురూపములు సిద్ధించును.) సూరనాఖ్యుఁడను = సూరనయను పేరుగల, నేనున్, భ్రాజితమతి = ప్రకాశించు బుద్ధిగల వాఁడైన, అమలార్యుఁడును, రాజిత = ప్రకాశించు, బోధ = జ్ఞానముయొక్క (లేక ఆత్మజ్ఞానముయొక్క), అర్థన = సంపాదనమందు, అభిరతుఁడు = ఆసక్తుఁడు (ఆత్మజ్ఞానమునకై నిరంతరము యత్నించువాఁడు), అగు, ఎఱ్ఱనయును, పుత్రులము + ఐ = కొడుకులమై, జనియించితిమి = పుట్టితిమి.

తాత్పర్యము:—అంబమ, అమరన్న పేళ్లుగల యాదంపతులకు సూరనపేరు గల నేనును, అమలనయు, ఎఱ్ఱనయు, నను ముగ్గురము కొడుకులమై పుట్టితిమి.

వ్యా. వి. :—"అన్యయుష్మదస్మత్కార్యంబు లుత్తరోత్తరంబు బలీయంబు" బాల. కార. ౧౬. సూత్రమున అస్మదర్థకము కర్తలలో నుండుటచే "పుత్రులము, జనియించితిమి" అను నుత్తమ పురుషకార్యములే వచ్చినవి.

క. స్తోత్రముల కయ్యె సమ్యక్,పాత్రము శ్రీరాచపూడి గంగన యను దౌ
హిత్రుఁడు గలుగఁగ వంశప,విత్రం బామిథున ముభయ విధసంతతులన్. 42

అర్థము:—ఆ మిథునము = ఆ జంట - (దంపతులు అన్నమాట), శ్రీరాచపూడి గంగనయను, దౌహిత్రుఁడు = కూఁతుకొడుకు, మనుమఁడు, కలుగఁగన్ = పుట్టఁగా, ఉభయవిధసంతతులన్ = రెండు విధములైన (కొడుకులయొక్కయు కూఁతుయొక్కయు), సంతతులన్=బిడ్డలచేత, వంశపవిత్రంబు=కులమును పవిత్రముచేయునదై, సమ్యక్ = తగిన, స్తోత్రములకున్ = పొగడ్తలకు, పాత్రము = తగినది, అయ్యెను.

తాత్పర్యము:—అంబమ్మ, అమరన్న యనుదంపతులు తముముగ్గురుకొడుకులును వారిసంతతులే కాక, రాచపూడి గంగన యనుదౌహిత్రుఁడును గలవా రగుటచే, వంశపావనులై, స్తోత్రార్హులైరి.

[ఈ సందర్భమున అమరనకుఁ గూఁతురు పుట్టినట్లు చెప్పఁబడలేదు. కూఁతుకొడుకుమాత్రము చెప్పఁబడెను. 39 వ పద్యమునందలి రాచపూడి అన్నమ్మ సూరనకు పెద్దయక్కయు, రాచపూడి గణపతికి భార్యయు నగు ననినచో చక్కఁగ సరిపడును - విచార్యము.]

## షష్ఠ్యంతములు

క. అక్షయగుణవిభవైతా, దృక్షకులోత్తంసున కసదృక్షవిమార్గ
ప్రేక్షాసి లలితధర్మ సు,రక్షాంసునకు నురురుచిధురా హంసునకున్. 43

అర్థము:—అక్షయ...ఉత్తంసునకున్ - అక్షయ = అంతములేని, గుణ = గుణములును, విభవ = సంపదయును గల, ఏతాదృక్ష = పైనిజెప్పిన యిటువంటి, కుల = పింగళివంశమునకు, ఉత్తంసునకున్ = శిరోభూషణమైనవానికి, అసదృక్ష = సాటిలేని, విమార్గప్రేక్షా = దూరాలోచనముచేతను, అసి = కత్తిచేతను, లలిత = మనోహరమైన, ధర్మసురక్షా = ధర్మమును రక్షించుటయును, అంసునకున్ = భుజశిరస్సు అనఁగా మూఁపును-గలవానికిని, (పాఠాంతరము "సదృక్షవిమార్గ" అనికలదు - ఆపక్షమున - సదృక్ష = సాటియైనదానికి, విమార్గ = మిక్కిలిమార్గమైన, - అనఁగా సాటిలేనిదనిభావము - అట్టి ప్రేక్షా = బుద్ధిచేతను, అసి = ఖడ్గముచేతను, లలిత = మనోహరమైన, ధర్మసురక్షా = ధర్మమును గాపాడుటయును, అంసునకును = భుజశిరస్సును గలవానికిని, అని అన్వయము) ఉరు...హంసునకున్ - ఉరు = గొప్పదగు, రుచిధురా = కాంతిభారముచేత, హంసునకున్ = సూర్యుఁడగువానికిని.

తాత్పర్యము:—అమితమగుసుగుణములును, సంపదలును, గల యిట్టి పింగళి వంశమునకు శిరోభూషణమైనట్టియు, సాటిలేని దూరాలోచనముచే సొగసైనధర్మరక్షణమును, ఖడ్గముచేత సొగసైన భుజమును గలట్టియు, సూర్యునివలె దుస్సహ మగుతేజస్సు గల్గినట్టి - (అని 50 వ పద్యములోని అమరామాత్యునకు అనుదానితో నన్వయము).

క. గౌతమగోత్రునకును బ్ర,ఖ్యాతాపస్తంబసూత్ర యాజుషశాఖా
ధీతి పవిత్రునకును లో,కాతిగ వశితా జితాంత రామిత్రునకున్. 44

అర్థము:—గౌతమగోత్రునకును = గౌతమమహర్షికులముగలవానికి - అనఁగా - గౌతమునివంశము లోనివానికి, "గోత్రాభూగవ్యయో, గ్గోత్రశ్శైలే, గోత్రం కులాఖ్యయోః" అని. మేదిని. ప్రఖ్యాత = ప్రసిద్ధమగు, ఆపస్తంబసూత్ర = ఆపస్తంబ మహర్షి ప్రోక్తమగు సూత్రసమ్మతమైన, యాజుషశాఖా = యజుర్వేదశాఖయొక్క, అధీతి = అధ్యయనముచేత - చదువుటచేత, పవిత్రునకును = పరిశుద్ధుఁడగువానికి, లోక ... అమిత్రునకున్ - లోక = లోకమును, అతిగ = దాఁటిన, వశితా = జితేంద్రియత్వముచేత, జిత = గెలువఁబడిన, అంతర = లోపల నుండెడు, అమిత్రునకున్ = కామక్రోధాదులగు శత్రువులు గలవానికి.

తాత్పర్యము:— గౌతమునిగోత్రమునఁ బుట్టినట్టియు, ఆపస్తంబప్రోక్తమై సూత్రరూప మగు శ్రౌతస్మార్తనిబంధనములను, స్వశాఖ యగు యజుశ్శాఖను, అధ్యయన మొనర్చినట్టియు, ఇంద్రియములను స్వవశమం దుంచుకొని, కామాద్యరిషడ్వర్గమును గెల్చినట్టి - అమరామాత్యునకు.

క. పృథులాకాశీసేతు, ప్రథ నిడుమానూరి కృష్ణ రాయసముద్ర
ప్రథితాగ్రహార భోగా,తిథేయ నిజసంతతి ప్రతీతాత్మునకున్. 45

అర్థము:—పృథుల = విశాలమైన — పెద్దవైనట్టియు, ఆకాశీసేతు = కాశిమొదలు సేతువు పర్యంతమును, ప్రథ = ఖ్యాతిగలదియు నగు "నిడుమానూరు, కృష్ణరాయసముద్రము" అను నామములచే, ప్రథిత = ప్రసిద్ధమైన, *అగ్రహార = అగ్రహారములయొక్క, భోగ = అనుభవముచేతను, ఆతిథేయ = అతిథిపూజలను ఆసక్తితోచేయువారగు, నిజసంతతి = తనసంతానముచేతను, ప్రతీత = ప్రసిద్ధినొందిన,

*అగ్రహారము:—విద్యలను గాపాడుటకై బ్రాహ్మణులకు రాజు లిచ్చినగ్రామములు.

ఆత్మునకున్ = స్వరూపముగలవానికిని - "నిడుమానూరి కృష్ణరాయసముద్ర" అని పాఠము లన్నిటఁగలవు. అవి రెండగ్రహారములైనచో "నిడుమానూరు కృష్ణరాయసముద్ర" అని యుండుట లెస్స.

క. గంగాశుచివృత్తికి నభి, షంగానాఘ్రాత నీతి సంపత్తికి, స
న్మంగళగుణ పాత్రునకును, బింగళి సూరప్రధాన ప్రియపుత్రునకున్. 46

అర్థము:— గంగా = గంగానదివలె, శుచి = పరిశుద్ధమైన, వృత్తికిన్ = వర్తనముగలవానికిని, అభిషంగ = అవమానముచే - లేక నిందచే, అనాఘ్రాత = వాసనచూడఁబడని, (లేశమైనను దూష్యము కాని అనిభావము.) నీతిసంపత్తికిన్ = నీతిసంపదగలవానికి - భూములు, రాజ్యములు, ధనాదులు సంపాదించు నుపాయమును నీతి అందురు. సత్+మంగళ+గుణ+పాత్రునకున్ - సత్ = యోగ్యములును, లేక శ్రేష్ఠములును, మంగళ = శుభములు, నగు - గుణ = గుణములకు, పాత్రునకున్ = స్థానము లేక 'అర్హము' అయినవానికిని, పింగళి సూరప్రధాను ప్రియపుత్రునకున్ = పింగళి సూరయమంత్రి ముద్దుబిడ్డఁడైనవానికి -

"పింగళి సూరప్రధానప్రియపుత్రునకున్" అనుదానిలో 'ప్రియ' లోని రేఫసంయుక్తపకారమునకుఁ బూర్వమందున్న "న" గురువు కావలసియున్నను, ఇట లఘువుగానే యుండుట విశేషము. ఒక ముద్రితప్రతిలో "ప్రధాను ప్రియపుత్రునకున్" అనుపాఠము గలదు. కాని సూరనకావ్యములందలి షష్ఠ్యంతములం దెచ్చటను సాధ్యసమాసఘటితవిశేషణములు లేవు. ఈ యొక్కచోట నుండు ననుట విపరీతము. రేఫసంయుక్తహల్లునకు పూర్వవర్ణము గురువు చేయకుండుట భారతాదిగ్రంథములందును గనఁబడుచున్నది. క. అ, య్యావనిజమువలన నమ్మని, ప్రవరు పృథూత్సంగతలముపై వడిఁ బడియెన్. భార. సభా. ౧. ౧౮౩. కావున "ప్రధానప్రియపుత్రునకున్" అను నదియే కవిప్రయుక్త మనవలెను.

క. శ్రీమద్రాజేంద్ర గురు, స్వామి స్థిరవంశకలశజలనిధి సోమ
త్సోమారాధ్య కృపాల, బ్ధామలశివభక్తి శోభితాచారునకున్. 47

అర్థము:—శ్రీమత్ = శోభాయుక్తుఁడైన, రాజేంద్ర = రాజేంద్రుఁడను పేరుగల, గురుస్వామి = గురుశ్రేష్ఠునియొక్క, స్థిర = శాశ్వతమగు, = వంశ వంశమనెడు, కలశజలనిధి = పాలసముద్రమునకు, సోమత్ = చంద్రుఁడైయాచరించుచున్న - (చంద్రునివంటివాఁడైన అని భావము) సోమారాధ్య = సోమారాధ్యుఁ డను శైవమతగురునియొక్క, కృపా = దయచేత, లబ్ధ = పొందఁబడిన, అమల = స్వచ్ఛమగు, శివభక్తి = శివునియందలిభక్తిచే, శోభిత = ప్రకాశించుచున్న, ఆచారునకున్ = నడవడిగలవానికి, 'సోమత్' సోమఇవ ఆచరతీతి అని ఆచారార్థమున క్విప్ప్రత్యయమువచ్చి, నామధాతువై, పిదప శతృప్రత్యయము వచ్చినరూపము.

క. అమలాంబానందనునకుఁ, గమలాంబాగురు సమాన ఘనధైర్యునకున్
గమనీయ మనీషి వ్యుప, గమనీయున కంబమాంబికా రమణునకున్. 48

అర్థము:—అమలాంబానందనునకున్ =అమలమ్మ యను నామెకుఁ గొడుకు అగువానికిని, కమలా=లక్ష్మికి, అంబా=తల్లియగు గంగకు, గురు = తండ్రియైన, హిమవంతునితో, సమాన=సాటియైన, ఘన=అధికమగు, ధైర్యునకున్ = ధీరత్వము లేక ధృతికలవానికి, కమనీయ...గమనీయునకున్ - కమనీయ=చక్కని, మనీషి = పండితులకు, వ్యుపగమనీయునకున్=సేవింపఁదగినవానికి, (పండితులకు చక్కఁదనమేమి? అని సందియము కల్గవచ్చును. కాని-"శుచి భూషయతి శ్రుతంవపుః," అనుసూక్తిననుసరించి స్వచ్ఛమగు శాస్త్రముచే నలంకరింప

బడినవారును కమనీయులు కావచ్చును. లేదా - గమనీయ = ఇతరులకు సేవ్యులైన, మనీషి=పండితులకు, వృపగమనీయున్కున్ =సేవింపఁదగినవానికిని - అనియైనను జెప్పఁదగును.) - అంబమాంబికారమణునకున్ = అంబమ్మయను సాధ్వికి మనోహరుఁడగువానికి.

కమలాంబా= లక్ష్మికి తల్లి గంగ. ఆమెకుగురుఁడు=తండ్రి, జన్మస్థానము, హిమవంతుఁడు - వానితో సరియగు ధృతిగలవాఁడు - అనియు, గమనీయ... ఇతరులచే సేవింపఁబడు పండితులకాశ్రయమైనవాఁడనియు తెలియఁదగును. "అంబికారమణునకున్" అనుచోట - అంబికా శబ్దమునకు 'తల్లి' యనునర్థము కలదు. కాన ఆలంకారికు లిట్టిది "విరుద్ధమతికృత్తు" అను నొక దోషముగాఁ జెప్పిరి.

క. మజ్జనకున కర్చితధీ, మజ్జనకునకు హరనుతి సమార్జిత మాయో
న్మజ్జనకున కమలచిదవ, మజ్జనకున కమృతరస నిమజ్జనకునకున్. 49

అర్థము:—అర్చితధీమజ్జనకునకున్ = పూజింపఁబడిన పండితజనము గలవానికిని, హర...ఉన్మజ్జనకునకున్ = హర = శివునియొక్క, నుతి = స్తోత్రములచే, సమార్జిత = గడింపఁబడిన, మాయా = మాయనుండి, ఉన్మజ్జనకునకున్ = తేలుటగలవానికిని, అమల = స్వచ్ఛమైన, చిత్ = జ్ఞానముచేత, అవమత్ = తక్కువవాఁడగుచున్న, జనకునకున్ = జనకమహారాజుగలవానికిని, అమృతరసనిమజ్జనకునన్ = మోక్షమను నుదకమున మునిఁగినవానికి, లేదా-మోక్షముయొక్కరుచియందు మునిఁగినవానికి, మజ్జనకునకున్ = నన్నుఁగన్నవానికి.

తాత్పర్యము:—"ధీమాన్ సూరిః కృతీః కృష్టిర్లబ్ధవర్ణో విచక్షణః" అని అమరము. (ధీమంతులను)=పండితులను పూజించువాఁడును, శివుని స్తుతించి మాయనుండి బయలుపడినవాఁడును, ఆత్మజ్ఞానము విషయమున జనకచక్రవర్తికంటె గొప్పవాఁడును, సర్వదా మోక్షమందలి ప్రీతితో నుండువాఁడును, నన్నుఁగన్నవాఁడును అగువానికి.

ఇందు - "ధీమజ్జనకునకున్, ఉన్మజ్జనకునకున్, నిమజ్జనకునకున్" అనుమూఁడు తావులందును అంత్యానుప్రాససిద్ధికై స్వార్థమున కప్రత్యయమువచ్చెను. ఇవి 'బహువ్రీహిసమాసాంతస్థలము లగుటచే "శేషాద్విభాషా" అనుసూత్రముచే వికల్పముగావచ్చినట్టిది, కాన "ధీమజ్జనునకున్, ధీమజ్జనకునకున్" అను రీతి రూపద్వయముతో నుండవచ్చును.

క. అమరామాత్యున కురుమ, త్యమరామాత్యున కజోపయమన కృతార్థో
ద్యమరామా త్యుపమేయా, యమరామాత్యురుగుణోదయ యశశ్శ్రీకిన్.

అర్థము:—ఉరుమతి = గొప్పబుద్ధిచే, అమర + అమాత్యునకున్ = దేవతామంత్రియగుబృహస్పతియైనవానికిని, అజోపయమన...శ్రీకిన్ - అజ = బ్రహ్మయొక్క, ఉపయమన = పెండ్లియాడుటచేత, (బ్రహ్మనుపెండ్లాడుటచేత నని భావము) కృతార్థ = సఫలమైన, ఉద్యమ = యత్నముగల, రామా = స్త్రీక- (సరస్వతికి అనిభావము) అత్యుపమేయ = అత్యంతము పోల్పఁదగిన, అయమరామా = అంబమ్మయను భార్యయొక్క, అతి + ఉరుగుణ = మిగుల గొప్పవగు గుణములయొక్క, ఉదయ = ఉన్నతిచేఁ గలిగిన, యశః+శ్రీకిన్ = కీర్తిసంపదలు గలవానికి, అమరామాత్యునకున్ = అమరయమంత్రికి - కృతిపతి యగు తన తండ్రికి అనిభావము.

తాత్పర్యము:—బుద్ధివిశేషమున బృహస్పతియు, సరస్వతితోఁ బోల్పఁదగిన అంబమ్మయను భార్యయొక్క సుగుణసంపదచే మహాయశస్సు నొందినవాఁడు నగు అమరయ మంత్రికి. (మీఁది కన్వయము)

[ఈ పద్యమున అంత్యానుప్రాసమే కాక చతుష్ప్రాస నియమము గూడ నుండుటవలన నర్థపుష్టి యంతగా లేకపోవుట సహజము—నాల్గవ పాదము మొదటనున్న "అయమ" "అంబమ్మ" పదమునకు వికృ

తీగా నెంచవలసి వచ్చినది. "అబ్బాంబావరుఁడు" అని 2. 113 పద్యమున నుండుటచే "అంబమ్మ" పదమునకే అబ్బమ్మ, అయ్యమ్మ, అనునవి వికృతులు గావచ్చునని అయ్యమ్మ శబ్దమునకే "అయమ" రూపాంతరమని యిందు గ్రహింపఁబడినది. హైమవతమ్మ - ఐతమ్మ, వినాయక - వియ్యన్న, విక్కయ్య, అయినట్లే, "అయమ" శబ్దము గూడ వికృతి నొందినరూపమై యుండవచ్చును.]

"ధర్మార్థ కామమోక్ష పురుషార్థ చతుష్టయసిద్ధిగల మహాపురుషుఁడు అమరయమంత్రి" యని వర్ణించి అట్టి తన తండ్రియగు నా మహనీయునకు నీకృతిని సూరనకవి సమర్పించుచున్నాఁడు.

వ. అక్షయకీర్తి వైభవాభివృద్ధి యగునట్లుగా నేను సమర్పింపం బూనిన ప్రభావతీ
ప్రద్యుమ్నంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 51

అర్థము:—అక్షయ=క్షయములేని, శాశ్వతమగు, కీర్తి వైభవ = కీర్తిసంపదల యొక్క, అభివృద్ధి = పెంపు, అగునట్లుగాన్ = (అమరమంత్రికి) కలుగునట్లుగా, నేను, సమర్పింపం బూనిన = భక్తితో కృతిగా నీయనెంచిన, ప్రభావతీ ప్రద్యుమ్నంబునకున్ = ఆ పేరుగల కావ్యమునకు, ప్రభావతి యను నాయికను ప్రద్యుమ్నుఁడను నాయకుని, నధికరించి - ఆధారముగా - జేసికొని, రచించిన గ్రంథము (గ్రంథమందుఁ జెప్పఁబడు వారికిని గ్రంథమునకును భేదములేదు. ప్రతిపాద్య ప్రతిపాదకములకు అభేదోపచార మన్న మాట.) కథాక్రమము = అందలి యితివృత్తముయొక్క వరుస, ఎట్టిది = ఏరీతిది, అనినన్ = అనినచో,—

తాత్పర్యము:—తా నర్పించు నీ కావ్యమువలనఁ దండ్రి యగు నమరయ్య కక్షయకీర్తి సంపత్తులు కలుగునని ప్రభావతీ ప్రద్యుమ్నమను కావ్యమునందలి కథ చెప్పనారంభించుచున్నాఁడు.

## కథా ప్రారంభము

క. శ్రీరమణీ రమణీయ మ,హోరస్థలుఁ డచ్యుతుఁడు సముజ్జ్వల మహిమన్
ద్వారక నుండఁగ నొకనాఁ, డారూఢాదరత నింద్రుఁ డవ్విభు కడకున్. 52

అర్థము:—శ్రీ...స్థలుఁడు, శ్రీ=లక్ష్మీదేవిచేత, రమణీయ=అందమైన, మహత్ + ఉరః+స్థలుఁడు = విశాలమగు రొమ్ముగల, అచ్యుతుఁడు = శ్రీకృష్ణుఁడు, సముజ్జ్వల - సమ్ + ఉత్ + జ్వల = ప్రకాశించుచున్న (ప్రకటితమైన,) మహిమన్ = గొప్పఁదనముతో, ద్వారకన్ = ద్వారకాపురమందు, ఉండఁగన్ = వసింపఁగా, ఒకనాఁడు, ఇంద్రుఁడు, ఆరూఢాదరతన్ = స్థిరమగు నాదరము గలవాని ధర్మముతో (చలింపని ఆదరముతోనని భావము) అవ్విభుకడకున్ = ఆ శ్రీకృష్ణు నొద్దకు - 'చనుదెంచువాఁడు' అను మీఁదిపద్యములోని దానితో నన్వయము.

తాత్పర్యము:—లక్ష్మీదేవిని వక్షస్స్థలమునఁ దాల్చిన శ్రీమహావిష్ణువే కృష్ణస్వరూపమునఁ దన పరిపూర్ణప్రభావము మెఱయ భూలోకమున ద్వారకాపురమం దుండఁగా, ఒకదినమున దేవేంద్రుఁడు మహాదరముతో నాశ్రీకృష్ణునొద్దకు - (పైపద్యముతో నన్వయము.)

వి. :— చ్యుతుఁడు = నశించువాఁడు. న + చ్యుతుఁడు = నశింపనివాఁడు - శాశ్వతుఁడు, అని వ్యుత్పత్తి - మహోరస్థలుఁడు, మహోరస్స్థలుఁడు - అని సంధియందు విసర్గలోపము వికల్పముగా నగును. 'ఖర్పరే శరివా విసర్గలోపో వక్తవ్యః' - అని వార్తికము.

వ. లోకహితకార్యపర్యాలోచనంబునకై చనుదెంచువాఁడు నాకంబు వెడలి యాకసంబున నడ తెంచుచున్న సమయంబున. 53

అర్థము:—లోక = మూఁడులోకములకు, హిత = క్షేమకరమగు, కార్య = పనినిగూర్చి, పర్యాలోచనంబునకై = బాగుగ నాలోచించుటకై, చనుదెంచువాఁడు = వచ్చుచున్నవాఁడు - (రానెంచినవాఁడై అనిభావము) నాకంబు = స్వర్గమునుండి, వెలువడి = బయలుదేఱి, ఆకసంబునన్ = ఆకాశమార్గమున, నడతెంచుచున్న = నడచివచ్చుచున్న, సమయంబునన్. (దిగివచ్చుచున్నపుడు - అనిభావము.)

వ్యా. వి:—నడచు + తెంచు - "అభ్యాగతి నరుగ్వాదుల కయ్యాది యనుప్రయుక్తంబగు, నగుచోగువర్ణంబు విభాషను లోపించు" అను బాల. క్రియా. 111 సూత్రమున "తెంచు" ధాతువు నను ప్రయోగము - సూ:—"అయ్యాది పరంబగునపుడు చువర్ణంబు లోపించు" అను 112 సూత్రముచే చువర్ణలోపము రాఁగా "నడతెంచు" అయినది.

తాత్పర్యము:—ఇంద్రుఁడు త్రిలోకాధిపతి. మూఁడులోకముల క్షేమము నాతనిపై నుండుటచేఁ బ్రకృతమున వజ్రనాభునిచేఁ గలిగిన హానినుండి వానిని రక్షించు నుపాయమును శ్రీకృష్ణునితో నాలోచింప, స్వర్గమునుండి వెడలి ఆకాశమార్గమునఁ దనసారథియగు మాతలితో వచ్చుచున్న సమయంబున. (మీఁది పద్యముతో నన్వయము.)

సీ. ధాత్రీమహాదేవి తాల్చిన మున్నీటి, మొలనూలిరత్నంపు మొగ పనంగ
జలధిపేరిటి పాఁప తలచుట్టు గల ధరి, త్రీమూర్తి శివు చిత్ర తిలక మనఁగ
నపరదిక్సతి కట్టికొనట్టి సాగర మను, పుట్టంబు తుదివ్రాఁత మొగడ యనఁగ
వరుణగోపుర బద్ధ వార్ధితోరణమధ్య, గుంభిత నవపుష్ప గుచ్ఛ మనఁగ

గీ. వివిధ మణిమయగృహదీప్తి విసరవిసర, ణోపశోభిత మగుద్వారకాపురంబు
దవులఁ గాన్పించెఁ దనుఁ జూడ దైవవిభుఁడు, వేయికన్నులుఁ జాలక వెఱఁగుపడఁగ.

ఈపద్యము మొదలు 66 పద్యముదాఁక - ఆకాశముననుండి క్రిందికిఁజూచినపుడు సముద్రమధ్యస్థమగు ద్వారకాపురమెట్లు కనఁబడునో కవి తనభావనాపటిమచే (నూహించి) పలురీతుల నుత్ప్రేక్షించుచున్నాఁడు. ఇయ్యది కాళిదాస శాకుంతలమున దుష్యంతుఁడు స్వర్గమునుండి భూమికిఁ దిరిగి వచ్చునప్పటి వర్ణనమును స్మరింపఁజేయుచున్నది.

అర్థము:—దైవవిభుఁడు = దేవతలకురాజగు నింద్రుఁడు, తనన్ = ఆద్వారకాపురమును, చూడన్ = చూచుటకు, వేయికన్నులు, చాలక, వెఱఁగుపడఁగన్ = అబ్రపడునట్లు, వివిధ = పలుతెఱఁగులుగల, మణిమయ = మణులవికారమైన (పలుతెఱఁగుల రత్నములచే నిర్మింపఁబడిన యని భావము) గృహ = ఇండ్లయొక్క, దీప్తివిసర = కాంతులగుంపులయొక్క, విసరణ = ప్రసారముచే, ఉపశోభితంబు = ప్రకాశించుచున్నది, అగు ద్వారకాపురంబు, ధాత్రీమహాదేవి = భూదేవి, తాల్చిన = ధరించిన, మున్నీటి మొలనూలి = సముద్ర మనెడి యొడ్డాణముయొక్క, రత్నంపుమొగపు = ముఖభాగమునందలి మణులు పొదిగినబిళ్లో (యేమో), అనంగన్ = అనునట్లు - (భూమి అబ్ధిమేఖల. కావున - ఆమేఖలకు ముఖభాగమున చీలతో బిగించిన రతనాలబిళ్ల యనునట్లు) జలధిపేరిటి = సముద్రమనుపేరుగల, పాఁప తలచుట్టు = పామురూపమైన తలపాగ, కల = కలిగిన, ధరిత్రీమూర్తి = భూమిరూపుఁడైన, శివు = శివునియొక్క, చిత్ర = పెక్కురంగులుగల, తిలకము = బొట్టు, అనఁగన్ = అనునట్లు - (అష్టమూర్తియగు శివునకు, పంచమహాభూతములును, సూర్యచంద్రులును, సోమయాజియు అను నెనిమిదియు మూర్తులు. కాన భూరూపమగు శివమూర్తికి సముద్రము సర్పశిరోవేష్టమువలెను, ద్వారక నొసటఁబెట్టుకొనిన పలురంగులు గల బొట్టువలెను నున్నవని భావము.) అపరదిక్సతి = పడమటిదిశయనెడుస్త్రీ, కట్టినట్టి = తాల్చిన, సాగరము + అనుపుట్టంబు = సముద్రమనెడి బట్టయొక్క, తుది = (కొంగుయొక్క) కొనయందుఁగల, వ్రాఁతమొగడ =

సరిగతో నేసిన మొగ్గయాకృతి గల శిల్పవిశేషము, జరీమొగ్గ, అనఁగన్ = అనునట్లు, వరుణ = జలాధిదైవత మగు వరుణదేవునియొక్క, గోపుర = పురద్వారమునందు, (కోటగుమ్మమని భావము), బద్ధ = కట్టఁబడిన, వార్ధి = సముద్రమనెడి, తోరణ = తోరణముయొక్క, మధ్య = నడుమను, గుంఫిత = కూర్పఁబడిన, నవ = క్రొత్తదగు, పుష్పగుచ్ఛము = పూలగుత్తి, అనఁగన్ = అనునట్లు, (సముద్రము వరుణునిపురమునకు కోటగుమ్మము (పురద్వారము)నఁ గట్టిన తోరణమువలె నున్నట్లును, ఆతోరణము నడుమ కూర్పఁబడిన పూలగుత్తివలె ద్వారక యున్నట్లును, ఉత్ప్రేక్షితము), దవులన్ = మిక్కిలిదూరమునందు, కాన్పించెన్ = కాన్పించెను.

అలం. :— రూపకానుప్రాణిత మగు నుత్ప్రేక్ష, అతిశయోక్తి.

వ. ఇట్లు గనుపట్టు నాపట్టణంపుసొంపునకు శిరఃకంపంబు సేయు నిలింపవల్లభు నింపుసొంపు పరికించి, కించిదుల్లసితవిలోచనంబుల నాసహస్రవిలోచను విలోకించి తదీయరథ సూతుం డగు మాతలి యి ట్లనియె. 55

అర్థము:—ఇట్లు = ఈరీతిగా, కనుపట్టు=గోచరించుచున్న, ఆపట్టణంపుసొంపునకున్ = ఆద్వారకాపురి యొక్క సొగసునకు, శిరఃకంపంబుసేయు = (మెచ్చుకొని) తల గదలించుచున్న, నిలింపవల్లభుని = దేవేంద్రునియొక్క, ఇంపుసొంపు = సంతోషాతిశయమును, పరికించి = తెలిసికొని, కించిత్=కొంచెముగా, ఉల్లసిత = వికసించిన, లోచనంబులన్ = కనులతో, ఆ సహస్రవిలోచనున్ = వేయికన్నులు గల యా యింద్రుని, తదీయ = ఆ యింద్రసంబంధమగు, రథ = రథమునకు, సూతుఁడు = సారథియగు మాతలి, విలోకించి = చూచి, ఇట్లు, అనియెన్=పల్కెను.

క. ఏమీ ! యిది దేవర కను,దామరలకు నింత వెఱఁగు సే దలకొలిపెడు నే
మే మనఁగ - నహహా ! నాక,స్వామికి నబ్రమగు ప్రోలు వసుమతిఁ గలిగెన్. 56

అర్థము:—ఏమీ ! = (ఆశ్చర్యసూచకము) ఔరా !, దేవర=ప్రభువువారియొక్క (పూజ్యార్థము) కనుదామరలకున్ = పద్మములవంటి కన్నులకును, ఏమి+ఏమి+అనఁగన్ = ఆహాహాయనునట్లు, ఇంతవెఱఁగు = ఇంతటి యధికాశ్చర్యమును, తలకొలిపెడున్ = కలిగించుచున్నది, అహహా ! = ఏమియద్భుతము, నాకస్వామికిని = స్వర్గమునకు ప్రభువగు నింద్రునకును, అబ్రము = ఆశ్చర్యము కలిగించునది, అగుప్రోలు = అయినట్టి పట్టణము, వసుమతిన్ = భూమియందు, కలిగెన్ = ఉన్నది. [కము = సుఖము, అదికానిది - (న+కము) అకము = దుఃఖము. అకములేనిది, నాకము - అనఁగా దుఃఖస్పర్శములేని సుఖస్థానము స్వర్గము. దానికిఁ బ్రభువగు నింద్రునకుఁగూడ నచ్చెరువు కలిగించిన ద్వారక యెంత గొప్పదియో చెప్ప నలవికాదన్న మాట].

అలం:—విషమము, పరికరాంకురము.

క. జడనిధి యను తెరమఱుఁ గటు, వెడలి నిలిచినట్టి యాటవెలఁదియపోలెన్
గడు నింపులు గులుకుచుఁ దన,రెడు నీపురలక్ష్మి యవధరించితె యధిపా ! 57

అర్థము:—అధిపా = ప్రభువా, అవధరించితె = చిత్తగించితివా, జడనిధి=సముద్రము, అను తెర= అనెడి తెరయొక్క, మఱుఁగు = చాటు, అటు=ఆవంకనుండి (హస్తనిర్దేశము), వెడలి=తొలఁగి, బయటికి వచ్చి, నిలిచినట్టి = రంగస్థలమున నిలిచియున్న, ఆటవెలఁదియపోలెన్ = సరిగా నర్తకివలెనే - (నాట్యము చేయు స్త్రీవలెనే) ఈపురలక్ష్మి = ఈపట్టణశోభ, కడున్ = మిక్కిలి, ఇంపులు = సొగసులను, గులుకుచున్ = వెదఁజల్లుచు, తనరెడున్ = ఒప్పుచున్నది.

"లడయో రభేదః" అను సూక్తిచే జలము, 'జడము'గా గ్రహింపఁబడినది. తెరవలెనే చలించుచున్నను సముద్రము జడపదార్థ మనియు సూచన.

వ్యా. వి. :—అవధరించితివి + ఏ - " లిఙ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు." బాల. క్రియా. 24 సూత్రమున వకారలోపము, అపదాదిస్వరసంధి. అవధరించితి + ఏ — " మధ్యమపురుష క్రియాపదములందిత్తునకు సంధియగు. బాల. సంధి. 7. సూత్రమున నిత్యసంధియై, అవధరించితే — అగును.

అలం. :—రూపకము.

క. పడమట నంభోరాశియుఁ, గడమదిశల వనచయంబుఁ గప్పారఁగఁ దా
నడుమఁ బురలక్ష్మి గనుపట్టెడు హరియురమున సుఖించు సిరివి దలిర్పన్. 58

అర్థము :—పడమటన్ = పడమటిదిక్కున, అంభోరాశియున్ = సముద్రమును, కడమదెసలన్ = తక్కినయెల్లదిక్కులందును, వనచయంబున్ = ఉద్యానముల గుంపును, కప్పు+అరఁగన్ = నల్లఁదనముతో నిండియుండఁగా, నడుమన్ = సముద్రమునకును, ఉపవనములకును నడుమను, పురలక్ష్మి = పట్టణశోభ యనెడు లక్ష్మి, (లక్ష్మి — శ్లిష్టరూపకము) హరియురమునన్ = నీలవర్ణుఁడగు విష్ణువు వక్షమున, సుఖించు సిరివి = హాయిగానున్న విలాసము, తలిర్పన్ = మెఱయఁగా, కనుపట్టెడున్ = కనిపించుచున్నది.

తాత్పర్యము :—పడమటిదిక్కున సముద్రమును, తక్కినవైపుల నుద్యానములును నల్లనిరంగుతో మెఱయుచుండ నడుమ నున్న యీ పురలక్ష్మి-(పురముయొక్కశోభ) నల్లనిదేహముగల విష్ణుని వక్షమునఁ బ్రకాశించు లక్ష్మివలె నలరుచున్నది.

అలం.: —రూపకానుప్రాణితమగు నుత్ప్రేక్ష.

ఉ. దోహద ధూపధూమములతోఁ గనుపట్టెడు తత్పురీవన
వ్యూహము నోసమస్తవిబుధోత్తమ ! చూచితె యంబుపాన కౌ
తూహల లంబమాన నవతోయదరాజి విరాజితాబ్ధి సం
దేహ నితాంత కందళనదీపిత నైపుణి నేపుఁ జూపెడున్. 59

అర్థము :—ఓ సమస్తవిబుధోత్తమ = ఎల్లదేవతలలోను శ్రేష్ఠుఁడగు నోయింద్రా !, దోహద = అకాలమున పుష్పించుటకును, ఫలించుటకును, చెట్లకుఁజేయు నుపచార విశేషమైన, ధూపధూమముల తోన్ = ధూపముగావేసిన పొగలతో (దానిమ్మలకు ధూపము దోహదము) కనుపట్టెడు = గోచరించుచున్న, తత్పురీ = ఆ ద్వారకాపురమందలి, వన = తోఁటలయొక్క, వ్యూహమును = సముదాయమును, చూచితి+ఏ = చూచితివా ? అంబుపాన = (సముద్రమందలి) నీటిని ద్రాగుటయందలి, కౌతూహల = వేడుకచేత, లంబమాన = (ఆకాశమునుండి) వ్రేలాడుచున్న, నవ = క్రొత్తవగు, తోయద = (నీటినిచ్చు) మేఘములయొక్క, రాజి = పంక్తులచేత, విరాజిత = ప్రకాశించునట్టి, అబ్ధి = సముద్రమనెడు, సందేహ = సంశయముయొక్క, నితాంత = అధికమగు, కందళన = మొలకెత్తుటయందు (అనఁగాఁ బుట్టుటయందు), దీపిత = ప్రకాశింపఁజేయఁబడిన, నైపుణిన్ = నేర్పుచేత, ఏపున్ = అతిశయమును, చూపెడున్ = చూపించుచున్నది. (కర్త. వనవ్యూహము)

తాత్పర్యము :—సకలదేవతలకు ప్రభువా ! ఆద్వారకయందలి తోఁటలగుంపునుండి వెడలుచున్న దోహదముగా వేసినపొగలగుంపులు, నీరు త్రాగుటకై ఆకసమునుండి సముద్రముమీఁదికి వ్రేలాడు మేఘ సముదాయ మేమో యను సందేహమును కలిగించుచున్నవి. చూచితివా ! (మేఘములు సముద్రమున నుదకమును ద్రాగి, భూమిపై వర్షించునని కవిసమయము.)

అలం :—స్వరూపోత్ప్రేక్ష.

వి. :—"వ్యూహఃస్యాద్బలవిన్యాసే నిర్మాణే బృందతర్కయోః" అను విశ్వనిఘంటువు ననుసరించి వ్యూహము— 1 బలవిన్యాసము, 2 రచన, 3 సముదాయము, 4 తర్కము - అని నానార్థములు - నిపుణుని భావము-నైపుణ్యము, నైపుణి, నైపుణము, నిపుణత్వము. అని రూపవిశేషములు.

ఉ. భోగపుఁజుట్లు కోటలుగ ౼ భూరికిరీటసముజ్జ్వలత్ఫణా
పూగము సౌధబృందముగ ౼ భోగికులేంద్రుఁ డుపేంద్రుఁ బాయలేఁ
కీగతిఁ దాను వచ్చి భజి౼యించెనొకో యవతార మంచుఁ జే
తోగతి నాకు నెంతయును ౼ దోఁచుచున్నది నిర్జరేశ్వరా !

అర్థము:—నిర్జరేశ్వరా = దేవతలకు ప్రభువా ! భోగికులేంద్రుఁడు = సర్పకులములకు ప్రభువగు శేషాహి, భోగపుఁజుట్లు = (తనయొక్క) శరీరపు చుట్టలు, కోటలుగన్ = కోటలగునట్లును, భూరి ... పూగము - భూరి = బంగారువికారమైన (లేక యమితసంఖ్యగల), కిరీట = కిరీటములచే, సముజ్జ్వలత్ = ప్రకాశించుచున్న, ఫణా=పడగలయొక్క, పూగము = సముదాయము (పూగః క్రముక బృందయోః-అని అమరము.) సౌధబృందముగన్=మేడల సముదాయమగునట్లును (చేసికొని), ఉపేంద్రున్=విష్ణువవతారమగు కృష్ణుని, పాయలేక = విడువఁజాలక, ఈగతిన్ = ఈవిధముగా - (ద్వారకాపురమందలి కోటలయు మేడల రూపము నొంది యనుట) తాను = స్వయముగా, వచ్చి = భూలోకమునకువచ్చి, అవతారము, భజియించె నొకో = పొందెనేమో, అంచున్, నాకున్, చేతోగతిన్ = మనోవీథియందు, ఎంతయున్ = మిగుల తోఁచుచున్నది. భోగము (నానార్థము) (1) సుఖము (2) సర్పశరీరము (3) పాముపడగ - అని. భోగము గలది భోగి.

తాత్పర్యము:—విష్ణువు కృష్ణుఁడై భూమిమీఁద నవతరింప, నాతని విడువఁజాలక, శేషాహి తన శరీరముచుట్లను కోటలుగాఁజేసియు, బంగారుకిరీటములతోఁ గూడిన వేయిపడగలను మేడలుగాఁ జేసియు, తానుగూడ ద్వారకాపురమున నవతరించెనని మాతలి హృదయమున భావించెను.

అలం. :—రూపకము, ఉత్ప్రేక్ష.

వ్యా. వి. భోగపుఁజుట్లు - భోగము+చుట్లు - కర్మధారయములందు మువర్ణకమునకుఁ బు,ంపులగు. బాల. సంధి - 31 సూత్రమునందలి "కర్మధారయములు" అను బహువచనముచేత జ్ఞాపితమై షష్ఠీసమాసము నను పు,ంప్వాదేశము రా-భోగపు+చుట్లు అని యయి, "సమాసంబుల నుదంత స్త్రీసమంబులకును, బు,ంపుల కును బరుషసరళంబులు పరం బగునపుడు నుగాగమంబగు" బాల. సంధి. 24 సూత్రమున నుగాగమము రా-భోగపు+ను+చుట్లు - అయి, ద్రుతకార్యములు కలుగఁగా "భోగపుఁజుట్లు-అని సిద్ధించినది. "చుట్టు+లు-అని యుండ "బహువచనంబు పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు. "బాల. అచ్చి. 12 సూత్రమున టకారముమీఁది ఉకారము లోపించి "చుట్ట్+లు" అని యుండ - "హల్మధ్యగంబున కన్యతరసవర్ణంబునకు లుక్కగు" అను సూరి యాంధ్రశబ్దాను శాసన సూత్రముచే-టకార, లకారములకు నడుమ నున్న టకారము లోపించి "చుట్లు" అని సిద్ధించినది.

"అంచున్" - అనుధాతువు శత్రర్థకరూపము "చువర్ణకంబు పరం బగునపు డన్వాదుల నుత్వలోపం బేని, నుస్థానంబున బిందువేని విభాష నగు". "బాల. క్రియా. 55 సూత్రమున "అనుచు, అన్చు, అంచు" అనురూపములు కలుగును.

మ. అవచూడోపలదీప్తిచిత్రితములై ౼ హర్మ్యాగ్రవిన్యస్తకే
తువులం దేర్పడ కొప్పె నప్పురముపై ౼ త్రోవన్ మొగుళ్లంగి యిం

ద్ర విలోకించితె? యెంత నేల చని యేర్పా టయ్యెో హో! నమ్మరా
దవి కాలాగురుధూపధూమతతులో యభ్రంబులో యిప్పుడున్. 61

అర్థము:—మొగుళ్ళు = మేఘములు, అవచూడ...చిత్రితములు - అవచూడ = జెండాగుడ్డల యొక్క క్రిందికొనలకుచ్చులందలి, ఉపల = మణులయొక్క, దీప్తి = కాంతులచేత, చిత్రితములై = పలురంగులుగలవై, హర్మ్య...కేతువులందున్- హర్మ్య = మేడలయొక్క, అగ్ర = కొనలయందు, విన్యస్త = ఉంపఁబడిన, నిలుపఁబడిన, కేతువులందున్ = జెండాలయందు, ఏర్పడక = వేఱుగాక (అనఁగా కలిసిపోయి), ఒప్పెను, ఇంద్ర = పరమైశ్వర్యముగలవాఁడా! వేల్పుఱేఁడ! ఎంతనేల = ఎంత దూర ప్రదేశమునకు, చని = వెళ్ళి, ఏర్పాటు + అయ్యెన్ = వేఱుగానైనవో, విలోకించితె = చూచితివా? ఇప్పుడును = అంతదూరముపెళ్లిన వని తెలిసిన యీ సమయమునను, అవి = ఆ కనఁబడునవి, కాలాగురు ధూపధూమములో = నల్లయగరుధూపముల పొగలో, లేక - అభ్రములో = మేఘములో, నమ్మరాదు = నమ్ముటకు వీలుపడకున్నది, హో = ఆహో, (ఆశ్చర్యద్యోతకము).

తాత్పర్యము:—మేఘము లాకాశవీథిఁ బోవుచు ద్వారకాపురమందలి మేడలతుద నెత్తఁబడిన జెండా గుడ్డలకొనలందలి, రత్నకాంతులచే నానావర్ణముల నొంది, మబ్బులేవో జెండా లేవో తెలియక యున్నవి. కొంతసేపటికి ఆమబ్బు లెంతో దూరము పోయినవి, కాని యవి నల్లయగరుధూపపుపొగగుంపులో, మేఘములో తెలియుటలేదు. ఇంద్రా! చూచితివా! ఎంత ఆశ్చర్యము! అని రెండు వింతలు మాతలి చూపెను. పట్టణముపై త్రోవకు వచ్చుసరికి మేఘములు జెండాలు కలిసిపోవుచున్నవి. పట్టణభాగము దాఁటిపోయినను, అగరుధూపపు పొగగుంపులును, మేఘములును కలిసిపోవుచున్నవి - భేదము తెలియుటలేదు, అని.

వి. మేఘమండలపర్యంతము మేడ లున్నతములై వ్యాపించిన వనియు, ఆ మేడలలో నుండుభోగపరా యణు లగు జనులు, వినియోగించుకొను సుగంధధూపధూమములు పట్టణము దాఁటి యెంతయో మేర చుట్టు ప్రక్కలవ్యాపించుచున్న వనియుభావము.

అలం:—అతిశయోక్తి, తద్గుణము, సందేహము.

(చ.) హరిహయ! చూడుమా తెలియ నబ్బము దగ్గఱి చూచి కాని యాం
గిరసున కైన - నల్లయది కెంపులమేడలతోడి విస్ఫుర
న్మరకతకుట్టిమస్థలియొ మవ్వపులేఁజిగురాకు కెంపుము
మ్మరమునఁ దేజరిల్లు నెఱమామిడిమ్రాఁకులతోడి తోఁటయో. 62

అర్థము:—హరిహయ=ఇంద్రా! చూడుమా, అల్లయది=అదిగో! దూరమునఁ గనఁబడునది, కెంపుల మేడలతోడి = కెంపులచేఁ గట్టఁబడిన మేడలతోనున్న, విస్ఫురత్ = ప్రకాశించుచున్న, మరకతకుట్టిమ స్థలియొ=గరుడపచ్చలతోఁ గట్టఁబడిన భూభాగమో - (చప్టాయో)-మవ్వపు = మృదువైన, లేఁజిగురాకు= లేఁతచిగుళ్లయొక్క, కెంపు = ఎఱ్ఱరంగుయొక్క, ముమ్మరమునన్ = అతిశయముచేత, తేజరిల్లు = ప్రకా శించునట్టి, నెఱమామిడిమ్రాఁకులతోడి = ప్రశస్తమైన మామిడిచెట్లతోనున్న, తోఁటయో, దగ్గఱి = సమీపించి, చూచికాని, ఆంగిరసునకునైనన్ = (కనిపింపని పదార్థముల నైనను జ్యోతిషమహిమచేఁ జూచినట్లు చెప్పఁగల) బృహస్పతికైనను, తెలియుట, అబ్బము = అరిది, దుర్లభము. (నెఱమామిడి, ఎఱమామిడి యను పాఠములకంటె "ఎలమామిడి" యను పాఠమున్నచో లెస్స. ఎలమావి, లేమావి, గున్నమామిడి యని కవులప్రయోగములందు బహుళముగాఁ గనఁబడును.)

తాత్పర్యము:—ఇంద్రా! చూడుము. ఆకనఁబడునది, కెంపులతో నిర్మించినమేడలు గల గరుడ పచ్చల కట్టడపు భూభాగమో, లేఁతచిగురాకుల యెఱ్ఱనిరంగు గల మామిడిచెట్లతో నున్న (పచ్చని) తోఁటయో - యను సందేహము తొలఁగించుకొనుటకు మనమే కాదు - బృహస్పతియైనను సమీపించి కనులారఁ జూడవలసినదే! ఏమి వింత!

అలం:—సందేహము. ఈసందేహము చిత్రమైనది. కుట్టిమస్థలియా? తోఁటయా? యను నుభయ కోటిగతపదార్థములును ప్రకృతవర్ణనమున కనుకూలములును, ఆవశ్యకములును గూడ నగుచున్నవి. చిగిర్చి యెఱ్ఱగనున్న మామిడిగున్నలు అందందుఁ గలిగి, మిగిలినభాగమందంతట నాకుపచ్చనిచెట్లతోనున్న తోఁటయా? అందందు కెంపులతోఁ గట్టినమేడలుగల్గి, గరుడపచ్చలచేఁ బద్ధమైన భూమియా? యని - ఆకసమునుండి చూడఁగా గోచరించిన దృశ్యమును కవి భావనాబలమున నూహించెను.

విశేషములు:—హరిహయుడు-"హరి రేవ హయః యస్య" అని వ్యుత్పత్తి శబ్దకల్పద్రుమమునఁ గలదు. హరి యెవరో తెలియుటలేదు. "అమరసుధయందు హరి ర్హయో యస్య అని వ్యుత్పత్తియు, "త్వక్కేశవాలరోమాణి సువర్ణాభానియస్యతు, హరిః సవర్ణతోఽశ్వస్తు పీతకౌశేయ సప్రభః" ఇతి శాలి హోత్రమ్" అని ప్రమాణమును గలవు. ఈ ప్రమాణమువలన, బంగారురంగు లేక పచ్చపట్టు రంగుగల చర్మము, జూలు, తోఁక, రోమములుగలది 'హరి' అను నశ్వమనియు - అది కలవాఁడు కాన హరిహయుఁడు అనియు నిర్ణీతమైనది. ఇంద్రుని యశ్వము తెల్లనిది యని ప్రసిద్ధము-కద్రూవినతల కథయందు స్పష్టము.

వ్యా. వి. "అబ్బురము" అనుదానిలోని ఉత్వమునకు లోపమువచ్చి "అబ్బ్రము" అని అయి, "హల్మధ్యగంబున కన్యతరంబునకు లుక్కగు" అను ఆంధ్ర శబ్దానుశాసనముచే బకారము రెండవది లోపించి "అబ్రము" అగును.

మ్రాఁకులతోడి తోఁట - "కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు, బహువచనంబు పరంబగునపుడు నిత్యముగా నగు". బాల. అచ్చి. 18 చే. ఏక. వ. మ్రాను, మాఁకు. బ. వ. మ్రాఁకులు అగును. మ్రాఁకుల తోడన్+తోఁట - "చేత, తోడ, వలనల కిత్వంబు సమాసంబునం దగు" బాల. సంధి. 42 చే. మ్రాఁకుల తోడి తోఁట - అగును. చిగురాకు, చిగురుటాకు - చిగురు పేర్వాదులలోనిది కాన టుగాగమము వికల్పము. లేఁత+చిగురాకు - ప్రాఁతాది సూత్రకార్యములు వచ్చి 'లేఁజిగురాకు' అగును.

సీ. కలధౌతకేళినగంబు గాఁ బోలును, దనరుచున్నది శంభుతనువులీల
ఘనపుష్ప చాంపేయవనరాజి గాఁబోలు, నేలుచున్నది పులితోలు సిరుల
హరినీల సోపానసరణి గాఁబోలును, బగటుచున్నది నల్లపాఁపపేరుఁ
బవడంపుటలవ సౌభాగ్యంబు గాఁబోలుఁ, జాటుచున్నది జటాజూటరుచిని

గీ. సరసి గాఁబోలుఁ గ్రాలెడుసురనదిగతి, నోడ గాఁబోలుఁ బోలెడినుడుపతికళ,
ననిమిషాధిప! చూచితే యల్లపసిఁడి, కోటనడిమి శృంగారపుఁదోఁటలోన. 63

అర్థము:—అనిమిషాధిప = (నిమిషము = ఱెప్పపాటు - లేనివారు దేవతలు) దేవతలకు ఱేఁడా, చూచితి + ఏ = చూచితివా, అల్లపసిఁడికోట నడిమి శృంగారపుఁదోఁటలోన్ = ఆబంగారుకోట నడుమ నున్న యుద్యానములోపల, కలధౌత = వెండివికారమైన, కేళినగంబు = క్రీడాపర్వతము, ఆటకొండ, కాఁబోలును = కావచ్చును. శంభు తనువులీలన్ = శివుని (తెల్లని) దేహమువలె, తనరుచున్నది = ఒప్పుచున్నది, ఘన...రాజి - ఘన = దట్టమైన, "ఘనం నిరంతరం సాంద్రం" - అమరము - పుష్ప=విరులు గల, చాంపేయ = సంపెంగలయొక్క, వనరాజి = తోఁటలవరుస, కాఁబోలును, పులితోలు సిరులన్ = పెద్దపులి చర్మముయొక్క శోభలను, ఏలుచున్నది = పోషించుచున్నది. (శివుఁడు వ్యాఘ్రచర్మమును

ధరించును.) హరినీల = ఇంద్రనీల మణుల వికారమగు, సోపాన = మెట్లయొక్క, సరణి = మార్గము, కాఁబోలును, నల్లపాఁపపేరున్ = నల్లత్రాఁచుల హారమును, పగటుచున్నది = ప్రకటించుచున్నది, తెలుపుచున్నది. పగడంపుటలవ=పగడపుతీఁగలచే నిర్మించిన కంచెయొక్క, సౌభాగ్యంబు = సొగసు, కాఁబోలును, జటాజూట రుచిని = జడలగుంపుయొక్క కాంతిని, చాటుచున్నది = వెల్లడించుచున్నది, సరసి = కొలను, కాఁబోలును, సురనదిగతిన్ = (శివుని జటలయందుండెడు) ఆకాశగంగవలె, క్రాలెడున్ = ప్రకాశించుచున్నది, ఓడ = (ఆ కొలనిలో విహారముకొఱకు నుంచిన) నావ, కాఁబోలును, ఉడుపతికళన్ = చంద్రకళను, పోలెన్ = పోలియున్నది.

తాత్పర్యము:—ఆకసముననుండి చూచుచున్నమాతలికి, ద్వారకయందలి ఉద్యానము శివునివలె గన్పించినట్లు కవి భావించుచున్నాఁడు. వెండి క్రీడాపర్వతము శివునిశరీరముగను, పచ్చని సంపెంగచెట్లచాలు పులితోలుగను, నీలంపుమెట్లవరుస నల్లత్రాఁచుల హారముగను, పగడాలకంచె జటాజూటముగను, నడుమనున్నకొలను ఆకాశగంగగను, ఆకొలనిలోని నావ చంద్రకళగను, జెప్పి, యుద్యానవనరూపమున శ్రీకృష్ణుని సేవింప వచ్చియున్న శివుఁడు కాఁబోలు నని యుత్ప్రేక్షింపఁబడినది.

అలం :—ఉదాత్తము, ఉత్ప్రేక్ష.

వ్యా. వి. :— పాము+పేరు - పాఁపపేరు. సూ. :—"కొండొకచో సమాసంబుల నామ్యాది కనుమ్యాదుల ముపర్ణంబులు ప, బ్బవర్ణంబు లగు" బాల. సమాస. 19 చే పబ్వర్ణ మ-దేశమైనది. జిత్తు బిందుపూర్వంబగు" బాల. తత్సమ. 19 సూత్రమున - అఱసున్న వచ్చి పాఁప, యైనది.

పవడంపుటలవ - పవడము+అలవ - "కర్మధారయములందు ముపర్ణకమునకుఁ బుంపులగు" - అను సూత్రమున పవడంపు-అయి "కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు" బాల.సంధి. 27చే టుగాగమము రాఁగా 'పవడంపుటలవ'-అని యైనది. పవడము (ప్రకృతి. ప్రవాళము) రూపాంతరము పగడము - పగటు ధా. ప్రకృతి. ప్రకట.

సీ. ఆలోలశైవాలజాలలాలిత్యంబు, జంగమోద్యానవేషము వహింప
రంగదుత్తుంగ తరంగ సంఘాతంబు, నడగోటలతెఱంగు నడుపుచుండ
డిండీరమండలాఖండసౌభాగ్యంబు, చరసౌధచయ విలాసము భజింప
శ్రీకరశీకరాస్తోక ప్రవర్షంబు, కానుకముత్యాలకరణిఁ బరఁగ

గీ. నగడితలు తత్తదాశోపయాతవాత,వశతచేత నేతత్పురవర్యపర్య
పాసనాశాసనానీతపరపురీప,రంపరాలీల నెఱపెడునింపుమీఱి. 64

అర్థము:—ఆలోల...లాలిత్యంబు - ఆలోల = అంతటను కదలుచున్న, శైవాల = నాఁచుతీఁగలయొక్క, జాల = గుంపుయొక్క, లాలిత్యంబు = అందము, జంగమ+ఉద్యానవేషము = సంచరించునట్టి పూఁదోఁటలవేషమును, వహింపన్=పొందఁగా, రంగత్...సంఘాతంబు - రంగత్ = చలించుచున్న, మీఁదికెగయుచున్న, ఉత్తుంగ = ఎత్తైన, తరంగ = అలలయొక్క, సంఘాతంబు = సముదాయము, నడగోటలతెఱంగు = నడచునట్టి కోటలవిధమును, నడుపుచుండన్ = ప్రవర్తిల్లఁజేయఁగా, డిండీర...సౌభాగ్యంబు - డిండీరమండల = నురువులగుంపుయొక్క, అఖండ = ఎడతెగని, సౌభాగ్యంబు=సొగసు, చర...విలాసము-చర=సంచరించునట్టి, సౌధచయ=మేడల సముదాయము యొక్క, విలాసము = శోభను, భజింపన్=పొందఁగా, శ్రీకర...ప్రవర్షంబు - శ్రీకర=శోభను కలిగించెడి, శీకర=నీటితుంపురులయొక్క అస్తోక = కొంచెముకాని, అధికమగు, ప్రవర్షంబు = వర్షము, కానుకముత్యాలకరణిన్ = కానుకలుగా సమర్పించు ముత్యముల విధమున, పరఁగన్ = ఒప్పఁగా, అగడితలు = కందకములు, తత్తత్...వశతచేతన్-

తత్ + తత్ = ఆయాయి, ఆశా = దిక్కులనుండి, ఉపయాత = వచ్చిన, వాత = వాయువునకు, వశత చేతన్ = లోఁబడుటచేత, ఏతత్పుర...లీలన్ - ఏతత్ = ఈ, పురవర్య = శ్రేష్ఠమగు ద్వారకాపురము యొక్క., పర్యుపాసనా = సేవించు కొఱకైన, శాసన = ఆజ్ఞచేత, సమానీత = రావింపఁబడిన, పర = శత్రువులయొక్క (లేక యితరరాజుల యొక్క), పురీ పరంపరా = పట్టనముల పంక్తులయొక్క, లీలన్ = విలాసమును, ఇంపు మీఱి = సంతోషమును బొంది, నెఱపెడున్ = ప్రకటించుచున్నవి.

తాత్పర్యము:—ద్వారకాపురముకోటల నంటి యుండిన కందకములు (అగడ్తలు) ఈపట్టనరాజమును సేవింప వచ్చిన శత్రురాజుల పట్టన సంఘమువలె నున్నవని యిందుఁ దెల్పఁబడెను. అగడ్తలయందలి కదలుచున్న నాఁచుతీఁగల గుంపులు, కదలుచున్న పూఁదోఁటలవలెను, ఎత్తైన కెరటములు నడువ నేర్చిన కోటల వలెను, నురుఁగుల తెట్టువలు కదలుచున్న మేడలవలెను, నీటితుంపురుల జల్లు ప్రభువునకుఁ గానుక పట్టిన ముత్యములవలెను, శోభిల్లఁగా అగడ్తల రూపమున శత్రురాజపట్టనములు స్వయముగా వచ్చి, అన్ని పట్టనములకుఁ జక్రవర్తి యగు నీ ద్వారకను సంతోష పూర్వకముగా సేవించు చున్న ట్లుండెను.

అలం. :— అత్యుక్తి, శ్లో. అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యాదార్యాది వర్ణనమ్, అని లక్షణము— మఱియు రూపకము, వృత్త్యనుప్రాసము.

క. పడమటియది సాగర మని,యెడు తజ్జ్ఞులమాటఁ దక్కనేతత్పురి న
ల్గడలందుఁ బరిఖ లెవ్వియొ, జడనిధి యెయ్యదియొ తెలియఁశక్యమె ప్రజకున్. 65

అర్థము:—పడమటియది = పడమటిదిక్కునందలిది, సాగరము = సముద్రము (సగరపుత్రులచేఁ ద్రవ్వఁబడినది కావున సాగరము), అని, తద్జ్ఞులమాటన్ + తక్కన్ = దానినెఱిఁగినవారి మాటచేఁ దప్ప, ఏతత్పురి = ఈపట్టణముయొక్క, నల్గడలందున్ = నాల్గుదిక్కులందు, పరిఖలు = అగడ్తలు, ఎవ్వియొ = ఏవో, జడనిధి = సముద్రము, (లడల కభేదము) ఎయ్యదియొ=ఏదియొ, తెలియన్ = తెలియుటకు, ప్రజలకున్ = జనులకు, శక్యమె = సాధ్యమా ? సాధ్యము కా దని భావము.

తాత్పర్యము:—పడమటి దిక్కునందలి సముద్రము అని ఆసంగతి తెలిసినవారు చెప్పుమాటచే తెలిసికోవలెనే, కాని ఆపట్టనము నాలుగుదిక్కులందు అగడ్తలేవో సముద్రమేదో తెలిసికొనుట ఎవ్వరికిని సాధ్యముకాదు. అనఁగా అగడ్తలు సముద్రముతో సమముగా నున్నవని భావము. అలం. విశేషకము.

వ్యా. వి. :—పడమటియది - "సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించు" బాల. సమాస. 8. అది అను తచ్ఛబ్దముతో సమాసము "అది అవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగానగు. బాల. సంధి. 44 చే "అది"లోని అకారమునకు లోపముకల్గుచో "పడమటిది" అనియు, లోపింపనియెడ "పడమటియది" అనియు రూపద్వయము కల్గును.

ఉ. తనుఁ దరుణీతటిద్విహృతిధన్యవనావళి యింత మీఱుటల్
కనియును మేఘ మిచ్చటి కలజ్జతఁ జేరెడుఁగాక -చేర కేఁ
గినను గొఱంత యేమి పురికిన్ బువుఁదేనియసోనకాలువల్
జనముల పైరుపంటలకుఁ జాలవె యెన్నఁటి కైన నెన్నఁగన్. 66

అర్థము :—మేఘము, తనున్ = తన్నును, తరుణీ...వనావళి - తరుణీ = జవ్వనులగు స్త్రీలు అను, తటిత్ = మెఱుపులయొక్క, విహృతి = విహారములచే, ధన్య = కృతార్థమైన, వన = తోఁటల యొక్క, ఆవళి = వరుస, సముదాయము, ఇంత = కొంచెముగా, మీఱుటల్ = అతిక్రమించుటలను,

కనియును = చూచియును, ఇచ్చటికిన్ = ఈపురప్రాంతమునకు, అలజ్జతన్ = సిగ్గులేనిదానితనముతో- అనఁగా సిగ్గులేక, చేరెడుఁగాక = చేరునేకాని, చేరక = అట్లు సిగ్గిలి యీ ప్రాంతకురాక, ఏఁగినను = పోయినను, పురికిన్ = ఈద్వారకకు, కొఱంత = లోపము, ఏమి = ఏమున్నది? ఎన్నఁగన్ = పరిశీలింపఁగా, జనముల = ప్రజలయొక్క, పైరుపంటలకున్ = సస్యముల పండించుటకు, పువుఁదేనియ సోన కాలువలు = ఆతోఁటలందలి పువ్వుఁదేనెలయొక్క వానలవలనఁ గలుగు కాలువలు, చాలవె = చాలవా? చాలును అని భావము.

తాత్పర్యము:—యువతులనెడు మెఱుఁగుఁదీఁగెల విహారములచే ధన్యము లైన ద్వారకయందలి పూఁదోఁటలు తన్ను మించిపోయిన వని తెలిసియు సిగ్గుమాలి, మేఘ మిచ్చటికి చేరినఁ జేరవచ్చును. కాని అట్లు చేరనిచో వానలు లేక పంట లెట్లు పండు నందురా? ఆ పూఁదోఁటలలో నెల్లపుడు పువ్వుఁదేనెలు గురియుచుండుటచేఁ బ్రవహించు నాతేనెకాలువలే ప్రజల పైరుపంటలకుఁ జాలును. కాన మేఘము రానట్టికొఱఁత యీపురమున కెన్నఁడు నుండదు.

ద్వారకయందలి యుద్యానములలో మెఱుపుతీఁగలవంటి జవ్వనులు విహరించుచుందు రనియు' అందలి వృక్షలతాదులు సర్వదా పుష్పించి మకరందమును వానజల్లులవలె ప్రసవింప, నాతేనెలు కాలువలై పాఱుచుండు ననియు - ఉద్యానవనముల యుత్కర్షము చెప్పఁబడెను.

అలం. :—రూపకానుప్రాణిత ప్రతీపము, పరిణామము.

వ. అని యివ్విధంబున రథికసారథులు తత్తద్వస్తు సందర్శన సమయ సముచిత వచోరచ
నల వినోదించుచుం గొంత దవ్వున నయ్యుర్వికి డిగ్గి యన్నగరంబు చేరం జనునంత,
నతనిరాక విని వనజోదరుండు ప్రియసహోదరుం డగు సాత్యకిం బిలిపించి, యద్దివిజ
వల్లభు నెదుర్కొని తోడితెచ్చుటకు నియోగించిన, నతండు సముచిత పరివార
సమన్వితుండై యెదుర్కొని, తోడ్కొని, చన వేడ్క లిగురొత్తుచి త్తంబున నద్దేవో త్త
ముండు నూత్నగారుత్మత స్తంభసంభృతాభేదావలంబి రంభాతరువిభూషిత గోపుర
పార్శ్వభాగం బగు తత్పురంబు ప్రవేశించి, యుభయపార్శ్వ సౌధవీథికానిరూఢ
ప్రౌఢవిలాసినీ కటాక్షనివహ బహుగుణీకృత మార్గతోరణుం డగుచు, వారిజనాభు
మందిరద్వారంబు చేర నరిగె, నతండును నుగ్రసేన వసుదేవ సంకర్షణ గదాక్రూర
ప్రముఖులతోఁ గక్ష్యాంతరంబులు గడచి యెదురువచ్చి తత్ప్రవేశవిధానంబు యథో
చితంబుగా నడపి పరస్పరార్హసంభావనంబు ల స్తంభసంభ్రమ సంభృతంబులై
జరుగునంతఁ గుశలప్రశ్నంబు గావించిన నద్దివిజనాయకుండు జనార్దనున కిట్లనియె.

అర్థము:—అని, ఇవ్విధంబునన్ = ఈప్రకారముగా, రథిక సారథులు = రథము నెక్కియున్న యింద్రుఁడును, రథచోదకుఁడగు మాతలియును, తత్తత్ ...రచనలన్-తత్తద్ =ఆయా, వస్తు = పదార్థముల యొక్క, సందర్శన సమయ=చూచుకాలమునకు, సముచిత=తగిన, వచః=మాటలయొక్క, రచనలన్ =కల్పనలచే, వినోదించుచు=ప్రొద్దుపుచ్చుచు, కొంతదవ్వునన్ =ద్వారకకు కొంచెము దూరమునందు, ఉర్వికిన్ = భూమికి, డిగ్గి=దిగి-(ఆప్రకారముగా నింద్రుఁడు, మాతలియు నాకాశమార్గమున దిగివచ్చుచు, సముద్రమధ్యమునుండి లేచివచ్చినట్లున్న ద్వారకాపురిని తొలుతగుర్తించి, వరుసగా-దోహదధూపధూమములను, కోటలను, పురసౌధములపై నెగురు కేతువులను, మేడలను, మేడలలోనున్న మరకతకుట్టిమములను, ఎలమావితోఁటలను, బంగారుకోటనడుమనున్న పూఁదోటలోని కేళిపర్వతమును, సంపంగిచెట్లచాలును, ఇంద్రనీలసోపానపంక్తిని, పవడపుఁగంచెను, క్రీడాసరస్సును, అందలినావను, అగడ్తలను, ఉద్యానములవిహరించు తరుణులను, పువుఁదేనె

కొలువలను, చిత్రవిచిత్రకల్పనలతో వర్ణించుచు, క్రమముగా భూమికి దిగినారు.) అట్లుదిగి, అన్నగరంబు= ఆ పురమును, చేరన్ = సమీపించునట్లు, చనుసంతన్=వెళ్లినప్పటికి, అతనిరాక=ఇంద్రునియాగమనమును, వనజోదరుండు = తామరపూవు నాభియందుఁగలవాఁడు (ఇట ఉదరస్థమగు నాభి యని యౌపచారికము) కృష్ణుఁడు, ప్రియసహోదరుండు = ప్రేమగలతమ్ముఁడు, అగు సాత్యకిన్, పిలిపించి, అద్దివిజవల్లభునిన్ = ఆవేల్పులఱేని, ఇంద్రుని, ఎదుర్కొని = ఎదురుగాసేఁగి, (ప్రత్యుత్థానముచేసి అని భావము) తోడి తెచ్చుటకున్ = వెంటనిడుకొని వచ్చుటకు, నియోగించినన్ = ఆజ్ఞాపింపఁగా - (వారట్లరిగి పురమును సమీపింపఁగనే యావార్తవిని, కృష్ణుఁడు తమ్ముని సాత్యకిని పిలిపించి, "యింద్రున కెదురుగాసేఁగివెంటనిడుకొని రమ్మని యాతని కానతిడెను అని భావము.) అతండును=ఆసాత్యకియును, సముచిత...సమన్వితుఁడై, సముచిత=మిగులఁదగినట్టి, పరివార=పరిజనులతో, సమ్+అను+ఇతుఁడు-సమన్వితుఁడు=కూడుకొనినవాఁడు, ఐ, ఎదుర్కొని=ఎదురుగాఁజని, ప్రత్యుత్థానముచేసి, తోడ్కొని=వెంటనిడుకొని, చనన్=(పురంబులోనికి) వెళ్లుచుండఁగా - (సాత్యకియును తగు పరివారముతో నింద్రున కెదురుగాఁ బోయి శ్రీకృష్ణు నానతిచెప్పి వారినిరువురను వెంటఁబెట్టుకొని వెళ్లుచుండెను అని భావము.) వేడ్కలు = ఉత్కంఠలు, ఇగురొత్తు= చిగిరించు, అంకురించునట్టి, చిత్తంబునన్ = మనస్సుతో, అద్దేవోత్తముఁడు = దేవతలలో శ్రేష్ఠుఁడగు నా యింద్రుఁడు, నూత్న...భాగంబు - నూత్న = క్రొత్తవగు, గారుత్మత = మరకతముల వికారమైన, స్తంభ = స్తంభములచే, సంభృత = సంపాదింపఁబడిన, అభేద = భేదములేమిని (అనఁగా ఐక్యమును) అవలంబి=వహించిన,రంభాతరు=అరటిచెట్లచేత, విభూషిత=అలంకరింపఁబడిన, గోపుర=పురద్వారముయొక్క, కోటగుమ్మముయొక్క, పార్శ్వభాగంబు = ప్రక్కప్రదేశముగలది, అగు తత్పురంబు = అయిన ఆద్వారకయందు, ప్రవేశించి, ఉభయ ... తోరణుండు - ఉభయపార్శ్వ =. రెండువైపులందున్న, సౌధవీథికా = మేడలవరుసలందు, ఆరూఢ = ఎక్కిన, ప్రౌఢవిలాసినీ = ప్రౌఢలగు స్త్రీలయొక్క, కటాక్షనివహ = కడగంటిచూపులగుంపుచేత, బహుగుణీకృత = పెక్కుమడుఁగులుగాఁ జేయఁబడిన, మార్గ = త్రోవయందలి, తోరణుఁడు = తోరణపుదండలు గలవాఁడు, అగుచు, వారిజనాభు = (తామరపువ్వు బొడ్డునఁగలవాఁడగు) శ్రీకృష్ణుని, మందిరద్వారంబు = గృహద్వారము, చేరనరిగెన్ = సమీపింపనేఁగెను. (ఎప్పుడు శ్రీకృష్ణుని దర్శింతునను తహతహతో నాయింద్రుఁడు కోటగుమ్మముదాఁటి, పురముసఁజొచ్చి, మేడలెక్కి ప్రౌఢలగు స్త్రీలు తన్నుఁజూచుచుండ శ్రీకృష్ణునిభవనమును సమీపించెను అనిభావము.) అతండును = ఆ కృష్ణుఁడును, ఉగ్రసేన ... ప్రముఖులతో - ఉగ్రసేన = దేవకితండ్రియగు ఉగ్రసేనుఁడును, వసుదేవ = తన తండ్రియగు వసుదేవుఁడును, సంకర్షణ = బలరాముఁడును, గద = గదుఁడును, అక్రూర = అక్రూరుఁడును, ప్రముఖులతో = ప్రధానముగాఁగలవారితో - మున్నగువారితో, కక్ష్యాంతరంబులు = వేఱువేఱు ముంగిళ్లను, గడచి = దాఁటి, ఎదురువచ్చి = ఎదురుగావచ్చి, తత్ప్రవేశవిధానంబు = ఆ యింద్రుని యొక్కప్రవేశరీతి, యథోచితంబుగాన్ = తగినవిధముగా, నడపి, పరస్పర + అర్హ సంభావనంబులు = ఒండొరులకు తగినగౌరవములు, అస్తంభ = నిలిచిపోవని, ఆఁపరాని, సంభ్రమ = తొట్రుపాటుచే, సంభృతంబులై = కూర్పఁబడినవై, జరుగునంతన్ = జరిగినపిదప - (శ్రీకృష్ణుఁడును ఉగ్రసేనవసుదేవాది వృద్ధులతోఁగూడి, యెదురుగవచ్చి, యింద్రుని తగురీతిని గౌరవించి, యాతనిచే గౌరవింపఁబడినపిదప అని భావము) కుశలప్రశ్నంబున్ = క్షేమమునుగూర్చిన ప్రశ్నమును, కావింపన్ = (కృష్ణుఁడు) చేయఁగా, అద్దివిజనాయకుండు = ఆదేవేంద్రుఁడు, జనార్దనునకున్ = శ్రీకృష్ణునకు, ఇట్లు = చెప్పఁబోవురీతిని, అనియెన్ = పల్కెను.

గీ. ఇప్పుడు నీ దర్శనం బనియెడు కుశలము, కలిమి ప్రత్యక్షమే చెప్పవలదు కృష్ణ !
యటమటము గాక యటమునుపటికుశలము, నఖిలవిదుఁడ వీ వెఱుఁగనియదియుఁగలదె?

అర్థము:—కృష్ణ ! ఇపుడు, నీ దర్శనంబనియెడు=నిన్నుఁ జూచుటయను, కుశలము కలిమి=క్షేమము కలుగుట, ప్రత్యక్షమే = గోచరించుచున్నదే - (ఇఁక) అటమునుపటి కుశలమును = నిన్నుఁ జూడక

పూర్వపు నాక్షేమమును గూర్చి, అటమటముగాక = వంచనయేకాని, (అనఁగా చెప్పమానుటయేకాని) చెప్పవలదు = మాటాడ వలదు, అఖిలవిదుఁడవు = సర్వము నెఱిఁగినవాఁడవగు, నీవు, ఎఱుఁగని యదియున్ = ఎఱుఁగనిది యనికూడ, కలదె=ఉన్నదా ? - లేదు అనిభావము.

తాత్పర్యము:—ఇపుడు నిన్నుఁ జూచుట యను గొప్ప కుశలము ప్రత్యక్షమే కాన దీనిఁ గూర్చి చెప్పనక్కఱలేదు. ఇంతకుఁ బూర్వపు క్షేమము గూర్చి యడిగెదవా ? అది చెప్ప మానఁదగినదే కాని చెప్పవలసినదికాదు. ఏమన సర్వజ్ఞుఁడవు కాన నీకుఁ దెలియని దే ముండును ? అనఁగా నిన్నుఁ జూచుటచే నీక్షణమునఁ గలిగిన కుశలమే కుశలముగాని యింతకుఁ బూర్వ మేమియు లేదు. సర్వజ్ఞుఁడ వగునీవు నా యాపద నెఱుఁగవా ? అని భావము.

అలంకారము:—కావ్యలింగము.

విశేషము:— అట మునుపటి కుశలము, అఖిలవిదుఁడ ... అని ప్రథమాంతమును, పాదాంత విసంధియుఁ గలపాఠమున్నచో - ఇప్పటి నీదర్శ మను కుశలము కలుగుట (లేదా కుశలసంపద) ప్రత్యక్షమే కానఁ జెప్పనక్కఱలేదు. అటమటముగాక=(ఏమియు నెఱుఁగనివానివలె నన్ను కుశలమాయనుట) మోసమే కాని, అఖిలవిదుఁడవు = సర్వమెఱిఁగినవాఁడవు, నీవు, అటమునుపటి కుశలము = నిన్నుఁ జూడరానప్పటి నా క్షేమము; ఎఱుఁగనియదియు=నీకుతెలియనిది యని కూడను, కలదె = ఉన్నదా ? అని సమన్వయించు కొనుట లెస్స, కాని ముద్రిత మట్లుండుటచేఁ బైరీతిని సమన్వయింపవలసి వచ్చినది. ప్రాజ్ఞులు ప్రమాణము.

క. ఐనను నాచేతను వినఁగా నభిమత మయ్యేనేని కమలోదర ! నీ
కే నెఱిఁగించెద విను మవధానముతో మన్మనోవ్యథాభర మెల్లన్. 69

అర్థములు :—కమలోదర = కమలము నాభియందుఁగలవాఁడా ! కృష్ణా !, ఐనను = నీకు సర్వము తెలిసినను, నాచేతను = నావలన, వినఁగాన్ = వినుటకు, అభిమతము = ఇచ్ఛ, అయ్యేనేని = కల్గినచో, నీకున్ = సర్వజ్ఞుఁడవగు నీకు, ఏను = నేను, మత్...భరము - మత్ = నాయొక్క, మనః + వ్యథా= మనస్తాపముయొక్క, భరము = అతిశయమును, ఎల్లన్ = సర్వమును, ఎఱిఁగించెదన్, అవధానముతోన్= చిత్తైకాగ్రతతో, వినుము.

వ్యా. వి. 'నాచేతను వినఁగా - నావలన వినఁగా' అను పంచమికి మాఱుగా "చేతవర్ణకంబు హేతు కరణంబులకు గ్రహ్యాదియోగజం బగు పంచమికిని బహుళంబుగా నగు" అను బాల. కారక. 4. సూత్రముచే "చేత" వర్ణకము వచ్చినది.

చ. తపమున వజ్రనాభుఁ డనుదైత్యుఁడు బ్రహ్మఁ బ్రసన్నుఁ జేసి, వ
జ్రపురి యనంగ నొక్కనగరంబును మేరువుపొంత మారుతా
తపములకున్ నిజానుమతిఁ దక్కఁ బ్రవేశ మొనర్పరాని య
ట్టిపసఁ దనర్చుదానిని ఘటించి యతం డొసఁగన్ బ్రదీప్తుఁడై. 70

అర్థములు :—వజ్రనాభుఁడు+అనుదైత్యుఁడు = 'వజ్రనాభుఁ'డనుపేరుగల రాక్షసుఁడు, తపమునన్ = తపస్సుచేత, బ్రహ్మన్ = చతుర్ముఖుని, ప్రసన్నున్ = కలఁకదేఱినవానిని (నిర్మలచిత్తుని) గా, చేసి (మెప్పించి అనిభావము), నిజానుమతిన్+తక్కన్ = తనసమ్మతిచేతఁదప్ప, మారుత+ఆతపములకున్= వాయువునకు, ఎండకునుగూడ, ప్రవేశ మొనర్పరాని = ప్రవేశింపశక్యముగాని, అట్టిపసన్ = అటువంటి సారముచే, తనర్చుదానిన్ = ఒప్పునట్టిదగు, వజ్రపురియనంగ=వజ్రపురియనుపేరుగల, ఒక్కనగరంబును= ఒకపట్టనమును, అతఁడు = ఆబ్రహ్మ, ఘటించి = సృజించి, ఒసఁగన్ = ఈయఁగా, ప్రదీప్తుఁడై = (ఆవజ్రనాభుఁడు) ప్రకాశించుచున్నవాఁడై, (మీఁదిపద్యముతో నన్వయము.)

వి. మారుతాతపములకున్ + ఉను - ప్రథమేతరవిభక్తిసంధి, మారుతాతపములకును, అని సముచ్చయము సంధితము కానియెడల సమంజసము కానేరదు.

వ. యథేష్టవైభవోపభోగంబులం బ్రవర్తించుచు. 71

అర్థము:—యథేష్ట = కోరికకుఁ దగినట్టి, వైభవ = సౌఖ్యములయొక్క, ఉపభోగంబులన్ = అనుభవములచే.

ఉ. ఆతఁడు మొన్న నున్నత మదాంధత దాడిగ నేఁగుదెంచి యా
పోతర మేమి చెప్ప ననుఁబూరికిఁ గైకొన కప్సరో వధూ
వ్రాతనిశాతపాణిరుహవారి సలాలస నవ్యపల్లవం
బై తనరారు నందనమహావనిలో విడియించె సేనలన్. 72

అర్థము:—ఆతఁడు, మొన్న, ఉన్నత= గొప్పదగు, మదాంధతన్ = మదముచేఁ గలుగు గ్రుడ్డితనము చేత, (అమితమగు మత్తతచేత నని భావము.) దాడిగన్ = యుద్ధయాత్రగా - "స్వర్గముపైకి" (అధ్యాహారము.) ఏఁగుదెంచి = వచ్చి, ఆ పోతరము = ఆ పొగరు, (క్రొవ్వు), చెప్పన్ = చెప్పుటకు, ఏమి = ఏమికలదు - ననున్ = నన్ను ను, పూరికిఁగైకొనక = గడ్డిపోచగా సమముగానైన గణింపక, లక్ష్యపెట్టక, అప్సరోవధూ... పల్లవంబు, అప్సరః + వధూవ్రాత = అప్సరస్త్రీల సముదాయముయొక్క, నిశాత = పదనైన, పాణిరుహ= గోళ్లసంబంధమైన- గోళ్లతోఁ జిలుకఁబడిన అని భావము, - వారి=ఉదకమందు, సలాలస = ఆశతోఁ గూడిన, కోరికలుగల, నవ్యపల్లవంబు = క్రొత్తచిగురాకులు గలది, ఐ=తనరారు = అయి యొప్పునట్టి, నందనమహావని లోన్ = నందనమను (ఇంద్రుని) పూఁదోఁటలో, సేనలను, విడియించెన్=విడియఁజేసెను, ప్రయాణ మాఁపి వసింపఁజేసెను అని భావము.

భావము:—వాఁడు మిగుల మదించి, మొన్నటిదినమున స్వర్గముపైకి దండయాత్ర వచ్చి, ఆ పొగ రేమి చెప్పుదును ? నన్నొకగడ్డిపరకగా నైన గణింపక - అప్సరస్త్రీల సన్నపు గోళ్లచే చిలుకఁ బడిన నీటితుంపురులచే సుకుమారముగాఁ బెరిఁగినచిగుళ్లు గల నందనవనమున సేనలను విడిదిచేయించెను - అప్సరలు సుకుమారలు, వారిపదనైన గోళ్లనుండి జాఱిననీరును అతిసూక్ష్మముగా నుండును. అట్టి నీటిచే పెరిఁగిన పల్లవములు మఱియు మృదువులు. అట్టిపల్లవములతో నిండియుండు నందనమున చండస్వభావము గల సేనలను దింపెను.

అలం. :— విషమాలంకారము.

వి. :—ఏమనన్, ఏమిచెప్పన్ అనునవి జాతీయములు. ఏమి అనన్ (వలెను అనిగాని 'కలదు' అని కాని అధ్యాహారము చేసికోవలెను) 'ఏమనిచెప్పన్' అనియుఁ గలదు.

సీ. దనుజాధిరోహ తాడన భంజనాదుల, కోర్చునే కల్పవృక్షోత్తమములు,
శోష్య పర్యుషిత మహనుష్యమాంసంబులు, పూనునట్టివియె సంతానకములు,
దానవ ద్విపఘటాలానతాదురవస్థ, సైరించునే హరిచందనములు,
మనుజఖాది స్వేదమలినవస్త్రాదులు, దాల్పఁబాలివియె మందారతరులు

గీ. నందనమ్మునకును వజ్రనాభదైత్యు, డపుడు చేసిన కష్టపాటబ్జనాభ
యిపుడు దలఁపునఁబాఱిన హృదయమునకు, నధికతరమైనపరితాప మావహిల్లు.

అర్థము:—అబ్జనాభ=కమలము నాభియందుఁగలవాఁడా! కృష్ణా, కల్పవృక్షోత్తమములు=చెట్లలో శ్రేష్ఠములగు కల్పకములు, దనుజ...భంజనాదులకున్ - దనుజ = రాక్షసులయొక్క, అధిరోహ = ఎక్కుట, తాడన = కొట్టుట, భంజన = విఱుచుట, ఆదులకున్=మున్నగు క్రూరక్రియలకు, ఓర్చునే = తాళఁగలవా? సంతానకములు = సంతానము లను చెట్లు, శోష్య = ఎండింపఁదగిన, పర్యుషిత = చాల కాలమునాఁటివి యగు, మనుష్యమాంసంబులు, పూనునట్టివియె = వహించునట్టివే? - హరిచందనములు, దానవ...దురవస్థన్ - దానవ = రాక్షసులయొక్క, ద్విపఘటా = ఏనుఁగులమందలకు, ఆలానతా = కట్టు గొయ్యలగుట యనెడు, దురవస్థన్ = హీనస్థితిని, సైరించునే = సహింపఁగలవా? మందారతరులు = మందారము లను చెట్లు, మనుజ...వస్త్రాదులు - మనుజభక్షాది = నరభక్షకులగు రాక్షసులయొక్క, స్వేద = చెమ్మటలచే, మలిన = మురికివగు, వస్త్రాదులు = కట్టుబట్టలు మున్నగువానిని, తాల్పన్ = ధరించుటకు, పాలివియే = వశమగునట్టివా? (ధరింపఁ దగినవా అని భావము) వజ్రనాభదైత్యుఁడు, నందనమ్మునకును = నందనవనమునకు, అపుడు = ఆ సమయమునందు, చేసిన కష్టపాటు = కలిగించినపీడ, ఇపుడున్ = ఈసమయమునఁగూడ, తలఁపునన్+పాఱినన్ = జ్ఞప్తికివచ్చినయెడల, హృదయమునకున్ = మనస్సునకు, అధికతరము = మిగుల గొప్పది, దుర్భరము, ఐన పరితాపము = అయినట్టియుడుకు, అనఁగా బాధ, ఆవహిల్లున్ = కలుగును.

తాత్పర్యము:—నందనమున మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము, అను నైదు దేవతా వృక్షము లుండు ననియు, అవి కోరినకోర్కు లిచ్చునవి యనియుఁ బ్రసిద్ధము. అట్టి యుత్తమోత్తమము లగు నావృక్షములు గల నందనము రాక్షససేన లాక్రమించుటచే నెట్టి దుస్థితి నొందినవో తెలుపఁబడుచున్నది. కల్పవృక్షములను రాక్షసులు పైకెక్కియు, కొట్టియు, విఱిచివేసియు బాధించిరి. సంతాన వృక్షములపైని మురిగిపోయిన నరమాంసముల నెండఁ బెట్టిరి. హరిచందనములను ఏనుఁగుల కట్టుగొయ్యలుగాఁ జేసిరి. మందారములమీఁద మనుజులను తిను రక్కసులు చెమటచేఁ దడిసిన మురికిబట్టల నాఱఁ గట్టిరి. ఈరీతిగా వజ్రనాభుడు నందనవనమున కొనాఁడుచేసిన యపకారము - ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినప్పటికిని మనసంతయు నుడుకెత్తునుజుమా! కృష్ణా!

అలం. :— విషమము, స్మరణము.

వి. తాల్పఁబాలివి - పాలు = (అధీనమైనట్టి,) + అవి - పాలు - ఔపవిభక్తికమగు ఇవర్ణమురాఁగా 'పాలి' అయి, పాలి + అవి - "అదియవిశబ్దంబుల యత్తునకు వృత్తి విలోపంబు బహుళంబుగానగు" అను సూత్రమున అకారలోపమొంది, పాలివి అనిరూపము నొందెను.

గీ. వాని కెదిరించి పోర దేవతలలోన, నెవ్వరును జాల రిది బ్రహ్మ యిచ్చినట్టి
వరములోపలియదియ పంకరుహనాభ, మదికలఁకఁ జేసి మును చెప్పమఱచినాఁడ.

అర్థము:—పంకరుహనాభ = కృష్ణా, వానికిన్ = ఆ వజ్రనాభునకు, ఎదిరించి = ప్రతిఘటించి ఎదురుగానిలిచి, పోరన్ = పోరుటకు, దేవతలలోనన్, ఎవ్వరును, చాలరు = శక్తులుగారు. ఇది = దేవత లెవ్వరును వాని నెదిరింపలేకపోవుట, బ్రహ్మ, ఇచ్చినట్టి = రాక్షసునకిచ్చిన, వరములోనిదియ = వరములో నొకయంశమే, మదికలఁకఁజేసి = మనస్సుయొక్క క్షోభచేత, (ఈసంగతి) మును = ముందుగా, చెప్పన్ మఱచినాఁడన్ = చెప్పుటమఱచితిని.

వి. :—ప్రతిఘటించు అనుఅర్థముగల "ఎదురు, ఎదిరించు, తాఁకు, మార్కొను" అనుధాతువులు సకర్మకములుగను, అకర్మకములుగనుగూడఁ గనఁబడుచున్నవి. ఎదిరించుధాతు వీ పద్యమునందువలెనే రాఘవ. 4. 138. నఁ గూఁడ "క...భగదత్త మహోశుండాలమునకుఁ దా నెదిరించెన్" అని అకర్మకముగా ప్రయుక్తమై కనఁబడుచున్నది.

వ. కావున వానిచేత లన్నియు నప్రతిహతంబు లయి సాగుచుండె, నంత నేనును బృహస్పతియు విచారించుకొని యద్దురాత్మునకు. 75

అర్థము:—కావునన్ = దేవతల కజేయుఁ డగుటచే, వానిచేతలు = వాని పనులు, అన్నియును, అప్రతిహతంబులు=కొట్టబడనివి (అడ్డులేనివి), అయి, సాగుచుండెన్ = చెల్లుచుండెను. అంతన్ = వాఁడట్లు సేనలతో నందనమున విడిసి యున్నప్పుడు, నేనును, బృహస్పతియున్, విచారించుకొని = ఆలోచించుకొని, అదురాత్మునకున్ = దుష్టమగు మనస్సుగల యావజ్రనాభునకు. (మీఁది కన్వయము.)

గీ. అక్కసెలియండ్ర సంతాన మైనయట్టి, మనకు మనలోన నింత దుర్మాత్సరంబు వలదు మాపల్కు నీవు, నీపలుకు మేముఁ, జేసి బ్రదుకుట మే లంచుఁ జెప్పఁ బనిచి.

అర్థము:—అక్కసెలియండ్ర సంతానము=అక్కయగు అదితి బిడ్డలు దేవతలు, చెలియలగు దితిబిడ్డలు రాక్షసులు, ఐనయట్టి, మనకున్, మనలోనన్ = అయిన మనలో మనకు (జాతీయము), ఇంత = ఇంత హెచ్చగు, దుర్మాత్సరంబు = కూడని యీర్ష్య (మత్సరోఽన్యశుభద్వేషే. అమరము) - వలదు = తగదు, మాపలుకున్ = మామాటను, నీవును, నీపలుకు, మేమును, చేసి = పాటించి, బ్రదుకుట = జీవించుట, మేలు = మన యిరుపక్షములవారికిని మంచిది, అంచున్, చెప్పన్ = చెప్పునటుల, పనిచి = (దూతలను) పంపిచూచియు,

"మనలో మనకు" "మామాట నీవు, నీమాట మేము పాటించి బ్రదుకుట" అనునవి జాతీయములు, (ఇందు సామోపాయము వర్ణింపఁబడెను.)

వ్యా. వి. :—అక్క + చెలియలు - అక్కసెలియండ్రు, "ద్వంద్వంబునం బదంబుపైఁ బరుషంబులకు గసడదవ లగు" అని బాల. సంధి. 15. 'చెలియలు' బ. వ. చెలియలు+లు - ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందటి లు వర్ణంబునకు బిందు పూర్వక డకారంబును నగు. బాల. ఆచ్ఛిక. 11 చేత-చెలియండ్రు - అగును.

వ. కొంత శాంతసంరంభంబుగా మఱియు నప్పటి తీఱమికొలంది యెంచుకొని చుట్టఱికంబు నెరపుచుం బట్టణంబులోనికి రప్పించి వానికి వానిసేనలకు ననూనంబుగా విడుదులు పాలుపెట్టించితి మట్టి సమయంబున 77

అర్థము :—కొంత = కొంచెము, శాంతసంరంభంబు = తగ్గిన తొట్రుపాటు, కాన్ = కలుగునట్లును, మఱియున్ = ఇంకను, తీఱమికొలంది = అక్కఱయొక్క మితిని, చేయవలసిన పనియొక్క మితిని-లేదా అసమర్థతయొక్క మితిని, ఎంచుకొని=గడించుకొని, చుట్టఱికంబున్=బంధుత్వమును, నెరపుచున్= నెఱవేర్చుచు (లేక వ్యాపింపఁజేయుచు), పట్టణంబులోనికిన్ = అమరావతీ పురములోనికి, రప్పించి = రావించి, వానికిన్ = ఆ వజ్రనాభునకును, వానిసేనలకును, అనూనంబుగాన్ = తక్కువగాకుండునట్లు, (ఎవ్వరికిని లోపము రాకుండునట్లు)-విడుదులు = బసలు, పాలువెట్టించితిమి = ఏర్పఱచితిమి, అట్టి సమయంబునన్ = అట్లు విడుదు లేర్పఱచినవేళయందు.

తాత్పర్యము :—వానితొందరపాటు కొంచెము తగ్గునట్లుగాను, మఱియు నప్పటి మాయక్కఱకు మితి కలుగునట్లుగాను, ఆలోచించి మాకు మాకుఁ గలబంధుత్వము ప్రకటించుచు, పట్టనములోనికి రావించి వానికి వానిసేనలకు లోపము లేకుండ విడుదు లేర్పఱచితిమి. ఆసమయమున- (పైపద్యముతో నన్వయము.)

వ్యా. వి. :—తీఱు - బయల్పడు అను ధాతువుపై వ్యతిరేక భావార్థక "మి" ప్రత్యయము - తీఱమి = బయలుపడకుండుటయొక్క, మితిని = మేరను, ఎంచుకొని = గణించుకొని - అనగా స్వస్వరూపముతో ఎంతకాలము బయల్పడ నవకాశములేదో యంతకాలము లెక్కించుకొని; విడిది. బ. వ. విడుదులు. సూ. "ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు" బాల. తత్సమ. 45-చేత దకారముమీఁది ఇకారమునకు ఉత్వమును, సూ. "వికృతియం దికారాంతంబుల యుపోత్త మేత్వంబునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు. బాల. తత్సమ. 46 చే, డకారముమీఁది ఇకారమునకుఁగూడ ఉత్వమును వచ్చి "విడుదులు" అగుచున్నది.

చుట్టఱికము "చిన్నాదులకు ఱికవర్ణకంబగు. బాల. తద్ధి. 3.

సీ. తన కులుపా చాలదని మిట్టిపడఁగ ననామధేయపు దైత్యునకు నడంగి
తనవిడిదికి రంభ ననుపవైతని తిట్టు, కిగ్గాడి యసురకుఁ గేలు మొగిచి
తనకుఁ బెద్దఱికంబు మును సేయ వని దూఱు, నధమ రాక్షసునకు నర్చలొసఁగి
తన కమృతము వోసి యనుప వంచు నదల్పఁ, బినుఁగు రక్కసునకుఁ బ్రియము చెప్పి

గీ. పంకరుహనాభ! యేఁ బడ్డపాటు లరయ, నెందు నెవ్వరుఁ బడరు నీకేమి చెప్ప
నెంత పాపంబు చేసిన జంతువొక్కొ, యింద్రుఁడగు నని యపుడాత్మ నెన్నుకొంటి.

అర్థము:—తనకున్ = నాకు, ఉలుపా = కానుక, చాలదు, అని, మిట్టిపడఁగన్ = (కోపముచే) ఎగిరిపడఁగా, అనామధేయపు దైత్యునకున్ = పేరులేని అల్పుఁడైన రాక్షసునకు, అడంగి = వంగియును, తనవిడిదికిన్ = నాబసకు, రంభన్ = రంభయను నప్సరసను, అనుపవైతి = పంపింపవైతివి, అని, తిట్టు, కిగ్గాడి యసురకున్ = నీచుఁడగు రక్కసునకు, కేలు మొగిచి = వందనము చేసియును, తనకున్ = నాకు, పెద్దఱికంబు = గౌరవమును, మును = అందఱికంటె ముందు, చేయవు, అని, దూఱు = తిట్టునట్టి, అధమ రాక్షసునకున్ = అల్పుఁడగు రక్కసునకు, అర్చలిచ్చి = పూజలు చేసియు, తనకున్ = నాకు, అమృతము పోసి = అమృతము త్రాగనిచ్చి = అనుపవు = పంపవు, అంచున్, అదల్పన్ = బెదరింపఁగా, పినుఁగు రక్కసునకున్ = హీనుఁడగు రక్కసునకు, ప్రియము చెప్పి = వానికి ప్రీతికరమగు పలుకు పలికియును, పంకరుహనాభ = ఓ శ్రీకృష్ణా! ఏన్ = నేను, పడ్డపాటులు = పొందిన కష్టములు, అరయన్ = పరిశీలింపఁగా, ఎవ్వరున్ = ఎట్టివారును, పడరు = పొందరు, అపుడు = ఆదుఃఖము కలిగిన సమయమందు, ఎంతపాపంబు = ఎట్టి ఘోర మగుపాపము, చేసిన = వెనుకజన్మములందుఁ జేసికొన్న, జంతువొక్కొ = ప్రాణియొకదా, ఇంద్రుఁడు, అగుదు = అయి పుట్టుదు, అని, ఆత్మలోన్ = మనస్సునందు, ఎన్నుకొంటిన్ = తలంచుకొంటిని.

తాత్పర్యము:—తనకు నేను పట్టినకానుక చాలలేదని యలిగిన పేరులేని రక్కసునకు వంగియు, తనబసకు రంభ నంపలేదని తిట్టిన నీచదానవునకు నమస్కరించియు, ముందుగా తన్ను గౌరవింపలేదని నిందించిన అల్పదనుజునకు పూజలు చేసియు, తనకు త్రాగ నమృతముపోసి పంపలేదని బెదరించు తుచ్ఛ దితిజునకు ప్రియవచనములు చెప్పియు - ఓ కృష్ణా! నేను పడ్డపాట్లెవ్వరును పడియుండరు. అప్పుడు నామనస్సులో ఎంతపాపము చేసికొన్న ప్రాణియో కాని యీ యింద్రుఁడై పుట్టఁడని అనుకొంటిని.

అలం:—స్వభావోక్తి.

వి:—ఉలుపా. రూ. ఉలుప. (హిందూస్థానీ. ఉల్ఫా) జంతువు. ప్రాణీతుచేతనో జన్మీ జంతుజన్యశరీరిణః, అని అమరము. 1 ప్రాణి, 2 మృగము. నానార్థములు.

అనామధేయపు దైత్యుఁడు. సూ:—"మహద్విశేషణంబు సమాసంబున మువర్ణకాంతంబును గలదు." అను ఆంధ్రశబ్దానుశాసనముచే సిద్ధించుచున్నది. (చూ. 1. ఆ. 1 ప. వ్యాఖ్య) - ఇందలి "తనకున్, తనవిడిదికిన్" మున్నగు తావులందలి యాత్మార్థకమునకు "నా" అను అస్మచ్ఛబ్దార్థము వచ్చుట విశేషము. సూ:—ఆత్మార్థకం బాకొనొకచో నామాస్మదర్థాభిదాయియు నగు" ప్రౌఢ. శబ్ద. 38 చే సిద్ధము.

ఉ. వారిజనేత్ర! యే నిపుడు వచ్చుచు నుండి యలౌకికాద్భుత
శ్రీరుచిర త్వదీయనగరీ గరిమాతిశయావలోక లీ
లారస దూరధూత సకలవ్యథ చిత్తుఁడనై యథాపురా
కారత నీకుఁ దోఁచెదనొకాని తనుద్యుతిఁ బాసితిం జుమీ. 79

అర్థము:—వారిజనేత్ర = తామరలవంటి కన్నులుగలవాఁడా - కృష్ణా, ఏను = నేను, ఇపుడు, వచ్చుచునుండి = వచ్చుచు, అలౌకిక...చిత్తుఁడను - అలౌకిక=లోకసంబంధములేనిది - అనఁగా లోకమం దెచ్చటను లేనిదియును, అద్భుత = వింతయైనదియును, అగు-శ్రీ = శోభచేత (లేక సంపదలచేత) రుచిర= అందమైన, త్వదీయనగరీ=నీదగు (ద్వారకా)పురముయొక్క, గరిమ = గొప్పతనమందలి, అతిశయ=పెంపు యొక్క, అవలోక = చూచుటయనెడు, లీలా = విలాసమునందలి, రస = రుచిచేత - ఆసక్తిచేత, దూరధూత = దూరముగాఁ ద్రోయఁబడిన, సకల = సమస్తమైన, వ్యథ = దుఃఖములుగల, చిత్తుఁడను= మనస్సుగలవాఁడను, ఐ, యథాపుర + ఆకారతన్ = వెనుకటిరూపము నతిక్రమింపనివాని ధర్మముతో- అనఁగా వెనుకటిరూపముతోడనే యున్నవానివలె - తోఁచెదను+ఒ+కాని=కనిపించుచున్నానేమోకాని, (నిజముగా), తనుద్యుతిన్ = (సహజమగు నాయొక్క) శరీరపు కాంతిని, పాసితిన్ + చుమీ = విడుచుకొన్నానుజుమీ.

తా. కృష్ణా! ఇప్పుడు నేను స్వర్గమునుండి వచ్చుచు లోకాతీతమగు మీ ద్వారకాపురియొక్క మహా వైభవమును జూచుచుఁ బొందినయానందముచే మనసున నున్న తొంటివెతలు దొలఁగిపోయి పూర్వపు రూపముతో కనఁబడుచున్నానేమో కాని నిజముగా నా శరీరకాంతి నంతయుఁ బోగొట్టుకొన్నానుజుమీ.

అలం. :—అతిశయోక్తి, అపహ్నవము.

వ్యా. వి. :—యథాపురాకారుఁడు - పురా = పూర్వమును, అతిక్రమింపక - అనునర్థమున "యథాపురమ్" అని అవ్యయీభావసమాసము. పిదప యథాపురమగు ఆకారముగలవాఁడు-బహువ్రీహి సమాసము- "యథా+పురా" అనునపు డవ్యయీభావమై "స నపుంసకమ్" "అవ్యయీభావశ్చ." (2-4-17,18) పాణినీయసూత్రములచే నపుంసకమై, హ్రస్వమునొంది, తుదినున్పునకు అమాదేశము కలుగఁగా "యథాపురమ్" అయినది.

వ. అది యట్లుండె నవ్విధంబున వివిధోపచారంబులు సంఘటింపఁ బెంపునం బ్రవర్తిల్లుచుండి, యా చండదానవుం డొకానొకనాఁడు సకలసైనికసన్నాహసంపదం బొదలుచుం గదలి యేఁతెంచి, మదీయమందిరద్వారంబునఁ దనబలంబుల నించి నిలిచి, మాటలాడఁ బని గలిగి వచ్చితి నని లోనికిం జెప్పి యనుపుటయు నేనును దత్ప్రవేశంబు నడుపం దగువారి నియమించితి నప్పుడు. 80

అర్థము:—అది = నాదురవస్థ, అట్లు = చెప్పినరీతిని, ఉండెన్ = ఉన్నది, అవ్విధంబునన్ = ఆరీతిగా, వివిధ + ఉపచారంబులు, వివిధ = పలుతెఱఁగులగు, ఉపచారంబులు = సన్మానములు - లేక, సేవలు, సంఘటింపన్ = కూర్పఁగా, చేయఁగా, పెంపునన్ = విజృంభణముతో, ప్రవర్తిల్లుచుండి, - (నా

దురవస్థ యావిధముగా నున్నది. ఇఁకరాక్షసునిస్థితి యెట్లున్నదందువా ? ఆరీతిగా వానికి కావలసినయుపచారములు మేముచేయుచుండ మహోన్నతిని వర్తించుచుండెను. అనిభావము) ఆ చండదానవుండు = అత్యంత కోపస్వభావుఁడైన యారక్కసుఁడు, ఒకనొకనాఁడు, సకల...సంపదలన్ - సకల = సమస్తమగు, సైనిక = భటులయొక్క, సన్నాహ = యుద్ధయత్నములయొక్క, సంపదన్ = సమృద్ధితో, పొదలుచున్ = విజృంభించుచు, కదలి = బయలుదేఱి, ఏఁతెంచి = వచ్చి, మదీయమందిరద్వారంబునన్ = నాయింటి వాకిటియందు, తనబలంబులన్ = తనసేనలను, నించి = ఉంచి, నిలిచి = తానచ్చటనే నిలిచియుండి, మాటలాడన్ = మాటాడుటకు, పనిగలిగి = ఆవశ్యకతగలిగి, వచ్చితిని, అని, లోనికిన్ = నాగృహము లోనికి, చెప్పియనుపుటయును = వార్తపంపఁగా, (తీవ్రకోపియగు నావజ్రనాభుఁ డొకదినమున ఎల్లసేనలను యుద్ధమున కాయత్తమొనర్చుకొని నాగృహము ముంగిట వానిని నిలిపి, అచట దా నాఁగి, మాటలాడఁ బని గలిగి వచ్చితి నని నాకు వార్త నంపెను అని భావము). నేనును, తత్ప్రవేశంబు = వాని యొక్క ప్రవేశము, నడుపన్ = జరుపుటకు, తగువారిన్ = అర్హులగు వారిని, నియమించితిని = ఆజ్ఞాపించితిని. అప్పుడు = ఆ సమయమున - (మీఁది కన్వయము.)

చ. మెఱియలవంటి రక్కసులు మిక్కిలి లెక్కకు మీఱి క్రొవ్వు నే
డ్తెఱయుఁ దలిర్పఁగా వడివడిం దనవెంటనె ద్వారపాలురన్
నెఱి చెడ మట్టికొంచుఁ జొర నిర్భర గర్వము నుబ్బు బింకమున్
మెఱయఁగ వచ్చి యాయసుర మించె మదగ్రమహాసనస్థితిన్. 81

అర్థము:—మెఱియలవంటి = గుండ్రాలవంటి, రక్కసులు = రాక్షసులు, (నల్లరాలవలె దృఢగాత్రులన్నమాట). మిక్కిలి = అతిశయించి (మిక్కిలు ధాతువునకు క్త్వార్థకరూపము) లెక్కకున్ = గణనమునకు, మీఱి = దాఁటి (అసంఖ్యాకులై యనిభావము.) - క్రొవ్వును = పొగరును, ఏడ్తెఱయును = శౌర్యమును, తలిర్పఁగాన్ = అధికముకాఁగా, వడివడిన్ = మిగులవడిగా, తన వెంటనె = తన వెనుక భాగముననే, నెఱిచెడన్ = మర్యాద - నియమము - చెడునట్లు, ద్వారపాలురన్, మట్టికొంచున్ = త్రొక్కుకొనుచు, (ప్రభునాజ్ఞలేనిదే యితరులను లోనికి రానీయని ప్రతీహారుల నియమము చెడునట్లు, వారిని బడఁద్రోసి త్రొక్కుకొనుచు - అనిభావము) చొరన్ = ప్రవేశింపఁగా, ఆ యసుర = ఆ వజ్రనాభుఁడు, నిర్భర గర్వమున్ = అధికమగు నహంకారమును, ఉబ్బన్ = సంతోషమును, బింకమున్ = బిగువును, అవిధేయతయును, మెఱయఁగన్ = బయల్పడఁగా, వచ్చి, మదగ్ర...స్థితిన్ - మత్ - నాయొక్క, అగ్ర = ఎదుట నుండు, మహాసన = పెద్దపీఠమునందు, స్థితిన్ = ఉనికిచే, మించెన్ = విజృంభించెను - అనఁగా నా యెదుట నుండు పెద్ద పీఠముపై తనంతఁ దానె వచ్చి కూర్చుండెను అని భావము.)

వ్యా. వి. :—అసుర. రూ. అసురుఁడు. సూ. "సుర శబ్దంబు నిత్యంబుగా నసుర శబ్దంబు వైకల్పికంబుగా స్త్రీ తుల్యంబులగు, సంస్కృత సమాసంబునం గావు" బాల. తత్సమ. 60. (ఇట స్త్రీ తుల్యత.)

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభా మునిముఖ్యుల రెట్టఁ బట్టి యా
తలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్తదాసనం
బులు గొని గూరుచుండిరి తపోధనులున్ సురలున్ వెడంగుపా
టొలయఁగ గ్రుక్కుమిక్కు మనకుండి రొదుంగుచు నక్కడక్కడన్. 82

అర్థములు :—అప్పుడు = ఆసమయమందు, తదీయులు = ఆరాక్షసునిసంబంధమైనవారు, సేవకులు, బలిమిన్ = బలాత్కారముతో, సభా = సభయందున్న, మునిముఖ్యులన్ = దేవర్షిశ్రేష్ఠులను, రెట్టఁబట్టి = భుజమును పట్టుకొని, ఆతలన్ = అవతల, పడన్ = పడునట్లు, వైచుచున్ = విసరివేయుచు,

అవారణన్ = అడ్డులేమిచే, తమకుఁదామె = తమంతఁదామే; స్వయముగా, తత్తదాసనంబులు = ఆయాయి మునుల పీఠములన్, కొని = గ్రహించి, కూరుచుండిరి, తపోధనులున్ = మునులును, సురలున్ = దేవత లును, వెడంగుపాటు = నిశ్చేష్టత, ఒలయఁగన్ =(తమ్ముసు) పొందఁగా, అక్కడక్కడన్=అందందు, ఒదుంగుచున్ = సంకుచితావయవులగుచు, గ్రుక్కుమిక్కుమనక = మాటాడనోరు మెదల్పక, ఉండిరి.

తాత్పర్యము:—అంత నారాక్షసునిసేవకులు సభయం దున్న దేవర్షులను బలాత్కారముగా బుజము పట్టి యావలకు నెట్టివేయుచు తమకుఁ దామే వారియాసనములు లాగికొని వానిపైఁ గూర్చుండిరి. ఇఁక మునులును దేవతలును చేష్ట దక్కి, అక్కడక్కడ ముడిఁగి కూర్చుండి మాటలేక యూరక యుండిరి.

వ్యా. వి. :—సురలు-సూ. "స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వ బహుత్వంబులం బ్రయోగింపంబడు". బాల. తత్సమ. 59. చే సురశబ్దము నిత్యబహువచనముగానే యుండును. పైపద్యము వ్యాఖ్యలోని సూత్ర ముచే దీనికి స్త్రీత్వము నిత్యము. కాన "సురలు" అనియే కాని "సురులు" అని కారాదు. అక్కడన్+ అక్కడన్. సూ. "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు." బాల. సంధి. 40. 'అక్కడ + అక్కడన్' అయి, సూ. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగా నగు. బాల. సంధి. 10 చే-"అక్కడక్కడన్" అగును. అక్కడ-ఆ+కడ-త్రికసంధి.

ఉ. యాదవసింహ! నాతలఁపు నీ నప్పుడు వారలపా టొకింత యౌఁ
గా దనుదాఁక లేదు గలఁగెకం బడఁజొచ్చె ఖలుండు వీఁడు పెం
పేదఁగఁ జుట్టుముట్టి మము నీ నిద్దఱఁ బట్టిన నేది దిక్కు ప్రా
మాదిక మైనమోస మిదియె మన్మతి కంచు జనించు శంకతోన్. 83

అర్థము:—యాదవసింహ = యదుకుల శ్రేష్ఠుఁడా! ఓ కృష్ణా, అప్పుడు = ఆసమయమున, వారల పాటు = వారువచ్చి పైఁబడుట, ఔను = తగును, కాదు = తగదు, అనుదాఁకన్ = అని చెప్పుదాఁక నైనను, లేదు-కాన - (లేమిన్ అని పాఠమున్నచో "కాన" అను అధ్యాహార మక్కఱలేదు.) నాతలఁపును= (నాయాలోచనయును,) నాహృదయమును, వీఁడు, ఖలుండు = దుష్టుడు, పెంపు = గౌరవము, ఏదఁగన్= నశించునట్లు, మము నిద్దఱను = బృహస్పతిని నన్నును, చుట్టుముట్టి, పట్టినన్ = నిర్బంధించినచో, ఏది + దిక్కు = ఏదిగతి, మన్మతికిన్ = నాబుద్ధికి, ఇది = ఈ జరిగినది, ప్రామాదికము = పొరపాటువలన సంభవించిన, మోసము = వంచన, లేక అవమానము, అంచున్ = అనుచు, జనించు శంకతోన్ = పుట్టి నట్టి భయముచే, కలఁకంబడఁజొచ్చెన్ = క్షోభపడ నారంభించెను. (నాతలఁపు. కర్త.)

తాత్పర్యము:—ఓకృష్ణా! అప్పుడు వజ్రనాభుని పరిజనులు వచ్చి పైఁబడుట కూడును కూడ దని ఆలోచించుదాఁక లేదు. కాన - వీఁడు దుష్టుఁడు, గౌరవహాని కలుగ బృహస్పతిని నన్నును చుట్టఁబెట్టి బంధించినచో దిక్కే మున్నది ? ఎంత పొరపాటుగా ఆలోచించితిని అనుభయములో నాహృదయము క్షోభింపఁజొచ్చినది. "శంకా సందేహభయయోః" అను నిఘంటువుచే ఇచట శంకాశబ్దము - భయార్థకము.

వ. ఏ నప్పు డుప్పతిల్లెడు మదికలంక యెఱుకపడకుండ గాంభీర్యంబుఁ దెచ్చుకొని తనకు వస్త్రాభరణాది సంభావన లొనర్చుటకు వారి వీరిం బిలిచి నియోగించుచు సంభ్రమించుటఁ గనుంగొని యన్నియు వచ్చెం జాలు నిలు మని వారించుచు నిలింపవిద్వేషి యి ట్లనియె. 84

అర్థము:—ఏను = నేను, అప్పుడు, ఉప్పతిల్లెడు = పుట్టిన, మదికలంక = మనస్తాపము, యెఱుక పడకుండన్ = (ఇతరులకు) తెలియరాకుండునట్లు, గాంభీర్యంబున్=గుండెలోతుఁదనమును (మనసులోని

భావము తెలుపు చిన్నెలు లేకుండుట), తెచ్చుకొని = కలిగించుకొని, తనకున్ = ఆ వజ్రనాభునకు, వస్త్రాభరణాదిసంభావనలు = బట్టలు, నగలు మున్నగువానిచే నగు సన్మానములు, ఒనర్చుటకున్ = చేయుటకు, వారిన్ వీరిన్ = చుట్టుప్రక్కలనున్నవారిని, పిలిచి, నియోగించుచు = ఆజ్ఞాపించుచు, సంభ్రమించుటన్ = వేగిరపడుటను, కనుంగొని = చూచి, అన్నియున్ = నీవుచేయఁదలఁచిన సన్మానములెల్ల, వచ్చెను = (మాకు) ముట్టినవి (చేసినట్లేయనుకొనుచున్నాను అని భావము). నిలుము = ఆగుము, అని, నిలింపవిద్వేషి = దేవతలకు విరోధియగు నారక్కసుఁడు, వారించుచున్ = మాన్పించుచు, ఇట్లు = ఈ క్రిందిరీతిగా, అనియెను.

వి:—"అన్నియు వచ్చె" అనునది జాతీయము. 'అండజయాన నీ వొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె" మనుచరిత్రము. 2. ఆ. 48 - మాకువచ్చెన్ = మాకుఁ జెందినవి-అని కలదు. ఇట వచ్చు ధాతువునకు విశేషార్థము.

ఆ. వలసినట్లు దివ్యవస్తువు లెల్ల నా, యిచ్చ ననుభవించి వెచ్చపెట్టి
ప్రభుత నెఱప కకట పరుఁ డిచ్చునందాఁక, నెదురుచూచు దైన్య మేల నాకు.

అర్థము:—వలసినట్లు = కావలసినవిధమున, దివ్యవస్తువులు - స్వర్గమునందున్న పదార్థములు, ఎల్లన్ = అన్నియు, నాయిచ్చన్ = నాయిష్టానుసారము, అనుభవించి, వెచ్చపెట్టి = ఇతరులకై వ్యయించి, ప్రభుత = ఏలికతనమును, అధికారమును, నెఱపక = ప్రకటింపక, చూపక, అకట = అయ్యో, పరుఁడు = ఇతరుఁడు, ఇచ్చునందాఁకన్, ఎదురుచూచు = కనిపెట్టుకొనియుండు, దైన్యము = హీనస్థితి, నాకున్, ఏల = ఎందులకు ?

తా. స్వర్గమందలివస్తువులెల్ల కావలసినవిధమున నాయిష్టానుసారముగా నే ననుభవించి ఇతరుల కిచ్చి నాయధికారమును జూపకుండ - అయ్యో! ఇతరుఁ డిచ్చుదాఁక ప్రతీక్షించు దీనస్థితి నా కెందులకు ?

వి:—ఈ పాఠమున వలసినట్లు - నాయిచ్చన్ - అనునవి పునరుక్త మగుచున్నవి. ఇచట "వలసినట్టి దివ్యవస్తువులెల్ల" అనిపాఠమైనచో స్వారసికముగ నుండును. ఇంకను విచార్యము.

క. నీమంచితనపు నటనల, నే మొగమోడుచు నెఱుంగక యిట్లుండితిఁ గా
కేమిటికి నాకు నీదు వృ, థామాధురి యొండు వినుము తగవరి వైనన్. 86

అర్థము:—నీమంచితనపు నటనలన్ = యోగ్యతను దెలుపు నీయభినయములచేత, ఏన్ = నేను, మొగమోడుచున్ = దాక్షిణ్యమూనుచు (లేక వెనుదీయుచు), ఎఱుంగక - నీకాపట్యమును దెలిసికొనలేక, ఇట్లు = ఈరీతిగా, ఉండితిఁగాక = ఉంటినేకాని, నీదువృథామాధురి = వ్యర్థమగు నీతియ్యఁదనము, అనఁగా మంచితనము, నాకున్, ఏమిటికిన్ = ఎందులకు ? తగవరివి = న్యాయముగలవాఁడవు, ఐనన్ = అయినయెడల, ఒండు = ఒక్కటి (చెప్పెదను) వినుము. లేనిది యున్నట్లు ప్రకటించుట "నటన" (అభినయము.)

వి:—మధురముయొక్క భావము. మధురిమ(ము) మధురత్వము, మధురత, మాధుర్యము, మాధురి - (తద్ధితాంతములు.) తగవరి. తగవు+అరి "అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు" బాల. తద్ధిత. 17.

మత్తకోకిల. ఎంతకాలము నీవు నాకము నేలితి వచ్చట నుండి నా
కంతకాలము నేలఁ బాడి బిడౌజ! కశ్యపమౌనిరా
ట్సంతతిత్వము మీకు దానవజాతికిన్ సరి గాదె నీ
వింతయున్ గని రాజ్యహీనత నేఁగు మెచ్చటి కేనియున్. 87

అర్థము:—బిడౌజ = శత్రువులను భేదించునట్టి తేజస్సుగలవాఁడా! ఓ యింద్రా! నీవు, ఇచ్చటన్ = ఈయమరావతియందు, ఉండి = వసించి, ఎంతకాలము, నాకమును = స్వర్గమును, ఏలితి = పాలించితివో, నాకున్, అంతకాలమును, ఏలన్ = ఏలుటకు, పాడి = న్యాయము-కలదు - అధ్యాహారము. మీకున్ = దేవతలకును, దానవజాతికిన్ = రాక్షసజాతికిని, కశ్యపమౌనిరాట్సంతతిత్వము = కశ్యప మునీంద్రునియొక్క బిడ్డలగుట, సరిగాదె = సమానమేకదా? కాన, నీవు, ఇంతయున్ = ఈ విషయ మెల్లను, కని = పరిశీలించి, తెలిసికొని అనిభావము, రాజ్యహీనతన్ = రాజ్యములేమితో - (రాజ్యమును విడిచిపెట్టి అనిభావము), ఎచ్చటికేనియున్ = మఱియొకతావునకు, ఏఁగుము = పొమ్ము.

తాత్పర్యము :—ఇంద్రా! మీరును మేమును కశ్యపునిబిడ్డలము. కాన నీ వెంతకాలము స్వర్గము నేలితివో అంతకాలము నేను నేలుట ధర్మము. ఈ సంగతి నీవు నాలోచించి రాజ్యము విడనాడి యెచటి కైనను పొమ్ము.

అలం:— కావ్యలింగము.

ఆ. ఇట్లు సేయవేని యింద్ర! మీ రెల్ల నా, చేతిలోనివార చెప్ప నేల
యిప్పుడ పట్టి నిగ్రహించెద నావుడు, నేను నగుచు యాతుధానుతోడ. 88

అర్థములు:—ఇట్లు = నేనుచెప్పిన యీవిధమున, చేయవేని, ఇంద్ర! (సంబోధనము) మీరు+ఎల్లన్ = దేవతలగు మీరందఱును, నాచేతిలోనివారు+అ = నాకు వశులైయున్నవారే, చెప్పన్ = చెప్పుట, ఏల = ఎందులకు, ఇప్పుడు+అ = ఈక్షణమందే, పట్టి = మిమ్మందఱను నిర్బంధించి, నిగ్రహించెదన్ = శిక్షించెదను, నావుడున్ = అనఁగా, నేను, నగుచున్ = నవ్వుచు, యాతుధానుతోడన్ = రాక్షసుఁడగు వజ్రనాభునితో. (మీఁదిపద్యముతో నన్వయము.)

ఆ. నిగ్రహముల కేమి నీవును మేము న, న్యోన్యమైత్రిఁ బొదలునట్టి తెఱఁగు
నడపవలయుఁగాక యెడసిపో నాడుకో, దడవె వేగిరింపఁదగునె యనఘ! 89

అర్థములు :—అనఘ = పాపరహితుఁడా, నిగ్రహములకున్ = నిరోధములకు, ఏమి = ఏమివచ్చెను, నీవును, మేమును, అన్యోన్యమైత్రిన్ = ఒండొరుల స్నేహముతో, పొదలునట్టితెఱఁగు = వర్ధిల్లునట్టి విధమును, నడపవలయుఁగాక = ఏర్పఱుపవలెనేకాని, ఎడసిపోన్ = విడిచిపోవునట్లుగా, వేఱగునట్లుగా, ఆడుకోన్ = అనుకొనుటకు, తడవె = ఆలస్యమే? (ఎంతసేపు కావలెను అని భావము) వేగిరింపన్ = తొందరపడఁగా, తగునె = తగదని భావము.

తాత్పర్యము :—ఓ పుణ్యాత్మా! విరోధములదాఁక నేమి వచ్చినది? మీరును మేమును కలసిమెలసి వర్ధిల్లుమార్గము చూడవలెను గాని, దూర మగునట్లు మాటాడుటకు ఎంత కావలెను? కాన తొందరపడఁ దగదు.

వ. దానవేంద్రా! నీపలికినట్లు మన మిరుదెగలవారముం గశ్యపసంతానం బగుటం జేసి
మన యెల్లవివాదంబులు నతండ తీర్ప నర్హుండు గావున నమ్మహామునీంద్రుకడకు
నరిగి యతనియెఱుకమీఁద నీకు నాకాధిపత్యంబు నొసంగవలసిన నొసంగెదఁ
దొలుత మదీయవచనంబులు విని యిట్టి సైరణ వహించి తది తుదముట్ట నడపక
విడిచిపెట్టుట నీయట్టి గట్టిదొరకు నుచితంబే తియ్యని నోరం జేదు మేయుట

నాయంబు గా దని మఱియు ననేకప్రకారంబుల నొడంబఱచి యతనియతివ్యగ్రతకుం బ్రతివిధానంబు గానక యే నప్పుడ యప్పటికి దొరకినబృహస్పతిప్రముఖులు సహాయులుగా నమ్మహాదైత్యు వెంటం గశ్యపుపాలి కేఁగితి నప్పు డప్పరమతపోధనుండు యజ్ఞదీక్షితుండై యున్నవాఁడు గావున మావివాదంబులు నిజ యజనావసానంబునందు విని తీర్చుటకు నియమంబు చేసి యాసురవిరోధిని యథార్హసాంత్వనాలాపంబుల శాంతుం జేసి యిప్పుడు నీవు నీవజ్రపురంబునకుఁ జను మని యాజ్ఞాపించిన. 90

అర్థము:— అతనియెఱుకమీఁదన్ = అతని యాజ్ఞమీఁద, (ఆలోచనమీఁద?) నాకాధిపత్యంబు = స్వర్గమునకుప్రభుత్వము, సైరణ = సహనము, వహించితి = పూనితివి, గట్టిదొరకున్ - గొప్పప్రభువునకు, తియ్యని నోరం జేఁదు మేయుట = మధురవస్తువులుదిను నోటితో చేఁదువస్తువు తినుటవలె, న్యాయముతప్పనినీవు తప్పుసేయుట, నీతిగాదు. అతివ్యగ్రతకున్ - మిక్కిలితొందరపాటునకు, ప్రతివిధానంబు = ప్రతిక్రియ, మాఱుచేఁత, నిజయజనావసానంబునందున్ = లనయొక్క యజ్ఞక్రియతుదయందు, యథార్హ = అప్పటికి తగిన, సాంత్వనాలాపంబులన్ = ఊరడింపుమాటలచేత - తక్కినది సుగమము.

ఉ. ఇం బడరంగ నియ్యకొనియెన్ రజనీచరుఁ డేమి భాగ్యమో
యంబుజనాభ! యప్పటికి నమ్మునిసత్కృప నేము నేమి చె
ప్పం బులినోటి కండ విడివడ్డ గతిం దలపట్టి చూచుకొం
చుం బెనుచేటు దప్పె ననుచుం దివి కేఁగితి మొయ్య నొయ్యనన్. 91

అర్థము:—అంబుజనాభ = తామరపూవు నాభియందుఁ గలవాఁడా! ఓకృష్ణా, ఏమి భాగ్యమో = ఏమియదృష్టమో కాని, అమ్ముని సత్కృపన్ = ఆ కశ్యపముని దయచేత, అప్పటికిన్ = తత్కాలమునకు, రజనీచరుఁడు = (రాత్రి చరించువాడు) రాక్షసుఁడగు వజ్రనాభుఁడు, ఇంబు = సంతసము, అడరంగన్ = అతిశయింపఁగా, ఇయ్యకొనియెన్ = అంగీకరించెను. ఏమును = మేము గూడ, ఏమి+చెప్పన్ = చెప్పుటకేమున్నది? పులినోటికండ = పులినోటిలోఁ జిక్కినకండ (ఇతరుల కెవ్వరికిని నీవలకుఁదీయ శక్యముకానిది,) విడివడ్డ గతిన్ = జాఱిపడినట్లు (ఇతరులు తప్పింపరాని నిర్బంధము నుండి తప్పించుకొని,) తలపట్టి చూచుకొంచున్ = (తలపైనుండు పెద్దబరువు దిగిపోయిన పిదప, నా బాధ తగ్గుటకై చేతితోఁ దల తడవుకొనుట లోకస్వభావము.) అక్లే యేమి చేయుటాయను పెద్ద యాలోచన భారము తొలఁగెఁ గదా యని యుపశమిల్లుచు, పెనుచేటు పెద్దగండము, తప్పెను ఇప్పటికి తప్పిపోయినది, అనుచున్ = ఒకరితో నొకరు చెప్పికొనుచు, దివికిన్ = స్వర్గమునకు, ఒయ్యనొయ్యనన్ = మెల్లమెల్లగా, ఏఁగితిమి = వెళ్లితిమి.

ఇందు - పులి నోటికండవిడివడుట (= అసాధ్యము సాధ్యమగుట), తలపట్టి చూచుకొనుట-అనునవి లోకోక్తులు. కాన

అలం:—లోకోక్తి.

చ. అడరి మదోద్ధతత్వమున నద్దనుజుం డెప్పు డేమఱించి పైఁ
బడునొ యెఱుంగరాదు సురపట్టనరాజ్యసుఖాశ యేర్పడన్
విడిచితి నింక నీవు తల నిండఁగ నర్ఘము వోసి తేని నే
నడుగటు పెట్టఁగా వెఱతు నచ్యుత నిన్ను నె కొల్చి యుండెదన్. 92

అర్థము:—అద్దనుజుండు = ఆరాక్షసుఁడు (వజ్రనాభుఁడు), మద+ఉద్ధతత్వమునన్ = గర్వముచేఁ గలిగిన మిట్టిపాటుచేత, అడరి = చెలరేఁగి, ఎప్పుడు = ఏసమయమునందు, ఏమఱించి = నేను మఱచి యుండునట్లుచేసి, పైఁబడునో = మీఁదఁబడునో, దండయాత్ర సాగించునో, ఎఱుంగరాదు = తెలియ శక్యముగాదు. సురపట్టనరాజ్య = స్వర్గరాజ్యమువలని, సుఖ=సౌఖ్యమందలి, ఆశ = కోరిక, ఏర్పడన్ = స్థిరముగా, విడిచితిన్ = విడిచివేసితిని, ఇంకన్ = ఈపైని, నీవు, తలనిండగన్ = తలమునుఁగునట్లు, అర్థము = ధనము, పోసితి+ఏనిన్ = పోసినప్పటికిని, (నాయెత్తుధనము పోసినను సరే అని భావము) నేను = నాయంతటి నేను, అడుగు+అటు పెట్టఁగాన్ = ఆవైపునకు వెళ్లుటకై, వెఱతున్ = భయపడు చున్నాను. అచ్యుత = కృష్ణా! నిన్నున్ + ఎ = నిన్నే, కొల్చియుండెదన్=ఆశ్రయించి యుండెదను.

తాత్పర్యము:—వాఁడు మనపైకి దండెత్తి రాఁడుగదా యని పరాకున నుండునట్లు నటించుచునే గర్వాతిశయముచే చెలరేఁగి ఏసమయమున మీఁదఁబడునో తెలియదు. స్వర్గరాజ్యము ననుభవింపవలె ననుకోరిక స్థిరముగా వదలుకొన్నాను. ఇంక నాయెత్తుధనము పోసినను నే నాస్వర్గమున కేఁగను. అచ్యుత! నీవు నాశనము లేనిపరబ్రహ్మవు. కాన ధర్మార్థకామములకు వజ్రనాభుఁడు హాని కలిగించినను, నిన్నునే సర్వదా సేవించి మోక్షమును బొందుదును. నిన్నుఁ గొల్చుటకంటె స్వర్గరాజ్యసుఖ మెక్కుడు కాదని వ్యంగ్యము.

అలం:— కావ్యలింగము. పరికరాంకురము.

వి:—పోసితేని-అనఁగా పోయుదువేని-అని భవిష్యదర్థము. కాని భూతార్థముకాకున్నను భూత కాలిక క్రియాపదప్రయోగము విశేషము. సూ. చే దర్థయోగంబున ల్పట్టునకు లిట్టగు. అను బాల. క్రియా. 119 సూత్రమున "ఏని" అను చేదర్థముయొక్క యోగమున సిద్ధించినది. పోసితివి-అనుదానిలోని వకారము సూ. లిఙ్మధ్యమపురుషైకవచనమునకు... లిడ్డాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు-బాల. క్రియా. 24 చే లోపించి "పోసితి+ఇ" అయి, అపదాది స్వరసంధిచే 'పోసితి' అనురూపమై-పోసితి+ఏని-నిత్యసంధికాఁగా-పోసితేని అయినది.

వ. అనుటయుఁ గర్ణంబులు మూసికొని వాసుదేవుండు. 93

అర్థములు:—కర్ణములు = చెవులు, వాసుదేవుఁడు=వసుదేవపుత్రుఁడు, శ్రీకృష్ణుఁడు. (సుగమము.)

తాత్పర్యము:—మనుజుఁడై పుట్టుటచేఁ దనకుసేవ్యుఁడైన యింద్రుఁడు తన్నుఁ గొల్తునని కృష్ణునితో ననుట ధర్మవిరుద్ధము. కాన అట్టిమాట విన్నందులకు మనసునఁ బరితపించుచు, ఇంకను నట్టిపలుకులు వినవలసివచ్చునేమో యనుభయమున శ్రీకృష్ణుఁడు చెవులు మూసికొనెను.

క. మదిమఱపునఁ బాపము తన, కొదవుటయును బిదప వగచి యొకసగమును - నే, నిది సేయ నింక ననియెడు, మదిఁ బెఱసగ మైన నరుఁడు మలుఁగు నఘంబున్. భార. అర. 5-41 అని యీయర్థమునే తెలిపెడిని.

ఉ. పాడిఁ దొఱంగఁ జన్నె యొకపట్టునఁ గొల్చెద నంచు నెంత మా
టాడితి సర్వదైవతకులాధిప! యొడలు బండ్ల వచ్చు బం
డ్లోడల వచ్చు నొండొరుల కొక్కొకచో ననువైన తావులం
గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె యిత్తఱి నింత యేటికిన్. 94

అర్థము:—సర్వదైవతకులాధిప = ఎల్లదేవతలసముదాయములకును ప్రభువగు మహేంద్రా! ఒక పట్టునన్ = సామాన్యమగు విషయమున, లేక, అల్పమగు విషయమున ("ఒకశబ్దం బొకచోనల్పార్థకంబు నగు" ప్రౌఢ. శబ్ద. 84.) పాడి=న్యాయమును, తొఱంగన్+చన్నె=విడువఁదగునా? "కొల్చెదను=నిన్నుసేవిఁ

తును, అంచున్ = అనుచు, ఎంతమాట = ఎంతకూడనిమాట, అడితి = పల్కితివి, ఓడలు బండ్లవచ్చున్ = ఓడలకు కావలసిన ప్రమాణములు బండ్లమీఁద వచ్చును. బండ్లోడలవచ్చు = అట్లే బండ్లుగాని బండ్లకు వలయు భాగములుగాని యోడలమీఁదవచ్చును. (అనఁగా గొప్పవారి కొకప్పుడు కొద్దివారి సాయము కావలసివచ్చును. అట్లే కొద్ది వారికి గొప్పవారి సాయము కావలసివచ్చును. ఇది లోకస్వభావము - కావున "నన్ను సేవింప వచ్చినట్లు పల్కుట తగ దని భావము.) ఒక్కొకచోన్ = ఒక్కొక్కసమయమున, ఒండొరులకున్, అనువైనతావులన్ = వీలగు ప్రదేశములందు, కూడుట = కలిసికొనుట, ఇష్టబంధులకున్ = ప్రియమగు చుట్టములకు, క్రొత్తయె = నేఁడే వచ్చినదా ? (ఆప్త లగుబంధువులు పరస్పరము ననుకూలమగు స్థలములందు కలియుచుందురు. అంతమాత్రమునఁ జూడవచ్చినవారు తక్కువ యని కాని చూడఁబడువా రెక్కువ యని కాని యుండదు) - ఇత్తఱిన్ = ఈసమయమున, ఇంత = ఈసేవ్యసేవక భావము లెంచునంతటిమాట, ఏటికిన్ = ఎందులకు ? -

తాత్పర్యము:—మనుజుల కుపాసింపఁదగువారు దేవతలు. అట్టిదేవతల కెల్ల నుపాస్యుఁ డగు నీవు మనుజుఁడ నగునన్నుఁ గొల్చెద ననుట యధర్మము. ఉత్తము లల్పులను, అల్పు లుత్తముల నొకొకప్పు డాశ్రయింపవచ్చును. మన మిష్టబంధువులము. వెనుకటిజన్మమున నింద్రోపేంద్రులము. నేను నీతావునకు రావచ్చును. నీవు నాతావునకు రావచ్చును. ఇందు సేవ్యసేవకభావములేదు. కావున మహేంద్రా ! అటనుట తగదు.

అలం:— పరికరాంకురము, లోకోక్తి, అప్రస్తుతప్రశంస.

ఉ. ఎన్నఁగఁ దొల్లి యీకొలఁదియే బలురక్కసు లెంద లెంద అ
త్యున్నతిఁ గ్రొవ్వి త్రుళ్లరు బిడౌజ! తుదిం జెడిపోరె వాండ్రు, వీఁ
డు న్నిజనాశకాలము కడున్ నికటం బగుటన్ నలంగఁజే
సె న్నిను నింత సత్పురుషచిత్తము నొచ్చిన రిత్త వోవునే. 95

అర్థము:—బిడౌజ = ఇంద్రా, ఎన్నఁగన్ = పరిశీలింపఁగా, తొల్లి = పూర్వము, ఈకొలఁదియే = ఈవిధమే కాదా ? బలురక్కసులు = గొప్పరాక్షసులు, ఎందలెందఱు = అసంఖ్యాకులగు నెందఱుమంది, అత్యున్నతిన్ = మిక్కిలి గొప్పతనముచే, క్రొవ్వి = మదించి, త్రుళ్లరు = ఎగసిపడరు, ఎగసిపడి నారని భావము. వాండ్రు = అట్టివారు, తుదిన్ = చివరకు, చెడిపోరే = నశించిపోవలేదా ? వీఁడున్ = ఈ వజ్రనాభుఁడుగూడ, నిజనాశకాలము = తనయొక్క పోఁగాలము, కడున్ = మిక్కిలి, నికటంబు+అగుటన్ = సమీపించినదగుటయును, నినున్ = నిన్ను, ఇంత = ఇంతగా, నలంగఁజేసెన్ = బాధపడఁజేసెను, పీడించెను, సత్పురుషచిత్తము = ఉత్తముఁడగు మనుజుని మనస్సు, నొచ్చినన్ = బాధ పడినయెడల, రిత్త = వృథాగా, పోవునే = పోవదు అని భావము.

...యము:—దేవేంద్రా ! పరిశీలించినచో పూర్వమునుండియు నీవిధమేకదా కనఁబడుచున్నది, ఎంతమంది మహాసురులు గొప్పవారై మదించి యెగసి పడలేదు ? తుదకు నశింపలేదు ? అట్లే వీఁడును తన వినాశకాలము దాఁపురించియే నిన్నుఁ బరిభవించెను. మంచివాని మనస్సు క్షోభించినచో నది యూరక పోవదు, కావున నీమనఃక్షోభచే వాఁడు నశించితీఱును.

అలం:— అర్థాంతర న్యాసము.

మ. వసుదేవుం డిపు డధ్వరం బొకటి నిర్వర్తింప నుద్యుక్తమా
నసుఁ డైనాఁ డదియున్ ద్వాదశాబ్దమకదా ! నాకేశ ! యాకార్య మె
ప్డు సమాప్తం బగు నంతనుండియు వరప్రోల్లాసి నాదుష్టరా
క్షసు సాధించుటకుం బ్రయత్నము దగం గావింత మేకాగ్రతన్. 96

అర్థము:—ఇపుడు, వసుదేవుఁడు, ఒకటి, అధ్వరంబు = ఒకయాగమును, నిర్వర్తింపన్ = చేయుటకు, ఉద్యుక్తమానసుఁడు = పూనిన - సంకల్పించిన - మనస్సుగలవాఁడు, ఐనాఁడు, అదియున్ = ఆ యజ్ఞమును - త్వదర్థమకదా = నీ నిమిత్తమేకదా! నాకేశ = స్వర్గాధిపా! ఆ కార్యము = ఆ పని అనఁగా-క్రతువు, ఎప్డు = ఎప్పటికి, సమాప్తంబు= పూర్ణము, అగును, అంతనుండియున్ =నాటినుండియు, వరప్రోల్లాసిన్ = బ్రహ్మయిచ్చిన వరముచే సంతసించునట్టి, ఆ దుష్టరాక్షసున్ = దుర్మార్గుఁడగు నా వజ్రనాభుని, సాధించుటకున్ = గెలుచుటకు, తగన్ = ఉచితమగురీతిని, ఏకాగ్రతన్ = ఒక్కతలంపుతో, ప్రయత్నము, కావింతము = నీవును నేనును చేయుదము.

తాత్పర్యము:—ఇప్పుడు మాతండ్రి వసుదేవుఁ డొకయాగము చేయఁదలఁచెను. అది నీనిమిత్తమే కాన, నీవును నిరీక్షించి యుండవలెను. అది పూర్తి యయిన వెంటనే బ్రహ్మవరములచే సంతసించు నాదుష్ట దైత్యుని సాధించుటకు నీవును నేనును దగుయత్నము చేయుదము.

వి.:—నాక + ఈశ. గుణసంధి. ఎప్పుడు. రూ. ఎప్డు. అబ్బురాదులందుత్వంబునకు లోపంబు విభాష నగు. బాల. ప్రకీ. 19 చే ఎప్డు - సిద్ధించును. మఱియు ఎప్డు = ఎప్పటికి అనుటకు "కాలార్థ్యం బులం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు" అను బాల. కారక 25 సూత్ర మాధారము. "కావింతము" చువర్ణంబుతోడ దుద్ధకారంబు తకారం బగు" బాల. క్రియా. 108 చే "కావించుదుము" అనునది "కావింతుము" అగును. పిదప ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. బాల. క్రియా. 30 చే "కావింతము" అగును.

క. నీవు నుపాయాన్వేషము, గావించుచు నుండు మల్పకార్యం బది గా
దేవెరవునఁ దత్పురిఁ జొర, గావలయునొ యెవ్వ రోర్వఁ గలరో వానిన్. 97

అర్థము:—నీవును, ఉపాయాన్వేషణము = పన్నుగడయొక్క వెదకుటను, కావించుచునుండుము. (ఏ పన్నుగడచే శత్రువు వశుఁడగునో దానికై నీవును యత్నింపుము.) అది = అట్టియుపాయము కనిపెట్టుట, అల్పకార్యము = చిన్నపని, కాదు - ఏమనగా - తత్పురిన్ = వానిపట్టణమందు, ఏవెరవునన్ = ఎట్టి పన్నుగడచేత, చొరఁగావలయునో = ప్రవేశింపవలెనోకదా! ఎవ్వరు, వానిన్, ఓర్వఁగలరో = ఓడింపఁ గలరోకదా!

వ్యా. వి.:—ఓడుధాతువునకు ప్రేరణమున చుగాగమము. సూ.:—ఆ డోడు కూడుల డకారంబు నకుం జుక్కపరం బగునపుడు రేఫంబగు. బాల. క్రియా. 80.

వ. అని యింద్రు వీడ్కొలిపి, వేడ్క భాసిల్ల వాసుదేవుండు వసుదేవయజ్ఞనిర్వాహణ ధూర్వహుం డయ్యె నంత. 98

అర్థము:—వీడ్కొలిపి = పంపి, (వీడుకొనునట్లుచేసి) వాసుదేవుఁడు = శ్రీకృష్ణుఁడు, వేడ్క = ఉత్సాహము, భాసిల్లన్ = ప్రకటముకాఁగా, యజ్ఞనిర్వహణ = యజ్ఞముజరుపుటకై, ధూర్వహుఁడు = భారమువహించినవాఁడు.

సీ. నిఖిలదేశాయాత నృపతి భూషాకర్ష, రేణుసంపోషిత క్షోణికంబు
మహితావభృథలాభ మహిమధన్యత్వభా, గ్జలదర్శితాపూర్వ సౌష్ఠవంబు
వరమంత్రతంత్రహ వ్య ద్రవ్యసాద్గుణ్య, సంభృతానల నవోజ్జ్వల్యకంబు
సన్నుతసాన్నాయ్య సౌరభ్యసంపదా, ధ్యంభవిష్ణుప్రపూ తానిలంబు

గీ. హోమధూమానురంజిత ॥ ద్యోతలంబు, నగుచు వసుదేవునధ్వర ॥ మతిశయిల్లె
భవ్యలీల మహాభూత॥పంచకమున, కొక్కొకవిశేష మొసఁగుచు ॥ నొప్పుమీఱి.

అర్థము:—నిఖిలదేశ = ఎల్లదేశములనుండి, ఆయాత = వచ్చిన, నృపతి = రాజులయొక్క, భూషా = నగలయొక్క, కర్ష = రాపిడిచేఁగలిగిన, రేణు = ధూళులచే, సంపోషిత = వృద్ధిపొందింపఁబడిన, క్షోణికంబు = భూమిగలదియును, మహిత = పూజ్యమైన, అవభృథ = యజ్ఞదీక్షాంతమునఁ గర్మాంగముగాఁజేయు స్నానముయొక్క, లాభ = లభించుటచేఁగల్గిన, మహిమ = గొప్పదనముచేత, ధన్యత్వభాక్ = కృతార్థతనొందిన, జల = నీటిచేత, దర్శిత = చూపింపఁబడిన, అపూర్వ = మును పెన్నఁడులేని, స్వాస్థ్యంబు = నిర్మలత్వము గలదియును, వర = శ్రేష్ఠములగు, మంత్ర = దేవతాస్తుతిరూపమగు వేదభాగములయొక్కయు, తంత్ర = హోమాదిక్రియలయొక్కయు, హవ్యద్రవ్య = నేయిమొదలగు హోమార్థమైన వస్తువులయొక్కయు, సాద్గుణ్య = మంచిగుణములచేత - ఉత్తమత్వముచేత, సంభృత = సంపాదింపఁబడిన, అనల = అగ్నియొక్క, నవ+ఔజ్జ్వల్యకంబు = క్రొత్తదైన దీప్తికలదియును, సన్నుత = కొనియాడఁబడిన, శ్రేష్ఠమైన, సాన్నాయ్య = పాలును పెరుఁగును కలిపిన హోమద్రవ్యముయొక్క, సౌరభసంపత్ = పరిమళాతిశయముచే, ఆఢ్యంభవిష్ణు = పూర్ణమగునట్టిస్వభావముగల, ప్రపూతానిలంబు - మిగుల పావనమైన వాయువు గలదియును, హోమధూమ = హోమసంబంధమగు పొగలచే, అనురంజిత = రంగువేయఁబడిన, ద్యోతలంబు=ఆకాశము గలదియును - అగుచు, వసుదేవు నధ్వరంబు = వసుదేవుని యాగము (కర్త), మహాభూతపంచకమునకున్ = పృథివ్యప్తేజో వాయ్వాకాశము లను నైదుభూతములకును, భవ్యలీలన్ - శుభకరమగు క్రియచే, ఒక్కొక విశేషము, ఒసఁగుచున్ = ఇచ్చుచు, ఒప్పుమీఱి = ప్రకాశించి, అతిశయిల్లెన్ = సర్వోత్కృష్ట మయ్యెను.

అవభృథము - యజ్ఞాంతమందు ఎక్కువతక్కువలవలనఁ గల్గుదోషములను నివారించుటకు చేయు కర్మము.

"యజ్ఞేషు దేవా స్తిష్ఠంతి యజ్ఞే సర్వం ప్రతిష్ఠితం। యజ్ఞేన ధ్రియతే పృథ్వీ యజ్ఞ స్తారయతి ప్రజాః। అన్నేన భూతా జీవంతి పర్జన్యా దన్నసంభవః। పర్జన్యో జాయతే యజ్ఞాత్ సర్వం యజ్ఞమయం తతః - అని కాళికాపురాణము. యజ్ఞమున సర్వదేవత లుందురు. సర్వము యజ్ఞమునఁ గలదు. పృథివిని యజ్ఞము ధరించుచున్నది. యజ్ఞము ప్రజలను తరింపఁజేయును. అన్నముచే ప్రాణులు జీవింతురు. అన్నము పర్జన్యునివలనఁ గలుగును. యజ్ఞమువలన పర్జన్యుఁడు (మేఘుఁడు, లేక యింద్రుఁడు) కలుగును. కావున యజ్ఞము సర్వమయ మనఁబడుచున్నది." అను పురాణ వచనము ననుసరించి యజ్ఞ మవశ్యానుష్ఠేయ మనియు, జగదుపకారకమను ననుభావము ధ్వనింప - యజ్ఞమువలన నీపాంచభౌతిక జగత్తున కెట్టిపుష్టి కలుగుచున్నదో వసుదేవయాగవిధానవర్ణనమున నిరూపింపఁబడినది. ఎల్లదిక్కులనుండి వచ్చినరాజులు యజ్ఞప్రయోగమును జూడ నొండొరులను ద్రోసికొనుటలో రాలిన వారిభూషణములధూళిచే భూమియు, అవభృథస్నానమున కుపయుక్తమై జలమును, ప్రశస్తము లైన మంత్ర, తంత్ర, ద్రవ్యములయొక్క వినియోగముచే నపూర్వ మగు ప్రకాశము గలిగి యగ్నియును, పాలును పెరుఁగును గలిసిన ద్రవ్యముల హోమమునఁ గలుగు పరిమళముతో నిండి వాయువును, హోమధూమముచే నల్లనిరంగు హెచ్చునట్లు పూయఁబడి యాకాశమును, మెఱయునట్లు వసుదేవుని యాగము విరాజిల్లెను. జగత్తు పాంచభౌతికము కానఁ బంచభూతముల కొక్కొక్క విశేషము గల్గఁ జెప్పుటచే, జగదుపకారకమై యాయజ్ఞము ప్రవర్తిల్లె నని విశేషము.

వ్యా. వి. ఆఢ్యంభవిష్ణువు:—కర్తరి భువః ఖిష్ణుచ్ఖుకఞౌ. (3-2-57) ఆఢ్యాదిషు చ్వ్యర్థేష్వచ్వ్యంతేషు భవతేరేతౌ స్తః అను పాణినీయముచొప్పున ఆఢ్యసుభగాదిశబ్దములకు భూధాతువుపై ఖిష్ణుచ్ అను ప్రత్యయము, ముమాగమపూర్వకమైనది, రాఁగా "ఆఢ్యం భవిష్ణు" అని యగును. పిదప వువర్ణకము.

శా. అక్షయ్యం బగుపెంపు దాల్చును దపోయజ్ఞక్రియాదుల్ యదీ
యక్షేమంకరనామసంస్మరణపుణ్యావాప్తి నాపుండరీ
కాక్షుం డచ్యుతుఁ డాదిపూరుషుఁడు ప్రత్యక్షాకృతిం దానె సం
రక్షింపన్ బెనుపొందు యజ్ఞమునకున్ బ్రాశస్త్య మిం కే మనన్. 100

"తదీయక్షేమంకర" అనియు - "పుణ్యావాప్తి నాఁబుండరీకాక్షుండు" అనియు ముద్రిత పాఠము లందుఁ గనఁబడుచున్నది. కాని "యదీయ" ఆ పుండరీకాక్షుఁడు "అను యచ్ఛబ్దతచ్ఛబ్దాన్వయమందు సామంజస్యము కనఁబడుచుండుటచే అట్లే వ్యాఖ్య గావింపఁబడుచున్నది.

అర్థము :—యదీయ = ఏ పుండరీకాక్షుని సంబంధమగు, నామ = పేరియొక్క; సంస్మరణ = స్మరించుటవలని, పుణ్య = శ్రేయస్సుయొక్క, అవాప్తిన్ = బొందుటచే, తపోయజ్ఞక్రియాదుల్ = తపస్సుచేయుట, యజ్ఞముచేయుట మున్నగు కర్మములెల్లను, అక్షయ్యం బగుపెంపు = తఱుఁగని గొప్పఁదనమును, తాల్చును = వహించునో - "పుండరీకాక్ష" నామస్మరణము తోలుతఁజేసి, చేసినకర్మములు చిన్నవైనను గొప్పఫలము నిచ్చును అని భావము. ఆ పుండరీకాక్షుండు = అట్టిపుండరీకాక్ష నామముగల వాఁడును, అచ్యుతుఁడు = నాశరహితుఁడు, నగు ఆదిపూరుషుఁడు = జగదాది యగుపరమాత్ముఁడు, తానె, ప్రత్యక్షాకృతిన్ =కంటికిఁగోచరించు కృష్ణరూపముతో, (వచ్చి) సంరక్షింపన్ = ఎట్టిలోపమును రాకుండఁ గాపాడుచుండఁగా, పెనుపొందు = గొప్పతనమొందుచున్న, యజ్ఞమునకున్ = (వసుదేవుని) యజ్ఞముయొక్క, ప్రాశస్త్యము = ప్రశస్తి, ఇంకన్ = వేఱుఁగా, అనన్ = అనుటకు, ఏమి, కలదు. (లేదా) ఇంకన్ =ఇంకను, ఇంతకంటెను, ఏమి, అనన్- (వలయును అధ్యాహారము).

తాత్పర్యము:—పుండరీకాక్షుని నామస్మరణ పూర్వకముగాఁ జేసిన తపోయజ్ఞాదులన్నియు నక్షయపుణ్యఫలము నిచ్చుచుండఁగా - ప్రత్యక్షముగా కృష్ణస్వరూపమున నాపుండరీకాక్షుఁడే సంరక్షకుఁడై నడపు నాయజ్ఞప్రాశస్త్యమును గూర్చి ఎందులకుఁ జెప్పుట? ఆయజ్ఞమువలనఁ గలుగు పుణ్యము వాచాగోచర మని భావము. అలం. కావ్యార్థాపత్తి.

పుండరీకాక్షనామ మహిమ మిట్లు చెప్పఁబడుచున్నది. "అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోఽపివా, యః స్మరే త్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః." వామనపురాణము 33 అధ్యాయము. ఎవఁడు అపవిత్రుఁడైనను, పవిత్రుఁడైననుసరే! జాగ్రత్స్వప్నాద్యవస్థలం దెందైనను సరే పుండరీకాక్షుని స్మరించునో వాఁడు అంతశ్శుద్ధుఁడును, బహిశ్శుద్ధుఁడును గూడ నగును. మఱియు పుండరీకాక్షుఁ డన - తెల్లతామరలవంటి కన్నులుగలవాఁ డనునర్థము మాత్రమే కాక "పుండరీకం పరం ధామ నిత్య మక్షర మవ్యయం। తద్భావా త్పుండరీకాక్షో దస్యుత్రాసా జ్జనార్దనః" భార. ఉద్యో. 70 అధ్యా. 6 శ్లోకము, పుండరీకమన - నిత్యము, నక్షరము, నవ్యయమునగు పరంధామమనియు, తత్స్వరూపుఁ డగుటవలన - పుండరీకాక్షుఁడు" అనఁబడుననియుఁ గలదు. పుండరీకం అక్ష్ణోతి, వ్యాప్నోతి అని యాపక్షమున వ్యుత్పత్తి అని శబ్దకల్పద్రుమము.

వ్యా. వి. :—యజ్ఞమునకున్ = (యజ్ఞముయొక్క) శేషషష్ఠి, నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి అనుదానివంటిది. (లేక యజ్ఞమునకు - 'కలిగిన' అని అధ్యాహారముచేసికొనియేని అన్వయింపవచ్చును.)

వ. అది యట్లుండె నతండు యాగసమాప్తిసమయంబున సమస్తదేశాయాతు లైన బంధుమిత్త్రాదులం దత్తదర్హసంభావనలచేతం బ్రీతులం జేయుచున్నతఱి భద్రుం డను నటుం డచ్చటికి వచ్చి యత్యద్భుతం బగు నర్తనప్రవర్తనంబునం బరితోషంబు నొందించి సభాసదులైన మునులచేత వివిధంబులైన వరంబులును నితరులచేతం

పారితోషికంబు లైన యంబరాభరణముఖ్యంబులుఁ గైకొనుచు వారిని వేఱువేఱ
యనేకప్రకారంబులం బొగడుచుం బ్రవర్తిల్లుచున్నంత. 101

అర్థము :—అది = ఆయాగముసంగతి, అట్లు = ఆరీతిగా, ఉండెను - (ప్రకరణాంతరసూచనము) అతండు=శ్రీకృష్ణుఁడు, యాగసమాప్తిసమయంబున = ఆ యజ్ఞము ముగిసినయప్పుడు, సమస్తదేశ+ఆయాతులయిన = అన్ని దేశములనుండి వచ్చిన, బంధుమిత్ర+ఆదులన్ =చుట్టములు చెలికాండ్రు మొదలగువారిని, తత్తదర్హసంభావనలచేతన్ = వారివారికిఁ దగిన గౌరవములచేతను (సత్కారములచేతను), భద్రుండు + అనునటుండు = భద్రుఁడను పేరుగల యాటకాఁడు, అచ్చటికిన్ = ఆయజ్ఞవాటికకు, వచ్చి, అత్యద్భుతంబు= మిగుల వింతయగు, నర్తనప్రవర్తనంబునన్ = నాట్యక్రమములచేత, పరితోషంబున్ = సంతోసమును, ఒందించి = కలిగించి, మునులచేతన్ = ఋషులచే, వివిధములగు వరంబులును, ఇతరులచేతన్ = మిగిలినవారిచే, పారితోషికంబులును (పరితోషముచే నిచ్చునవి) = బహుమతులు, ఐన యంబరాభరణముఖ్యంబులును = అయిన శ్రేష్ఠమగు బట్టలను నగలను, కైకొనుచున్ = గ్రహించుచు, పడయుచు, వారిని = ఆ బహుమానము లిచ్చినవారిని, వేఱువేఱ = ప్రత్యేకముగా, పొగడుచున్, ప్రవర్తిల్లుచున్న + అంత = ఉండునంతలో,

తాత్పర్యము:—యాగము పూర్తియయ్యెను. శ్రీకృష్ణుఁడు యాగము చూడ నితరదేశములనుండి వచ్చినవారి నర్హరీతి సత్కరించుచున్న సమయమున భద్రుఁ డను నొకనటుఁ డచటికి వచ్చి తన యద్భుత నాట్యకళచే నందఱను సంతుష్టులఁ జేసెను. ఆసమయమున నచట నున్న మునులు వానికి పెక్కు వరము లిచ్చిరి. ఇతరులు వస్త్రములు నాభరణములును బహూకరించిరి. అవి గొని వాఁ డందఱను ప్రత్యేకముగా పొగడుచుండెను. ఆసమయమున—

చ. కలికిపిసాళినవ్వు లెసఁగఁగన్ వటుధూర్తులు గొంద ఱొండొరుం
దలకొన నెచ్చరించి తమదండపుఁగోలల నున్న మాఱుగో
చులు వెసఁ బుచ్చి పైచి కడుసొంపులు గాఁ బొగడించుకోఁ జుమీ
తలఁపఁగ నిప్పు డింత తెగుదారుల మైతిమి భద్ర నావుడున్. 102

అర్థములు:—కలికి = అందమైనట్టియు, పిసాళి = పరిహాసయుక్తములగు, నవ్వులు, ఎసఁగఁగన్ = కలుగునట్లు, వటుధూర్తులు = బ్రహ్మచారులందు కొంటెవాండ్రు (వంచకులు) కొందఱు, ఒండొరులన్ = ఒకరొకరిని, తలకొనన్ =మించునట్లు, ఎచ్చరించి = పురికొల్పుకొనుచు, తమదండపుఁగోలలన్ = బ్రహ్మచర్యమున దండముగా ధరింపఁ దగిన మోదుగుకఱ్ఱలయందు, (ఇటదండశబ్దము పారిభాషికము-బ్రాహ్మణునకు పాలాశదండము, క్షత్రియునకు పిప్పలదండము, విహితము, దండముపసంజ్ఞగల కఱ్ఱయని యిటనర్థము చెప్పుకోఁదగును) ఉన్న, మాఱుగోఁచులు = తాముధరించినవిగాక వేఱుగా దండములందుఁ గట్టియుంచుకొనిన కౌపీనములను, వెసన్ = వేగముగా, పుచ్చి = దండములనుండి విప్పి, పైచి = భద్రునిమీఁదికి విసరివేసి, భద్ర = ఓభద్రుఁడా, తలఁపఁగన్ = ఆలోచింపఁగా, కడున్ = మిగుల, సొంపులు = ఎక్కువ సొగసు (భృశార్థమున బహువచనము) కాన్ = కలుగునట్లు, పొగడించుకోన్ + చుమీ = నీచేత పొగడించుకొనుటకుఁజుమీ, ఇప్పుడు, ఇంతతెగుదారులము = ఇంతటి తెగువగలవారము (సాహసికులము అన్నమాట.) ఐతిమి, నావుడున్ = అని పల్కఁగా -

తాత్పర్యము:—కొందఱు కొంటెబ్రహ్మచారులు పరిహాసయుక్తమగుచక్కని నవ్వులతో, నొకరి నొకరు మించునట్లు పురికొల్పుకొనుచు, తమదండపుఁగోలలం దున్న వేఱుగోఁచులను విప్పి, యానటుని పైకి విసరివేసి ఓభద్రా మేమును నీచేత నందఱవలెనే పొగడించుకొనుటకే యింతగాఁ దెగించి యీ బహుమతి యిచ్చితిమి అని పల్కఁగా.

వ్యా. వి. :—పొగడించుకోన్ = పొగడించుకొనన్ = అను దాని రూపాంతము. "ముజ్జుపరంబగు నపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు. బాల. క్రియా. 60 సూత్రమునందలి బహుళగ్రహణముచే కో శబ్దమునకు అతిచారము కల్గుటచే నుజీ పరమైనను "కొను" న కాదేశముగా 'కో' శబ్దము వచ్చినది. ఇట్టివి యీ కవి ప్రయోగములందు ప్రచురములు. కలికి, పిసాళి = ఈ రెండు పదములును "నవ్వులు" అను పదమునకు విశేషణములు—"కలికిపిసాళి"యను నప్పుడు విశేషణోభయపదకర్మధారమై, పిదప "నవ్వులు"అను విశేష్యముతో సమసించును. అప్పుడు "కలికిపిసాళినవ్వులు - విశేషణ పూర్వపదకర్మధారయ మగుచున్నది.

తెగుదారి :—తెగువ + దారి. వృత్తియందు "వ" లోపించును - "దారి" శబ్దము 'ధారి' యను సంస్కృతశబ్దమునుండి పుట్టినది. కాన సంస్కృతమునందువలెనే కర్మవాచక మువపదముగా నున్నప్పుడే యిది ప్రయుక్త మగుచున్నది. జడదారి, మాయదారి, తెగుదారి - ఇత్యాది.

వటుధూర్తులు :—సప్తమీతత్పురుషము - కాని విశేష్యపూర్వపదకర్మధారయము కాదు, సూ. సప్తమీశౌండైః 2-1-40. అనుపాణినీయముచే- శౌండాది గణపఠితమగు "ధూర్త" శబ్దముతో సప్తమ్యంతమే సమసించును. కావున - వటువులందు + ధూర్తులు = అనియే గ్రహింపఁదగును.

దండపుఁగోలలు :—దండము, కోల - రెండును సమానార్థకములవలె భాసించును. కాని దండ శబ్దము - బ్రహ్మచారులు, సంన్యాసులు, కంచుకులు మున్నగువారు ధర్మముగా ధరించు "హస్తావలంబము" అనునర్థవిశేషము గలది. కోల "శబ్దము సామాన్యవాచకము. "చూతవృక్ష" శబ్దమువలె నిదియును సాధువు- "శిష్టతావ దనేన దండకాష్ఠేన కందర్పవ్యాధిం నాశయామి" అని శాకుంతలమునఁ గాళిదాసు. కాన 'దండము'అన 'కఱ్ఱ'మాత్రము గాక విశిష్టవాచకము అని తెలియఁదగును.

క. ఎలనవ్వాలయఁగ నాతఁడు, కలయఁగ నవి చుట్ట చుట్టి గంభీరపుఁ బే
రెలుఁ గొప్ప నోహోహో యని, పలుమఱు నెగురంగ వైచి పట్టుచు వేడ్కన్.

టీ. ము:— = భద్రుఁ డను పేరుగల యా నటుఁడు, ఎలనవ్వు = లేఁతనవ్వు (అనఁగా చిఱునవ్వు), ఒలయన్ = కలుగఁగా, (లేక ముఖమున వ్యాపింపఁగా) అవి = ఆగోఁచులను, కలయఁగన్= ఒండొంటితో కలిసిపోవునట్లు (ఏకమగునట్లు), చుట్టచుట్టి = వలయముగా మెలివెట్టి, గంభీరపుఁబేరెలుఁగు= మంద్రమగు పెద్దకంఠధ్వని, ఒప్పన్ = కలుగునట్లు, ఒహోహో, అని = అని పలికి, వేడ్కన్ = సంతోషముతో (లేక వినోదముగా), పలుమఱు = పెక్కుమాఱులు, ఎగురంగవైచి = పైకెగురవేసి, పట్టుచున్= క్రిందఁ బడకుండఁ బట్టుకొనుచు - పైపద్యముతో నన్వయము.

తాత్పర్యము:—సామాన్యముగా ఆటగాండ్రు తమవిద్యకు మెచ్చి ప్రేక్షకులు పారితోషికముగా నిచ్చువస్త్రాదికము లెల్లరకుఁ గనఁబడునట్లు పై కెగురవేయుచు ఓహో! యనుచు దాతలపేరు చెప్పుచు క్రిందఁ బడకుండ వానిని పట్టుకొనుచు పొగడుచుందురు. అట్లే, ఆభద్రుఁ డను నటుఁడు చిఱునవ్వుతో ఆగోఁచు లన్నియు కలిపి చుట్టగాఁజుట్టి ఓహోహో అని పెద్దగా పలుకుచు పై కెగురవేసి పట్టుకొనుచు, (ఇట్లు పొగడెను.)

అలం:- -స్వభావో_

వి. :—ఒహోహో, ఓహో+ఓహో - సూ. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగా నగు. బాల. సంధి. 10. చే 'ఓహోహో'! అగును. సూ. ఓ యారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు. బాల. ప్రకీర్ణ. 12 సూత్రమున "ఒహోహో" అగును. అట్లుకానిచో "ఒహో + ఓహో" ఆమ్రేడితము కామింజేసి సంధికి ప్రాప్తియేలేదు.

సీ. వేదసౌరభములు వెదచల్లఁగల శుచి, బ్రాహ్మణజాతి కోరకములార!
పరిశుద్ధి పెంపొందు బ్రహ్మవర్చసపావ,కస్ఫూర్జిత స్ఫులింగంబులార!
యరయ నట్టికసీలలంత లయ్యును బింక,మున బ్రహ్మశిఖ ముట్టుప్రోడలార!
దంటమాటలకు ధౌర్త్యమునకు నానతి,పడి పట్టినట్టి సత్ప్రాజ్ఞులార!

చిన్నవడుగులార వెన్నునివామన, త్వంబు నభినయించు తండ్రులార!
మీ ప్రసాద మిది సమృద్ధికారణము మా, కఖిలకార్యముల మహాత్ములార! 104

అర్థము:—వేదసౌరభములు = వేదములనెడు పరిమళములను, వెదచల్లఁగల = వ్యాపింపఁజేయఁగల, శుచి బ్రాహ్మణజాతి కోరకములార = పవిత్రమగు బ్రాహ్మణకుల మను జాజిచెట్లయొక్క మొగ్గలార! పరిశుద్ధి = పావనత్వము, పెంపొందు = హెచ్చగుచున్న, బ్రహ్మవర్చస = వేదముఁజదువుట మొదలగు వాని వలనఁగలుగు తేజస్సు అనెడు, పావక = అగ్నియొక్క, స్ఫూర్జిత = పెటపెట మనిధ్వనించు, స్ఫులింగములార = (అగ్ని) కణములార! అరయన్ = చూడఁగా, అట్టికసీల లంతలు, అటికలు తగిలించు కొన గోడలకు బిగించు కొయ్యమేకు (చిలుకకొయ్యలు) లంతపరిమాణముగలవారు, అనఁగా అల్పమగు దేహపరిమాణముగలవారు, అయ్యును, బింకమునన్ = ధైర్యముతో, బ్రహ్మశిఖన్ = బ్రహ్మయొక్క జుట్టును - వేదశిఖలగు నుపనిషత్తులను, ముట్టు = తాఁకినట్టి, ప్రోడలార = నేర్పరులార, దంటమాటలకున్ వక్రోక్తులకును, ధౌర్త్యమునకున్ = (వంచన) మోసమునకును, ఆనతిపడి = రాజశాసనమున కనువగు కొలత, పట్టినట్టి = సరిపడినట్టి - అనఁగా - ఏమియు హెచ్చుతగ్గులు లేక సరిపడు - సత్ప్రాజ్ఞులార = యోగ్యులగు పండితులార, చిన్నవడుగులార = లేఁబ్రాయపు బ్రహ్మచారులార, వెన్నుని వామనత్వంబు = విష్ణుని వామనావతారధర్మమును, అభినయించు = నటించునట్టి, తండ్రులార, ఇది, మీప్రసాదము = మీరను గ్రహముతో నిచ్చిన యీ గోఁచులచుట్ట, మహాత్ములార = విశాలహృదయులార! అఖిలకార్యములన్ = అన్నిపనులయందును, మాకున్, సమృద్ధికారణము = సంపదలకు హేతువు (అగును.)

తాత్పర్యము:—జాజిమొగ్గలు పరిమళమునువలె వేదవాఙ్మయమును సకలదిక్కుల వ్యాపింపఁజేయుచు, అగ్నినుండి పెటపెటమనుచు వెడలు నిప్పు కణములవలె, వేదము చదువుటవలనఁ గలిగిన పరమపవిత్ర మగు తేజస్సును చిమ్ముచు, అట్టికసీలలవలె నల్పప్రమాణ మగు నాకారము కలవారైనను, విద్యాపాటవమున బ్రహ్మయొక్క జుట్టునుగూడఁ బట్టుకొనుసాహసము కలిగి, వక్రోక్తులకును, మోసములకును పరిపూర్ణ స్థానము లగుచు, విష్ణుని వామనావతారమందలి మోసపుఁజర్యల నభినయించుచున్న యోచిన్న వయసుగల వటువులార! మీ రనుగ్రహముతో నిచ్చిన యీగోఁచులు మాకు నెట్టిపనియందును సంపత్కార మగును- అని స్తుతించెను.

అలంకారము:—రూపకము, శ్లేషము, విషమము.

వి. లేఁతవయసు గలవటువులు కావున జాజిమొగ్గలుగా చెప్పఁబడిరి. పవిత్రతకు తేజస్వితకు అగ్ని కణములుగా వర్ణింపఁబడిరి. వారి వేదవిద్యాపటిష్ఠత యెట్టి దనిన బ్రహ్మను జుట్టుపట్టుకొనఁ గల్గినట్టిది యనియు, ఉపనిషదర్థముల వశపఱుచుకొన్న దనియు చమత్కరింపఁబడెను. అంగడివీథియందు కొలపాత్రలు తూనికరాలు హెచ్చుతగ్గులులేకుండ రాజు శాసింపవలెనని ధర్మశాస్త్రము. వక్రోక్తులకును, మోసమునకును ఆనతిపడి పట్టుటయనఁగా - రాజాజ్ఞచే హెచ్చుతగ్గులు లేని కొలతపాత్రలుగా నగుదు రని చమత్కారము. వక్రోక్తులును వంచనలు వీరియందు పరిపూర్ణముగాఁ గల వని భావము. వెన్నుఁడు వామనత్వమున బలిని వంచించినట్లు మీరును వంచనచేయఁగల రని ధ్వని. వామనుఁడైన విష్ణువు మూఁడులోకము లాక్రమించినట్లు మీరును జగద్విదిత పాండిత్యము గలవా రని ధ్వని.

అట్టికసీలలు = వంట కుపయోగించుకుండలను గోడలయందు బిగించిన కొయ్యమేకులకుఁ దగిలించు టాచారము. పూర్వమాసీలలను విలాసార్థము చిలుకలయు, మనుజులయాకారమునను నిర్మించి గోడలకుబిగించు

కొనువారు. అందు కుండలు జాఱిపోకుండ ఆసీల తెక్కలువిచ్చి మెడమలఁచికొనిన చిలుకయాకృతితో హెచ్చుగా నుండుటచేఁ గావచ్చును. ఆసీలలకు చిలుకకొయ్యలు, చిలుకకట్టులు అనుసంజ్ఞ కల్గియుండును. ప్రకృతమున మనుజాకారము గల అట్టికసీలలవలె అల్పప్రమాణముతో వటువు లుండుటవలన "అట్టిక సీలలంతలు" అని ప్రయోగింపఁబడి, యుచితముగ నున్నది.

వ. అని పొగడిన నవ్వి యవ్వటువులు దుండగమున. 105

సుగమము:—

ఆ. వె. ఓరి యాటకాఁడ ! యీరీతియఱపులా, పొగడు టనఁగ మెచ్చు ! పుట్ట దిందు
మగుడఁ బుచ్చుకొనఁగఁ ! దగదు నీ వంటిన, గోఁచు లిపుడు పుచ్చుకొనక చనము.

అర్థము:—ఓరి యాటకాఁడ=ఓరీ నటుఁడా (ఆట యంచనఁగ నాట్యంబొప్పు.' ఆం.భా. నాట్య. 130) పొగడుట, అనఁగన్, ఈరీతి యఱపులా = ఇట్టి పెద్దకేకలా ? ఇందున్ = ఈనీయఱపులలో, మెచ్చు పుట్టదు = స్తుతియేలేదు. (లేక మామనస్సులకు సంతసము కలుగలేదు.) నీవు, అంటినగోఁచులు = ముట్టు కొనిన గోఁచులు, మగుడన్ = మరల, పుచ్చుకొనఁదగదు, కాని - ఇపుడు, పుచ్చుకొనక = నీవలన గోఁచు లను పుచ్చుకొనక, చనము = వెళ్లము. అని దుండగమున ననిరి.

తా. ఓరి నటుఁడా ! పొగడు టనఁగా నిట్టియఱపులా ? దీనియందు మెప్పేమి కలదు ? కావున మా గోఁచులు మాకు నిమ్మనుటకు నీవు ముట్టుకొన్నవి మాకు ముట్టఁ దగదు. అయినను నీవలన క్రొత్తగా గోఁచులను పుచ్చుకొనక మేము వెడలము. అని దుండగమునఁ బల్కిరి.

వ. అనుచుఁ దలంగిపోక యిట్టు నట్టుం జుట్టు మెట్టాడు చిట్టివడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదుర నదలించుచుం దనమేళగాండ్ర నాలోకించి యిబ్బాలకులు మన వాలకపు సొమ్ములందు నేమేనియు నపహరించుటకు నట్టాడుచున్నవారు మీర లీ ముచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని యుండుఁ డనుటయు నుదరిపడుచు నప్పడుచులు గడుసుఁదనంబున నతని నధిక్షేపించి,

అర్థము:—అనుచున్, తలంగిపోక=తొలఁగిపోవక, ఇట్టునట్టున్=ఇటునటు, చుట్టున్, మెట్టాడు = (మెట్టు ఆడు శ. ప.) చిందులు త్రొక్కునట్టి, చిట్టివడుగులన్ = కుఱ్ఱలగు బ్రహ్మచారులను - ఆనట్టు = ఆనటుఁడు, నగవున్ = నవ్వును, కోపంబున్, కదురన్ = (తనకు) కలుగఁగా, అదలించుచున్ = బెదిరించుచు, తనమేళగాండ్రన్ = తన నటసంఘము వారిని, ఆలోకించి = చూచి, ఇబ్బాలకులు = ఈ పసివాండ్రు, మన వాలకపు సొమ్ములందున్ = వేషము వేసికొనుట కుపయోగించు మన వస్తువులందు, ఏమేనియున్ = ఏవస్తువైనను, అపహరించుటకున్ = దొంగిలించుటకు, అట్టాడుచున్నవారు = సమీపమునఁ దిరుగుచున్నారు (చుట్టు చుట్టు తిరుగుచున్నారు.) మీరలు, ఎచ్చరికన్=జాగ్రత్తతో, ఈ ముచ్చులన్ = ఈ దొంగలను, కనుపెట్టుకొని = కాచికొని, ఉండుఁడు, అనుటయున్ = అనగా, అప్పడుచులు = ఆ బాలకులు, ఉదరిపడుచున్ = (హఠాత్సంభవములైన క్రోధాదులచే) ఉలికి పడుచు, గడుసుఁదనంబునన్ = ధార్ష్ట్యముచే (దిట్టతనముచే), అతనిన్ = ఆభద్రుని (నటుని), అధిక్షేపించి = తిరస్కరించి.

తాత్పర్యము:—అనుచు వెడలిపోవక యిటునటు చుట్టుకొని యావటువులు చిందులుత్రొక్కుచుండ, నవ్వును కోపమును రాఁగా ఆనటుఁడు వారిని సమీపమునకు రాకుండ బెదరించుచు, తన మేళమువారితో మనవేషము వేసికొను వస్తువులలో నేదైనను వీరు దొంగిలింతురేమో జాగ్రత్తగ చూచుచుండుఁ డనఁగా - ఆబాలురు కోపముచే త్రుళ్లిపడి, యానటుని దిరస్కరించి - పై పద్యముతో నన్వయము.

వ్యా. వి. :— మేళము + కలవాఁడు - సూ. కా, క్షత్రియ వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతు బర్థంబునం దాటాదుల కగు. బాల. తద్ధిత. 11 - (మేళ + కా) సూ. కాక్షత్రియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి. తద్ధిత. 12 - "మేళగా" అని ప్రాతిపదికము, సూ. కా ప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘురేఫంబునకు గుంగు బిందుపూర్వకడకారంబు నగు- బాల. ఆచ్ఛిక. 7. చే - మేళగాలు, మేళగాండ్రు. అగును, "కనుపెట్టు" = కాచు, "కనిపట్టు" = కనుఁగొను, తెలిసికొను, "కనుపట్టు" = కనఁబడు, - అను మూఁడుధాతువుల వర్ణక్రమ భేదము సూక్ష్మమై భ్రాంతి కలిగించు చుండును.

సీ. ఏము ముచ్చులమె యూహింప ముచ్చుఁదనాల, పుట్టినయిండ్లు మీబోంట్లె కాక
యాటవాండ్రని నమ్మి యనుమతింపఁగ నెట్టి, పుర మైన నశ్రమంబునను జొచ్చి
పగ లెల్ల నాటల భ్రమయించుచును సందు, గొందు లెల్ల నెఱింగికొనుచు రేలు
కన్నగాండ్రగుచు నగళ్లు ప్రవేశించి, యందు నెంతటివార లడ్డ మైనఁ

ఆ. జక్కడఁచుచుఁ బేనుగ్రుక్కినపాటిగా, నిష్టమైన యర్థమెల్లఁ బడసి
బ్రతుకుచునికి మీస్వభావ మింతయును దప్పదు యథార్థ మనుచుఁ బలుకుటయును.

అర్థము:— ఊహింపన్ = ఆలోచింపఁగా, ముచ్చుఁదనాల పుట్టినయిండ్లు = దొంగతనములకు జన్మస్థానములు, మీ బోంట్లె కాక = మీవంటివారే కాని, ఏము = మేము, ముచ్చులమె = దొంగలమా, ఆటవాండ్రు = నటులు (గదా) అని, నమ్మి = విశ్వసించి, అనుమతింపఁగన్ = అంగీకరింపఁగా, ఎట్టిపురము + ఐనను = ఎటువంటి చొరరాని నగరమంతైనను, అశ్రమంబునను = శ్రమలేకుండ, చొచ్చి = ప్రవేశించి, పగలు, ఎల్లన్, ఆటలన్ = నాట్యములచేత, భ్రమయించుచును = భ్రాంతిగలిగించుచు, సందుగొందులు + ఎల్లన్ = ఇఱుకటపుఁద్రోవలు, మూలమూలలు - అనఁగా రహస్యస్థలము లన్నియు, ఎఱింగికొనుచున్ = తెలిసికొనుచు, రేలు = రాత్రులందు, కన్నగాండ్రు = కన్నము వేసి దొంగిలించు దొంగలు, అగుచున్, నగళ్లు = అంతఃపురములందు, ప్రవేశించి, అందున్ = అచట, ఎంతటివారలు = ఎంత బలవంతులు, అడ్డము + ఐనన్ = అడ్డువచ్చినను, పేనుగ్రుక్కిన పాటిగన్ = నిర్లక్ష్యముగాను నిశ్శబ్దముగాను పేనిని చంపినట్లుగా, చక్కడఁచుచున్ = చంపివేయుచు, ఇష్టమైన = కోరఁబడినదగు, అర్థము + ఎల్లన్ = ధన మంతయును, పడసి = సంపాదించుకొని, బ్రతుకుచున్ + ఉనికి = బ్రతుకుచుండుట, మీస్వభావము, ఇంతయును = మా పలికినవానిలో రవంతయును, తప్పదు = బొంకుగాదు, యథార్థము, అనుచున్, పలుకుట యును = పలుకగా.

తాత్పర్యము:— మీరే దొంగలు కాని మేము దొంగలమా ? మీ స్వభావము మే మెఱుఁగనిది గాదు. ఆటవాండ్రుగదా యని మిమ్ము నమ్మి రావింప నెట్టిచొరరాని నగర మైనను జొచ్చి, పగలు నటనములచేత వీరు నీతిమంతు లనిన ట్లందఱ నమ్మించి, రహస్యపుఁద్రోవ లన్నియుఁ దెలిసికొని రాత్రులందు అంతఃపురము లలో ప్రవేశించి, ఎంతబలవంతు లడ్డము వచ్చినను, పేను గ్రుక్కినరీతి వారిని చంపివేసి కావలసిన ధనము నెత్తుకొనిపోయి బ్రతుకుచుందురు. మా మాట రవంతయు నబద్ధము గాదు. వాస్తవము అని పలుకుటయును. (మీఁదిపద్యముతో నన్వయము.) ఇందు శుచిముఖి మాటచొప్పున భద్రునిరూపముతో ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుని నమ్మించి, పగలెల్ల నాట్యము ప్రదర్శించుచు సురంగమునుండి ప్రభావతి యంతిపురము చొచ్చి యామెతో నిష్టోపభోగంబు లనుభవించుచు, తెలిసినపిదప వజ్రనాభుని జంపివైచుట గల్గిన వింత భావికథ యంతయు వటువుల మాటలందు సూచింపఁబడినది. తమ్ము దొంగలనుటచే నీవే దొంగవని యా నటుని నధిక్షేపించుటకు కన్నగాండ్రయి యంతిపురములు చొచ్చి యడ్డువచ్చినవారిని చంపి, వలసిన ధనము లను దొంగిలింతురను నాశయముతో వటువులు పల్కిరి. కాని కృష్ణున కది యుపశ్రుతియైనది.

వి. :—ప్రుచ్చుఁదనాలు - (ప్రుచ్చు + తనములు) సూ. ఉదంతస్త్రీ సమంబులకును, బుంపులకును, నదంత గుణవాచకంబులకును దనంబు పరం బగునపుడు నుగాగమం బగు. బాల. సంధి 34. ప్రుచ్చు + ను + తనములు - ప్రుచ్చుఁదనములు - అయి, సూ. లు, ల, న - లు పరంబగునపు డొకానొకచో ముగాగమంబు నకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు. బాల. తత్సమ. 43 చే - ప్రుచ్చుఁదనాలు అని యగును.

న + శ్రమము—అశ్రమము. ఇట నఞ్ఞునకు అభావ మర్థము, "శ్రమలేమి" అనియే కాని శ్రమ కానిది యని యర్థము కాదు. పగలు = పగటియందు, రేలు = రాత్రులయందు, నగళ్లు=నగళ్లయందు. పురము = పురమందు. అను వీనికి సప్తమ్యర్థమునఁ బ్రథమ. సూ. కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు. బాల. కారక. 25.

మ. వనజాక్షుం డపు డింద్రకార్యముదెసన్ వర్తిల్లు చిత్తంబుతో
నరికిన్ వజ్రపురంబుఁ జొచ్చుట కుపాయాన్వేషియై యున్కిఁజే
సి నిజాపేక్షకు నుత్తరంబుగ గ్రహించెన్ "విప్రవాక్యం జనా
ర్దన" యన్మాట యథార్థమై పరఁగఁ దద్వాక్యక్రమం బంతయున్. 169

అర్థము:—అపుడు, వనజాక్షుఁడు = తామరలవంటి కన్నులుగలవాఁడు, శ్రీకృష్ణుఁడు, ఇంద్ర కార్యము దెసన్ = ఇంద్రుని పనియగు వజ్రనాభునివధ విషయమున, వర్తిల్లు = ఆలోచించుచున్న, చిత్తంబుతోన్ = మనస్సుతో, అనికిన్ = యుద్ధముచేయుటకు, వజ్రపురంబునందు, చొచ్చుటకున్ = ప్రవేశించుకొఱకు, ఉపాయ + అన్వేషి = సాధన మార్గమును వెదకుచున్నవాఁడు, ఐ యున్కిఁజేసి = అయి యుండుటచేత, విప్రవాక్యం జనార్దన-యన్మాట = అనుకూలమగు బ్రాహ్మణ వాక్యమును జనార్దనుఁడు కార్యసాధక మగునని ప్రశంసించె ననెడిమాట, యథార్థమై = సత్యమగు నర్థముగలదై, పరఁగన్ = ఒప్పునట్లు, తద్వాక్యక్రమంబు = ఆ బ్రాహ్మణ వటువుల మాటల వరుసను, అంతయున్ = సర్వమును, నిజాపేక్షకున్ = తన తలఁపునకు, ఉత్తరంబుగన్ = సమాధానముగ, గ్రహించెన్ = కైకొనెను.

"ఉపశ్శశంస గార్గ్యస్తు శకునంతు బృహస్పతిః । మనోజవంతు మాండవ్యో విప్రవాక్యం జనార్దనః" ఏదే నొకకార్యమునకుఁ బోవునపుడు గార్గ్యుఁడు వేకువజామును, బృహస్పతి శకునమును, మాండవ్యుఁడు మనోనిశ్చయమును, జనార్దనుఁ డనుకూల మగుబ్రాహ్మణ వచనమును కార్యసాధకము లగు నిమిత్తములుగా ప్రశంసించిరి. "అని సూక్తి గలదు."

తాత్పర్యము:—శ్రీకృష్ణుఁడు భద్రుని ధిక్కరించి విప్రవటువులు నిందించునపుడు, దేవేంద్రునిపని యెట్లు జరుగును ? వజ్రపురము చొచ్చుట కుపాయ మేమా" యని యనుకొను చుండెను. "వేసగాండ్రు పగలు వేసములు వేసి రహస్యములను కనుఁగొని రాత్రి అంతఃపురములకు సైతము పోయి యడ్డువచ్చినవారిని హతమార్చి దొంగతనము చేయుదు రనుబ్రాహ్మణబాలుర మాటలలోఁ దనకుఁ గావలసిన యుపాయము దొరకుటఁజేసి తాను జనార్దనుఁ డగుటయు, పలికినవారు విప్రు లగుటయుఁ "విప్రవాక్యం జనార్దన"యను మాట సరిగాఁ దనయందు లక్ష్యసమన్విత మగునట్లు కృష్ణుఁడు ప్రవర్తింప నిశ్చయించుకొనెను.

వ. ఇవ్విధంబున విశ్వంభరుండు వటువచనంబు లుపశ్రుతిగం జేకొని తదనుసారంబున వజ్రపుర ప్రవేశంబును వజ్రనాభ వినాశంబును నతిసుకరంబులుగా మనంబున నిశ్చయించుకొని తత్ప్రయోజనంబునకు నరుగ నర్హుం డెవ్వఁడొకో యను విచారంబునం బ్రవర్తిల్లె నటమున్న యమరనాయకుండు దనుజాపాయంబునకు

నుపాయంబు భావించి దేవశైవలినీ విహార మహారస తరంగి తాంతరంగంబు లగు
చక్రాంగంబుల రావించి సగౌరవంబుగా నిట్లనియె. 110

అర్థము:—ఈ+విధంబునన్, విశ్వంభరుండు = శ్రీకృష్ణుఁడు, (విశ్వమును భరించువాఁడు. సంజ్ఞాయాం భృ, తృ, వృజ, ధారి, సహి, తపి, దమః అను సూత్రమున ఖచ్ ప్రత్యయమురాఁగా ముమాగమము, వచ్చి - విశ్వంభరుఁడు"అని సిద్ధించును.) వటువచనంబులు = బ్రహ్మచారులమాటలు, ఉపశ్రుతి+కాన్ = ఉపశ్రుతి వాక్యమగునట్లు (ఉపశ్రుతియనఁగా - ఏదేనొకపనిచేయఁ దలఁచినవారు, ఆపని యగుటయో కాకపోవుటయో నిశ్చయించుకొనుటకై యొకసుజనుని యింటిపంచకుంబోయి, కులదేవతలకునమస్కరించి, యింటివారికిం దెలియకుండ నాయింటిపయిని పుష్పాలు నక్షతలుంజల్లి యప్పటి యాయింటివారి పల్కులాలించుట. ఇచ్చట తలఁచినపని యగుటను, కాకపోవుటను సూచించు నితరుల సంభాషణమును వినుట యని మాత్రమే గ్రహింపఁదగును. "నక్తం నిర్గమ్య యత్కించి చ్ఛుభాశుభకరం వచః। శ్రూయతే తద్విదు ర్ధీరా దైవప్రశ్న ముపశ్రుతిం" (అని హారావళి.) చేకొని = గ్రహించి, తత్+అనుసారంబునన్ = దాని ప్రకారముగా, వజ్రపుర ప్రవేశమును = వజ్రపురమునఁ జొచ్చుటయును, వజ్రనాభ వినాశంబును = వజ్రనాభునియొక్క చావును, అతిసుకరంబులు + కాన్ = మిగుల సులభముగా చేయఁదగినవిగా, నిశ్చయించుకొని, తత్ప్రయోజనంబునకున్ = ఆపనికి, అరుగన్, అర్హుండు, ఎవ్వండొకో, యనువిచారంబునన్ = అను నాలోచనతో, ప్రవర్తిల్లెను = ఉండెను.

అటమున్న + అ = అంతకుముందే, అమరనాయకుండు = దేవతాప్రభువగు నింద్రుఁడు, దనుజ+అపాయంబునకున్ = రాక్షసుఁడగు వజ్రనాభునియొక్క నాశమునకు, ఉపాయంబున్, భావించి = ఆలోచించి, దేవశైవలినీ ...... అంతరంగంబులు - దేవ = దేవతలయొక్క, శైవలినీ = నదియగు నాకాశగంగయందలి (శైవలము = నాఁచు, కలది, శైవలిని = నదియని వ్యుత్పత్తి.) విహార = కేళియందు, (కల) మహారస = ఎక్కువ రుచిచే (అనఁగా ప్రేమచే), తరంగిత = పుట్టిన తరంగములుగల (అనఁగా ఉప్పొంగుచున్న), అంతరంగంబులు = మనస్సుగలవి, అగు, చక్రాంగంబులన్ = హంసలను, రావించి, సగౌరవంబుగాన్ = మన్ననతోఁగూడికొన్న విధమున, ఇట్లు, అనియెన్.

తాత్పర్యము:— ఇట్లు కృష్ణుఁడావటువుల మాటలను దైవప్రమాణముగాఁ గైకొని, వజ్రపురమునఁ బ్రవేశించుట, వజ్రనాభసంహారమును, సులభసాధ్యములేయని నిశ్చయించుకొని దానికిఁ దగువాఁ డెవ్వఁడా యని చూచుచుండెను. అంతకు మునుపే యింద్రుఁడు రాక్షసుని చంపునుపాయ మాలోచించి, ఆకాశగంగయందు విహరించు హంసలను రప్పించి, వానితో నీరీతి ననెను.

తే. హంసవరులార ! మాకొక్క-యవసరంబు,గలిగి పిలిపించితిమి మీరు-గలుగుటకును,
ఫలము మీచేత నైనయీ-పని కొదవుట,గావున వినుఁడు వివరింతుఁ-దత్కార్యసరణి.

అర్థము:—హంసవరులార! = శ్రేష్ఠములగు నోయంచలార, మాకున్ = నాకు, (పూజ్యార్థమున బహువచనము) ఒక్క అవసరంబు = ఒకయావశ్యకమగుపని (ఈ యర్థము తెలుఁగుభాషయందుమాత్రము కనఁబడుచున్నది.) కలిగి, పిలిపించితిమి = (మిమ్ము) పిలువ నంపితిని, మీరు, కలుగుటకును = ఉన్నందులకు, ఫలము = లాభము - (ఏమియందురా అని అధ్యాహారము) మీచేతనైన = మీకు సాధ్యమైనట్టి, ఈ పనికిన్ = చెప్పఁబోవు పనికి, ఒదవుట = ఉపయోగించుటయే, కావునన్, కార్యసరణి = ఆపని నెఱవేఱుత్రోవ, వివరింతున్, వినుఁడు.

క. మము వజ్రనాభుఁ డనియెడు, నమరరిపుఁడు పఱచినట్టి - యాపాట్లు సమ
స్తము మీ రెఱుఁగుదురే కద, క్రమమున నవి చెప్ప నేల - ఖగవరులారా! 112

అర్థము:—ఖగవరులారా = పక్షిశ్రేష్ఠములారా (ఖగము - ఆకసమునఁబోవునది. వ్యు. ఇట సాభిప్రాయము.) వజ్రనాభుఁడు, అనియెడు = అనునట్టి, అమరరిపుఁడు = దేవతలకు విరోధి - రాక్షసుఁడు. మమున్ (ఇదియును పూజ్యార్థమున బహుత్వము. లేదా దేవతలనెల్లరను), పఱచినట్టి యాపాట్లు=పొందించినట్టి ఘోరమగు కష్టములు, సమస్తము = సర్వమును, మీరు, ఎఱుఁగుదురేకద, (కాన) అవి, క్రమమునన్= వరుసగా, (మరల) చెప్పన్+ఏల = చెప్పు టెందులకు ? అనఁగా తెలిసినదే మరలఁ జెప్పనక్కఱలేదు. అని భావము.

అలం. :—పరికరాంకురము.

వ్యా. వి. :—"పొందు, అనుభవించు" అను నర్థముగల "పడు" ధాతువునకు ప్రేరణమున చుగాగమము రాఁగా-సూ. పడునరుం జుక్కును డా కలఘురేఫంబు నగు. బాల. క్రియా. 82. చే డకారము నకు శకటరేఫము కలుగ 'పఱుచు' అని ఉన్మధ్యము కావలసియుండ, ఈ కవి "పఱచు" అని యీ యొక్కయెడనేకాక" భంగించి యితరకాంతదో,అంగుటతప్పో ? తడంబఱచి పురుషులకున్. అని కళా-7-225 లో యతిస్థానమున అన్మధ్యముగా ప్రయోగించియున్నాఁడు. "పాటు" సూ. టువర్ణకంబు పడ్వాదుల కగు, నగుచో నవి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు. బాల. కృదంత. 8 చే సిద్ధము.

ఆ. మాకు నిప్పుడు వాని * మర్దించుయత్నంబు,గలిగి యున్నయది ప్రకాశ మైన
నెగ్గు పుట్టుఁ గాన * నీరహస్యంబు, మీ మనసునందె పెట్టుకొనఁగవలయు. 113

అర్థము :—మాకున్, ఇపుడు, వానిన్, మర్దించుయత్నంబు =చంపెడి ఉద్యోగము, పూనిక, కలిగి యున్నయది = తటస్థించినది, ప్రకాశము + ఐనన్ = ఆయత్నము బయలుపడిన దైనచో, ఎగ్గు = హాని, పుట్టున్ = కలుగును,కానన్, ఈరహస్యంబు, మీమనసునందె, పెట్టుకొనఁగవలయున్ = దాఁపవలెను.

క. మాకంటె వాఁడు మునుపుగ, నేకార్యము సేయఁగలఁడో * యెఱుఁగము, మీరల్
జోకగఁ దత్పురి మెలఁగుచు, నా కే దొకపనికి వేగునడపఁగవలయున్. 114

అర్థము:— వాఁడు = ఆ వజ్రనాభుఁడు, మాకంటెన్, మునుపు + కాన్ = ముందుగనే, ఏ కార్యము = ఏమిపని, చేయఁగలఁడో = చేయునో, ఎఱుఁగము, మీరల్, తత్పురిన్ = వానినగరమందు, జోకగన్ = మెలఁకువతో, జాగ్రత్తగా, మెలఁగుచున్, నాకున్, ఏది + ఒకపనికిన్ = ఏదియో యొక రహస్యకార్యమునకు - (ఏది = ఏదియో - అనునర్థమున "ఓ" అను అనిర్ధారణమును తెలుపునవ్యయ మధ్యాహారము) వేగునడపఁగవలయున్ = శత్రురాజ్యమందలి విశేషములను రహస్యముగా కనిపెట్టిచెప్పుట జరుపవలెను.

చ. ప్రతిదివసంబు వానినగరంబునఁ బుట్టువిశేషముల్ భవ
న్మతిపస నన్నియుం దెలిసి * మా కెఱిఁగించుట మీప్రయోజనం
బితరులచేతఁ గా దిది,తదిష్టము లేక చొరంగరాదు మా
రుతమున కైనఁ దత్పుర మొకరుల్ చొరఁజాలమి చెప్ప నేటికిన్. 115

అర్థము:—భవన్మతిపసన్ = మీబుద్ధిసామర్థ్యముచేత, వానినగరంబునన్ = ఆ రాక్షసునియొక్క పట్టనమున, ప్రతిదివసంబు = దినదినమును, పుట్టువిశేషములు = కలుగునట్టివింతలు, అన్నియును, తెలిసి = తెలిసికొని, మాకున్, ఎఱిఁగించుట = తెలుపుట యే, మీప్రయోజనము = మీవలనజరుగవలసిన పని, ఇది = ఈ పని, ఇతరులచేతన్ = హంస లగుమీరు గాక లాఁతులచేత, కాదు = నెఱవేఱదు, తత్పురము =

ఆ పట్టణమునందు, తత్ + ఇష్టము = ఆ వజ్రనాభుని యనుమతి, లేక, మారుతమునకైనన్ = వాయువు నకునైనను, చొరంగరాదు = ప్రవేశింపశక్యముగాదు, (అట్టియెడ) ఒరుల్ = ఇతరులు, చొరఁజాలమి = ప్రవేశింపలేకపోవుట, చెప్పన్ = చెప్పుట, ఏటికిన్ = ఎందులకు.

తాత్పర్యము :—ఆ వజ్రనాభుని వజ్రపురమున దినదినము కలుగువిశేషములు మీ బుద్ధిశక్తిచేత రహస్యముగా గ్రహించి, యవి యన్నియును మీరు మాకు చెప్పుచుండవలెను. ఇదియే మీవలన మాకుఁ గావలసినపని. వాని యనుమతి లేకుండ గాలికూడ నా పురమునందుఁ బ్రవేశింప లే దన నితరులమాట యెందులకు ? అనఁగా ఎవ్వరికిని చొర రాదని భావము.

అలం. :—కావ్యార్థాపత్తి.

క. మీరాకపోక లింపు సు,రారాతికిఁ గేళిదీర్ఘికాడులకు నలం
కారములు మీవిహారము,లారయ నేరికి నతిప్రియంబులు గావే. ౧౧౬

అర్థము :—మీవిహారములు = మీ వినోదసంచారములు, కేళిదీర్ఘికాదులకున్ = క్రీడార్థమగు దిగుడుబావులు మున్నగువానికి, అలంకారములు = సొగసు గూర్చునవి(కాన), సురారాతికిన్ = దేవతలకు వైరియగు నా వజ్రనాభునకు, మీ రాకపోకలు = మీయొక్క వచ్చుట పోవుట, ఇంపు = ఇష్టము, సంతోషకరము-అగును, ఆరయన్ = ఆలోచింపఁగా - (మీవిహారములు) ఏరికిన్ = ఎవరికిని, అనఁగా అందఱకును, అతిప్రియంబులు = మిక్కిలియిష్టమైనవి, కావే = కావా ? మీవిహారము లెల్లవారికిని మిగులఁ బ్రీతికరము లనిభావము.

అలం. :—అర్థాంతరన్యాసము.

వ. అనుటయు నాపులోమజావల్లభునకు శుచిముఖీవల్లభుం డనుమరాళతల్లజుం డుల్లసిత వదనుం డగుచు నెదుర నిలిచి దేవా యీవేళ కా వజ్రనాభుండు ప్రాభవాభిమానం బునఁ గన్ను గానమిఁ దన్నుఁ దా నెఱుంగ కున్నవాఁడు నాకుఁ జూడ నిప్పటికిఁ గా దెప్పటికి నప్పరమతామసుం డింక నీవంకకుం గదలి రా నెఱుంగఁ డని తోఁచు చున్నయది యైనను దేవర దేవకార్యం బేమియు నేమఱ కుండునది యిది యంతయు నింతకుమున్ను వజ్రపురినుండి యేము గొందఱము వచ్చితిమి గానఁ గానంబడిన యర్థంబు విన్నవించితి నెంచిచూడ గించిదూనంబుగా వానిరాజ్య సంపదయుఁ దుదకు వచ్చినది యిది మదీయజాయవలన వినంబడియెఁ దద్విశేషం బును దానిచేత విన్నపంబు చేయించెద నని తనచెలువం బిలిపించి బలరిపుం గనిపించి నీవు నాకు వినిపించిన వజ్రనాభు రాజ్యావసానసామీప్యంబు స్వామికి నేమియుం గొఱంత వెట్టక విన్నవింపు మనుటయు నాశుచిముఖి శతమఖున కభిముఖియై యిట్లనియె. 117

అర్థము:—అనుటయున్ = అనిచెప్పఁగా, ఆపులోమజావల్లభునకున్ = పులోముని కూఁతురగు శచీదేవికి భర్తయగు నింద్రునకు, శుచిముఖీవల్లభుండు=శుచిముఖియను హంసికి భర్త, అను మరాళ తల్లజుఁడు = అని పిలువఁబడు హంసశ్రేష్ఠుఁడు, ఉల్లసితవదనుండు = వికసించిన మొగముగలవాఁడు, అగుచున్, నిలిచి, దేవా, ఈవేళకున్ = ఇప్పటికిని, ఆ వజ్రనాభుండు, ప్రాభవాభిమానంబునన్ = దొరతనమువలని గర్వముచేత, కన్ను గానమిన్ = అంధుఁ డగుటచే, తన్నుఁ దానెఱుంగక=ఒడలెఱుంగక,

స్మృతిదప్పి, ఉన్నవాఁడు, నాకున్, చూడన్ = ఆలోచింపఁగా, ఇప్పటికిన్ + కాదు = ఈనాఁటికే కాదు, ఎప్పటికిన్, అప్పరమతామసుఁడు = మిగులఁ దమోగుణముగల యావజ్రనాభుఁడు, (నిద్ర, ఆలస్యము, ప్రమాదము - తమోగుణము లని గీత.) ఇంకన్, నీవంకకున్, లేక - ఈవంకకున్ = స్వర్గము వైపునకు, కదలిరాన్ + ఎఱుంగఁడు = బయలుదేఱి రావలె నను స్మృతి లేకున్నవాఁడు, అని, తోఁచుచున్నయది, ఐనను, దేవర = ప్రభువువారు, దేవకార్యంబు = దేవతల రక్షణకార్యము, 'ఏమియును, ఏమఱక + ఉండునది = మఱవకుండవలెను, ఇది, అంతయును, ఇంతకుమున్న, వజ్రపురినుండి, ఏము, కొందఱము, వచ్చితిమి, కానన్, కానంబడిన యర్థంబు = గోచరించిన విషయము, (మీకు) విన్నవించితిని = మనవిచేసితిని, ఎంచిచూడన్ = బాగుగా నాలోచింపఁగా, వానిరాజ్యసంపదయున్ = వానియొక్క దొరతనపు హెచ్చును, కించిత్ + ఊనంబు + కాన్ = కొంచెము తక్కువగా, తుదకున్ = సమాప్తికి, వచ్చినది ( - వానిరాజ్యము కొలఁదికాలములో నంతము కావచ్చినది అని భావము.) ఇది = ఈసంగతి, మదీయజాయవలనన్ = నాపెండ్లాము వలన, వినంబడియెన్ = వినవచ్చెను (వింటిని అని భావము.) తద్విశేషంబును = ఆ విన్నదాని యతిశయమును, దానిచేతన్ = నాభార్యచేతనే, విన్నపంబు = మనవి, చేయించెదను, అని, తన చెలువన్ = తనభార్యను, పిలిపించి, బలరిపున్ = బలుఁడను రాక్షసునకు వైరి యగు నింద్రుని, కనిపించి = చూపి, నీవు, నాకున్, వినిపించిన, వజ్రనాభు, రాజ్య + అవసాన - సామీప్యంబు = రాజ్యముయొక్క సమాప్తియొక్క చేరువ, (రాజ్యనాశనము సమీపించుట యని భావము) స్వామికిన్ = ప్రభువగు నింద్రునకు, ఏమియున్ = కొంచెమును, కొఱంత పెట్టక = లోపింప నీయక, తగ్గింపక, (పూర్ణముగా నని భావము) విన్నవింపుము = మనవిచేయుము, అనుటయున్, ఆశుచిముఖి = శుచిముఖియను పేరిటి యా యాఁడుహంస, శతమఖునకున్ = (నూఱుయజ్ఞములుచేసిన) ఇంద్రునకు, అభిముఖియై = ఎదురుమొగముగలదియై, (ఎదుటనిలిచినదై యని భావము) ఇట్లు, అనియెను.

చ. తడవులఁబట్టి యేము సతతంబును బోదుము వానివీటికిన్
గడు మతి చాలమిం గడుపుకక్కుఱితిన్ సురలోకనాథ మా
యెడఁ గలయట్టి తప్పిది సహింపుము పక్షుల మాట నొక్కవెం
బడి నిది చెల్లెఁ గాక, రిపుప్రాంతము చేరెడువార లాప్తులే. 118

అర్థము:—సురలోకనాథ = (స్వర్గమునకు ప్రభువైన) మహేంద్రా! ఏము = మేము, తడవులఁ బట్టి = చిరకాలమునుండియు, (ఇదిజాతీయము), సతతంబును = ఎల్లప్పుడును, నిత్యమును, వానివీటికిన్ = వానిపురమునకు, వజ్రపురమునకు, మతి = బుద్ధి, కడున్, చాలమిన్ = మిక్కిలిలేకపోవుటచే, కడుపు కక్కుఱితిన్ = కడుపునిండించుకొను నాశతో, పోదుము = వెళ్లుచుందుము, మాయెడన్, కలయట్టితప్పు, ఇది = మావద్దనున్న తప్పు ఇదిసుమా, సహింపుము = (దీనిని) నీవోర్వవలెను, పక్షులము + ఔటన్, ఇది = ఈ శత్రుపురమునకు వెళ్లుట, ఒక్కవెంబడిన్ = ఒక విధముగా, చెల్లెన్ = చెల్లినది, కాక = కాని, రిపు ప్రాంతముచేరెడు వారలు = శత్రువుయొక్క సన్నిధికేఁగువారు, ఆప్తులే = విశ్వసింపఁదగువా రగుదురా ?- కా రని భావము.

తా. స్వర్గప్రభూ! బుద్ధిచాలక, కడుపుకక్కుర్తిచేత వజ్రనాభునిపురమునకు చిరకాలమునుండి నిత్యమును పోయి వచ్చుచుందుము. మాతప్పును నీవుమన్నింపవలెను. జ్ఞానశూన్యు లగు పక్షుల మగుటచే ఒక విధముగా మాకుఁ జెల్లవచ్చును. కాని శత్రుప్రాంతముల కేఁగువారు విశ్వాసపాత్రు లగుదురా ? కారు అని భావము.

అలం :—కావ్యలింగము, అర్థాంతరన్యాసము.

వ్యా. వి. :—పోదుము - పోవు + దు + ము. సూ. పోవునకు దుఙ్మత్తులు ముఙ్మం బరం బగునపుడు 'వు' లోపంబును, 'పొద, పద'లును విభాష నగు. బాల. క్రియా. 99 - చే "వు" లోపించినరూపము.

వీటికిన్ - వీడు శబ్దము ఔపవిభక్తిక మగాన టివర్ణం బంతాదేశమైన రూపము. కన్కుటితి - దీనికి తొలిరూపము. కన్కుటితి. సూ. "ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు. బాల. ప్రకీర్ణ. 11 - రిపుప్రాంతము. సాధ్యసమాసము. రిపుయొక్క ప్రాంతము - అని విగ్రహము.

వ. ఏమును బోక మానెద మని తలంతుమేని. 119

తాత్పర్యము :—మేము పోవకయుండ మనుకొన్న నీ క్రిందివిధ మగుబాధ మాకుఁ గలిగినది.

సీ. గగనస్రవంతిలోఁ గల సువర్ణాబ్జంబు, లందు మే లేర్చి తా నపహరించి,
మానసంబు శఠాత్ము మానసంబునుబోలె, నిస్సారసత్వంబు నెరయఁ జేసి
బిందుసరంబులోఁ గుందనంపుందమ్మి, పేరు లేకుండంగఁ బెల్లగించి
సౌగంధికాఖ్య కాసారంబు జలమాత్రశేషమై దీనతఁ జెందఁ జేసి
మఱియుఁ గలదివ్యసరసులు నెఱయఁ జెఱిచి, తనదు కేళీదీర్ఘికలందుఁ గనకనళిన
జాతు లెల్లనాటించినాఁ డాతఁ డింద్ర, యటు చనక మేఁత నడుచునే హంసములకు.

అర్థము :—ఇంద్ర, ఆతఁడు = ఆ వజ్రనాభుఁడు, గగనస్రవంతిలోన్ = ఆకాశగంగయందు, కల = ఉన్న, సువర్ణ + అబ్జంబులందున్ = బంగారు తామరలయందు, మేలు = మంచిరకము, తాను స్వయముగా, ఏర్చి = ఏఱి, అపహరించి = బలాత్కారముగాఁ తీసికొనిపోయియు,

మానసంబున్ = మానససరస్సును, శఠాత్ము = కుత్సితస్వభావము గలవానియొక్క, మానసంబునుబోలెన్ = మనస్సునువలె, నిస్సారసత్వంబు = సారసములు అనఁగా-తామరలు లేకుండుట, (అని సరస్సు పక్షమున) చేవయు, శాంతియు లేకుండుట - లేక, సారస్యము లేకపోవుట, నెరయన్ = వ్యాపించునట్లు, చేసి, చేవయు, శాంతియు లేనికుత్సితుని మనస్సువలెనే, మానస సరస్సును, సారసశూన్యమును-తామరలు లేనిదిగఁ జేసి యని భావము. అలం :— సభంగశ్లేషము.

బిందుసరంబులోన్ = బిందుసరము అను పేరుగల సరస్సులో - (బిందుసరశ్శబ్దము సకారాంతమని సూ. ని. లోఁ గలదు, సకారాంతమే యగుచో "బిందుసరస్సు"లో అనియుండఁదగును. సరశ్శబ్దము - పయఃప్రభృతులలోని దని బాల. తత్సమ. 80 - సూత్రముయొక్క వివరణమున, అంత్య సకారలోపము లేనట్లుకలదు. కాని ఘటికాచల మాహాత్మ్యము. 1. ఆశ్వాసమున "రసఝర భరంబు వొల్చు మానస సరంబు - అని అంత్యనియమముతోఁ గలదు' అని సూర్యప్రకాశిక తెలుపుచున్నది. ఇంకను బరిశీల్యము. కుందనంపుందమ్మి = బంగరు తామరయొక్క, పేరు, లేకుండన్ = నిశ్శేషముగా, పెల్లగించి = పెకలించివైచియు, సౌగంధికాఖ్యకాసారంబు = సౌగంధికమను పేరుగల సరస్సు, జలమాత్రశేషము = నీరే మిగులుగాఁ గలది, ఐ, దీనతన్ = దారిద్ర్యమును, చెందన్ = పొందునట్లుగా, చేసి = (పాడు) చేసియు, మఱియున్, కల దివ్యసరసులు = ఉన్నట్టి యుత్తమములైన సరస్సులను, నెఱయన్ + చెఱిచి = పూర్ణముగా పాడుచేసియు, కనకనళిన జాతులు = బంగరు తామర జాతులను, ఎల్లన్ = అన్నిటిని, తనదు కేళీదీర్ఘికలందున్ = తనయొక్క క్రీడార్థమగు దిగుడు బావులందు, నాటించినాఁడు = ప్రాఁతించెను, (కాన) హంసములకున్, మేఁత = తిండి, అటు = ఆ వజ్రపురమునకు, చనక = పోవక, నడచునే = జరుగునా ? జరుగ దని భావము.

వ్యా. వి.:- కుందనంపుందమ్మి - కుందనము+తమ్మి - సూ. "కర్మధారయంబులందు మువర్ణకమునకుఁ బుంపులగు "బాల. సంధి. 32 చే కుందనంపు+తమ్మి అయి. సూ." సమాసంబుల నుదంతస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబగునపుడు నుగాగమం బగు. బాల. సంధి. 25. చే నుగాగమమును ద్రుత కార్యములుగలిగి "కుందనంపుందమ్మి" అగును.

ఈ పద్యము కాళిదాస కృతకుమారసంభవములోని "మందాకిన్యాః పయఃశేషం దిగ్వారణమదావిలమ్, హేమాంభోరుహ సస్యానాం తద్వాప్యోధామ సాంప్రతమ్ 2. 44. శ్లోకముపైని పెంపకముగాఁ గనఁబడుచున్నది. తారకాసురుఁ డొక్క యాకాశగంగలోని పద్మములను నిశ్శేషముగాఁదెచ్చి తన బొడ్డనబావులలో నాటించెను. కాని వజ్రనాభుఁడు పై నాలుగు తావులే కాక సకలజలాశయములందలి పద్మములను దెచ్చి తన క్రీడాదీర్ఘికలందు నాటుటవలన హంసల కాహారశూన్యత కలిగెనని చెప్పుటచేత తారకునికంటెను వజ్రనాభుఁడు దుండగీఁ డని తెలియవచ్చు చున్నది.

వ. అది యట్లుండె, నట్లు వజ్రపురంబునం గలకొలంకులఁ దటాకంబులం గేళాకూళులఁ బొడ్డనబావుల నడ్డుపెట్టులేక విహరించుటకు వజ్రనాభుముదల యడిగి తజ్జలాశయంబు లన్నింటికి నస్మదీయ సంక్రీడనంబుకలిమి యలంకారం బగుట యెంచి యతం డంగీకరింప యథేష్ట విహరణంబుల నహరహంబునుం బ్రవర్తిల్లుచున్న యేము నిన్నఁ గన్యాకాంతఃపురంబున నొక్కసరోవరంబునం బరఁగుతఱి సామ్రాజ్యలక్ష్మి సాక్షాత్కారానుకారిణి యైన యొక్కకన్యకామణి తన చెలికత్తియతోడం దత్తటంబునం గ్రొత్తవిరిగుత్తి మొత్తంబుల నత్యంతంబు చెలువొందు గురివెంద పొదరింట నొంటి నుండి యవ్వాలుఁగంటితోడ. 121

అర్థము:—అది = మా వృత్తాంతము, అట్లు = ఆరీతిగా, ఉండెను. (ఈ వాక్యము ప్రకరణాంతరమునకు సూచకము) అట్లు = ఆవిధముగా, వజ్రపురంబునన్, గల = ఉన్నట్టి, కొలంకులన్ = చిన్న చెరువులందు, సరస్సులందును, తటాకంబులన్ = పెద్ద చెరువులందును, కేళాకూళులందున్ = క్రీడా సరస్సులందును, (కేళాకూళి, కేళకూళి, కేళకుళి, కెళాకూళి, కెళకూళి - అనియు రూపాంతరములు) బొడ్డనబావులన్ = (నడుమ చిన్ననూయిగల) కోనేళ్ళయందును, (ఈ యర్థమును శ. ర. ఇచ్చెను. కాని, దిగుటకై మెట్లుగల పెద్దబావి యని తోఁచుచున్నది.) అడ్డుపెట్టు = నిరోధము, లేక, విహరించుటకున్, వజ్రనాభున్, ముదల = అనుమతి, అడిగి, అస్మదీయ సంక్రీడనంబు = మా సంబంధమగు నాటయొక్క, కలిమి = కలుగుట, అలంకారంబు=ఆజలాశయములకు శోభకలిగించునది, అగుట, ఎంచి=భావించి,అతండు, అంగీకరింపన్, యథేష్ట విహరణంబులన్ = ఇష్టము వచ్చిన వేడుక సంచారములతో, అహరహంబునున్ = దినదినమును, ప్రతిదినమును, ప్రవర్తిల్లుచున్న=చరించుచున్న, ఏము = మేము, నిన్నన్, కన్యాకాంతఃపురంబునన్ =రాజకన్యలుండుప్రదేశమునందు, ఒక్క సరోవరంబునన్ = ఒకమేలైన కొలనియందు, పరఁగుతఱిన్ = ఉన్న సమయమందు, సామ్రాజ్య ...... అనుకారిణి - సామ్రాజ్యలక్ష్మి = చక్రవర్తిత్వ సంపదయొక్క, సాక్షాత్కార = ప్రత్యక్షమగుటను, అనుకారిణి = అనుకరించునది, పోలునది, (సాంగమై కనిపింపని సామ్రాజ్యలక్ష్మి శరీరము ధరించి వచ్చినదా యన్నట్లున్న - అని భావము.) ఐన = అయినట్టి, ఒక్క కన్యకామణి = ఒక మిన్నయగుకన్నె, తనచెలికత్తియతోడన్, తత్తటంబునన్ = ఆకొలని యొడ్డునందు, (ఉన్న) క్రొత్తవిరిగుత్తి మొత్తంబులన్ = అప్పుడేవికసించిన పూలగుత్తుల గుంపులచేత, అత్యంతంబు = మిక్కిలి, చెలువొందు = సొగసైన, గురివెంద పొదరింటన్, ఒంటినుండి = ఏకాంతముగానుండి, అన్యులెఱుఁగ కుండునట్లుండియని భావము (అంతియ కాని ఏకాకినిగానుండుట ఇటఁ గుదురదు. చెలికత్తియతోడ అనునది బాధకము. సూ. ఒంటరి, యొంటి, యొంటిగాఁడు. నా-నేకాకి, యేకాంతంబు, శూరుం-డేకచరంబు నోలి నగు. అనునాంధ్రశబ్దానుశాసనము - ననుసరించి "ఏకాంతము" అనుట న్యాయ్యము. అవ్వాలుఁగంటితోన్ = (సోగకన్నులుగల) ఆచెలికత్తెతో - పైపద్యముతోడ నన్వయము.

తాత్పర్యము:— సరే! ఆసంగతి య ట్లున్నది. మేము కమలసమృద్ధము లగు వజ్రపురజలాశయంబుల విహరించుట కావజ్రనాభు ననుజ్ఞకోర - మాసంచారము జలాశయముల కలంకార మని భావించి యనుజ్ఞ యిచ్చెను. ప్రతిదినము నటుల సంచరించుచు నిన్న కన్యకాంతఃపురమందలి సరస్సున విహరించుచుండఁగా

ఆ కొలనియొడ్డున సాక్షాత్కరించిన రాజ్యలక్ష్మివలె నున్న యొక్కకన్నెమిన్న తనచెలికత్తెయు తానును పూచిన గురివెందపొదరింట రహస్యముగాఁ గూర్చుండి, యాచెలితో ఇట్లనెను.

వ్యా. వి. :—కొలంకులన్. సూ. కలన్యాదుల నువర్ణంబు కుజ్జగు, బహువచనంబు పరంబగునపుడు నిత్యంబుగా నగు. బాల. అచ్చిక. 18.

అడ్డుపెట్టు - ఉవర్ణకం బడుక్వాదుల కగు. బాల. కృదంత. 21 - చే - అడ్డుపెట్టు - ధాతువు మీఁద "ఉ" వర్ణకముగాఁగా నిత్యసంధి యయి సిద్ధించిన కృదంతరూపము.

వాలు + కన్నులు గలది - వాలుఁగంటి - బహువ్రీహిని సమాసాంతకార్యము టివర్ణమును, ఉదంత స్త్రీ సమంబునకు నుగాగమమును వచ్చి సిద్ధించినది. ఆ + వాలుఁగంటి-అవ్వాలుఁగంటి - త్రికసంధి.

చ. కమలదళాక్షిరో ! వినవుగా కల యొక్కటి గంటి వేకువన్
సమధిక మైన యద్భుత మొకోనర్చుచు నున్నది యెన్నుకొన్న లో
కమునను గన్నవిన్నయది గాదది కొంత నిజంబు కొంత స్వ
ప్నము నని పల్కి సిగ్గుకతనన్ మఱి చెప్పక దాఁచె దాఁచినన్. 122

అర్థము:—కమలదళాక్షిరో=తామర రేకులవంటి కన్నులుగల-ఓ చెలియా ! వినవుగా = వింటివి కాదుగదా - (వినుము అను నర్థమున జాతీయము), వేకువన్ = తెల్లవాఱుతఱిని, కల, ఒక్కటి, కంటిన్ = ఒక్కకల గన్నాను, ఎన్నుకొన్నన్ = ఆలోచించుకొనఁగా, సమ్+అధికము = మిగుల హెచ్చు, ఐన యద్భుతము = అయినట్టి యాశ్చర్యమును, ఒనర్చుచున్నది = కలిగించుచున్నది. లోకమునను = జగత్తునందు, కన్నవిన్నయది = చూచినదియును, వినినదియునుగూడ కాదు, అది, కొంత, నిజంబు, కొంత, స్వప్నము = కల - (సామాన్యముగా స్వప్నము లసత్యములు కావున 'కల్ల' యనుభావమున ప్రయుక్తము) అనిపల్కి = అనుచు చెప్పి, సిగ్గుకతనన్ = సిగ్గు కారణముగా - సిగ్గుచేతననిభావము. మఱి = ఇఁక నాపై సంగతి, చెప్పక, దాఁచెన్ = కప్పిపుచ్చెను, దాఁచినన్ = అట్లు కప్పిపుచ్చఁగా - (మీఁదికన్వయము.)

తాత్పర్యము:—చెలియా ! తెల్లవాఱుచుండఁగా నా కొక వింతయగు కల వచ్చినది. అట్టి దింతకు మున్ను వినలేదు. చూడలేదు. అందు కొంత నిజము. కొంత కల్ల. అని చెప్పి సిగ్గుచేత మీఁదియంశము చెప్పక మానివేసినది. అట్లు మానివేయఁగా.

వ్యా. వి. కమలదళాక్షిరో:—సూ. రో శబ్దం బొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు, నయ్యాది హ్రస్వాంతంబును నయ్యెడి. ప్రౌఢ. శబ్ద. 14.

కన్నవిన్నయది:—'కన్నయది+విన్నయది' అని విగ్రహము. ఆయీత్యాది ఘటితంబులు విశేషణోభయపదకర్మధారయంబులు. ప్రౌఢ. సమాస. 17. - విన్న కన్న యర్థము. అని ఉదాహరణముచూపి, ద్వంద్వంబునం బూర్వ పదాంత్యావయవంబునకు లోపంబు గానంబడియెడి. సమాస. 32 సూత్రమున "విన్నకన్నది" అని యుదాహరణము చూపుటచే ఇది కర్మధారయమా ? ద్వంద్వమా? అని సంశయము కలుగుచున్నది. కాని కన్న అది - అనుదానిలోని అది అనునది ధాతుజ విశేషణమునకు విభక్తివివక్షయం దను ప్రయుక్తమైన తచ్ఛబ్దమాత్రమే కావున - విశేషణోభయపద కర్మధారయ మనుటయేసమంజసము. కంటిని-కను ధాతువు. భూతార్థకము ఉత్తమైకవచనరూపము. కను + తి + ని - సూ. తి, దు, ట, లు పరంబగునపు డన్వాదుల నుస్థానంబున సున్నయు నుండు డులోపంబును విభాష నగు. బాల. క్రియా. 59చే-కం+తి+ని. అయి, సూ. ఇట బిందువు మీఁది త, ద-లకు నిత్య వైకల్పికంబు లయి - ట, డ- లగు - క్రియా. 52 చే- కంటిని అనురూపము సిద్ధించెను.

క. ఒట్టిడుకొంటివిగద నీ, కెట్టి రహస్యంబు దాఁప నే నని మనలో
నిట్టివి గలవా యని చెలి, యట్టే తప్ప దన విరచితాంగీకృతియై. 123

అర్థము:—చెలి = చెలికత్తె, (కర్త్రి), ఎట్టి రహస్యంబున్ = ఎటువంటి మఱుఁగు విషయమును, నేను, నీకున్ = నీవిషయమున, దాఁపను, అని, ఒట్టు, ఇడుకొంటివిగద = పెట్టుకొన్నావుగాదా, మనలోన్, ఇట్టివి = ఈ భేదములు, కలవా, అని, అట్టే = అదేపనిగా, తప్పదు, అనన్, విరచితాంగీకృతియై=చేయఁబడిన యొప్పుదల గలదియై, ఒప్పుకొన్నదై అని భావము.

తాత్పర్యము:— అంత చెలికత్తె "నేను ఎట్టి రహస్యమును నీయెడ దాఁప నని యింతకు మున్ను ఒట్టు పెట్టుకొంటివి గాదా ? మనలో మన కిట్టివిభేదములు కలవా ?" అని పలికి చెప్పక తప్పదని బలవంత పెట్టఁగా ప్రభావతి యంగీకరించినదై—

వ. ఆ కలకంఠి తనకల సకలంబు నకలంక సౌహార్దంబున ని ట్లని వినిపించె. 124

అర్థము:—ఆకలకంఠి = అవ్యక్తమధుర మగు కంఠధ్వనిగల యా ప్రభావతి, తనకల=తనకు వచ్చిన స్వప్నము, సకలంబున్, అకలంక సౌహార్దంబునన్=కపటములేని మైత్రితో, ఇట్లు, అని (వాక్యాలంకారము) వినిపించెన్ = వినఁజేసెను-చెప్పెను.

వ్యా. :—సౌహార్దము. సుహృదుని భావము - తద్ధితాంతము. సౌహృదయ్యము. రూపాంతరము.

చ. హిమగిరిరాజకన్య పరమేశ్వరి నాకల సుప్రసన్నయై
విమల దర స్మితామృతము వెల్లువ చెక్కులఁ బిక్కటిల్ల నన్
మమతను జేరఁగాఁ బిలిచి మక్కువచే నను నొక్కకేల మే
నిమురుచు నీకు నొక్కమగనిన్ ఘటియించితి నంచుఁ బల్కుచున్. 125

అర్థము:—పరమ + ఈశ్వరి - గొప్పదియును, శివుని యిల్లాలునగు, హిమగిరి రాజకన్య=హిమవంతుఁడను పర్వతరాజు కూఁతురగు పార్వతి, నాకలన్ = నాకు వచ్చిన కలలో = సుప్రసన్న యై = మిగుల ననుగ్రహించినదై, (ప్రత్యక్షమై యని భావము.) విమల = స్వచ్ఛమైన, దరస్మిత = చిఱునవ్వు అనెడి, అమృతము వెల్లువ = అమృతప్రవాహము, చెక్కులన్, పిక్కటిల్లన్ = నిండఁగా, మమతను = నాది యను నభిమానముచేతను, ఆత్మీయతచేతను, నన్ = నన్నును, చేరఁగాన్ = దగ్గఱకు వచ్చునట్లు, పిలిచి, మక్కువచేన్ = ప్రేమచేత, ననున్, ఒక్క కేలన్ = ఒక్కచేతితో, మే=(నా)దేహమును, నిమురుచున్ = మెల్లగారాయుచు, నీకున్, ఒక్కమగనిన్ = భర్తను (ఒక్క - శబ్దము జాతీయము. లేదా ముఖ్యుఁడగు భర్తను, అనియేని జెప్పఁదగును) ఘటియించితిని = కూర్చితిని, అంచున్, పల్కుచున్ = చెప్పుచు.

తాత్పర్యము:—పరమేశ్వరి యగునంబ నాకలయం దగపడి చిఱునవ్వుగల మోముతో నన్నుదగ్గఱకు రాఁ బిలిచి, నాయొడలు నిమురుచు "నీకొకనిని మగనిగాఁ గూర్చితిని" అని పలుకుచు.

సీ. సంకల్పమాత్ర తత్క్షణ సన్నిధాపితం, బగు చిత్రఫలకంబు నందు నొక్క
పురుషు నత్యాశ్చర్యతరరూప లావణ్య, గాంభీర్య శౌర్యాది శుంభ దఖిల
గుణములఁ గొమరొందు కొమరుఁబ్రాయపువాని, వ్రాసి యితండ నీవల్లభుండు
ప్రద్యుమ్నుఁ డనియెడి ప్రభుకుమారుఁడు మీకు, నిద్దఱకును జనియించినట్టి
గీ. పుత్త్రుఁ డీపురి యేలు నోపాలఁతి యనుచు, బలికెనఁట నేను నచటి పెద్దలు గఱపఁగ
మ్రొక్కి యనిపితినఁట యిందు నిక్కమగుచుఁ, బడఁతి యున్నది తచ్చిత్రఫలక మిప్పుడు.

అర్థము:—పడఁతి = ఓ చెలీ, సంకల్పమాత్ర = కేవలము తలంపుచేతనే, తత్క్షణ = ఆ నిమిషమందే, సన్నిధాపితంబు = దగ్గఱకు రప్పింపఁబడినది (ప్రాప్తమైనది అని భావము), అగు చిత్రఫలకంబునందున్ = అయిన చిత్తరువు వ్రాయఁదగిన ఫలకమునందు, అత్యాశ్చర్య...గుణములన్ - అత్యాశ్చర్యతర = మిగుల నచ్చెరువగు, రూప = నగలచే నలంకరింప బడకున్నను, అలంకరించిన ట్లవయవములను ప్రకాశింపఁ జేయునది రూపము, సహజమగు చక్కఁదనము, లావణ్య = అవయవము లందు నుండెడి ముత్యపుఁదళుకు వంటి తళుకును, కాంతియును, గాంభీర్య = లోఁతుగుండెతనమును, శౌర్య = పరాక్రమమును, ఆది = మొదలగు, శుంభత్ = ప్రకాశించుచున్నట్టియు, అఖిల = సమస్తమైన, గుణములన్ = గుణములచేత, కొమరారు = సొగసైన, కొమరుఁ బ్రాయపు వానిన్ = యౌవనముగల ఒక్క పురుషుని, పడుచువానిని, వ్రాసి = చిత్రించి, ఓపాలఁతీ! ఇతండు + అ = ఇతఁడే, నీవల్లభుండు = నీప్రియుఁడు, ప్రద్యుమ్నుఁ డనియెడు ప్రభుకుమారుఁడు = (ఇతఁడు) ప్రద్యుమ్నుఁడను పేరు గల రాజపుత్రుఁడు, మీకున్ ఇద్దఱకును = మీదంపతులకు, జనియించునట్టి పుత్త్రుఁడు, ఈ పురిన్ = ఈ వజ్రపురమును, ఏలును, అనుచున్, పలికెనఁట = అనినదఁట, నేనును, అచటిపెద్దలు, కఱపఁగన్ = ఉపదేశింపఁగా - నేర్పఁగా, మ్రొక్కి, అనిపితినఁట = పంపితినఁట, (అఁట - వృత్తాంతకథనమును దెలుపునది)- ఇందున్ = ఈస్వప్నమందుఁ జూచిన యన్నిటిలోను, నిక్కము = సత్యము, అగుచున్, తచ్చిత్రఫలకము = ఆబొమ్మ వ్రాసినపలక, ఇపుడున్, ఉన్నది.

తాత్పర్యము:—అట్లు నాతో మాటాడుచునే తలఁచిన మాత్ర లభించిన చిత్రఫలకమందు మిగుల నబ్బ్రమగు రూపము, లావణ్యము, పరాక్రమము, గంభీరత మున్నగు నుత్తమ ధర్మములు గల యొక్క చక్కని లేఁబ్రాయపు మగవానిని పార్వతి చిత్రించి, చూపి, "ఓ పాలఁతీ ఇతఁడే నీ మగఁడు, వీనిపేరు ప్రద్యుమ్నుఁడు. రాజకుమారుఁడు. మీ యిద్దఱకుఁ గలుగు కొడుకే యీవజ్రపురము నేలు" నని పలికినది. అచట నున్న పెద్దవారు చెప్పఁగా నే నపు డాయంబికకు మ్రొక్కి పంపితినఁట, కల యంతయు నసత్యము కావచ్చును. కాని దీనిలోని చిత్రఫలకము నిజమై యిప్పుడును నాయొద్ద నున్నది.

వి. :—రూపము - "అంగా న్యభూషితా న్యేవ కేనచి ద్భూషణాదినా, యేన భూషితవ ద్భాంతి తద్రూప మితి కథ్యతే" నగలచే నలంకరింపకున్నను, అలంకరించిన ట్లవయవములు మెఱయుట రూపము, లావణ్యము—"ముక్తాఫలేషు ఛాయాయా స్తరళత్వమి వాంతరా, ప్రతిభాతి య దంగేషు త ల్లావణ్య మి హోచ్యతే"—ముత్యములందు మిలమిలలాడు కాంతివంటి కాంతి లావణ్యము.

వ్యా. వి. :—కొమరుఁ బ్రాయము - సూ. సమాసమున ఉదంత స్త్రీ సమమునకు పరుషపరకల్పమున నుగాగమ ద్రుతసంధులు-ప్రాయము-ప్రకృతి. పాయము-వికృతి.

కొమరుఁ బ్రాయపువాఁడు - ఆభాసిక కర్మధారయ మని అథర్వణాచార్యు లనిరి. కావున "కర్మధారయంబుల ముపర్ణకంబునకుఁ బుంపులగు" అనుదానిచే పుంప్వాదేశము.

మ. అనుచున్ నెచ్చెలితోడ నచ్చెలువ య ట్లత్యద్భుతస్వప్నమున్
వినిపింపన్ నికటంబునన్ మెలఁగుచున్ వింటిన్ సురాధీశ! దా
నన యే నెన్నిక నిర్ణయించితి మదిన్ దథ్యంబుగా వజ్రనా
భునకుం గాలము చేరు వౌట యిది నీబుద్ధిన్ వివేకింపుమా. 127

అర్థము:—అనుచున్, నెచ్చెలితోడన్ = చెలికత్తెతో, అచ్చెలువ = ఆకన్యక, అట్లు = ఆరీతిగా అత్యద్భుత స్వప్నమున్ = మిగుల వింతయగు కలను, వినిపింపన్ = చెప్పుచుండఁగా - సురాధీశ = దేవేంద్రా! నికటంబునన్ = వారి సమీపమందు, మెలఁగుచున్ = తిరుగుచు, వింటిన్, దానన్ + అ = దానిచేతనే, తథ్యంబుగాన్ = నిజముగా, (తప్పకుండ నని భావము) వజ్రనాభునకున్, కాలము=మరణము,

చేరువ + ఔట = సమీపించినది యగుటను, ఏను = నేను, ఎన్నికన్ = తర్కముచేత, మదిన్ = మనసునందు, నిర్ణయించితిన్, ఇది = నేను చెప్పిన సంగతిని, నీబుద్ధిన్, వివేకింపుమా = విచారణమొనర్పుము.

తాత్పర్యము:—అని యాకన్య తనచెలితో నావింతస్వప్నమును చెప్పుచుండ దగ్గఱగా మెలఁగుచు విన్నాను. ఆవిన్న వృత్తాంతముచేత వజ్రనాభునకు మృతి సమీపించిన దని నేను నిశ్చయించుకొన్నాను. నీవును నీబుద్ధికొలఁది నాలోచింపుము.

వ్యా. వి. :—నెఱ+చెలి-నెచ్చెలి సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి. బాల. సంధి. 39.

సీ. ఆయింతిఁ బ్రద్యుమ్నుజాయగాఁ బలికిన, గౌరిమాటకు బొంకుగలుగ దనుము
దనుజవిరోధిపుత్రునకు నాదుష్టదైత్యుఁడు తనంతఁ దనూజ నొసఁగఁ డనుము
ప్రద్యుమ్నుఁ డట్లు ప్రభావతీపతి యైన, దానవునకుఁ బోరు తప్ప దనుము
వజ్రపురము ప్రభావతికొడు కేలుట, యసురకు జయ మైనఁ బొసఁగ దనుము

గీ. చిత్రఫలకంబు ప్రత్యక్షసిద్ధ మగుటఁ, జేసి యాకల యధికవిశ్వాస యోగ్య
మదియు వేకువఁ గావున, నచిరభావి, ఫలము దేవేంద్ర నీ వెంచి తెలిసికొనుము.

అర్థము:—దేవేంద్రా! ఆ యింతిన్ = ఆస్త్రీని, ప్రద్యుమ్నజాయ + కాన్ = ప్రద్యుమ్నుని యా లగునట్లు, పలికిన గౌరిమాటకున్ = చెప్పిన పార్వతిమాటకు, బొంకు = కల్లఁదనము, మోసము, కలుగదు, అనుము = అనుకొనుము, ఆ దుష్టదైత్యుఁడు = దురాత్ముఁడగు నారాక్షసుఁడు, దైత్యవిరోధి పుత్రునకున్ = రాక్షసులకు పగతుఁడైన కృష్ణునికొడుకునకు, తనూజన్ = పుత్రికను, తనంతన్ = స్వయముగా, ఒసఁగఁడు = ఈయఁడు, అనుము, అట్లు = అంబికావరానుసారము, ప్రద్యుమ్నుఁడు, ప్రభావతీపతి = ప్రభావతికి మగఁడు, ఐనన్ = అయినయెడ, దానవునకున్ = రాక్షసునకు, పోరు = యుద్ధము, తప్పదు = చేయకతీఱదు, అనుము, (ఆయుద్ధమున) అసురకున్ = రాక్షసునకు, జయము = గెలుపు, ఐనచోన్ = అగునెడల, వజ్రపురము, ప్రభావతికొడుకు, ఏలుట, పొసఁగదు = కుదురదు, అనుము, చిత్రఫలకము = చిత్తరువు వ్రాసినపలక, ప్రత్యక్షసిద్ధము = ప్రత్యక్షముగా నేర్పడినది - (అనఁగా కంటికగపడుచున్నది) అగుటఁజేసి = అగుటచేత, ఆ కల, అధిక విశ్వాసయోగ్యము = మిక్కిలి నమ్మకమునకుఁ దగినది, అదియు = ఆకలయు, వేకువన్ = తెల్లవాఱునపుడు, (వచ్చినది) కావునన్, అచిరభావి ఫలము = శీఘ్రముగా రానున్న ఫలము గలది, లేక సన్నిహిత భవిష్యత్తునందు ఫలముగలది, నీవు, ఎంచి = నాచెప్పినది చర్చించి, తెలిసికొనుము = నిజము తెలిసికొనుము.

తాత్పర్యము:—దేవేంద్రా! ఆకన్యక ప్రద్యుమ్నుని భార్యయగు నన్న గౌరిమాట యన్యథా కా దనుకో. క్రూరరాక్షసుఁడు వజ్రనాభుఁడు. రాక్షసమారకుఁడు కృష్ణుఁడు. అట్టియెడ వజ్రనాభుడు తనజాతికి పగవాఁ డగు కృష్ణుని కొడుకునకు తనకూఁతును తానై యీయఁడనుకో. గౌరివరముచే ప్రభావతికి భర్త ప్రద్యుమ్నుఁడే యగునెడల రాక్షసునకు యుద్ధము తప్ప దనుకో. వజ్రనాభునికే జయము గల్గునెడల ప్రభావతికొడుకు వజ్రపురము నేలుట పొసఁగదనుకో. ఒకవేళ వచ్చిన కల కల్ల గాఁగూడదా? అనిన - గౌరి కలలో నిచ్చినచిత్రఫలకము ప్రత్యక్షముగాఁ గనఁబడుటచే కల యథార్థము. అదికూడ వేకువను వచ్చుటచే దానిఫల మతిశీఘ్రకాలమున జరిగితీఱును. నీవును బాగుగా నీవిషయమును జర్చించి నిజము తెలిసికొనుము.

అలం:—పరికరాంకురము, కారణమాల, కావ్యలింగము.

వ్యా. వి. :—అసురకున్ - "సూ." సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు, సంస్కృతసమాసంబునఁ గావు. బాల. తత్సమ. 60 - అసుర, అసురుఁడు, అసురు నకున్, అసురకున్ - అని రూపసిద్ధి.

వ. ఆకన్నియపేరు ప్రభావతి యగుటయు నది వజ్రనాభునికూఁతు రగుటయుఁ దదీయ స్వప్నకథనానంతరప్రవృత్తంబు లయినయమ్మత్తకాశినుల యుత్తరప్రత్యుత్త రంబుల వెంబడి నెఱుంగఁబడియె నవియుం గొన్ని వివరించెద భవదీయకార్యోప కారి యైనయంశంబు గలిగిన గ్రహించునది యని యాయంచగరిత యకించిదంచిత సహజమాధురీధురీణ వాణీరామణీయకంబు కార్యకామనీయకంబున నినుమడించి బిడౌజు నిబిడౌజుఁ జేయుచుండ ని ట్లనియె. 129

అర్థము :—తదీయస్వప్నకథనానంతర ప్రవృత్తంబులు = ఆమెసంబంధమగు కలయొక్క చెప్పుట యొక్క, తరువాత జరిగినవి-ఆమె తనకలనుగూర్చి చెప్పినతరువాత జరిగినవి అనిభావము, అయిన = అయినట్టి, ఆ + మత్తకాశినుల = ఆ యుత్తమస్త్రీలయొక్క (మదముగలదానివలెఁ బ్రకాశించునది అని వ్యుత్పత్తి) ఉత్తరప్రత్యుత్తరంబుల వెంబడిన్ = ప్రశ్న సమాధానముల సందర్భమున, భవదీయ కార్య + ఉపకారి = మీ సంబంధమగు పనికిఁ దోడ్పడునది, ఐన యంశంబు = అయినట్టి యేకొంచెము, అంచగరిత = ఆఁడుహంస, అకించిత్ ... రామణీయకంబు - అకించిత్ = అత్యధిక మైనట్టియు, అంచిత = ఒప్పుచున్నట్టియు, సహజ = సాజమైన, కృత్రిమముకానట్టి, మాధురీ = తియ్యఁదనమునకు, ధురీణ=భారవాహకమైన - తియ్యఁదనముచే శ్రేష్ఠమైన యని భావము, వాణీ = పలుకుల యొక్క, రామణీయకంబు = అందము, (కర్త)కార్య కామనీయకంబునన్ =పనియందలి కోర్కిచేతను, ఇనుమడించి=ద్విగుణమై, రెండింతలై, బిడౌజున్ = ఇంద్రుని, నిబిడ+ఓజున్ =దట్టమగు నుత్సాహము కలవానినిగా, చేయుచుండన్ - (ఆ హంసియొక్క సహజ మాధుర్యముగల పలుకులయందము తన కప్పుడు కావలసినపని యందలి కోర్కిచేత ద్విగుణితమై యింద్రున కమితోత్సాహము కలిగించెనని భావము.) ఇట్లు, అనియెను.

వి. :—121 వచనమున "ఒక్కకన్య" అని యారంభించి ప్రభావతిపే రెందును రాకుండనే 127 వ పద్యముదాఁక శుచిముఖి కాపేరు తెలియ దన్నట్లే చెప్పించి 128 లో ప్రభావతీపతి, ప్రభావతికొడుకు అని శుచిముఖిచే ననిపించుట విరుద్ధమని యెంచి, స్వప్నవృత్తాంతము చెప్పినపిదప వారిసంభాషణమున ఆమె ప్రభావతి యనియు, వజ్రనాభునికూఁతు రనియు గ్రహించితి నని శుచిముఖిచేతనే చెప్పించుట కవియొక్క విమర్శనచతురిమము. 2 ఆ. 3 వ పద్యమందలి 'ఆకాంక్షితసుపూర్తి,' ఇట్టిదియే యని తెలియఁ దగును.

క. విను మట్లు తనదుకల చెప్పినయాయమఁ జూచి దానిప్రియసఖి యనయం
బును వెఱఁ గందుచు మెచ్చుచు, వనితా నీ వెంత భాగ్యవతివే యనుచున్. 130

అర్థము:—ఆయమన్ = (ఆ + అమ్మన్) ఆ ప్రభావతిని, ప్రియసఖి = ఇష్టురాలగు చెలికత్తె, అనయంబును = అత్యంతేఁటు, వెఱఁగు = అచ్చెరువు, భాగ్యవతివే = అదృష్టవంతురాలవే, అనుచున్ =అని మెచ్చుకొనుచు.

వ. శిరఃకంపం బొనర్చి. 131

అర్థము:—శిరఃకంపంబు = శ్లాఘాసూచకముగా తల నిటు నటు గదల్చుట.

గీ. మునుపు గౌరివరంబుచేఁతనె జనించి, తబల నీవు ని న్గన్నమీయమ్మ నేమ
మట్టి దిట్టిది నాఁ జన్నె యగజ నీవు, నింత మెప్పించుకొంటి నీకెవ్వ రీడు. 132

అర్థము:—అబల = ఓ సుకుమారీ, నీవు, మునుపు, గౌరివరంబుచేతన్ + ఎ, జనించితి = పుట్టితివి, నిన్ = నిన్నును, కన్న = ప్రసవించిన, మీయమ్మనేమము = మీ తల్లియొక్క నియమము, అట్టిది, ఇట్టిది, నాన్ = అనఁగా, చన్నె = తగునా ? (చను + ఏ) నీవును, అగజన్=పార్వతిని (శైల వృక్షావగౌ నగౌ. అమరము. అగము = కొండ వలన జనించినది అగజ.) ఇంత = స్వప్న సాక్షాత్కారము కలుగునంతగా, మెప్పించుకొంటి, నీకున్, ఈడు = సాటి, ఎవ్వరు ?

తా. నీవు గౌరీదేవి వరమునఁ బుట్టి, యామె యంతగా ననుగ్రహింప సేవించుచున్నావు. నీకుసాటి యెవరు ? నీవంటి యుత్తమగుణవతిని తనకుఁ బుత్త్రికగా నిమ్మని నిరంతనియమమునఁ బూజించి వరము పడసిన మీయమ్మ, యంతటి పార్వతీభర్తృగాలు కావున నీ వంతకంటెను పార్వతికి భర్తృరాల వైతివి. అని ప్రభావతిని తల్లిని మెచ్చుకొనినది. తల్లివలె ప్రభావతి సుగుణవతి కాని తండ్రివలె క్రూరస్వభావ కా దని ధ్వని.

చ. వలిమలయాఁడుబిడ్డ కల నీ వచ్చి యనుగ్రహ మెంతయేనియున్
గలుగక యిట్లు చిత్రఫలకంబున నీకు లిఖించి యిచ్చునే ?
చెలువుని నింత దృష్టముగఁ జెప్పెద నొండొక పోతుటీఁగకున్
బొలయఁగరాని చోట నిది పుట్టుట నెగ్గగు నీదుతండ్రిచేన్. 133

అర్థము:—అనుగ్రహము = దయ, ఎంతయేనియున్ = మితిలేనంతటిది, కలుగక = లేకుండనే, వలిమల = హిమగిరియొక్క, ఆఁడుబిడ్డ = కూఁతురు, అగు పార్వతీదేవి, కలన్ = కలయందు, వచ్చి = ప్రత్యక్షమై, ఇంతదృష్టముగన్ = ఇట్లు ప్రత్యక్షముగ కనఁబడునట్లు, చెలువునిన్ = (నీ) ప్రియుని, ఇట్లు, చిత్రఫలకంబునన్, లిఖించి = చిత్రించి, నీకున్, ఇచ్చునే !('కాని, యొకటి'. అధ్యాహారములు) చెప్పెదను, ఒండొకపోతుటీఁగకున్ = ఒకచిన్నమగయీఁగకుఁగూడ - దేవ దానవ మానవాదులలో మగవాండ్ర మాట యటుండ, నీచమగు మగపురుఁగునకుఁగూడ ననిభావము, పొలయఁగరానిచోటన్ = చొరరానిచోట- (కన్యాంతఃపురమునందు నని భావము.) ఇది = ఈ చిత్రఫలకనువచ్చువార్త, పుట్టుటన్ = పుట్టుటచేత, నీదు తండ్రిచేన్, ఎగ్గు = హాని, కలుగును.

తాత్పర్యము:—గౌరీదేవికి నీమీఁద నెంతయనుగ్రహము లేక, కలలోఁ గనఁబడి నీప్రియునిరూపము చిత్తరువున వ్రాసి మెలఁకువ వచ్చినతరువాతఁ గూడ గోచరించునట్లు నీ కిచ్చునా ! సరే ! యది యటుండ- ఏ మగపురుఁగును ప్రవేశింపకుండ కట్టడచేసిన యీ యంతిఃపురమున నిట్టిచిత్రఫలక మున్న దని తెలిసినచో మునుము నీతండ్రివలన పెద్దహానిమూత్రము కలుగఁగలదు.

వ్యా. వి. :—పోతు + ఈఁగ - సూ. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు. బాల. సంధి. 23. చే టుగాగమము రా - పోతుటీఁగ, అగును. (మల = కొండ. తమిళము-మలై)

ఆ. వె. చిచ్చు లేక చిముడు మచ్చరీఁ డీసుద్ది, వజ్రనాభుఁ డోర్చు వాఁడె యకట!
యగజపేరు పెట్టియతివ యెవ్వతో యింత, చేసె ననుచు మమ్ముఁ జెండు దొలుత.

అర్థము:—చిచ్చు = నిప్పు, లేక = లేకుండనే, చిముడు = మిగులనుడుకు - నిప్పులేకుండ నన్నా దులు ఉడుకవు, ఇట ఉడుకుటయేకొదు. చిముడనుడుకుటవిపరీతము. అట్టివాఁడఁట వజ్రనాభుఁడు, హేతువు లేకయే మండిపడునట్టి, మచ్చరీఁడు = మచ్చరముకలవాఁడు, ఈర్ష్యాళువు, అగు వజ్రనాభుఁడు, ఈ సుద్ది = ఈ మాట, ఓర్చువాఁడె = సహించువాఁడా ? సహింపఁ డని భావము. అకట = అయ్యో, (సంతాపసూచ

కను) అగజపేరుపెట్టి = పార్వతియొక్క పేరు చిత్రము వ్రాసినదానికిఁబెట్టి - పార్వతి వ్రాసినదని పైకిఁ జెప్పి, అతివ = స్త్రీ, ఎవ్వత + ఓ ఎవతెయో, ఇంత = ఇంతపని, చేసెను, అనుచున్, తొలుతన్ = ముందు, మమ్మున్ = మావంటి నీచెలికత్తెలను, చెండున్ = నఱికివేయును.

తాత్పర్యము:—నిమిత్తము లేకయే కోపించి హానిచేయు నీర్ష్యాళువగు వజ్రనాభుఁ డీమాట ... ? పార్వతీదేవి పేరు పెట్టి, చెలికత్తె యెవతెయో యింత పని చేసె నని అయ్యో! ముందుగా మమ్ముల నందఱ నఱికి పాఱవైచును.

అలం. :—విభావన, లోకోక్తి, కావ్యార్థాపత్తి.

వ్యా. వి. :—మచ్చరీఁడు, సూ. "ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు" బాల. ధ. 18-చే " మచ్చరము + ఇ = మచ్చరి - అయి - సూ. "ఈ ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం దగు". బాల. తద్ధిత. 17 చే. మచ్చరి + ఈ + ఁడు = మచ్చరీఁడు, అని సిద్ధించినది. "ఎవ్వత+ఓ = ఎవ్వతయొ, అనియుండుటయే కాని" బహుళగ్రహణముచే స్త్రీవాచక తత్సమ సంబోధనాంతంబులకు సంధి లేదు "అనునిషేధమున" ఎవ్వతో అనుసంధి యుండరాదు. అయినను "ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు" అను సూత్రమున రక్షితము.

క. ఆచిత్రఫలక మెవ్వరు, చూచిన వెలి విసరి యప్పుడ ¶ సుబ్బెడు నది నీ
వే చూచు టేను జూచుట, యోచంచలనయన యింతయు నెఱుంగుదువే. 135

అర్థము:—ఓ చంచల నయన = చలించునట్టి కన్నులుగల ఓ చిన్నదానా!, ఆచిత్రఫలకము = అంబ చిత్తరువు వ్రాసి యిచ్చిన యాపలకను, ఎవరు, చూచినను, వెలివిసరి = బయలుపడి, అపుడు + అ = ఆ క్షణమందే, ("ఎల్లెడల" అధ్యాహారము) సుబ్బెడున్ = వ్యాపించును - (కాన) అది, నీవే చూచుట=నీవు మాత్రము చూచుట, నేను చూచుట, ఇంత మాత్రమే కావలెను అని భావము. ఇంతయున్=నేను జెప్పిన యీ సంగతి యంతయు, ఎఱుంగుదువే = ఎఱుఁగుదువు కాదా. అనఁగా నీవును నేనును చూచుటతక్క నితరు లెవ్వరును చూడరాదు. ఈ సంగతి జ్ఞప్తియం దుంచుకొమ్ము.

వి. :—నీవే చూచుట నేను చూచుట - ఇది యొక జాతీయము కావచ్చును. సుబ్బు = బయలుపడు అని శ. ర. కాని, వెలివిసరి - అని యుండుటచే పునరుక్తి కావలసి వచ్చుచున్నది. కాన సుబ్బు=నలుదెసలను ప్రసరించు, వ్యాపించు - అని కవి హృదయమైనట్లు తోఁచుచున్నది.

చ. ఇతరులు రాకమున్న యది ¶ యెక్కడఁ బెట్టినదానవో సుశీ
ఘ్రతఁ గొని తెమ్ము తల్లిఖితుఁ ¶ గన్నులఁ జూచిన దాఁక నామనం
బతిముదితంబు గా దగజ ¶ యారసి యెవ్వని వ్రాసెనో సురూ
పతపస నీకు జోఁ డయిన ¶ భవ్యుఁడు దుర్లభుఁ డెల్ల సృష్టిలోన్. 136

అర్థము:— అది=ఆచిత్తరువును, ఎక్కడన్, పెట్టినదానవో = ఉంచితివో, ఇతరులు = అన్యులు, రాకమున్న + అ = ఇచటికి రాకుండఁగనే, సుశీఘ్రతన్ = అతివేగముతో - వెనువెంటనే, కొనితెమ్ము = తీసికొనిరమ్ము, తత్ + లిఖితున్ = దానియందుఁ జిత్రింపఁబడిన వానిని, కన్నులన్ + చూచిన దాఁకన్ = నాకన్నులతో ప్రత్యక్షముగా చూచునంతవఱకు, నామనంబు, అతి ముదితంబు=ఎక్కువ సంతసించినది, కాదు, సురూపత పసన్ = చక్కఁదనము యొక్క సారముచేత, నీకున్, జోడు = సరిసమానము, అయిన భవ్యుఁడు = అగు నుత్తముఁడు, ఎల్ల సృష్టిలోన్ = బ్రహ్మచే నిర్మితమగు నెల్ల లోకములందును, దుర్లభుఁడు = లభింపనివాఁడు. (అట్టియెడ) అగజ = పార్వతి, ఆరసి = బాగుగా పరిశీలించి, ఎవ్వనిన్, వ్రాసెనో = చిత్రించెనోకదా!

వి. :—శీఘ్రము. ఇటవిశేషణము. దానిపైని "తసిల్" ప్రత్యయము భావార్థమున విధింపఁబడి శీఘ్రుత యైనది. "క్లీబే శీఘ్రూద్యసత్త్వేస్యా త్రిష్వేషాం భేద్యగామియత్" శీఘ్రుత్వరితలఘుక్షిప్రాది శబ్దములు గుణవాచకములు గాని, క్రియావిశేషణములు గాని యగునపుడు నపుంసకలింగములు. ఈ శీఘ్రాదిపదములలో నేది విశేష్యనిఘ్న మగునో అది మూఁడులింగములందు వర్తించును అని అమరము. దీనిననుసరించి శీఘ్ర శబ్దము భావార్థమునను విశేషణార్థమునను గూడ వర్తించుట స్పష్టము.

సురూపత - ప్రాప్తరూప సురూపాభిరూపాః బుధమనోజ్ఞయోః. అమరము - సురూపుఁడు = చక్కనివాఁడు. వానిభావము, సురూపత = చక్కఁదనము అనిఫలితార్థము. సురూపత్వము, సౌరూప్యము, రూపాంతరములు.

వ. అనవుడు నక్కాంత యిక్కడ నొక్కచిగురుంబొదరుటీఁటిమి నిడినదాన నని యా
క్షణంబ తెచ్చి నెచ్చెలియుం దాను నప్పలకకప్పుఁబావడ యెడలించి. 137

అర్థము :—అనవుడున్ =అనినపిదప, అక్కాంత=ఆ ప్రభావతి, (ఆ+కాంత. త్రికసంధి) ఇక్కడన్, ఒక్క చిగురుంబొదరుటీఁటిమిన్ = చిగిరించిన పొదరింటియాకుల గుంపునందు, ఇడినదానను = (దాఁచి) ఉంచినదానను, అని, ఆక్షణంబు + అ, తెచ్చి, నెచ్చెలియును, దానును, ఆ + పలక = ఆ చిత్రఫలకము యొక్క, కప్పుఁబావడ = గవుసెన, కప్పినవస్త్రము, ఎడలించి = తొలగించి.

వి. :—కప్పుఁబావడ=నిచోళము-కప్పు+పావడ - ఉదంతస్త్రీసమంబగుట సమాసంబున పరుషము పరమై నుగాగమ ద్రుతకార్యములు - "చిగురుంబొదరు" ఇట్టిదే.

పొదరుటీఁటిమి - పొదరు + ఈఁటిమి - పొదరుశబ్దము పేర్వాదులలో పఠింపఁబడుటచేత టుగాగమము వికల్పముగాఁ వచ్చి, పొదరు టీఁటిమి, పొదరీఁటిమి - అనికావలెను. "పొదరీఁటిమి" అనభిదాన మట్లు తోఁచెడిని.

చ. కలకల నవ్వినట్లు తెలిగన్నుల నిక్కము చూచినట్లు తోఁ
బలుకఁ గడంగినట్లు కడుభావగభీరత లబ్బినట్లు పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టియా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోటియున్. 138

అర్థము:—కలకలన్ - కలకలమని, (నవ్వుటయం దగుధ్వని కనుకరణము) నవ్వినట్లు+ అ=నవ్విన విధముగానే, తెలిగన్నులన్ = స్వచ్ఛమగు కన్నులతో, నిక్కము + అ = నిజముగానే, చూచినట్లు + అ, తోన్ = చూచెడువారితోడ, పలుకన్, కడంగినట్లు + అ = పూనినట్లే, భావగభీరతలు =ఆశయముల యొక్క లోఁతులు - లోఁతగు నభిప్రాయములు గలుగుట, అబ్బినట్ల = కలిగియున్నట్లే, పెంపు = అతిశయము, ఒలయన్ = అంతటను కలుగునట్లుగా, తనర్చి = ఒప్పి, జీవకళ = బ్రదికియున్నట్లు చూపు శిల్పవిశేషము, ఉట్టిపడన్ = ఊడిపడునట్లు, శివ=పార్వతి, వ్రాసినట్టి = చిత్రించినట్టి, ఆచెలువునకున్ = ఆప్రియునకు, ఆభిముఖ్యము = ఎట్టయెదుట నుండుటను, భజింపన్ = పొందుటకు, ఎదుట నుండుట కని భావము. దానును = ప్రభావతియును, బోటియున్ = చెలికత్తెయును, తలంకెను = జంకెను.

తాత్పర్యము:—చిత్రఫలకముపై నుండు గవుసెన, యెడలింపఁగనే మొట్టమొదట నందలివ్యక్తి కలకల నవ్వినట్లు కనఁబడెను. ఆటువంకఁ జూడ తమ్మును నిజముగా చూచినట్లే కనఁబడెను. కొంచెము నిదానించి చూడఁ దమతో మాటాడఁబూనిన ట్లగపడెను. బాగుగా నిరీక్షింప ఏవియో గంభీరమగుభావములు గలిగియున్నట్లు కనఁబడెను. ఇట్లు సర్వత్ర గొప్పఁదనము గనఁబడ జీవకళ వెల్లడియగునట్లు గౌరి చిత్రించిన యా మనోహరాకారునకు వా రిరువురును ఎట్టయెదుట నిలువఁబడుటకుఁగూడ జంకిరి,

వ్యా. వి. :—జీవకళ - అను జాతీయము సంస్కృతమునఁ గానరాదు. కాని తెనుఁగునఁ బ్రచురముగా నున్నది. కళాశబ్దమునకు శోభ యనునర్థము తెనుఁగున మాత్రమే కనఁబడుచున్నది. కాన నిది తెలుఁగు వారి జాతీయ మనుకొని "జీవించియున్నట్లు తోఁచునట్టి కాంతివిశేషము" అనుకొనుటయు సమంజసము. అభిముఖునియొక్క భావము. ఆభిముఖ్యము - భావార్థకప్రత్యయము. వ్యతి వైముఖ్యము.

చ. చిత్తరు వన్న నిశ్చయముచే నెదురుండి మొగంబు చూడ మో
మెత్తును సత్యపుంభ్రమసమృద్ధిని గ్రమ్మఱుఁ దత్‌క్షణంబ లో
నొత్తుచుఁ దత్తఱంబుఁ ద్రపయున్ మగుడంగ నిరీక్షణేచ్ఛఁ బో
మొత్తును భర్తచూపు దను మోచుట దోఁచిన నోసరిల్లుచున్. 139

అర్థము:—(ఆప్రభావతి) చిత్తరువు, అన్న = అనిన, నిశ్చయముచేన్, ఎదురుండి=ఎదురుగానుండి, చూడన్, మోము = మొగమును, ఎత్తును, (అంతలోనె) సత్యపుం భ్రమ సమృద్ధిని - నిజమను భ్రాంతి యొక్క యతిశయముచేత, నిజము నెడ్డ భ్రాంతితో, (లేదా - సత్య = వాస్తవమైన, పుం = పురుషుఁ డనెడి, భ్రమ సమృద్ధిని - భ్రమాతిశయముచే), క్రమ్మఱున్ = మరలిపోవును. అంధలి యథార్థము తెలియఁగొని-తత్ + క్షణంబు + అ = అనిమిషమందే, అప్పుడే, తత్తఱంబున్ = వేగిరపాటును, త్రపయున్ = సిగ్గును, లోన్ = మనస్సులో, ఒత్తుచున్ = అణఁచుకొనుచు, మగుడంగన్ = మరలఁగా-చూడవలెనని మరల సంకింపఁగా అని భావము. భర్తచూపు = చిత్తరువునందలి పతి దృష్టి, తనున్, మోచుట = స్పృశించుట, తోఁచినన్ = కనఁబడఁగా, ఓసరిల్లుచున్ = ప్రక్కకొదుఁగుచు, నిరీక్షణ + ఇచ్ఛన్ = చూచుటయందలి కోరికను, పోమొత్తును = పోవునట్లు త్రోసివేయును.

తాత్పర్యము:—ఆ ప్రభావతి చిత్తరువే కదా యని సంకోచము లేకుండ నెదురుగానుండి చూచుటకై ముఖ మెత్తును. అందలిది బొమ్మ కాదనియు, యథార్థ మగు పురుషుఁడనియు భ్రాంతిచే మరలిపోవును. వెంటనే వేగిరపాటును, సిగ్గును, అడఁచుకొని మరలఁ జూడ సంకింప - భర్తదృష్టి తనపైఁ బడినట్లు కాన్పింప కొంచెము ప్రక్కకు నొదుఁగుచు, చూడవలె నను కోరికను విడనాడును.

వ్యా వి.:—'అనిన' - అను + న - సూ. పద్యాదుల నపర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు. బాల. క్రియా. 51-చే. అన్న, అని యగును. 'ఎదురుండు' శబ్దపల్లవధాతువు. 'సత్యము + భ్రమ' అనుపక్షమున - కర్మధారయమున మువర్ణకమునకు పుంపులు రాఁగా - సత్యపు + భ్రమ-యగును. పుంపులకు సమాసములందు పరుష సరళపరత్వమున విధించిన నుగాగమము స్థిరము పరమైనను వచ్చుట విశేషము. "ఈయాగమం (నుగాగమంబు) బొకానొకచోట స్థిరముపరంబగుచోఁ గానంబడియెడి." అని బాల. సంధి. 25 సూత్రము వివరణమున నుండుటచే నుగాగమమును, ద్రుతకార్యములును ప్రాప్తింప "సత్యపుంభ్రమ," అని సిద్ధించినది. ఒయ్యారపుస్లీల - మనుచ. 5-69. ఇట్టిదే.

గీ. వెఱయుఁ ద్రపయును లోనుగ విఘ్నసమితి, గడుఁ గలఁగిపోకయుండఁ దా నడుమ నడఁచి
యేచి చిత్రతానిశ్చయ మెచ్చరింప, నింతి క్రమమునఁ బ్రియునిరూ పెల్లఁ జూచె.

అర్థము:—వెఱయున్ = భయమును, త్రపయున్ = సిగ్గును, లోనుగన్ = మొదలుగా - (కల) విఘ్నసమితి = ఆటంకముల సముదాయము, కడున్ = మిక్కిలి, కలఁగిపోకయుండన్ = క్షోభపడకుండు నట్లు, నడుమన్ = మనసునఁబుట్టి పైకివచ్చునంతలోనే, అడఁచి = నొక్కిపట్టుకొని, చిత్రతానిశ్చయము = బొమ్మయనెడి నిశ్చయ జ్ఞానము, ఏచి = వర్ధిల్లి, ఎచ్చరింపన్ = ప్రేరేపింపఁగా, ఇంతి = ఆ ప్రభావతి, ప్రియునిరూపు = పతియొక్క ఆకారము, ఎల్లన్ = అంతయును, క్రమమునన్ = వరుసగా, చూచెన్ = చూచెను.

తాత్పర్యము:—భయము, సిగ్గు, మన్నగు వెన్నియో యడ్డంకులు గజిబిజి యగుచుండఁగా బొమ్మ యనెడినిశ్చయజ్ఞానము వానిని పైకిరాకుండఁగా నణఁచివైచి విజృంభించెను. అప్పుడు ప్రభావతి ప్రియుని యొక్క రూపమును (ఒక మాఱుకాక) క్రమముగాఁ జూచెను.

వి. :—లోనుగన్ - (లోను = మొదలు) మొదలుగాఁగ అనునర్థవిశేషమున -

గీ. స్థావరములు జంగమములు ధాత లోనుగాఁగఁ, బ్రళయంబు నొందిన కాలమునను. భార. శాంతి. 4. 219. — కంసుఁడు లోనుగఁ దైత్యులున్ ... హరి. ఉత్త. 1-40 ఇత్యాదులు కలవు.

వ. అత్తలోదరిచెలికత్తెయు నత్యంత విస్మయాయత్తచిత్తయై యొక్కింత తడవుచూచి యిట్లనియె. 141

అర్థము:—ఆ + తలోదరి = పలుచని యుదరముగల యా ప్రభావతి యొక్క, చెలికత్తెయును, అత్యంత ... చిత్తయై - అత్యంత = అధికమగు, విస్మయ = ఆశ్చర్యమునకు, ఆయత్త = వశమైన, చిత్తయై = మనసుగలదియై, ఒక్కింత తడవు = కొంచెముసేపు.

ఉ. ఇంత బెడంగు లోకమున నెవ్వరి కున్నది యంబ తా నిజా
త్యంతిక నైపుణీమహిమ యంచన వ్రాసెనొ యేమొ కాక యా
చింతయుఁ గూడ, దీతని సృజించియె జోడుగఁ గోరి సుమ్ము దా
నెంతయు నేర్పు మీఱ నజుఁ డిట్లు సృజించె నినున్ బ్రభావతీ ! 142

అర్థము:—ప్రభావతీ, అంబ = గౌరి, తాన్ = తాను - (స్వయముగా) నిజా...మహిమన్- నిజ = తనయొక్క, ఆత్యంతిక = ఎడతెగని, నైపుణీ = నేర్పుయొక్క మహిమన్ = గొప్పఁదనముచేతనైన, అంచనన్ = ఊహచేత, వ్రాసెనో+ఏమొ కాక = చిత్రించినదేమో - కాని, ఇంత బెడంగు = చక్కఁదనము, లోకమునన్, ఎవ్వరికిన్, ఉన్నది = కలదు ? ఎవ్వరికినుండదు అని భావము. ఆచింతయున్ = అట్టి యాలోచనమును, కూడదు = తగదు, అజుఁడు = బ్రహ్మ, ఈతనిన్ = ఈ ప్రద్యుమ్నుని, సృజించి+ఎ, జోడుగన్ = ఇతనికి జంటయగునట్లు, కోరిసుమ్ము = కోరియేసుమా, తాను, ఎంతయున్ = అత్యంతము, నేర్పు = కౌశలము, మీఱన్ = అతిశయించునట్లు, నినున్ = నిన్నును, ఇట్లు = ఇంత చక్కఁదనముగల దానినిగా, సృజించెను = నిర్మించెను.

తాత్పర్యము:—గౌరీదేవి తనయత్యధిక మగునేర్పుచే నిట్టివాఁ డుండవచ్చు ననునూహచే చిత్రించిన దేమో కాని యింత సొగసు లోకమునం దెవరి కున్నది ? ఆ యాలోచనయు తగదు. ఏ మన బ్రహ్మ ముందుగా నీతని సృజించియే, యితనికిఁ దగినజోడు కావలె ననియే సుమీ తన నేర్పంతయుఁ జూపి ప్రభావతీ ! నిన్ను సృజించినాఁడు. ఇతని చక్కఁదనమునకు నీ చక్కఁదనము సరిగా సరిపడి యున్నదని భావము.

అలం :—ఉత్ప్రేక్ష, ఆక్షేపము. అతిశయోక్తి.

వ. అనుటయు నక్కాంతాతిలకంబు. 143

స్పష్టము.

ఉ. ఇచ్చక మాడుమాట లివి యెల్ల నటుండఁగనిచ్చి నీకు నీ
నెచ్చెలితోడు సుమ్ము సఖి! నిక్కము చెప్పుము వ్రాఁతనేర్పు గా
కిచ్చెలువంబు గల్గు ఘనుఁ డెక్కడనే నొకఁ డుండెనేని నేఁ
దచ్చరణద్వయంబునకు దాస్య మొనర్పఁగ నైన నర్హనే? 144

అర్థము:—సఖి = ఓచెలీ! నీకున్, నీనెచ్చెలితోడుసుమ్ము = నీస్నేహితురాలనగు నాతోడుసుమీ (ఇది యొట్టుపెట్టుకొనుట), ఇచ్చకమాడు = ముఖప్రీతిగా మాటాడునట్టి, మాటలు, ఇవి యెల్లన్ = ఇవి యన్నియు, అటుండనిచ్చి = ఆవంకనుంచి, అనఁగా మానివేసి, నిక్కము = నిజమును, చెప్పుము. (ఇది) వ్రాఁతనేర్పు = చిత్రించుటలోని నేర్పరితనము, కాక, ఈ + చెలువంబు = ఈకనఁబడుచున్న సొగసు కల్గుఘనుఁడు, ఎక్కడనేన్ = ఎంతైనను, ఒకఁడు, ఉండెనేని = ఉన్నయెడ, నేన్ = నేను, తచ్చరణ ద్వయంబునకున్ - తత్ = వానియొక్క, చరణ = పాదములయొక్క, ద్వయంబునకున్ = దోయికి, జంటకు, దాస్యము = సేవ, ఊడిగము, ఒనర్పఁగనైనన్ = చేయుటకైనను, అర్హనే = తగినదాననా? భార్యాత్వమునకు కాదుగదా! దాసీత్వమునకైనఁ దగ నని భావము.

తాత్పర్యము:—చెలీ! ముఖప్రీతిగా నీవు మాటాడు మాటలను కట్టిపెట్టి నిజము చెప్పుము. చెప్పవా నీకు నామీఁద ఒట్టు. ఈ చిత్రగతపురుషుని చక్కఁదన మంతయు శిల్పచాతుర్యము గాక, నిజముగా నిట్టిసుందరుఁ డెక్కడనైన నున్నయెడల నే నతనికి భార్యగా నగుట యెందులకు? దాసిగా నైన నుండ నర్హురాలనటే?

అలంకారము:—సంభావనము.

వ. అని మఱియుఁ బెక్కుచందంబులం గందర్పరాగంబు దేటపఱుచుమాటలం దన బోటితోడం దడవు సంభాషించుచుండె నవియుఁ బదిలంబుగాఁ దెలిసిన నమ్ముద్దియ ప్రద్యుమ్నశీఘ్రానయనంబునకు నుద్యోగంబు తద్దయుం జేయుట సంభావితంబు గావున దేవకార్యంబునకు నుపకారంబుపోలెఁ దోఁచుచున్నది యని చెప్పుటయు నవహితమానసుండై యాకర్ణించి. 145

అర్థము:—అని=ఈరీతిగా పలికి, మఱియున్, పెక్కుచందంబులన్ = అనేకవిధములుగా, కందర్ప రాగంబు = మన్మథునివలనఁ గలిగినప్రేమ, తేటపఱుచు = వెల్లడించు, మాటలన్, అవియున్ = ఆ మాటలను, పదిలంబుగాన్ = జాగ్రత్తగా, తెలిసినన్ = తెలిసికొనినచో, ఆ + ముద్దియ = ఆ కన్య, ప్రద్యుమ్నశీఘ్ర + ఆనయనంబునకున్ = ప్రద్యుమ్నునియొక్క, వేగముగావచ్చుటకు - ప్రద్యుమ్నుఁడు తొందరగా వచ్చుటకు అనిభావము, ఉద్యోగంబు = యత్నము, తద్దయున్ = అధికముగా, చేయుట సంభావితంబు = (నాచే) ఊహింపఁబడినది, కావునన్, దేవకార్యంబునకున్ = దేవతలపనికి, వజ్రనాభ వధకు, అన్నమాటకు ఉపకారంబుపోలెన్ = ఉపకరించునదివలె.

తాత్పర్యము:—అని యింకను ననేకరీతుల మన్మథజనిత మగు ననురాగము వెల్లడించుచు చాలసేపు చెలికత్తెతో మాటాడుచుండెను. ఆమాటలను జాగ్రత్తగాఁ దెలిసినయెడల ప్రద్యుమ్నుని శీఘ్రముగా రావించుయత్నము చేయుచున్న దని యూహింపవచ్చును. కాఁబట్టి ప్రద్యుమ్నుఁ డచటికి వెళ్లుట దేవ కార్యమునకు నుపకరించున ట్లున్నది యని శుచిముఖి చెప్పఁగా స్థిరచిత్తుఁడై విని, (ఇంద్రుఁడు)

## ఆశ్వాసాంతము.

శా. ధారుణ్యాభరణాయమాన బుధతాధారుండు, భూమోల్లస
త్కారుణ్యామృతశైత్య నిత్యదృగలంకారుండు నేత్రాంత గా
హారుణ్యాంకురకల్పితారి మదసంహారుండు కీర్త్యంగనా
తారుణ్యాగళ నౌషధాభిజన విస్తారుండు శూరుం డనిన్.

అర్థము :— ధారుణ్యా... ధారుండు, ధారుణీ = భూమికి, (ధరుణము = నీరు - దానివలనఁ బుట్టినది ధారుణి యని వ్యు. "అద్భ్యః పృథివీ" అని శ్రుతి.) ఆభరణాయమాన = భూషణమై యాచరించుచున్న, బుధతా = పాండిత్యమునకు, ఆధారుఁడు = ఆశ్రయమగువాఁడు - భూమికలంకారమైన పాండిత్యముగలవాఁడు అనిభావము, భూమో... కారుండు - భూమ = అధిక్యముచే, ఉల్లసత్ = ప్రకాశించుచున్న - అధికమైన అని యర్థము. కారుణ్య = దయయనెడి, అమృత = అమృతముయొక్క, శైత్య = చలువయే, నిత్య=స్థిరమగు, దృగలంకారుండు = చూపులయొక్క యలంకారముగాఁ గలవాఁడు-అధికమగు దయామృతపు శైత్యముచే నలంకరింపఁబడిన చూపులు గలవాఁడు-చల్లగా దయతో నందఱను చూచువాఁడని భావము, నేత్రాంత ... సంహారుండు— నేత్రాంత = కనుఁగొనలయందు, గాహ=ప్రవేశించిన, అరుణ్య = ఎఱుపుయొక్క, అంకుర = మొలకలచే, కల్పిత = చేయఁబడిన, అరిమద = పగవారి మత్తత యొక్క, సంహారుండు=నాశముగలవాఁడు (కనుఁగొనలయం దించుక యెఱ్ఱదనము కలిగెనా యతని శత్రువుల మదమంతయుఁబోవునని భావము.) కీర్త్యంగనా ... విస్తారుండు, కీర్తి + అంగనా = కీర్తి యనెడు స్త్రీ యొక్క, తారుణ్య = యౌవనము యొక్క, అగళిత + ఔషధ=జాఱకుండుటకు మందైన, అభిజన = వంశము యొక్క, విస్తారుడు = విరివిగలవాఁడు. అతనివాఁడు కలిగిన కీర్తిని గాపాడునట్టి పుత్ర పౌత్రాదికము గలవాఁడని భావము. అనిన్ = యుద్ధమందు, శూరుండు = పరాక్రమవంతుఁడు - కృతిపతి యగు అమరామాత్యుఁడు పండితుఁడు, కరుణాళువు, శత్రుభీకరుఁడు, స్థిరకీర్తి, శూరుఁడు అని యిం దుగ్గడింపఁబడెను.

వి. :— ఈ పద్యము ద్విప్రాసము. అలంకారము అంత్యానుప్రాసము - ఈ కావ్యమందలి యెల్ల యాశ్వాసాంత పద్యములు ప్రథమాంతములే కాని చతుర్థాశ్వాసాంత పద్యములును, పంచమాశ్వాసాది పద్యమును ద్వితీయాంతములు. కవి యిచ్ఛానుసారము కూర్పవచ్చును కాన నీ యొక్క కావ్యముననే సూరన యిట్లు వ్యవహరించెను. నిర్వచనోత్తర రామాయణ, కుమార సంభవ, కావ్యాలంకార చూడామణ్యాది ప్రాచీన కృతులందు వివిధవిభక్త్యంత విశేషణములతో ఆశ్వాసాంత పద్యములు కనఁబడుచున్నవి. పూర్వాశ్వాసాంతమునఁ గల విభక్తియే ఉత్తరాశ్వాసాది పద్యమున నియతముగా నుండవలసినట్లు కనఁబడును.

"ధారిణ్యాభరణాయామాన" అనుపాఠము "ధారుణీ" శబ్దము ప్రచురముగా లేకుండుటచే కలిగిన సవరణ అనుకోఁదగును. అట్లు సవరించుచో తక్కిన మూఁడు పాదములందుఁ గల 'కారుణ్య' 'ఆరుణ్య' 'తారుణ్య' శబ్దములపరిపాటి చెడును. కాన ధారుణ్యాభరణాయమాన అనియే కవియాశయమని యూహ్యము.

క. సారతరవైదికసమాచారుఁడు బహునృపకృతోపచారుఁడు నిరహం
కారుఁడు సాంగానంగాకారుఁడు సన్నుతవచఃప్రకారుఁడు సభలన్. 147

అర్థము:— సారతర, వైదికసమాచారుఁడు = ప్రశస్తమైనట్టిదియు, వేదమునఁ జెప్పఁబడినట్టిదియు నగు ప్రవర్తనగలవాఁడు, బహు... చారుఁడు = పెక్కురు రాజులచే చేయఁబడిన సేవలుగలవాఁడు, నిరహంకారుఁడు = గర్వములేనివాఁడు, సాంగానంగాకారుఁడు = శరీరముతోఁ గూడిన మన్మథుని రూపమువంటి రూపముగలవాఁడు, సభలన్ = సభలందు, సన్నుతవచః ప్రకారుఁడు = కొనియాడఁబడిన మాటలపద్ధతి గలవాఁడు.

వి. :—అనంగుఁడు, సాంగుఁడైనచో - అతఁడుపమాన మగు నపుటచే అభూతోపమ యని దండ్యాచార్యు లనిరి. అప్రసిద్ధమగు నుపమానయోగము లేమింజేసి ఉత్ప్రేక్ష యని ఆధునికు లనిరి. ఈవిషయము "పతత్పతంగప్రతిమః - అను మాఘకావ్యము ప్రథమసర్గ ॥ 12 శ్లోకమునకు వ్యాఖ్యచేయుచు మల్లినాథసూరి యిట్లనెను (పడుచున్నసూర్యుఁడుపమానముగాఁ గలవాఁడు అని దాని కర్థము) పతత్పతంగ ఇత్యత్ర పతంగస్య పతనాసంభవా దియ మభూతోప మేతి దండిప్రభృతయో బభణుః, అతఏవ అప్రసిద్ధోపమానత్వాయోగా దుత్ప్రేక్షేతి ఆధునికాలంకారికాః సర్వే వర్ణయంతి" అనెను.

## క వి రా జ వి రా జి త ము

జలధిగభీరుఁడు § శాంతవికారుఁడు § శాస్త్రవిహారుఁడు § సౌమనసా
చల వరధీరుఁడు § శశ్వదుదారుఁడు § సంహృతవైరుఁడు § శంభుపదా
చలితవిచారుఁడు § సాదిమసారుఁడు § సత్పరివారుఁడు § సర్వనుతో
జ్జ్వలగుణవారుఁడు § సంవిదగారుఁడు § సంశయదూరుఁడు § సద్విధులన్. 148

అర్థము:—జలధిగభీరుఁడు = సముద్రమువలె లోతైనవాఁడు - (లోఁతుగసందేహలవాఁడు అని భావము) శాంత - నశించిన, వికారుఁడు = మార్పులుగలవాఁడు, ఏకాకారవృత్తిగలవాఁడని భావము. శాస్త్రవిహారుఁడు = తర్క-వ్యాకరణాది శాస్త్రములందు విహరించువాఁడు, సౌమనస...ధీరుఁడు - సౌమనస - సుమనసులన దేవతలు. వారికి సంబంధించిన, అచలవర=పర్వతశ్రేష్ఠమగు మేరువలె, ధీరుఁడు = చలింపనివాఁడు, శశ్వత్ + ఉదారుఁడు = ఎల్లప్పుడును దాత, సంహృతవైరుఁడు = నిర్మూలింపఁబడిన శత్రుత్వముగలవాఁడు-ఎవ్వరియందును శత్రుభావములేనివాఁడు, శంభుపదాచలితవిచారుఁడు=శివునిపాదము లందు చలింపని ధ్యానముగలవాఁడు, సాదిమసారుఁడు - సాది = అశ్వారోహకులలో, మసారుఁడు = (మరకతము అని ఆప్టే.) ఇంద్రనీలమణివంటి వాఁడు. శ్లేషార్థము - (స + ఆదిమ అని విడఁదీయుచో అఖండయతియగును.) "గొప్ప గుజ్జుపురాతు" అని యర్థము, సత్పరివారుఁడు యోగ్యమగు పరివారము భృత్యాదులు గలవాఁడు. సర్వ...వారుఁడు - సర్వ= ఎల్లరచేతను, నుత = పొగడఁబడిన, ఉజ్జ్వల = ప్రకాశించునట్టి, గుణవారుఁడు = సుగుణముల సముదాయముకలవాఁడు, సంవిత్ + అగారుఁడు = జ్ఞానమునకు గృహము - స్థానమైనవాఁడు, సద్విధులన్ = మంచిపనులవిషయమున, సంశయదూరుఁడు = సందేహములేనివాఁడు. అమరయమంత్రి (కృతిపతి),

## గ ద్య ము

ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వవైభవ, పింగళి యమరనార్య తనూభవ, సౌజన్యజే (గే ?) య సూరయ నామధేయప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నంబను ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.



# ప్రభావతీ ప్రద్యుమ్నము

## సవ్యాఖ్యానము

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీచణ గౌతమ గోత్ర, ప్రాచీనామాత్యకీర్తిభామా విష్వ
ద్రీచీన గమన శిక్షై, కాచార్యుఁడు సూరమంత్రిరాయమరార్యుఁ డిలన్.

అర్థము:—ఇలన్ = భూమియందు, శ్రీ ... ఆచార్యుఁడు — శ్రీ చణ = సంపదలచేఁ బ్రసిద్ధులైన, గౌతమగోత్ర = గౌతముని వంశమువారగు, ప్రాచీన = తొల్లిటి, అమాత్య=మంత్రుల యొక్క, కీర్తిభామా = కీర్తియనెడి స్త్రీకి, విష్వద్రీచీన = అన్ని దిక్కులయందు వ్యాపించిన, గమన సంచారము యొక్క, శిక్షా = నేర్పుటయందు, ఏక = ముఖ్యుఁడగు, ఆచార్యుఁడు = ఉపాధ్యాయుఁడైన, సూర మంత్రి యమరార్యుఁడు = సూరయ మంత్రి కొడుకగు నమరయ మంత్రి, (ఒప్పును - అధ్యాహారము)

తాత్పర్యము:—తమ గౌతమ గోత్రమునఁ బుట్టిన పూర్వుల కీర్తి నెల్లదెసల వ్యాపింపఁజేసిన మహానుభావుఁ డగు అమరయ మంత్రి యొప్పును.

వ్యా. వి. :—శ్రీలచే ప్రసిద్ధులు - శ్రీచణులు. "తేన విత్త శ్చుంచు ప్చణపౌ. 5-1-26 అను పాణినీయముచే వచ్చిన "చణప్" అను తద్ధిత ప్రత్యయము.

విష్వద్రీచీనము—విష్వక్ + అంచ్ - ఖ - "విష్వ గ్దేవతయో శ్చ టే రద్ర్యంచతావప్రత్యయే 6-3-92. సూత్రమున - "విష్వక్ + అద్రి = విష్వద్రి+అచ్ - అని, కాఁగా - "చౌ" 6-3-13. సూత్రమున అకారము లోపించిన "అచ్" అనఁగా "చ్" అనునది పర మగునపుడు పూర్వాచ్చునకు దీర్ఘము కలుగఁగా - విష్వద్రీచ్ అయి-ఖ ప్రత్యయమున కాదేశమగు "ఈన" అను నది చేరగా "విష్వద్రీచీనము" అను రూపము సిద్ధించినది.

వ. ఆ సహస్రాక్షుం డపేక్షిత ప్రయోజనానుకూల్యంబుకంటె నా పెంటి రాయంచ
యంచిత వచన రచనా విచక్షణత్వంబు చిత్తంబునకుఁ గ్రొత్త యింపుసొంపు సంపా
దించుచుం బెంపుమీఱ నింపు లగు మెచ్చు నచ్చెరువు నిచ్చలంబులై తనర
ని ట్లనియె. 2

అర్థము:—ఆసహస్రాక్షుండు=వేయికన్నులు గలవాఁ డగు నాయింద్రుఁడు, అపేక్షిత...కూల్యంబు కంటెన్ - అపేక్షిత = కోరఁబడిన, ప్రయోజన = పనియొక్క, అనుకూల్యంబు కంటెన్ = అనుకూలత కంటె - తా నపేక్షించినపని యనుకూలముగా జరుగు ననుకొనుటకంటెను, ఆపెంటి...విచక్షణత్వంబు- ఆపెంటిరాయంచ = ఆ యాఁడు రాజహంసయొక్క, అంచిత = యోగ్యమైన, వచన రచనా = మాటల కూర్పునందలి, విచక్షణత్వంబు = పాండిత్యము - లేక వివేకము, చిత్తంబునకున్ = మనస్సునకు, క్రొత్త యింపు = క్రొత్తదగు సంతోషముయొక్క, సొంపున్ = సమృద్ధిని, సంపాదించుచున్ = కలిగించుచు, పెంపుమీఱన్=అతిశయిల్లఁగా, ఇంపులు+అగు = ఇష్టములగు, మెచ్చును = మెప్పును, అచ్చెరువును = ముసు, నిచ్చలంబులు + అయి = స్థిరములై, తనరన్ = ఒప్పఁగా, ఇట్లు, అనియెన్=పలికెను.

తాత్పర్యము:—శుచిముఖి చెప్పెడి పల్కులను చిత్తైకాగ్రతతో విని యింద్రుఁడు తన కార్యమనుకూలముగా నగు నను విషయమునకంటెను, ఆ హంసియొక్క మాటలనేర్పు నూతనానందాతిశయమును గూర్ప - శ్లాఘయు, ఆశ్చర్యమును కనఁబడ నిట్లనెను.

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక, పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁ పెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ, బునరుక్తిదోషంబుపొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శాఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకొన నదుకుచు, నుపపత్తి యెందు నత్యూర్జితముగ

గీ. నొకటఁ బూర్వోత్తరవిరోధ మొదవకుండ, దత్తదవయవవాక్య తాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ, బలుకనేర్చుట బహుతపఃఫలముగాదె.

ఈ పద్యమున శుచిముఖీవచనరచనా స్తుతి నెపమున నింద్రునినోట కవిత్వ మెట్లుండవలెనో వాచ్యము గాకుండ కవి చెప్పించుచున్నాఁడు. ఈచెప్పఁబోవు లక్షణములతో తనకవిత్వము సాగించితి నని ధ్వని కూడఁ గల దని కొందఱు తలంచుచున్నారు.

అర్థము:—శబ్దసంస్కారము = రససిద్ధి కను వగు పదములను జక్కఁబఱచుట, (అనఁగా వ్యాకరణసంస్కారము.) ఎచ్చటను = ఏచోటనుగూడ - సర్వత్ర, జాఱఁగనీక = తొలఁగనీయక - చ్యుతసంస్కారదోషరహిత మగున ట్లని భావము - చ్యుతసంస్కారము నిత్యదోషము కావున నది ముందు చెప్పఁబడెను.

పదమైత్రి = పదములపొందిక, అర్థసంపదలన్ = అర్థముయొక్క సమృద్ధిలో, పొదలన్ = ప్రకాశింపఁగా - పదముల కూర్పునందు సర్వత్ర యర్థము నిండుగా నుండవలెను. అర్థరహితపదములఁ గూర్చుట "వ్యర్థము" అనుదోష మగును. దానినే నిరర్థక మనిరి కొందఱు. తలఁపు + ఎల్లన్ = భావ మంతయును, అక్లిష్టతను = క్లేశము లేకుండఁగనే, ప్రదీపితము = స్పష్టము, కాన్ = అగుచుండగా - "క్లిష్ట" మను దోషము లేకుండఁగా నని భావము. వ్యవధానముగా నర్థ మిచ్చుపదముల ప్రయోగము "క్లిష్టత" అనుదోష మగును. దీనిని దూరాన్వయ మనిరి కొందఱు. పునరుక్తిదోషంబు+పొంతన్ = చెప్పినయర్థమునే మరలఁ జెప్పుట యనుదోషమువంక, పోక = ప్రవర్తింపక - పునరుక్తి యనుదోషము లేకుండ నని భావము.

ఆకాంక్షిత స్ఫూర్తి = అన్వయమున కపేక్షితము లగుపదములయొక్క ప్రకాశమును, ఆచరించుచున్ = చేయుచు - అన్వయమున సాపేక్షము లైనపదములు స్ఫుటముగా నుండవలెను.

శాఖాచంక్రమక్రియన్=ఒకకొమ్మనుండియొకకొమ్మకుఁ బోవుచుఁ జెట్టునుండిదిగకుండుటవలె ప్రస్తుతమైన దానికివిశేషముగా సంబంధము లేనియంశమును హెచ్చుగాఁ జెప్పుట (ఇది యపుష్టార్థ మనుదోష మగును లేక వాచ్యవివర్జితము అనుదోష మగును,) కడవన్=(ప్రధానవిషయము) దాఁటి, చనక=పోక, ప్రకృతార్థభావంబు = ప్రస్తుత మగునంశముయొక్క యభిప్రాయము, పాదుకొనన్ = స్థిరపడునట్లుగా, ఉపపత్తి = యుక్తి (లేక, హేతువు,) అత్యూర్జితము = మిగుల బలముగలది, కాన్ = అగునట్లు, అదుకుచున్ = కూర్చుచు.

ఒకటన్ = ఒకచోటనైనను, పూర్వోత్తర విరోధము = వెనుకఁ జెప్పినదానికిని ముందు చెప్పిన దానికిని విరుద్ధత, ఒదవకుండన్ = కలుగ కుండఁగా, తత్తత్...భేదములు = తత్ + తత్ = ఆయాయి, అవయవవాక్య = అప్రధానము లగు వాక్యములయొక్క, తాత్పర్య భేదములు=వేఱు వే అభిప్రాయములు, మహావాక్య తాత్పర్యమునకున్ = ప్రధాన వాక్యముయొక్క, (రామాయణాది ప్రబంధముయొక్క అని కొందఱు) తాత్పర్యమునకున్ = అభిప్రాయమునకు, ఒనరన్ = తగునట్లు, పలుకన్ = మాటాడఁగా, నేర్చుట, (కవిత్వము చెప్ప నేర్చుట యని ధ్వని.) బహుతపఃఫలము + కాదు + ఎ=గొప్పతపస్సుయొక్క

ఫలము గదా - గొప్పతపస్సు చేసి యుండనిదే పైని జెప్పినరీతి వచోరచన లభింప దని భావము. "నరత్వం దుర్లభం లోకే విద్యా తత్రచ దుర్లభా, కవిత్వం దుర్లభం తత్ర వివేకస్తత్ర దుర్లభః" అనియు-జగతినరజన్మ, తత్రచ, వైదుష్యం - తత్రసత్కవితా, కవితాయాం పరిణామో, దుష్ప్రాపః పుణ్యహీనేన" అనియు - అభియుక్తోక్తులు పైయర్థమున కుపష్టంభకములు.

వి. :—మహావాక్యమును గూర్చి సాహిత్యదర్పణమున నిట్లున్నది.

"వాక్యోచ్చయో మహావాక్యం" - యోగ్యతాకాంక్షాసత్తియుక్త - ఇత్యేవ. (వాక్యోచ్చయః) అని వివరించి - "స్వార్థబోధే సమాప్తానా మంగాంగిత్వవ్యపేక్షయా, వాక్యానా మేకవాక్యత్వం పునః సంహత్య జాయతే. వాక్యం యథా "శూన్యం వాసగృహం" ఇత్యాది. మహావాక్యం యథా:— రామాయణ, మహాభారత, రఘువంశాది (తమతమ యర్థమును బూర్తిగాఁ జెప్పుచు, అంగాంగిభావము గల వాక్యము లన్నియుఁ గూడి, ఏకవాక్యముగా నగును. అట్టి యేకవాక్యమే మహాకావ్యము. అది యేది యనిన రామాయణ, మహాభారత, రఘువంశాదికము) అని. శుచిముఖిపలుకు లన్నియుఁ గ్రోగుచేసి, యందలి భావాదికము పరిశీలించినచో నొక కావ్య మగు నని వ్యంగ్యము. "ఆకాంక్షితసుపూర్తి" యనుపాఠమున - అన్వయమున కపేక్షితములగు పదములకు జక్కఁగాఁ బూరించుట యని యర్థము.

క. నీ వెవ్వరికోలఁదివి గా,వో వరటామణి విహంగసామాన్యవె భాషా
ప్రావీణ్యము చూడఁగ వా,గ్దేవతవో కాక యాకెదిద్దిన కవివో. 4

అర్థము:—ఓ వరటామణి = శ్రేష్ఠురాల వగునోయాఁడుహంసమా! ('హంసస్యయోషిద్వరటా' అని అమరము) నీవు, ఎవ్వరికోలఁదివి = ఎవ్వరివంటిదానవు, కావు, నీకు పోలికయే లేదు అని భావము - భాషా ప్రావీణ్యము = మాటలనేర్పు, చూడఁగన్ = పరిశీలింపఁగా, వాగ్దేవతవు + ఓ = సరస్వతీదేవివో, కాక= అట్లుకాక, అకె = ఆమె, దిద్దిన = (చదువు) నేర్పిన, కవివి+ఓ = రసమయములగు శబ్దార్థములచేఁ గావ్యము రచించుదానవో, (నీటిపక్షివో యని యర్థాంతరము) అంతియకాని - విహంగయోషవు+ఎ = సాధారణమగు నాఁడుపక్షివి ? కావుసుమా అని భావము.

తాత్పర్యము:— ఓ యంచపడఁతిమిన్నా! నీవు సాటిలేనిదానవు. నీ మాటనేర్పు చూడఁగా సరస్వతివో, లేక యామెవద్ద విద్యలనన్నిటిని నేర్చిన కవివో యగుదువు కాని సాధారణ మగు ఆఁడు పక్షివిమాత్రము కావు. -

అలం:— సందేహము.

వి. :—"కవి" శబ్దము, విశేషణము అని కేశవనిఘంటువు, కావున పుంలింగ స్త్రీలింగములందు సమముగా నుండును. అది యిచటఁ బ్రయోగింపఁబడుట యెంతయు నుచితముగా నున్నది. విద్వదాది శబ్దములకున్నట్లు కవి శబ్దమునకు స్త్రీ ప్రత్యయ విధానము లేమింజేసి యుభయ లింగమైనదని తెలియఁదగును. శబ్దకల్పద్రుమమున - ఈ శబ్దము. త్రి. అని కలదు.

క. అనుటయు రెండవపక్షం, బనిమిషవర తప్ప దెట్టిసయర్థమును దగు
లొక్కనఁ దివియక వెలి వోని,చ్చునె బుధుఁ డూహించి చేయుసుకవిత్వంబుల్. 5

అర్థము:— అనుటయున్ = ఇట్లు పలుకఁగా, అనిమిషవర = రెప్పపాటులేనివారగు దేవతలకు ప్రభువా! రెండవపక్షము = సరస్వతీదేవి దిద్దిన కవివి అను రెండవ యర్థము, తప్పదు = తప్పిపోలేదు. నిజము. బుధుఁడు=పండితుఁడు, (దేవతయని యర్థాంతరము) ఊహించి=భావించి, చేయు సుకవిత్వంబుల్= చేయునట్టి యుత్తమ రచనలు, ఎట్టియర్థమును = ఎంతయో గొప్పదగు అర్థవిశేషము గూడ, తగులొక్కనన్= లగ్న మగునట్లు, తివియక = ఆకర్షింపక, వ్యంగ్యార్థము లేకుండ అని భావము, వెలివోనిచ్చునే = దాఁటి పో నిచ్చునా.

తాత్పర్యము:—ఇంద్రుఁ డిట్లనఁగా - హంసి యిట్లనె "ఓ దేవవిభూ ! నీ వనిన వికల్పములో మొదటి పక్షము" నీవు సరస్వతివో యనునది కాదు కాని "ఆమెవలన శిక్షపొందిన కవివి" యను రెండవపక్షము మాత్రము నిజము. క్రౌంచరంధ్ర మనుటచే నీవు సుకవి వైతివి. పండితుఁడు చేయునట్టివ్యంగ్యప్రధాన మగు నుత్తమకవిత్వమున నెన్నియో యర్థము లిమిడియుండునుకదా !"-

అలం:—శ్లేషము, అర్థాంతరన్యాసము.

వి. :—ఇందు హంసి 'సరస్వతికి శిష్యురాల' నని వాచ్యముగాఁ జెప్పిన నహంకార మగు నని నీ వనిన "సరస్వతివో" యను మొదటి పక్షము కాదు. కాని "ఆమె దిద్దినకవివో" అను రెండవపక్షము నిజము. "కవి" నని యహంకరించుచుంటి ననుకొంటి వేమో ? నీమాటయందే కవి = నీటిపక్షి యని యర్థము స్ఫురించుచున్న" దని వ్యక్తమగునట్లు హంసయగుట సూచించుచు - నీవు బుధుఁడవు అనఁగా దేవుఁడవు, మీకు దివ్యదృష్టి యుండును - పండితుఁడవు కూడ నగుదువు కావున నీ రచన సుకవిత్వ మగును. "కవి క్రౌంచరంధ్ర" యనందురు గాన ఇంద్రియాతీత మగునర్థము గూడ గ్రహించువాఁడవే అని యింద్రుని యెడ గౌరవమును సూచించుచున్నది. ఇంతియకాక పండితుఁ డగునీకవి "తనకావ్యమున నిట్టివ్యంగ్యము లెన్నియో ఉండు"నని హంసినోటఁ బలికించుట యొకవిచిత్రశ్లేషము.

ఆ. విను సురేంద్ర పద్మజుని తేరు దివుచు సారంధరాఖ్యుఁ డగు మ రాళవిభుని
బిడ్డ నేను వాణి పెనుపంగఁ బెరిఁగి తద్విమలశిక్షఁ గంటి విద్య లెల్ల. 6

అర్థము :—సుర + ఇంద్ర = దేవేంద్రా!, విను = వినుము, నేను, పద్మజుని తేరు = (పద్మము నందు పుట్టిన) బ్రహ్మయొక్క రథమును, తివుచు లాగునట్టి, సారంధరాఖ్యుఁడు = 'సారంధరుఁడు' అను పేరుగల, మరాళవిభుని బిడ్డన్ = హంసలరాజుయొక్క కూఁతురను, వాణి - సరస్వతీదేవి, పెనుపంగన్ = పెంపఁగా, పెరిఁగి, తద్విమలశిక్షన్ = ఆమెయొక్క స్వచ్ఛమైన విద్యాబోధనముచే, ఎల్లన్ విద్యలు = అన్నివిద్యలను, కంటిని = తెలిసికొంటిని, నేర్చితిని.

తాత్పర్యము :—ఇంద్రా వినుము. బ్రహ్మరథమును లాగునట్టి సారంధరుఁ డను హంసరాజుయొక్క కూఁతురను నేను. నన్ను సరస్వతి పెంచినది. ఆమెయే యెల్లవిద్యలు నేర్పఁగా నేర్చితిని.

వ్యా. :—"సారంధర. సూ. "సంజ్ఞాయాం భృతౄవృజిధారి సహితపి దమః". (3-2-46) చే "ఖచ్" ప్రత్యయమురాఁగా "సార + ధర" - అయి ముమాగము వచ్చి "సారంధర" అని సంజ్ఞావాచక పద మగును.

వ. అని రాజహంస (సి ?) తనపూర్వం బెఱింగించిన దేవేంద్రుఁడు దానంజేసి కాదె నీ వింత సామర్థ్యంబునం బొలుపు మీఱుచున్నదానవు. మీఁదికార్యంబునకుం బర్యాకులిత భావంబునం జేసి త్రోవగానక దీనత నున్న మాకు మాపాలిటి భాగ్య దేవత యీవిధంబున నిన్ను నన్నిటికి నాధారంబుగా ననుగ్రహించెం గావున దేవకార్యంబు కడముట్ట నిర్వహించుటకు నీవ తక్క నొరులు నేర రిది యంతయు నెఱింగి యెంతయుం బ్రార్థించెద నంచబలఁగంబుతో నెప్పటియట్ల వజ్రపురంబున కరిగి కేళిదీర్ఘికల విహరించుచుఁ బ్రభావతితోడి చెలిమికలిమికి నుపాయం బొనర్చి యమ్ముద్దియకుం బ్రద్యుమ్నునం దనురాగంబు బలియునట్లుగా వలయు తెఱంగున నతనిగుణంబు లభివర్ణించి యాయిద్దఱకును శీఘ్రసంగమం బెవ్విధంబున నగు నది నీవ యెఱింగి సంఘటింపుము.

అర్థము:—అని = ఇట్లు చెప్పి, రాజహంసి = (ని. రాజహంసాస్తు తే చంచుచరణై ర్లోహితైః సితాః అని అమరము) ఎఱ్ఱనగు కాళ్లును ముక్కును గల తెల్లనిహంసలు - రాజహంసలు. స్త్రీత్వవివక్షయందు రాజహంసి అగును) శుచిముఖి, పనపూర్వంబు తనవెనుకటివృత్తాంతము, ఎఱింగించినన్ = తెలుపఁగా, దేవేంద్రుఁడు (ఇట్లనుచున్నాఁడు.) వాణిం బేసి కొని - (సరస్వతిచేతలోఁ జేరఁగి యామెవలన విద్యల నెల్ల నేర్చితివి) ఆ పేరుపుచేతనె కదా, నీవు, ఇంత, సామర్థ్యంబునన్ = సమర్థతతో, పొలుపు మీఱుచున్న దానవు ఒప్పుచున్నావు, మీఁది కార్యంబునకున్ = ముందు చేయఁదగు పనికి, పర్యాకులిత= (పరి+ఆకులిత) కలఁత నొందిన, భావంబునన్ = చేసి = మనస్సుచేత, త్రోవ=ఉపాయము, కానక=పొందలేక, దీనతన్ = వెడఁగుఁదనముతో, ఉన్న మాకున్ = ఉన్న మా దేవతల కంపఱకు, మాపాలిటి భాగ్యదేవత=మా యదృష్టదేవత, ఈ విధంబునన్=ఈ రీతిగా, నిన్నున్, అన్నిటికిన్ = ఎల్లపనులకు, (వజ్రనాభసంహారమునకు, ప్రభావతీ ప్రద్యుమ్నుల సమావేశమునకును) ఆధారంబుగాన్ ఆశ్రయముగా, అనుగ్రహించెన్ = దయచే నిచ్చినది (కర్తభాగ్యదేవత). కావునన్, దేవకార్యంబు = దేవతలయొక్క పని (వజ్రనాభవధ) కడముట్టన్ = తుదకంట, నిర్వహించుటకు = నెఱవేర్చుటకు, నీవు + అ = నీవ తక్క = నీవేతప్ప, ఒరులు = ఇతరులు, నేరరు = నెఱవేర్పఁజాలరు - (నేరను. సూ. నేరరు. సూ. నేరుచునకు లిఙ్లోట్టులు ముత్తుం బరంబు లగునపుడు ఉ, చు లకు లోపంబు బాహుళంబుగా నగు. బాల. క్రియా. 97.) ఇది=ఈ విషయము, అంతయున్, ఎఱింగి = తెలిసినకారణముచేత, ఎంతయున్, ప్రార్థించెదన్, (నీవు) అంచ బలఁగంబులతోన్ = హంసపరివారముతో, ఎప్పటియట్లు + అ = పూర్వమువలెనే, వజ్రపురంబునకున్, అరిగి = వెళ్లి, కేళి దీర్ఘికలన్ = విహారార్థము నిర్మించిన దిగుడు బావులందు, విహరించుచున్ = స్వేచ్ఛతో సంచరించుచు, ప్రభావతి తోడి చెలిమి కలిమికిన్ = ప్రభావతితో నగు స్నేహసంపదకు - అనఁగా ప్రభావతితో నెక్కువమైత్రి కలుగునట్లు - ఉపాయంబు = పన్నగడ, ఒనర్చి, అమ్ముద్దియకున్ = ఆ యింతికి, ప్రద్యుమ్నునందున్, అనురాగంబు = ప్రేమ, - వలపు, బలియునట్లుగాన్ = పెరుఁగు రీతిని, వలయు తెఱంగునన్ = కావలసిన విధముగా, అతని గుణంబులు, అభివర్ణించి = స్తుతించి, ఆ యిద్దఱకును, శీఘ్రసంగమంబు = వెంటనే కలిసికొనుట, ఎవ్విధంబునన్, అగున్, అది, నీవు + అ, ఎఱింగి, సంఘటింపుము = కూర్పుము.

తాత్పర్యము:—అని తన వృత్తాంతము చెప్పిన శుచిముఖితో నింద్రుఁ డిట్లనుచున్నాఁడు. నిజమే. నీవు సరస్వతికి శిష్యురాలవు కాననే యింత సమర్థురాల వైతివి. మనసు కలఁగి ముందు పనికిఁ ద్రోవ దొరకకున్న మాకు మా పుణ్యమున నీవు దొరకితివి. దేవకార్యము నీవేగాని యితరులు చేయఁజాలరు. నీ హంస పరివారముతో వెనుకటివలెనే వజ్రపురమున కేఁగుము. ఆటకొలఁకులందు విహరించుచు ప్రభావతితో దృఢ స్నేహ మొనర్చి, యామెకు ప్రద్యుమ్నునందు వలపు గలుగునట్లు వాని గుణములను సందర్భోచితముగా స్తుతించి, యాయిద్దఱు వేగముగా కలిసికొను నుపాయం బూహించి వారిని నిరపాయముగా కలుపుము అని ప్రార్థించుచున్నాను.

వ్యా. :— చెలిమి. సూ. పేర్వాదుల కిమి వర్ణకంబగు - బాల. తద్ధిత. 5. ఇది తద్ధితాంతము, కలిమి - సూ. ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు. కృదంత. 4. ఇది కృదంతము. చెలి + ఇమి, కలుగు+ఇమి.

వి. :—రాజహంస పాఠము ప్రమాదము కావచ్చును. రాజహంసి యనుట న్యాయము. అదియే కవిప్రయుక్తము కానోపు.

క. ఏ ననిపితి నని ద్వారవతీ నగరికిఁ బోయి వాసుదేవునితో నీ
పూనిక సకలము చెప్పి న, వీనాదృతి నతనిబుద్ధి వినిశ్చనవలయున్. 8

అర్థము:—ద్వారవతీనగరికిన్, పోయి, ఏను=నేను, అనిపితిని=పంపితిని, అని, వాసుదేవునితోన్= వసుదేవపుత్రుఁ డగు కృష్ణునితో, నీపూనిక = నీ ప్రయత్నము, సకలము, చెప్పి, అతనిబుద్ధిన్ = అతని

యాలోచనము, నవీన + ఆదృతితోన్ = క్రొత్తదగు నాదరముతో - హెచ్చగు శ్రద్ధతో, చనవలయున్ = (నీవు) వెళ్లవలెను.

వ్యా. వి. :—'పోవు' ధాతు - ప్రేరణరూపములు. అనుచు, అనుపు, అంపు, పనుచు, పనుపు పంపు, పుచ్చు - అనునవి.

క. అని హంసంబుల నన్నిటి, గనుఁగొని మీ రెల్ల దీని కార్యవిధికి న
త్యనుకూలతమైన నేత, ద్వినియోగము నడపవలయు దేవహితముగన్. 9

అర్థము:—అని, హంసంబులన్, అన్నిటిన్, కనుఁగొని, మీరు, ఎల్లన్ = అందఱును, దీని కార్య విధికిన్ = ఇది చేయఁదగినపనికి, అతి + అనుకూలతమైన్ = ఎక్కువ సాయముతోనుండి, దేవహితముగన్ = దేవతలక్షేమము కలుగునట్లు, ఏతద్వినియోగము = దీనియొక్క నియమనము - ఆజ్ఞను, నడపఁగవలయున్ = ప్రవర్తిల్లఁ జేయవలెను. ఇది చెప్పినట్లు మీరు చేయవలెనని భావము.

వ్యా. వి. :—హంసము, రూ. హంస. సూ. చరిత్రాదుల ముపర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు. బాల. తత్సమ. 58. అత్యనుకూలతమైన్ = సూ. జడపదంబుల మీఁది తోడకు మెయి, మై లు విభాషగా నగు. ప్రౌఢ. శబ్ద. 18,

ఆ. అని యనుప మరాళి యమరాళి కార్యం బొనర్పఁ జనియె సురలు నమ్మి పొగడఁ
బరిగణింప విశదపక్షపాతుల ప్రవర్తనము లెట్లు నమ్మఁదగక యున్నె? 10

అర్థము:—అని = ఇట్లు తక్కినహంసలతోఁ జెప్పి, అనుపన్ = తోడుగా పంపిన పిదప, సురలు = దేవతల సముదాయము, నమ్మి = (దానిమాటలను) విశ్వసించి, పొగడన్ = మెచ్చుకొనఁగా, మరాళి = ఆ యాఁడుహంస, అమర + ఆళి కార్యంబు = దేవతాసముదాయముయొక్క పనిని, ఒనర్పన్ = చేయఁగా, చనియెన్ = పోయెను, పరిగణింపన్ = ఆలోచింపఁగా, విశదపక్షపాతుల = స్పష్టమైనప్రేమ గలవారి యొక్క, (తెల్లని ఱెక్కలయొక్క ప్రసారము గలవానియొక్క అని హంసపక్ష మగు నర్థాంతరము), ప్రవర్తనములు = నడవడులు, ఎట్లున్ = అన్నివిధములచేతను, నమ్మన్ + తగక + ఉన్నె = నమ్ముటకు వీలు గాకుండునా, అనఁగా సర్వవిధములచేత నమ్మఁదగినవే యని భావము.

అలం:—అర్థాంతరన్యాసము, శ్లేషము.

వ. అది యట్లుండె నట్లు గదలి చని.

తా. ఆ యింద్రుఁడు హంసల నట్లు పంచెను. అనంతరము శుచిముఖి తోడిహంసలతో బయలుదేఱి పోయి,

గీ. అష్టమహిషీసమేతుఁడై యాలయోపవన సరస్తీర మండపవర్తి యైన
కృష్ణు దవుదవ్వుల నెవిలోకించి తెలిసి, యితని నెఱిఁగించుకొన వేళ యిదియ యనుచు.

అర్థము:—అష్టమహిషి=ఎనుమండ్రుపట్టపురాణులతో, సమేతుఁడై, కూడుకొన్నవాఁడై, ఆలయ... వర్తి - ఆలయ = (తన) గృహముదగ్గఱనున్న, ఉపవన = పూఁదోఁటయందలి, సరః = కొలనియొక్క, తీర = ఒడ్డుననున్న, మండప = చావడియందు, వర్తి = ఉన్నవాఁడు, ఐన కృష్ణున్, దవుదవ్వులన్ + ఎ= మిగుల దూరమందుండియే, తెలిసి = ఈతఁడు కృష్ణుఁడేయని గుర్తించి, ఇతనిన్ = ఈకనఁబడుచున్న కృష్ణుని, ఎఱిఁగించుకొనన్ = (తన్నాతఁడు) ఎఱుఁగునట్లు చేసికొనుటకు, పరిచయము చేసికొనుట కని భావము, ఇదియ = ఇదే, వేళ = తగినసమయము, అనుచున్ (శుచిముఖి) = అనుకొనుచు,

వి. :—అష్టమహిషులపేళ్ళు ముందు పద్యమునందు తెలియును. (ని. కృతాభిషేకా మహిషీ అని అమరము.) దవు దవ్వులు:—దవ్వు దవ్వులు - అత్యంతార్థమున ఆమ్రేడితరూపము.

క. తనయంచబలంగముఁ దా,నును శుచిముఖి నభము డిగ్గి నూత్నవిలాసం
బొనరించె సరోలక్ష్మికిఁ, గనకాంచితపక్ష చకచకద్యుతిచేతన్. 13

అర్థము:—శుచిముఖి, తనయంచబలంగమున్ = తనయొక్క హంసలపరివారమును, తానును, నభము (న్) = ఆకాశమునుండి, డిగ్గి = క్రిందికిదిగి, కనక ... ద్యుతిచేతన్, కనక = బంగారు (రేఖల) చేత, అంచిత = ఒప్పుచున్న, పక్ష = ఱెక్కలయొక్క, చకచకద్యుతిచేతన్ = చకచకమను కాంతిచేత, సరోవరలక్ష్మికిన్ = శ్రేష్ఠ మగు నాకొలనియొక్క సంపదకు, నూత్నవిలాసంబు=క్రొత్త దగుఅందమును, ఒనరించెన్ = ఒనరఁజేసెను, కలిగించెను.

తాత్పర్యము:—ఆశుచిముఖి తనహంసల పరివారముతో మింటినుండి క్రిందికి దిగి కృష్ణుని యుద్యాన సరస్సునకు, బంగారురేఖలుగల ఱెక్కలతళుకులచేత నొకక్రొత్త యందము కలిగించెను. ఆ హంసలు కొల నిలో వ్రాలుటచే నొకయపూర్వశోభ దానికిఁ గలిగె నని భావము.

వ్యా. వి. :—నభము డిగ్గి - సూరిమతమున ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగు. బాల. కారక, 21 సూత్రముచే.- నభమువలన అనుదానికి బదులుగా నభమున్ అని యగును. ప్రౌఢవ్యాకర్త మతమున - వలన కనుప్రయుక్తంబగు ఉండి శబ్దము పరముగానున్నపుడు 'వలన' కు వికల్పముగా నాదేశము లగు ద్వితీయాసప్తములలో నేదే నొకటి యుండఁగా - మీఁదనున్న "ఉండి" పదంబు వికల్పముగా లోపించు ననియు "వలన కాదేశంబు లైనద్వితీయాసప్తములమీఁది "ఉండి" కి లోపంబు విభాషనగు"నని సూత్రింపబడెను. కాని ఉండిపదము నిమిత్తముగా వలన కాదేశముగా వచ్చిన ద్వితీయాసప్తములు సన్ని పాతపరిభాషచే "ఉండి" పదలోపమునకు నిమిత్తము కాఁగూడదు. కావున బాలవ్యాకరణమతమే శాస్త్రీ యమును, సమంజసమును నగును.

వ. తదనంతరంబ తా నొక్కతియ రక్కసులగొంగ చెంగటికి నల్లనల్ల నడచి. 14

అర్థము:—తత్ + అనంతరంబు + అ = ఆకొలనిలో వ్రాలిన వెంటనే, (శుచిముఖి) తాను, ఒక్కతియ, రక్కసులగొంగ = రాక్షసవిరోధి యగు కృష్ణునియొక్క, చెంగటికిన్ = సమీపమునకు, అల్లన్ + అల్లన్ = మెల్లమెల్లగా, నడచి

రాక్షసుఁ డగువజ్రనాభునివధకు హెచ్చరింప శుచిముఖి రక్కసులగొంగ దరికి వచ్చిన దనుటచే "రక్కసులగొంగ!" సాభిప్రాయ విశేష్య మగుటచే అలంకారము పరికరాంకురము.

సీ. తొడలు తలాడగాఁనిడి రుక్మిణి భజింపఁ, బదము లొత్తుచు సత్యభామ కొలువ
సురఁటి చేకొని భద్రశుశ్రూష గావింప, విరిచామరము మిత్రవింద యిడఁగఁ
గాళింది వేడ్కతోఁగాళంజి దాల్ప జాం,బవతి తములపాకుమడిచి యొసఁగ
గొడుగు పావలు కేలఁగొని నాగ్నజితి యుండ, జలములగిండి లక్షణ వహింప

గీ. గ్రొమ్మెఱుంగులతోడి కార్మొగులువోలె, నొప్పుకృష్ణునిచేరువనొప్పు హంసి
నిండునెలరీతిఁ దారకానీతనభంబు, పొలపుఁ దెలిపెడినె తమ్మికొలనికెలన. 15

అర్థము:—రుక్మిణి, తలాడగాన్ = ఉపధానముగా, (తలఁగడ తలాడ తలాపి తలయుండి యొనగు నా నుపధానసంజ్ఞయై యొప్పుచుండు ఆం, భా. ద్వి. 163) ఇడి = ఉంచి, భజింపన్ = సేవింపఁగా,

సత్యభామ, పదములు = పాదములను, ఒత్తుచున్, కొలువన్ = సేవించుచుండఁగా - భద్ర = భద్ర యనునామె, సురఁటి = వట్రువవిసనకఱ్ఱ, చేకొని, శుశ్రూష = సేవను, కావింపన్, మిత్రవింద, విరిచామరను = పుష్పములవిసనకఱ్ఱ, ఇడఁగన్ = గ్రహించి విసరుచుండఁగా, కాళింది, వేడ్క_తోన్ = ఉత్కంఠతో, కాళంజి=తమ్మ యుమియు పాత్రమును, తాల్పన్=ధరింపఁగా, జాంబవతి=జాంబవంతుని కూఁతురు, తములపాకు, మడిచి = సున్నము రాసి మడిచి, ఒసఁగన్, నాగ్నజితి, గొడుగును, పావలును = పాదుకలను, కేలన్ + కొని = చేతులఁబూని, ఉండన్ = నిలిచియుండ, లక్షణ, జలములగిండి = నీరు త్రాగు సన్నపుమెడ గలచెంబు (కూజా)ను, వహింపన్ = ధరింపఁగా, క్రొమ్మెఱుంగులతోడి కార్మొగులువోలెన్=క్రొత్తమెఱుపులతోఁ గూడియున్న వానకాలపు మబ్బువలె, ఒప్పుకృష్ణుని చేరువన్ = ప్రకాశించుచున్న కృష్ణునకు సమీపమున, తారకాన్వితనభంబు పోలుపున్ = నక్షత్రములతోఁ గూడియున్న యాకసముయొక్క సొగసును, తెలిసెడి = వెల్లడించుచున్న, సెత్తమ్మి కొలని కెలసన్ = తామరచెఱువు దరిని, నిండు నెలరీతిన్ = పూర్ణచంద్రునివలె, హంసి = శుచిముఖి, ఒప్పెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:— అష్టమహిషీ సమేతుఁడై కృష్ణుఁ డెట్లుండెనో, అతని దగ్గఱనున్న శుచిముఖి యెట్లున్నదో యీపద్యమున వర్ణింపఁబడెను. రుక్మిణి తలగడగాఁ దనతొడల నొంపఁగా - సత్యభామ కాళ్లొత్తుచుండ, భద్ర సురఁటి వీచుచుండ, మిత్రవింద పూలచామర వేయుచుండ, కాళింది లమ్మపడిగము (పతద్గ్రహము) పట్టఁగా, జాంబవతి యాకుమడుపు లిచ్చుచుండ, నాగ్నజితి రాజచిహ్నా మగుచత్రమును, పాదుకలను జేతులబూని నిలిచియుండ, లక్షణ నీటిపాత్ర చేతఁ బట్టుకొని యుండ, నాయెనమండ్రు దనకొమ్ము తోలఁకరి మెఱుపులతోఁ గూడియున్న వానకాలపు మేఘమువలెఁ గృష్ణుఁ డుండెను. అతని సమీపమున పూచిన తామరపూలకొలను నక్షత్రములతో నున్నయాకసమువలె నుండ దాని ప్రక్కన నిండుచందురునివలె శుచిముఖి యొప్పుచుండెను. ఇందు కృష్ణుని యెనమండ్రు భార్యలు చెప్పఁబడిరి.

అలం:—ఇందు సీసపాదములు నాల్గిటియందును అలంకారము స్వభావోక్తి. గీతమునందు ధర్మలుప్తోప మాలంకారము - రెండిటికిని సంసృష్టి.

వ్యా. వి.:—కాళంజి రూ. కాళాంజి. 'స్త్రీ' కాళాంజి యనఁ బవద్గ్రాహిణివగు. ఆం. భా. ద్వి. 168. సూ. ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబునకు విభాషనగు - బాల. ప్రకీర్ణ. 11. సూత్రమున కాళాంజి, కాళంజి. యగును.

తమలపాకు - తములపు + ఆకు - అనుచోట టుగాగమము నిత్యముగా రావలసి యున్నది. కాని మహాకవుల ప్రయోగములందు. కప్రపనఁటులకెంతన్ - యయా. 4-28. సబ్బరపుబ్బగు నిక్కుగుబ్బ. కెద్దన మాలిక, పట్టపేనుంగు శ్రీరంగపతికి. పాండు. 1-77 అయ్యలియల వేణితోఁ బగలపాకులబోరు లాడఁబోయు - వీథినాటకము ఇత్యాదిగా కనవచ్చుటచేత 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.' (బాల.సంజ్ఞా 23.) సూత్రమున ఈటుగాగమ మిట్టికొన్నిచోట్ల మాత్రము రా దనుకొనఁదగును. క్రొమ్మెఱుంగు - క్రొత్త + మెఱుఁగు సూ. సమాసం బులం బ్రాఁతాదు తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 36 చే - క్రొ + మెఱుఁగు - అగును. సూ. క్రొత్తశబ్దమున కాద్యక్షర శేషమునకుం గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. బాల. సంధి. చే - క్రొమ్మెఱుఁగు - అనియెనది.

సెత్తమ్మి:—సెఱ + తమ్మి. సెఱశబ్దము ప్రాఁతాదిగణములోనిది కా కున్నను తద్గుణకార్యము లతిదిష్టము లగుటచే - 'క్రొమ్మెఱుఁగు'వలెనే యగుచున్నది.

తే. బెదరు లేకిట్లు మిక్కిలి కగదియ వచ్చి,యున్నఁ దనదిట్టతనమునకు కువిద లెల్ల
నరుదుపడఁ గృష్ణుఁ జూచి నోరన్నమరవిభుఁడు, పనిచె నీ కొక్కమాట చెప్పంగననియె,

అర్థము :— బెదరు=భయము, లేక, ఇట్లు, మిక్కిలి, కదియన్=సమీపింపఁగా, వచ్చి యున్నన్=వచ్చియుండఁగా, ఉవిదలు = రుక్మిణిమున్నగు స్త్రీలు, ఎల్లన్, తన దిట్టతనమునకున్ = తనధైర్యమునకు, దానిధైర్యము నెఱింగి అనిభావము, అరుగుపడన్ = ఆశ్చర్యమొందఁగా - (శుచిముఖి) కృష్ణున్, చూచి, నీకున్, ఒక్కమాట, చెప్పంగన్, అమరవిభుఁడు = దేవేంద్రుఁడు, నన్నున్, పనిచెన్, అనియెన్=అని పల్కెను.

వ్యా. వి. :— ఉన్నన్, ఉండిసన్ - సూ. చేదాద్యర్థం బయిన ఉండున కున్నాదేశంబు విభాష నగు. బాల. క్రియా. 57.

వ. అని తదనంతరంబ. 17

అర్థము :— అని = ఇట్లుపలికి, తత్ + అనంతరంబు + అ = దానివెంటనే.

క. తన తనయుఁడు రాక్షసుపైఁ, జనియెడు నని రుక్మిణికి నసమ్మత మగునో
యనుశంకఁజేసి హంసాంగన యేకాంతంపుమాట గల దని పలికెన్. 18

అర్థము :— తనతనయుఁడు = తనకొడుకగు ప్రద్యుమ్నుఁడు, రాక్షసుపైన్=వజ్రనాభుని మీఁదికి, చనియెడున్ = దండెత్తివెళ్లును, అని = అనితలఁచి, (తాను చెప్పునది) రుక్మిణికిన్, అసమ్మతము = సమ్మతముకానిది, అగును + ఓ = అగునేమో, అనుశంకఁజేసి = అనెడు సందేహముచేత, హంసాంగన = ఆయాఁడుహంస-శుచిముఖి, ఏకాంతపుమాట = రహస్య మగుమాట, కలదు, అని, పల్కన్ = చెప్పఁగా, (మీఁది కన్వయము.)

తాత్పర్యము:— వజ్రనాభవధను గూర్చిన యాలోచనమున నచ్చటివా రెవ రున్నను కార్యహానిలేదు. కాని దుష్టుఁడగు రాక్షసునిపైకిఁ దనకొడుకు యుద్ధమునకు వెళ్లు నని వినఁగానే మాతృప్రేమచే రుక్మిణి యంగీకరింప దేమోయని సంశయించి, ఆమె నొక్కతెను దూరముగాఁ బొమ్మనుట తప్పగునని, వారందఱును దూరముగా తామె వెడలిపోవునట్లు ఏకాంతపుమాట యున్నది అని శుచిముఖి పల్కెను. ఇందలి యౌచిత్యము సంస్తుత్యము.

క. పలికినఁ గమలావిభుఁ డా, పులుఁగుపడఁతి మాటనేర్పు బుద్ధికళాకౌ
శలమును మెచ్చుచు నెంతయు, మొలకనగవు చెక్కుటద్దములఁ దళుకొత్తన్. 19

అర్థములు:— పలికినన్=అట్లు పలుకఁగా, కమలావిభుఁడు=లక్ష్మికి పతియగు నాకృష్ణుఁడు, ఆపులుఁగుపడఁతి మాట నేర్పున్ = ఆయాఁడుపక్షియొక్క మాటనేర్పును, బుద్ధికళా = ఆలోచన లేక వివేక మను విద్యయందలి, కౌశలమును = నేర్పును, ఎంతయున్ = అత్యంతమును, మెచ్చుచున్, మొలకనగవు=లేఁత నవ్వు, చెక్కుటద్దములన్ = అద్దములవంటి చెక్కిళ్లయందు, తళుకొత్తన్ = ప్రకాశింపఁగా-(బుద్ధిన్ = వివేకమును, కళాకౌశలమును=దూత్యమందలి నేర్పును, అనియు నన్వయింపవచ్చును. దూత్యము చతుష్షష్టి విద్యలం దొకటి కావున.)

వి. :— కమలావిభుఁ డనుటవలన - రుక్మిణీపతి యని యర్థము. "రాఘవత్వేఽభవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని । అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ" అనుసూక్తిచే లక్ష్మియే రుక్మిణిగాఁ బుట్టిన దని తెలియుచున్నది. హంసయొక్క భావమును కృష్ణుఁడు గ్రహించె ననుటకు చిఱునవ్వు సూచకము కావచ్చును.

వ్యా. :—చెక్కు + అద్దము - ఉపమానోత్తర పదకర్మధారయము. కావున ఉత్తున కచ్చు పరమగుటచే టుగామము వచ్చి, చెక్కుటద్దము అగును. తళుకు + ఒత్తు - తళుకొత్తు. శబ్దపల్లవక్రియ - సూ. ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులై విలక్షణార్థాభిధాయకంబు లగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు. బాల. క్రియా. 118.

చ. చెలువుగ భోజకన్యతొడఁ జేర్చినమూర్ధము సత్యభామయూ
రులపయి నున్నపాదములఁ బ్రోర్జితలీలఁ దరల్చి లేచి, యు
జ్జ్వల నిజపాణిపద్మమున జాంబవతీకర నాగవల్లికా
దళములు పుచ్చుకొన్నఁ బ్రమదల్ చని రందఱు గొంత దవ్వుగన్. 20

అర్థములు:—చెలువుగన్ = సొగసుగా, భోజకన్య = (భోజ - విదర్భ దేశాధిపతియగు భీష్మకుని కూఁతురగు) రుక్మిణి యొక్క, తొడయందు, చేర్చిన = మోపిన, మూర్ధమున్ = తలయును, సత్యభామయూరులపయిన్ = సత్యభామతొడలపై, ఉన్నపాదములన్, ప్ర + ఊర్జిత - ప్రోర్జితలీలన్ = అధికమగు విలాసముతో, తరల్చి = తొలఁగించి, లేచి, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, నిజ = తనయొక్క, పాణిపద్మమునన్ = తామరపువ్వువంటిచేతితో, జాంబవతీ...దళములు - జాంబవతీ = జాంబవతియొక్క, కర = చేతియందలి, నాగవల్లికాదళములు = తములపాకులు - ("తాంబూలవల్లీ తాంబూలీ నాగవల్ల్యపి." అని అమరము) - పుచ్చుకొన్నన్ = పుచ్చుకొనఁగా, ప్రమదల్ = రుక్మిణ్యాదు లగుస్త్రీలు, అందఱును, కొంత దవ్వుగన్ = కొంచెము దూరముగా, చనిరి = వెళ్లిరి.

తాత్పర్యము:—అప్పటికి తలగడగా నిడిన రుక్మిణితొడపై మోపిన శిరస్సును, సత్యభామ తన తొడలపైఁ జేర్చి యొత్తుచున్న పాదములను, కృష్ణుఁడు ఒయ్యారముగాఁ దీసికొని, జాంబవతి చేతియందున్న తములపాకులు పుచ్చుకొనఁగానే రుక్మిణ్యాదిస్త్రీ లందఱును కొంత దూరముగా వెళ్లిరి. ఈపద్యము "తొడలు తలగడగా నిడి" అనుపద్యమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

అలం:—స్వభావోక్తి.

తే. ఇట్లు గోవిందుఁ డేకాంతమిచ్చి వినఁగ, హంసి తము వజ్రి పిలిపించుటాదిగాఁగ
నచటి కనుచుట తుదగాఁగ నతని తమ వచఃప్రసంగంబు నిరవశేషముగఁ జెప్పె.

అర్థము:—ఇట్లు = ఈరీతిగా, గోవిందుఁడు = కృష్ణుడు, ఏకాంతమిచ్చి = రహస్యముగా మాటాడుటకు నవకాశ మిచ్చి, వినఁగన్, హంసి, వజ్రి = వజ్రాయుధముగలవాఁడు, ఇంద్రుఁడు, పిలిపించుట, ఆదిగాఁగన్ = మొద లగునట్లు, మొదలుకొని అని భావము. అచటికిన్ = వజ్రపురమునకు, అనుచుట, పంపుట, తుదగాఁగన్ = తుద యగునట్లు, పంపుటదాఁక అని భావము. అతని తమ వచఃప్రసంగము = ఆ యింద్రునియొక్కయు, తమయొక్కయు మాటలప్రసక్తి, సంభాషణము, నిర్ + అవశేషంబు + కాన్ = మిగులు లేనిదిగా, పరిపూర్ణముగా, చెప్పెను.

వ్యా. వి. :—'ఏకాంతమిచ్చు' - శబ్దపల్లవక్రియ - రహస్యముగా మాటాడ నవకాశమిచ్చు అనునర్థమున క. తన చారులలో, ధీనిధిమతిమంతుఁడనంగా నొక్కఁడు వచ్చి సమయకర్తవ్యంబుల్ వ. నడపియుండ నేకాంతం బిచ్చిన - కేయూరబాహుచరిత్రము 1-72, 73. "అతనితమ వచప్రసంగంబు." ద్వంద్వసమాసపూర్వక షష్ఠీతత్పురుషము.

వ. ఇట్లు చెప్పిన. 22

చ. వడుగులపల్కు-నుపశ్రుతిగ నేవారక మున్ను సునిశ్చితత్వమున్
బడసిన కార్యపద్ధతికిఁ బక్షివధూవచనక్రమంబుచేఁ
గడమ సమర్పితంబగుడుఁ గంజదళాక్షుఁడు సంతసిల్లె నే
ర్పడియెను వజ్రనాభవధభారవహుం డిపు డంచు నాత్మలోన్. 23

అర్థము:—వడుగుల పల్కు = బ్రహ్మచారుల మాట, ఉపశ్రుతిగన్ = కార్యసూచక మగునిమిత్తము కాఁగా, వారక = ఉడుగక, తప్పకుండ - మున్ను = అంతకు మునుపే, సునిశ్చితత్వమున్ = అత్యంతము నిశ్చయింపఁబడుటను - (దృఢనిశ్చయము అనిభావము) పడసిన=పొందిన, కార్యపద్ధతికిన్= తమకర్తవ్యముయొక్క మార్గమునకు, కడమ=శేషము, పక్షి ... క్రమంబుచేన్ - పక్షివధూ = ఆఁడుపక్షి (శుచిముఖి) యొక్క, వచన = మాటలయొక్క, క్రమంబుచేన్ = వరుసచేత, సమర్పితంబు = అర్పింపఁబడినది, లభించినది, అగుడున్ = అగుటయును, కంజదళాక్షుఁడు = తామర రేకులవంటి కన్నులుగలవాఁడు, కృష్ణుఁడు, ఆత్మలోన్ = మనసునందు, వజ్రనాభ ... వహుఁడు - వజ్రనాభ = వజ్రనాభుని యొక్క, వధ = సంహారమునకు, భారవహుఁడు = బరువుమోయువాఁడు - సమర్థుఁడు, ఇపుడు, ఏర్పడియెను = బయల్పడెను - లభించినాఁడని భావము, అంచున్ = అనుకొనుచు, సంతసిల్లెను = సంతోషించెను.

తాత్పర్యము:—వసుదేవయాగాంతమున భద్రుఁడను నటుని నాక్షేపించుచు వటువులు పల్కినమాట యుపశ్రుతిగాఁ జేసికొని వజ్రనాభుని వధించు మార్గ మొకటి నిశ్చయింపఁబడెను. కాని ఆ పట్టణములోనికి నటరూపమున వెళ్లి మోసగించి వాని చంపువాఁ డెవఁడును లభింపని కొఱంత శుచిముఖి పలుకులలోఁ దీఱిపోవుటచే శ్రీకృష్ణుఁడపుడు తనమనస్సులో ఇప్పటికి వజ్రనాభుని వధించు సమర్థుఁడు లభించినాఁ డని సంతోషించెను. ఉపశ్రుతిని గూర్చి చూ. 1 ఆ. 109, 110, వ్యాఖ్య.

వ. ఇట్లు సంతసిల్లి శుచిముఖి కిట్లనియె. 24

అర్థము:—స్పష్టము.

చ. బలవిభవాభిశోభితుఁ డభంగుర శౌర్యధురంధరుండు కా
వలసిన మాయలున్ దివిజవైరులకంటెఁ గరంబు నేర్చు నీ
పలుకులచంద మారయఁ బ్రభావతికిం బతి గాఁగలాఁడు ని
చ్చలముగ రుక్మిణీసుతుఁడు చంపు నవశ్యము వజ్రనాభునిన్. 25

అర్థము:—రుక్మిణీసుతుఁడు = రుక్మిణికిఁ గొడుకగు ప్రద్యుమ్నుఁడు, బల ... శోభితుఁడు — బల విభవ = సత్త్వ యొక్క అతిశయముచేత, అభిశోభితుఁడు = ప్రకాశించుచున్నవాఁడు, అభంగుర ... ధరుండు — అభంగుర = మొక్కవోని, శౌర్య = పరాక్రమమునకు, ధురంధరుండు = బరువుమోయు వాఁడు, 'అడ్డగింపరాని పరాక్రమముగల వారిలో మిన్న'యనిభావము. దివిజ వైరుల కంటెన్ = రాక్షసుల కంటెను (దివిజులు=స్వర్గమున పుట్టినవారు, దేవతలు - వారికి వైరులు రాక్షసులు). కావలసిన మాయలున్= ఆవశ్యకములైన మాయలుకూడను, కరంబు = మిగుల, నేర్చున్ = అభ్యసించెను, నీ పలుకుల చందము = నీ మాటలరీతి, ఆరయన్ = ఆలోచింపఁగా, ప్రభావతికిన్, పతి, నిచ్చలముగన్ = స్థిరముగా, తప్పకుండ నని భావము, కాఁగలాఁడు = కాఁగలవాఁడు, అవశ్యమున్ = తప్పక, వజ్రనాభునిన్, చంపున్ = వధించును.

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁడు బలసంపన్నుఁడు, బీఱువోని పరాక్రమము గలవాఁడు, రాక్షసుల కంటెను కావలసిన మాయలు నేర్చినవాఁడు. ఏ మాటలరీతి పరిశీలింపఁగా - తప్పక ప్రభావతికి భర్త కాఁగలఁడు. వజ్రనాభుని వధించి తీఱును.

అలం:— కావ్యలింగము.

క. ఆ రాక్షసుపట్టన మెవ్వారికిఁ దదనుజ్ఞ లేక వైరమునఁ జొరం
గారాదఁట ప్రద్యుమ్నుఁ డ, వారణఁ దత్పురముఁ జొచ్చువైపు విను మికన్. 26

అర్థము:—ఆ రాక్షసు పట్టనము = ఆ వజ్రనాభుని పురమున (వజ్రపురమున), తదనుజ్ఞ = వాని యొక్క యనుమతి, లేక, ఎవ్వారికిన్ = ఎట్టివారికైనను, వైరమునన్ = పగచేత, చొరంగారాదఁట = ప్రవేశింప వీలు గాదఁట, (అయినను) - ప్రద్యుమ్నుఁడు, అవారణన్ = అడ్డము లేకుండ, తత్పురమున్ = ఆపట్టణమందు, చొచ్చువైపు = ప్రవేశించునట్టి యుపాయము, ఇఁకన్, వినుము.

తాత్పర్యము:—ఆవజ్రనాభుఁడుండు వజ్రపురమున వాని యనుమతి పొందక, శత్రుత్వ మూని ఎట్టివారును ప్రవేశింపలేరఁట. అయినను అడ్డము లేకుండ ప్రద్యుమ్నుఁ డాపురమున ప్రవేశించు నుపాయము చెప్పెదను. ఇఁక వినుము.

సీ. భద్రాఖ్యుఁడగు నటప్రముఖుఁ డొక్కరుఁడు మున్నరుదెంచి మజ్జనకాధ్వరమున
ననయంబు గూడిన మునిసభం దన నాట్య, గరిమచే మెప్పించి వరము గాఁగఁ
దన కవధ్యతయు సప్తద్వీపగమనంబు, నాకాశగతియు నాట్యములయందు
నెవ్వరిరూపు వహించె వారల యట్లు, తాను భేదములేక తనరుటయును

గీ. బడసి యేడుదీవుల నాటపస నెరపుచుఁ, దిరుగుచున్నాఁడు వానిపై దితిసుతునకు
వేడ్క పుట్టంగఁ జెప్పియవ్వీడు చొరఁగ, ముదల గొనుమాతఁడై వచ్చుమదనుఁడంత.

అర్థము :—భద్రాఖ్యుఁడు = భద్రుఁ డనుపేరుగలవాఁడు, అగు నటప్రముఖుఁడు = అయిన నటశ్రేష్ఠుఁడు, ఒక్కరుఁడు = ఒకఁడు, మున్ను, అరుదెంచి = వచ్చి, మత్ + జనక + అధ్వరమునన్ = నా తండ్రియొక్క యాగమునందు, అనయంబు = అధికముగా, కూడినమునిసభన్ = సమావేశమైనమునుల యొక్క సభను, తననాట్యగరిమచే = తన నృత్యముయొక్క గొప్పతనముచేత, మెప్పించి, తనకున్, అవధ్యత్వంబున్ = చంపఁదగ కుండుటయును, ఎవ్వరిచేతను తనకు చావులేకుండుటయు, సప్తద్వీప గమనంబున్ = ఏడుదీవులందుఁ దిరుగుటయును, ఆకాశగతియున్ = ఆకసమం దెగిరిపోవుటయు, నాట్యము లందున్, ఎవ్వరిరూపు, వహించెన్ = పూనునో, తాను, భేదములేక, వారియట్ల = వారివలెనే, తనరుటయును= ఉండుటయును, వరముగాఁగన్ = (ఇవన్నియుఁగలిసి) వరముగునట్లు, పడసి = (వారివలన) పొంది, ఏడుదీవులన్, ఆటపసన్ = నాట్యమందలి శక్తిని, నెరపుచున్ = ప్రకటించుచు, తిరుగు చున్నాఁడు, దితిసుతునకున్ = రాక్షసుఁడగు వజ్రనాభునకు, వానిపైన్ = ఆ భద్రునిమీఁద, అనఁగా వానినాట్యము మీఁద, వేడ్క = అభిలాష, పుట్టంగన్ = కలుగునట్లు, చెప్పి, అవ్వీడు = ఆ పట్టణ మందు, చొరఁగన్ = ప్రవేశించుటకు, ముదల = ఆజ్ఞ, అనుమతి, కొనుము = పొందుము, అంతన్ = అటుపిదప, మదనుఁడు = ప్రద్యుమ్నుఁడు, ఆతఁడై = ఆ భద్రుఁడుగామాఱి, వానియాకారముతో నని భావము, వచ్చున్ = రాఁగలఁడు.

తాత్పర్యము:—ఇంతకు మున్ను భద్రుఁ డనుపేరుగల యొకగొప్పనటుఁడు మాతండ్రి చేయుచున్న యాగమునందుఁ గూడినమునిసభను తననాట్యముచే మెప్పించి, వారిచేత వరముగా ఎవరిచేతను చంపఁబడ

కుండుటయు, ఏడుదీవులందు సంచరించుటయును, ఆకాశగమనమును, అందఱ యాకారములను భేద మేమియు లేకుండ ధరించుటయును, వరముగ పొంది, ఏడుదీవులందు నాట్యశక్తిని ప్రకటించుచుఁ దిరుగు చున్నాఁడు. నీవు వజ్రనాభున కానటునిపై నభిలాష పుట్టించి, యాపురమునఁ బ్రవేశించుట కనుమతిని పొందుము. వెంటనే ప్రద్యుమ్నుఁ డాభద్రుఁడుగా మాఱి యటకు వచ్చును.

వ్యా. అరుదెంచు - అరుగుదెంచు నను రూపాంతరము. సూ. అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది (తెంచు) యనుప్రయుక్తం బగు, నగుచో గువర్ణంబు విభాషను లోపించు. బాల. క్రియా. 111.

సప్తద్వీపములు:—జంబూ, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మల, పుష్కరములు.

వ. ఇది నీకుఁ బరమప్రయోజనంబు దీన నుపయోగింపఁదగిన యవాంతరకృత్యంబులుఁ
దత్తదుపాయంబులు నీవ యెఱుంగుదు పొమ్ము సురకార్యంబు నిర్వహింపు మని
వీడుకొలిపినం దనమరాళజాలంబుతో జాలపాదవనిత గగనంబున కెగసి వజ్రపురం
బున కభిముఖంబుగాఁ బ్రయాణంబు సలుపునప్పుడు ద్వారకానగరబాహ్యప్రదే
శంబునందు వాహ్యాళివిహారసారస్యంబునం దగిలియున్న ప్రద్యుమ్నుండు. 28

అర్థము:—ఇది = వజ్రపురమున భద్రునిరూపముతో ప్రద్యుమ్నుని ప్రవేశపెట్టుట, నీకున్, పరమ ప్రయోజనము = ముఖ్యమగు కార్యము, దీనన్ = ఈపనియందు, ఉపయోగింపన్ + తగిన = సాయపడఁ దగిన, అవాంతరకృత్యంబులు = నడుమఁ జేయఁదగిన పనులును, తత్ + తత్ + ఉపాయంబులును = ఆ యాయి సాధనములును, నీవు+అ=నీవే, ఎఱుంగుదు=ఎఱుఁగుదువు, పొమ్ము=వెళ్లుము, సురకార్యంబు= దేవతాకార్యము, నిర్వహింపుము = నెఱవేర్పుము, అని, వీడుకొలిపినన్ = పంపఁగా, తన మరాళజాలం బుతోన్ = తన హంసలగుంపుతో, జాలపాదవనిత = ఆఁడుహంస, గగనంబునకున్ = ఆకాశమునకు, ఎగసి = ఎగిరి, వజ్రపురంబునకున్, అభిముఖంబుగా = ఎదురుగా, ప్రయాణంబు, సలుపునప్పుడు = చేయు సమయమందు, ద్వారకానగర బాహ్యప్రదేశంబునందున్ = ద్వారకాపురముయొక్క బయలుప్రదేశమున, వాహ్యాళి ... సారస్యంబునన్ = వాహ్యాళి విహార = గుఱ్ఱముపై వేడుకగాఁదిరుగుట, అను క్రీడయందలి ప్రేమయందు, తగిలియున్న = చిక్కుకొనియున్న - మునిఁగియున్న - ప్రద్యుమ్నుండు-మీఁదికన్వయము.

తాత్పర్యము:—నీవు ముఖ్యముగాఁ జేయఁదగినపని ప్రద్యుమ్నుఁడు నటునిరూపమున వజ్రపురమందు ప్రవేశించునట్లు చేయుట. దానికై వజ్రనాభుననుమతి పడయ నెట్లెట్లు ప్రవర్తింపవలెనో దాని కుపాయము లేమి కావలెనో నీవే యెఱుఁగుదువు, వెళ్లుము, దేవతల యీపని పూర్తిచేయుము, అని సెలవీయ తనయంచపిండుతో నాశుచిముఖి వజ్రపురమువైపు ప్రయాణము సలుపుచుండఁగా - ద్వారకాపురియొక్క వెలుపటి ప్రదేశమున వినోదార్థము గుఱ్ఱమునెక్కి విహరించుచున్న ప్రద్యుమ్నుఁడు (కనఁబడెను,)

వి. :—జాలపాదము, వలవంటిపాదములు గలది - (హంస), అనివ్యుత్పత్తి - వాహ్యాళి, (వికృతి) వయాళి, అను పదములు తెలుఁగు ప్రబంధములందుఁ గనఁబడుచున్నవి. వాహ్యాళి (1) గుఱ్ఱములవరుస, (2) అశ్వప్రదర్శనము, (3) గుఱ్ఱములు పరుగెత్తుట, అని కిట్టెలు కన్నడ నిఘంటువున సంస్కృత పదముగాఁ జూపఁబడినది, కాని సంస్కృత నిఘంటువులలోఁ గానరాదు. - ప్రకృతమున అశ్వములు పరుగెత్తుట - అను నర్థ ముచితముగాఁ దోఁచుచున్నది.

చ. తనహృదయంబువెంబడిన ✻ తప్పక ఘోటక మంత నంతనే
కునుపడ నిల్చి ముందఱకుఁ ✻ బాఱి కెలంకులకుం దొలంగి దా
వెనుకకు నేఁగుదెంచి కడు ✻ వేడ్క యొనర్పఁగ బంతి యాడె నె
మ్మనిని గనకంపుఁగోల నడి ✻ మింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్. 29

ఇందు గుఱ్ఱము నెక్కి బంతియాట దృశ్యము వర్ణింపఁబడుచున్నది. బంతిని మింటి కెగురవైచి క్రింద పడకుండ నాడుట యిందు ముఖ్యము.

అర్థము:—ఘోటకము = గుఱ్ఱము, తన హృదయంబు వెంబడిన్ + అ = తనయొక్క (ప్రద్యుమ్నుని యొక్క) మనస్సుచాయనే, ఇష్టప్రకారము అనిభావము, తప్పక = (బంతి) తప్పిపోకుండ, అంత నంతనే = ఆయా దూరప్రదేశములందే, పనుపడన్ = ఉండునట్లు, నిల్చి = నిలువఁబడియు, ముందఱకున్, పాఱి = పరుగిడియు, కెలంకులకున్=పార్శ్వములకు, తొలంగి = తప్పుకొనియు, తాన్ = వెనుకకున్, ఏఁగుదెంచి= వచ్చియు, కడున్ = మిగుల, వేడ్క+ఒనర్పఁగన్ = ఉత్సాహము పుట్టింపఁగా - నెమ్మిని = ఆసక్తితో, కనకపుఁగోలన్ = బంగారు కఱ్ఱతో, నడి + మింటన్ + ఎ = ఆకాశమధ్యమందే, త్రిమ్మరన్ = (ఆబంతి) వెనకకుఁ దిరిగిపోవునట్లు, తారి = సమీపించి, కొట్టుచున్, బంతియాడెన్. (కర్త ప్రద్యుమ్నుఁడు.)

తాత్పర్యము:—బంతిని ఆకాశమున నెగురవైచి భూమిపైఁ బడకుండఁ దనచేతి బంగరుకఱ్ఱతో వెనుకకు దిరిగిపోవునట్లు కొట్టుచు, గుఱ్ఱము నెక్కి యాడునప్పుడు బంతి యెటువైపు పడఁబోవునో అచ్చటి కచ్చటికి నాగుఱ్ఱమును తోలుకొను చుండవలెను. కాని ప్రద్యుమ్నుని గుఱ్ఱము అతనియిచ్ఛ కనుకూలముగా తనంతఁదానే బంతియొక్క రాక ననుసరించి, ముందటికి, వెనుకకు, పార్శ్వములకుఁ బరువెత్తి నిలుచు చుండుటచే, ఆతనికి నుత్సాహ మెక్కువయై యాడుచుండెను.

అలం:— స్వభావోక్తి. “బంతి యాడన్” అని ముద్రిత ప్రతులందలి పాఠము లనన్వితములగుటచే “ఆడెన్” అని సవరించి యన్వయింపఁబడెను.

చ. ఎగురఁగవైచి కొట్టు టది యెంత భరం బని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడమిం బడనీకయె దాని మీఱి చి
త్రగతి హయంబు దోలుచును గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టి యాడె విం
తగఁ దనచేతి రత్నమయదండముకొంతులు గాఁడి పాఱఁగన్. 29

ఈ పద్యమున బంతిని ముందఱకు దూరముగా పాఱవైచి, యది భూమిపైఁ బడకుండఁ గొట్టు దృశ్యము వర్ణింపఁబడుచున్నది.

అర్థము:—ఎగురఁగవైచి, కొట్టుట = క్రిందఁ బడకుండఁ గొట్టుట, అది, ఎంతభరంబు = ఏమిగొప్ప అని, అగ్రగామిగన్ =ముందఱికిఁ బోవునదిగా, పాఱవైచి=దూరముగా విసరివేసి, పుడమిన్ =భూమియందు పడనీకయె = పడనీయకుండఁగానే, దానిన్, మీఱి = అతిక్రమించి, చిత్రగతిన్ = వింతయగు నడకతో, హయంబును = గుఱ్ఱమును, తోలుచున్ = నడిపించుచు, క్రమ్మఱన్ = ఆ బంతి వెనుకకు మరలునట్లు, తనచేతి...కొంతులు - తనచేతి = తనచేతనున్నట్టి, రత్నమయ = మణులతో నిండిన, దండము = (బంగరు) కోలయొక్క, కొంతులు, కాఁడి - (బంతియందు) గ్రుచ్చుకొని, పాఱఁగన్ - దూసికొనిపోఁగా, అని భావము. వింతగన్ = అద్భుతమగునట్లు, మీఁదికిన్ = పైభాగమున కెగురురీతిని, కొట్టి, ఆడెను.

తాత్పర్యము:—బంతి పై కెగురవైచి కొట్టుట యేమంత గొప్ప యని బంతిని దూరముగా ముందు వైపునకు విసరివేసి వెనువెంటనే యాబంతిని దాఁటిపోవునట్లు గుఱ్ఱమునుతోలి తిరిగి యాబంతి వెనుకకుఁ బోవునట్లుగా చేతి బంగరుకోలతో కొట్టుచు నాడెను - ఇది వెనుకటివిధముకంటెను, కష్టతరమైనను సులభముగా నాడెనని భావము.

అలం:— స్వభావోక్తి - “రత్నమయదండముకొంతులు కాఁడిపాఱె” నను నేకదేశమున అతిశయోక్తి.

వ. వెండియు నతండు మండలగతుల నతులంబుగాఁ దురంగంబుఁ దోలి యాడునప్పుడు

అర్థము:—వెండియున్ = మఱియు, అతండు, తురంగంబున్ = గుఱ్ఱమును, అతులంబుగాన్ = సాటిలేనట్లు, మండలగతులన్ = వర్తులాకారమగు పరుగులతో (పర్విడునట్లు), తోలి = నడపించి, యాడునప్పుడు = క్రీడించునప్పుడు.

సీ. తొలుదొల్త నయ్యేకతురగంబు మండల, గతిచారి యగుచు నిక్కంబు తోఁచె
నావెనుకను సరూపాశ్వాలి చెదరక, చక్రాకృతిని బర్వు సరణి తోఁచె
నంతట ననతిస్ఫుటావయవంబుగా, నెనసి యేకాంగవేష్టనత తోఁచెఁ
దుదఁ దద్విభూషణద్యుతి రాజిమాత్రంబు, కొఱవి ద్రిప్పినరీతి మెఱసి తోఁచె

గీ. నంతకంతకు గతివేగ మగ్గలింప, రాఁగ వాగె యెచ్చరిక పరాకు జియ్య
యనుజనులు ఱిచ్చవడి తమపని మఱవఁగఁ, బరఁగు నమ్మేటి నెఱరౌతు ప్రౌఢికతన.

అర్థము:—పరఁగు నమ్మేటి నెఱరౌతు ప్రౌఢికతనన్ = ప్రసిద్ధుఁడైనట్టియు, గొప్పవాఁడును, పూర్ణుఁడునగు నశ్వసాది - (గుఱ్ఱపుస్వారియం దాఱితేఱిన గొప్పఁదనముగలవాఁడు) అగు నాప్రద్యుమ్నుని యొక్క, ప్రౌఢికతనన్ = నేర్పు (కలుగుటయను) కారణముచేత, అంతకంతకున్ = క్రమక్రమముగా, గతి వేగము = నడకయొక్కవడి, అగ్గలింపరాఁగన్ = అధికముకాఁగా, జియ్యా=ప్రభువా !, వాగె - ఎచ్చరిక= కళ్లెపు ద్రాడుఁ జాగ్రత్త, పరాకు = (హెచ్చరికదెలుపుమాట) పరాకువలదు అని భావము. అను జనులు = అని హెచ్చరిక చేయుచు చూచుచున్న ప్రజలు, ఱిచ్చవడి = నివ్వెఱపోయి, తమపని = హెచ్చరిక చేయుపని, మఱవఁగన్ = మఱచిపోవునట్లు, అయ్యేకతురగంబు = ఆగుఱ్ఱమొక్కటి, మండల గతి = మండలాకారపునడకతో, చారి = సంచరించుచున్నదియై, నిక్కంబు = నిజముగా, తోఁచెన్ = కానఁబడెను. ఆవెనుకన్ = ఆపిమ్మట, సరూప + అశ్వ + ఆలి = సమానాకారముగల, గుఱ్ఱముల పంక్తి, చెదరక = చెదరిపోకుండ, ఒకేవరుసను, చక్రాకృతిని = చక్రముయొక్క ఆకారమువంటి యాకారముతో - (చక్రమువలెనని భావము), పర్వు = పరుగిడునట్టి, సరణి = రీతి, తోఁచెన్, అంతటన్= తరువాత (ఇంకను గతివేగము హెచ్చఁగా) అనతిస్ఫుట = అత్యంతము స్పష్టముకానట్టి, అవయవంబు = అంగములుగలది, కాన్ = అగునట్లు, ఎనసి = వ్యాపించి, ఏకాంగవేష్టనత = అవయవములన్నియు ఒక యవయవముగాఁ బెనవైచుకొనినట్లుండుట (కాలు, కడుపు, తల మొదలగువాని ముద్దయని భావము.) తోఁచెన్, (ఇంకను వేగము హెచ్చఁగా), తుదన్ = చివరకు, కొఱవి, త్రిప్పినరీతిన్, తద్విభూషణ ... మాత్రంబు - తత్ = ఆగుఱ్ఱముయొక్క, విభూషణ = అలంకారములయొక్క, ద్యుతి =కాంతులయొక్క, రాజిమాత్రంబు = రేఖమాత్రము, తోఁచెన్ = గోచరించెను.

తాత్పర్యము:—ఆప్రద్యుమ్నుఁడు గొప్ప గుఱ్ఱపురౌతగుటవలన నతని నేర్పుచేత మండలాకారముగాఁ బరుగెత్తుటలోని వేగము హెచ్చింపఁగా, అంతకుమున్ను "ప్రభువా! పరాకు కళ్లెపుఁద్రాడు జాగ్రత్త" యనుచు హెచ్చరించుచున్న చూపఱు తమపని మఱచిపోయి చూచుచుండ - మొదట మండలాకారముగా సంచరించుచున్న యాగుఱ్ఱ మొక్కటిగానే కనఁబడెను. తరువాత వేగాతిశయముచే వర్తులాకారప్రదేశమున సమానరూపము గల గుఱ్ఱముల పంక్తిగా కనఁబడెను. పిదప నింకను వేగము హెచ్చఁగా అవయవ విభాగము కనరాక యన్నియవయవము లేకముగా నల్లుకొనిపోయినట్లగపడెను. ఇంకను వేగము హెచ్చ, ఆగుఱ్ఱముయొక్క నగలకాంతులయొక్క రేఖ యొక్కటే కొఱవి చుట్టువాఱఁ ద్రిప్పినట్లుగాఁ దోచెను.

అలం :—ఉత్ప్రేక్ష, ఉపమ.

చ. ఉరుజవశాలి యత్తురగ ముల్ముకచక్రనయావలంబియై
తిరుగురయంబుచేత నెడత్రెవ్వక కుమ్మరిసారె చాడ్పునన్

బరఁగెఁ గడున్ ధృతాభినవ ♦ భాండతకుం దగ నున్కిపట్టు గాఁ (దా?)
దరలక పైని దద్భ్రమణ♦దండగతిన్ హరిపుత్త్రుఁ డొప్పఁగన్. 34

అర్థము:—ఉరుజవశాలి = ఎక్కువ వేగముచేఁ ప్రకాశించునది, (అగు) అ+తురగము=ఆగుఱ్ఱము, ఉల్మక చక్రసయావలంబియై=కొఱవి చక్రము యొక్కరీతిని వహించినదై - (చక్రమువలె గుండ్రముగా త్రిప్పఁబడుచున్న కొఱవి యట్లుండెనని భావము) ఎడ ద్రెవ్వక = వ్యవధానములేకుండ = తిరుగు రయంబు చేతన్ = తిరిగెడి వేగముచేత, ధృత...తకున్ - ధృత = ధరింపఁబడిన, అభినవ = క్రొత్తదగు, భాండ తకున్ = అలంకారమనెడు కుండకలది యగుటకు, తగు నున్కిపట్టు = తగిన స్థానము, కాన్ = అగు నట్లు, తద్భ్ర...గతిన్ — తత్ = ఆసారెయొక్క, భ్రమణ = తిరుగుట కొఱకగు, దండగతిన్=కఱ్ఱవలె, తరలక = చలింపక, పైని = మీఁదిభాగమున, హరిపుత్త్రుఁడు = శ్రీకృష్ణుని కొడుకు, ప్రద్యుమ్నుఁడు, ఒప్పఁగన్, కుమ్మరి సారె చాడ్పునన్ = కుమ్మరియొక్క చక్రమువలె, కడున్ = మిక్కిలి, పరఁగెన్ = ఒప్పెను. "ఉన్కిపట్టు దాఁ" అను పాఠమున-తాన్ = ఆ గుఱ్ఱము, ఉన్కిపట్టు = తగినస్థానము (అగుచు)

తాత్పర్యము:—మహావేగముగల యాగుఱ్ఱము చక్రాకారముగాఁ దిరుగుకొఱవివలె - వ్యవధానము లేకుండ మండలాకారముగాఁ దిరుగుచుండఁగా - ధరింపఁబడిన భూషణము లనెడు క్రొత్తకుండను నిర్మాణ మొనర్చుటకై కుమ్మర చక్రమును ద్రిప్పు కఱ్ఱవలె, కదలకుండ పైని ప్రద్యుమ్నుఁడుండుటచే కుమ్మరిసారె వలె గోచరించెను.

అలం :—నిదర్శనము, ఉపమ, రూపకము.

వ్యా. వి. :—ద్రెవ్వక - ద్రెచ్చు, ధాతువునకు వ్యతిరేకక్త్వార్థక ప్రత్యయ మగు 'కజీ' పరము కాఁగా - సూ. ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు 'ప,వ' లగు. అను బాల. క్రియా. 88 సూత్రమున అద్విరుక్తము ప్రాయిక మనుకొని - ద్రెచ్చులోని చువర్ణమునకు వకారాదేశము చేయఁగా - ద్రెచ్+వ్+ఉ. అని యగును. పిపద "చకారంబునకు హల్లు రా (పరముకాఁగా) బరసవర్ణం బగు" అను శబ్దలక్షణ సంగ్రహము. 5. 63 సూత్రముచే" ద్రెచ్" లోని చకారమునకు వకార మాదేశము కాఁగా - ద్రెవ్వు-అయి కజీ జేత్తు కావున అత్త్వము వచ్చి ద్రెవ్వక అనురూపము సిద్ధించును.

వ. అతఁ డంత. 35

క. వల్గితముఖగతిపంచక, వల్గువిహారముల సైంధ♦వము నలయించెన్
వల్గావిభాగకుశలత, వల్గత్కుండలమరీచి♦వల్లరు లెసఁగన్. 36

అర్థము:—వల్గా = కళ్లెపుఁద్రాటియొక్క, విభాగ = వేఱువేఱువిధములఁ బట్టుకొనుటయందలి, కుశలతన్ = నేర్పుచేత, వల్గత్ = చలించుచున్న, కుండల = తమ్మంట్లయొక్క, మరీచివల్లరులు, తీఁగలవంటి సోఁగకాంతులు, ఎసఁగన్ = వ్యాపింపఁగా (కర్ణాభరణములు కదలుచుండ వానికాంతులు నల్దెస వ్యాపించు చుండె ననిభావము), వల్గిత...విహారములన్ - వల్గితముఖ = వల్గితము మొదలుగాఁగల, గతిపంచక = అయిదు విధములగు గమనములచేత, వల్గు=మనోహరమైన,విహారములన్=సంచారములచేత-(అస్కందితము,ధౌరితము, రేచితము, వల్గితము, ప్లుతము - అని గుఱ్ఱపునడక లైదువిధములు) సైంధవమున్ = గుఱ్ఱమును, (సింధుదేశమునఁ బుట్టినది) అలయించెన్ = శ్రమపెట్టెను. వల్గాశబ్దమునకు కళ్లెపుఁద్రాడు అను నర్థమున "ఆలానే గృహ్యతే హస్తీ వాజీ వల్గాసు గృహ్యతే, హృదయే గృహ్యతే నారీ యదిదం నాస్తి గమ్యతాం. మృచ్ఛకటికము. 1 - అంకము 50 శ్లోకము.

అతివేగము, అతిమందము గాని నడక 'అస్కందితము'. అంతకంటె చక్కనినడక "ధౌరితము" తాళగతితోఁ బరుగెత్తుట "రేచితము". మీఁదికి కాళ్లు కదలించుచు వేగముగాఁ బోవుట 'వల్గితము'. అంతట సమముగా పరుగెత్తుట 'ప్లుతము'. ఈ అయిదును ఆశ్వగతు లనియు, అశ్వధార లనియు వ్యవహారము.

తాత్పర్యము:— తన చెవుల సన్నరత్నాభరణముల కాంతులు నల్దెస వ్యాపించుచుండ - కళ్లెపుఁ ద్రాటియొక్క బిగింపు, సడల్పుటను ననుసరించి విభాగములందు నేర్పుగలవాఁడై, వల్గితాది గతిపంచకముచేత గుఱ్ఱములను పోవునట్లు ప్రద్యుమ్నుఁడు స్వారిచేసెను.

వి. గుఱ్ఱము నలయించుట నిర్దయతచేఁ గాను, పరిశ్రమము లేక బంధించి యుంచిన గుఱ్ఱమునకు ముదిమి వేగముగ వచ్చు నని యందురు. "పంథా జరా మనుష్యాణాం వాజినాం బంధనం జరా. అనిసూక్తి. ప్రయాణము మనుజులకును, బంధించియుంచుట గుఱ్ఱములకును జరాహేతువులు.

శా. నానావీథిగతిప్రభేద విహృతిన్ సంతృప్తుఁడై కంతుఁ డిం
పూనన్ వాగెఁ గుదించినన్ బురుషకప్రోన్నమ్ర పూర్వాంగమై
గానంగాఁబడియెన్ మరుజ్జవన మాగంధర్వ మర్కాశ్వసం
తాన స్పర్ధను మిన్ను బ్రాఁకెడుక్రియన్ దా నెంతయున్ జూడ్కికిన్. 37

అర్థము:—కంతుఁడు=ప్రద్యుమ్నుఁడు, నానా ... విహృతిన్ - నానా = అనేకవిధములగు, వీథి= సంచారప్రదేశములందు, గతిప్రభేద = వేఱువేఱు నడకలతోడి, విహృతిన్ = విహారముచేత, సంతృప్తుఁడై= తనివినవాఁడై, వాగెన్ = కళ్లెమును, కుదించినన్ = లాగిపట్టుకొనఁగా, మరుజ్జవనము = వాయువువలె మిగుల వేగముగలది (యగు), ఆగంధర్వము = ఆగుఱ్ఱము, పురుషక ప్రోన్నమ్రమపూర్వాంగమై = పురుషక మనుస్థితి (స్థానకము) చేత, ప్ర + ఉత్ + నమ్ర=ప్రోన్నమ్ర=మిక్కిలి మీఁది కెత్తఁబడిన, పూర్వాంగము= మీఁదిశరీరముకలది, ఐ, అర్క ... స్పర్ధను - అర్క = సూర్యునియొక్క, అశ్వసంతాన = గుఱ్ఱముల సముదాయముతోడి, స్పర్ధను = పోటిచేతను, మిన్ను=ఆకాశమును, ప్రాఁకెడుక్రియన్=ప్రాఁకుచున్నదో యనునట్లు, తాను, చూడ్కికిన్ = జనులచూపునకు, ఎంతయున్ = అత్యంతమును, కానంగాఁ బడియెన్= కనఁబడెను.

తాత్పర్యము:—మన్మథునియవతార మగుప్రద్యుమ్నుఁ డీరీతిగా అనేకవిధము లగు విహారప్రదేశము లందు గుఱ్ఱమును జిత్రగతుల నడిపించి, తనివినొంది, ఒకచోటనే నిలిపి, కళ్లెమును లాగిపట్టఁగా, వాయు వేగము గలయాగుఱ్ఱము ముందుకాళ్లు రెంటను మీఁదికెత్తి వెనుకకాళ్లపై నిల్చి, పురుషక మను స్థానక మున నుండ - చూపఱ చూపునకు "సూర్యునిగుఱ్ఱములతో పోటీచేయుటకై యాకాశమును ప్రాఁకుచు న్నదా యనునట్లు కనఁబడెను.

అలం. :—ఉత్ప్రేక్ష.

వి. :—"పశ్చిమే నాగ్రపాదేన భువి స్థిత్వాగ్రపాదయోః. ఊర్ధ్వప్రేరణయా స్థాన మశ్వానాం పురుషస్స్మృతః" ఇతి. పురుషఏవ పురుషకః - స్థానకవిశేషకః - అని మల్లినాథుని సర్వంకష - వ్యాఖ్య. వీథులనఁగా - దుష్టాశ్వములకు సాధుత్వమును, యోగ్యము లగునితరాశ్వములకు గతిదార్ఢ్యము కలుగుటకును విధించిన పరిమితము లగుసంచారప్రదేశములు. 'లఘ్వి, మధ్యమ, ఉత్తమ' అని యావీథి మూఁడువిధములు. లఘ్వి యెనుబది, మధ్యమ తొంబది,' ఉత్తమ నూఱు - విండ్ల దూరముగల ప్రదేశములు - ఈ మూఁటియందు వరుసగా ఉత్తమ, మధ్య, మాధమాశ్వములను త్రిప్పవలె నని కొందఱు. మఱికొందఱు సమోన్నతాదిభేదములచే నీవీథియే తొమ్మిదివిధము లనిరి. సమోన్నత (పోయినకొలఁది యెత్తుగా నుండునది), విషమ (ఎగుడుదిగుడుగా నుండునది), అంబుకీర్ణ (తడిగానుండునది లేక నీటితో వ్యాప్తమైనది), శుద్ధ (ఏమియు

నష్టులేక సమముగా నుండునది) నతాగ్ర (వంగియుండుభాగము గలది, వెళ్లినకొలఁది కొంచెముపల్లముగా నుండునది), తృణవీరుదాఢ్య (గడ్డిపోచ, తీఁగలతోను నిండినది), స్థాణుప్రకీర్ణ (మోళ్లతో నిండినది), ఉపల ప్రకీర్ణ (రాలతో నిండినది), పార్శ్వోన్నత (ఒకప్రక్క నెత్తైనది), అని. ఈవిషయము మల్లినాథసూరి మాఘ కావ్యవ్యాఖ్యయం దిట్లు వ్రాసియున్నాఁడు. "వీథ్య స్తిస్రో ఽథ ధారాణాం లక్ష్మీ మధ్యోత్తమాః క్రమాత్। తాసాం స్యాదధమా మాన మశీతి ర్నవతి శ్శతం। లక్ష్మీ మధ్యోత్తమానాంతు వాజినాం వీథికాః స్మృతాః, నవానాం కథితా వీథ్యో దుష్టానాం క్రమశః క్రమే। అన్యేషా మపి సర్వత్ర గతిదార్ఢ్యార్థ మీరితాః॥ సమోన్నతా సా విషమాంబుకీర్ణా, శుభ్రా నతాగ్రా తృణవీరుదాఢ్యా। స్థాణుప్రకీర్ణోపలసంప్రకీర్ణా। పార్శ్వోన్నతాఖ్యా నవధేతి వీథ్యః॥ సర్వాసు వీథిషు యో వాజీ దృఢశిక్షాసమన్వితః। తేన రాజా రణే నిత్యం మృగయాయాం ముదం వ్రజేత్" ఇతి. భోజః - అని.

వ్యా. :—చూడికి - సూ. ఇకివర్ణకంబు కోర్వ్యాదుల కగు" కోర్వ్యాదులలోని చూచునకు "చూడు చూచునకును -చూడికి. అను బాల. కృదంత. 16 చె సిద్ధము". - "లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నడిమదుమ లోపంబు గానంబడియెడి. బాల. ప్రకీర్ణ. 18. చే 'చూడ్కి" అగును.

సీ. సముపలాలనయుత స్కంధాంతికాస్ఫాల, దమితతేజో మహోద్ధత్యకంబు
దంతాళికానియంత్రణసమున్నామితా, కుంచితగ్రీవాసమంచితంబు
దందమ్యమానశబ్దాయమాన ఖలీన, కషణ జర్జరితసృక్వద్వయంబు
ఘనఘర్మడిండీర ఖండపాండురిత పల్యాయనవర్ధ్రోభయ ప్రాంతకంబు

గీ. నగు హయము డిగ్గఁ బ్రబ్యుమ్నుఁ డంకవన్నె, యొకటి సాహిణి యవ్వలనూఁదిపట్టఁ
దనయనుఁగుఁజెలికాఁడుకై దండనొసఁగ, బ్రజసురాళించిమణులు వస్త్రములువైవ.

అర్థము :—సముపలాలన...కంబు - సముపలాలన = బుజ్జవముతో, యుత = కూడిన, స్కంధ = మూపుయొక్క, అంతిక = సమీపమందు, ఆస్ఫాల = తట్టుటచేత, దమిత = అణఁపఁబడిన, మహౌద్ధత్యకంబు = హెచ్చుగర్వముకలదియును - బుజ్జగించుచు మూపుయొక్క సమీపమున చేతితో చఱచుచు విజృంభణము తగ్గింపఁబడినది అనిభావము. దంతాళికా...సమన్వితంబు - దంతాళికా = కళ్లెపుత్రాటి యొక్క, (ని. ముఖరజ్జుశ్చదంతాళీరాణికా రశ్మిశీతిచ. వైజయంతి.) నియంత్రణ = బిగించుటచేత, సమున్నామిత = ఎత్తఁబడినదియు, ఆకుంచిత = వంపఁబడినదియునగు, గ్రీవా = మెడతో (తలపైకెగసి, మరాతి మెడవంకకుఁగుదింపఁబడియుండుట,దీనినే కైజామోర యందురు) - సమన్వితంబు = కూడినదియును, (పరుగు, నడక మాని వేయుటకై, కళ్లెముబిగింపఁగా కైజామోర కలిగి యున్నది అనిభావము) - దందమ్యమాన ... ద్వయంబు - దందమ్యమాన = మిగుల లాగి పట్టఁబడినది కాన, శబ్దాయమాన = ధ్వనించుచున్న, ఖలీన = కళ్లెముయొక్క, కషణ = ఒరపిడిచేత, జర్జరిత = శిథిలమైన (తెగిపోయిన అని భావము), సృక్వద్వయంబు = తొలువుల జంట (సెలవులజంట యన్నమాట) - గలదియు (గట్టిగా బిగించిపట్టుటచేత ధ్వనించుచున్న కళ్లెముయొక్క రాపిడిచే సెలవులు రెండును తెగిన వని భావము), ఘనఘర్మ...ప్రాంతకంబు - ఘన = దట్టమైన, లేక, అధికమైన, ఘర్మ=చెమటయొక్క, డిండీరఖండ = నురుఁగులయొక్క ముక్కలచేత, పాండురిత = తెల్లనిదిగాఁ జేయఁబడిన, పల్యాయన = జీనుయొక్క, వర్ధ్రి = (జీనున కడుగునవేసిన) మెత్తయొక్క, ఉభయ ప్రాంతకంబు = రెండు పార్శ్వములు గలదియు (అనగా అధికమగు చెమట నురుఁగులచే జీనుయొక్క మెత్త రెండుకొనలయందుఁ దడిసిపోయె ననిభావము.) అగు హయమున్ = అయినట్టి గుఱ్ఱమునుండి, అవ్వలన్ = ఆవలివైపున, అంకవన్నె = పల్లమున కేర్పఱచిన యినుపమెట్టు (రికాబు), ఒకటి, సాహిణి = గుఱ్ఱపువాఁడు, ఊఁది = నొక్కి, పట్టన్ = పట్టుకొనఁగా - ఇవ్వలి మెట్టునుండి దిగునపుడు పల్లము తిరిగిపోకుండున ట్లవ్వలనుండు మెట్టు నొక్కిపట్టుకొనఁగా - అని

భావము. తన యనుఁగుఁ జెలికాఁడు = తన యిష్టమిత్రుఁడు = కైదండన్ = చేయూఁతను, ఒసఁగన్ = ఈయఁగా - ఆ ప్తమిత్రుఁడు దగ్గరకు వచ్చి, అంకవన్నెనుండి క్రిందికి దిగునపుడు చేయూఁత నీయఁగా- (ఇది మహారాజలక్షణము), ప్రజ = చూడవచ్చిన జనులు, మణులున్ = రత్నములును, వస్త్రములున్ = బట్టలును, (దృష్టిదోషపరిహారకముగ), నురాళించి వైవన్ = దిగఁదుడిచి పాఱవేయఁగా - ప్రద్యుమ్నుఁడు, డిగ్గెన్ = దిగెను.

అలం :—స్వభావోక్తి.

వి. :— ఇందు స్వారిచేసి యలసిపోయిన గుఱ్ఱముయొక్క స్వరూపమును దానినుండి రాజసము మెఱయఁగా దిగిన ప్రద్యుమ్నుని స్వరూపమును, దృష్టిదోషపరిహారమునకై నడుపఁబడు నానాఁటియాచార స్వరూపమును కనులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడినవి.

ఆ. అపుడు గగనసరణి నరిగెడు శుచిముఖి, యతనిఁ జూచి యల్లి యతఁ డితండ
కావలయు నవశ్య మీ వరపురుషుతోఁ, మాటలాడి చనుట మనకు మేలు. 39

అర్థము:—అపుడు = ఆసమయమందు, గగనసరణిన్ = ఆకాశమార్గమందు, అరిగెడు, శుచిముఖి, అతనిన్ = ఆప్రద్యుమ్నుని, చూచి, అల్ల యతఁడు, ఇతండు + అ = ఇతఁడే, కావలయును, ఈ వర పురుషునితోన్ = ఈ యుత్తమ పురుషునితోడ (వరుఁడు, పెండ్లి కొడుకగుపురుషుఁ డని యర్థాంతరము) మాటాడి, చనుట = వెళ్లుట, మనకు, మేలు = మంచిది.

తాత్పర్యము:—ఆ సమయమందే ఆకాశమార్గమున వెళ్లుచున్న శుచిముఖి యతనిం జూచి గుర్తించి "యీతనితో మాటాడి, వెళ్లుట మనకు మంచిది" (అనెను).

క. అని యాప్రద్యుమ్నునకున్, వినఁబడునట్లుగ మరాళవితతులతోఁ బ
ల్కి నిజోక్తి కతఁడు వెఱఁగం,ద నయంబున నవియుఁ దాను ధరణికి డిగ్గెన్.

అర్థము:— నిజోక్తికిన్ = తనమాటకు - మరాళవితతులతో = హంసల గుంపులతో - వెఱఁగు + అందన్ = అచ్చెరువడఁగా.

సీ. మరునశ్వగతి మెచ్చి సురలు వైచిన పైఁడి, వ్రాఁతక్రొమ్మడుఁగు దువ్వలువ లనఁగ
దర్పకు నెఱరౌతుతనము పేర్మికిఁ గ్రమ్ము,కొను సతేజఃకీర్తిఘనము లనఁగ
హయఫేనధావళ్యయాచ్నార్థమై వ్రాలు,తటిదనుగతసితాబ్దంబు లనఁగ
వాజివిభ్రమ జితావర్తతఁ దొలఁకు ది,వ్యులయేటిసాబ్జరేణూర్ము లనఁగఁ
గనకరేఖలతోడి తెల్లకెక్కలబెడంగు,చూపఱకుఁ గనుపండువై సొంపుమీఱ
జలదపథముననుండి భూస్థలికి డిగ్గు,హంసములు వర్ణనాసీమ నతకరించె. 41

అర్థము:—మరునశ్వగతిన్ = ప్రద్యుమ్నుని గుఱ్ఱపుస్వారిని, మెచ్చి, సురలు = దేవతలు, వైచిన = (విసరి) వేసిన, పైఁడి...వలువలు - పైఁడివ్రాఁత = బంగారు జరీతోనల్లిన చిత్రములుగల, క్రొమ్మడుఁగు దువ్వలువలు = క్రొత్తవియు, పరిశుద్ధములు నగు సన్నవస్త్రములు, అనఁగన్ = అనునట్లును, దర్పకు నెఱరౌతు తనము = ప్రద్యుమ్నునియొక్క పరిపూర్ణమగు నశ్వారోహకత్వము యొక్క, పేర్మికిన్ = గొప్పతనమునకు, క్రమ్ము = పైఁబడుచున్న, సతేజః = ప్రతాపముతోఁ గూడిన, కీర్తిఘనములు = కీర్తిసముదాయములు, అనఁగన్ -

ప్రతాపము ఎఱ్ఱగాను, కీర్తి తెల్లగాను నుండు ననుట కవిసమయము - తెక్కలతుది సన్నబంగారురేఖలు ప్రతాపమువలెను, తెల్లగానుండు హంసలు కీర్తిసంఘాయములవలెను నున్న వని భావము. హయ...ర్థమై, హయ = గుఱ్ఱముయొక్క, శ్వేత = తరఁగుల సంబంధమగు, ధావళ్య = తెల్లఁదనముయొక్క, యాచ్ఞార్థమై = యాచించుటకొఱకై, ప్రాలు = క్రిందికి దిగుచున్న, తటిదనుగత సితాబ్దంబులు = మెఱుఁగు తీఁగలచే ననుసరింపఁబడిన తెల్లనిమేఘములు, అనఁగన్ = అనునట్లును, వాజి...వర్తతన్ - వాజి = గుఱ్ఱముయొక్క, విభ్రమ = సంభ్రమముగా పరుగెత్తుటలచే, జిత = జయింపఁబడిన, ఆవర్తతన్ = నీటి సుడులు గల దగుటచేత - (ఇట విభ్రమ = సుడులచేత అని - మ. శా. గారి లఘుటీక) తొలఁకు = క్రిందికి చెదరిపడుచున్న, దివ్యులయేటి = వేల్పుల నది యగు నాకాశగంగయొక్క, స + అబ్జరేణు = పద్మపరాగముతోఁ గూడిన, ఊర్ములు = తరంగములు, అనఁగన్ = అనునట్లును (పద్మపరాగమువలె - తెక్కలతుది బంగరురేఖలును, తెల్లనగు ఆకాశగంగ కెరటములవలె హంసలదేహములును నున్న వని భావము.) కనకరేఖలతోడి = బంగారు గీఱలతో నున్న, తెక్కలబెడంగు = తెక్కలయొక్క సొగసు, చూపఱకున్ = చూచువారికి (నిత్యబహువచనము), కనుపండువు = నేత్రపర్వముగా (కంటికింపుగా అని భావము), సొంపుమీఱన్ = అంపగింపఁగా, జలద...నుండి - జలద= (నీటి నిచ్చునవి) మేఘములయొక్క, పథమునను నుండి = మార్గమగు నాకాశమునుండి, భూస్థలికిన్, డిగ్గు, హంసములు, వర్ణనాసీమను=వర్ణించుట యొక్క హద్దును, అతికరించెను = దాఁటెను.

తాత్పర్యము:—బంగారురేఖలతో నొప్పు తెక్కలు గలయా తెల్లనిహంస లాకాశమునుండి భూమికి దిగుచుండ, ప్రద్యుమ్నుని గుఱ్ఱపుస్వారిని మెచ్చుకొని దేవత లాకసమునుండి వేయుచున్న సరిగంచుల తెల్లని బట్టలో, అతనిగొప్పరౌతుతనమునకు పైఁబడుచున్న ప్రతాపముతోఁ గూడినకీర్తిముద్దలో, అతని గుఱ్ఱము యొక్క సురుగుల తెలుపును యాచించుటకై వచ్చిన మెఱుపులతోఁ గూడియున్న తెల్లమబ్బులో, ఆగుఱ్ఱముయొక్క వర్తులాకార సంచారములకు నోడిన నీటిసుళ్లుగలదై క్రిందికి తొనఁకిపడుచున్న మిన్నేటి కెరటములో, అనునట్లు చూచువారికి నేత్రపర్వ మగుచుండెను. ఆసొగసు వర్ణనకు మీఱియుండెను.

అలం:—ఉత్ప్రేక్ష.

వ్యా. వి. :—ప్రకృతి - స్మరుఁడు. వికృతి - మరుఁడు. క్రొత్త + మడుఁగు - సూ. క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషమునకుం గొన్నియెడల సుగాగమంబును, గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబును నగు. బాల. సంధి. 38 చే క్రొమ్మడుఁగు - అగును, అబ్దము = (1) మేఘము (2) సంవత్సరము (నానా) చూపఱు, ని. బ. వ. కాని "చూపఱుల్" అని - "తక్కటి చూపఱులెంతయుఁ, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. భార. విరా. 82. చూపఱులచూడ్కి కొకవింత సొబ గొనర్చె - కళా. 7-76. అని మరల బహువచనము కనఁబడుచున్నది - "ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యంబు బహువచనంబు నెనయు" బాల. అచ్చిక, 17. అనుదానిచే "చూపఱులు" అనుటయు సాధు వగును.

సీ. ఇట్లు గన్పట్టుచున్నేఁ తెంచి యంచలు, వసుధ చేరువ నేటవాలు గాఁగ
నతినిశ్చలప్రసారితపతత్త్రంబులై, డిగుచుఁ గామునిముందటికిని గొంత
సరి గడవఁగఁ బాఱిమరలి బోరలు దెట్టి, గిల నొక్కకడ వంచిమలపు దిరిగి
మెఱకలంతట రెండునెఱయఁ జక్కఁగఁ జాచి, యవనిఁ గాలూని తెక్కార్చి ముడిచి

గీ. మొగము లోకకొంత యొయ్యారముగ మలంచి,
యీఁకను విదిర్చికొనుచు నొక్కింత తడవు
హైమరేఖావిచిత్ర నిజాంగరుహ వి,
నిర్మలతఁ జూడ్కులకు నింపు నింపుచుండె.

అర్థము:—అంచలు, ఇట్లు, కన్పట్టుచున్ = గోచరించుచు, ఏఁతెంచి = వచ్చి, వసుధచేరువన్ = భూమికి దగ్గఱగా, ఏటవాలు, కాఁగన్, అతి ... త్రంబులు + ఐ - అతిసిచ్ఛల = మిసల కదలనట్టి, పతత్త్రంబులై = ఱెక్కలు గలవియై, డిగుచున్ = దిగుచు, కాముని ముంపటికిని = ప్రద్యుమ్నుని ముందటి తావునకు, కొంత = కొంతదూరము, సరిగడవంగన్ = దాఁటిపోవునట్లు, పాటి = యెగిరివెళ్లి, మరలి, బోరలు = ఱొమ్ములు, తెట్టగిలన్ = పైకిఁగనఁబడు చుండఁగా, ఒక్కకడ = ఒకకొన, వంచి, మలపు దిరిగి = వెనుకకుఁ దిరిగి, అంతటన్ = పిదప, ఎఱకలు=ఱెక్కలు, రెండును, నెఱయన్ = వ్యాపించునట్లు, చక్కగన్ = పూర్తిగా, చాచి, అవనిన్, కాలు, మోపి, ఱెక్క, ఆర్చి = ఆడించి, ముడిఁచి, - మొగములు, ఒకకొంత = కొంచెము, ఒయ్యారముగన్ = విలాసముగా, మలంచి = వెనకకు త్రిప్పి, ఈఁకను, విదిర్చికొంచున్ = జాడించుకొనుచు, ఒక్కింత తడవు = కొంచెముసేపు, హైమ ... వినిర్మలత, హైమ = బంగరుసంబంధమైన, రేఖా=గీఱలచేత, విచిత్ర=వింతయగు, నిజ=తమయొక్క, అంగరుహ = ఈఁకల యొక్క, వినిర్మలతన్ = స్వచ్ఛత్వముచేత, చూడ్కులకున్ = (జనుల) చూపులకు, ఇంపున్ = సంతసమును, నింపుచుండెన్ = కలిగించుచు నుండెను.

తాత్పర్యము:—ఈరీతిగా కనఁబడుచు నాహంసలు కదలని ఱెక్కలతో ఏటవాలుగా భూమికి చేరువ యగునట్లు దిగుచు, ప్రద్యుమ్నుని ముందఱప్రదేశము కొంచెము దాఁటిపోయి, తిరిగి, ఱొమ్ములు పైకిఁగనఁబడఁగా కొంచెము వంచి మలుపుతిరిగి, రెండు ఱెక్కలును పూర్తిగాఁజాచి, భూమిపై కాలు మోపి, ఱెక్క యల్లాడించి, ముడిఁచి, ముఖములు కొంచెము విలాసముగా వెనుకకుఁ ద్రిప్పి, ఈఁకలు జాడించుకొనుచు, కొంచెముసేపు బంగరురేఖలచే వింతగా నున్న తమ యీఁకలయొక్క ధావళ్యముచేత చూచుజనులకన్నులకు సంతోషము కలిగించుచు నిల్చినవి.

అలం.:—స్వభావోక్తి. ఈ పద్యమున పెద్దపక్షి యాకాశమునుండి దిగునప్పు డెట్లుండునో భూమికి దిగినపిదప నెట్లు వర్తించునో ఆవిశేష మంతయు కనులకు కట్టినట్లు వర్ణించుట నిరుపమ మనక తీఱదు. కవియొక్క లోకజ్ఞత దీన స్పష్టము.

వ. అంతఁ బ్రద్యుమ్నుఁ డుద్ద్యోతమానకౌతుకంబున వాని నుపలక్షించి, పక్షివరులారా తొలుత నితనితో మాటలాడ వలయు ననుకొంటి రిచ్చట నెవ్వనితో నేమి మాటలాడ వలయు నతనిం బిలిచి సంభాషింపుఁ డెట్టిప్రయోజనంబున నెందుఁ బోవుచున్నవారలో? మీర, లన్యోపరోధంబునం గార్యవిరోధంబు సైరించి యుండరుగదా యను శంకచేత సంకోచంబు లేక వేగిరించి యీగతిఁ బలుకవలసెఁ గాని భవదీయ సన్నిధాన సౌభాగ్యంబునం దనిసి కాదు. మీ రూప చేష్టావచో విశేషంబు లరయ దివ్యజాతి పక్షులరు గాని ప్రకృతిహంసంబులు గా రనుటయును నంత శుచిముఖి యఖిల జనమనోహరం బైన మధుర స్వరంబున నిట్లనియె. 43

అర్థము:—అంతన్ = హంసలు భూమిమీఁదికి దిగినపిదప, ప్రద్యుమ్నుండు, ఉద్యో ...... కౌతుకంబునన్ - ఉద్ద్యోతమాన = మీఁదికి ప్రకాశిత మగుచున్న, పైకిఁగనఁబడుచున్న అని భావము - కౌతుకంబునన్ = వేడుకతో, వానిన్ = ఆహంసలను, ఉపలక్షించి = చూచి, పక్షివరులార = శ్రేష్ఠ మగు నో పులుఁగులార, తొలుతన్, ఇతనితోన్, మాటలాడవలయును, అనుకొంటిరి = ఆకసమునం దెగురుచు ననుకొన్నారు, ఇచ్చటన్, ఎవ్వనితోన్, ఏమి, మాటలాడవలయును, అతనిన్ = ఆమాటాడ వలసిన యాతనిని, పిలిచి, సంభాషింపుఁడు = మాటాడుకొనుఁడు, ఎట్టిప్రయోజనంబునన్ = ఎటువంటి పని నిమిత్తముగా, ఎందున్ = ఎక్కడకు, పోవుచున్నవారలో, అన్య + ఉపరోధంబునన్ = ఇతరుల వల్లని యాటంకముచే, కార్యవిరోధంబున్ = మీపనికిఁ గలిగిన ప్రతిబంధమును, సైరించి = సహించి,

ఉండదుగదా? (మీరేకార్యమునకై యెందులకు వెళ్లుచున్నారో - మీరు మాటాడఁదలఁచిన వారితో మాటాడు కొనకుండ మావంటియితరు లడ్డముగా లేరుగదా - అని భావము.) అనుశంకచేతన్ = అనెడి సందేహముచేత, సంకోచంబు = సందేహము, లేక, వేగిరించి = తొందరపెట్టి, ఈగతిన్ = ఈవిధముగా పలుకవలసెన్ = పలుకవలసి వచ్చినది - (మావంటివా రడ్డముగా నున్నారేమో యనుసందేహముచే మీకు కావలసినవారిని పిలిచి మాటాడుకొనుఁడు అని తొందరపెట్ట వలసివచ్చినది యని భావము.) కాని = అట్లు పలుకవలసివచ్చినదే కాని, భవదీయ...భాగ్యంబునన్ - భవదీయ = మీదగు, సన్నిధాన = చేరువ యనెడి సౌభాగ్యమునన్ = అదృష్టమువలన, తనివికాదు = తృప్తి పొందికాదు, మీ రెంత సేపు మాచేరువ నున్నను తృప్తి మాకుఁగలుగనే కలుగదు అని భావము. మీరూప...విశేషంబులు - మీ = మీయొక్క, రూప = ఆకారముయొక్కయు, చేష్టా = వ్యాపారములయొక్కయు, వచః = మాటల యొక్కయు, విశేషంబులు, అరయుచో = పరిశీలింపఁగా, దివ్యజాతి = స్వర్గసంబంధ మగుపుట్టుక గల - స్వర్గమునఁబుట్టిన అని భావము. పక్షులము = పులుఁగులు, కాని, ప్రకృతిహంసంబులు = సామాన్య మగు హంసలు (మాత్రము) కారు, అనుటయును = అనఁగా, అంతన్, శుచిముఖి, అఖిలజన మనోహరంబు = అందఱ మనస్సుల నాకర్షించునట్టిది, ఐన, మధురస్వరంబునన్ = తియ్యనగు (అందమైన) యెలుఁగుతో, ఇట్లు, అనియెన్ = పల్కెను.

ఉ. ఇచ్చట మేము వేఱ మఱి యెవ్వరితోడను మాటలాడఁగా
వచ్చెద, మచ్యుతాత్మజ దివస్పతిపంపునఁ గృష్ణపాలికిన్
వచ్చి యతండు వీడ్కొలుప వారలయిద్దఱ యాజ్ఞలున్ గడున్
హెచ్చరికన్ ధరించి యిపు డేఁగెదులాగిది యొక్కచోటికిన్. 44

అర్థము:—అచ్యుతాత్మజ = శ్రీకృష్ణునికుమారుఁ డగు నో ప్రద్యుమ్నా! మేము, ఇచ్చటన్, వేఱు + అ, మఱియెవ్వరితోడను = (నీవుగాక) ఇతరు లెవరితో, మాటలాడఁగాన్, వచ్చెదము, (కాకువు) దివస్పతిపంపునన్ = స్వర్గాధిపతి యగు నింద్రు నాజ్ఞచేత, కృష్ణపాలికిన్ = కృష్ణునొద్దకు, వచ్చి, అతండు, వీడ్కొలుపన్ = సెల వొసఁగ, వారల యిద్దఱయాజ్ఞలున్, కడున్, హెచ్చరికన్ = జాగ్రత్తతో, ధరించి = వహించి, ఒక్కచోటికిన్ = ఒకానొకస్థలమునకు, ఇపుడు, ఏఁగెదులాగు = వెళ్లువిధము, ఇది = ఈ మా ప్రయాణముసుమా, అచ్యుతుఁడు - చ్యుతుఁడు = నశించువాఁడు, న + చ్యుతుఁడు = చ్యుతుఁడు కానివాఁడు, అని వ్యుత్పత్తి. ఆత్మజుఁడు = తనవలన పుట్టినవాఁడు. (కొడుకు) "దివస్పతి" దివః + పతిః - తత్పురుషేకృతిబహులం (6-3-14) అనుపాణినీయముచే అలుక్సమాసము "కస్కాదిషుచ" (8-4-48) చే విసర్గమునకు సత్వమునుగల్గి సిద్ధించినరూపము - ఈ + చోటన్ - త్రికసంధి చేయఁగా "ఇచ్చోటన్" అయి నూ. కృతప్రహస్వంబగు చోటు శబ్దంబు నొత్వంబున కత్వప్రహస్వంబులు విభాష నగు. బాల. సమాస. 15 సూత్రముచే, ఇచ్చటన్, ఇచ్చోటన్ - అనురూపములు వికల్పముగా నగును. వారల యిద్దఱయాజ్ఞ - లాత్మస్మద్యుష్మ దుభయార్థకంబులు సామానాధికరణ్య సంఖ్యావాచితో సమసించు. ఆంధ్రశబ్దాను శాసనము, ప్రకీర్ణసూత్రము చేత - మీ యిద్దఱు, తమయిద్దఱు - అయినట్లే - తచ్ఛబ్దబహువచనాంతమునకు సంఖ్యావాచితో సమాస మైనది.

ఉ. ఇప్పుడు నిన్నుఁ జూచి కొలు వించుక చేయ కతిక్రమించి పో
నొప్పు దటంచు వచ్చితిమి యోగ్య సమర్పణ మాను టెంతయున్ R.C
దప్పు గదయ్య! యాదవవతంస నినుం గని నీయనుగ్రహం
బొప్పుగఁ గాంచి పోవుట ప్రయోజనసిద్ధికి మూల మారయన్. 45

అర్థము :—యాదవవతంస = యదువంశరాజులలో శ్రేష్ఠుఁడా, ఇప్పుడు, నిన్నున్, చూచి కొలువు = సేవ, ఇంచుక, చేయక, అతిక్రమించి = దాఁటి - విడిచి అని భావము. పోన్ + ఒప్పదు = పోవఁదగదు, అటంచున్ = అనుచు, వచ్చితిమి, యోగ్యసమర్చన = ఉత్తములయొక్క పూజను, ఉత్తములను పూజించుట అనిభావము - మానుట, ఎంతయున్ = మిగుల, తప్పు + కద + అయ్యా = తప్పుగాదా ? నినున్, కని, నీ అనుగ్రహంబు = నీదయను, ఒప్పుగన్ = బాగుగా, కాంచి = పొంది, పోవుట = వెళ్లుట, అరయన్ = ఆలోచింపఁగా, ప్రయోజనసిద్ధికిన్ = (ఇప్పటి) కార్యముయొక్క నెఱవేఱుటకు, మూలము = ప్రధానకారణము.

తాత్పర్యము:—ఇపుడు నిన్నుఁ జూచి సేవింపక వెళ్లరా దని వచ్చితిమి. యోగ్యులను బూజింప మానుట తప్పుగాదా ? నిన్నుఁ జూచి నీదయ నొంది వెళ్లుట ఇప్పటి పూపని నెఱవేఱుటకు మూలము కూడ నగును.

అలం:—కావ్యలింగము. అర్థాంతరన్యాసము.

క. నీపలికినట్ల యేము సు,రాపగఁ గ్రీడించు దివ్యహంసములము నీ
చూపునకుఁ దప్పు గలదే, యేపట్టుననైనఁ బంకజేక్షణతనయా. 46

అర్థము:— నీపలికినట్ల = నీ వనినయట్లే, ఏము = మేము, సురాపగన్ = దేవతానదియందు, ఆకాశ గంగయందు, క్రీడించు = విహరించునట్టి, దివ్యహంసములము = స్వర్గమునఁబుట్టిన యంచలము, పంకజేక్షణ తనయా = తామరలవంటి కన్నులుగల కృష్ణుని కొమరుఁడా; ఏపట్టునన్ + ఐనన్, నీ చూపునకున్, తప్పు = పొరపాటు, కలదే = ఉండునా. ఉండదు అని భావము.

తాత్పర్యము:- నీ వనినట్లే మేము దివ్యహంసలము. ఆకాశగంగలో క్రీడించుచుందుము. ఏవిషయము నందైనను నీ దృష్టికిఁ దప్పిపోవునది కలదే - లేదు, అని భావము.

వ్యా. వి:—నీవు + పలికినయట్లు + ఏ - సూ. ధాతుజవిశేషణ భావార్థకపూర్వ, వ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు. ప్రౌఢ. కారక. 15. చే - నీయొక్క + పలికిన + అట్లు - సూ "యొక్కకు లోపంబు బహుళంబు". కారక, 16. చే, నీ పలికిన యట్లే - అనియగును.

హంసములము - హంస శబ్దము చరిత్రాది గణపతితమై, హంస, హంసము, అని రెండు రూపము లౌంను. ప్ర. బ. హంసలు, హంసములు - మేము అనుదానికి విశేషణ మైనప్పుడు ముపర్ణమును, తుది ఉకారమున కకారమును - బాల. కారక. 33. 34. సూత్రములచే వచ్చి పైరూపము సిద్ధించును.

వ. ఏము కాశ్యపులము మమ్ము నింద్రుండును మా తండ్రి యుపేంద్రుండును నిజ పరివారంబులోనివారిఁగా విచారించి, యీరీతిఁ బని పంచి నడుపుకొనుచున్నవారు. వారిజాక్షునకు దక్షిణభుజాదండంబునుంబోలె నఖిలకార్యంబులందు నత్యంతధురం ధరత్వంబు వహించి యున్నవాఁడవు గావున మావిధంబు నీకు విన్నవించుకొంటి మెల్లపట్టునం దృష్టిఁ బెట్టుకొని యుండునది యేము పోయివచ్చెద మనినఁ బ్రద్యుమ్నుం డి ట్లనియె.

అర్థము:—ఏము = మేము, కాశ్యపులము = కశ్యపబ్రహ్మ సంతతిలోనివారము, ఇంద్రుఁడును, ఉపేంద్రుఁడును - కశ్యపుని బిడ్డలేకావున, మమ్మును, నిజపరివారంబులోని వారినిగా, విచారించి=ఊహించి, ఈ రీతిన్, పని = ఆజ్ఞను, నడపుకొనుచున్నవారు = మాచే చేయించుకొనుచున్నారు, వారిజాక్షునకున్ =

తామరలవంటి కన్నులుగల శ్రీకృష్ణునకు; దక్షిణభుజాదండంబునుంబోలెన్ = కుడిభుజమువలె (దండమువంటి భుజము - భుజాదండము) అఖిలకార్యంబులందున్ = ఎల్లపనులందును, అత్యంత ధురంధరత్వంబు = మిగుల భారమునువహించు కృత్యము, వహించియున్నవాఁడవు = పూనియున్నావు. (అన్నిపనుల నిర్వాహణము ముఖ్యముగా నీయందే యున్న దనుట - కుడిభుజము సర్వకార్యములందును బరువు పూన నెట్లు ముఖ్యమో కృష్ణుని యెల్లపనులం దట్టి ముఖ్యతముఁడ వని భావము.) కావునన్, మావిధంబున్, నీకున్, విన్నవించుకొంటిమి. ఎల్లపట్టులన్ = అన్నివిషయములందును, దృష్టిన్ = నీ చూపును, పెట్టుకొని = (కార్యముపట్ల) నిలిపి, ఉండునది = ఉండవలెను, (విధ్యర్థక క్రియ).

తే. మీరు పోయెడి కార్య మెవ్వారలకును, జెప్పరాదేమొ? పోనిమ్ము చెప్పు మొకటి
యల్లయతఁ డితఁ డనుకొంటి రాద నెచట, నా ప్రసంగంబు రాఁ గారణంబు గలిగె.

అర్థము:—మీరు, పోయెడికార్యము = వెళ్లుచున్నపని, ఎవ్వారలకునున్ = ఇతరుల కెవరికిని, చెప్పరాదు + ఏమి + ఓ = చెప్పఁగూడదేమో, పోనిమ్ము = అది యటుండనిమ్ము, ఒకటి, చెప్పుము, అల్లయతఁడు = మన మనుకొన్నవాఁడు, ఇతఁడు = ఈ కనఁబడుచున్నవాఁడే, అనుకొంటిరి, ఆదిన్ = మొదట, మీరు బయలుదేఱునప్పుడు అని భావము, నా ప్రసంగంబు = నన్నుఁగూర్చిన ప్రస్తావన, రాన్ = వచ్చుటకు, కారణము = నిమిత్తము, ఎచ్చటన్ = ఎక్కడ, కలిగెన్ = తటస్థించెను.

తాత్పర్యము:— మీరిపుడేపనికై వెళ్లుచున్నారో అది చెప్పఁగూడనిదగుచో మానివేయుఁడు. కాని వాఁడువీఁడే యనుకొనిరిగదా ! ఇంతకుమున్ను నామాట యెక్కడ వచ్చినది ? హేతువేమి ?

వ్యా. వి:— మీరు పోయెడికార్యము - సూ. కర్మాదులకుఁ బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు. బాల. సమాస. 26 చే. పోయెడి అనుధాతుజ విశేషణము 'మీరు' అనుదానికి విశేషణమైనను, కార్యమునకట ప్రాధాన్య వివక్ష కావున సంప్రదానమగు నా పదముతో సమసించినది.

క. అదియును జెప్పఁగ వచ్చిన,యది యైన నొకింతవడి ప్రయాణత్వరయున్
గుదియింప వచ్చునేనిన్, బదరక నిమిషంబు నిలిచి భాషింపఁ దగున్. 49

అర్థము:—అదియును = నన్నుఁగూర్చి వచ్చిన ప్రస్తావము, చెప్పఁగవచ్చిన యది = చెప్పుట కనుకూలమైనది, ఐనను = అయిన యెడలను, ఒకింతవడి = కొంచెముసేపు, ప్రయాణత్వరయున్ = ప్రయాణపు తొందరయును, కుదియింప వచ్చునేనిన్ = తగ్గించుకొనవీలగు నేనియును, పదరక = తొందరపడక, (శాంతించి), నిమిషంబు = ఱెప్పపాటు కాలము, నిలిచి, భాషింపఁ దగున్ = మాటాడవలయును. (ఇందు ప్రద్యుమ్నునియొక్క ప్రకృతిగాంభీర్యము వ్యక్త మగుచున్నది. 'నీ ప్రసంగ మచట వచ్చినది లే' యని యసంపూర్ణముగా నెవరివలననేని విన్నచో పూర్ణముగా వినుదాఁక నెట్టివానికిని మనసుకుదిరి యుండదు. ప్రద్యుమ్నునకు నట్లే యున్నది. కాని యడిగినచో హంసి నిరాకరించినయెడ నవమాన మగును. కావున దానిని వినుటయం దంతగా నాసక్తి లేనట్లును, నీకు చెప్పఁదగినది నాకు వినఁదగినదియు నైనచో, అంతియ కాదు. కొంచెము తడవు నిలిచి యుండ వీలున్నచోఁ జెప్పుము అని నిర్బంధము లేకుండ మాటాడుట యెంతయు గంభీరమును, మనోహరమును నై యున్నది.

చ. అనుడు రహస్య మైనదియ యైనను భవత్పరిపృష్ట మెంతయున్
జనక నిమేషముం దడయ సంగతి గాదును మాకు నైన నీ
వనఁగ జనార్దనుం డనఁగ నాఁటియ భేదము లేదు కావునన్
విను వినుపింతు మాపనియు నీదు ప్రసంగము మున్ను కల్మియున్. 50

అర్థము:—అనుడున్ = అనిన పిమ్మట, (శుచిముఖి చెప్పుచున్నది), భవత్పరిపృష్టము - భవత్ = నీచేత, పరిపృష్టము = అడుగఁ బడినది, ఎంతయున్, రహస్యము, ఐనది + అ, ఔను, (మిక్కిలి రహస్యమైనదే యవును అని భావము) చనక, నిమేషమున్, తడయన్, సంగతి, కాదు + ఉన్ — (ఈసముచ్చయమగు ఉన్ తడయన్ అనుదానితోఁ గలిసి యర్థయుక్త మగును.) చనక = వెళ్లక, మాకున్, నిమేషమున్= ఱెప్పపాటు కాలమైనను, తడయన్ + ఉన్ = ఆలస్యము చేయుటయును, సంగతి = యుక్తము, కాదు, ఐనను, నీవు, అనఁగన్, జనార్దనుఁడు = శ్రీకృష్ణుఁడు, అనఁగన్, ఆరయన్ = పరిశీలింపఁగా, భేదము, లేదు, కావునన్, మాపనియున్, నీదు ప్రసంగము, మున్ను, కల్మియున్ = కలుగుటయును, వినిపింతున్, వినుము.

వ్యా. వి. :—ఉను, నేని, ఏని వంటి కొన్ని యవ్యయములు భారతాదిప్రాచీనగ్రంథములందు కామ చారముగాఁ గన్పట్టును. 'సీ. చక్రధరుండైయు జలరుహనాభుండు గాండీవధరుఁడైయుఁ బాండవుండు - అని. భార. ఆది. 8. 261 - చక్రధరుండై, జలరుహనాభుండు + ఉను, గాండీవధరుఁడై, పాండవుఁడు + ఉను - అనుసమన్వయము లెస్స. 'నీవును జూచి తట్టిసభ నేని వినంబడ దేయుగంబులన్' భార. సభా. 2.95. అట్టిసభ, ఏయుగంబులన్నేని, వినంబడదు. అని సమన్వయము. అట్లేయిందలి "కాదును" అనుదానిలోని సముచ్చయము (ఉను) "తడయన్" అనుదానితోఁగలిసి కాని యర్థవంతము కానేరదు. తడయనున్ = ఆలసించుటకును, - అనిన చక్కగాఁ గుదురును. నీదుప్రసంగము - నీప్రసంగము, షష్ఠీసమాసమున వచ్చిన దుగాగమము - కలిమి - కలుగుధాతువుపై భావార్థమున నిట ఇమిప్రత్యయము - "కలుగుట" అర్థము.

వ. అని శుచిముఖి యిట్టు నట్టు పలుకఁ గొంకి నలువంకలుఁ బాఱఁజూచుటయు
నాచూపువెంటనె శంబరాంతకుచూపు దీపితైకాంతకాంక్షం బగుచుం బరఁగినఁ
బరిజనసమానంబుగా మాననీయులు నాయన యున్నచోటికిఁ గడు నెడ గలుగఁ
దొలంగి చని రంతఁ గంతు నభివీక్షించి యంచచెలువ చెలువంపుఁజెలువు గులుకు
కలికిపలుకులకలకలంబు వీనులకపూర్వపర్వం బగుచుఁ బర్వుచుండ నిట్లనియె. 51

అర్థము:—పలుకన్ = చెప్పుటకు, కొంకి = సందేహించి, నలువంకలు = నాలుగుదెసలు, శంబరాంతకు = శంబరుఁడను నసురకు యముఁడైన, ప్రద్యుమ్నునియొక్క, చూపు = దృష్టి, దీపిత...క్షంబు- దీపిత = ప్రకాశింపఁజేయఁబడిన, (ప్రకటింపఁబడిన అనిభావము) ఏకాంత = రహస్యమందలి, కాంక్షంబు= కోర్కెకలది, (రహస్యమును గోరుచున్నట్లు సూచించుచుండెనని భావము.) అగుచున్, పరఁగినన్ = ప్రసరింపఁగా, మాననీయులు = గౌరవార్హులగు పెద్దలు, పరిజనసమానంబుగాన్ = సేవకులతో సమానముగా, కడున్ + ఎడ =మిగుల దూరము, కలుగన్, తొలంగి, చనిరి, అంతన్, కంతున్+అభివీక్షించి=ప్రద్యుమ్నుని చూచి, అంచచెలువ = హంసాంగన, (చెలువ = అందమగుస్త్రీ.) చెలువంపుఁజెలువు = సొగ సగువిధమును, కులుకు = చిమ్ముచుట్టి, కలికిపలుకుల = నిపుణ మగు మాటలయొక్క, కలకలంబు = రొద-లేక వీణాదుల ధ్వనివంటిధ్వని, వీనులకున్ = చెవులకు, అపూర్వపర్వంబు = (పూర్వమందులేనిది) క్రొత్తదగు పండుగ, అగుచున్, పర్వుచుండన్ = వ్యాపించుచుండఁగా, ఇట్లు, అనియెన్ = చెప్పెను.

తాత్పర్యము:—అని శుచిముఖి చెప్పుటకు సందేహించి యిటునటు పాఱఁజూడఁగా - ప్రద్యుమ్నుఁడును రహస్యము మాటాడుకొనవలె నందఱు తొలఁగుఁ డన్నట్లు తేఱిపాఱఁ జూచునంత - అచట నున్న సేవకులును పెద్దలును నందఱును మిగుల దూరముగా నేఁగ - ప్రద్యుమ్నుని జూచి యాహంసి, మధుర మగు స్వరమున నిట్లు చెప్పెను.

అలం:— "అంచచెలువ చెలువంపుఁజెలువు గులుకు కలికిపలుకుల కలకలంబు"అను వాక్యమునందు లకారముయొక్క యసకృదావృత్తిచే - వృత్త్యనుప్రాసము, శబ్దాలంకారము.

క. వినవయ్యా వజ్రనాభుం, డనిమెడు నొకదైత్యుఁ జంప నీ యత్నము సతతం
బును నడచుచున్నయది బహు, దినములనుండియును హరికి నీ దేవేంద్రునకున్. 52

అర్థము:—వినవయ్యా = వినుమా, వజ్రనాభుండు, అనిమెడు నొకదైత్యున్, చంపన్, యత్నము, హరికిన్ = కృష్ణునకును, దేవేంద్రునకును, బహుదినములనుండియు, సంతతంబును=ఎల్లప్పుడును, ఎడతెగక అని భావము. నడచుచున్నయది = సాగుచున్నది.

వ్యా. వి. :—వినుము+అయ్యా-"సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష ననుప్రయుక్తంబులగు" బాల. క్రియా. 33. సూత్రముచే "అయ్యా" అనుప్రయుక్తమైనది. ఇది ఎదాదులలోని దగుటచే - సూ. "ఎదాదు లనుప్రయుక్తం బగునపుడు ముజ్జునకు "వుజి, రుజి" యగు. 34 సూత్రమున "వినుము" అను దానిలోని మకారమునకు వకారమును వెనుకటి ఉకారమునకు అకారమువచ్చి "వినవయ్యా" అని అయ్యెను, (బ. వ. వినరయ్యా.)

క. తమకంటెను మున్న వాఁడే, తమమీఁదట నేమి కీడు దలఁచునో యనుచున్
మము వారు వేగు పంపఁగ, నమరాహితు వీటి కిప్పు డరిగెద మనఘా. 53

అర్థము:—అనఘా = పాపరహితుఁడా !, తమకంటెన్, మున్న = ముందుగా, వాఁడే = ఆరక్కసుఁడే, తమమీఁదటన్ = తమపైని, ఏమి, కీడు = హానికరమగుపనిని, తలఁచునో = తలపెట్టునో, అనుచున్ = అనిసంశయించుచు, మమున్, వారు = ఆయింద్రుఁడును, కృష్ణుఁడును, వేగుపంపఁగన్ = చారులుగా పంపఁగా, అమరాహితువీటికిన్ = దేవతలకు శత్రువగు వజ్రనాభునియొక్క పట్టనమునకు, ఇప్పుడు, అరిగెదము = వెళ్లుచున్నాము.

తాత్పర్యము:—తా మెప్పుడో చంపఁదలఁచియుండ వజ్రనాభుఁడే తమమీఁద వచ్చి పడునేమో యనుశంకచే వాఁ డేస్థితియం దున్నాఁడో కనిపెట్టి వచ్చిచెప్ప నింద్రుఁడును, కృష్ణుఁడును చారులుగామమ్ము నంప నిదిగో వెళ్లుచున్నాము.

వ. అనిన విని యతండు. 54

క. కటకట మనవా రిది దు, ర్ఘటముగఁ గొని యెంతచింతఁ గావించెద రె
ప్పటి కింక నేము మే మెం, తటిపగయును దీర్పలేమె తమయాజ్ఞపసన్. 55

అర్థము:—అనినన్ = శుచిముఖి యట్లనఁగా, విని, అతండు, (ఇట్లనును. అధ్యాహారము) కటకట! సంతాపసూచకము, ఇది = ఈరాక్షసవధ, దుర్ఘటముగన్ = సాధింపరానిదిగ, కొని = తీసికొని, (ఉద్దేశించి యని భావము), మనవారు = మన పెద్దలు, ఎంత, చింత, కావించెదరు, ఇంకన్, ఏము, ఎప్పటికిన్, ఇంక మేమెప్పటికి నుపయోగింతు మనిభావము. తమయాజ్ఞపసన్ = తమశాసనముయొక్క శక్తిచేత, ఎంతటి పగయును, మేము, తీర్పలేమె = పోఁగొట్టలేమా ?

క. అకట ! తమమహిమ తా రెఱుఁగ, రకటయో మఱి యేలొ తెగరుగాక మరుత్కం
టకుఁ బీఁచమడంపనె న, న్నొకనినె పంపినను దమ నియోగముబలిమిన్. 56

అర్థము:—అకట ! వారు = (మనవారు), తమమహిమ = తమ గొప్పతనమును, తారు = తాము, ఎఱుఁగరయో, మఱియేలొ (మఱి + ఏల + ఒ) = మఱి యెందువలననో, తెగరు గాక = సాహసింప

కొంచురు గాక, నన్నున్, ఒకనిని + ఎ = ఒక్కనినె, పంపినను = ఆజ్ఞాపించినను, తమనియోగము బలిమిన్ = తమ యాజ్ఞాబలముచేత, మరుత్కంటకున్ = దేవతలకు నీచశత్రువగు నారక్కసుని, పీఁచమడంపనే = చంపివేయనా ? - చంపేయుదునని భావము.

వ్యా. వి. :—పీఁచము + అడఁగు = పీఁచమడఁగు - చచ్చు, నశించు - అని శబ్దపల్లవధాతువు, దానిపై ప్రేరణరూపము పీఁచమడఁచు = చంపు అని యగును. ఈపద్యమునఁ బ్రద్యుమ్నుఁడు తా నెంత బలవంతుఁ డని యెఱిఁగినను, పెద్దలయెడ విధేయత గనఁబడ వారియాజ్ఞ కానిదే శత్రువును జంప ననుట మహాపురుష లక్షణమై యుత్తమనాయకత్వము వెల్లడించుచున్నది.

వ. అనుడు శుచిముఖి మెచ్చు నచ్చెరువు నిరవుకొన నతనిం జూచి యి ట్లనియె - 57

అర్థము:—అనుడున్ = ప్రద్యుమ్నుఁ డనఁగా, శుచిముఖి, మెచ్చున్ = శ్లాఘయును, అచ్చెరువున్ = వింతయును, ఇరవుకొనన్ = కలుగఁగా, అతనిన్, చూచి, ఇట్లు, అనియెను.

చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచార మింత చే
యుదురఁట దైత్యుఁ డెంత బలియుండొ కదా యని, కోఁచవాఱ కి
ట్లుదుటున వానిఁ ద్రుంతు నను నొక్కనిఁ బంపిన నంటి చాలదే
యిది నెరవైనబంటుతన మిట్టిది నీక తగున్ గుమారకా! 58

అర్థము:—కుమారకా = ఓ చిన్నవాఁడా, భిదురధరుండున్ = వజ్రాయుధమును దాల్చినవాఁడగు నింద్రుఁడును, చక్రియును = చక్రాయుధుఁడగు కృష్ణుడును, బెట్టుగన్ = అత్యంతము, ఇంత, దీర్ఘవిచారము = ఎడతెగని యాలోచనను, చేయుదురఁట - దైత్యుఁడు = ఆ వజ్రనాభుఁడు, ఎంత బలియుండో కదా = ఎంతటి బలవంతుఁడో కదా, అని = తలఁచి, కోఁచవాఱక = భయపడక, ఇట్లు = ఈ రీతిగా, ఉదుటునన్ = ఔద్ధత్యముతో, ననున్, ఒక్కనిన్, పంపినన్, వానిన్, త్రుంతును, అంటి = అంటివి, చాలదే = ఇట్లనుటయే చాలును, ఇది = ఇట్లనుట, నెరవు = పరిపూర్ణమైన, బంటుతనము = పరాక్రమము, ఇట్టి + అది = ఇటువంటి శౌర్యము, నీకున్ + అ = నీకు ఒక్కనికే, తగున్ = అర్హమగును.

తాత్పర్యము:— వజ్రాయుధము, చక్రాయుధము ధరించిన యింద్రోపేంద్రులు పెద్ద యాలోచనలో మునిఁగి యుండ - రాక్షసుఁ డెంతబలవంతుఁడు కానిదే వా రంత దీర్ఘవిచార మేల చేయుదు రని యైన యనుకొనక, నన్నొక్కనిఁ బంపినచో వానిని చంపుదు నంటివి. అది యొక్కటే చాలును. ఈ పలుకుట నీయొక్క నిండుపరాక్రమము తెలుపుచున్నది. ఇట్టిది నీకే చెల్లును. ఎంత బలపరాక్రమములు లేనిదే యింత ధీరముగా నన వనిభావము.

అలం:— పరికరాంకురము.

చ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మెడు తమ్మెదిరించి యేమియున్ 58
డయ్యక కొంతసేపు పెనుకొడాకను జేతుల కాఁటి నిల్చువాఁ
డెయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁ గౌతుకకారి కాఁడె నీ
వయ్యసురేంద్రుతోడి యని కాసయొనర్చుట యుక్త మెన్నఁగన్. 59

అర్థము:—కయ్యపువేడ్కన్ = యుద్ధమందలి యుత్సాహమును, రేఁచుకొని = ఉద్రేకింపఁజేసికొని, క్రమ్మెడు = కవియునట్టి, తమ్మున్, ఎదిరించి = ప్రతిఘటించి, ఏమియున్ = కొంచెమును, డయ్యక =

అలయక, కొంతసేపు, పెనుడాకను = గొప్ప శౌర్యముతో, చేతులకున్ = చేతుల బలిమికి, అంటి = ఓపి, చాలి, నిల్చువాఁడు = తొలఁగనివాఁడు, ఎయ్యెడన్ = ఎక్కడనైనను, పోటుబంటునకున్ = యుద్ధవీరునకు, ఎంతయున్ = అత్యంతము, కౌతుకకారి = వేడుక కలిగించువాఁడు, కాఁడె = కాఁడా, అగునని భావము. ఎన్నఁగన్ = ఆలోచింపగా, నీవు, ఆ + అసురేంద్రుతోడియనికిన్ = ఆ రాక్షసరాజుతో చేయఁదగు యుద్ధమునకు, ఆస యొనర్చుట = ఆశించుట, యుక్తము = న్యాయము.

తాత్పర్యము:—యుద్ధోత్సాహము నుద్రేకింపఁజేసికొని మీఁదఁ బడునట్టిశత్రు సెదిరించి, అలయక కొంతసేపు శౌర్యముచే చేతులకోఁటి నిల్చువాఁ డెచటనైన లభించెనా యుద్ధవీరునకు మహోత్సాహము కల్గును. ఆలోచింప నీ వా వజ్రనాభునితో యుద్ధమొనర్ప నాశించుట యిట్టిదేకాన న్యాయమే యగును.

అలం:—అర్థాంతరన్యాసము.

వ్యా. వి:—కయ్యపువేడ్క "కర్మధారయంబులందు మువర్ణకమునకుఁ బుంపులగు" బాల. సంధి. 32. అనుదాని లోని బహువచనముచేత - తత్పురుషమునందును పుంపులు వచ్చుట జ్ఞాపితమైనది. పొడుచు ధాతువుయొక్క కృదంతరూపము-పోటు, "టువర్ణకంబు పడ్వాదుల కగు, నగుచో నయ్యవి యాద్యక్షర శేషంబులై దీర్ఘంబు నొందు" బాల. కృదంత. 8.

బంటు = 1 సేవకుఁడు, 2 శూరుఁడు. (నానా.)

ఆ. తమకుఁ దామె ప్రల్లదంబునఁ బని లేని, కయ్యమునకుఁ జనరుగాని తగిన
దురము లైనఁ దివురుదురు తమయంతన, పిఱికికండ లేని బిరుదుమగలు. 60

అర్థము:—పిఱికికండ = అధైర్యము, లేని, బిరుదుమగలు = శూరులగు పురుషులు, ప్రల్లదంబునన్ = దౌర్జన్యముచేత, తమకున్ + తాము + ఎ = తమంతఁ దామే, స్వయముగా, పనిలేని = ప్రయోజనములేని, కయ్యమునకున్ = యుద్ధమునకు, చనరు = వెళ్లరు, కాని, తగిన దురములు = తగిన యుద్ధములు (చేయక తప్పనివి అని భావము), ఐనన్ = కలిగినచో, తమయంతన్ + అ = తమంతటఁ దామే, తివురుదురు = పూనుకొందురు, సిద్ధమగుదురు.

తాత్పర్యము:—అధైర్య మెఱుఁగని శూరపురుషులు దౌర్జన్యముచే తమకుఁ దామై, పనిలేని పోరులకు దిగరు కాని, అనివార్యము లగుయుద్ధములు తటస్థించినచో తామే సిద్ధ మగుదురు.

అలం:—అప్రస్తుత ప్రశంస.

వి :—పిఱికికండలేనివాఁడు = ధీరుఁడను నర్థమున తెనుఁగు జాతీయము.

వ. అది యట్లుండె నింక నీ ప్రసంగంబు మున్ను వచ్చిన తెఱంగును విన్నవించెద వినుము. 61

అర్థము:—సుగమము.

చ. ఇంతకుమున్ను వజ్రపురికేఁగుచునుండుదు మేము గావునన్
గాంతతరాంగి యద్దనుజకన్యక నే నొకనాఁడు గంటి శు
ద్ధాంత సరఃప్రకాండ సముదంచితకేళిఁ జరించుచుండి త
ద్ద్వాంతలతాగృహంబున వయస్యయుఁ దానును ముచ్చటాడఁగన్. 62

అర్థము:—ఇంతకు మున్ను, ఏము = మేము (అంచలము), వజ్రపురికిన్, ఏఁగుచు నుండుదుము = వెళ్లుచుందుము, కావునన్, = కాబట్టి, ఒకనాఁడు, నేను, శుద్ధాంత ... కేళిన్ — శుద్ధాంత = అంతఃపురమందలి, సరః ప్రకాండ = ప్రశస్తమైన కొలనియందు, సముదంచిత = ఒప్పుచున్న, కేళిన్ = క్రీడయందు, సంచరించుచున్ + ఉండి=ప్రవర్తించుచుండి, తత్ప్రాంత లతా గృహంబునన్ = ఆ సమీప మందలి పొదరింటియందు, వయస్యయున్ = చెలికత్తెయును, తానును, ముచ్చటాడఁగన్ = సల్లాపమొనర్చు కొనుచుండఁగా, కాంతతర + అంగి = అత్యంత మనోహరమగు దేహము గలది, (యగు) అద్దనుజకన్యకన్ = ఆ వజ్రనాభ రాక్షసునియొక్క పుత్రికను, కంటిన్ = చూచితిని.

తాత్పర్యము:—ఇంతకుఁ బూర్వము మేము వజ్రపురికి వెళ్లుచుందుము. కాన ఒకనాఁడు నేను కన్యాంతఃపురమందలి కొలనిలో విహరించుచు, దాని యొద్దనున్న పొదరింటిలోఁ జెలికత్తెయుఁ దానును ముచ్చటలాడుకొనుచుండఁగా మిగుల సొగసైన ఆ రక్కసుని కూఁతును జూచితిని.

వి. :—ఆ+దనుజ కన్యక - త్రికసంధి-ఇందలి "ఆ" తచ్ఛబ్దార్థము. సమాసగతమగు దనుజ శబ్దముతో నన్వయించును. దీనినే ఏకదేశాన్వయ దోషమందురు. షష్ఠీ సమాసైకదేశముతో సంస్కృతమునను ఈ యేక దేశాన్వయము గలదు. కాని సమానాధికరణమునఁ గూడ తెనుఁగునఁ గలవు. "ఆ నారాయణ పాండవేయ గుణ మాహాత్మ్యామలజ్యోత్స్న" భార. ఆది. 3-21 ఇట్టివి బహుళములుగాఁ గలవు — లేక తద్దనుజకన్యక, అని కాని, అద్దనుజు కన్యక యనికాని, పాఠము లున్న యెడ నీ శంకయే కలుగదు.

ప్రాంత — వయస్య — అను తావున ప్రాది యతి. ఇట సచ్చుతోఁ జెల్లినది.

క. తిర్యగ్వనితను నన్ను న, మర్యాదానందమగ్నమతిఁ జేసె మహా
శ్చర్యముగఁ దద్వధూ సౌం, దర్యం బపు డేమి చెప్ప నలినాక్షసుతా! 63

అర్థము:—నలినాక్షసుతా = తామరలవంటి కన్నులు గల కృష్ణుని పుత్రుఁడా, అపుడు = ఆ కన్యను చూచిన సమయమున, తద్వధూ సౌందర్యము = పడఁతియొక్క సొగసు, చెప్పన్ ఏమి = చెప్పుట కేమున్నది, మహాశ్చర్యముగన్ = గొప్పవింత యగునట్లు, తిర్యగ్వనితను = పక్షిస్త్రీని (అగు) నన్నును = నన్నుఁ గూడ, అమర్యాదా ... మతిన్, అమర్యాద = హద్దులేని, ఆనంద = సంతోషమున, మగ్న = మునిఁగిన, మతిన్ = బుద్ధి గలదానినిగా, చేసెన్ = చేసెను.

తాత్పర్యము:—శ్రీకృష్ణ తనయా! అప్పుడామెసొగసు చెప్పుట కేమున్నది? సౌందర్య వివేకము లేని పక్షిని. అందును నాఁడుదానిని సొగసుచూచి సంతసింపలేని యాఁడుదాన నగు నన్నునే అత్యాశ్చర్యముగా మితిలేని యానందమున ముంచివేసినది - "తిర్యగ్వనితను" అను విశేషణము సాభిప్రాయము కావున.

అలం. :—పరికరము.

వి. :—ఏమిచెప్పన్ - అనునది ఏమి చెప్పవలయును. ఏమి చెప్పఁగఁ గలదు. అను వాక్యములందలి వలయున్, కలదు, ఉన్నది మున్నగు క్రియాపదములు లోపించిన జాతీయము - చెప్పన్ = చెప్పుదును. అను (కొన్ని) వ్యాఖ్యానములు భ్రాంతి మూలకము అని తెలియఁదగును.

సీ. నెత్తమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫల, శ్రీ లంచుఁ దాఁబేటిచిప్ప లనుచు
నమ్ములపొదు లంచు నరఁటి కంబము లంచుఁ, బులినమంచును సుడిచెల్వ మనుచు
హరిమధ్యమం బంచు హైమ కుంభము లంచు, నవమృణాళములంచుఁ జివురులంచు
మదనుశంఖ మటంచు మణిదర్పణము లంచుఁ, బగడ మంచును దిలప్రసవ మనుచు

శఫరు లంచు సింగిణు లంచుఁ జంద్రఖండ, మనుచు శ్రీకారము లటంచు నళులటంచు
నిట్టివిగదయ్య చెప్పఁబోయిన నుపమలు, వీనిఁ దడవ సిగ్గొదవు నవ్వెలఁది నెంచి.

ఈపద్యమున స్థూలముగా ప్రభావతి యవయవములు పాదాదిశీర్ష పర్యంతముగా వ్యజ్యమానము లగునట్లు సూచితములు. పిదప నిరువదిమూఁడు పద్యములందు కేశాదిపాదాంతము వర్ణింపఁబడెను. ఇట్లు వర్ణించుటలో "దేవతానాం రూపం పాదాంగుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశా దారభ్య." అని మల్లినాథసూరి కుమారసంభవమున ప్రథమసర్గ 33 శ్లోకవ్యాఖ్య కవతారికయం దనెను. "మానవులను శిరస్సు మొదలుకొనియు, దేవతలను పాదములు మొదలుకొనియు వర్ణింపఁదగును. (దేవతలు పూజ్యులు గానఁ బాదములనుండి వర్ణింపవలెను. అని నరసభూపాలీయవ్యాఖ్యయందు శ్రీసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు వ్రాసిరి.) కాని కవు లీనియమము నంతగాఁ బాటించిన ట్లగపడదు. ప్రకృతమున ప్రభావతి దేవతయు, మానవియుఁ గూడఁ గాదు. దానవి. ఈమె రెండు విధములుగాను వర్ణింపఁ బడుట చూడ పైనియమము కామచార మనిపించుచున్నది. స్త్రీని పాదాది శిరఃపర్యంతము వర్ణించునపుడు కవులు సాధారణముగాఁ జెప్పునట్టి యుపమాన వస్తువులను పేర్కొని, యివి ప్రభావతి యంగములకుఁ బోలవని యీపద్యమునఁ జమత్కరింపఁబడుచున్నది.

అర్థము:—సామాన్యముగా కాంతలయొక్క యడుగులకు - నెత్తమ్ములు (నెఱ+తమ్ములు) = వికసించిన తామరపూలు (ఉపమ అనునది యను సంధించుకోఁదగును) అనుచున్, గోళ్లకు-క్రొన్నెలలు (క్రొత్త+నెలలు) = లేత చందురు వంకలు, గుల్ఫములకు,-వటఫలశ్రీలు = మఱ్ఱిపండ్లయొక్క శోభలు, మీఁగాళ్లకు-తాఁబేటి చిప్పలు, పిక్కలకు-అమ్ములపొదులు, తొడలకు-అనఁటికంబములు = అరఁటిస్తంభములు, పిఱుఁదులకు - పులినంబు = ఇసుకతిన్నె, నాభికి-సుడిచెలువము = నీటిసుడియొక్క సొగసు, నడుమునకు-హరిమధ్యంబు = సింహపునడుము, కుచములకు - హైమకుంభములు = బంగరు వికారమగు కుండలు, బాహువులకు-నవమృణాళములు = క్రొత్తవగు తూండ్లు, అఱచేతులకు-చివురులు, కంఠమునకు - మదనశంఖము = మన్మథుని (విజయ) శంఖము, చెక్కులకు-మణి దర్పణములు = మణి వికారమగు నద్దములు, అధరమునకు-పగడము, ముక్కునకు-తిలప్రసవము = నువ్వుఁబువ్వు, (ప్రసవము. నానార్థములు 1. బిడ్డను గనుట 2. బిడ్డ 3. పువ్వు 4. పండు.) కన్నులకు:-శఫరులు = చేఁపలు, కనుబొమలకు:-సింగిణులు= శృంగ ధనుస్సులు, నుదుటికి-చంద్రఖండము = చంద్రునిలో సగభాగము - అర్ధచంద్రుఁడు, చెవులకు - శ్రీకారములు = శ్రీయని వ్రాసిన యక్షరరేఖలు, కురులకు-అళులు = తుమ్మెదలు, అనుచున్ = అని, ఉపమలు = సమానధర్మముగల పదార్థములను, చెప్పఁబోయినన్ = చెప్పఁ బూనినయెడల, ఇట్టివిగదా= ఈచెప్పిన వానివంటివేకదా, అవ్వెలఁదిన్ = ఆప్రభావతిని, ఎంచి = స్మరించి (లేక, తలంచి), వీనిన్= సామాన్యముగా స్త్రీల యవయవములకుఁ జెప్పు నీయుపమాన పదార్థములను, తడవన్ = తలపోయుటకు, సిగ్గు, ఒదవున్ = కలుగును.

తాత్పర్యము:—స్త్రీలను వర్ణించునపుడు సాధారణముగా పాదాది కేశావధి యగు నంగములకు పోలికలుగా పద్మాదిపదార్థములను జెప్పుదురు. అట్లే యాప్రభావతి యంగసౌష్ఠవము నెంచి, యాయుపమాన పదార్థములను - జెప్పుటకుఁ గాదుకదా ! మనస్సునఁ దలఁచుటకుఁగూడ సిగ్గగును.

అలం:—వ్యతిరేకము.

వి. :—ఇట్లనుటచేఁ బ్రభావతి చక్కఁదన మసాధారణ మని తెలియుచున్నది.

వ్యా. :—నెఱ + తమ్ములు - సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు (ప్రాఁతాదిగణకార్యములు) కొండొకచోఁ గానంబడియెడి. బాల. సంధి. 38 చే - అతిదేశము నొంది 'నెత్తమ్ములు' అగును. క్రొత్త + నెల - 35 సూత్రముచే "క్రొ + నెల" అని కాఁగా, సూ. "క్రొత్తశబ్దమున కాద్యక్షర

శేషమునకుం గొన్ని యెడల నుగాగమంబునుం గొన్ని యెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు - సంధి. 37 చే'' ''క్రొన్నెల'' అగును.

గీ. చామరంబులు వెనుకకుఁ ◊ జనుట నీల,రత్నములు పూరిఁ గఱచుట ◊ భ్రమరక మని
తేఁటి బిడ్డకుఁ బేరిడుట యా ◊ తెఱవకురుల,యధికనీలిమ కోడి సూ◊హరితనూజ. 65

అర్థము:—హరితనూజ = శ్రీకృష్ణుని కొడుకగు ప్రద్యుమ్నా ! ఆతెఱవ - నీలిమకున్ - ఆతెఱవ = ఆ ప్రభావతియొక్క, కురుల = తలవెంట్రుకలయొక్క, అధిక= ఎక్కువైన, నీలిమకున్ = నల్లదనమునకు, ఓడి + చూ = ఓడిపోవుటచేతను జుమా, చామరంబులు = చమరమృగములయొక్క తోఁకకుచ్చులు, వెనుకకుఁ జనుట = పాఱిపోవుట - వెనుకభాగమున నుండుట యని యర్థాంతరము - నీలరత్నములు = ఇంద్రనీలమణులు, పూరిన్ + కఱచుటయును = ఓడితిమియని గడ్డిని నోట తాల్చుటయును, తృణగ్రహణము చేయుట యని యర్థాంతరము, తేఁటి=తుమ్మెద, బిడ్డకున్ = తనపిల్లకు, భ్రమరకము = ముంగురులు, - తుమ్మెదపిల్లయని యర్థాంతరము. అని, పేరు + ఇడుట = పేరుపెట్టుకొనుట - (కలిగెను. అధ్యాహారము,) 'ఆ తెఱవకురుల కధికనీలిమనోడి సూ' అనిపాఠాంతరము. అపుడు అధికనీలిమన్ = ఎక్కువనల్లఁదనము విషయమున, ఆ తెఱవవెంట్రుకలకున్, ఓడి సూ. అని అర్థము.

తాత్పర్యము:—ఆ ప్రభావతికురుల నల్లదనమునకు చామరంబులు, నీలరత్నములు, తుమ్మెదలును ఓడిపోయినవి. కావుననే చామరములు వెనుకకుపాఱిపోయినవి. నీలమణులు గడ్డికఱచినవి. తుమ్మెద తనబిడ్డకు ముంగురులకు పర్యాయపదమగు భ్రమరకము అనుపేరు పెట్టుకొన్నది. చామరములు చమర మృగముల తోఁకకుచ్చులు గాన వెనుకనే యుండుటయు, ఇంద్రనీలములు తృణగ్రాహు లగుటయు, మొగమున వ్రేలుకురులకు భ్రమరకములని పే రుండుటయు వాస్తవము. ఆ ధర్మము లోడిపోవుటకు చిహ్నములుగా నుత్ప్రేక్షింపఁబడినవి.

అలం. :—ఉత్ప్రేక్ష, అతిశయోక్తి.

వి. :—తృణగ్రాహిలక్షణము. క. కసవుల నిసువుల కరమున, వెస నిడి నీలంబు మీఁద వెస నూఁగు టయున్, వెస నెడని పోక నిలిచిన, వసుధఁ దృణగ్రాహి యనఁగ వర్ణన కెక్కున్ - అని రత్నశాస్త్రము.

క. అకలుషనీలిమ నాకన్యక కచమున కోడి పాఱి◊నవియై తేఁటుల్
మకరందార్థము తఱచుగ, వికచము లగుపుష్పములకె ◊ వెదకుచునుండున్. 66

అర్థము:—తేఁటుల్ = తుమ్మెదలు, అకలుషనీలిమన్ = మలినరహితమగు - అచ్చ మగునలుపు విషయమున, ఆకన్యకకచమునకున్ = ఆకన్యకయొక్క జుట్టునకు, ఓడి, పాఱినవి = పరుగెత్తినవి, ఐ, మకరందార్థము = తేనెకొఱకు, తఱచుగన్, వికచములు = కచములు లేనట్టివి - (వికసించినవి యని యర్థాంతరము) అగు పుష్పములకున్ + ఎ = అయిన పూవులకొఱకే, వెదకుచు నుండును.

తాత్పర్యము:—ఆ ప్రభావతియొక్క జుట్టునకు నలుపువిషయమున తుమ్మెద లోడిపోయి యా నలుపును జయింపఁగోరి పరుగెత్తినవై, కచముసంబంధములేని పూవులకే తేనెనిమిత్తమై వెదకుచుండును, వికచకములు (= వికసించిన) పూలకొఱకె వెదకునని భావము.

అలం. :— శ్లేషోత్థాపిత కావ్యలింగము, హేతూత్ప్రేక్షాధ్వని.

వి. :—మానవంతుల కోటమి తటస్థించినచో ప్రతిపక్షులను గెలుచుదాఁక యత్నము గావించి శక్తి సంపాదించుటకై అటువంకకుఁ బోక. ప్రతిక్రియాపూర్వకముగా సాధింతురు. తుమ్మెదల్లు నీలిమవిషయమున

ప్రభావతి కచమున కోడిపోయినవి కావున కచసంబంధము లేని వికసించిన పూల నాశ్రయించి, మకరందమును గూడఁబెట్టుచున్నవి. తేనె సోఁకిన వెండ్రుకలు తెల్లపడునని ప్రతీతి కలదు. కావన నీలిమమును పోఁగొట్టి కచమును జయింప యత్నించుచున్న వన్నమాట.

వ్యా. :—నీలిమము - సూ. "అత్మేమనిజంతంబులకు, నాంతంబులగు మనుజసంజ్ఞలకు, స్త్రీత్వంబు బహుళంబుగానగు. బాల. తత్సమ. 77. (నీల+ఇమనిచ్).

గీ. చంద్రభీతఘనధ్వాంత ✽ సంచయమున, కభయ మొసఁగి వేణీభరం ✽ బను నెపమునఁ
దనవెనుక వేసికొన్నది ✽ తరుణిమొగము, చంద్రుఁ గైకొనమి కిదియ ✽ సాక్షి గాదె.

అర్థము:—తరుణిమొగము = ఆపడుచుయొక్క మొగము, చంద్ర...సంచయమునకున్-చంద్ర = చంద్రునివలన, భీత = భయపడిన, ఘన = దట్టమగు, ధ్వాంతసంచయమునకున్ = చీఁకటిగుంపునకు, అభయము+ఒసఁగి = భయము లేదు రక్షించెద నని మాటయిచ్చి, వేణీభరంబు = పెద్దజడ, లేక జడముడి, అను నెపమునన్ = అనునట్టి మిషచేత, వెనుకవేసికొన్నది = తనవెనుక దాఁచి యుంచినది. (జడ వెనుక వైపుననే వేసికొనుట నిజము.) ఇదియ=ఈచీఁకటిని వెనుకవేసికొని వచ్చుటయే, చంద్రుని, కైకొనమికిన్ = లక్ష్యపెట్టకపోవుటకు, సాక్షి = దృష్టాంతము లేక నిదర్శనము - కాదె - కాదా ? అగుననిభావము. ఆమెమొగము చంద్రుని లెక్కింప దనుటకు చంద్రవిరోధి యగు చీఁకటిని వెనుకవేసికొని వచ్చినది అనుటయే సాక్షి.

అలం:—అపహ్నవము, అతిశయోక్తి, కావ్యలింగము.

క. కాంతతరఫాలసంజ్ఞిత, కంతువిజయలేఖపట్టి ✽ కావిన్యస్తా
ద్యంతశ్రీకారము లన, నెంతయు నాయింతి వీను ✽ లింపెసలారున్. 68

అర్థము:—ఆయింతివీనులు = ఆస్త్రీయొక్క చెవులు, కాంత...కారములు - కాంతతర = మిగుల చక్కని, ఫాల = నొసలనెడి, సంజ్ఞిత = పేరుగల, కంతు = మన్మథునియొక్క, విజయ = గెలుపులను తెలుపు, లేఖ = వ్రాఁతగల, పట్టికా = పలకయందు, విన్యస్త=ఉంపఁబడిన, అనగా వ్రాయఁబడిన, ఆద్యంత = మొదటను తుదనుగల, శ్రీకారములు = శ్రీయను నక్షరములు, అనన్, ఎంతయున్ = అత్యంతము, ఇంపెసలారున్ = ఒప్పును.

తాత్పర్యము:—ఆ ప్రభావతి నొసటను మదనవిజయ లేఖనముగల ఫలకయం దాద్యంతంబులందు వ్రాసిన శ్రీకారములా యన నామెచెవు లొప్పుచుండెను.

అలం. :—రూపకము, ఉత్ప్రేక్ష.

వ్యా. సంజ్ఞకలది సంజ్ఞితము - తారకాదిత్వా దితచ్ - ఇతచ్ప్రత్యయాంతము తద్ధితము.

తిలకము సంహితోర్ధ్వముఖ ✽ తీక్ష్ణశరాగ్రము గాఁగ నాసికాం
చల విలసత్ప్రకోష్ఠ సుమ ✽ సాయక ముష్టి గృహీతమధ్య శా
ర్ఙ్గలత యనన్ బొమల్ దనరఁ ✽ గా నిరుగొమ్ములఁ బ్రేలు వెల్లజ
ల్లులగతి నవ్వుడాలు పొదలున్ మదిరాక్షి మొఱుంగుఁ జెక్కులన్.

అర్థము:—తిలకము = (నొసటి) నిడుపబొట్టు, సంహిత...గ్రము - సంహిత = (వింటియందు) కూర్పఁబడిన, సంధానింపఁబడిన, ఊర్ధ్వముఖ = మీఁదికి ప్రసరించిన, తీక్ష్ణ = వాఁడియైన, శర = బాణము యొక్క, అగ్రము = కొన-ములికి, కాఁగన్ = అగుచుండఁగా, నాసికాం ... లత - నాసికాంచల = ముక్కు-చివరభాగమనెడు, విలసత్ = ప్రకాశించుచున్న, ప్రకోష్ఠ = ముంజేయిగల, సుమసాయక = మన్మథునియొక్క - (పూవులు బాణములుగా గలవాడు), ముష్టి = పిడికిటిచేత, గృహీత = పట్టుకొనఁబడిన, మధ్య = నడిమిభాగముగల, శార్ఙ్గలత = తీఁగవంటి శృంగధనుస్సో, అనన్ = అనునట్లు, బొమల్ = కనుబొమ్మలు, తనరన్ = ఒప్పఁగా, ఇరు+కొమ్ములన్ = రెండుకొనలందును, వ్రేలు వెల్లజల్లులగతిన్ = వ్రేలాడుచున్న తెల్లని సవరపుఁగుచ్చులవలె, నవ్వుడాలు = నవ్వుకాంతి, మదిరాక్షీ = (మైకము కలిగించు చూపుగల) ప్రభావతియొక్క, మెఱుఁగుఁజెక్కులన్ = తళతళలాడు చెక్కిళ్లయందు, పొదలున్ = అతిశయించును.

తాత్పర్యము:—ఆ ప్రభావతికి నుదుటనుండు నిడుదబొట్టు మన్మథుని యూర్ధ్వముఖమై పదనెక్కిన బాణపుములికివలెను, ముక్కుయొక్క చివరభాగ మాతని ముంజేయివలెను, ఆముంజేతితోఁ బట్టుకొనఁబడిన లస్తకము (మధ్యభాగము) గల ధనుస్సువలె కనుబొమ్మలును, ఆ ధనురగ్రములందు కట్టిన తెల్లని సవరపుఁ గుచ్చులవలె తళతళలాడు చెక్కిలులందుఁ జిమ్ముచున్న నవ్వుయొక్క కాంతియును వ్యాపించి-మన్మథుఁడు బాణసంధానము చేసిన ధనుస్సువలె తిలకము, నాసాంచలము, కనుబొమలజంట, చిఱునవ్వు కాంతియుఁ గలసి కానబడును.

అలం. :—రూపకము, ఉత్ప్రేక్ష.

వి. మదిరాక్షి-(మదిరా+అక్షి), మదిరా = మద్యము అని వాచ్యార్థము. దానినుండి - మదము అని లాక్షణికార్థమును గ్రహించి (1) మదముగల కన్నులుగలది, (2) మదమును - మోహమునుపుట్టించు కన్నులు గలది, (3) "మదిరా మత్తఖంజనే" అని శబ్దరత్నావళియందుఁ గలదు కాన-మదించిన కాటుకపిట్టలవంటి కన్నులుగలది. అని మూఁడువిధముల వ్యుత్పత్తులు కనఁబడుచున్నవి. ఇరుగొమ్ములు. ద్విగువునందు క్వాచిత్క మగు బహువచనము. "ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు మిశ్రంబునకుఁగాదు." బాల. సమాస. 18. ఇరు+కొమ్ములు. కర్మధారయాంతర్భూతము ద్విగువు కాన - కర్మధారయమున వచ్చెడి గసడదవాదేశము వచ్చి, 'ఇరుగొమ్ములు' అని సిద్ధించినది. శార్ఙ్గము = 1. శృంగవికార మగుధనుస్సు, 2. ధనుస్సు, విల్లు.

ఉ. అంబురుహాక్షినాసిక నిశాజాన్వయ శత్రువు చంపకప్రసూ
నంబుఁ గరంబు గెల్చుట మనంబునఁ బెట్టి తదీయపార్శ్వయు
గ్మంబున నిత్యసేవకతఁ గ్రాలెడు వీక్షణతారకాఖ్యరో
లంబకదంపతుల్ పెను వహాళావళి నెంతయు సంభ్రమించుచున్.

అర్థము :—అంబురుహాక్షి = తామరపూలవంటి కన్నులుగల యాప్రభావతియొక్క, నాసిక = ముక్కు, నిజాన్వయశత్రువు = తనవంశమునకు విరోధియైన, చంపకప్రసూనంబున్ = సంపంగిపూవును, కరంబు = పూర్తిగా, గెల్చుట = జయించుట - (తనశత్రువును గెలుచుటచే నాసిక మిత్రమైనది-శత్రువునకు శత్రువు మిత్రుఁడగుట సహజము.) మనంబునన్ = మనస్సునందు, పెట్టుకొని = ఉంచుకొని, జ్ఞప్తి యందుంచుకొని, ఈక్షణ...దంపతుల్ = ఈక్షణతారకా = కంటినల్లగుడ్లు అను, ఆఖ్య = పేరుగల, రోలంబక = తుమ్మెదలయొక్క, దంపతుల్ = ఆలుమగలు (కర్తలు), పెనువహాళావళిని = పెద్దవేడుకతో, ఎంతయున్ = అత్యంతము, సంభ్రమించుచున్ = వేగిరపడుచు, తదీయ = ఆ నాసికసంబంధమైన, పార్శ్వ = ప్రక్కలయొక్క, యుగ్మంబునన్ = జంటయందు (ముక్కునకిరువైపులందు అని భావము),

నిత్యసేవకలన్ = శాశ్వతమగు సేవకధర్మముతో-(ఎడతెగని యూడిగముతో అని భావము) క్రాలెడున్ = ప్రకాశించుచుండెను, ఉన్నవి అని యర్థము.

తాత్పర్యము :—ఆమెయొక్క ముక్కు తమజాతికి విరోధి యగు సంపంగిపూవును గెలుచుట మనస్సున నుంచుకొని, కంటినల్లగ్రుడ్లనెడుపేరు గల తుమ్మెదలజంట మిగులతమితో నెంతయేని తొట్రిలుచు, ఆముక్కున కిరుపైపుల నిల్చి స్థిర మగు దాస్యమును చేయుచున్నవి.

అలం. :—రూపకము, అతిశయోక్తి.

వి:—రోలంబము. వ్యు. ధ్వనించుచు నొకచోటనుండి మఱొకచోటికి పోవునది. (రౌః కూజన్ సన్, లంబతి, స్థానాత్ స్థానాంతరం గచ్ఛతి. ఇతి. లంబ, అచ్. అని శబ్దకల్పద్రుమము.) జాయా+పతి = జంపతులు, రూ. దంపతులు.

ఉ. బింబఫలోష్ఠికన్ను లనుఁ బేడిస మీ లిరుదిక్కులన్ సమా
నంబుగఁ బర్వుచున్న శ్రుతినామసరోయుగశోభ యిట్టు న
ట్టుం బిరువీకుసేయఁగఁ గడున్ దమి నెందుకుఁ గాక రెంటి మ
ధ్యంబునఁ బాఱెడిన్ బరువు లారయఁ జాపల మట్టిదే కదా!

అర్థము:—బింబఫల + ఓష్ఠి = (దొండపండువంటి పెదవిగల) ఆ ప్రభావతియొక్క, కన్నులు, అను= అనఁబడునట్టి, బేడిస మీలు = చంగున నెగిరెడిచేఁపలు, ఇరుదిక్కులన్ = రెండు దెసలందును, సమానంబుగన్ = హెచ్చు తగ్గులు లేకుండ, పర్వుచున్న = ఒప్పుచున్న, శ్రుతి ... శోభ - శ్రుతినామక = చెవు లనుపేరు గల, సరః + యుగ = కొలఁకులజంటయొక్క, శోభ = కాంతి, ఇట్టునట్టున్ = ఇటు వంకకు నటువంకకు, కడున్ = ఎంతయు, పిరువీకు సేయగన్ = పట్టిలాగఁగా, తమిన్ = ఉత్కంఠతో, ఎందుకున్ + కాక = ఏవంకకుఁజేరక, రెంటిమధ్యంబునన్ = రెండుచెవులనడుమ, పరువులుపాఱెడిన్ = పరుగెత్తుచుండును, ఆరయన్ = ఆలోచింపఁగా, చాపలము = నిలుకడలేకపోవుట, అట్టిదేకదా = ఆ విధమైనదియేకదా! నిలుకడ లేనివా రట్లే యెటునుగాక చెడిపోదు రని భావము.

అలం. :—రూపకము. అర్థాంతరన్యాసము.

తాత్పర్యము :—ప్రభావతికన్ను లనుచేఁపలు రెండువైపులను సమానముగా నున్నచెవు లను కొలఁకులకాంతి యిటునటు పట్టి లాగఁగా - ఏవంకకు పోఁజాలక, రెండుచెవులకు నడుమ నిటునటు పరువెత్తుచుండును. "నిలుకడలేమి" యను గుణ మట్లేకదా యుండును.

వి. :—ఇందు "బింబఫలోష్ఠి" అనుపదము స్త్రీమాత్రపరమే కాని యవయవార్థముతో సంబంధము లేనిది. చేఁపలకు చాపల్యము నైసర్గికము, "మనో మధుకరో మేఘో మానినీ మదనో మరుత్, మర్కటో మా మదో మత్స్యో మకారా దశ చంచలాః" అనిసూక్తి. చేఁపలజంటవలె తళతళలాడుచు నిటునటు ప్రసరించు నేత్రములనియు, అవి యాకర్ణాంతములనియును భావము.

గీ. కలయ నాపాదమస్తకాంగములయందు, మించి పటలీలఁ దరళతోదంచిత మగు
యువతిలావణ్యమును గన్నుఁగవయు నతను,దంటమీలట్లెక్కియ మనఁదనరుఁజూడ.

అర్థము :—ఆపాదమస్తక = కాలు మొదలు తలవఱకుఁగల, అంగములయందున్ = అవయవములందు, కలయన్ = అంతటను వ్యాప్తమగునట్లు, మించి = అతిశయించి, పటలీలన్ = వస్త్రమువలె, తరళతోదంచితము = చాంచల్యముతో నొప్పునది, అగు యువతిలావణ్యమును = అయినట్టి యా యువిద.

యొక్క మేనిసొగసును, కాంతివిశేషమును - కన్నుఁగవయున్ = కన్నులజంటయును, అతను ... యము - అతను = మన్మథునియొక్క, దంటమీల = రెండుచేఁపలుగల, టెక్కెయము = జెండా, అనన్=అనునట్లు, చూడన్ + తనరున్ = చూడనొప్పును.

తాత్పర్యము :—ఆ ప్రభావతియొక్క యెల్లయవయవములందుఁ గల తళతళ మను కాంతివిశేషము జెండాగుడ్డవలెను, రెండుకన్నులు మీనధ్వజుఁ డగు మదనుని జెండామీఁది జంటచేఁపల వలెను, ప్రకాశించుటచే ఆమె మన్మథుని విజయధ్వజమువలె నున్నది.

అలం. :—నిదర్శనము, ఉత్ప్రేక్ష.

వి. :—లావణ్యము. దీనినిగూర్చి చూ. 1 ఆశ్వాసము 126. పద్యవ్యాఖ్యయందలి వివరణము.

ఉ. ఎప్పుడు భక్తిభావమున నింపలరన్ ద్విజరాజు పాదముల్
దప్పక సేవ చేయు సుకృతంబునఁ గాంచెఁ జకోరయుగ్మ మీ
యొ ప్పన నొప్పుఁ గన్ను, లవి యోలిని గ్రోలిన తేటవెన్నెలల్
చిప్పిలునట్లు మించు సతి లేనగవున్ దెలినిగ్గుఁజూపులున్. 73

అర్థము :—చకోరయుగ్మము = వెన్నెలపులుఁగులజంట, ఇంపు + అలరన్ = ఆనందముకలుగఁగా, ద్విజరాజుపాదముల్ = చంద్రుఁడను బ్రాహ్మణశ్రేష్ఠునియొక్క, కిరణములనెడి యడుగులను, భక్తిభావమునన్=అన్నము అనుభావముచేతను (భక్తిగలుగుటచేతను అని రెండవ యర్థము), ఎప్పుడున్ = సదా, తప్పక= విడువక, సేవచేయు = సేవించుటవలనఁగలుగు, సుకృతంబునన్ = పుణ్యముచేత, ఈయొప్పు = ఈయందమును, కాంచెన్ = పొందెను, అనన్ = అనునట్లు, కన్నులు = (ఆమె) కనుఁగవ, ఒప్పున్ - (కావునసే) అవి = ఆ చకోరములు, ఓలిని = వరుసగా, గ్రోలినతేటవెన్నెలల్ = త్రాగినట్టి నిర్మలమగు చంద్రుని కాంతులు, చిప్పిలునట్లు=పైకి ఉబుకుచున్నరీతిగా, సతి లేనగవున్=ఆమెయొక్క చిఱునవ్వును, తెలినిగ్గుఁ జూపులున్ = తెల్లనికాంతిగల చూపులును, మించున్ = ప్రకాశించును.

తాత్పర్యము:—చకోరములు చంద్రకిరణములను పానము చేయు నని, అందమగు స్త్రీలకన్నులు చకోరములవలె నుండు నని కవిసమయము. చకోరములజంట, ద్విజరాజపాదములను - అనఁగా చంద్రకిరణములనెడి బ్రాహ్మణపాదములను భక్తభావముతో (అన్నము అనుభావముతో) సేవించిన పుణ్యమున ప్రభావతినేత్రములై పుట్టునట్టివిశేషమును పొందినవి. కావునసే ఆ చకోరములు పానము చేసినతేటవెన్నెలలే పైకుబుకుచున్నట్లు, ఆమెచిఱునవ్వును, తెల్లనికాంతులు గలచూపును ప్రకాశించును.

అలం:—శ్లిష్టరూపకము, ఉత్ప్రేక్ష, కావ్యలింగము.

వ్యా. వి. :—చేయుసుకృతంబు= చేయఁబడుసుకృతము. సూ. కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబు కర్తతోడంబోలె వానితోడ సమసించు. బాల. సమా. 26. లేఁత + నగవు - లేనగవు. 'సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 35. తెలినిగ్గు + చూపులు - సూ. సమాసంబుల నుదంతస్త్రీసమంబులకును బుంపులకును బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు. బాల. సంధి. 24 - చే నుగాగమము - ద్రుతకార్యములు రాఁగా "తెలినిగ్గుఁజూపులు" అగును.

ఉ. సావరమాధురీస్పృహాపరసన్ బికమో శుకమో తదీయ జి
హ్వావిలసత్సరస్వతి నుపాసన చేయుచు నగ్రభూమి నిం

పావహిలంగ నేర్చి యుపహారముగా నిడినట్టి పల్లవం
బో విమలంపు బింబఫలమో యన వాతెఱ యొప్పు నింతికిన్. 74

అర్థము:—సౌవర = కంఠధ్వనిసంబంధమైన, మాధురీ = తియ్యదనమందలి, స్పృహా = కోరిక యొక్క, వశత్ = బలముచేత, లేక ఆధిక్యముచేత - పికమో = కోయిలయో, శుకమో = చిలుకయో, తదీయ... సరస్వతిన్ - తదీయ = ఆమెసంబంధమైన, జిహ్వా = నాలుకయందు, విలసత్ = ప్రకాశించుచున్న, సరస్వతిన్ = వాక్కును, (వాగ్దేవతను), ఉపాసనచేయు మన్ = పూజించుచు, అగ్రభూమిన్ = ఆ సరస్వతియెదుటి ప్రదేశమున, ఇంపు = సంతోషము, అవహిలంగన్ = కలుగునట్లు, ఏర్చి = ఏఱి, ఉపహారముగాన్ = కానుకగా, ఇడినట్టి = సమర్పించునట్టి, పల్లవంబో = చిగురో, విమలంపు బింబ ఫలమో = స్వచ్ఛమగు దొండపండో, అనన్ = అనునట్లు, ఇంతికిన్ = ఆ ప్రభావతికి, వాతెఱ = అధరము, ఒప్పును.

తాత్పర్యము:—తమకంఠధ్వనియందలి తియ్యదనము హెచ్చించుకొనుకోర్కెతో కోకిలయో, చిలుకయో, కాని ప్రభావతినాలుకయం దున్నవాగ్దేవతను పూజించుచు ఆమె కానందము కలుగ ఆమెయెట్టయెదుట కానుకగానుంచిన చిగురటాకో (కోకిలయైనచో) లేక దొండపండో (చిలుకయైన పక్షమున) అనునట్లు ఆమెయధర మున్నది.

వి. :—లోకమున కంఠస్వర మాధుర్యమునకుఁ బ్రసిద్ధి కెక్కినవి కోయిల, చిలుకయును. అవికూడ ప్రభావతి కంఠమాధుర్యమునకై యభిలషింపవలసివచ్చె ననుటచే ఆమె కంఠమాధుర్యము లోకోత్తర మైన దని భావము. సాధారణముగా దేవతలకుఁ దాము దిను నాహారవస్తువులనే నైవేద్య మొనర్తురు. కాన తన కాహార మగు చిగురుటాకును కోకిలయు, తన కతిప్రియాహార మగు దొండపండును చిలుకయు, కానుకగాఁ బట్టుట యుచితము. నాలుకపై నుండు సరస్వతికి అగ్రభూమి పెదవియుండుచోటే యగును. కాన అచట భక్తితో నుంచిన ట్లున్నవఁట. ప్రభావతి యధరము చిగురుటాకువలెను, దొండపండువలెను నున్నదని భావము.

అలం:—సందేహము, ఉత్ప్రేక్ష.

వ్యా. వి. :—సౌవరము - స్వరసంబంధమైనది. సూ. ద్వారాదీనాంచ (7. 3. 4.) ద్వార, స్వర... ఇత్యాది గణపఠితానాం, ఏషాం నవృద్ధి, రైజాగమశ్చ - అను పాణినీయసూత్రముచే సిద్ధించిన రూపము. స్త్రీత్వమున "సౌవరీ" అగును. 'సౌవరియగు మాధురి' యను కర్మధారయమున పుంవద్భావమొంది "సౌవరమాధురి" యగును.

క. మగువయధరంబు పగడముఁ, జిగురును బింబమును బంధుజీవకమును గ
ట్టిగ గెల్చి కన్నసత్కీర్తిగతి న్నాసాగ్రమణి మరీచి వెలుంగున్. 75

అర్థము:—మగువ యధరంబు = ప్రభావతియొక్క క్రిందిపెదవి, పగడమును, చిగురును, బింబమును = దొండపండును, బంధుజీవకమును = మంకెన పూవును, గట్టిగన్ = పూర్తిగా, గెల్చి, కన్న = పొందిన, సత్కీర్తిగతిన్ = మంచి యశస్సువలె (కీర్తి తెల్లని దని కవిసమయము) నాసా ... మరీచి - నాసా=ముక్కుయొక్క, అగ్ర = కొనయందలి, మణి = ముక్తామణి (ముత్యము) యొక్క, మరీచి = కాంతి, వెలుంగున్ = ప్రకాశించును.

తాత్పర్యము:—స్త్రీల యధరోష్ఠమునకు నుపమానములుగా చెప్పఁబడు నాల్గువస్తువులను తనయొత్తిడిచేతనుచే ప్రభావతి యధరముగెల్చి, సంపాదించుకొన్న తెల్లని కీర్తివలె ముక్కునఁదాల్చిన యడ్డబాస యందలి ముత్యపుఁగాంతి యొప్పును.

అలం:—ఉత్ప్రేక్ష, (ఉపమాను ప్రాణితము).

వ్యా. వి. :—కన్న - కనిన - కనుధాతువు పడ్వాదులలోని దగుటచే సూ. పడ్వాదులనవర్ణకంబున కత్వంబును దుదిహల్లునకు ద్విత్వంబును విభాష నగు. బాల. క్రియా. 51. చే రూపద్వయము సిద్ధించెను.

వి. :—మరీచి = కాంతి, యనుటకు "మరీచిః కృపణే దీప్తౌ వృషిభేద మయూఖయోః" అని. విశ్వ నిఘంటువు.

గీ. మృదులపవనాహతి నొకింతకఁగదలియాడు, పల్లవము మాటునను దోఁచుకమొల్లమొగ్గ
చాలుగతిఁ బల్కుబడి మోవికచాటునఁగనఁ,బడుచు నింతిపల్వరుస కకన్భ్రాంతిపఱుచు.

అర్థము:—ఇంతిపల్వరుస = ప్రభావతి పలుకుదురు, దంతపంక్తి (కర్త), మృదులపవన+ఆహతిన్ = చిఱుగాలితాఁకిడిచే, కదలియాడు = కదలుచున్న, పల్లవము మాటునను = చిగురాకుచాటుననుండి, తోఁచు = కనఁబడునట్టి, మొల్లమొగ్గ చాలుగతిన్ = బొండుమల్లె మొగ్గలవరుసవలె, పల్కుబడిన్ = మాటాడునపుడు, మోవిచాటునన్ = పెదవి చాటుననుండి, కనఁబడుచున్ = గోచరించుచు, కన్భ్రాంతి పఱచున్ = కంటికి భ్రమకొలుపును. (చూడఁగనే మొల్లమొగ్గ చా లనుభ్రాంతిని గలిగించు నని భావము.)

అలం:—ఉపమ, భ్రాంతిమంతము.

వి. :—మొల్ల = కుందము, బొండుమల్లె, సీ... మొల్లయనఁ గుందము చెలంగును. ఆం. భా. 2. 53. కదలు+ఆడు = కదలాడు, కదలియాడు - ధాతువునకు ధాతు వనుప్రయు క్తమైన శబ్దపల్లవము. కదలు+ఇ - శబ్దపల్లవ కార్యముగావచ్చిన 'ఇ' కారముగాని క్త్వార్థకే కారము కాదు. "కదలాడు" అనుచోట "కదలి + ఆడు" అని పదవిభాగము కాక, ద్వైవిధమున కదలు+ఆడు - అనియే గ్రహింపఁదగును. పల్కుబడి- "బడియేల్వాదులకగు" బాల. కృదంత. 14. పలుకుట అని యర్థము. పల్లు+వరుస - అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు. అను బాల. ప్రకీర్ణ. 8. చే పలువరుస, అయి. సూ. "పదాంతంబులయి యసం యుక్తంబు లైన ను, లు, రు ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు." బాల. ప్రకీర్ణ. 16 చే ఉత్వలోపముకల్గి "పల్వరుస"యయ్యెను. ఇట్లే పల్కుదురు-పలుకుదురు.

క. చెలువపలు కమృతరసములు, గులుకుట వీనులకె కాదు కోమలదంతా
వళిరుచి యను శీకరపుం, దెలి నిగ్గునఁ గన్నులకును దెల్లమ చూడన్. 77

అర్థములు :—చెలువపలుకు = ప్రభావతియొక్క వాక్కు, అమృతరసములు = అమృతపు రుచు లను, కులుకుట = చిమ్ముట, వీనులకున్+ఎ = చెవులకుమాత్రమేకాదు, చూడన్ = ఆలోచింపగా, కోమల...నిగ్గునన్-కోమల = సుకుమారమైన, దంతావళిరుచి = పలువరుసయొక్క కాంతి, అనుశీకరపుం దెలినిగ్గునన్ = అనునట్టి (అమృతపు) తుంపురులయొక్క తెల్లని కాంతిచే, కన్నులకును, అమృతరసములు కులుకుట, తెల్లము+అ = స్పష్టమే.

తాత్పర్యము :—ఆ ప్రభావతియొక్క వాక్కు అమృతరసమును (తియ్యఁదనమును) వినువారి చెవు లందు మాత్రమే చిమ్ముటకాదు. మాటాడుసమయమునఁ గొంచెము కొంచెముగఁ దోఁచు పలువరుస యొక్క తెలికాంతులనెడు యమృతబిందువుల తెలికాంతిని చూచువారి కన్నులందును జిమ్ముట స్పష్టము.

అలం. :—తుల్యయోగిత.

వి. మాధుర్యమునకును, ధావళ్యమునకును నమృతము నుపమానముగా కవులు గ్రహించుట యాచా రము. పలుకు అమృతరసము యొక్క తియ్యఁదనమును, పలువరుస యమృతకాంతివంటి తెల్లని కాంతిని

జిక్కుచుండెనని యమృతాంశుయొక్క రెండుధర్మములు నిందు సార్థకమైనవి. ప్రభావతి పలువరుస యమృత బిందువులవలె తెల్లగా సుకోమలములై యున్నదనియు వ్యక్తము.

తే. కనక కర్ణికాధారాళ కాంతు లదికి, బాహులతికలు బిరుదుసంపంగిదండ
లిరుగడల వ్రేల వైచినకరణిఁ బరఁగఁ, గంబువిజయము పచరించుఁ గాంతగళము.

అర్థము:—కనక ... కాంతులు - కనకకర్ణికా=బంగారుచెవి నగలయొక్క, (కర్ణభూషణములయొక్క) ధారాళ=అడ్డులేని, కాంతులు = నిగ్గులు, అదికి=అంటుకొని, హత్తుకొని, కాంతగళము=ఆ ప్రభావతియొక్క కంఠము, బిరుదుసంపంగి దండలు = శౌర్యమును సూచించు సంపంగి మాలికలను, ఇరుగడలన్ = రెండువైపులను, వ్రేలవైచిన కరణిన్ = వ్రేలాడవేసిన రీతిగా, బాహులతికలు = తీఁగలవంటి బుజములు, పరఁగన్ = ఒప్పుఁగా, కంబువిజయమున్ = శంఖమును గెల్చుటను, పచరించున్ = ప్రకటించును.

తాత్పర్యము:—ఆ ప్రభావతియొక్క కంఠము, తన కిటు నటు మెఱయు కర్ణభూషాకాంతులతో హత్తుకొని, రెండుప్రక్కలను వ్రేలునట్లు శౌర్యసూచకము లగు సంపంగిదండలు వేసినరీతిగా తీగలవంటి బాహువు లొప్పుఁగా, తాను శంఖమును జయించుటను ప్రకటించుచున్నది. అనఁగా ఆమెగళము తాను శంఖమును జయించి బిరుదుగా వేసికొనినసంపంగి దండలవలె ఆమెబాహు లున్న వని భావము.

అలం:— రూపకము, ఉపమ.

క. ఖరకరకరభిన్నములై, కర మెలమి వహించు నరుణకమలంబులతోఁ
బురుడింపఁ దగునె గొజ్జఁగి, విరిఁ జేకులబంతిగములు వెలఁదికరంబుల్. 79

అర్థము:—గొజ్జఁగివిరి = గొజ్జంగిపూలయొక్క, చేకుల = దళములచేఁ గట్టబడిన, బంతిగములు = బంతుల గుంపులయిన, వెలఁదికరంబుల్ = ఆ ప్రభావతిచేతులను - (గొజ్జఁగి పూబంతులవలె నతిమృదువులు గొప్పవి నని భావము) ఖర ... భిన్నములు - ఖరకర = తీక్ష్ణ మగు కిరణములు గల సూర్యునియొక్క, కర = కిరణములచే, భిన్నములు = వికసితములు - (వాఁడిచేతులు గలవాని కఠినహస్తములచే చీల్పఁబడినవి అనియు నర్థము. సూర్యుఁడనెడి వాఁడిచేతులవాని కిరణములనెడి కరములచే, వికాసము అను భేదము నొందిన వని యభేదాధ్యవసాయము) ఐ, కరము = మిగుల, ఎలమిన్ = వికాసమును, వహించు = పొందునట్టి, అరుణ కమలంబులతోన్ = ఎఱ్ఱదామరలతో, పురుడింపన్ = పోల్చుట, తగునే - తగదని భావము.

అలం:— వ్యతిరేకము. రూపకము.

ఆ. జిలుఁగుపయ్యెద యనువలలోన నాచెల్వ, గుబ్బచనుఁగవ యను కోకయుగళి
యెగయఁ బెనఁగురీతి నెసఁగుఁ బ్రేవలఁ జల, త్పక్షలీల మెఱుఁగు తరఁగ లడర. 80

అర్థము:—ఆచెల్వ ... యుగళి - ఆచెల్వ = ఆ ప్రభావతియొక్క, గుబ్బ = వట్రువయైన, చనుఁగవ=కుచములజంట, అను కోకయుగళి = అనెడు చక్రవాకముల జంట, ప్రేవలన్ =పార్శ్వములందు, చలత్పక్షలీలన్ = చలించుచున్న ఱెక్కలవలె, మెఱుఁగు తరఁగలు = తరంగములవలెఁ బొంగివచ్చుచున్న కాంతులు, అడరన్ = వ్యాపింపఁగా, జిలుఁగుపయ్యెద = సన్ననిపైఁట, అనువలలోన్ = అనెడివలయం దుండి, ఎగయన్ = ఎగిరిపోవుటకై, పెనఁగురీతిన్ =ఒండొంటితో నొరసికొనువిధమున, ఎసఁగున్ =ఒప్పును.

భావము:—ప్రభావతి చనుఁగవ యిరువంకఁ గాంతులు తరంగములట్లు పొంగి వచ్చుచుండ, సన్నని పైఁటయం దొండొంటి నొరసికొనుచు - వలలోఁ జిక్కుకొని, తప్పించుకొని యెగిరిపోవుటకై - ఱెక్కలు గొట్టుకొనుచు కలవరపడు చక్రవాకముల జంటవలె నున్నది.

అలం:— రూపకము, నిదర్శనము.

గీ. చారుతరనాభి యనెడు గంభీరసరసిఁ, గడఁగి క్రీడించుమరుని శృంగార రసపుఁ
జిమ్మనపుఁగ్రోవిధార నాఁజెన్నుమీఱుఁ, బడఁతినూగారు కన్నులపండు వగుచు. 81

అర్థము:—చారుతరనాభి = మిగులనందమగు, నాభియనెడు = బొడ్డుఅను, గంభీర = లోతైన, సరసిన్ = కొలనియందు, కడఁగి = పూని, క్రీడించు, మరుని...ధార - మరుని = మన్మ యొక్క, శృంగారరసపు=శృంగారరస మనెడు జలమును (జిమ్ము) చిమ్మనపుఁగ్రోవి = (జలమును) చిమ్మునట్టి గొట్టముయొక్క, ధార = (నీటి) ధార, నాన్ = అనునట్లు, పడఁతినూగారు = ఆ ప్రభావతియొక్క రోమావళి, కన్నుల పండువు = నేత్రపర్వము - కంటి కానందము కల్గించునది, అగుచున్, చెన్ను మీఱున్ = ఒప్పారును.

తాత్పర్యము:—ఆ ప్రభావతియొక్క నూగారు - అంద మగుపొక్కిలియనెడికొలనిలో విహరించుచు మన్మథుఁడు అందలిశృంగారరస మనుజలమును చిమ్మనగొట్టముతో పై కెగనూఁదఁగా వెలువడిన యాశృంగార మనునీటియొక్క ధారయో యనునట్లు నేత్రానందకరమై ప్రకాశించును.

అలం:—రూపకము, ఉత్ప్రేక్ష.

వి :—చిమ్ము - ధాతువుపై "అప్పాదులకు నజేయగు" అను బాల. కృదంత. 13. "చిమ్మన" అని యగును. దానికి ముగంతత్వము విశేషము. చిమ్మనము + క్రోవి - పుంపులును, నుగాగమమును రాఁగా - చిమ్మనపుఁగ్రోవి అయినది.

చ. తనుతర రోమవల్లరికిఁ దా నిరువంకలఁ గల్గులేదు నా
ననయము సూక్ష్మ సూక్ష్మముగ నజ్జలజానన కౌనుమించి లో
చనముల కింపొనర్చుఁ గడుసన్నపుఁ గారుమెఱుంగుఁ దీఁగె చ
క్కని నిడు బీటవాటి కనఁగాఁ బడున ట్లతియత్న దృశ్యమై. 82

అర్థము:— అజ్జలజాననకౌను = ఆకాంతయొక్క నడుము, తనుతర = మిగుల సన్నమగు, రోమ వల్లరికిన్ = నూగారునకు, ఇరువంకలన్ = రెండు ప్రక్కలందు, కల్గులేదు = ఉన్నదో లేదో, నాన్ = అనునట్లు, అనయము = అత్యంతము, సూక్ష్మ సూక్ష్మముగన్ = సన్నసన్నముగ, మించి = ఉండి, అతియత్న దృశ్యమై = ఎక్కువ యత్నముచేత, గనఁదగినదై, కడుసన్నపు = మిగుల సూక్ష్మమగు, కారు మెఱుంగుఁదీఁగె = తొలకరితీఁగ మెఱుఁగు, చక్కని నిడుబీటవాటి = సొగసగు పొడుగుపాటి పగులు నొంది, కనఁగాఁబడునట్లు = (ఎక్కువ యత్నముచేత) కనిపించునట్లు, లోచనములకున్ = (చూపఱ) కన్నులకు, ఇంపు = ఆనందమును, ఒనర్చున్ = చేయును.

తాత్పర్యము:—ఆ ప్రభావతి నడుము మిగుల సన్న మగురోమావళి కిరువంకల నున్నదా లేదా యనన ట్లత్యంతము సూక్ష్మాతి సూక్ష్మమై, మిగులసన్న మగుతొలకరి తీఁగమెఱుఁగు పొడఁగుపాటి బీటకలిగి కనిపించిన ట్లెంతయో యత్నముచేసి చూడఁదగినదై, కనుపండువ కావించును.

అలం:—అల్పము, ఉపమ. అల్పాలంకార లక్షణము— గీ. అలఁతి యాధేయమునకంటె నల్పభావ, మైన నాధారమున కది యల్పమగును. చంద్రాలోకము 85 - ఆధేయమగు రోమవల్లరి అతిసూక్ష్మముగా నుండ - దానికాధార మగు నడుము కలదో లేదో యనునంత సూక్ష్మముగా నున్నట్లు వర్ణింపఁబడుటచేత అల్పాలంకారము.

క. చనుఁగవ వ్రేఁగున గిటగిట, మను నెన్నడు మేమి యగునొకోయనియెడి శంకన్
కనకపుఁగట్టిడినాఁడో, వనజాసనుఁ డనఁగ వనితవళు లింపెసఁగున్. 83

అర్థము:— చనుఁగవ వ్రేఁగునన్ = చన్నులజంటయొక్క బరువుచేత, గిటగిట = గిటగిట యని ధ్వనించుచున్న, నెన్నడుము = (ఆమె) సొగసైననడుము, ఏమి, అగునో, అనియెడి, శంకన్ = భయముచే, వనజ + ఆసనుఁడు = (తామరపూవు పీఠముగాఁగలవాఁడు) బ్రహ్మ, కనకపు + కట్టు = బంగారు కట్టు కట్టినాఁడు + ఓ = (నడుమునందు) పెట్టినాఁడో, అనఁగన్, వనితవళులు = ప్రభావతియొక్క కడుపుమీఁది ముడుతలు, ఇంపెసఁగున్ = ప్రకాశించును.

తాత్పర్యము:— స్తనభారమున గిటగిటలాడుచున్న నడుమేమి హానినొందునో యను భయముచేత, బ్రహ్మ బంగారు బంధము కూర్చినాఁడో యను నట్లా ప్రభావతి కడుపుమీఁది ముడుతలు వెలయును.

అలం:— స్వరూపోత్ప్రేక్ష.

వ్యా. వి.:— చను + కవ - కనకపు + కట్టు - మొదటిది ఉదంతస్త్రీసమమును, రెండవది "పు" వర్ణకాంతమును - రెండిటికిని పరుషమును కవర్ణగసకత్వమున సుగాగమమును, ద్రుతకార్యములు కాఁగా "చనుఁగవ, కనకపుఁగట్టు" - అనురూపము లేర్పడినవి.

గీ. నెన్నడుము పేరిమింట నానెలఁత బొడ్డు, పొన్నవిరి నిక్కముగఁ జూచి ఖిన్నఁబోదు
రభ్రకుసుమసౌరభసాధనార్థ హేతు, వాశ్రయాసిద్ధ మనియెడినయ్య లెల్ల. 84

అర్థము:— అభ్ర ... హేతువు - అభ్ర = ఆకాశమందలి, కుసుమ = పూవుయొక్క, సౌరభ = పరిమళమునకు, సాధనార్థ = సాధించు ప్రయోజనముగల, హేతువు - ఆశ్రయాసిద్ధము, (ఆశ్రయముయొక్క అసిద్ధికలది - అనఁగా పరిమళమున కాశ్రయమగు పుష్పమే లేనిది కాన, అట్టివాక్య మాశ్రయాసిద్ధి దోషదుష్టము) - అను నయ్యలు - ఎల్లన్ = అని చెప్పెడి పెద్దలెల్లరు, (అనఁగా తార్కికులందరును అని భావము) - నెన్నడుము పేరిమింటన్ = నడుము అను నాకాశమందు, ఆ + నెలఁత బొడ్డుపొన్నవిరిన్ = ఆప్రభావతియొక్క నాభియనెడి పొన్నపువ్వును, చూచి, నిక్కముగన్ = నిజముగ, ఖిన్నఁబోదురు = ఖిన్నులగుదురు - (ఆకాశమున పూ వుండదని వారు చెప్పినమాట ప్రత్యక్షవిరుద్ధముగా నయ్యెను కాన.) ఇది తార్కికసిద్ధాంతము పైని జమత్కరింపఁబడిన భావవిశేషము - గగనారవిందం సురభి-అరవిందత్వాత్, "అని ఆకసమునందలి తామరపువ్వు - (ఇదిపక్షము = సాధ్యమున కాశ్రయము.) సురభి = పరిమళము గలది. (సాధ్యము -) అరవిందత్వాత్ = తామరపూవగుటవలన (ఇది హేతువు = సాధనము) సరోజారవిందవత్ = కొలనిలో నుండు తామరపూవువలెనే (ఇది ఉదాహరణము.) ఈవాక్యమందలి హేతువు - పరిమళమున కాశ్రయము అని చెప్పనట్టి "పక్ష మగు గగనారవిందము లేనే లేదు. కావున సాధ్యమైన పరిమళమును సాధింపలేదు - అని తార్కికులు చెప్పుదురు. ఆతార్కికులే ఈమెనడుము అను మింట బొడ్డు అను పొన్నపూవును చూచినచో ఖిన్నులగుదురు."

ఆమె నడుము మిక్కిలి సూక్ష్మమనియు (సన్నదనియు) నాభి పొన్నపువ్వువలె నున్నదనియు ముఖ్యాశయము.

అలం. :— రూపకానుప్రాణితమగు విషమము.

చ. సుకవులు క్రిందు మీఁ దరసి కొ చూడక యా డని యాడుకొన్న హా
టకకదళీవిలాస మకరోటా విపరీతము గాక సాటియే
యకలుష రామణీయక సమంచిత కోమల తద్వ్యధూరుల
క్ష్మకి సరి గావ యెంత తలక్రిం దయినన్ గరిరాజహస్తముల్. 85

అర్థము:—సుకవులు = ఉత్తములగుకవులు (సయితము), క్రిందు, మీఁదు = అరఁటియొక్కయు, ఆమెతొడలయొక్కయు, క్రిందుభాగము, మీఁదిభాగము, అరసి=విమర్శించి, చూడక, ఈడు = (అరఁటులు ప్రభావతితొడలకు) సమము, అని, ఆడుకొన్నన్ = (తాము) చెప్పుకొనినను, హాటక కదళీవిలాసము = బంగారపు టరఁటిచెట్లయొక్క శోభ, విపరీతము = తాఱుమాఱుగాక, సాటియే = సమమగునా ? ఇఁక - కరిరాజహస్తములే = శ్రేష్ఠమగు నేనుఁగులయొక్క, హస్తములే = తొండములు, ఎంత తలక్రిందయినన్ = ఎంత కష్టపడినను (సరే), అరఁటులవలెఁగాక, మీఁదవలముగాను, క్రింద క్రమసూక్ష్మతయుఁ గలిగియుండిన నుండుఁగాక, అకలుష.....లక్ష్మికిన్ - అకలుష = నిర్మలమైన, రామణీయక = సొగసుతో, సమంచిత= కూడినవియు, కోమల = మృదువులు నగు, తద్వధూ + ఊరులక్ష్మికిన్ = ఆయింతి తొడలయొక్క శోభకు, సరి = సాటి, కావు+అ=కానేకావు.

తాత్పర్యము:—కవులు స్త్రీలయూరువులకు నుపమానములుగా నరఁటులను, ఏనుఁగుతొండములను జెప్పుదురు, అట్లని ప్రభావతి తొడలకుఁ గూడ-క్రిందు మీఁ దరయక = ఏది తక్కువది యేది యెక్కువది అని యాలోచింపక, సమములే అని చెప్పిరా బంగరుటనఁటులశోభకూడ విపరీతము - అనఁగా మొదట లావుగను తుదలందు సన్నముగా నుండుటచే తాఱుమాఱయి సామ్యము నొందదు. ఏనుఁగుతొండములు ప్రభావతి యూరువులవలెనే, పైభాగము స్థూలము, రానురాను సన్నముగానై, అరఁటులవలెఁ గాక తలక్రిందయినప్పటికి, కళంకరహిత మగు సొగసును, మార్దవమును గల ఆమె యూరువులతో సరి కానే కావు. ఏమన - ఏనుఁగు తొండము లాఁదోఁకగా నుండవచ్చునే కాని ధూళిధూసరములై, అతికఠినములుగా నుండును గదా! కావున కవులు లోకసామాన్యముగాఁ జెప్పు నీరెం డుపమానములు పనికిరాక తద్వధూరులక్ష్మి నిరుపమానమైన దని భావము.

అలం. :—వ్యతిరేకము.

వ్యా :—అయినన్ - అగుధాతువు చేదాద్యర్థకరూపము - అగు + ఇ + నన్ - అని యుండ - సూ. "అగుపోవులకడ్రవాల కివ్వక్రంబులు పరంబగునపుడు యకారంబగు" బాల. క్రియా. 99. చే గకారమునకు యకారము వచ్చి, అయినన్ - అని యైనది.

తే. రమణిజంఘలు శాలిగర్భములు హీర, దీప్తి జలపూర్తి యొప్పునందియలు మళ్లు
వానిలోపలఁ జలువకై వచ్చియున్న, కచ్ఛపంబులఁ బోలిమీఁగాళ్లు దనరు. 86

అర్థము:—రమణిజంఘలు = సుందరియగు ప్రభావతియొక్క, జంఘలు = పిక్కలు, శాలిగర్భములు =వరిపొట్టలు, హీరదీప్తి = (అందియలందలి) వజ్రాలకాంతి, జలపూర్తి = నీటియొక్క నిండుదనము, ఒప్పునందియలు = మెఱయుచున్న పాదకటకములు, మళ్ళు = సస్యములకు నీరునిలుచుటకై నలువైపుల గట్లుతీర్చినపొలములు, వానిలోపలి చలువకై, వచ్చి, ఉన్న = కదలకున్న, కచ్ఛపంబులన్ = తాఁబేళ్లను, పోలి, మీఁగాళ్లు, తనరున్ = ఒప్పును.

తాత్పర్యము:—ప్రభావతిపిక్కలు వరిపొట్టలు, అందెలందలి వజ్రాలకాంతి - మళ్ల నిండ నింపిన జలములు, అందెలు నీరునిలుచుటకై చుట్టు గట్లువేసిన పొలములు - అందలి చలువకై వచ్చినతాఁబేళ్లవలె మీఁగాళ్లు - ప్రకాశించును.

అలం:—రూపకము, ఉపమ.

వి. :—జలపూర్తినొప్పు అనుపాఠము ముద్రితప్రతులందుఁ గలదు, కాని యాపాఠమున వజ్రాల కాంతి యనునీటినిండుచే ఒప్పునట్టి అందెలు - అనుట సమంజసముగాఁ గనఁబడదు. నీటిచే ఒప్పునవి మళ్లు, వజ్రాలకాంతితో ఒప్పునవి అందెలునుగదా! - క్రమము ననుసరించి, యాలోచింప - జంఘలు వరిపొట్టలు -

పగడాలతెల్లనికాంతి నీటిపూరము, అందెలు మళ్లు, ఆమళ్లలోని చలువకువచ్చిన తాబేళ్లవంటివి మీఁగాళ్లు, అని యీయొకచోటమాత్రమే - ఉపమ. కాని, తక్కినవరుసయందు ఉపమానముయొక్క తాద్రూప్యము వలన రూపకాలంకారము స్ఫుటముగానుండుటవలన, హీరదీప్తి జలపూర్తి, ఒప్పునందియలుమళ్లు అనిపాఠము మార్చి వ్యాఖ్యానింపఁబడినది.

వ్యా. :—మడి - (బ. వ.) లు. "ఇత్తునకు బహువచనంబు పరంబగు డుత్వంబగు" బాల. తత్సమ. 45. చే మడులు - అయి, "బహువచనంబు పరం బగునపుడు డ, ల, ట, ర, ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు." బాల. అచ్చిక. 12 చే - మళ్లు. అయి బహువచనశిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలశులకారంబు నిత్యంబుగనగు. అచ్చిక. 14. చే మళ్లు - అగును. ఉత్వలోపము బహుళముగాన మడులు, అనియు రూప ముండును. మీఁదు + కాళ్లు - "సమాసంబునం బ్రాంతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 35 - చే. మీ + కాళ్లు - అయి "లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు" సంధి. 36 చే నుగాగమము, ద్రుతకార్యములు రా "మీఁగాళ్లు" అని సిద్ధించెను.

క. కెందామరలుఁ జిగుళ్లును, సౌందర్యశ్రీలఁ దమకు సరి గా వని యా
యిందుముఖి పాదములు నగుఁ, గందళదుజ్జ్వల నఖాంశుకైతవయుక్తిన్. 87

అర్థములు :—ఆ యిందుముఖిపాదములు = (చంద్రునివంటి మొగముగల) ఆ ప్రభావతియొక్క యడుగులు, సౌందర్యశ్రీలన్ = చక్కఁదనముయొక్క సంపదల విషయమున, కెందామరలును = ఎఱ్ఱ తామరపూవులును, చిగుళ్లును = చిగురుటాకులును, తమకున్, సరి, కావు, అని, కందళ ... యుక్తిన్ = కందళత్ = అంకురించుచున్నట్టియు, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, నఖ = గోళ్లయొక్క, అంశు = కాంతులనెడు, కైతవయుక్తిన్ = మిషయొక్క కలయికచే, మిషతో నని యర్థము, నగున్ = నవ్వును.

తాత్పర్యము :—ఆ ప్రభావతియడుగులు సౌందర్యసంపదలవిషయమున ఎఱ్ఱతామరలు, చిగుళ్లు తమకు సాటి కావని కాళ్లయందలిగోళ్లకాంతు లను మిషమున నవ్వును.

అలం. :—ప్రతీపము, కైతవాపహ్నవము.

వ్యా. వి. :—కెందామరలు. కెంపు + తామరలు. ప్రాంతాదిసూత్రసంధి.

శా. శృంగగ్రాహికఁ జెప్ప వేఱె తెరువుల్ సిద్ధింపమిం జేసి చి
త్రాంగశ్రీనిధి నవ్వధూమణిని స్థూలారుంధతీన్యాయ మా
ర్గాంగీకారమునన్ వచించితిని జంఘాద్యోపమల్ సూచనా
భంగుల్ గాని యదస్సహస్రగుణ సౌభాగ్యంబు లా యంగముల్.

అర్థము:—చిత్రాంగ శ్రీనిధిన్ — చిత్ర = అద్భుతమైన, అంగ = అవయవముల యొక్క, శ్రీ = శోభకు, నిధిన్ = స్థానమైన, అవ్వధూమణిన్ = అయింతిమిన్నను, శృంగ గ్రాహికన్ = (మందలో నున్న గోవుల గుణదోషము లెఱుఁగఁగోరిన వానికి ఆ యావులను గాచువాఁడు ప్రతి గోవువద్దకు వెళ్లి దాని కొమ్ము చేతఁబట్టుకొని 'యిది యిట్టిది' యని సరిగా చెప్పుటను శృంగగ్రాహికా న్యాయ మందురు.) ఆ పేరుగల న్యాయముచే, చెప్పన్ = చెప్పుటకు, వేఱె తెరువుల్ = వేఱు త్రోవలు (ఉపాయములన్నమాట), సిద్ధింపమింజేసి = లభింపక పోవుటచేత, స్థూలా ... కారమునన్ — స్థూలారుంధతీ న్యాయ = ఆ పేరుగల న్యాయము యొక్క, మార్గ = త్రోవయొక్క, అంగీకారమునన్ = అంగీకరించుటచేత - (గ్రహించుటచేత అని భావము), వచించితిని = చెప్పితిని, ( సూక్ష్మరూపముతో నాకాశమున సప్తర్షిమండలమున నుండు

నరుంధతీ నక్షత్రము తెలియఁ జెప్పుటకు - ప్రక్కనుండు పెద్ద నక్షత్రమును ముందు గుర్తింపఁజేసి, పిదప - నా పెద్ద నక్షత్రము ప్రక్క మినుమినుకను నరుంధతీ నక్షత్రమును గుర్తింపఁజేయుట స్థూలారుంధతీ న్యాయము అని కొందఱు. ముందుగా పెద్ద నక్షత్రమును జూపి అదియే అరుంధతి యని గుర్తింపఁజేసి తరువాత అది కాదు, దాని ప్రక్కనున్న చిన్న నక్షత్రము అరుంధతి యని గుర్తింపఁజేయుట-స్థూలారుంధతీ న్యాయము అని కొందఱును.) కాని = అంతియే కాని, చంద్రాద్యోపమల్ - చంద్ర = చంద్రుఁడు, ఆద్య = మొదటివాఁడుగా గల (మొదలగు అని భావము), ఉపమల్ = ఉపమానవస్తువులు, సూచనాభంగులే =సూచించు రీతిగలవి (మాత్రమే), ఏలయన- అయంగములే=ప్రభావతియొక్క యాయాయి అవయవములు, అవ ... సౌభాగ్యములే - అవః = చంద్రాదులగు నీయుపమానవస్తువుల కంటె, సహస్రగుణ = వేయిరెట్లధికమైన, సౌభాగ్యములే = అందముగలవి.

తాత్పర్యము:—అద్భుతమైన శరీర శోభగల యా ప్రభావతి యవయవములు నేను చెప్పిన యుపమాన వస్తువులతో కొంచెమేని భేదము లేక సరిగా నట్లే యున్నవని శృంగగ్రాహికాన్యాయముచేఁ జెప్పుటకు సాధ్యముగాక, పూర్ణముగా కొకపోయినను కొంతవఱకైనను గ్రహింప వీలగు నని స్థూలారుంధతీ న్యాయమున చంద్రాద్యుపమాన పదార్థములు చెప్పితినే కాని యంతమాత్రమే యామె యవయవసౌందర్య మనుకొనఁ దగదు. ఆమె యవయవములే యుపమానములగు చంద్రాదులకంటె వేయిరెట్లధిక సౌందర్యము కలవి సుమా.

వి. :—సామాన్యముగా నుపమేయముకంటె నుపమాన మెన్నియో రెట్లు గొప్పదిగా నుండును. అట్లు గాక ఆ ప్రభావతి యవయవములే చంద్రాదులకంటె వేయిరెట్లధికముగా నున్నవి -. కాన నేను చెప్పిన యుపమానములు కొంతమాత్రమే సరిపడవచ్చునని భావము.

అలం. :—లుప్తోపమ, నిదర్శనము, వ్యతిరేకము.

ఉ. వెన్నెల తేటనిగ్గు నరవిందములేకు మృదుత్వముం బదా
ర్వన్నియ జాళువాపసిఁడి రంగు మెఱుంగుల ధాళధళ్యమున్
గన్నియ రూపుగాఁ గరుపు గట్టి మనోజుఁడు పోఁతఁ బోయఁబో
లు నెన్నెఱనేర్పుతో ననుట లోకుల పల్కుడి చాల దేమియున్. 89

అర్థము:—మనోజుఁడు = (మనసునఁబుట్టినవాఁడు) మన్మథుఁడు, కన్నియరూపు = ఆకన్యయొక్క ఆకారము, కాఁ = కావలెనని, కరుపుగట్టి = మూసను సిద్ధించి, (అందు) - వెన్నెలతేటనిగ్గున్ = వెన్నెలయొక్క యుత్కృష్టకాంతిని (మరియు), అరవిందములేకు మృదుత్వమున్ = తమ్మిపూరేకులలోని మార్దవమును (మెత్తఁదనము) పదార్వన్నియ...రంగున్, పదార్వన్నియ = పదియాఱువన్నె వచ్చువఱకుఁ గరఁగించిన, జాళువా = మేలిమి, పసిఁడి = బంగారుయొక్క, రంగున్ = వర్ణమును, మెఱుంగులధాళ ధళ్యమున్ = మెఱుపులలోని తళతళలను, (ఏకముచేసి, అధ్యాహారము) నెఱనేర్పుతో = నిండునేర్పుతో, పోఁతన్ + పోయన్ + పోలున్ = కరుగునంగము పోసి శరీర మగునట్లు నిర్మించి యుండవచ్చును, అనుట = అనిపల్కుట, లోకులపల్కు = ప్రజ లవిచారితముగా నను మాట. ఏమన - ఇది = మన్మథుఁడు తన పెద్దనేర్పుతో, చంద్రికాదిపదార్థము లుపాదానకారణముగా నిర్మించె నను నీమాట(కూడ), ఏమియున్ = కొంచెముగా నైనను, చాలదు - అనఁగా లోకోత్తర మైనమన్మథసృష్టినిగూడ నతిక్రమించిన దని భావము.

తాత్పర్యము:—ప్రభావతీరూపమును జూచి "మన్మథుఁడు తాను సౌందర్యాధిదైవతము కావున వెన్నెలయొక్క పరమశోభను, తామరరేకులమెత్తఁదనమును, మేలిమిబంగారురంగును, మెఱుపులలోని తళతళలను ప్రోఁగుచేసి యీ మెయిరూప మగునట్లు పోఁతపోసి యుండవచ్చును" అను లోకులమాటలు స్థూలముగా పలికినవే కాని నిజము తెలిసి పలికినవి కావు, ఏమన ఆమెచక్కఁదనమరసిన లోకులనుకొనిన మన్మథుని సృష్టిచాతుర్యముగూడఁ జాల దనిపించుచున్నది.

అలం:—అతిశయోక్తి, ఉత్ప్రేక్ష.

వి. :—ఆమెశరీరము వెన్నెలతేటవలె నానందకరమై, తామరరేకులవలె మృదువై, మేలిమిబంగరు వలె పచ్చనిరంగుకలదై, మెఱపులతీగెవంటిలావణ్యము కలిగియున్న దని అభిప్రాయము. కోరికలకు జన్మస్థాన మగు మనస్సులో, పుట్టినవాఁడు కాన మన్మథుఁడు తనకోరికప్రకారము తీర్చి దిద్దినాఁ డని "మనసిజ"పదము తెలుపుచున్నది. ఇట్లూహించి పలికినమాటకూడఁ జాల దనుటచే ప్రభావతిచక్కదన మవాఙ్మానసగోచర మనుకోఁదగును.

ఉ. ఎమ్మెయిఁ బ్రజ్ఞ మీఱ వచియించెద నన్న వచింపలేన య
క్కొమ్మ బెడంగులోన నొక కోటితమాంశము నైన నంతమా
త్రమ్మ మదుక్తిశక్తి యనరా దతివాఙ్మహిమాఢ్య నేను మా
యమ్మ సరస్వతీసతి తనంతటి దానిగ నన్ను దిద్దుటన్. 90

అర్థము:—ప్రజ్ఞ=బుద్ధి, మీఱన్ = అతిశయింపఁగా, ఎమ్మెయిన్ = ఏ రీతిగానైనను, వచించెదను అన్నన్ = చెప్పెద ననుకొన్నను - (చెప్పయత్నించినను), ఆ + కొమ్మ + బెడంగులోనన్ = ఆ ప్రభావతి యొక్క చక్కఁదనమునందలి, ఒక కోటితమాంశమును + ఐనన్ = మిక్కిలి స్వల్పభాగమైనను, వచింపన్+లేను + అ=చెప్పనేలేను. (ఇట్లంటిని గదాయని), మదుక్తిశక్తి=నా మాటయందలి సామర్థ్యము, అంతమాత్రమ్ము + అ = అంతకొలత గలదియే, అనరాదు - మా+అమ్మ సరస్వతీసతి = నన్ను పెంచిన సరస్వతీదేవి, తనంతటి దానిఁగన్, నన్నున్ (విద్యలందు) - దిద్దుటన్ = శిక్షించుటచేత, నేను, అతివాఙ్మహిమాఢ్యన్ = అధికమగు సంభాషణ శక్తితో నిండిన దాననుజుమా.

తాత్పర్యము:—బుద్ధిబలముచే నేదో రీతిగా చెప్పెద మనుకొన్నను, ఆయింతి సొగసులో నొక కోటియగు భాగము నైనను చెప్పలేను. అట్లు చెప్పఁజాలనంటిని గదా యని, నాకంత మాత్రమే మాటాడు శక్తిగల దనుకోరాదు. మాయమ్మ సరస్వతీదేవి విద్యలందు నన్ను తనంతటిఁదానిగ దిద్దినది. కాన మాటాడుటలో మిగుల గొప్పతనము కలదాననే అయినను ప్రభావతి సొగసును జెప్పుశక్తి మాత్రము నాకు లేదు.

అలం. :—కావ్యలింగము.

వి. :—సరస్వతి తనంతటి దానిగ నన్ను దిద్దినది. నే నతివాఙ్మహిమాఢ్యను అనుటలో తనం సరస్వతి, సరస్వతియంతటిది తాను నగుననియు, తాను చెప్పజాల ననుటచే సకల వాగధిష్ఠాత్రి సరస్వతియుఁ గూడఁ జెప్పఁజాల దనియు వ్యంగ్యము.

వ్యా:—కోటితమము "తస్యపూరణే డట్" అను సూత్రమునుండి 'పూరణే' అనువర్తింపఁగా, నిత్యం శతాది మాసార్ధమాస సంవత్సరాచ్చ (5-2-57) అను సూత్రముచే పూరణార్థమున శతాదిసంఖ్యలలోని దగు కోటిశబ్దమునకు తమట్ ప్రత్యయము నిత్యముగావచ్చును - కోటితమము = కోటియవది అని యర్థము - (కోటిశబ్దమునకు వికృతియు "కోటి"యే యని యయాతిచరిత్ర ప్రయోగమునుబట్టి నిర్ణీతము.)

వ. అని తాను బ్రహ్మదేవుని రథవాహనం బైనసారంధరుం డను హంసవంశావతంసుఁడు రగుటయుఁ దదీయసంబంధ వశంబున నంబుజాసను రాణివాసంబునందు వాణి పెంపఁ బెరుఁగుటయుఁ దదనుగ్రహంబునం దనకు నఖిలవిద్యలుం గరతలామలకం బగుటయుం జెప్పి మన్ముఖంబు శబ్దసంస్కారపూతం బనుబుద్ధి నద్దేవియ నాకు శుచిముఖి యను పే రిడియె నని యి ట్లనియె. 91

అర్థము:—అని, తాను, బ్రహ్మదేవుని రథవాహనంబు = బ్రహ్మయొక్క రథమునకు వాహనము - (వహించునది - లాగునది) ఐన = అయినట్టి, సారంధరుండు, అను = అనెడుపేరుగల, హంస...తంసు = హంస = హంసలయొక్క, వంశ = కులములకు, లేక - కులములందుఁ బుట్టినవానికి, అవతంసు = శిరోభూషణమైన వానియొక్క, కూఁతురు, అగుటయున్, తదీయ...వశంబునన్ - తదీయ = వానిదగు, సంబంధ వశంబునన్ = అనుబంధమూలమున - నే నాసారంధరునికిఁ గూఁతుగైన యసంబంధము మూలమున, అంబు...వాసంబునందున్ - అంబుజాసను=(తామరపువ్వు పీఠముగాఁగల) బ్రహ్మయొక్క, రాణివాసంబునందున్= అంతఃపురమునందు, వాణి = సరస్వతీదేవి, పెంపన్, పెరుఁగుటయున్ = పెద్దదగుటయును, తత్ + అనుగ్రహంబునన్ = ఆమెయొక్క దయచేత, తనకున్, సకలవిద్యలున్, కరతలామలకంబు - కరతల= అఱచేతియందలి, ఆమలకంబు = ఉసిరికకాయ వలె స్పష్టముగాఁ దెలిసినవి, అగుటయున్, చెప్పి, మన్ముఖంబు - (మత్+ముఖంబు) = నాయొక్క మొగము, శబ్దసంస్కారపూతంబు = వ్యాకరణముచేత పవిత్రమైనది, అనుబుద్ధిన్ = అను తలంపుతో, అద్దేవియ - (ఆ+దేవియ) = ఆసరస్వతీదేవియే, నాకున్, శుచిముఖి = పరిశుద్ధమగు ముఖము - (అనఁగావాక్కు) గలది, అనుపేరు, ఇడియెన్ = పెట్టెను అని, ఇట్లు, అనియెన్ = చెప్పెను.

తాత్పర్యము:—బ్రహ్మయొక్క రథమునులాగెడి సారంధరుని కూఁతుర ననియు, ఆసంబంధమున సరస్వతి పెంపఁ, బెరిఁగి యామెదయచే సకలవిద్యలు నేర్చితి ననియు, వ్యాకరణశాస్త్రము నేర్పుటచే శుచిముఖియని యాదేవియే తనకుఁబేరుపెట్టె ననియు, నాహంసి తన యాభిజాత్యమునుదెలిపి మరలనిట్లుచెప్పెను.

చ. నలినజురాణివాస మొకనాఁడు ననున్ దనచేతిప్రోదిరా
చిలుకను వాదుకుం గవిత చెప్పఁగఁ దా నియమించి, యందు నా
పలుకులఁ గొంత వాసి గని భావమునన్ గడు మెచ్చుచున్ నఖాం
చలమున నాదుటెక్కునులి చక్కఁగ దువ్వుచు గారవించుచున్. 92

అర్థము:—నలినజు రాణివాసము = బ్రహ్మయొక్క యంతఃపురకాంత యగు సరస్వతి, ఒకనాఁడు, ననున్ = నన్నును, తన...చిలుకను - తనచేతి = తనచేతియందుండెడు, ప్రోదిరాచిలుకను = పెంపుడు చిలుకను, వాదుకున్ = వాదమునకు, కవిత, చెప్పఁగన్ = కవిత్వము చెప్పుటకై, తాన్ = తాను, స్వయముగా, నియమించి = ఆజ్ఞాపించి, అందున్ = మాకవిత్వమునందు, నాపలుకులన్ = నావాక్కులందు, కొంత = కొంచెము, వాసి = ఆధిక్యమును, కని, భావమునన్ = మనస్సునందు, కడున్ = ఎక్కువగా, మెచ్చుచున్, నఖాంచలమునన్ = (తన) గోటికొనతో, నాదుటెక్కునులి = నాటెక్కలలోని, చిక్కును, చక్కఁగన్ + దువ్వుచున్ = సరి యగునట్లు దువ్వుచు, గారవించుచున్ = లాలించుచు - మీఁదికన్వయము.

తాత్పర్యము:—ఒకనాఁడు సరస్వతీదేవి నన్నును తనచేతిపై నున్న పెంపుడుచిలుకను వాదకథగా కవిత్వము చెప్ప నియమించి, నాకవిత్వమున కొంచెము మెఱవడి యుంట గాంచి మెచ్చుచు నాటెక్కల లోని యీఁకలచిక్కును తనగోటికొనతో చక్కఁబడ దువ్వుచు లాలించుచు.

వి. :—ప్రేమ మతిశయించినప్పుడు బిడ్డలను జేరఁదీసి వారి తలవెండ్రుకలను జక్క దువ్వుచు లాలించుట తలిదండ్రుల లక్షణము. అట్లే తనపెంపుడు హంసయందుఁ గలప్రేమకు సూచకముగా సరస్వతి టెక్కలనులి చక్కఁబడ దువ్వినది. అనుటచే హంసి సరస్వతి కంతప్రేమాస్పద మని తెలియుచున్నది. నిజము తెలిసికొనుట కొకరితో నొకరు చేయు సంభాషణము వాదము అనియు, నొకరి నొకరు జయింపఁ గోరి చేయు సంభాషణము జల్పకథ యనియు ప్రాచీనులు చెప్పిరి. ఇచట జయాపజయములతో నిమిత్తము లేని వినోదమున కగుసంభాషణము కావున వాద మనుట యుచితము - (విజిగీషోఃకథా జల్పో వాద స్తత్త్వ

విశేదిషోః.) తత్త్వము తెలిసికొని మాటలాడుటలో రాచిలుకకంటె హంసి అధిక్యము చూపినది కావుననే "నాపలుకులఁ గొంతవాసి గని" యనుట కల్గెను. జల్పమే యగుచో "నే నాచిలుకను జయించితి" ననియే హంసి చెప్పి యుండును. రాణివాసము = రాజభార్యలు వసించుగృహము అని యర్థమైనను, అందుండుటవలన ఆస్త్రీలను గూడ రాణివాసము అని వ్యవహారము – దీనికి సంస్కృతపర్యాయములును, అంతఃపుర, శుద్ధాం, తావరోధ శబ్దములకును రాజస్త్రీ లనియర్థము గలదు. "అంతఃపురాచరణా రాజదారేష్వపి తాత్స్థ్యాత్ వర్తంతే" అని కల్పద్రుమము. "భవసాగరశోషణేన పర్య్యా, చ్ఛురితాంతఃపురజీవనాథధేనః రజసా రఘునాథపాదభాజా – అని విశ్వగుణాదర్శము, పర్యాచ్ఛురిత = గోరంగ నిరోమెక్క, అంతఃపుర=భార్యయగు అహల్యకు – అని భార్యాపరముగాఁ బ్రయోగము గలదు. అథకాంచి నగమహాచాం, సిద్ధాంతం శూలిపాణి శుద్ధాంతం – మూకపంచశతి. శూలపాణి=శివునియొక్క, శుద్ధాంతం = అంతఃపురస్త్రీ యగు కామాక్షిని- అని శుద్ధాంతశబ్దము వాడఁబడినది.

వ్యా. :—వాదనకున్ – సూ. శబ్దకంబు తరువాతి ఉకారము కారంబులకు నగాగమం బగు. బాల. తత్సమ 28. చే. వాదనకున్ – అని యుండఁదగును. కాని ఇట్టి నగాగమ రహితరూపములు కవిత్రయేతర ప్రయోగములం గాన్నట్లు పరిష్క. శబ్ద. 19. సూత్రమున చెప్పఁబడినది – ఇచట "వాదునన్" అని పాఠ మున్నట్లు కొంద అందురు.

చ. ప్రబలము లైనకౌతుక, కృపారస, వత్సలతాదరంబులన్
శబలితచిత్తయై యిడుదు కే నా "కుపమాతిశయోక్తికామధే
ను"బిరుద మిచ్చి తల్లిఖితకనూపురమున్ భువనైకమాత య
య్యబల మదంఘ్రిఁ దాఁ దొడిగె కే నా బిరుదం బిది చూడు మేర్పడన్. 93

అర్థము:—ప్రబలములు = ఎక్కువ బలముగలవి – అధికములు, ఐన = అయినట్టి, కౌతుక...దరంబులన్ – కౌతుక = వేడుకచేతను, కృపారస = దయచేతను, వత్సలతా = ప్రేమచేతను, ఆదరంబులన్ = ఆదరణముచేతను, శబలితచిత్త + ఐ = నానావర్ణమిశ్రమగు దానివలె నైన మనస్సుగలదై (అనఁగా వేడుక మున్నగు భావము లేకమై పోయిన మనస్సుగలది అనిభావము) ఇడుదు, నాకున్, ఉపమాతిశయోక్తి కామధేను బిరుదము=ఉపమాలంకారమునకును అతిశయోక్త్యలంకారమునకును కామధేనువు అను బిరుదు, ఇచ్చి, తల్లిఖితనూపురమున్ = ఆబిరుదము చెక్కఁబడిన పెండేరమును, భువన+ఏకమాత = లోకముల (కెల్ల) కేవలము తల్లియగు, అ+అబల = అసరస్వతీకాంత, తాన్=స్వయముగా, మదంఘ్రిన్= నాపాదమందు, తొడిగెన్, ఇది = ఇదిగో, ఆబిరుదంబు, ఏర్పడన్ = స్పష్టముగా, చూడుము.

తాత్పర్యము:—లోకములన్నిటిని గన్నతల్లియగు నాసరస్వతి తనహృదయమున ఉత్కంఠయును, దయయును, ప్రేమయును, ఆదరమును నొక్కమారే కలిగి, కలిసిపోవఁగా, నాకు 'ఉపమాతిశయోక్తి కామధేనువు' అనఁగా–కామధేనువు కోరినకోర్కు లిచ్చునట్లు 'కోరినన్ని యుపమాతిశయోక్త్యలంకారములతో కవిత చెప్పునది' యను బిరుద మిచ్చి ఆబిరుదము చెక్కిన పెండేరమును తాను నాకాలికిఁ దొడిగినది. ఇదిగో ఆ నూపురము చూడుము. శబలము – చిత్ర కిర్మీర కల్మాష శబలైతాశ్చకర్బురే – అని అమరము – అన్నిరంగులు కలిసిన చిత్రవర్ణము. దానివలెనె వేడుక, దయ, ప్రేమ, ఆదరమును కలిసిపోవుటచే మనస్సంతయు తన్మయమైన దగుటకు "శబలితము" అని ప్రయుక్తము – ఏకము=1 ముఖ్యము, 2 అన్యము, 3 కేవలము, 4 ఒకటి. అని నానార్థములు.

క. అని నూపురగతవ, ర్ణనికాయముఁ ద్రిప్పి చూపి కే నారాయణనం
దన ! యిట్టి నాదుపలుకుల, కు నగమ్యము దనుజకన్యకోమ యూహింపన్. 94

అర్థము:—అని, నూపుర...నికాయమున్ - నూపుర = కాలియందెను - పెండారమును, గత = పొందినట్టి, వర్ణ = అక్షరములయొక్క, నికాయమున్ = సముదాయమును, త్రిప్పి, చూపి = కనఁబఱచి, నారాయణనందన = శ్రీకృష్ణుని పుత్త్రుఁడగు నో ప్రద్యుమ్నా!, ఇట్టినాదుపలుకులకున్ = సరస్వతిచే నిట్టిబిరుదందిన నామాటలకుఁగూడ, దనుజకన్యకామరు = వజ్రనాభాసురుని కూఁతురగు ప్రభావతియొక్క చక్కఁదనము, ఊహింపఁగన్, అగమ్యము = పొందశక్యముగానిది.

తాత్పర్యము:—అని కాలియందెను త్రిప్పి యందుఁగల బిరుదాక్షరములను చూపి, అయ్యా, ఇంతదాన నగు నేను గూడ ప్రభావతిసొగసును యథాతథముగాఁ జెప్పఁజాలను జుమీ!

వి. :—తనగొప్పతనము తాను జెప్పుకొనునట్లు గాక చెప్పుటయు, నిట్టినామాటలకుఁగూడ ప్రభావతి సౌందర్యము అగమ్యము అని చెప్పుటయు హంసియొక్క వాక్ప్రౌఢికి సూచకములు.

వ. ఆ జగన్మోహనాంగిం జిత్రఫలకంబున వ్రాసి యైనం జూపెద నంటినేని. 95

అర్థము:—జగత్ + మోహన = లోకములను మోహపెట్టునట్టి, అంగిన్ = శరీరముగలదానిని, (ఆ ప్రభావతిని) చిత్రఫలకంబునన్ = చిత్తరువు వ్రాయునట్టి పలకపై, వ్రాసియైనన్ = చిత్రించియైనను, చూపెదను, అంటిన్ + ఏని = అందునా ?

వ్యా.వి:—సూ. చేదర్థయోగంబున లృట్టునకు లి ట్టగు. బాల. క్రియా. 119 చే, భవిష్యదర్థమున భూతకాలిక క్రియ-ముద్రితప్రతులందు "అంటేనిన్" అని కలదు. అంటిన్-అనునది ద్రుతాంతమగుటచే అట సంధి యసాధువు, అట్లుకాక, అంటి (అంటివి) అను మధ్యమపురుషైకారసంధి' యనినచో అర్థము పొసఁగదు. కావున అంటినేని, అనిపాఠము సవరింపఁబడినది.

క. ఏయంగకమును భావన, చేయక వ్రాయంగరాదు ♣ చేసిన నానం
దాయత్తత మది చొక్కుఁ బ,రాయత్తపుబుద్ధిఁ జెలువ ♣ నలవియె వ్రాయన్. 96

అర్థము:—ఏయంగకమును = (ప్రభావతియొక్క) ఏ యొక్క యవయవమునుగూడ, భావన చేయక = హృదయమునకు హత్తుకొనునట్లు ధ్యానముచేయక, వ్రాయంగన్ + రాదు=చిత్రింప వీలుగాదు, చేసినన్ = (అట్లు) భావన చేసినయెడల, ఆనందాయత్తతన్ = సంతోషమునకు వశమై పోవుటచేత - (సంతోషమునందు మునుఁగుటచేత), మది = మనస్సు, చొక్కున్ = వివశమగును, పరాయత్తపు బుద్ధిన్ - పర=ఇతరమునకు, ఆయత్తపు = అధీనమైన, బుద్ధిన్ = బుద్ధితో, చెలువన్ = ఆ ప్రభావతిని, వ్రాయన్ = చిత్రించుట. అలవియే = శక్యమా ? శక్యముకాదు అనిభావము.

తా:—చిత్తరువున నామెరూపము వ్రాసి చూపుద మనిన నేచిన్నయవయవము నైనను బాగుగా ధ్యానించి కాని వ్రాయ శక్యము కాదు. ధ్యానింపఁ బూనుచో ఆనందముచే హృదయము పరవశమై పోవును. పరవశ మగుమనస్సుతో వ్రాయుట కుదురదుగదా !.

వి. "అంగకము" అల్పార్థమున కప్ ప్రత్యయము.

అలం. :—కారణమాల. "గీ, వరుసఁ దప్పని కారణావళులతోడఁ, గీలుకొల్పినఁ గారణమాల యగును." ఆంధ్రచంద్రాలోకము. 90.

వ. అదియునుంగాక - 97

క. అత్తరుణీమణిరూపముఁ, జిత్తరువున వ్రాయునేర్పు ♣ చేకుఱునేనిన్
దత్తుల్యవనిత నెం దే, నత్తొలివేలుపు సృజింపఁడా తనసృష్టిన్. 98

అర్థము :—ఆ + తరుణీమణిరూపమున్ = పడుచులలో శ్రేష్ఠురా లగు నా ప్రభావతియొక్క యాకారమును, చిత్తరవునన్, వ్రాయుచేర్పు, చేకురుసేనిన్ = కలిగినచో, ఆ + తొలివేలుపు = దేవతలలో మొదటివాఁడగు నా బ్రహ్మ, తనసృష్టిన్ = తనయొక్క సృష్టియందు, ఎంచేన్ = ఎచటనైనను, (లేదా - ఎప్పుడైనను), తత్తుల్యవనితన్ = ఆమెతో సమానురాలగు స్త్రీని, సృజింపఁడా = పుట్టింపఁడా ?

తాత్పర్యము :—అంతియ కాదు. ఆ బ్రహ్మ ప్రభావతీరూపము చిత్తరవున వ్రాయునేర్పు గలవాఁడే యైనచో - ఆమెతో సమాన యగు స్త్రీని తనసృష్టియం దింకొకతె నెచటనైనను సృజింపకుండునా ? - అనఁగా బ్రహ్మకూడ ఆమెరూపమును చిత్రింప లేఁ డని భావము.

వి. :—చేకూరు - రూ. చేకురు. సూ. దీర్ఘపూర్వక మగు లఘురేఫము హ్రస్వపూర్వక మగుచో నలఘురేఫంబగు. ప్రౌఢ. సుక్త. వి. 1 -.

ఆ. అజుఁడె యొకప్రసంగ కై మై చెప్ప వింటి న, క్కాంత తనదుసృష్టి కా కునికియు
నాదిశక్తి శివు మహాదేవి తనదైన, చిత్రమహిమచే సృజించుటయును. 99

అర్థము:—అజుఁడు + ఎ = బ్రహ్మయే, ఒక ప్రసంగము + ఐ = ఒక ప్రస్తావనము వచ్చి, (అగు ధాతువున కిట 'కలుగు' అని యర్థము) ఆ+కాంత = ఆచెలువ (ప్రభావతి), అతనిసృష్టి = ఆ బ్రహ్మయొక్క నిర్మాణము, కాక+ఉనికియును = కాకుండుటయును, ఆదిశక్తి = పరాశక్తియగు, శివుమహాదేవి = శివుని యిల్లాలగు గౌరి, లసది+అయిన, చిత్రమహిమచేన్ = ఆశ్చర్యకర మగు మహత్త్వముచే, సృజించుటయును = నిర్మించుటయును, చెప్పన్ + చెప్పఁగా, వింటిన్ = వినియున్నాను.

తాత్పర్యము:—ఆమె బ్రహ్మసృష్టిలోనిది కా దనియు, పరాశక్తియగు గౌరిచే అత్యద్భుత మహిమ వలన సృజింపఁబడె ననియు, బ్రహ్మయే యొకానొక ప్రసంగమున చెప్పఁగా విని యుంటిని.

క. విను మిపు డది సంస్మృతిపద,విని జెందెను మాటమాట కై వెంబడి నెందే
ననుభవ భవసంస్కారం,బున కుద్బోధము ప్రసంగమున నగునుగదా ! R.c 100

అర్థము:—వినుము, మాటమాటవెంబడిన్ = ప్రసంగవశమున, అది = ఆ బ్రహ్మచెప్పినమాట, ఇపుడు, సంస్మృతిపదవిని=ధ్యానమార్గమును, చెందెను=పొందెను - (అనఁగా తలంపునకు - జ్ఞప్తికివచ్చినది అని భావము) ఎందేన్=ఎప్పుడైనను, ప్రసంగమునన్ = ప్రస్తావముచే, అనుభవ...రంబునకున్, అనుభవ = అనుభవముచే, భవ = పుట్టిన, సంస్కారంబునకున్ = అనుభవింపఁబడిన పదార్థముయొక్క స్మృతిని కలిగించు జ్ఞానమునకు, (కన్ను, చెవి, ముక్కు మొదలగు నింద్రియములచే నేదేని యొకపదార్థ మనుభవింపబడినపు "ఇది యిట్టిది" అనుజ్ఞానము పుట్టి యాత్మయందు స్థిరముగ నుండి, ప్రస్తావము వచ్చినతఱి దానిని జ్ఞప్తికిఁ దెచ్చునది "సంస్కారము" అందురు.) ఉద్బోధము = వికాసము-పైకుబుకుట, ప్రసంగమునన్= ప్రస్తావముచే, అగునుగదా = కలుగునుగదా.

తాత్పర్యము:—బ్రహ్మ చెప్పినయామాట, ఇప్పటిమన ప్రసంగమున జ్ఞప్తికిఁ దగిలినది- నేత్రాదీంద్రియములచే అనుభవింపఁబడిన పదార్థములయొక్క జ్ఞానమును దెల్పునట్టిసంస్కారము (దీనినే వాసన యందురు). దాని ప్రసంగము వచ్చినచో పైకుబుకుట లోకమునఁ గలదుగదా !

అలం:—అర్థాంతరన్యాసము.

వి. :—బ్రహ్మ చెప్పినమాట తొలుదొల్త చెప్పక, యాతనిసృష్టిలోనిదే ప్రభావతి యనునట్లు వర్ణించి చెప్పి, తుదకు ఆమె గౌరీదేవి సృష్టిలోని దని బ్రహ్మ పలుకుగాఁ జెప్పుట యుచితము కా దను

కొంచుపేమో, ఇప్పుడు ప్రభావతి సృష్టిప్రసంగము వచ్చినది కాన మాటమాటవెంబడిని బ్రహ్మమాట స్మృతికి వచ్చి యిప్పుడు చెప్పితిని. లోకమున నేత్రాదింద్రియములచే ననుభవింపబడిన పదార్థముల యొక్క జ్ఞాన మాత్మయందు స్థిరముగా వాసనారూపమున నుండును. దానినే సంస్కారము అనియందురు. అయ్యది పూర్వానుభవమును గూర్చిన ప్రసంగము వచ్చినచో బయల్పడుట సహజముగదా - అని "ఆకాంక్షితసుపూర్తి" కవితాలక్షణముగాఁ జెప్పిన తనవాక్యమునకు సరిపడునట్లు కవి సంఘటించి ప్రౌఢి నెఱపినాఁడు.

మ. దనుజేంద్రాంగన కంబికావరమహా త్త్వస్ఫూర్తి నాలోకమో
హన జన్మించుట వింటి, వెండియుఁ దదంగాలౌకిక శ్రీప్రవ
ర్తన మూహించిన నట్ల రెంటికిఁ గడున్ దార్కాణ మయ్యెన్ మనం
బున కిట్లిప్పుడు సంస్మృతం బయిన యంభోజాతజాతోక్తియున్. 101

అర్థము:—దనుజేంద్రాంగనకున్ = రాక్షసరాజగు వజ్రనాభునిభార్యకు, అంబికా...స్ఫూర్తిన్ - అంబికా = పార్వతీదేవియొక్క, వర = వరముయొక్క, మహత్వస్ఫూర్తిన్ = గొప్పదనముచే, ఆ లోక మోహన = జగత్తునుమోహింపఁజేయు నా ప్రభావతి, జన్మించుట = పుట్టుట, వింటిన్ = వినియున్నాను, వెండియున్ = పిమ్మట, తదం ... వర్తనము - తత్ = ఆమెయొక్క, అంగ = శరీరముయొక్క, అలౌకిక = లోక సంబంధము కానిది (లోకోత్తరమగు) అగు, శ్రీ = శోభయొక్క, ప్రవర్తనము = ప్రసరణమును, ఊహించినన్=ఆలోచింపఁగా, అట్లు + అ =అరీతిగానే (సరిగా అని భావము) - రెంటికిన్ = గౌరీవరమునఁ బుట్టినదని వినుటకును, ఆమె లోకోత్తర సౌందర్యమునకును, మనంబునక్=మనస్సునందు, ఇట్లు, ఇప్పుడు, సంస్మృతంబు + అయిన = జ్ఞప్తికి వచ్చిన, అంభోజాత = తామరపూవునందు, జాత = పుట్టిన, బ్రహ్మయొక్క, ఉక్తియుఙ్ = మాటగూడ, తార్కాణము = ప్రమాణము, అయ్యెన్ = అయినది.

తాత్పర్యము:—లోకము నెల్ల మోహింపఁజేయు నా ప్రభావతి గౌరీదేవివరమున వజ్రనాభుని భార్యకు జన్మించిన దని వినియుంటిని. అనంతర మామె లోకోత్తర మగు సౌందర్యమును జూచితిని. అట్లు విన్నదానికిని, చూచినదానికిని, ఇప్పుడు మనస్సునకు జ్ఞప్తికిఁ దెచ్చిన బ్రహ్మయొక్క మాట కూడ సరిగా సరిపడినది.

వి. :—శుచిముఖి తొలుతనే బ్రహ్మ యిట్లు చెప్పెనని చెప్పక, ప్రద్యుమ్నుని జూడఁగనే ప్రభావతి విషయము స్ఫురించినట్లును, ఆమె సౌందర్యమును వర్ణించుటలో ఆమె బ్రహ్మసృష్టిలోనిది కాక గౌరీదేవి సృజించిన లోకోత్తరసౌందర్యము గలదని చెప్పినట్లును, ఆమాట యప్రమాణ మనుకొనకుండ బ్రహ్మయే యట్లు పలికె నని చెప్పుటయును, నెంతయు నౌచిత్యాధాయకమును, మనుజస్వభావ సూచకమునై యున్నవి.

క. వినుము ప్రభావతి యన న,వ్వనితామణినామ మర్థవంత మ్మగుచున్
దనరారుచుండు నినయం,బును యదుకుల కలశజలధిపూర్ణశశాంకా. 102

అర్థము:— యదు...శశాంకా, - యదుకుల = యదు వను చంద్రవంశరాజుయొక్క వంశము - యాదవవంశము, అనెడు, కలశజలధి = (కుండగా నైనసముద్రము) పాలసముద్రమునకు, పూర్ణ = నిండగు, శశాంకా = (కుందేలు చిహ్నముగాఁగల) చంద్రుఁడా ! - (యాదవవంశ మను పాలసముద్రమునకు నిండు చంద్రుఁడైన వాఁడు, అనగా నాతని జననముచే నా యదువంశము పొంగుచున్న దని భావము) వినుము, ప్రభావతి = కాంతిగలది, అనన్, అవ్వనితామణి నామము = స్త్రీలలో శ్రేష్ఠురాలగు నామె

పేరు, అర్థవంతమ్ము = (వట్టి సంజ్ఞాపరము గాక, ప్రభ గలది యను) అర్థము గలది, అగుచున్, అన యంబున్ = అత్యంతమును, తనరారుచునుండును = ఒప్పుచుండును.

తాత్పర్యము:—యదువంశోద్దీపకుఁడ వగు నో ప్రద్యుమ్నుఁడా! ఆ కన్య పేరు ప్రభావతి. అది సంజ్ఞాపరము గాక, అధికకాంతిగలది యని సార్థక మగు పేరు సుమా.

వి. :—ఇంతకుముందు 'అద్దనుజకన్యక' యని మాత్రమే పలికినది కాని పేరెచటనుగూడ జెప్పక, ఆమె సౌందర్యము, జననాదికము, నెల్లను వర్ణించి, ప్రద్యుమ్నున కామె పేరు విన నుత్కంఠ కలిగించి తుదకుఁ జెప్పినట్లు గ్రహింప నగును.

గీ. ఆప్రభావతి తనకలఁ నగజ వచ్చి, వ్రాసి దయనిచ్చె నని యొకరమ్యపురుషుఁ
జిత్రఫలకాభిలిఖితు నెచ్చెలియుఁ దాను, గరము వేడుకఁ జూడ నేఁగంటి ననఘ.

అర్థము:—అనఘ = పాపరహితుఁడా! ఆ ప్రభావతి, తనకలన్ = తన స్వప్నమునందు, నగజ = పర్వతపుత్రి యగుగౌరి, వచ్చి = కనఁబడి, దయన్ = దయతో, వ్రాసి = చిత్రించి, ఇచ్చెన్, అని, చిత్రఫలకాభిలిఖితున్ = చిత్రఫలకమునందు వ్రాయఁబడిన, ఒక రమ్యపురుషున్ = ఒక చక్కనిపురుషుని, తాను, నెచ్చెలియున్ = చెలికత్తెయును, కరము = అత్యంతము, వేడుకన్ = ఉత్కంఠతో, చూడఁన్ = చూచుచుండఁగా, నేన్ = నేను, కంటిని = చూచితిని.

తాత్పర్యము:—తనకలలో గౌరీదేవి కనఁబడి, దయతో చిత్రించి యిచ్చె నని ఆ ప్రభావతి పలుకుచు, చిత్రఫలకమున వ్రాయఁబడిన యొకసుందరపురుషుని యాకారమును తానును, తనచెలికత్తెయు వేడ్కతో చూచుచుండఁగా నేను చూచితిని.

క. ఆకన్నప్రతిమసుద్దులు, మాకు మునుపు కలిమిఁ జేసి మహనీయ తదీ
యాకృతి పొలు పంతయు భవ,దాకృతిఁ గని యతఁ డితండె యనుకొంటి మొగిన్.

అర్థము:—ఆకన్నప్రతిమసుద్దులు = అట్లు నేను చూచినబొమ్మయొక్క మాటలు, మాకున్ = (మాలో) మాకు, మునుపు = ఇంతకు ముందు, కలిమిఁజేసి = కలుగుటచేత, మహనీయ = పూజింపఁదగిన, తదీయ = ఆపురుషుని సంబంధమగు, ఆకృతి = రూపముయొక్క, పొలుపు = సొగసు, అంతయున్, భవదాకృతిన్ = నీయొక్క రూపమునందు, కని = చూచి, అతఁడు = ఆచిత్తరువునందలి పురుషుఁడు, ఇతండ+అ = ఇతఁడే, అని, ఒగిన్ = క్రమముగా, అనుకొంటిమి.

వ్యా. వి. :—కనిన - కన్న - సూ. పద్యాదుల నవర్ణకంబున కత్వంబును, దుదిహల్లునకు ద్విత్వంబును విభాష నగు - బాల. క్రియా. 51-(సం. సూక్తి. తె. సుద్ది.) కలిమిఁజేసి - సూ. కొన్నియెడలఁ జేత విభక్త్యర్థక వర్ణకంబునకును, వలన వర్ణకంబునకుం దఱచుగఁ జేసి యనుప్రయుక్తం బగు. ప్రౌఢ. కారక. 4. "ఒగిన్" అనునది యీపద్యమందు వాక్యాలంకారమేని కావచ్చును.

వ. అని పలికి మాకు నిక్కడ మిక్కిలిం దడయుట యుచితంబుగాదు పోయి వచ్చెద
మనుప నవధరించితె యనుచుం దోడియంచలుం దాను నప్పలుఁగుచెలువ
యుప్పరవీథి కెగసె, నప్పు డమ్మరాళంబు లరాళంబులు గాక యాకాశభాగంబున
గమనవేగంబునం దీఁగ సాఁగినబాగు మెఱయు నిజగరుత్కనకరేఖామయూఖంబు
లాఖండలాశాదిక్కునకు నక్కజంపుఁ జెలిమిం గొనలువాఱ యుద్దీపించు ప్రద్యుమ్న

ప్రతాపవైభవంబునుం బోలెఁ జాల నాలోకనీయంబు లగుచుండఁ, దత్పురస్సర తదీయకీర్తిమూర్తి విశేషంబులో యనఁ సోయగంబున మీఱి గగన మంతయుఁ గబళించుటకు నొక్కకడకు నొత్తుకొని పోవ బారలు చాచిన చందంబున నిష్పంద ప్రసారితంబులైన తనూరుహంబులతోడఁ జూడ నొప్పారుచు, నప్పటప్పటికి నవిరళ ధవళిమస్పష్ట నుభయపార్శ్వభాగ పాండురబలాహకంబుల నహంకృతిపెక్కువ నొక్కపెట్టఁ గలహించుటకుం బిలుచుభంగి సంఘటిల్ల నుల్లసిల్లు పక్షయుగళవిక్షేప వ్యాపారంబులచేత, సముద్యోగించుచు నొక్కయెడఁ బ్రడీనోడ్డీన సండీన యానభేద వినోదంబు లాచరించి రోదోంతరం బంతయు నెంతయుం గలయ మలయు తమ యమలంపుఁ దెలిదళుకుఁ జిలికి యది మలయజంపుఁ గలయంపి చెలువు సలరింప, నంతఁ గుందనంపు రంగవల్లికామతల్లికల యుల్లాసంబు వెల్లిగొలుపు గరుదంత కాంతిపూరంబులచేత నతిశయిల్లుచు, నొక్కొక్కచోట నొండొంటిసందున సంచర్య మాణంబులగు నభోవిభాగంబులవలన నస్తోక భాసిసంభవా సంభేద సంభృత శబలతా విలాసభాసుర సురాపగాప్రవాహ సందేహ కందళనంబులకు ననుగుణం బయిన పరుస్తున నిడుపౌఁజులు గట్టి, యిట్టట్టు చెదరక చదల నడచుచు, వజ్రపురంబు చేరి తోఁటయట్లు సకల జలాశయంబుల విహరించు చుండె, నందు శుచిముఖి కన్యాంతః పుర సరోవిహార సమయంబుల. 105

అర్థము:—అని, పలికి, మాకున్, ఇక్కడన్, మిక్కిలి = అధికముగా, తడయుట = ఆలసించుట, ఉచితంబు = తగినది, కాదు, పోయి వచ్చెదము = (ఇది జాతీయము) వెళ్లుదుము, అనుపన్ = పంపుటకు, అవధరించితి + ఏ = తలఁచితివా, (పంపుట కనుమతింపుము అని భావము.) అనుచున్, ఆ + పులుఁగు చెలువ = ఆయాఁడుపక్షి, శుచిముఖి, తోడి యంచలున్ = తనతో వచ్చిన హంసలును, తానును, ఉప్పర వీథికిన్ = ఆకాశ మార్గమునకు, ఎగసెన్ ఎగిరెను, అప్పుడు, అమ్మరాళంబులు = ఆహంసలు, అరాళంబులు = వక్రంబులు, కాక — సూటిగా ప్రసరించునవై (ఇది మయూఖములకు విశేషణము.) గమనవేగంబునన్=నడక యందలి - అనఁగా ఎగురుచు వెళ్లుటయందలి వేగముచేత, తీఁగ సాగిన బాగు = తీఁగ ప్రాఁకిన విధము, మెఱయు=ప్రకాశించునట్టి - నిజ ... మయూఖంబులు - నిజ = తమ యొక్క, గరుత్ = ఱెక్కల యందలి, కనక రేఖా = బంగరు రేఖల యొక్క, మయూఖంబులు = కిరణములు - కాంతులు—అట్లు చెప్పి శుచిముఖి ప్రద్యుమ్నునియొద్ద సెలవుగైకొని తోడియంచలతో వినువీథి కెగసెను. ఆ మరాళముల విప్పిన ఱెక్కల తుద నున్న బంగరు రేఖల కాంతు లట్లుండెనో యుత్ప్రేక్షింపఁబడు చున్నవి. ఆఖండలారి దిక్కునకున్ = వజ్రనాభుని పురము వైపునకు (ఆఖండల = కొండల ఱెక్కల నఱకిన యింద్రునకు, అరి = శత్రువు - వజ్రనాభుఁడు.) అక్కజంపు టెలమిన్ = (అక్కజము + ఎలమిన్) అక్షయ మగు వికాసముతో-(అక్షయశబ్ద భవము అక్కజము.) కొనలు వాఱి = వ్యాపించి, ఉద్దీపించు = జ్వలించుచున్న, ప్రద్యుమ్న ... వైభవంబునుంబోలెన్ - ప్రద్యుమ్న = ప్రద్యుమ్నునియొక్క, ప్రతాప = శౌర్యమునయొక్క, వైభవంబునుం బోలెన్ = అతిశయమువలె, చాలన్ = అధికముగా, ఆలోకనీయంబులు = చూడదగినవి — అగుచుండన్, హంసఱెక్కలతుదఁ గల బంగారురేఖల కాంతులు చూడఁగా వజ్రనాభుని పురమువైపు వ్యాపింప సాగుచున్న ప్రద్యుమ్నుని ధగధగ మెఱయు ప్రతాప మాలికలా యనున ట్లుండెనని యుత్ప్రేక్ష. తత్పుర ... విశేషంబులో - తత్ = ఆ ప్రద్యుమ్నుని ప్రతాపమునకు, పురస్సర = ముందు నడచుచున్న, తదీయ = అతని సంబంధ

మగు, కీర్తి = యశస్సుయొక్క, మూర్తివిశేషంబులలో = శరీరభేదములలో, అనన్ = అనునట్లు, (హంసలు) సోయగంబునన్ = చక్కఁదనముచే, మీఱి = అతిశయించి, ఆ ప్రద్యుమ్నుని ప్రతాపముకంటె ముందుగా నేఁగుచున్న యాతని స్వచ్ఛమగు కీర్తిస్వరూపములో యనునట్లు హంసలు పఱచుచుండె నని యింకొక యుత్ప్రేక్ష. ఆ హంసలు, గగనమండలియున్ = ఆకాశము నంతను, కబళింపుటకున్ = మ్రింగుటకై, ఒక్కకడకున్ = ఒకవైపునకు, ఒత్తుకొని, పోవన్ = ప్రోగుచేసికొని పోవుటకు, బారలు చాచిన చందంబునన్ = బారలు (వ్యామములు) చాపిన విధమున, నిష్పంద ప్రసారితంబులు = కదలకుండఁగ జాపఁబడినవి, ఐనతనూరుహంబులతోడన్ = అయినట్టి ఱెక్కలతో, తనూరుహము - (నానా - శరీరమునఁ బుట్టినది. 1 వెండ్రుక, 2 (పక్షి) ఱెక్క.) అప్పటప్పటికిన్ = అప్పటికప్పుడు, అవిరళ...స్పర్ధన్ - అవిరళ = ఎక్కువైన, ధవళిమ = తెల్లదనము విషయమునఁ గలిగిన, స్పర్ధన్ = పోటిచేత, ఉభయ... పాకంబులన్ - ఉభయ పార్శ్వభాగ = రెండు ప్రక్కల నుండెడు, పాండుర = తెల్లని, బలాహకంబులన్ = మేఘములను, అహంకృతి పెక్కసన్ = గర్వముయొక్క యతిశయముచేత, ఒక్కపెట్టు + అ = ఒక్కమాఱుగా, కలహించుటకున్ = పోరాడుటకు, పిలుచుభంగి = పిలుచునట్టి విధము, సంఘటిల్లన్ = కలుగునట్లు, ఉల్లసిల్లు = ఒప్పునట్టి పక్ష...చేతన్ - పక్షయుగళ = ఱెక్కల జంటలయొక్క, విక్షేప=చిమ్ముట (లేక ఆడించుట) అను, వ్యాపారంబులచేతన్ = క్రియలచేత, ఉద్యోగించుచున్ = కయ్యమునకు పిలువ యత్నించుచు - హంసలు ఱెక్కలను చిమ్ముట (ఆడించుట) యెట్లుండెనన-లమ కిరుప్రక్కల గోచరించు వెలిమబ్బులను తెల్లఁదనము విషయమై పోటీచేసి కయ్యమునకు రం డని యామబ్బులను పిలుచున ట్లుండెను, ఒక్కొక్కయెడన్ = (ఎగిరిపోవుచు) ఒక్కొక్కప్పుడు, ప్రడీనో... వినోదంబులన్ - ప్రడీన = వేగముగా నెగురుట, ఉత్ + డీన - ఉడ్డీన = మీఁది కెగురుట, సండీన= ఒండొంటితోఁ గలసి చెట్టుమొదలగువాని మీఁది కెగురుట, (అనెడి) యానభేద = (పక్షి) నడకలయొక్క భేదములచే నైన, వినోదంబులన్ = వేడుకలచేత, రోదోంతరంబు - (రోదః + అంతరంబు) భూమ్యాకాశముల నడిమితావును, అంతయున్ = సర్వమును, ఎంతయున్ = అత్యంతము, కలయన్ = ఏకమగునట్లు, మలయు = వ్యాపించునట్టి, తమ యమలంపుఁ జెలివకున్ = తమయొక్క మలినలేశమును లేని తెల్లనికాంతిని, చిలికి = చల్లి, అది = ఆ తెల్లనికాంతి, మలయజము + కలయంపి + చెలువున్ = మంచిగందపు నీటి కలాఁపిసొగసును, అలవరింపన్ = కలిగింపఁగా, అందున్ = ఆకలాఁపి చల్లిన తావులందు, కుందనము + రంగవల్లికా - కుందనంపురంగవల్లికా + మతల్లికల = శ్రేష్ఠమగు బంగారముతో (రచింపఁబడిన) ప్రశస్తమగు ముగ్గులయొక్క, ఉల్లాసంబు = అందమును, వెల్లిగొల్పు = ప్రవహింపఁజేయునట్టి, గరుదంత ... వల్లరులచేన్ - గరుత్ = ఱెక్కలయొక్క, అంత - కొనలయొక్క, కాంతివల్లరులచేన్ = తీఁగలవంటి తళుకులచేత, అతిశయిల్లుచున్ = విజృంభించుచు - ఒక్కొక్కవేళ వేగముగా నెగురుట, మీఁది కెగురుట, గుంపుగా ఎగురుట మున్నగు చిత్రమగు గమనములతో భూమ్యాకాశముల నేకము చేయునట్లు వ్యాపించు నాహంసల నికర మైన తెలుపు - దెసల వ్యాపించి, మంచిగంధపునీటితోఁ జల్లిన కలాఁపివలె నుండ దానియందు పెట్టిన కుందనపురంగవల్లులవలె ఱెక్కల తుదినుండు బంగరురేఖల తళుకు లొప్పుచుండె నని భావము - ఒండొంటి సందునన్ = బారులుగా నెగురుచున్న హంసలయొక్కనడిమితావులందు, సందర్శనీయంబులు = చూడఁ దగినవి, అగు నభోవిభాగంబులన్=ఆకాశపు భాగములచేత, అస్థాన ... నంబులకున్, అస్థాన=వేఱుచోట, (యమున ప్రయాగ క్షేత్రముననే గంగతో కలియును, వేఱుచో టనఁగా నాప్రయాగ గాక తదితరస్థలమందు అని భావము.) ఇచట - న + స్థాన - అనుదానిలోని నఞ్ఞునకు-తద్భిన్నత్వము - అనశ్వము అనినట్లు అర్థము. భానుసంభవా = (సూర్యునివలన బుట్టినది యగు) యమునానదియొక్క, సంభేద=సంగమము (కూడిక) చేత, సంభృత=సంపాదింపఁబడిన, శబలతా=చిత్రవర్ణముయొక్క, విలాస=సొగసుచేత, భాసుర = ప్రకాశించుచున్న, సుర + ఆపగా=దేవతానదియగు గంగయొక్క, ప్రవాహ=వెల్లువ యనెడి, సందేహ=సంశయముయొక్క, కందళనంబులకున్=మొలక లెత్తుటలకు, - సంశయము కలుగుటలకు అని యర్థము, అనుగుణంబు= తగినది, యగు, పరపునన్ = విరివితో, నిడుపాఁజాలు - నిడుద + పాఁజాలు - పొడుగైన బారులు,

కట్టి = తీరి, ఇట్లు + అట్లు = ఈ వంకకు, ఆవంకకు, చెదరక, - సూటిగా నని భావము. చదలన్ = ఆకసమున, నడచుచున్ = ఎగిరిపోవుచు - బారులు తీరి యాకసమున నెగిరి వెళ్లుచున్న యాహంసల నడిమి యవకాశములనుండి నల్లగా నాకాశభాగములు గోచరించి, ప్రయాగేతరస్థలమున గంగాయమునాసంగమము కలిగెనా యని సందేహమును కలిగించుచుండె నని భావము అలం. అభూతోపమ. అని దండి - ఉత్ప్రేక్షా ధ్వని యని నవీనులు. సందేహాలంకారము. 'వజ్రపురంబు, చేరి, తొంటియట్లు + అ=మునుపటివలెనే, సకల జలాశయంబులన్=ఎల్ల నీటిపట్టులందును, విహరించుచున్, ఉండెను, అందున్=ఆహంసలలో, శుచిముఖి, కన్యా ... సమయంబులన్ - కన్యా = రాజకన్య యగు ప్రభావతియొక్క, అంతఃపుర = అంతిపురమందలి, సరః = కొలనియందు, విహార = సంచరించు, సమయంబులన్ = వేళలయందు - (లేదా - కన్యకలయొక్క, అంతఃపుర = నగళ్లయందు (జరుగు) సరోవిహార = కొలఁకులందలి జలక్రీడల కగు, సమయంబులన్ = వేళలందు - అని యైనను చెప్పవచ్చును.)

వి. :—ఇందు హంస లాకసమున నెగురుటలోని వైశిష్ట్యము క్రమము తప్పక వర్ణించుటయే కాక, ప్రకృతమగు ప్రద్యుమ్నవిషయ మనుసంధింపఁబడుచుఁ జక్కఁగ సుత్ప్రేక్షింపఁబడినది.

శుచిముఖి కన్యకలు జలక్రీడ యొనర్చుసమయంబుల నీక్రిందివిధమున వారితో పరిచయము కలిగించుకొనుట.

సీ. జలఖేలదంగనా । కలకలంబులకు మిక్కిలి దవ్వు వాఱక । నిలిచి నిలిచి
పడఁతు లొక్క రొకళ్ళ । పై జల్లు జలబిందు,లొడలు సోఁకినఁ బోక । యోర్చి యోర్చి
యోలలాటలతమి । నొండొరుఁ దఱుము చెల్వల ధాటి కులుకక । మెలఁగి మెలఁగి,
లీలావతీహస్త । లీలాబ్జకేసరం,బులకును బసిగొంచు । మలసి మలసి
క్రమముతోడ దనుజ । కన్యకాంతఃపుర, కాంతలకును బెదర । కింత నంతఁ
జేరికలఁ జరించు । టారూఢిగా నల,వాటు చేసికొనియెఁ । బాటవమున. 106

అర్థము:—జల...కలకంబులకున్ - జల = నీటియందు, ఖేలత్ = క్రీడించుచున్న, అంగనా = స్త్రీలయొక్క, కలకలంబులకును = పెద్దధ్వనులకు, కోలాహలములకు, మిక్కిలి = మిగుల, దవ్వు = దూరముగా, వాఱక = పరుగెత్తక, నిలిచి నిలిచి = ఆఁగి యుండియు, పడఁతులు = స్త్రీలు, ఒక్కరు = కొందఱు, ఒకళ్లపైన్ = కొందఱిమీఁద, చల్లుజలబిందులు = చల్లుకొనునీటిబొట్లు, ఒడలు = శరీరమును, సోఁకినన్ = తాఁకినప్పటికిని - శరీరముమీఁదపడినను, పోక = తొలఁగక, ఓర్చి యోర్చి = పలుమాఱు సహించియు, ఓలలాటలతమిన్ = ఓల ఓల యనుచు నీటియందుమునుఁగుచు, నీఁదుచు నాడునాటలయందలి వేడుకచేత, ఒండొరున్ = ఒకరినొకరు, తఱుము చెల్వల = తఱుముచున్నట్టి స్త్రీలయొక్క, ధాటికిన్ = విజృంభణమునకు, పెలరేఁగుటకు, ఉలుకక = భయపడక, మెలఁగి మెలఁగి = (వారినడుమనే) అత్యంతము చరించియు, లీలా...రంబులకున్, లీలావతీ = విలాసవతులగు నింతులయొక్క, హస్త = చేతులందలి, లీలాబ్జ = విలాసార్థమైన పద్మములందలి, కేసరంబులకును = కింజల్కములకు - (దారములవంటి పదార్థములకు), పసిగొంచున్ = వాసనచూచుచు, మలసి మలసి = పెనఁగి పెనఁగి, క్రమముతోడన్, దనుజకన్యకాంతఃపురకాంతలకును = రాక్షసుని కూఁతు రగు ప్రభావతియొక్క యంతఃపురమం దుండు స్త్రీలకు, బెదరక, పాటవమునన్ = నేర్పుచేత, ఇంతనంతన్ = కొలఁదిపాటి దూరమున, చేరికలన్ = చేరుటలయందు, ఆరూఢిగాన్ = దృఢముగా, - బాగుగా, అలవాటు, చేసికొనియెన్.

తాత్పర్యము:—శుచిముఖి సరోవరజలమందు క్రీడించుచున్న స్త్రీల పెద్దరొదలకు ఎక్కువ దూరము నకు పరుగెత్తక, నిలుచుచు, స్త్రీ లొకరిపై నొకరు చల్లుకొను నీటిబిందువులు, తన యొడలిపైఁ బడినను, నోర్చుచు, ఓలలాటలోని వేడుకచే నొకరి నొకరు తఱుము విజృంభణమునకు భీతిల్లక తిరుగుచు, సొగసు కత్తెల చేతులందలి విలాస పద్మములందలి కేసరములు వాసనచూచి విడువక తిరుగుచు, ఇట్లు క్రమముగా

ప్రద్యుమ్నుఁ డాయా యుపమాన ధర్మములను మననము చేసిచేసి, క్రమముగా ప్రభావతివాస్తవ మైన రూపము కనఁబడఁగా - దానియందే మనస్సు నిల్పుకొనెను.

ఆత్మజ్ఞానమునకు సాధనచతుష్టయమును శ్రవణాదిత్రితయమును అంతరంగసాధనము లగుటలో విశేషము లేకున్నను, శ్రవణాదిత్రితయము సాక్షాత్సాధనము అని, బ్రహ్మవిద్యాదీపికయం దిట్లు కలదు. "ఆత్మజ్ఞానం ప్రతి సాధనచతుష్టయస్య శ్రవణాదిత్రితయస్యచ అంతరంగసాధనత్వావిశేషేపి, శ్రవణాదిత్రితయస్య సాక్షాత్సాధనత్వా త్పృథ గ్విచారణీయత్వం." అని. శ్రవణ, మనన, నిధిధ్యాసములు శ్రవణాదిత్రితయము అని వేదాంతిమతము.

సీ. కనఁ డొద్ద నున్నవారిని వీరు వా రని, కనినఁ దదర్హవర్తనలు మఱచు
వినఁడు చెప్పినపల్కె వేమఱుఁ జెప్పక, వినిన నే మే మంటి రనుచు నడుగుఁ
జనఁ డెత్తులిడక మజ్జనముఖ్యవిధులకు, జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు
కొనఁడు నానాసేవకుల సేవ లెవ్వియుఁ, గొనిన వీడ్వాటుగాఁ బనులు పనుచు
శుచిముఖీవాక్యదర్పణస్ఫురిత నిరుపమాన దనుజేంద్రకన్యకామణి మనోజ్ఞ
రూపరేఖావిలాస సంరూఢ మైన, యాత్మ మరలింపనేరక హరిసుతుండు. 109

అర్థము:—హరిసుతుండు = కృష్ణునికొడుకగు ప్రద్యుమ్నుఁడు, శుచిముఖీ...సంరూఢము - శుచిముఖీ = హంసియొక్క, వాక్య = పలుకులనెడి, దర్పణ = అద్దమునందు, స్ఫురిత = ప్రకాశించినట్టియు (ప్రతిబింబించినట్టియు) - నిరుపమాన = సాటిలేని, దనుజేంద్రకన్యకామణి = రాక్షసరాజగు వజ్రనాభుని పుత్రికారత్న మగు ప్రభావతియొక్క, మనోజ్ఞ = అందమైన, రూప = ఆకారమునందును, రేఖా = రేకలయందును, విలాస = శృంగార చేష్టలయందును, సంరూఢము = చిక్కుకొన్నది, ఐన యాత్మను = అయినట్టి మనస్సును, మరలింపనేరక = త్రిప్పుకొనఁజాలక, ఒద్దన్ = సమీపమునందు, ఉన్న వారిని, కనఁడు = చూడఁడు, కనినన్ = చూచినను, వీరు, వారు, అని = వీరిట్టివారు, వారట్టివారు, అని విచారించి, తత్ = వారియెడ, అర్హ = తగినట్టి, వర్తనలు = నడవడులను, మఱచున్ = మఱచి పోవును, చెప్పినపల్కు + ఎ, వేమఱున్ (వేయి+మాఱులు) పెక్కుసారులు, చెప్పక, వినఁడు, వినినను, ఏమి+ఏమి, అంటిరి = అన్నారు, అనుచున్, అడుగున్, - మజ్జనముఖ్య విధులకున్ = స్నానము మొదలగు కృత్యములకు, ఎత్తులిడక = ప్రోత్సాహపెట్టకుండ, చనఁడు = వెళ్లఁడు, చనినన్ = వెళ్లినప్పటికిని, క్రియలు = ఆ స్నానాది కృత్యములను, తబ్బిబ్బుగాన్ = తడఁబాటుగా, చలుపున్ = చేయును, నానాసేవకుల=ఎల్లసేవకుల యొక్కయు, సేవలు=ఉపచారములు, ఎవ్వియును, కొనఁడు=అంగీకరింపఁడు, కొనినన్ = అంగీకరించినను, వీడ్వాటుగాన్ = వ్యత్యాసముగా, తాఱుమాఱుగా, పనులు = ఆజ్ఞలను, పనుచున్ = నియమించును.

తాత్పర్యము:—అద్దమునందుఁ బ్రతిబింబమువలె శుచిముఖియొక్క వాక్యములందు సరిగాఁ బ్రతిబింబించిన ప్రభావతియొక్క మనోహర మైనరూపరేఖావిలాసములందు లగ్నమై చలింపని మనస్సు గలవాఁ డగుటచే ప్రద్యుమ్నుఁడు చెంగట నున్నవానిని చూడఁడు. చూచినను వీ 'రట్టివా'రని తెలిసికొని వారియెడఁ దగినట్లు ప్రవర్తింప మఱచిపోవును. పెక్కుమాఱులు చెప్పక యేమాటయు వినఁడు, వినినను ఏమి టేమిటి యంటిరి యని యడుగును. స్నానాది నిత్యకృత్యములను దగ్గఱనున్నవారు ప్రోత్సహింపనిదే చేయఁడు. చేసినను ముందుది వెనుకను, వెనుకటిది ముందును చేయును. పెక్కురు సేవకులు చేరి యుపచారము లొనర్చుచున్నను గైకొనఁడు, కొనినను తాఱుమాఱుగా వారికిఁ బనులను నియమించును.

అలం:—స్వభావోక్తి, రూపకము.

వి. :—శుచిముఖివాక్యములందుఁ బ్రతిబింబించిన ప్రభావతిరూపము దర్పణప్రతిబింబమువలె నుండెను - అనుటవలన హెచ్చుతగ్గులు లేక తెలియఁ జెప్పిన నేర్పరి శుచిముఖి యని ధ్వనించుచున్నది. ప్రత్యక్షముగా చూడకున్నను బుద్ధివిశేషముచేఁ బ్రభావతిరూపము యథాస్థితముగా గ్రహించి మనస్సున ధరించుటచేత ప్రద్యుమ్నునకు చక్షుఃప్రీతి యను మన్మథావస్థ కలుగుటయు స్ఫురించుచున్నది.

వ్యా. :—వేయి + మాఱులు - ద్విగువు కావున నేకవచన మగుటయే కాక, సూ. ఆచ్ఛికసమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవైకల్పికములుగాఁ జెప్పఁబడియెడి. ప్రౌఢ. సమాస. 31 చే - "వేయి లోని 'యి' వర్ణమునకు లోపమును, మాఱు" లోనిదీర్ఘమునకు హ్రస్వమును రాఁగా "వేమఱు" అనురూపము సిద్ధించినది. ఇట్లే 105 పద్యములోని 'పలుమఱు' అనునది యును - "పలు + మాఱులు = పలుమఱు" అయినది.

ఉ. ఉద్యదపేక్షఁ బక్షివనితోక్తులవెంబడిఁ జంచరీక చం
ద్రాద్యుపమానశోభకు సహస్రగుణంబుగ హెచ్చఁ గేశవ
క్త్రాద్యఖిలాంగలక్ష్మి మదికందిన యంతయునున్ నయించి, యా
హృద్యతరాంగిమూర్తి సొబ గెల్ల నొకింతగఁ జూచు నాత్మలోన్. 109

అర్థము:—(ప్రద్యుమ్నుఁడు కర్త) పక్షివనితోక్తులవెంబడిన్ = హంసయొక్కమాటల వెంటను, అనఁగా శుచిముఖిచెప్పిన మాటల ననుసరించి, ఉద్యదపేక్షన్ = ఉదయించుచున్న (కలుగుచున్న) కోర్కెచేత, చంచరీక ... శోభకున్ - చంచరీక = తుమ్మెదలు, చంద్ర=చంద్రుఁడు, ఆది = మొదలుగాఁగల, ఉపమాన = పోలికగాఁ జెప్పఁబడిన వస్తువులయొక్క, శోభకున్ = చక్కఁదనమునకు, సహస్రగుణంబుగన్ = వేయిరెట్లు, హెచ్చన్ = అధికమగు నట్లుగా, కేశ ... ... లక్ష్మిన్ - కేశ = జుట్టు, వక్త్ర = ముఖము, ఆది=మొదలుగాఁగల, అఖిల = సమస్తమైన, అంగ=అవయవములయొక్క, లక్ష్మిన్= చక్కఁదనమును, మదికిన్ = మనస్సునకు, అందినయంతయునున్ = అందినట్టి సర్వమును - (మనస్సున కందినంతదాఁకనని భావము.) నయించి = కూర్చి, ఆహృద్య ... సొబగు - ఆ హృద్యతర = మిగుల మనోహరమైన, అంగి = అవయవములుగల యా ప్రభావతియొక్క, మూర్తిసొబగు = శరీరసౌందర్యమును, ఎల్లన్ = అంతయును, ఆత్మలోన్ = మనస్సునందు, ఒకింతగన్ = కొంచెముగ, చూచున్ - చూచును.

తాత్పర్యము :—ప్రద్యుమ్నుఁడు మదిని కోర్కెలు సందడింపఁగా - శుచిముఖి చెప్పినప్రకారము తుమ్మెదలు, చంద్రుఁడు మున్నగు నుపమానవస్తువులసొగసునకు వేయిరెట్లధికమగు సొగసును, ప్రభావతి యొక్కజుట్టు, ముఖము మొదలగు నంగములకు, తనమనసు వెళ్లినంతవఱకుఁ గూర్చి, తనమనస్సునం దా సుందరి దేహసౌందర్యమంతయు, కొంచెముగఁ జూచును. "అసహస్రగుణ సౌభాగ్యంబు లాయంగముల్". అన తాను జెప్పిన యుపమానవస్తువులు హీనములు లని శుచిముఖి చెప్పుటచేత అనుపమానవస్తుశోభకు వేయిరెట్లు శోభఁ గూర్చుకొని ధ్యానింపఁగా కొంచెదాఁక ప్రభావతిరూపు తోఁచిన దని భావము.

చ. మది గొనినంతమేరయును మూన కతం డుపమానకోటి యొ
ప్పిద మఖిలంబు నిట్లు గడుఁ బెక్కుమడుంగులుగాఁ దలంచి త
త్తదవయవత్వసుస్థితికిఁ దార్పఁగ నమ్మదిరాక్షిరూప మె
య్యది యదియే కనంబడియె నచ్చపుబుద్ధికి లేవగమ్యముల్. 110

అర్థము :—అతండు = ఆ ప్రద్యుమ్నుఁడు, మది = తనమనస్సు, కొనినంతమేరయును=గ్రహించినంతవఱకు, ఉపమానకోటి = చంద్రుఁడు మొదలగు నుపమాన వస్తుసముదాయముయొక్క, ఒప్పిదము +

అఖిలంబున్ = చక్కఁదనము నంతయును, మానక = విడువక (ధారావాహికగా) ఇట్లు, పెక్కుమడుంగులుగాన్=ఎన్నియోరెట్లధికముగా, కడున్=మిగుల, తలంచి=తలపోసి, ధ్యానించి, (ఆసొగసంతయును) తత్తత్ = ఆయాయి, అవయవత్వ = ముఖాద్యంగము లగుటయొక్క, సుస్థితికిన్ = మంచియునికికి - (ఆ ప్రభావతియొక్క యవయవ ధర్మములుగా నగునట్లు) తార్పఁగన్ = కూర్పఁగా - ఎయ్యది = ఏది, ఆ + మదిరాక్షీ రూపము = ఆ ప్రభావతి యొక్క యాకారమో, అదియే = ఆ రూపమే, కనంబడియెన్ = గోచరించెను, - అచ్చపు బుద్ధికిన్ = నిర్మలమైన మనస్సునకు, అగమ్యముల్ = తెలియరానివి, లేవు = ఉండవు.

తాత్పర్యము:—హంస చెప్పిన ప్రకార ముపమాన వస్తువుల సొగసునకు వేయిరెట్లు సొగసుచేర్చి చూడఁగా - ఆ ప్రభావతి రూపము రేఖామాత్రముగానే గోచరించిన దని వెనుకఁ జెప్పఁబడెను. ఇప్పుడట్లు గోచరించిన యారూపమునందు మరలమరల నుపమానవస్తువుల సొగసునకు తన మనసు గ్రహింపఁగలిగిననంతవఱకు నెన్నియో రెట్లధికమగు సొగసును జేర్పఁగా, తుదకు ప్రభావతి రూప మేదో సరిగా నదియే ప్రద్యుమ్ననకు మనస్సున గోచరించెను. ఉపమాన కోటియొక్క ధర్మములను సంఘటించిన మాత్రనే యుపమేయము గోచరించునా ? యని సంశయింతురేమో యని పై యర్థము సమర్థింపఁబడుచున్నది. 'లోకములో స్వచ్ఛమైన బుద్ధి గలవారికిఁ దెలియరానివి యుండవు గదా' అని-దీని వలన ప్రద్యుమ్నుఁడు నిర్మలమగు బుద్ధిగలవాఁ డనియు, కావుననే హంసిపలుకుల ప్రకారము వేయి రెట్లధికముగా నుపమానకోటి యొక్క సొగసును మననముచేసి, కొంచెముగా గోచరించిన ప్రభావతిరూపమున సరియగు రూపమును చూడఁ గలిగినాఁ డని భావము.

అలం. :—అర్థాంతర న్యాసము.

వి. :— 105-వ పద్యము మొదలీపద్యముదాక నున్న నాల్గింటిలో - కవులు కన్యాంగ సౌందర్యము వర్ణించు సందర్భమున నొక్కొక్క యవయవమును బెక్కుపద్యములతో నేల చెప్పుదురో, ఆ చెప్పుట యుక్తమో యయుక్తమో విమర్శించినట్లు గాకుండ విమర్శింపఁబడి, కవు లట్లు వర్ణించుటలోని యౌచిత్యము లోకమునకుఁ దెలుపఁబడెను. ఎట్లన వినువానికి అచ్చపుబుద్ధి యున్నచో నావర్ణనములందలి రహస్యము తెలియు ననియు, అట్టి బుద్ధిలేని మూర్ఖునకుఁ దెలియ దనియు వ్యంగ్యముగా సూచింపఁబడెను.

సీ. ఆరూపు మదిఁ జాలహత్తించు హత్తించి, యతివ యట్టిది గాకయనుచు మెచ్చు
మెచ్చి కన్గొనుకోర్కి హెచ్చించు హెచ్చించి, యంత మేలెట్లబ్బునసుచు వగచు
వగచి నిట్టూర్పులు నిగిడించు నిగిడించిఁ, దదవలోకము లేనిబ్రతుకు రోయు
రోసి దాని కుపాయ మూసించు నాసించి, కలఁక నేమియు దొరకమికిఁ గుందుఁ
గుంది తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు, విడిచి దరిదాపు లేమిఁ బెన్వేతల మునుఁగు
మునిఁగి యెవ్వరు పిలిచినఁ గినియు మిగుల, హరిసుతుండు ప్రభావతీ విరహవశత. 111

అర్థము:— హరిసుతుఁడు = కృష్ణుని కొడుకగు ప్రద్యుమ్నుఁడు, ప్రభావతీ విరహవశతన్ = ప్రభావతియొక్క యెడఁబాటునకు వశుఁడగుటచేత, ఆ రూపు = ఆ ప్రభావతియొక్క యాకారము, మదిన్ = మనస్సునందు, చాలన్ = అధికముగా, హత్తించున్ = తగులువడఁజేయును, లగ్నమొనర్చును, హత్తించి, అతివ, అట్టిదిగాక=అంతటి చక్కనిదిగదా, అనుచున్, మెచ్చున్, మెచ్చి, కన్గొనుకోర్కిన్ = చూడవలెనను వాంఛను, హెచ్చించున్ = అధికముచేయును, హెచ్చించి, అంతమేలు, ఎట్లు, అబ్బును, అనుచున్, వగచున్ = పరితపించును, వగచి, నిడు+ఊర్పులు = దీర్ఘనిశ్వాసములు, నిగిడించున్ = వెలువరించును, నిగిడించి, తదవలోకము = ఆమెను జూచుట, లేనిబ్రదుకున్, రోయున్=ఏవగించుకొనును

కోసి, దానికిన్ = ఆమెను జూచుటకు, ఉపాయము = వెరవును, ఆసించున్ = అపేక్షించును, ఆసించి, కలఁకన్ = క్షోభముచే, ఏమియున్ = ఏయుపాయమును, దొరకమికిన్ = లభింపకుండుటకు, కుందున్ = చింతిల్లును, కుంది, తలపోఁతలకున్ = (ఏమేమియో) ఆలోచనలకు, మదిన్=మనస్సును, కొల్లవిడుచున్=దోఁచుకొనిచ్చును (అనఁగా ఆలోచనాధీనమనస్కుఁడగు నని భావము.) విడిచి = అట్లుదోఁచుకొననిచ్చి, దరిదాపు=హద్దు, లేమిన్ = లేకపోవుటచేత, వెన్వెతలన్ = మహావ్యథలందు, మునుఁగున్, మునిఁగి, ఎవ్వరు, పిలిచినన్, కినియున్ = కోపించును - ఇత్యాది నిర్వేదము అనెడి సంచారిభావము - మన్మథావస్థలలోని "అరతి" యను నాఱవయవస్థ. వెనుకటిపద్యములలోఁ బ్రత్యక్షముగాఁ జూచుచున్నట్లు హంసి పలుకులవలనఁ బ్రభావతిరూపము మనసున గోచరించుట "దృగవస్థ". పిదప మనస్సంగము, సంకల్పము - తెలియుచునేయున్నవి. జాగరము, కృశత, చెప్పుటకు వ్యవధానములేమి "అరతి" యిందుఁజెప్పఁబడినట్లూహ్యము.

అలం:—కారక దీపకము.

## ఆ శ్వా సాం త ము

శా. ధీమంతుండు పటుప్రతాపనయమైత్రీ నిత్యనమ్రీభవ
త్సామంతుండు సుకీర్తిమౌక్తికమణిస్రగ్భూషి తాశావధూ
సీమంతుండు విపక్షమంత్రిముఖరాజీవ ప్రభోచ్చాటనా
హేమంతుండు నిజస్తవానుకలనాహ్రీమంతుఁ డత్యంతమున్. 112

అర్థము :—ధీమంతుండు = శ్రేష్ఠమగు బుద్ధిగలవాఁడు, పటు ... సామంతుడు, పటు = సమర్థమైన, ప్రతాప = తేజస్సుచేతను (ధనమువలనను దండమువలనను బుట్టుతేజము ప్రతాపము) నయ = నీతిచేతను, మైత్రీ = చెలిమిచేతను, నమ్రీభవత్ = విధేయులగుచున్న, సామంతుండు = సామంతరాజులుగలవాఁడు, (గొప్పదగు ధనసేనాబలములచేతఁ గొందఱుసామంతులను, నీతిచేఁ గొందఱను, మైత్రిచేఁ గొందఱను విధేయుల నొనర్చుకొనినవాఁ డని భావము.) సుకీర్తి...సీమంతుండు - సుకీర్తి = మంచికీర్తి యనెడు, మౌక్తికమణి = ముత్యములయొక్క, స్రక్ = హారములచే, భూషిత = అలంకరింపఁబడిన, 'ఆశావధూ = దిక్కులనెడు స్త్రీలయొక్క, సీమంతుండు = పాపట గలవాఁడు - (అన్నిదెసల నిండినకీర్తి గలవాఁడని భావము.) విపక్ష... హేమంతుండు - విపక్షమంత్రి = శత్రురాజుల మంత్రులయొక్క, ముఖరాజీవ = మోముఁదమ్ములయొక్క, ప్రభా = కాంతియొక్క, ఉచ్చాటనా = తొలఁగించుటయందు, హేమంతుండు = హేమంతఋతువైన వాఁడు, (హేమంతఋతువు తామరపూవుల శోభను నశింపఁజేయునట్లు, ప్రతిపక్షమంత్రుల ముఖములను శోభాహీనముగాఁ జేయు నీతినైపుణిగల వాఁడు అనిభావము) నిజ ... హ్రీమంతుఁడు, నిజ = తనయొక్క, స్తవ = స్తుతియనెడి, అనుకలనా = వ్యాపారమునందు, హ్రీమంతుండు = సిగ్గుగలవాఁడు - (తన గుణములను స్తుతిచేయునపుడు సిగ్గిల్లువాఁ డని భావము.)

క. అబ్బాంబావరుఁ డఖిలకకుబ్బాంధవరమ్యకీర్తికుఁడు నళినీప
త్రాబ్బిందు సమప్రకృతిక్షుబ్బోధమయాత్మతత్త్వకోవిదుఁడు మహిన్. 113

అర్థము:—అబ్బాంబావరుఁడు = అంబమ్మకు భర్త, (అంబమ్మను, అబ్బమ్మ యని పిలిచెడివారు కాఁబోలును.) అఖిల...కీర్తికుఁడు-అఖిల = సమస్తమైన, కకుప్ = దిక్కులకును, బాంధవ=చుట్టమైన, కీర్తికుఁడు=కీర్తిగలవాఁడు. (బహువ్రీహి కావున కప్ప్రత్యయము విభాషగావచ్చును.) నళినీ...కోవిదుఁడు-నళినీపత్త్ర = తామరాకునందలి, అప్+బిందు=నీటిబొట్టుతో, సమ=సమానుఁడును, ప్రకృతి=అజ్ఞానమును, క్షుప్=పోఁగొట్టునట్టి, బోధమయ=జ్ఞానస్వరూపమైన, ఆత్మతత్త్వ=పరమాత్మతత్త్వమునందు, కోవిదుఁడు=

పండితుఁడు - సంసారము నంటక తామరాకుపై నీటిబొట్టువలె నుండువాఁడును, అజ్ఞానమును హరించు జ్ఞానమయమగు నాత్మతత్త్వమున పండితుఁడును, (అని. విశేషణోభయపద కర్మధారయము) లేదా - నళినీపత్రాబ్బిందుసముఁడు - అని పాఠమున్నచో వ్యస్తమై యింతకంటె సొగసుగా నుండును.

తరల. కుముద బంధునిభుండు పింగళి గోకమంత్రియశఃకథా
సముదనల్పసభుండు వైదికశాస్త్ర సింధునిరంతర
ప్రమథనాత్తశుభుండు సంతతభక్తి యుక్తి సమర్చిత
ప్రమథ లోకవిభుండు విత్తనిరంకుశప్రతిభుం డిలన్. 114

అర్థము:—కుముద బంధునిభుండు = (తెల్ల) కలువలకుఁ జుట్టమగు చంద్రునితో సమానుఁడు. (కాంతియందుఁ గావచ్చును. లేక, దానమందుఁగావచ్చును.) పింగళి ... సభుండు - పింగళిగోకమంత్రి = పింగళివంశమునకు మూలపురుషుఁడై గోకనమంత్రి యొక్క, యశః = కీర్తి యొక్క, కథా = కథలచేత, వృత్తాంతములచేత, సముత్ = సంతోషముతోఁ గూడిన, అనల్ప = గొప్పవగు, సభుండు = సభలుగలవాఁడు. గొప్పగొప్ప సభలందు తనవంశమునకు మూలపురుషుఁడగు గోకనామాత్యుని యశస్సును వినిపించి యందలి సభ్యులను సంతోషపెట్టినవాఁడు అనిభావము. ("సమదనల్ప" అను పాఠము దుర్బోధముగానున్నది. పాఠభేదములు చూచి పరిష్కరింపఁదగినది యీ విశేషణము.) వైదిక ... శుభుండు - వైదిక = వేదసమ్మతములగు, శాస్త్ర = శాస్త్రములనెడు, (లేదా - వైదిక = వేదసంబంధమైన, శాస్త్ర = శాసనములు, నియమములనెడు), సింధు = సముద్రముయొక్క, నిరంతర = ఎడతెగని, ప్రమథన = మథించుటచేత, ఆత్త = పొందఁబడిన, శుభుఁడు = క్షేమముగలవాఁడు, (ఎల్లప్పుడు వేదసమ్మతముగా ప్రవర్తించుటచే శుభముల నొందినవాఁ డని భావము), సంతత ... విభుండు - సంతత = ఎల్లప్పుడు, భక్తియుక్తి = భక్తియోగముచే, సమర్చిత = పూజింపఁబడిన, ప్రమథలోకవిభుండు = ప్రమథులను (శివకింకరులను) నాథుఁ డగుశివుఁడు గలవాఁడు (భక్తితో సర్వదా శివునిసేవించువాఁడు అని భావము) - విత్త నిరంకుశప్రతిభుండు = పొందఁబడిన యడ్డులేని ప్రజ్ఞ గలవాఁడు.

## గ ద్య ము

ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యగేయ, సూరయనామధేయ ప్రణీతం బైన ప్రభావతీప్రద్యుమ్నం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



# ప్రభావతీ ప్రద్యుమ్నము

## సవ్యాఖ్యానము

### తృతీయాశ్వాసము

క. శ్రీమద్భక్తివిశేష, స్థేమావిశ్రాంత విహిత శివతత్త్వ కథా
మీమాంసుఁడు పింగళి యమ,రామాత్యవతంసుఁ డపరహంసుఁడు దీప్తిన్. 1

అర్థము:—శ్రీమత్ = శోభాయుక్తమైన, భక్తివిశేష = భక్తియొక్క యాధిక్యముయొక్క, స్థేమ = స్థైర్యముచేత, అవిశ్రాంత = ఎడతెగ కుండునట్లుగా, విహిత = చేయఁబడిన, శివ = శివునియొక్క, తత్త్వ = స్వరూపమునుగూర్చిన, కథా = కథలయొక్క, మీమాంసుఁడు = విచారణ గలవాఁడును, దీప్తిన్ = తేజస్సునందు, అపరహంసుఁడు = రెండవసూర్యుఁడు, ఐన (అమరామాత్యుఁడు).

తాత్పర్యము:— అమరామాత్యుఁడు స్థిరభక్తితో సదాశివతత్త్వము తెలుపు కథలను విచారణ మొనర్చువాఁడు. సూర్యునివంటి తేజశ్శాలి.

వ. హరికుమారుం డొక్కనాఁ డేకాంతవర్తియు హస్తవిన్యస్త గండస్థలుండు నగుచు
నిట్లని తలపోయం దొడంగె. 2

అర్థము:—హరికుమారుండు = ప్రద్యుమ్నుఁడు, ఏకాంతవర్తియు = ఏకాంతమున - రహస్యమున నున్నవాఁడును, హస్త...స్థలుండు = హస్త = చేతియందు, విన్యస్త = ఉంపఁబడిన, గండస్థలుండును = చెక్కిలిగలవాఁడును, అగుచున్, ఇట్లు, (అని, వాక్యాలంకారము)తలపోయన్, తొడంగెన్.

చ. కలుగునొకో కనుంగవకుఁ గాంతఁ గనుంగొను భాగ్య, మెక్కడన్
గలిగెడుఁ, దత్పురంబు చొరఁగల్మియ దొడ్డఁట, చొచ్చి చూడఁగాఁ
గలిగిన నవ్విలాసవతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్చు టెట్లు ? నా
తలఁపుబడిన్ దదాత్మయును దార్కొన కెట్లది సంఘటిల్లెడున్. 3

అర్థము:—కాంతన్ =అందగత్తెయగు ప్రభావతిని, కనుంగొను భాగ్యము=చూచునట్టి యదృష్టము, కనుంగవకున్ =(నా) రెండు కనులకును, కలుగునొకో = కలుగునా ? తత్పురంబు = ఆ వజ్రపురము, చొరన్ + కల్మి + అ = చొరఁగలుగుటయే, దొడ్డు + అఁట = అసాధ్యమఁట, (కాన) ఎక్కడన్ + కలిగెడున్ = ఎక్కడఁ గలుగును ?, (ఒకవేళ) చొచ్చి = ప్రవేశించి, చూడఁగాఁ గలిగినన్ = చూడఁ గలిగినయెడల, ఆ + విలాసవతిన్ = ఆ యొయ్యారిని, కౌఁగిటన్, చేర్పక, ఓర్చుట = సహించుట, ఎట్లు, అది = అకౌఁగిటఁ జేర్చుట, తదాత్మయును = ఆమెయొక్క మనస్సుగూడ, నాతలఁపుబడిన్ = నాకోర్కి ననుసరించి, తార్కొనక = ప్రవర్తింపక, ఎట్లు = ఏవిధముగా, సంఘటిల్లెడున్ = కలుగును ?

తాత్పర్యము:—ప్రభావతిని జూచునదృష్టము నారెండు కన్నులకుఁ గలుగునా ? ఆపట్టనము చొచ్చుటయే యసాధ్యమఁట. ఇఁక చూచుట యొక్కడకి ఎట్లో అందుఁ జొచ్చి చూచుటయే కలిగినయెడ

నా యొయ్యారిని గౌఁగిటఁ జేర్పక సైఁచి యుండు టెట్లు? కనిపింపఁగనే పైఁబడి కౌఁగిలించుకొనుట యనునది యామెమనస్సు గూడ నాకోరిక ననుసరించినఁ గదా ఘటిల్లును? (ఈ పద్యము మొదలు 15 పద్యములవఱకు వితర్కము అను సంచారిభావము)

అలం:—సందేహము.

వ్యా. వి:—కను + కవ. సూ. సమాసంబుల నుదంతస్త్రీసమంబులకును, బుంపులకును బరుష, సరళంబులు పరం బగునపుడు నుగాగమం బగు. బాల. సంధి. 25 చే నుగాగమము, (కను + ను + కవ, ద్రుతకార్యములు వచ్చి "కనుంగవ" అగును. చొచ్చు. ధా. నుజేపరముకాఁగా - సూ. అగు, వచ్చు, చొచ్చు, చూచు, లకు ముత్తు పరం బగు నపుడు కా, రా, చొరు, చూడులగు. బాల. క్రియా. 91 చే చొచ్చునకు "చొరు" ఆదేశము కాఁగా - "చొరను" అను రూపముసిద్ధించినది. కలిమి- సూ. ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు. బాల. కృదంత. 4. చే. కలుగు + ఇమి - అనియుండ - సూ. ఇటఁ గృత్కగతపవేములు పరంబులగునపుడు క, గ, చ, య, వ, లకు లోపం బగు. బాల. కృదంత. 2 చే "గు" లోపించి "కలిమి" అనురూపము భావార్థమున సిద్ధించి - 1 కలుగుట, 2 సంపద అనునర్థముల నిచ్చును. కలిమి-కల్మి. సూ. లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి. బాల. ప్రకీర్ణ. 18 చే - లకారము మీఁది "ఇ"కారమునకు లోపము రాఁగా సిద్ధించినరూపము.

చ. శుచిముఖిమాట యొం డరసి చూడఁగ నెంతయు నాసపా టొన
ర్చుచు మదిఁ ద్రిప్పుచున్నయది; చూడ్కికి నన్ను నె పోలువాని నా
రుచిరతరాంగి చిత్తరువు రూ పొకటిన్ రహిఁ జూడఁ జెప్పెఁ ద
ద్వచనముచొప్పు నేమి నియతంబు సమాకృతు లెందుఁ గల్గవే. 4

అర్థము:— శుచిముఖిమాట = శుచిముఖి చెప్పినపలుకు, ఒండు = ఒకటి, అరసి చూచినన్ = పరిశీలింపఁగా, ఎంతయున్ = అత్యంతమును, ఆసపాటు = ఆసపడుట, కోరిక, ఒనర్చుచున్ =కలిగించుచు, మదిన్ = మనస్సును, త్రిప్పుచున్నయది = భ్రమింపజేయుచున్నది - ఆకర్షించుచున్నది అనిభావము, చూడ్కికిన్ = చూపునకు, నన్నునె, పోలువానిన్ = పోలినవానిగా, ఆరుచిరతరాంగి = మిగులచక్కని శరీరము గలయాప్రభావతి, చిత్తరువురూపు = చిత్రమునందలి రూపము, ఒకటిన్ = ఒకదానిని, రహిన్ = ఆసక్తితో, చూడన్ = చూచుట, చెప్పెన్ - (కాన ఆస కలుగుచున్నది. అనివెనుక కన్వయము.) తద్వచనముచొప్పు = ఆపక్షియొక్క మాటరీతి (మాత్రము), ఏమి, నియతంబు=ఏమి స్థిరమైనది? సమాకృతులు = సమాన మగు నాకారములు, ఎందును = ఎల్లయెడల, కల్గవు + ఏ = ఉండవా? ఉండు నని యర్థము.

తాత్పర్యము:—శుచిముఖి చెప్పినమాట యొకటి మిగుల నాసకొల్పుచు మనస్సును భ్రమింపఁజేయుచున్నది. ఆ మాట యేది యనిన - కంటికి నావలెనే యుండువానినిగా ఒకచిత్తరువునందలిరూపము ఆ ప్రభావతిచూచుచుండెనని చెప్పినది. అయినను ఆహంసి మాట యేమి స్థిరము? లోకమునం దెల్లెడ సమాన మగురూపము లుండవా? అనఁగా మనుజులఁ బోలిన మనుజు లుండరా? ఆ చిత్రగతపురుషుఁడు నాకంటె నన్యుఁడు కాఁగూడదా?

వ్యా. వి. :—చూడికి, చూడ్కి - సూ. 'ఇకి' కోర్వ్యాదులకగు - చూచు + ఇకి - వృత్తి. 'చూడు' చూచున కగు - (చూడు + ఇకి = చూడికి) బాల. కృదంత. 16.

చ. ఇది పదిలంబుగా నడుగ కే నపు డక్కట, కోర్కి దాఁచి వ
ట్టిదొరతనంపునీటు ప్రకటించితిఁ బాపపులజ్జ నన్ను నో

రదిమె, ననాదరంబు తెఱఁగై మది హంసికిఁ దోఁచెనేమొ? ని
ల్వ్వద మఱి యించుకైన; గఱువల్ చవి గానికథల్ వచింతురే? ౭-౮ 5

అర్థము:—ఇది = ఆ చిత్తరువునందలి యాకారము నాదియా? నన్నుఁ బోలినవానిదా యను సంశయమును, పదిలంబుగాన్ = గట్టిగా (వివరముగా నని భావము), అడుగక, ఏను = నేను, అక్కట = అయ్యో, కోర్కి, దాఁచి, వట్టిదొరతనంపునీటు = నిరర్థకమైన ప్రభుత్వమువలనఁ గలుగు గర్వమును, ప్రకటించితిని = వెల్లడించితిని, కారణ మేమన - పాపపులజ్జ = పాడుసిగ్గు, నన్నున్, నో రదిమెన్ = మాటాడనీయలేదు, అది = ఆ సిగ్గుచే నేను మాటాట కుండుట, హంసికిన్ = శుచిముఖికి, అనాదరంబు తెఱఁగు + ఐ = దొరతనపునీటుచేఁ గలిగిన తిరస్కారము విధమై, తోఁచెనేమొ = గోచరించెనేమొ, (కావుననే) మఱి = ఆపయిని, నిల్వదు + అ = (క్షణమైన) ఆఁగలేదు - గఱువల్ = గౌరవముగలవారు, పూజ్యులు, చవిగానికథల్ = వినువారికి రుచింపనివృత్తాంతములను, వచింతురే=పలుకుదురా? (పలుకరని భావము.)

తాత్పర్యము:—ఆ సమయమున పాడుసిగ్గు నానోరునొక్కుటచేత, ఆ చిత్తరువునందలిరూపము నాదా? ఇతరునిదా? యని వివరముగా నడుగక వ్యర్థ మగుదొరతనపుగర్వము ప్రకటించితిని. అది హంసికి అనాదరమువలెఁ దోఁచి కొఁబోలును, మఱి నిలువకుండ నరిగెను. అవును. గౌరవముగలవారు వినెడువారికి రుచింపనికథలు చెప్పరుగదా?

అలం:—కావ్యలింగము, అర్థాంతరన్యాసము.

వి. :—నోరదుము, నోరునొక్కు - జాతీయములు - మాటాడనీయకుండు అని యర్థము.

ఉ. ఏ నొకయించుకంత మనసిచ్చిన మాటలు పల్కకుండఁగాఁ
గాని మరాళి యద్దనుజకన్యకకై నను నొత్తిచూచి, యే
మైన ననంగఁ బూను నని యాత్మకు దోఁచుచునున్న దిప్డు కా
దేని ప్రసంగమున్ దిగిచి యేల నుతించుఁ దదీయరూపమున్.

అర్థము:—ఏను = నేను, ఒకయించుకంత = ఒక కొంచెమైనను, మనసు + ఇచ్చిన + మాటలు = మనస్సునఁ గలకోరికను దెలుపుమాటలను, పల్కక + ఉండఁగాన్ = పల్కకుండుటచేత, కాని, మరాళి = ఆఁడుహంస (శుచిముఖి), అద్దనుజకన్యకకై = ఆ ప్రభావతికొఱకు, ననున్ = నన్ను, ఒత్తిచూచి = (నా హృదయ మెట్లున్నదో యని) బాగుగా పరీక్షించి చూచి, ఏమి + అయినన్ = ఏదే నొకవిషయమును గూర్చి, అనంగన్ = చెప్పుటకు, పూనున్ = కడఁగియుండును (సంభావనార్థమున నిట తద్ధర్మక్రియ), అని, ఇప్డు = ఇప్పుడు, ఆత్మకున్ = మనస్సునకు, తోఁచుచున్నయది = స్ఫురించుచున్నది, కాదేని = అట్లు కాని యెడల, ప్రసంగమున్ = ప్రస్తావమును, తిగిచి = (తానై) తెచ్చి, తదీయరూపమున్ = ఆప్రభావతి సంబంధమైన యాకృతిని, ఏల = ఎందులకు, నుతించున్ = కొనియాడును.

తాత్పర్యము.—నే నాసమయమున కొంచెమైనను మనస్సులోనికోరిక తెలియునట్లు పలుకకుండుట చేతఁ గాని, లేకున్న నాహంసాంగన ప్రభావతికొఱకై నన్ను బాగుగా పరీక్షించిచూచి, యింకను నేదియో చెప్పఁబూనిన ట్లిప్పుడు నామనస్సునకు స్ఫురించుచున్నది. అట్లుకానిచో ప్రభావతి ప్రస్తావన తానే తెచ్చి, యామెరూపము నేల వర్ణించి చెప్పును.

అలం:—కావ్యలింగము.

వి. :—మనసిచ్చు = గుట్టువెట్టక మనస్సులోని భావము వెల్లడించు, ఒత్తిచూచు = పరీక్షించి తెలిసికొను, ఈరెండును జాతీయములు.

వ్యా. వి. :—పల్కుచుండఁగాన్ - ఉండుధాతువుయొక్క నుజ్యంతరూపము. నుజ్ ప్రత్యయము తుమర్థభావలక్షణములందును, వలయ్వాదిక్రియాయోగంబునఁ గర్త యగుభావంబునందును వచ్చును. అని శాస్త్రము. ఇచట తుమర్థకమును గాదు, భావలక్షణమును గాదు, వలయ్వాదిక్రియాయోగంబును లేదు. కేవలభావార్థమునసే నుజ్ వచ్చి - ఉండఁగాన్ = ఉండుటచేత అని యర్థ మిచ్చుచున్నది. మఱియు దీని కవ్యవహితపూర్వ పద్యమున - చూడన్ = చూచుచుండుటను, (చెప్పెను.) అనునదియు నిట్టిప్రయోగ విశేష మని గ్రహింప నగును. ఇప్డు - 'ఇప్పుడు' అనుదానికి రూపాంతరము. సూ. అబ్బురాదులం దుత్వమున కు లోపంబు విభాష నగు. బాల. ప్రకీర్ణ. 19 చే. 'ఇప్పుడు' అనుదానిలోని ఉత్వము లోపించి, "ఇప్పడు" అని యుండఁగా సూ. హల్మధ్యగంబున కన్యతరంబునకు లుక్కగు. అను ఆంధ్రశబ్దలక్షణ సంగ్రహము. 5.30. సూత్రమున రెండవ పకారము లోపించి, "ఇప్డు" అని యగును.

మ. అటుగా కద్భుతరామణీయకగుణాఢ్యం బైన సద్వస్తువున్
బటువాచారసికుల్ ప్రసంగ మయినన్ బారంబు ముట్టన్ రసో
త్కటతన్ జెప్పక మానఁజాల రను పక్షం బొండు భావించినన్
ఘటియిల్లున్ వనితాంగవర్ణనకు నిక్కం బన్యథాసిద్ధియున్. 7

అర్థము:—అటుగాక = ప్రభావతికై హంసి నన్ను నొత్తిచూచి మాటాడింపకున్నను, ప్రసంగము= ప్రస్తావనము, అయినన్ = కలిగినచో (వచ్చినచో) పటువాచారసికుల్ = సమర్థమగు పలుకులు పలుకుట యందు, రుచిగలవారు - (మాటనేర్పరులని భావము) రామణీయకగుణాఢ్యంబు = చక్కఁదన మనుగుణము తో నిండినది, లేక చక్కఁదనముతోను, మంచి స్వభావముతోను నిండినది, ఐనసద్వస్తువున్ = అయినట్టి మంచిపదార్థమును, పారంబు ముట్టన్ = తుద దాఁకునట్లు-(పరిపూర్ణముగా నవి భావము), రసోత్కటతన్ = రసముయొక్క అతిశయముతో (అనఁగా రసవత్తరముగా అని భావము), చెప్పక, మానఁజాలరు=మానలేరు, అనుపక్షంబు, ఒండు = ఒకటి, భావించినన్ = ఊహించినయెడల, వనితాంగవర్ణనకున్ = ప్రభావతి యొక్క యవయవ వర్ణనకు, నిక్కంబు = నిజముగా, అన్యథాసిద్ధియున్ = మఱొక విధమునఁ బ్రాప్తి యును, ఘటియిల్లున్ = కలుగును. అన్యథాసిద్ధి = ప్రకారాంతరమున సిద్ధించుట - మఱొకవిధమున నెఱ వేఱుట - అని యిట నర్థము, (తర్కశాస్త్రమున) కారణత్వమునకుఁ బ్రతిబంధకముగా నుండుదోషము, అని కలదు.

తాత్పర్యము:—ప్రభావతికొఱకై నామనోనిశ్చయము తెలియఁగోరి హంసి నన్ను నిర్బంధించి మాటాడింపఁ నెంచకుండినను, ప్రసంగము వచ్చినచో మాటనేర్పరులు చక్కఁదనమును, మంచిగుణములును గలపదార్థమును పూర్తిగా రసవత్తరవాక్కులతో వర్ణింపక విడువఁజాల రనుపక్షమే యగు ననుకొనినచో, ప్రభావతీ రూపవర్ణనము నాకొఱకుఁగాక యన్యముకొఱకుఁ గావచ్చును - కావున నా కామెయెడ నాశ గలుగుట వ్యర్థము.

వ్యా. వి:—వాక్ఛబ్దము - ఆబంతముగూడనయి 'వాచా (రసికులు)' అనియగును. "వష్టి భాగురి రల్లోప మవ్యాప్యో రుపసర్గయోః । ఆబంతంచ హలంతానాం యథావాచా నిశా దిశా" అను వార్తికముచే సిద్ధించెను.

చ. హరియును వాసవుండు దమకంపిన కార్యము హంసి తానయై
ధరణికి డిగ్గి చెప్పి మదుదగ్రమనస్థితిఁ గాంచు టెన్న నా

సురరిపుఁ జంప న న్ననుపు సుద్దులు పుట్టఁగఁబోలు, నెల్లెడన్
సరసిజనేత్రు దక్షిణ భుజంబవు నీ వని పల్కినందునన్. 8

అర్థము:—హంసి = శుచిముఖి, తాను + అ + ఐ = తనంతఁదానే, ధరణికిన్ = భూమిపైకి, డిగ్గ = ఆకసమునుండి దిగి, హరియును = శ్రీకృష్ణుఁడును, వాసవుండును = ఇంద్రుఁడును, తమున్ = తమ్మును (హంసలను), అంపిన = ఆజ్ఞాపించిన, కార్యమున్ = పనిని, చెప్పి, మదు...స్థితిన్ - మత్ = నాయొక్క, ఉదగ్ర = ఉన్నతమైన - అధికమైన, మనః+స్థితిన్ = మనస్సుయొక్క నిలకడను, కాంచుట = పరీక్షించుట, ఎన్నన్ = ఆలోచింపఁగా, ఆ సురరిపున్ = దేవతలకు శత్రువగు నావజ్రనాభుని, చంపన్, నన్నున్, అనుపు + సుద్దులు = పంపునట్టిమాటలు, పుట్టఁగఁబోలున్ = కలుగవచ్చును, (కావుననే) నీవు, ఎల్లెడన్ = అన్నివిషయములందును, సరసిజనేత్రు = (తామరలవంటి కన్నులుగల) శ్రీకృష్ణునకు, దక్షిణ భుజంబవు = కుడిబుజమవు - సహాయములలో ముఖ్యుఁడవు అని, పల్కినందునన్ = చెప్పినహేతువుచేత - (విదితము = తెలియఁబడినది. అధ్యాహారము.) "పల్కెనందునన్" అని పాఠమున్నచో - అందునన్ = సుద్దులు పుట్టిన కారణముచేత, పల్కెన్ = చెప్పెను. అని స్వారసికముగాఁ (గుదురును.)

తాత్పర్యము:—శుచిముఖి తనంతఁదా నాకసమునుండి భూమికి దిగివచ్చి, కృష్ణుఁడు నింద్రుఁడును తమ్ము నాజ్ఞాపించిన పనిని జెప్పి, గొప్పదగు నా మనస్సునిలకడను బరీక్షించుట యారయ - వజ్రనాభుని జంపుటకు నన్ను పంపుమాటలు వచ్చియుండును. కావుననే హంసి 'నీవు సర్వకార్యములందును హరికి కుడిభుజమవు' అన్నది.

ఉ. అన్నియు నేకవాక్యముగ నారయ నాసలు పెంచుపక్షమే
యున్నది కొంత మించి, యిది యోజనసేయఁగ నాదురూపె యా
కన్నియచేతి చిత్రఫలకంబున నున్నది, యెవ్వ రట్టిచో
నన్ను నెఱింగి వ్రాయ ననినన్ శివ వ్రాయుట వింటిఁ జొప్పడన్. 9

అర్థము:—అన్నియున్ = ఈ వెనుకటి యంశము లన్నియును, ఏకవాక్యముగన్ = ఒక (యభిప్రాయ మునే తెల్పునట్టి) వాక్యముగా, ఆరయన్ = ఆలోచింపఁగా, ఆసలు = నాకోర్కెలను, పెంచుపక్షమే = వర్ధిల్లఁజేయు పక్షమే, కొంత, మించి యున్నది = అధికముగా నున్నది - ఇది = ప్రభావతిని బొందఁ గోరుటను, యోజనసేయఁగన్ = ఆలోచింపఁగా, - ఆకన్నియచేతి చిత్రఫలకంబునన్ = ఆ ప్రభావతియొక్క చేతిలోని చిత్రఫలకమునందు, ఉన్నది, నాదురూపె = నాయాకారమే, అట్టిచోన్ = అటువంటి దుర్గమ ప్రదేశమునందు, నన్నున్, ఎఱింగి = తెలిసికొని, వ్రాయన్ = చిత్రించుటకు, ఎవ్వారు = ఎవరు, (ఉన్నారు - అధ్యాహారము) అనినన్, చొప్పడన్ = సరిగా సరిపడునట్లు, శివ = పార్వతీదేవి, వ్రాయుట = చిత్రించుటను, వింటిన్ = విన్నాను.

తాత్పర్యము:—హంసి తనంతఁదానై వచ్చుట, ప్రసంగము తెచ్చి ప్రభావతి చక్కఁదనమును వర్ణించుట మున్నగు నంశము లన్నియు నొక యభిప్రాయము గలవాక్యముగా నూహించినయెడల నాకుఁ గోరికలు పెరుఁగుచున్నవి. ఆ కోరిక లెట్టివనః- ఆ ప్రభావతి చేతిలో నున్న చిత్రఫలకమందలి రూపము తప్పక నాదియే. అట్టి దుర్గమస్థలమందలి యెవరు నన్ను నెఱింగి వ్రాసిరో యనిన అఘటనాఘటనా పటు వగుపార్వతి వ్రాసి యిచ్చిన దని వింటిని. ఆమెయే వ్రాసియిచ్చినచో సర్వము ననుకూలించును అని.

వ్యా. వి. :—అట్టిచోటన్ - అట్టిచోన్, సూ. ఉత్తరపదంబగు చోటశబ్దము టాక్షరంబునకు లోపంబు విభాష నగు. బాల. సమాస. 16 చే. రూపద్వయము.

సీ. శివ నన్నె వ్రాసి యి । చ్చిన పక్షమునను లే, ఖననిమిత్తము వేఱు । కలుగునో కో-
కలుగ దంతఃపుర । కన్య కిట్టిది భర్తృ, పరతఁ దక్క ఘటిల్లు । టరుదు గాన
నది యట్లయైనను । దదభీష్ట యువపరీ, క్షామాత్రఫలకమై । జాఱునో కో-
జాఱ దీశ్వరి యిచ్చె । సత్కృప నని బాల, వేడ్కఁ జూచుటఁ జెప్ప । వింటిఁ గాన

తే. నిట్టిగతిఁ జెల్వ నుమ వెడ్డు । వెట్టునో కో, పెట్ట దది దా సృజించిన । బిడ్డ గాన
బొంకగుచు నంత కిదియ త్రో । పువడునో క్రో, పడ దజుఁడుచెప్పె నని విన । బడియెఁగాన.

అర్థము:— శివ = పార్వతీదేవి, నన్నున్ + ఏ = నన్నే, వ్రాసి = చిత్రించి, ఇచ్చిన పక్షమునను = ఇచ్చినది యను పక్షమునందుఁగూడ, లేఖననిమిత్తము = చిత్తరువువ్రాసి యిచ్చుటకు హేతువు, వేఱు + అ = మఱొకటి, కలుగునో కో = ఉండు నేమో (అనిసంశయము), అంతఃపురకన్యకున్ = అంతిఃపురమున నవివాహితగా నుండు బాలకు, ఇట్టిది = యువకుఁడ నగు నారూపము చిత్రించి యిచ్చుట, భర్తృపరతన్ + తక్కన్ = భర్త యగు నను భావముతోఁ దప్ప, ఘటిల్లుట = కలుగుట, అరుదు = దుర్లభము, కానన్ = కావున, కలుగదు = చిత్తరు విచ్చుటకు మఱొక కారణము కలుగదు (నిశ్చయము), అది = ఆ చిత్తరు విచ్చుట, అట్లయైనను = భర్తృపరముగా నీయఁబడిన దైనను, తదభీష్ట...ఫలకము - తత్ = ఆకన్యకచే, అభీష్ట = కోరఁబడిన, యువ = పడుచువానియొక్క, పరీక్షా మాత్రఫలకము = తెలిసికొనుట మాత్రమే ఫలముగాఁ గలది, ఐ, జాఱునో కో = వ్యర్థమగు నేమో (అనిసంశయము), ఈశ్వరి = పార్వతీదేవి, సత్కృపన్ = స్థిరమగుదయతో, ఇచ్చెను, అని, బాల = ప్రభావతి, వేడ్కన్ = తమితో, చూచుటన్, చెప్పన్ = (శుచిముఖి) చెప్పఁగా, వింటిన్, కానన్, జాఱదు=వ్యర్థము కాదు (నిశ్చయము). ఇట్టిగతిన్= భర్తగాఁ గానట్టి నాచిత్తరువు నిచ్చి, ఉమ = పార్వతిదేవి, చెల్వను= ఆప్రభావతిని, వెడ్డువెట్టునో కో= మోసపుచ్చునా ? (అని సంశయము.) అది = ఆ ప్రభావతి, తాన్ = పార్వతి స్వయముగా, సృజించిన బిడ్డ, కానన్, పెట్టదు=వెడ్డువెట్టదు, మోసగింపదు. (అని నిశ్చయము) - సూ. శబ్దపల్లవక్రియలును, ద్వ్యవయవక్రియలును సమాస్తంబు లయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు. ప్రౌఢ. క్రియా. 25. వెడ్డువెట్టదు. "అను దానిలోని పూర్వావయవమునకు లోపము వచ్చి "పెట్టదు" అనునది నిలిచి, వెడ్డువెట్టదు. అనుదానియర్థ మిచ్చినది. అంతకున్ =ఈచెప్పిన దానియంతలోను, ఇదియ= ఆప్రభావతిని గౌరీదేవి సృజించె నను నీమాటయే, బొంకు = అసత్యము, అగుచున్, త్రోపువడునో క్రో = నిరాకరింపఁ బడు నేమో (అని సంశయము). అజుఁడు= బ్రహ్మ, చెప్పెను, అని, వినఁబడియెన్ = హంసిచే వినిపింపఁబడెను, కానన్, పడదు = త్రోపువడదు, నిరాకరింపఁబడదు (అని నిశ్చయము).

తాత్పర్యము:— పార్వతీదేవి నాచిత్తరువు వ్రాసి యిచ్చిన పక్షమందుఁ గూడ వేఱు కారణ ముండునా అని సంశయించి, అంతలోనే అంతఃపురకన్యకల కిట్టిచిత్తరువు భర్తృభావముతోఁ దక్క మఱొక భావముతో లభించుట దుర్లభము గాన వేఱే కారణ ముండదు అని నిశ్చయించుకొనును. (ఇట్లే సంశయములు నిశ్చయములు నిందువర్ణింపఁబడెను.) అట్లు భర్తృపరముగా వ్రాసి యిచ్చినదైనను, ప్రభావతిచేఁ గోరఁబడిన ప్రాయపువానిని దెలిసికొనుట మాత్రమునకే యై వ్యర్థమగు నేమో - (సంశయము.) గౌరీదేవి యిచ్చెనని ఆప్రభావతి యాచిత్రము నే వేడుకతోఁ జూచుట హంసి చెప్పినది గాన వ్యర్థము కాదు. (అని నిశ్చయము.) గౌరీదేవి చిత్తరువుమాత్రమే చూపి సంఘటన చేయక మోసపుచ్చు నేమో (అని సంశయము.) తాను సృజించిన బిడ్డయే కాన నామెను మోసగింపదు (అని నిశ్చయము) - ఇది యంతయుఁగూడ అసత్యమై యేమియు లేకపోవు నేమో (అని సంశయము) - మరల బ్రహ్మ చెప్పె నని హంసవలన వింటిని గానఁ దప్పక జరుగును (అని నిశ్చయము.) - ఇట్లు డోలాందోళిత చిత్తుఁడై తపించుచుండె నని భావము.

అలం:—నిశ్చయాంత సందేహము.

చ. మును తనసృష్టికామి నలుమోముల వేలుపు చెప్ప వింటి నే
నను మరాళి పల్క, నపు డక్కట! యే నడుగంగ లేక యే
మని ననుఁ దిట్టుకొందు, నజుఁ డట్టిప్రసంగపువేళ నవ్వరా
ననకు విభుం డితం డతఁ డనన్ వినఁబడ్డది యేమి గల్గెనో. 11

అర్థము:—నలుమోముల వేలుపు = చతుర్ముఖుఁడు, బ్రహ్మ, (ప్రభావతి), తన సృష్టికామిన్ = తన సృజన లోనిది కాకుండుటను, మును = పూర్వము, చెప్పన్, నేను, వింటిన్, అనుచున్, మరాళి = ఆఁడుటంచ-శుచిముఖి, పల్కన్ = చెప్పఁగా - అక్కట, అపుడు, నేను అడుగంగలేక = అడుగఁజాలక, (ఇపుడు) ననుక్, ఏమి, అని తిట్టు కొందును ? (ఏమని తిట్టుకొనినను చేసిన తప్పున కా తిట్లు చాల వనియు అంత తెలివి తక్కువ పనిచేసితి ననియు భావము) - అట్టి ప్రసంగపువేళన్ = ప్రభావతి పుట్టుక తెలుపు సమయమున, అజుఁడు = బ్రహ్మ, అవ్వరాననకున్ = శ్రేష్ఠ మగు మోముగల యా ప్రభావతికి, విభుండు= మగఁడు, ఇతఁడు, అతఁడు, అనన్ = అని చెప్పఁగా, ఏమి, వినఁబడ్డది = వినఁబడినది, కల్గెనో, (ఏమి విన వచ్చినదో కదా అని భావము.)

తాత్పర్యము.—ప్రభావతి తన సృష్టిలోనిది కా దని బ్రహ్మ మున్ను చెప్పఁగా వింటి నని హంసి చెప్పినప్పు డామెకు భర్త యెవ్వఁ డగు నని బ్రహ్మ చెప్పినాఁడో దానిని గూర్చి యడుగ లేకపోతినే నా తెలివి తక్కువకు నే నేమని తిట్టుకొన్నను తప్పేమి ? ఎవఁ డగు నని హంసి విన్నదోకదా.

ఉ. వావిరి నవ్విలాసవతి వార్తలపట్టున నెన్ని యెన్ని ప్ర
శ్నావసరంబు లైన, నొక యర్థము నే నడుగంగ లేమి ని
చ్ఛావిముఖుం డితం డని ప్రసంగము వచ్చిన నూరకుండునే
మో వరటాలలామ యిఁక ముద్దియ సన్నిధి నేమి సేయుదున్. 12

అర్థము:—వావిరిన్ = అధికముగా, అవ్విలాసవతి వార్తలపట్టునన్ = (శృంగార చేష్టలు గల) ఆ ప్రభావతియొక్క వృత్తాంతములు చెప్పు సమయమున, ఎన్నియెన్ని = ఎన్నెన్నియో - పెక్కులు, ప్రశ్నావసరంబులు = ప్రశ్నకు సమయములు, అడుగఁ దగిన యవకాశములు అని భావము - ఐనన్ = కలిగినప్పటికిని. (ఒయ్యారియగు నా ప్రభావతి వృత్తాంతమును హంసి విపులముగాఁ జెప్పు పట్టున నెన్నియో యడుగఁ దగిన యవసరములు వచ్చినవి. అట్లు వచ్చినప్పటికిని అని భావము) ఒక - యర్థమును = ఒక్క విషయమును గూర్చియైనను, నేను అడుగంగ లేమిన్ = అడుగక పోవుటచేత, ఇతండు, ఇచ్ఛా విముఖుఁడు = కోర్కికి పరాఙ్ముఖుఁడు - (కోర్కిలేనివాఁడు అని భావము), అని, ముద్దియ సన్నిధిన్ = ఆ ప్రభావతి దగ్గఱ, ప్రసంగము = నా ప్రస్తావనము, వచ్చినన్ = కలిగినను, వరటాలలామ = శ్రేష్ఠమగు నా హంసి - (వి. హంసస్యయోషి ద్వరటా. అమరము.) ఊరక+ఉండును+ఏమి+ఓ = మిన్నకుండునేమో కదా, మాటాడ కుండునేమో - ఏమి, చేయుదున్.

అలం. :—సందేహము.

ఉ. పోవునొకో సరోజముఖిపొంతకు నింకొక మాటు హంసి ? దాఁ
నావలనన్ దదిష్టవచనం బొకటేన్ గొనిపోవఁ గానమిన్
బోవుట నిష్ఫలం బనుచుఁ బోకయె మానునొ ? కాక పోవునో
దైవత కార్యభారమును దద్వశమైనది కొంత గల్గినన్. 13

అర్థము:—హంసి = శుచిముఖి, సరోజముఖి = తామర పువ్వువంటి మోము గల ప్రభావతి యొక్క, ప్రాంతమునకున్ = ప్రాంతమునకు, సమీపమునకు పోవునో = వెళ్లునా? (లేక) నావలనన్ = నావైపునుండి, తదిష్టవచనంబు = ఆమెకుఁ బ్రియ మగుమాట, ఒకటిన్ = ఒకటైనను, కొనిపోవన్ = తీసికొని వెళ్లుటకు, కానమిన్ = కన్పింపక పోవుటచేత, తాన్ = తాను, పోవుట, నిష్ఫలంబు = వ్యర్థము, అనుచున్, పోకయె మానునో = వెళ్లుటయే మానునేమో, కాక = అట్లు కాక, దేవ కార్య భారమును = దేవతల యొక్క (కార్యాతిశయము) గొప్పపని, తద్వశము = ఆహంసి కధీనము, అయినది, కొంత = కొంచెము, కల్గినన్ = కలుగఁగా - తాను నిర్వహింపఁదగిన దేవతాకార్య భారము (వజ్రనాభవధము) గూర్చి కొంత యక్కఱ కలిగినచోన్, పోవునో = వెళ్లునేమో, "కల్గినన్" - అనుటకంటె 'కల్గుటన్' అనుపాఠము లభించినయెడ స్వారసికముగ నుండును - ఆపక్షమున "దైవకార్య భారమును, తద్వశమైనది, కొంత, కల్గుటన్ = దేవతల గొప్పకార్యముకూడ తనవశమై యుండుటచేత నానిమిత్తము గాకున్నను, తననిమిత్తమే వెళ్లునేమో" యనునర్థము వచ్చును. కాని ముద్రిత ప్రతులందు "కల్గినన్" అనియే పాఠ మగపడుచున్నది.

అలం:—సందేహము.

క. తరుణికడ కంచ యేగతి, నరిగిన నాసగల దది మహామతి నాయాం
తరగతిఁ గనదే వినదే, ధర "న ప్రతిషిద్ధ మనుమతం భవతి" యనన్. 14

అర్థము:—అంచ = ఆఁడుహంస, తరుణికడకున్ = ప్రభావతి యొద్దకు, ఏగతినైనన్ = నానిమిత్తము గాని, దేవతాకార్యము నిమిత్తము గాని, అరిగినన్ = వెళ్లినచో, ఆస = నాపని సఫల మగునని అపేక్ష, కలదు - ఏమన - అది = ఆహంసి, మహామతి = గొప్పబుద్ధిగలది, (మతి యనఁగా - రాబోవు దానిని దెలిసికొను జ్ఞానము)-కాన - నాయాంతరగతిన్ = నాయభిప్రాయమును, కనదే = తెలిసికొనదా? తెలిసికొను నని భావము - ధరన్ = లోకమునందు "అప్రతిషిద్ధం = నిరాకరింపఁబడనిది, అనుమతం = అంగీకరింపఁబడినది, భవతి = అగుచున్నది" అనన్ = అని (జనులు) పలుకఁగా, వినదే = వినియుండదా?

తాత్పర్యము:—నానిమిత్తముగాని దేవకార్యనిమిత్తముగాని హంసి ప్రభావతిదగ్గఱకు వెళ్లినయెడల నాకోర్కి తీఱు నని యాశకలదు. అదిసూక్ష్మబుద్ధిగలది. కాన నాయాశయము గ్రహించి నేనుచెప్పనక్కఱయే లేక గ్రహింపఁగలదు. కావున ఆమె చెప్పుచుండ వలదని నిషేధింపక పోవుట యనుమతించితి ననియే తెలిసికొనును. లోకమున 'నిరాకరింపకుండుట యంగీకారసూచక' మని జనులాడుకొనుట యది వినియే యుండును.

అలం:—కావ్యలింగము.

క. ఏపనియు లేక యుండిన, నాపడఁతుకఁ జూడఁ జనక హంసి నిలువ నే
ట్లోపెడును? దానిఁ జూచిన, చూపఱకును వశమె తిరుగఁ జూడక యుండన్. 15

అర్థము:—ఏపనియున్ = ఏప్రయోజనముగూడ, లేక యుండినను = లేకున్నప్పటికిని, హంసి = శుచిముఖి, ఆపడఁతుకన్ = ఆప్రభావతిని, చూడన్, చనక, ఎట్లు, నిలువన్, ఓపెడున్ = నిలిచి యుండఁ గలదు - (చూచుటకై పోకుండ నాఁగఁజాల దని భావము), దానిన్ = ఆప్రభావతిని, చూచిన, చూపఱకున్ = చూచినవారికి, ద్రష్టలకు, తిరుగన్, చూడకయుండన్, వశమె = శక్యమా? మరలఁ జూడకుండుట యశక్య మని భావము.

అలం:—కావ్యలింగము.

వ్యా. వి. :—పడఁతి, పడఁతుక - సూ. ఊకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు. బాల. తద్ధిత. 10. చూపఱు నిత్యబహువచనము. కాని యీత[illegible] "గీ. చూపఱల చూడ్కి కొకవింత సొబగొసర్చె.

కళా 7-76 ప్రయోగించెను. అది సూ. "ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నెనయు." బాల. ఆచ్ఛిక. 17 చే - బహువచనాంతతుల్య ప్రాతిపదికము మాత్రమేయై (చూపఱు) బహువచన మగు, 'లు' ప్రత్యయ మొంది 'చూపఱులు' అయిన దనుకోఁదగును. "అపిసంయుక్త సమాప్తౌ భూయాంతే లుః ప్రదృశ్యతే నామ్నాం" అని చింతామణియును గలదు.

క. అని భావనాబలంబున, మనమున ఘటిత మగుమగువ । మధురాకృతి య
క్కునఁ జేర్పఁ గడఁగి తత్తఱ, మునఁ గానక వెగడుపడుచుఁ । బొదలు విరాళిన్. 16

అర్థము:—అని = ఇట్లనుకొని, భావనాబలంబునన్ = తలఁపుయొక్క యతిశయముచే - (తదేకధ్యానముచే నని భావము.) మనమునన్, ఘటితము = కూర్పఁబడినది, అగుమధురాకృతిన్ = అయినట్టి సుందరమగు ప్రభావతియొక్క రూపమును, తత్తఱమునన్, అక్కునన్ = ఱొమ్మునందు, చేర్పన్, కడఁగి= యత్నించి, కానక, వెగడుపడుచున్ = తల్లడిల్లుచు, పొదలువిరాళిన్ = అధికమగు వలపుచేత.

వ్యా. వి. :—"మధురమగు నాకృతి" అనుదానిలోని మధురశబ్దమునకు "సుందరము" అని లక్షణాసిద్ధ మగునర్థము చెప్పవలెను. "కిమివహి మధురాణాం మండనం నాకృతీనాం" అని అభిజ్ఞాన శాకుంతలను.

వ. ప్రొద్దుగడపుట తద్దయు భరం బగుడు నుద్యానంబునకుం జనియె నప్పుడు. 17

అర్థము:—ప్రొద్దు+కడపుట=కాలక్షేపము చేయుట, తద్దయున్ = మిగుల, భరంబు=బరువైనది, (అశక్యము అనిభావము) - అగుడున్ = అగుటయు, ఉద్యానంబునకున్ = పూఁదోఁటకు, చనియెన్ = వెళ్లెను, అప్పుడు.

సీ. నిబిడంపుజిగితోడ । నిండుపూగుత్తులు, బిగువుపాలిండ్ల యొ । ప్పిదము నెరప
నునుఁగెంపు గ్రక్కునూ । తనపల్లవంబులు, కరతలంబుల సోయ । గంబుఁ దెలుప
నెలమిఁ బర్వెడునట్టి । యెలదీఁగియలసొంపు, సుకుమారబాహు వి । స్ఫురణ జరుపఁ
గడుఁ బేరెములువాఱు । గండుతుమ్మెదచాలు, కడగంటిచూపుల । బెడఁగు నడప

తే. విరులతెలిడాలు చిఱునవ్వు । సిరులఁ జిలుక, మధురసపునిగ్గు లావణ్య । మహిమ గులుక
నతనిచూడ్కికిఁ జూడ ను । ద్యానభాగ, మంతయుఁ బ్రభావతీమయం । బగుచు దోఁచె.

అర్థము:—నిబిడంపుజిగితోడన్ = దట్టమగుకాంతితో, నిండుపూగుత్తులు=పరిపూర్ణ మగుపువ్వుల గుత్తులు, గుత్తముగాఁబూలతోనిండిన గుత్తులు - అనిభావము, బిగువుపాలిండ్లయొప్పిదమున్ = బింక మగు స్తనములయొక్క సొగసును, నెరపన్ = నింపఁగా - (తెలుపఁగా అని భావము), నునుఁగెంపు = లేఁత యెఱుపురంగును, క్రక్కు = వెడలించు, నూతనపల్లవంబు = క్రొత్తచిగురుటాకు, కరతలంబుల = అఱచేతులయొక్క, సోయగంబున్ = సొగసును, తెలుపన్ = ప్రకటింపఁగా, - ఎలమిన్ = వికాసముతో, పర్వెడునట్టి = ఒప్పునట్టి, లేక వ్యాపించునట్టి, ఎలతీఁగియలసొంపు = లేఁతతీఁగలయొక్క యందము, సుకుమారబాహువిస్ఫురణన్ = మృదువులగు భుజములకాంతిని, జరుపన్ = వ్యాపింపఁజేయఁగా, కడున్ = అధికముగా, పేరెములు + వాఱు = పరుగెత్తుచున్న, గండుతుమ్మెదచాలు = మగతుమ్మెదల పంక్తి, కడగంటిచూపుల బెడఁగు = కంటికొనతోఁ జూచుచూపులయొక్క సొగసును, నడపన్ = ప్రవర్తిల్లఁజేయఁగా, విరులతెలిడాలు = పువ్వులయొక్క తెల్లకాంతులు, చిఱునవ్వుసిరులన్ = లేనగవు శోభలను, చిలుకన్ = ప్రకటింపఁగా, మధు రసపు నిగ్గు = పూఁదేనెరుచిలోని సారము, అనఁగా తియ్యఁదనము, లావణ్యమహిమన్ = (మేని) తళుకుయొక్క గొప్పతనమును, కులుకన్ = చిమ్మఁగా - చూడన్, అతనిచూడ్కికిన్ = ఆ ప్రద్యుమ్నునిదృష్టికి, ఉద్యానభాగము = పూఁదోఁట యుండుప్రదేశము,

అంతయున్, ప్రభావతీమయంబు = ప్రభావతియొక్క వికారము - (అనఁగా ప్రభావతియే పూఁదోఁట రూపముగా మాఱినట్లు - అని భావము. ఇట వికారార్థమున "మయట్" ప్రత్యయము) అగుచున్, తోఁచెన్ = కనిపించెను.

తాత్పర్యము :—పూలగుత్తులు స్తనముల విధమును, లేఁజిగుళ్లుచేతుల విధమును, తీఁగలు భుజముల విధమును, గండుతుమ్మెదలు క్రేఁగంటి చూపులవిధమును, పువ్వుల తెలుపు కాంతులు చిఱునవ్వులవిధమును, తేనెలందలితియ్యఁదనము మేనియందమువిధమును, తెలుపుచుండ ప్రభావతియే యాపూఁదోఁటరూపముగా మాఱినట్లాతని దృష్టికిఁ గనఁబడెను.

అలం. రూపకము.

వ్యా. వి. :— పూవు గుత్తి - అనికాని పూ + గుత్తి అనికాని యనవచ్చును. పూవునకు పర్యాయముగా "పూ" శబ్దమున్నది. పూవు + గుత్తి అనునప్పుడు "సమాసంబులం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు. బాల. సంధి. 36. చే - "పూగుత్తి" యగును. పాల + ఇండ్లు = పయోధరములు. నిత్యబహువచనము. నునుఁగెంపు, గండుఁదుమ్మెద - ఉదంతస్త్రీసమంబులగు "నును, గండు" శబ్దములకు పరుషము లగు క, త, లు పరమగుట, నుగాగమము ద్రుతకార్యములు వచ్చి సిద్ధించిన రూపములు.

ఆ. యువతిపై విరాళి యొక్కింత మఱతునో, యనుచు నాస నేగి యచట నతఁడు
మఱచెఁ దదితరంబు నెఱయంగ నది సుమీ, యొకటి కోర వేఱయొకటి యగుట.

అర్థము :—యువతిపైన్ = ఉవిదపైని, ప్రభావతిపైని (గల) - విరాళి = వలపు, ఒక్కింత = కొంచెము, మఱతును + ఏమి + ఒ = మఱచెదనేమో, అనుచున్, ఆసన్ = అభిలాషతో, ఏగి, అచటన్ = ఆ యుద్యానమునందు, అతఁడు, నెఱయంగన్ = పూర్తిగా, తత్ + ఇతరంబు = ఆ ప్రభావతికంటె అన్యపదార్థము (ల) ను, మఱచెన్ = విస్మరించెను, ఒకటి, కోరన్, వేఱు + అ, ఒకటి, అగుట, (అనఁగా) ఇదిసుమా = ఇదియేకదా.

తాత్పర్యము:—ప్రభావతియెడఁ దనకుఁ గలిగిన వలపుచేత పరితాపము పట్టఁజాలక, దాని నెట్లైనను మఱవ వలెనని ప్రద్యుమ్నుఁడు పూఁదోఁట కరిగి చూడఁగా నందు సర్వమును బ్రభావతీ మయముగాఁ గానిపింపఁ బ్రభావతిని దక్క నితర ప్రపంచమును మఱచిపోయెను. లోకమున ఒకటి కోరఁగా వేఱొకటి యగునను టయిదియే కదా!

అలం. :—విషమము, నిదర్శనము.

వ. అతం డివ్విధంబునఁ బ్రభావతీ విభ్రమభ్రమ వశంబున లత లతఁ దప్పకుండఁ గదియం జనుచు. 20

అర్థము:—ప్రభా. ... వశంబునన్ - ప్రభావతీ విభ్రమ = ప్రభావతి యొక్క శృంగార చేష్టలు అను, భ్రమ = భ్రాంతికి, వశంబునన్ = లొంగిన కారణమున, లతన్ + లతన్ = ఒక్కొక్క తీఁగనే, తప్పకుండన్ = విడువకుండ, కదియన్ = సమీపించునట్లు, చనుచున్ = వెళ్లుచు.

సీ. తరుణికెంగే లంచుఁ దమిఁ బట్టి కటకటా, చిగురాకె యిది యంచుఁ జిన్నవోయి
వెలఁదిపాలిం డ్లంచు వెస నంటి చెల్లఁబో, పూగుత్తులే యంచుఁ బొలుపు దఱిగి
చెలువపయ్యెద యంచుఁ జేసాచి యయ్యో! పరాగోదయమె యంచు రహిఁదొఱంగి
రమణివేనలి యంచు రతికాంక్ష నొడసి హా, తేఁటిమొత్తమె యంచుఁ దెల్లఁబాఱి

తే. యకట ! యనిమిత్తకృపఁ దానె యరుగుదెంచి,
హితవు నెరపెడి హంసితోఁ హృదయ మిచ్చి
పలుకని కృతఘ్నునకు నాకుఁ బ్రాప్త మగునె,
యట్టియువతిపొం దనుచుఁ దా నాత్మఁ గుందు. 21

అర్థము:— తరుణి = జవ్వనియగు నా ప్రభావతియొక్క, కెంపు + కేలు = ఎఱ్ఱని కరతలము, అంచున్, తమిన్ = ఉత్కంఠతో, పట్టి = పట్టుకొని, కటకటా, ఇది, చిగురాకు + ఎ, అంచున్, చిన్నఁబోయి = ఖిన్నుఁడయి - వెలఁది పాలిండ్లు = ఆయింతి కుచములు, అంచున్, వెసన్ = తొందరగా, అంటి = పట్టుకొని, చెల్లఁబో = అయ్యో! (సంతాపార్థకము), (ఇవి) పూగుత్తులే, అంచున్, పొలుపు + తఱిగి = శోభాహీనుఁడయి, చెలువ పయ్యెద, అంచున్, (పట్టుకొనఁగా) చే = చేయి, చాచి, అయ్యో! పరాగోదయము = (వస్త్రమువలె నెగురుచున్న) పుష్పొడి తెర, అంచున్, రహిన్ = సంతోషమును, తొఱఁగి = విడిచి పెట్టి, రమణివేనలి = ఆ చెలువ యొక్క జడ, అంచున్, రతికాంక్షన్ = రతియందలి కోర్కిచే, ఒడిసి = పట్టుకొని, హా = అయ్యో, తేఁటి మొత్తము + ఎ = (ఇది) తుమ్మెదపిండు, అంచున్, తెల్లఁబాఱి = వెలవెలఁబోయి, అకట !, అనిమిత్త కృపన్ = హేతువు లేనట్టి దయచే, తాను + అ = తానే, అరుగుదెంచి = (నా యొద్దకు) వచ్చి, హితవు = మేలును, నెరపెడి హంసితోన్ = చేయునట్టి శుచిముఖితో, హృదయము + ఇచ్చి = మనస్సిచ్చి - హృదయ మందలి భావము బయలుచేసి, పలుకని కృతఘ్నునకున్ = చెప్పనట్టి, కృతఘ్నునకు (చేసిన మేలు మఱచువాఁడు కృతఘ్నుఁడు, తెలిసి యుండువాఁడు కృతజ్ఞుఁడు), అట్టి యతివ పొందు = అట్టి యింతి యొక్క సాంగత్యము, నాకున్, ప్రాప్తము = పొందఁబడినది, అగును + ఎ = అగునా ? (కాదని భావము) అనుచున్, ఆత్మన్ = మనస్సునందు, కుందున్ = ఖేద మొందును, (కర్త ప్రద్యుమ్నుఁడు).

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁడా పూల తోఁటలోఁ దిరుగుచు, ప్రభావతి యెఱ్ఱని చేయి యనుకొని పట్టుకొని, "అయ్యో! ఇది చిగురాకే"యని ఖిన్నుఁడగును; మఱియు ఆమె కుచము లనుకొని పూలగుత్తులను బట్టికొనియు, ఆమె పైఁటకొం గనుకొని పుష్పొడి తెరను దాఁకియు, ఆమె జడ యనుకొని తుమ్మెదచాలును పట్టుకొనియు, వెలవెలఁబోయి, అయ్యయ్యో 'నిర్హేతుక కరుణతోఁ దనంతఁదాను వచ్చి నాకు మేలు చేయఁదలఁచిన హంసితోఁడ నా మనసులోని కోరిక చెప్పని నా కృతఘ్నత్వముమూలమున, నటువంటి యువతి సాంగత్యము నాకిఁకఁ బ్రాప్తము కాదు' అని మనస్సునందుఁ బరితపించును.

అలం:—భ్రాంతిమంతము, కావ్యలింగము.

వ్యా. వి. :—"హితము"నకు వికృతులు హితవు, ఇతవు. "కెంగేలు" కెంపు + కేలు. కెంపు శబ్దము ప్రాఁతాది గణములోనిది కాన తొలియచ్చు మీఁది వర్ణములకు లోపము కలిగి - "కె + కేలు" - అయి లుప్తశేషము కాన-కె అనుదానికి పరుషపరకత్వమున నుగామము, ద్రుతకార్యములును వచ్చి యేర్పడిన రూపము. అంచున్, అన్చున్-'అను'ధాతు శత్రర్థక రూపములు—సూ. చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని ను స్థానంబున బిందువేని విభాష నగు. బాల. క్రియా. 55 చే సిద్ధించిన రూపము.

వ. అంత నంతర్గతంబున. 22

అర్థము:—అంతః + గతంబునన్ = మనస్సును పొందినదిగా - అనఁగా మనస్సులోపలనే అని భావము.

తే. ఉవిద నాకుఁ బ్రాపించు ట కెటుండ నిమ్మ, హంసి యిఁక నొకమఱి చూడ కనబ్బునేని
నాదుకన్నులు కన్ను లెకన్నంగ నేన, యగ్రగణ్యుండ ధన్యాత్ము కలందు నెల్ల. 23

అర్థము:—ఉవిద = (ప్రకృతి-యువతి) ఆజవరాలు, నాకున్, ప్రాపించుట = లభించుట, అటు+ఉండనిమ్ము = అట్లుండనీ, (దాని మాటకేమి) ఇఁకన్ + ఒకమాఱు = ఇంకొకమాఱు, చూడన్ = (నేను) చూచుటకు, హంసి = శుచిముఖి, అబ్బునేని = దొరకినచో (తటస్థపడినచో అని భావము), నాదు కన్నులు= కన్నులు, ఎన్నంగన్ = ఆలోచింపఁగా, నేను + అ = నేనే, ఎల్లన్, ధన్యాత్ములందున్ - ధన్య = దలఁచినపని నెఱవేఱినట్టి, ఆత్ములందున్ = మనస్సుగలవారిలో, అగ్రగణ్యుండన్ = ముందు లెక్కింపఁ తగినవాఁడను.

తాత్పర్యము:—ఆజవ్వని నాకు లభించుమాట యటుండనీ, ఇంకొకమాఱు శుచిముఖిని చూడఁ గల్గినచో నాకన్నులు కన్నులగును. కృతార్థులలో నేను మొదటివాఁడ నగుదును.

అలం :—అంతకు పూర్వమే కన్నులైనవానికి "హంసిని జూచిననే కన్ను లగు"నని క్రొత్తగా నేత్రత్వము విధించుటచేత దీనిని "విధ్యలంకార" మందురు. "కంజాక్షు నర్చించు కరములు కరములు" మున్నగునవి యిట్టివే.

వి. :—అటుండనిమ్ము. ప్రకరణాంతరము సూచించు, ఇట్టివే 'అది యట్లుండె' మున్నగునవి, తెలుఁగు జాతీయములు. ఇచ్చట తనకు ప్రభావతిపొం దావశ్యకమై యుండ - ప్రద్యుమ్నుఁడు హంసిని చూడవలె నని కోరుటలోని యౌచిత్య మరయ - ప్రభావతికిఁ దనయందు వల పున్నట్లు మాత్రమే హంసి సూచించెను. కాని లభించునుపాయము తా నడుగలేదు. అది చెప్పలేదు. కాన దాని నొకమాఱు చూచినచో ప్రభావతి లభించునుపాయము తెలిసికొని, ప్రభావతిని ప్రత్యక్షముగాఁ జూచుట కల్గినచో నేత్రములు సఫలము లగును. తాను కృతార్థుఁడు నగు నని వ్యంగ్యము. మఱియు విరహులకు ప్రియాగుణ కీర్తనము తాపోపశాంతి కారకము. కావున శుచిముఖి వచ్చినచో ప్రభావతీ గుణకీర్తనము చేసి తన హృదయతాపము పోఁగొట్టు నని తలఁచుట మ ఱొకవ్యంగ్యము.

ఆ. వచ్చునొకొ సురారి ♦ వార్త చెప్పఁగఁ దాను, వచ్చి కడలఁ బోక ♦ యిచ్చటికిని
దెచ్చునొకొ ప్రభావ♦తీక్షేమ వృత్తాంత,మాత్ర మయిన నంచ♦మగువ నాకు. 24

అర్థము:—అంచమగువ = ఆ యాఁడుహంస, సురారివార్త = వేల్పులపగవాఁ డగు వజ్రనాభుని యొక్క వృత్తాంతము, చెప్పఁగన్, వచ్చునొకొ = వచ్చునా? వచ్చి, కడలన్ = ఏవైపులనుండియో, పోక = వెడలిపోక, నాకున్ = నాకొఱకై, ప్రభావతీ క్షేమవృత్తాంత మాత్రము + అయినను = ప్రభావతియొక్క సుఖముదెలుపు వార్తమాత్ర మైనను, ఇచ్చటికిన్ = నేనున్న యీ చోటికి, తెచ్చునొకొ = తెచ్చునా? సుఖవార్తచెప్పునా? అని భావము.

వి. :—కడలఁబోవు = తప్పుకొనిపోవు అని కాని, దూరమునుండి పోవు అని కాని, అర్థమున జాతీయము కావచ్చును.

అవతారిక:—ప్రభావతీ క్షేమవార్తామాత్ర మైనను దెలిసికొనఁ దహతహపడుటకుఁగారణ మీ క్రింది పద్యమునఁ దెలుపఁ బడుచున్నది.

చ. వినుకలిచేతనే విరహ♦వేదన నామది నింత వర్ధిలెన్
గనుకలి నట్లు చిత్రఫల♦కంబునఁ గాంచినయింతి నెమ్మనం
బునఁ గడు నింత కెంత పరి♦పూర్తి వహించునొ యెంత నొచ్చునో?
ఘన మని వింటిఁ జిత్తరువుఁ ♦ గన్గొను ప్రేమయు, నేమి సేయుదున్. 25

అర్థము:—వినుకలిచేతన్ + ఏ = వినుట మాత్రముననే, నామదిన్, విరహవేదన = ఎడఁబాటు వలనిబాధ, ఇంత = ఇంత యధికముగా, వర్ధిలెన్ = పెరిఁగెను (గదా), అట్లు = అంతగాఢముగా, కనుకలిన్ = చూపుతో, చిత్రఫలకంబునన్, (నన్నున్ అధ్యాహారము) కాంచిన = చూచినట్టి, ఇంతి నెమ్మనంబునన్ = ఆ ప్రభావతి మనస్సునందు (విరహపీడ), ఎంతపరిపూర్తిన్ = ఎంతపూర్ణతను, ఆధిక్యమును, వహించెనో = పొందెనోకదా, ఎంత నొచ్చునో = ఎంతగా బాధపడుచున్నదో, చిత్తరువున్ = (నా) చిత్రఫలకమును, కన్గొను ప్రేమయున్ = చూచునట్టి ప్రీతియును, ఘనము = (ఆమెకు) అధికము, అని, వింటిని, ఏమి చేయుదున్ = ఏమి ప్రతిక్రియ చేయఁగలను.

తాత్పర్యము:—ఆమె రూపము విన్నంతమాత్రముననే ఆ ప్రభావతి నెడఁబాయుటవలనిబాధ యింత పొందుచుంటినే! చిత్తరువునఁ గనులార నారూపము చూచిన యామె యెంత బాధనొందుచున్నదో? కారణ మేమన - నాచిత్తరువును గనుఁగొనెడుప్రేమ యామె కత్యధిక మఁట! ఏమిచేయుటకు నుపాయము కానఁబడదు.

అలం:—కావ్యార్థాపత్తి, కావ్యలింగము.

వ్యా. వి. :—"కను, విను," ధాతువులపై భావార్థమున "కలి" ప్రత్యయము రాఁగా 'కనుకలి, వినుకలి' అగును. సూ. వడిప్రభృతు లిట్లెఱుంగునది. బాల. కృదంత. 22. నెఱ+మనము. సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు (ప్రాఁతాది కార్యంబులు) కొండొకచోఁ గానంబడియెడి. బాల. సంధి. 39. చే. నె+మ్మనము అయి, నెమ్మనము అని సిద్ధించినది.

ఆ. అందుమీఁద హంసి యరిగి నాతోడఁ దా, మాటలాడుటయును మద్విధంబుఁ
దెలుప నాసలేమి దలపోసి, యె ట్లౌనొ, చెలువ? యకట! యేమిసేయువాఁడ! 26

అర్థము:—అందుమీఁదన్ = దానిపైని - ఆవిరహపీడ నొందుచుండ, మీఁదుమిక్కిలి, హంసి = శుచిముఖి, అరిగి=అచటికిఁబోయి, తాను, నాతోడన్, మాటలాడుటయును, మద్విధంబున్=నేనేమియు ననక విని యూరకుండుటను, తెలుపన్ = చెప్పఁగా, ఆసలేమి = (నాకు) అభిలాష లేకపోవుటను, తలపోసి = భావించి, చెలువ = (అంత యుత్కటప్రేమగల) ఆప్రభావతి, ఎట్లు + ఔను+ఒ=ఏరీతిగా నగునో - (జీవించునో లేదో అనిభావము) అకట, ఏమి, చేయువాఁడను.

మత్తకోకిల. అంచతొయ్యలి దేవతాపతియానచొ ప్పొనరించి యేఁ
తెంచు టెన్నఁడు? దానిచేత మదీయహృద్గతిఁ జెప్పి యేఁ
బంచు టెన్నఁడు? గావునన్ వెసఁ బత్రికన్ లిఖియించి యా
యంచ కిప్పుడు పంచెదన్ సతి కంత దెల్పెడునట్లుగాన్. 27

అర్థము:—అంచతొయ్యలి = హంసాంగన, దేవతా...చొప్పు - దేవతాపతి = ఇంద్రునియొక్క, ఆన చొప్పు = ఆజ్ఞాప్రకారము, ఒనరించి = చేసి, ఏఁతెంచుట = వచ్చుట, ఎన్నఁడు = ఎప్పుడు, (ఎప్పటికి వచ్చునో అని భావము) ఏన్ = నేను, మదీయహృద్గతిన్=నాసంబంధమైన యభిప్రాయమును, చెప్పి = (దాఁచకుండ) పలికి, పంచుట - (ఆశుచిముఖిని) పంపుట = మరలపంపుట, ఎన్నఁడు = ఎప్పుడు, (ఎప్పటికిఁ బంపుదును? అని భావము) కావునన్, సతికిన్ = ప్రభావతికి, అంత = సమస్తమును-(నాహృద్గతమైన యావద్విషయమును అని భావము), తెల్పెడు నట్లుగాన్ = తెలియఁ జెప్పునట్లు, పత్రికన్ = ఉత్తరమును, లిఖియించి = వ్రాసి, ఆ యంచకున్ = ఆ శుచిముఖికి, వెసన్ = త్వరగా, పంచెదన్ = పంపెదను.

తాత్పర్యము:—ఇంద్రాజ్ఞాప్రకారం మంతయు నడపి శుచిముఖి యెప్పటికి వచ్చును ? నాహృదయ స్థితి దాని కంతయుఁ జెప్పి యెప్పుడు దానిని పంపుదును? కావున నాయింతి కంతయుఁ జెప్పున శ్లోకజాబు వ్రాసి హంసి కందునట్లు పంపుదును.

వి. :—పత్త్రిము అనఁగా ఆకు - పిదప వ్రాయుట కుపయోగించు తాటియాకు, కాగితము మొదలగు వానియందు రూఢియైనది. దాని రూపాంతరమే పత్త్రిక. ఈపద్యమున "జాబు" అను విశేషార్థమున వాడఁబడినది.

వ్యా. వి. :—పంచుట. పోవు ధాతువుయొక్క ప్రేరణార్థక రూపవిశేషము. పుచ్చు, అంచు, పనుచు, పంచు మున్నగు వానిలోనిది.

వ. అని తలంచి యాక్షణంబ శుచిముఖిపేర లేఖ వ్రాసి యిది గొంపోవువా రెవ్వ రని నివ్వటిల్లెడు చింత నంతరంగంబు గలంగ నుద్యానమధ్యంబునకుం గ్రమ్మఱ నరుగు దెంచి యత్తఱి నుత్తరంబు చనువాని నెల్ల నుద్దేశించి తద్దయు దుర్దమంబైన విర హార్తికతన వార్తాహరణ యోగ్యాయోగ్య వివేకంబు లేక యి ట్లనియె. 28

అర్థము:—అని తలంచి, లేఖ = ఉత్తరము, కొంపోవువారు = తీసికొనివెళ్లువారు, నివ్వటిల్లెడు చింతన్ = అధికమగు విచారముచే, అంతః + అంగము = మనస్సు, కలంగన్ = కలఁతనొందగా, ఉత్తరంబు = ఉత్తరదిశకు, చనువానిన్ + ఎల్లన్ = వెళ్లునట్టివాని నన్నిటిని, దుర్దమంబు = అణఁపరానిదగు, విరహార్తికతనన్ = ఎడఁబాటువలనిపీడ కారణముగా, వార్తా...వివేకంబు - వార్తా = వార్తయొక్క, హరణ = తీసికొనివెళ్లుటయందు, యోగ్య = అర్హులగువారిని, అయోగ్య = అనర్హులగువారిని గూర్చి, వివేకంబు = తెలిసికొను తెల్వి, లేక, ఇట్లు, అనియెన్.-"కామార్తాహి ప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు" అను కాళిదాససూక్తిని వ్యాఖ్యానించుచు "కామాంధానాం యుక్తాయుక్తవివేకశూన్యత్వాత్" అని పలికిన మల్లినాథ సూరివాక్యమునకును నీయర్థము ఛాయ యనవచ్చును.

సీ. కృప నెఱిఁగింపరే ! కీరోత్తమములార !, వజ్రపురికిఁ బోవు ! వారె మీరు ?
సదనుగ్రహమునఁ దుమ్మెదలార ! చెప్పరే, వజ్రపురికిఁ బోవు ! వారె మీరు ?
కరుణతో వినిపింపఁ ! గదరె కోయిలలార !, వజ్రపురికిఁ బోవు ! వారె మీరు ?
తెలుపరే దయఁ జూచి ! మలయవాయువులార, వజ్రపురికిఁ బోవువారె మీరు ?

తే. చలువ లొసఁగెడు మేఘరాజంబులార !, యమలపక్షత నొప్పు రాయంచలార
నిలిచి నామాటలకు మాఱుపలుకరయ్య !, వజ్రపురికిని బోయెడివారె మీరు. 29

అర్థము:—కీరోత్తమములార = శ్రేష్ఠములగు నోచిలుకలార, కృపన్ = దయతో, ఎఱిఁగింపరే= చెప్పుఁడు, మీరు, వజ్రపురికిన్, పోవువారె ? తుమ్మెదలార, సదనుగ్రహమునన్ = మంచి (లేక స్థిరమగు) దయతో చెప్పరే, కోయిలలార, కరుణతోన్, వినిపింపఁగదరె = వినిపింపుఁడు, చెప్పుడు, మలయవాయువు లార = మలయ పర్వతము సంబంధమగు గాలులార ! దయన్, (నన్నున్) చూచి, తెలుపరే, చలువలు = చల్లఁదనములను, ఒసఁగెడు = ఇచ్చునట్టి, మేఘరాజంబులార = మేఘశ్రేష్ఠములార ! అమలపక్షతన్ = తెల్లని ఱెక్కలకలిమితో, (పాపములేనివారియందు ప్రేమతోననియు నర్థము) ఒప్పు, రాయంచలార = రాజహంసలార, కలహంసలార, నిలిచి = ఆఁగి, నామాటలకున్, మాఱు, పలుకరయ్య = సమాధానము చెప్పుఁడు, మీరు, వజ్రపురికిని, పోయెడువారె ? - ఉన్మాదము అను మదనావస్థ యిందు చెప్పఁబడెను.)

క. అని పలుకుచున్న సమయం, బున నొకశుక మభ్రమార్గమున నేఁగుచు నా
తని దీనాలాపంబులు, విని కారుణ్యమున నిలిచి విస్ఫుటఫణితిన్. 30

అర్థము:—అనిపలుకుచున్న సమయంబునన్, ఒకశుకము = ఒకచిలుక, అభ్రమార్గమునన్ = ఆకసపుత్రోవను ఏఁగుచున్, ఆతని, దీనాలాపములు = జాలిగొలుపు మాటలను, విని, కారుణ్యమునన్ = దయచే, నిలిచి = ఆఁగి, విస్ఫుటఫణితిన్ = స్పష్టమగువాక్కుతో (మనుష్యవాక్కుతో నని భావము.)

వి. :—ఫణితి - "ఫణగతౌ" అని గత్యర్థమందు పాణినీయ ధాతుపాఠమునను, నిస్స్వాహకరణార్థమున కవికల్పద్రుమమునను - ఫణధాతువుగలదు. వాక్కు అను నర్థమున నిది సరిపడునట్లు తోఁపదు. భణధాతువు శబ్దించుట అను నర్థమున కలదు. దానిపై భణితి యనురూపమగుచో - వాక్కు అనునర్థము కుదురును. ఎచ్చటెచ్చట 'వాక్కు' అనునర్థమున "ఫణితి" శబ్దము గలదో అచ్చటచ్చట "భణితి" యని పఠించినచో సరిపడును. కాన ఫణితి కాదనియు, భణితి యనియు తెలియఁదగును. ఫాలము, భాలము మున్నగుద్విరూపశబ్దములవంటిదనుభ్రాంతిచేఁ "ఫణితి"రూపమువాక్కు అనునర్థమునవచ్చియుండవచ్చును. భణితిశబ్దమునకు వాక్కనునర్థమున "మధుమయభణితీనాం మార్గదర్శీమహర్షిః" అని చంపూరామాయణము.

ఆ. ఏను వజ్రపురికి నేఁగెడుదాన నా,వలనఁ గార్య మేమి ? గలదు నీకు
దెలుపు మొకటి రెండు పలుకుల ముగియఁగా,ననుచుఁ బలుకుటయును యాదవుండు.

అర్థము:—ఏను = నేను, వజ్రపురికిన్, ఏఁగెడుదానన్ = వెళ్లుచున్నదానను, నీకున్, నావలనన్, ఏమి, కార్యము, కలదు, ఒకటి రెండుపలుకులన్, ముగియఁగాన్ = ముగియునట్లు, తెలుపుము, అనుచున్, పలుకుటయును = పలికినపిదప, యాదవుండు = యదువంశమునఁ బుట్టినవాఁడగు ప్రద్యుమ్నుఁడు. మీఁది కన్వయము.

సీ. "ఓ పక్షివర ! వినుమ మాపురి శుచిముఖి, యనుపేరి యొకరాజహంసి యుండు
నది యున్నచోటు నీ వరసి, యీపత్త్రిక,యందింపవలయు మత్ప్రార్థనమున".
నన విని, యాచిల్క "యట్ల చేసెద సహా,యంబు, పోయెద, మాటలాడ నాకు
లే దవకాశంబు లేశమాత్రంబును, నాదుపక్షంబులనడుమ లేఖ

ఆ. యొరుల కెఱుకపడక యుండునట్లుగఁ గట్టు, మతిరయంబుతోడ" ననుచు నతని
దండ కరిగి నిలిచెఁ దడయ కాతఁడు నట్లు, చేసె నదియుఁ జనియె శీఘ్రగతిని.

అర్థము:—అరసి = కనిపట్టి, మత్ప్రార్థనమునన్ = నా యొక్క కోరికచేత, సహాయంబు=సాయము (ఇట ధర్మపరము), లేశమాత్రంబును = కొంచెమైనను, పక్షంబులనడుమన్ = ఱెక్కల మధ్యమున, దండకున్ = చెంతకు, శీఘ్రగతిని = వేగమైననడకతో - తక్కినది సుగమము. ఇటుమీఁద శుచిముఖి వృత్తాంతము చెప్పఁబడుచున్నది.

వ. అంతకు మున్ను శుచిముఖియును, నుచితప్రకారంబున నట్లు తనబలంగంబునుం దానును దానవాంతఃపురకామినీసమీపసంచారపరిచయంబు సంపాదించుకొనుచుం గ్రమంబునఁ బ్రభావతితోడిచెలిమి గలిగించుకొనుటకుం దఱి వేచియుండుఁ గావున నది కనుపెట్టుకొని యుండ, నొక్కనాఁ డక్కలకంఠి తోంటి సరసిపరిసరంబునం

దమందకందర్పతాపశమనార్థంబుగ రాగవల్లరి యను నెచ్చెలియుం దానును వచ్చి
వనవిహారంబు సలిపె - నప్పుడు. **33**

అర్థము :—ఉచితప్రకారంబునన్ = తగురీతిని, దానవాంతఃపుర...పరిచయంబు - దానవ = వజ్రనాభునియొక్క, అంతఃపురకామినీ = శుద్ధాంతమందలి స్త్రీలయొక్క, సమీప = దగ్గఱ, సంచార = తిరుగుటచేతనైన, పరిచయంబు, సంపాదించుకొనుచు, (ప్రథమాశ్వాసము 106 పద్యమున ఆ పరిచయము వర్ణితము.) క్రమంబునన్ = క్రమముగా, ప్రభావతితోడిచెలిమి = ప్రభావతితో స్నేహమును, కలిగించుకొనుటకున్, తఱి = అనుకూలసమయమునకై, వేచియుండును = కాచుకొని యుండును, కావున, అది = ఆ శుచిముఖి, (అట్లు) కనుపెట్టుకొనియుండఁగ = ప్రతీక్షించి యుండఁగా - కలకంఠి = అవ్యక్తమధురమగు కంఠధ్వని గలది, ప్రభావతి, సరసిపరిసరంబునందున్ = కొలనిసమీపమున, అమంద...నార్థంబుగన్ - అమంద = అత్యధికమైన, కందర్ప = మన్మథునివలని, తాప = వేఁడిమియొక్క, శమనార్థంబుగన్ = శాంతికొఱకు, తగ్గుటకొఱకు, "రాగవల్లరి" అను = (జనులు) రాగవల్లరి అనుపేరఁ బిలుచునట్టి, వనవిహారంబు = పూఁదోఁటలో వినోదించుట.

వి. :— కనిపట్టు, అనునది "కనిపెట్టు" అనుట ప్రామాదికము, కని, పట్టు=గ్రహించు - అని దాని కర్థ మగును. పెట్టు ధాతువుతో నగునేని కనుపెట్టు - (కను = కన్ను), ఉత్త్వలోపమున 'కన్పెట్టు' అగును. ఇట్లె - "కనఁబడు" అనునదియును. ఇది తొలుత కర్మార్థకముగా పుట్టియు, అగ్గమగు, గోచరించు - అని కర్త్రర్థకముగా వ్యవహరింపఁబడుచున్నది. "కనఁబడు" అనునది 'కన్బడు, కన్పడు' అనుట భ్రమమూలకము. కనుపట్టు - కన్పట్టు = గోచరించు అనునవిసాధువులు - కన్ను శబ్దమునుండివచ్చిన శబ్దపల్లవక్రియ కావున, హంసవింశతి 1. 65. లో. "కనుపడు ధూమాంకురములగతి నృపుమేనన్" అనుతావునఁ కనఁబడు అని యైనను పఠింపవచ్చును. శుకసప్తతి - 3. 354. లో "కుప్పెకన్పడ గొప్ప కొప్పువెట్టి" - అను ప్రయోగము నందు "కన్పడు" అనుట భ్రమమూలకము అనఁదగును.

సీ. అతివ మందస్మితద్యుతి ప్రసాదంబున, విరులపాండిమ యభివృద్ధిఁ గాంచె
సతి కటాక్షశ్రీల సాహాయ్యకమునఁ దు, మ్మెదపిండు చెలువ మభ్యుదయ మొందె
జలజాక్షి కరతలచ్ఛవి యనుగ్రహమునఁ, జివురుఁగెంజాయ పుష్టిని వహించెఁ
దరుణి నిశ్వాసగంధముప్రోది మలయవా, యువుల నెత్తావివైభవము చెందె

తే. నవిలతాంగికిఁ దోడ్తోన యార్తిఁ బెనిచె, బాటిలదె రజోమాలిన్యపల్లవత్వ
చాపలంబుల కాధారమై పరఁగెడు, వారికిని మేలొనర్చిన వారి కెగ్గు.

అర్థము:—అతివ ... ప్రసాదంబునన్ - అతివ = ఆస్త్రీ (ప్రభావతి) యొక్క, మందస్మితద్యుతి = చిఱునవ్వుకాంతియొక్క, ప్రసాదంబునన్ = అనుగ్రహముచేత, విరులపాండిమము = పువ్వులయొక్క తెల్లఁదనము, అభివృద్ధిన్, కాంచెన్, సతికటాక్ష శ్రీలసాహాయ్యకంబునన్ =ఆయింతియొక్క కడగంటిచూపుల సిరులయొక్క (శోభలయొక్క అనియు, సంపదలయొక్కనియు నర్థద్వయము) సాయముచేత, తుమ్మెదపిండుచెలువము = తుమ్మెదగుంపులయొక్క సొగసు, అభ్యుదయము = మేలును, ఉన్నతిని, ఒందెన్ = పొందెను, జలజాక్షి = తామరలవంటి కన్నులుగల యామెయొక్క, కరతలచ్ఛవి యనుగ్రహమునన్ = అఱచేతికాంతుల దయచేత, చివురుఁగెంజాయ = చిగురుటాకులయొక్క యెఱ్ఱకాంతి, పుష్టిని = బలుపును, వహించెన్ = పొందెను, తరుణి...ప్రోదిన్, తరుణి = ఆయువతియొక్క, నిశ్వాస - నిట్టూర్పుల సంబంధమగు, గంధము = వాసనయొక్క, ప్రోదిన్ = రక్షణముచేత, మలయవాయువుల = మలయ మను కొండనుండి వచ్చుగాలులయొక్క, (దక్షిణపుగాలులయొక్క అనిభావము) నెఱ + తావి = సువాసన, వైభవము

చెందెన్ = అభ్యున్నతిని పొందెను. (ఇట్లు మే లందియు) లతాంగికిన్=తీఁగవంటి మేనుగల ఆ ప్రభావతికి, అవి = విరులపాండిమ మున్నగునవి, తోడ్తోన = వెనువెంటనే, ఆర్తిన్ = పీడను, పెంచెన్=వృద్ధిచేసెను. రజో...చాపలంబులకున్-రజః=రజోగుణమునకును (పుప్పొడికిని), మాలిన్య = పాపమునకును (నల్లఁదనమునకును), పల్లవత్వ = విటభావమునకును (చిగురా కగుటకును), చాపలంబులకున్ = స్థిరబుద్ధి లేకుండుటకును (చంచలత్వమునకును), ఆధారమై = అండయై, పరగెడువారికిని = ఒప్పునట్టివారికిని (ఈ నాలుగు గుణములకు వరుసఁగా నాధారములైనవి పూవులు, తుమ్మెదలు, చివుళ్లు, మలయవాయువులును.) మేలు = ఉపకారము, ఒనర్చినవారికిన్ = చేసినవారికి, ఎగ్గు = అపకారము, పాటిలదె = కలుఁగదా ? కలుగునని భావము.

తాత్పర్యము:—ప్రభావతియొక్క చిఱునగవుకాంతియొక్క దయచేత పువ్వుల తెల్లరంగు వృద్ధినొందెను. ఆమెకడగంటిచూపుల లక్ష్ముల సాయము నూని, తుమ్మెదలసొగసు గొప్పతన మందెను. ఆమె యఱచేతి కాంతుల దయచేత చిగురాకులయెఱ్ఱకాంతి బలుపును గనెను. ఆమె నిట్టూర్పుగాడ్పుల సువాసనల రక్షణము నొంది మలయానిలముల పరిమళము వైభవ మొందెను. ఇట్టి యుపకారము లొందియు నవియె ప్రభావతికి, వెనువెంటనే (విరహమువలని) పీడ గలిగించినవి-అవును- లోకమున రజోగుణమునకును, పాపమునకును, విటకానితనమునకును, స్థిరబుద్ధి లేమికిని స్థానము లైనవారికి మేలొనర్చువారు వారివలననే కీడు పొందకుందురా! ఇందు పూవులకు రజోగుణ మనఁగా పుప్పొడి కల్గియుండుట యనియు, తుమ్మెదలకు మాలిన్యము అనఁగా నల్లఁగానుండుట యనియు, చివుళ్లకు పల్లవత్వము అనఁగా చిగురాకుఁదనము (పల్లవధర్మము) కలిగియుండుట యనియు, దక్షిణవాయువులకు చపలత్వము - అనఁగా నిలుకడలేమి యనియు, నర్థాంతరము లనుసంధించుకొనవలెను.

అలం.:—సీసపాదములందు, ప్రతీపము. మఱియు ప్రసాదము, అభ్యుదయ మొందుట, అనుగ్రహము వైభవము నొందుట మున్నగు చేతనధర్మము లచేతనములం దారోపింపబడి యన్వ్యర్థ స్ఫూర్తి కలుగుటవలన సమాసోక్తియును. గీతపాదములందు విషమమును, శ్లేషానుప్రాణితార్థాంతరన్యాసమును, యథాసంఖ్యమును గలవు.

వ్యా. వి:—పాండిమ, పాండిమము. సూ. ఆత్మేమనిజంతంబులకు నాంతంబులగు మనుజ సంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు. బాల. తత్సమ. 77. (ఇది ఇమనిజంతము) కరతల + ఛవి - అనునప్పుడు సంధియందు "తుగాగమము జశ్త్వ చర్త్వములు వచ్చి - కరతలచ్ఛవి" యనియైనది. "ఛేచ" - హ్రస్వస్యఛే పరే తుగాగమఃస్యాత్." అని పాణినీయము. చివురుఁగెంజాయి - కెంపు + చాయ - సూ. సమాసంబునఁ బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబుకెల్ల లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 36 చే-కె+చాయ. అనియయి, సూ. లుప్తశేషంబునకుఁ బరుషములు పరంబగునపుడు నుగాగమం బగు బాల. సంధి 37. చే నుగాగమము రా, కె + ను + చాయ అయి ద్రుతకార్యము (బొంది) కెంజాయ అయ్యెను - "చివురు + కెంజాయ" అనునప్పుడు సూ. సమాసంబుల నుదంతం బగు స్త్రీ సమంబులకును, బుంపులకును బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమంబగు" బాల. సంధి. 25. చే నుగాగము రా 'చివురు + ను + కెంజాయ' అయి ద్రుతకార్యములొంది 'చివురుఁగెంజాయ' అని రూపసిద్ధి నొందెను.

సీ. విరహిరక్తముతోడి మరునిబల్లెము లన, నెల్లెడ విలసిల్లు పల్లవములుఁ
బాంథమేదఃస్నేహభరిత కామాస్త్రాళి, నా నొప్పు సరసప్రసూనములును
భావజు మిడివింటఁ బాఱు నీలపుగుండ్ల,భంగిఁ జరించు పుష్పంధయములుఁ
జేతోజ బల సముద్ధూత ధూళి యనంగ, రాజిల్లు సుమనఃపరాగములును

నసమసాయక జయబిరుదావళీ ప్ర, పాఠకర వందిజన ఘనార్భటి యనంగఁ
గడు విజృంభించు శుకపిక కలకలమును, నెలఁతకును గుండెదిగులు జనింపఁ జేసె.

అర్థము :—విరహిరక్తరుతోడి = ఒండొరుల నెడఁబాసిన నాయికానాయకులయొక్క నెత్తురుతోఁ గూడియున్న, మరునిబల్లెములు = మన్మథుని బల్లెములు (నాయుధవిశేషములు), అనన్ = అనునట్లు, ఎల్లెడన్ = అన్నితావులను, విలసిల్లుపల్లవములును = ప్రకాశించు చివుళ్లును, విరహిజనులను బొడువఁగా వారినెత్తు రంటుకొని యున్నమన్మథునిబల్లెములా యనున ట్లెఱ్ఱనైన చిగుళ్లు పూఁదోఁటయందంతటను గల వని భావము. పాంథ ... కామాస్త్రాళి - పాంథ = బాటసారులయొక్క, (భార్యలనెడఁబాసినవారియొక్క,) మేదః = క్రొవ్వురూపమగు, స్నేహ = చమురుతో, భరిత = నిండిన, కామ = మన్మథునియొక్క, అస్త్ర = ఆయుధములయొక్క, ఆళి = పంక్తి, నాన్ = అనఁగా, ఒప్పు = ప్రకాశించునట్టి, సరస = తేనెతోఁగూడిన, ప్రసూనములున్ = పువ్వులును, భావజు = భావమునఁబుట్టినవాఁడగు మదనునియొక్క, మిడివింటన్ = ఉండవింటినుండి, పాఱు = వేగముగా వెలువడిన, నీలంపుగుండ్ల భంగిన్ = ఇంద్రనీలపు గుండ్లవలె, చరించు=తిరుగుచున్న, పుష్పంధయములు = తుమ్మెదలును, చేతోజ= మన్మథునియొక్క, బల = సేనలచేత, ఉద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, ధూళి = దుమ్ము, (యుద్ధయాత్రకు చతురంగసేనలు వెడలునపుడు ధూళులు రేఁగును. అట్లేమన్మథసేనల యుద్ధయాత్రయు నున్న దని భావము. అనంగన్ = అనునట్లు, రాజిల్లు = ప్రకాశించు, సుమనఃపరాగములును = పువ్వులయొక్క ధూళులు, (పుప్పొడులును), అసమ...ఆర్భటి=అసమసాయక=బేసిబాణములు (ఐదు) గల మన్మథునియొక్క,(సాటిలేని బాణములుగలవాఁడని ధ్వని), జయ = గెలుపుల సంబంధమైన, బిరుద = గుణోత్కర్షాది వర్ణనతోఁ గూడిన ఛందోవిశేషములయొక్క, ఆవళీ = వరుసలయొక్క, ప్రపాఠ = పాఠమును - చదువుటను, కర = చేయుచున్న - (చదువుచున్న - అనిభావము) వందిజన = స్తుతిపాఠకులగుంపు సంబంధమైన, ఆర్భటి = పెద్దధ్వని, మ్రోఁత, అనంగన్ = అనునట్లు, కడున్, విజృంభించుచు = హెచ్చుచున్న, శుకపిక కలకలములు = చిలుకలయొక్కయు, కోయిలలయొక్కయు రొదలును (ఏకమై), నెలఁతకును = ప్రభావతికి, గుండెదిగులు = హృదయపీడ, అనగా భయమును, జనింపఁజేసెను = పుట్టఁజేసెను, కలిగించెను.

అలం. :—ఉత్ప్రేక్ష.

వ్యా. వి. :—పుష్పంధయము - (ఈరూపము వ్యాకరణవిరుద్ధము అని; సూర్యరాయాంధ్ర నిఘంటువు.) కాని తెలుఁగున "మత్తపుష్పంధయవేణి నిత్తు శిశుపాలున కంచు" నని భాగవతమునను, ఇందును గనఁబడుచున్నది. పాణినీయము దీని నంగీకరింపక పోయినను ముగ్ధబోధవ్యాకరణమున మాత్రము "ముంజకూలాస్యపుష్పాద్ధేటః - ఏభ్యః పరాత్ ధేటః ఖశ్ స్యాద్ధే ముంజంధయః, కూలంధయః, ఆస్యంధయః, పుష్పంధయః" అని అంగీకరించుటచే సాధు వనఁ దగును. "బిరుద" శబ్దము సంస్కృతము కా దనియు, సంస్కృత - విరుద - శబ్దభవ మని కిట్టిలు కన్నడనిఘంటువునఁ గలదు. కర్ణాటాంధ్రకవు లీబిరుద శబ్దమును సంస్కృత శబ్దములతో సమాసము చేసినారు. కన్నడమున వైరిసమాసము గలదు. కావున దాని ననుసరించి నిర్ణయింప వీలుపడదు. కాని "అష్టదిగ్రాజకుల మనోభయంకర బిరుదసన్నుత గుణాభిరామ గుణహారి తిరుమలరాయశౌరి. వసు. మున్నగు తావులందు విరుద శబ్దమే "వబయోరభేదః" అను సూక్తిచే "బిరుద" యయ్యె ననిన సరిపడును. విరుదము = గుణోత్కర్షాదివర్ణనము అని శబ్దకల్పద్రుమ మర్థముఁ దెలిపి "విరుదం కవయః ప్రాహుః గుణోత్కర్షాదివర్ణనమ్" ఇతి రూపగోస్వామికృత శ్రీగోవింద విరుదావళీ భాష్యే శ్రీబలదేవవిద్యాభూషణః" అని చెప్పుటచే "గుణోత్కర్షాది వర్ణనముచేయు ఛందోవిశేషము. సంస్కృతశబ్దము. వబలకు భేదము లేదు కాన విరుదశబ్దమునకే రూపాంతరము "బిరుద" శబ్దము అనుకోఁదగును. "జయబిరుదావళీ = గెలుపులను దెలుపునట్టి ఛందోవిశేషముల వరుస" యనుకొనుట లెస్స యని గోచరించుచున్నది.

వ. ఇవ్విధంబున నయ్యింతి తంతన్యమాన కంతుసంతాప యగుచు రాగవల్లరిం జూచి యిట్లనియె.

అర్థము:—తంతన్య...సంతాప - తంతన్యమాన=మిగుల హెచ్చుచున్న, కంతు=మన్మథునియొక్క, సంతాప = వేడిగలది, అగుచున్ - (మిగిలినది సుగమము.)

మ. అకటా ! యిట్టిది ప్రొద్దు పుచ్చుట కుపాయంబే విరోధంబ కా
క కడుం, జాలు వనాంతఖేలన మికం గన్నార మత్ప్రాణనా
యకరూపంబును జూచుచుండుటయె మే లామీఁద భావ్యర్థ మం
బిక యొక్కర్తె యెఱుంగుఁ దత్ఫలకమున్ బింబోష్ఠి తేవే వెసన్. 37

అర్థము:—బింబోష్ఠి = దొండపండువంటి మోవి గల ఓచెలీ! అకటా = అయ్యో, ఇట్టిది = ఇటువంటి యుద్యాన విహారము, ప్రొద్దుపుచ్చుటకున్ = కాలము వెళ్లించుటకు, కడున్ = మిక్కిలి, విరోధంబు + అ = ప్రతికూలమే, కాక = కాని, ఉపాయంబు + ఏ = సాధన మగునా ? వనాంత ఖేలనము = పూఁదోఁటయందు క్రీడించుట, చాలును, ఇఁకన్ = ఇంక, మత్ప్రాణనాయకు రూపంబును= నాప్రాణేశ్వరుని యాకృతిని, కన్నారన్ = కన్నుతనియునట్లు, చూచుచుండుటయె, మేలు = మంచిది, ఆమీఁదన్ = ఆపైని, భావి + అర్థము = కాఁగల పనిని, అంబిక = గౌరీదేవి, ఒక్కర్తె=ఒక్కతియే, ఎఱుంగున్, తత్ఫలకమున్ = ఆచిత్తరువుగల పలక, వెసన్ = త్వరగా, తేవే = తెమ్ము.

తాత్పర్యము:—చెలీ! ఉద్యానవిహారము కాలక్షేపమునకు విరోధమే కాని అనుకూలము కాదు. ఇఁక నీవిహారము చాలును. ఇంతకంటె నాప్రాణేశ్వరుని రూపమును కన్ను దనియఁ జూచుచుండుట మంచిది. ముందు కావలసినకార్య మంతయు గౌరియే యెఱుఁగును. ఆమె యెట్లు నడపనై యున్నదో ! ఆవిచారము మన కేల ? ఆ చిత్రఫలకమును వెంటనే తెమ్ము.

వ్యా. వి. :—బ్రధ్నశబ్దభవము ప్రొద్దు అని కొందఱు, 'పొళుదు' అను తమిళమునుండి వచ్చిన దని కొందఱు. ప్రొద్దు (నానా.) 1 సూర్యుఁడు 2 కాలము 3 అహోరాత్రము 4 పగలు 5 పూట. విరహులకు చిత్రదర్శనము వినోదోపాయ మనినాఁడు మల్లినాథసూరి. "చిత్రదర్శనస్య విరహిణాం వినోదోపాయత్వాత్" కామశాస్త్రమున - వియోగకాలమునం దిష్టజనముతో సమమగు దుఃఖానుభవము, చిత్తరువు వ్రాయుట, చూచుట, స్వప్నదర్శనము, ఆయిష్టజనముయొక్క యంగమును తాఁకినవారిని తాఁకుట, కామవ్యథ నొందు వారికి ప్రతీకారముగాఁ జెప్పఁబడెను. శ్లో. వియోగావస్థాసు ప్రియజనసదృక్షానుభవనం। తత శ్చిత్రంకర్మ, స్వపనసమయే దర్శనమపి। తదంగస్పృష్టానా ముపగతవతాం స్పర్శన మపి। ప్రతీకారః కామవ్యథితమనసాం కోపి కథితః - అని. కావున కామవ్యథితమనస్క యగుప్రభావతి ప్రియునిచిత్తరువును కాలక్షేపార్థముగాఁ దె మ్మని చెలితో ననెను.

వ్యా. వి. :— "బింబోష్ఠి - బింబ + ఓష్ఠ - "ఓత్వోష్ఠయో స్సమాసేవా" (1-1-64 సూ.) వార్తికముచే - బింబౌష్ఠి, బింబోష్ఠి - అనురూపద్వయముసిద్ధించును. తేవే - తెచ్చు + ము + ఏ - (ముత్తుపరంబగునపుడు) సూ. తేతేరులు తెచ్చున కగు. బాల. క్రియా. 93. తే + ము + ఏ. అగును. సూ. ఎదాదు లనుప్రయుక్తంబగునపుడు ముజ్జునకు వుజిరుజి యగు. బాల. క్రియా. 34 చే. తే + వు + ఏ - అయి, "తేవే" యని సిద్ధించును.

వ. అని తెప్పించి యప్పలకయందు నాత్మసంకల్పవాసనావిశేషవశంబున ననేకవిధ శృంగార భావచేష్టావిశిష్టతం గనుపట్టునట్టి లిఖితరూప యదుకులప్రదీపు నెదుర నుండియుం గ్రేడించియు నిర్నిమేష యయ్యు నిమీలితాక్షి యయ్యుం గొంతతడ వనేకభావంబు లావహిల్లం జూచి చూచి. 38

అర్థము :—ఆత్మ...వశంబునన్ - ఆత్మ = మనస్సునందలి, సంకల్ప = తలఁపులయొక్క, వాసనావిశేష = సంస్కారాతిశయమునకు, వశంబునన్ = లోనగుటచేత - (మనస్సునందుఁ జిరకాలము తలఁచు

కొనుచుండుటచే నొకసంస్కారము - జిడ్డువంటిది - కలుగును దానినే వాసన యందురు. "అట్టివాసనకు లోనయి" యనఁగా - చిత్తరువు చూడఁగనే ప్రభావతిహృదయమున నావాసన యుద్బుద్ధమైన దన్నమాట.) అనేక ... విశిష్టతన్ - అనేకవిధ = పెక్కుతెఱఁగులైన, శృంగారభావ = శృంగారరససంబంధమగు అనుభావ సంచారిభావాదులతోను, చేష్టా = హావభావాదులతోను, విశిష్టతన్ = కూడుకొనియుండుటతో, కనుపట్టు = గోచరించుచున్న, లిఖితరూప = చిత్రింపఁబడిన రూపముగల, యదుకుల ప్రదీపు=యాదవ కుల మనుగృహమునకుఁ బెద్దదీపమైన ప్రద్యుమ్నునకు (కులము శ్లిష్ట రూపకము.) ఎదురన్, ఉండియున్, ప్రేడించియు = ప్రక్కకుఁ దొలఁగియు, నిర్నిమేష=ఱెప్పపాటులేనిది, అయ్యున్, నిమీలితాక్షి = మూసికొనిన కన్నులు గలది, అయ్యున్, అనేక భావంబులు = పెక్కు అభిప్రాయములు, ఆవహిల్లన్ = కలుగఁగా, చూచిచూచి = ఆదరాతిశయమున మరల మరలఁ జూచి. మీఁది కన్వయము.

చ. "అనయముఁదృప్తిఁ గావలయుఁ నంచు నజస్రము నెంత చూచినన్
గనుఁగవ కంతకంతకును గాటముగా నొక వింతవింత యిం
పు నెరపుచున్ ననుం దరలి పోవఁగనీ దికఁ నోర్వఁజాల నే"
ననుచు రసోద్ధతిం గదియ నక్కునఁ జేర్చె నిజేశురూపమున్. 39

అర్థము:—అనయమున్ = అత్యంతము, తృప్తి = తనుపు, కావలయును, అంచున్, అజస్రమున్ = ఎడతెఱపిలేకుండ, ఎంత = ఎంతగా, చూచినన్ = చూచినప్పటికి, కనుఁగవకున్ = రెండు కనులకును, అంతకంతకును = క్రమక్రమముగా, గాటముగాన్ = గట్టిగా, ఒక వింత వింత యింపు = ఒకానొక యత్యద్భుత మగు నానందము, నెరపుచున్ = కలిగించుచు, (ఈ చిత్తరువు - అధ్యాహారము) ననున్, తరలి పోవఁగ నీదు = విడిచిపోనీయ కున్నది, ఇఁకన్, నేను, ఓర్వఁజాలన్=సైపఁజాలను, అనుచున్, రసోద్ధతిన్ = ప్రేమాధిక్యముచేత (ఎక్కువ ప్రేమచే నని భావము), నిజేశు రూపమున్ = తన నాథుని యాకారమును, (చిత్తరువును), అక్కునన్=ఱొమ్మునందు, కదియన్=తగులునట్లు, హత్తుకొనునట్లు, చేర్చెన్=చేర్చుకొనెను.

తాత్పర్యము:—మిగుల తృప్తి కలుగవలె నని ఎడతెగకుండఁగా నెంత చూచినను,తృప్తిలేదు సరిగదా! కన్నులకుఁ గ్రమక్రమముగా స్థిరతరమై, అత్యద్భుతమగు నొక యానందము కలిగించుచు నీ చిత్తరువు నన్నును తొలఁగి పోనీయ కున్నది. ఇఁక నే నోర్వఁజాలను అని ప్రేమాతిశయముచే ప్రాణేశుని రూపముగల యా చిత్రఫలకమును, ఱొమ్మున గట్టిగా హత్తుకొనునట్లు చేర్చుకొనెను. (సంచారి భావములందలి లజ్జా త్యాగము.)

గీ. చేర్చి యొక్కింత తడవు నిశ్చేష్ట యగుచుఁ
జొక్కి కనుఁగవ యరమోడ్చి శోభనాంగి
యంతఁ జిత్రరూపత మదియందుఁ దోఁపఁ
గ్రమ్మఱఁగఁ బుచ్చి కనుఁగొంచుఁ గాంక్ష లడర. 40

అర్థము:— చేర్చి = అట్లు చిత్తరువును ఱొమ్మునఁ జేర్చికొని, ఒక్కింత తడవు = కొంతసేపు, నిశ్చేష్ట = వ్యాపారములేనిది, అగుచున్, చొక్కి = వివశయై, శోభనాంగి = సుందరమగు దేహముగల యా ప్రభావతి (కర్త్రి.) (సుందరం రుచిరం చారు సుషమం సాధుశోభనం. అని అమరము.) కనుఁగవ, అర మోడ్చి = సగము మూసి, (ఇది పారవశ్య సూచకము), అంతన్ = అంతలోన, చిత్రరూపత = చిత్తరువు లోని రూపగుట, మదియందున్, తోఁపన్, క్రమ్మఱఁగన్ = హృదయమునుండి తప్పిపోవునట్లు, పుచ్చి= తొలఁగించి, కాంక్షలు = కోర్కులు, అడరన్ = అతిశయింపఁగా, కనుఁగొంచున్ = చూచుచు - (వైపద్యముతో నన్వయము.)

లేదా — పుచ్చి = హృదయమునుండి తొలఁగించి, కాంక్షలు, అడరన్, క్రమ్మఱఁగన్ = మరల, కనుఁగొంచున్,అనియును జెప్ప నగును. (ఇందు పూర్వార్ధమున-స్తంభము, వైవశ్యము-అను సాత్త్వికభావములు.)

ఉ. ఇట్టి మనోహరాంగుఁ డొకఁ డెందయినన్ గలఁడేని గల్గియుం
గట్టిగ నా కతండు బిగికౌఁగిటఁ జేర్పఁగ నబ్బెనేని నే
నిట్టటు కొంచినన్ విడక యిష్టవిహారము లెల్లఁ గాంక్షఁ జే
పట్టి యొనర్చునేని రసభావము లెట్టివియొక్కొ యత్తఱిన్. 41

అర్థము:—ఇట్టిమనోహరాంగుఁడు = ఇటువంటి చక్కని దేహముగలవాఁడు, ఒకఁడు, ఎందున్ అయినన్ = ఎక్కడనైనను, కలఁడేని = ఉన్నయెడల (ఉండఁడని నిశ్చయజ్ఞానము. ఇట్లే ముందుగూడ) కల్గియున్ = ఉండియును, అతండు, బిగికౌఁగిటన్, గట్టిగన్, చేర్పఁగన్, నాకున్, అబ్బెనేని = కలిగెనేని, అతఁడు నన్ను తన బిగికౌఁగిట గట్టిగాఁ జేర్చుకొనుభాగ్యము నాకుఁ గలుగునేని, (ఆసమయమున నేను, ఇట్టు - అటు, కొంచినన్ = సంకోచించినయెడ - లేక భయపడినయెడ, విడక = మానక, లేదా - నన్ను కౌఁగిటినుండి విడువక, కాంక్షన్ = కోరికతో, చేపట్టి = నన్నుగట్టిగా పట్టుకొని, ఇష్ట విహారములు = తన యిచ్చవచ్చిన క్రీడలను, ఎల్లన్=అన్నిటిని, ఒనర్చునేని=చేయునెడల, అత్తఱిన్=ఆ సమయమునందు, రసభావములు = శృంగార రసమును, చేష్టలును, ఎట్టివి+ఒక్కొ = ఏరీతిగా నుండునోకదా !

తాత్పర్యము:—ఇంత చక్కనివాఁ డెక్కడనైన నున్నచో, అతఁడు తనబిగికౌఁగిట నన్నుఁ గట్టిగాఁ జేర్చుకొను భాగ్యము కల్గినచో, నే నిటునటు సంకోచింపఁగా, విడువక కోరిక దీఱ నిష్టక్రీడల నొనర్చునెడల ఆ సమయమున శృంగారరసమును చేష్టలును ఏరీతివిగా నుండునో! అలంకారము. సంభావనము.

క. అని యువ్విళ్లూరుచు మది, ననయముఁ దలపోయు నుస్సురనుఁ గాంతాళం
బునఁ బొరలు నిట్లు విరహంబున కోర్వక యవ్వధూటి బోటిం బలికెన్. 42

అర్థము:—అని, ఉవ్విళ్లూరుచున్ = రాఁగల సుఖమును తలఁచుకొని తహతహపడుచు, మదిన్, అనయము = అత్యంతము, తలపోయున్, ఉస్సురనున్, కాంతాళంబునన్ = తాళిమిలేమిచే, పొరలున్ = చలించును, ఇట్లు, విరహంబునకున్ = ఎడఁబాటునకు, ఓర్వక = సైఁపక, అవ్వధూటి = ఆ ప్రభావతి, బోటిన్ = చెలికత్తెను గూర్చి, పలికెన్ = (ఇట్లు) చెప్పెను. అలం:—సముచ్చయము.

క. ఉమసేవ యేను సలిపెడు, సమయంబునఁ గర్తృకర్మసాధన వైగు
ణ్యము లేమి గలిగెనో యిట్లమితవ్యథఁ దెచ్చిపెట్టె నాయమ నాకున్. 43

అర్థము:—ఉమసేవ = పార్వతియొక్క పూజ, ఏను = నేను, సలిపెడు సమయంబునన్=చేయునట్టి వేళయందు, కర్తృ...వైగుణ్యములు - కర్తృ = చేయువానియొక్కగాని, కర్మ = కృత్యముయొక్క - చేసెడు పూజయొక్కగాని, సాధన = ఉపకరణములగు పువ్వులు మున్నగువానియొక్కగాని, వైగుణ్యములు = గుణరాహిత్యములు (అనఁగా - ఉండవలసిన మంచి గుణములు లేకుండుట - లోపములు - అని భావము). ఏమి, కలిగెనో, ఆకారణముననే, ఆయమ = ఆ పార్వతీదేవి, నాకున్, ఇట్లు, అమితవ్యథన్ = హద్దులేని బాధను, తెచ్చిపెట్టెన్ = (తీసికొనివచ్చి) కలిగించెను.

తాత్పర్యము:—పార్వతీదేవిని నేను పూజించు సమయమున కర్త్రినగు నావలనఁగాని, చేసెడు పూజయందుఁగాని, సాధనములగు పూజాద్రవ్యములందుఁగాని యేవో లోపములు గల్గెను కాఁబోలు

కావుననే ఆమె స్వప్నమునఁ గనఁబడి చిత్తరువు నిచ్చి, అందలినాయకుని యూరును పేరును చెప్పక నాకిట్లపారమగు దుఃఖము తెచ్చిపెట్టినది.

వి. :—విగతగుణము - విగుణము = గుణవిహీనమైనది, విగుణముయొక్క భావము "వైగుణ్యము." సాద్గుణ్యమునకు వ్యతిరేకము.

క. ఇటు గాక లోకముల నిం, తటి చెలువుఁడు గలఁడె కలిగినను బుబ్బదె యి
చ్చట నచ్చటఁ గలఁ డని య, క్కట నన్ని ట్లేచుట యంబకరుణ తెఱంగే. 44

అర్థము:—ఇటు = ఈవిధము, కాక, లోకములన్ = ఎల్లలోకములందును, ఇంతటి చెలువుఁడు= ఇంతటి యందగాఁడు, కలఁడె = ఉన్నాఁడా? లేఁడని భావము. కలిగినను = ఉన్నచో, ఇచ్చటన్, కలఁడు, అచ్చటన్, కలఁడు, అని, బుబ్బదె = బయలుపడదా? అక్కట = అయ్యో! నన్నున్, ఇట్లు, ఏచుట = బాధించుట, అంబకరుణ తెఱంగు + ఏ = పార్వతీదేవి దయయొక్క పద్ధతి యగునా? - ఆమెకు నాపై దయయే యున్నచో నిట్లు బాధింపదు అనిభావము.

తాత్పర్యము:—ఈవిధమే కాని, ఇంతటి చక్కనివాఁడు లోకములం దెందైనను గలఁడా? ఉన్నచో అక్కడగలఁ డిక్కడ గలఁ డని బయలుపడదా? అయ్యో అంబకరుణ యిట్లుగా నుండునా?

సీ. అని పల్కుపలుకు । లాయవసరంబునఁ దత్స, మీపంబునం దనురూపగతిని
శుచిముఖి సంచరించుచు విని యిత్తన్వి, చిత్తంబు వడసి యేఁ । జెలిమికలిమి
హత్తించుకొనుటకు । ననుగుణంబగువేళ, యిదియ యటంచు నూహించి మదిని
దగునుపాయంబు వితర్కించి యప్పుడు య,దృచ్ఛనపోలె నా । తెఱవయెదుట
గీ. నడ్డముగ నల్లనల్లన । యరుగుచు సవి,మర్శదృష్టిని బలుమఱు । మరలిమరలి
చిత్రఫలకంబువంక వీక్షించెఁ గొంత, సరిగడచుదాఁక నొకవింత । సరణి మీఱ. 45

అర్థము:—అని ఇట్లు, పల్కు పల్కులు = చెప్పుమాటలు, శుచిముఖి, అనురూపగతిని = తగిన గమనముతో, సంచరించుచున్ = తిరుగుచు, విని, ఇత్తన్వి - (ఈ + తన్వి) = ఈ సుకుమారియగు ప్రభావతియొక్క, చిత్తంబు = మనస్సును, వడసి = పొంది, చెలిమికలిమిన్ = స్నేహసంపదను - అనఁగా దృఢమగుస్నేహమును, హత్తించుకొనుటకున్ = చెదరనటు కలిగించుకొనుటకు, అనుగుణంబు = తగినది, అగువేళ = అయినట్టిసమయము, ఇదియ = ఇదియే, అటంచున్ - అనుకొనుచు, మదిని, తగునుపాయంబున్ = తగినవెరవును, వితర్కించి = ఊహించి, యదృచ్ఛనపోలెన్ = (యదృచ్ఛన్ + అ + పోలెన్) స్వేచ్ఛచేతనువలెనే, ఆ తెఱవయెదుటన్ = ఆ ప్రభావతియెదుటి ప్రదేశమందు, అడ్డముగన్, అల్లనల్లనన్ = నెమ్మదిగా, అరుగుచున్ = పోవుచు, చిత్రఫలకంబువంకన్ = ప్రభావతి చేతియందున్న ప్రద్యుమ్నుని చిత్తరువువ్రాసియున్న పలకవైపు, సవిమర్శదృష్టిని = పరిశీలనతోఁగూడిన చూపుచేత, పలుమఱు = పెక్కుమాఱులు, మరలిమరలి = తిరిగితిరిగి, కొంతసరిగడచుదాఁకన్ =కొంచెము మేర దాఁటి వెళ్లువఱకు, వింతసరణి = విచిత్రమైనపద్ధతి, మీఱన్ = అతిశయించునట్లు, వీక్షించెన్ = చూచెను.

తాత్పర్యము:—అని ప్రభావతి చెలికత్తెతో ననెడిమాట లాసమయమున వారిదగ్గఱనే తగినవిధమునఁ దిరుగుచున్న శుచిముఖి విని, దీనిమనసును నావంకఁ ద్రిప్పికొని దృఢస్నేహము కలిగించుకొనఁదగిన సమయ మిదియే యని తలఁచి, తగినయుపాయ మూహించి, అప్రయత్నముగా వెడలినట్లామెయెదుట నడ్డముగ నెమ్మదిగా నడచుచు, పెక్కుమాఱులు విమర్శతోఁ గూడినచూపుతో కొంతముందునకు వెళ్లుదాఁక నచ్చెరువు పొందుచున్నట్లు తిరిగి తిరిగి ప్రభావతిచేతియందున్న యా చిత్రఫలకమువైపుచూచెను.

వ్యా. వి. :—చెలి + ఇమి - సూ. పేర్వాదుల కిమివర్ణకం బగు. బాల. తద్ధిత.5. భావార్థకతద్ధిత ప్రత్యయము. కలుగు + ఇమి. సూ. ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు. బాల. కృదంత. 4. కృత్ప్రత్యయము.

క. అపు డమ్మరాళిచందం, బుపలక్షించుచుఁ గపోలయుగ్మము దరహా
సపుఁగాంతిఁ దనరఁగా నా, చపలేక్షణ తనదు ప్రాణసఖి కి ట్లనియెన్. 46

అర్థము:—అపుడు, ఆ మరాళిచందంబు = ఆయాఁడు హంసయొక్క వైఖరిని, ఉపలక్షించుచున్ = చూచుచు, ఆచపలేక్షణ = చంచలమగు చూపులుగల యాప్రభావతి, కపోలయుగ్మము, రెండు చెక్కిళ్లు, దరహాసపుఁగాంతిన్ = చిఱునవ్వుయొక్క కాంతిచేత, తనరఁగాన్ = ప్రకాశింపఁగా, తనదు ప్రాణసఖికిన్ = ప్రేమాస్పద మైన తనచెలికత్తెతో, ఇట్లు - ముందు చెప్పఁబోవు విధమున - అనియెన్ = అనెను.

వ్యా. వి:—ప్రాణసఖికిన్ + ఇట్లు + అనియెన్ - సూ. వచ్యర్థాసుఖ్యకర్మంబునకుఁ దోడ, కు వర్ణకంబులు ప్రాయికంబుగా నగు. బాల. కారక. 6. సూ. ప్రాణసఖిని, సఖితోన్, సఖికిన్. అని మూఁడు విభక్తులును వచ్చును. దరహాసపుఁగాంతి,-దరహాసముయొక్క కాంతి - షష్ఠీతత్పురుష మైనను కర్మధారయంబు లందు మువర్ణకమునకుఁ బుంపులగు - అను సూత్రమునందలి బహువచనము వ్యర్థమై కర్మధారయేతరమునకు జ్ఞాపక మగుచున్నది. కాన ఇటపువర్ణ మాదేశ మైనది. దరహాసపు + కాంతి = అనియుండ "సమాసంబుల నుదంతస్త్రీసమంబులకును బుంపులకును బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు" అనుదానిచే నుగాగమమును, ద్రుతకార్యములును కలిగి - దరహాసపుఁగాంతి - అయినది.

క. "కఱదల పులుఁ గిది తా నే, మెఱుఁగునొకో తిరిగి తిరిగి యీఫలకముపైఁ
బఱపెడుఁ జూడ్కు-ల" నా నా, మెఱుఁగుంబోఁడికి మరాళి మృదుమధురోక్తిన్.

అర్థము:—కఱదలపులుఁగు = చమత్కారములు గల యీ పక్షి, తాను, ఇది=ఈ చిత్రపుసంగతి, ఏమి ఎఱుఁగునొకో=ఏమేనిఎఱుఁగునా యేమి, ఈ ఫలకముపైన్ =ఈ చిత్తరువు పలకమీఁదికి, మాటి మాటికి మెడమరల్చి, చూడ్కులు = చూపులు, పఱపెడున్= ప్రసరింపఁ జేయుచున్నది. నాన్= అనఁగా, ఆమరాళి = ఆయాఁడుహంస, ఆమెఱుంగుఁ బోఁడికిన్ = మెఱపువంటి దేహము గల యా ప్రభావతితో, మృదు మధురోక్తిన్ = మెత్తనితియ్యని మాటలో - ("ఇట్లనియెన్" అనిమీఁదివచనముతో నన్వయము.)

తాత్పర్యము:—ఇది మాయలమారి (లేక నేర్పులుగల) పక్షియే!, మన మెఱుఁగకుంటిమిగదా! తా నేమెఱుఁగు నని తిరిగితిరిగి, చిత్రఫలకము చూచుచున్నది? అని ప్రభావతి పలుకఁగా హంసి మృదువుగా తియ్యగా ని ట్లన్నది.

వి. :—కఱదలు (కఱదులు - అపపాఠము) - దీనికి "కఱతలు" రూపాంతరముగాఁ గనఁబడు చున్నది. కఱద - 1. వాక్కు 2. మాయమాటలు 3. సంకోచములు 4. చేష్టలు, పనులు 5. చమత్కారములు, వింతలు. మొదటిదానఁ దక్క మిగిలిన యర్థములందు నిత్యబహువచనాంతము అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. 5 వ యర్థమున కుదాహరణముగా నీ పద్యమే చూపెను. కళాపూర్ణోదయమున 'కఱదల పూపపైఁ మునులు గానని యట్టికతల్ వచింపఁగా, నెఱిఁగిన నీకు నాఁకలియు నేడ్పులు నా యనువారు' అను పద్యమునందలి "కఱద" శబ్దముతో సరిచేసి చూడ - చమత్కారి, (గడుసరి) పిట్ట, చమత్కారియగుబిడ్డ, అని కాని, మాయలమారిపిట్ట, మాయలమారిబిడ్డ, అని కాని యర్థము గ్రహించినచో ప్రకరణానుకూలముగా నుండు నని తోఁచుచున్నది.

వ్యా. వి. :—మెఱుఁగుంబోఁడి - సూ. బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁది "మేను"నకు బోఁడి యగు. బాల. సమాస. 23. చే - మెఱుఁగువంటి మేనుగలది అనునర్థమున "బోఁడి" యాదేశము కాఁగా, మెఱుఁగుఁబోఁడి యని సిద్ధించుచుండ - సూ. అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపద కర్మధారయంబులు. (సమాస. 29.) అని ప్రౌఢవ్యాకరణము - బోఁడికాదు, పోఁడి = మనోజ్ఞము, మనోజ్ఞురాలు అని యర్థము చెప్పి కర్మధారయ మనెను. కాని మనోజ్ఞురాలు అనునర్థము అలరుఁబోఁడి మెఱుఁగుఁ బోఁడి మున్నగు సమాసములందుఁ గుదిరినను తియ్యఁబోఁడి, చక్కెరఁబోఁడి అను వానియందు కుదురదనియే - బాలవ్యాకరణము ప్రాచీనుఁ డగు కేతన మార్గము ననుసరించి బహువ్రీహి యనెను. ఆ పక్షమున తియ్యఁబోఁడి అనగా మధురమగు నాకృతి కల దని పొసఁగును. "మగువ మధురాకృతి" యని ఈ కావ్యమున 3-16. లోనే కలదు. "కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం" అని అభిజ్ఞాన శాకుంతలమున కాళిదాసును ప్రయోగించెను.

వ. ఇ ట్లనియె "నోపడంతీ! నీ పలికినట్ల మాయట్టి తిర్యగ్జంతువు లేమియు నెఱుంగమి
యథార్థంబ, యైనను నేను నీచేతి చిత్రఫలకం బబ్రపడి చూచుటకుం గారణంబు
వినుము మున్నొక్కచోట నొక్కపురుషుం జూచి తత్సమాన రూపుని మఱి
యెందునుం గానక, యిప్పు డిందు నతనికైవడి దోఁచిన నిది తదీయ రూపం బెఱిఁగి
వ్రాసిన తెఱంగో? యటుగాక యట్టివాఁడె వే ఱొక్కఁ డెక్కడ నైనం గలిగెనో
యని యించుక విమర్శించి వీక్షించితి" నన విని ప్రభావతి యద్భుత ప్రమోద
సందేహంబులు డెందంబునం గ్రందుకొనుచుఁ గందళింప నప్పలుఁగుం దప్పక చూచి
యి ట్లనియె. 48

అర్థము:—తిర్యగ్జంతువులు = (అడ్డముగాఁ బోవునట్టి) పశుపక్ష్యాది ప్రాణులు, తత్ = అతనితో, సమాన=సరియగు, రూపునిన్ = రూపము గలవానిని, అతనికైవడి = అతనిపోలిక, తదీయ రూపంబు = అతనిదగురూపు, వ్రాసిన తెఱంగు + ఓ = చిత్రించిన విధమా? అద్భుత ప్రమోద సందేహంబులు = ఆశ్చర్యము, సంతోషము, సంశయము, క్రందుకొనుచున్ = సందడించుచు, కందళింపన్ = మొలవఁగా, కలుగఁగా, - కైవడి (నానా) (1) పోలిక (2) ప్రతిబింబము.

శా. ఏమేమీ యిఁక నొక్కమాటు చెప్పుమా ? యీ వున్నరూ పి ట్లయో
యేమైనం గలదో విభేద, మిటు రయ్యమ్మీక్షింపు మింకన్ వచః
సామర్థ్యం బరయన్ మహాత్మ వని యస్మద్బుద్ధికిన్ దోఁచె దా
హా మాభావము గానలేవె మదిలో ? హంసీ భయం బేటికిన్. 49

ప్రభావతికిఁ గలిగిన యద్భుత ప్రమోదసందేహము లిందు సూచిత మగును.

అర్థము:—ఏమేమీ = ఏమంటివి, ఏమంటివి (ఆశ్చర్య సూచకము), ఈవు, ఉన్నరూపు=కలరూపు నిజమును, ఇఁకన్=మరల, ఒక్కమాఱు, చెపుమా, అట్టివాఁ డున్నాఁడనుమాట (మరల మరల వినవలెనని, కోరిక - ప్రమోదసూచకము), అయో = అయ్యో, విభేదము = నీవు చూచినపురుషుని రూపముకంటె హెచ్చుగాని తగ్గుగాని, ఏమైనన్ = ఏ కొంచెమైనను, కలదో = ఉన్నదేమో (ఇది సందేహ సూచకము)- ఇటన్ = ఇచ్చటికి, రమ్ము, ఇంకన్ = మరల, ఈక్షింపుము = చూడుము. లేదా, ఇటన్, రమ్ము, ఈక్షింపుము, ఇంకన్ = ఈమీఁద - అని కాని (అన్వయింప వచ్చును), నీవచఃసామర్థ్యంబు = నీ మాటల

యందలి ప్రౌఢతనము, అరయన్ = పరిశీలింపఁగా, మహాత్మవు = గొప్ప బుద్ధివిశేషము గలదానవు, అని, అస్మద్బుద్ధికిన్ = మాబుద్ధికి, తోఁచెదు = గోచరించుచున్నావు, (కావున) ఆహా, మాభావంబు = నాయభిప్రాయము, కానలేవె = తెలిసికొనలేవా ? మహాత్మవు కాన తప్పక తెలిసికోఁగలవని భావము - హంసీ = ఓ యాఁడుహంసా, మదిలోన్ = నీ మనస్సునందు, భయంబు = భీతి, ఏటికిన్ = ఎందులకు ? భయపడ నక్కఱ లే దనిభావము.

అలం :—పరికరము. కావ్యలింగము.

వి. :—(అస్మద్బుద్ధికిన్) 'మా బుద్ధికి, మా భావము' - అనుటలోని బహువచనము ప్రభావతియొక్క యాభిజాత్యమును సూచించుచున్నది - గౌరవార్థమున బహువచనము.

వ. అనిన నది మదిరాక్షి నీక్షించి యిట్లనియె.

అర్థము:—అనినన్, అది = ఆ శుచిముఖి, మదిరాక్షిన్ = ప్రభావతిని, ఈక్షించి = చూచి, ఇట్లు, అనియెన్ = పల్కెను, మదిరాక్షి - వ్యుత్పత్తికై 2 ఆశ్వాసము 69 పద్యవ్యాఖ్య చూచునది.

క. నీ వనినయట్ల యేను భ,యావహులను గానివారి నాకృతిన కనం
గా వలఁతి నైన నఁ బిలువక, యే వెట్టినె చేర నిరువు రేకత మాడన్. 51

అర్థము:—నీవు, అనినయట్ల = 'మాభావముగానలేవె' యని పలికినట్లే, భయావహులను = (మాకు) భయము కలిగించువారిని, కానివారిన్ = భయపెట్టని వారిని, ఆకృతిన్ + అ = ఆకారముచేతనే, కనంగాన్ = తెలిసికొనుటకు, వలంతిని = సమర్థురాలను, కావున నాకు మీపట్ల భయ మేమియు లేదు. కాని - ఐనన్ అయినప్పటికిని, ఇరువురు = ఇద్దఱు, ఏకతమాడన్ = రహస్యము చెప్పుకొనుచుండఁగా, పిలువక, చేరన్ = సమీపించుటకు, ఏన్ = నేను, వెట్టినె = వెట్టిదాననా ?

తాత్పర్యము:—నీవు పలికినట్లు భయపెట్టువా రెవరో, పెట్టనివా రెవరో, ఆకారమును బట్టియే గ్రహింపఁగలను. దూరముగా నుండుట భయముచేఁ గాదు. ఇద్దఱు రహస్యము మాటాడుకొనుచుండఁగా పిలువకుండ సమీపించుటకు నేను వెట్టిదానను గాను.

వి. :—మీరు మాటాడుకొనునది రహస్యవిషయ మని నేను గ్రహించితిని. అని వ్యంగ్యము.

వ. అనిన వెఱఁగంది యాయిందుముఖి సఖియునుం దానును నొండొరులమొగంబులు చూచి నగుచుఁ జెవులకుం జవులు మివుల నలవరించు గులుకుటెలుంగు గల కలికి పలుకులకె వలచి మొలచుకుతుకంబున నతివశంవదహృదయలై తమ కిద్దఱకుం దాని పెద్దబుద్ధులు సుద్దులు ముద్దు రప్పించుచుం దద్దయు నుద్దీపితరాగంబు లగుచుండ రాగవల్లరి యా గఱువతనంబులాగు లేగరితలందును మున్ను కన్న విన్న యవియె దీనికఱదు లెంత యరుదులు చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాదమేదుర నిరీక్షణంబుల వీక్షించి యోపక్షికులభూషణంబ నీభాషణంబు నిక్కంబ మిక్కిలి నక్కఱపడి వేడక ప్రౌఢలగు గఱువ లిరువు రేకాంతమాడుచోటి కేటికిఁ బోయెద రిది యట్లు గాదు గదా! యే మొక్కసందియంబు నివర్తించుకొనం గోరి యుత్తటి నత్యంతంబు ప్రార్థనంబు గావించుచున్నవారము గావున నీకన్నయుష్పురుషునియొప్పు

నిప్పలకపై వ్రాసిన రూపంబుచొప్పు నొక్కటి యగునో కాదో యీదండకు వచ్చి
నిచ్చలంబుగాఁ జూచి నిశ్చయించి చెప్పు మిప్పుడుచు నేను నిట్టివాఁ డెందును లేఁడు
కలం డను వివాదంబునం బన్నిదంబు చఱచినవారము. 52

అర్థము:—అనినన్ = హంసియట్లనఁగా, వెఱఁగంది = ఆశ్చర్యపడి, ఆయిందుముఖి = చంద్రుని వంటి మోముగల యాప్రభావతి, చెవులకున్ + చవులు = చెవులకురుచులు (వినవలె నని కోర్కులు అని భావము.) మివులన్ = అధికముగా, అలవరించు = కలిగించుచున్నట్టి, కులుకు + ఎలుంగు = సొగసైన కంఠ స్వరము, కల కలికి పలుకులకున్ + ఏ = కలిగిన దంటమాటలకే, వలచి = కోరి, మోహపడి, మొలచు కుతుకంబునన్ = అంకురించుచున్న వేడుకతో, అతివశంవద హృదయలై = (అయంచకు) లోఁబడిన మనస్సులు గలవారై, తమకున్, ఇద్దఱకున్, దాని బుద్దులు=దాని యూహలును, సుద్దులు = మాటలును, ముద్దు, రప్పించుచున్ = కలిగించుచు, తద్దయున్ = అత్యంతము, ఉద్దీపితరాగంబులు = అధిక మొనర్పఁ బడిన ప్రేమ గలవి, అగుచుండన్ - రాగవల్లరి= ఆపేరుగల ప్రభావతి చెలికత్తె, ఆగఱువతనంబులాగులు= ఆపెద్దతనపు విధములు, ఏగరితలందును = ఏయిల్లాండ్ర యందును, మున్ను, కన్నవిన్నయవి+ ఏ = చూచి నవా? వినినవా ? (కాదనిభావము), దీనికఱుదులు = ఈహంసియొక్క చమత్కారపు మాటలు, ఎంత యరు దులు = ఎంత యద్భుతములు ? చూచితి + ఏ = చూచితివా, అంచున్, ఆదరా ... నిరీక్షణంబులు - ఆదర= ఆదరముచేతను, ఆహ్లాద = సంతసముచేతను, మేదుర = దట్టమైన, నిరీక్షణంబులన్ = చూపులచే, ఓపక్షికుల భూషణంబ =పక్షులకులమున కాభరణమైనదానా ! పక్షిశ్రేష్ఠమా! మిక్కిలిన్ =అత్యంతమును, అక్కఱపడి = ఆశపడి, వేడక = బతిమాలక, ప్రోడలు = నేర్పరులు, అగు గఱువలు=అయినపెద్దవారు, పూజ్యులు, ఇరువురు, ఏకాంతము + ఆడుచోటికిన్ = రహస్యము చెప్పికొను తావునకు, ఏటికిన్, పోయె దరు, ఇది = ఇప్పటి మాస్థితి, అట్లు = నీవనుకొనినట్లు, కొమగడా ! నివర్తించుకొనన్ = మరలించు కొనుటకు, పోఁగొట్టుకొనుటకు, నీకన్న యప్పురుషుని చొప్పు = నీవు చూచిన యామగవాని యందమును, రూపంబుచొప్పు = ఆకారముతీరును, నిచ్చలంబుగాన్ = స్థిరముగా, బాగుగా, చూచి, ఇప్పడుచును = ఈ యువతియును, ఏనును, వివాదంబునన్ = తగవునందు, పన్నిదంబు = పణము, చఱచినారము = ఒడ్డినారము.

వ్యా. వి. :—కులుకు + ఎలుఁగు - కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమం బగు. బాల. సంధి. 28. చే టుగాగము - కులుకుటెలుఁగు - కలికి = నానా (1) అందమైనది, (2) దంట, నేర్పరి, (3) ఆఁడుది. సం. బుద్ధిః, తద్భ. బుద్ధి - సూక్తి - సుద్ది - నిశ్చలము - నిచ్చలము.

కన్న విన్నయవి - (కన్నయవి + విన్నయవి) - సూ. ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపంబొండె నగు. ప్రౌఢ. సమాస. 32. విశేషణోభయపదసమాసముగా గావచ్చును.

క. అనుటయుఁ బందెముకొఱకై, నను వేఱొకపనికి నైన ని నా కది తెలియం
బని గలదె? మీకు నాచే, వినవలసిన యర్థ మరసి వినిపింతుఁ దగన్. 53

అర్థము :—అనుటయున్ = ఇట్లు చెలికత్తె గుట్టుగాఁ బలుకఁగా, పందెముకొఱకైనను (సరే), వేఱొకపనికైనను = చిత్తరువునందలిరూపము గలపురుషుని జాడ తెలిసికొనుటకైనను (సరే), అది, తెలియన్, నాకున్, పని = ప్రయోజనము, కలదే = ఉన్నదా ? (లే దనిభావము,) మీకు, నాచేన్ = నావలన, వినవలసినయర్థము = వినవలసినవిషయము, అరసి = చిత్తరువు పరిశీలించి, తగన్, వినిపింతును.

గీ. అనుచు శుచిముఖి తనమాట ని కాపడంతు, లీక్షితాన్యోన్య వదనలై యెంత దూర
మరుగుచున్నది దీనివాక్యాశయ మని, మివుల వెఱఁగందఁ గొంత చేరువకుఁ బోయి.

అర్థము:—అనుచున్, తనమాటకున్, ఆపడంతులు = ఆస్త్రీలు (ఇరువురును), ఈక్షితాన్యోన్య వదనలు = చూడఁబడిన యొండొరులముఖములు గలవారు - ఒకరిమొగ మొకరు చూచుకొన్నవారు, ఐ, దీనివాక్యాశయము = దీనిమాటలలోని భావము, ఎంతదూరము అరుగుచున్నది = ఎంతదూరము వెళ్లుచున్నది. (అనఁగా వ్యంజనాశక్తి యుతమైనది.) అని, వెఱఁగు అందన్ = ఆశ్చర్యపడఁగా - శుచిముఖి, కొంత = కొంచెము, చేరువకున్ = చిత్రఫలకముదగ్గఱకు, పోయి = వెళ్ళి. ముందుపద్యముతో నన్వయము.

క. సవిమర్శదృష్టి నాటితకవిధాన మొకింత నడపి కడుఁ బదిలముగా
వివరింప నతనిరూపము, యవు నౌ నిది యిందు సందియము లే దనియెన్. 55

అర్థము:—సవిమర్శ ... విధానము - సవిమర్శ = బాగుగా పరిశీలనతోఁ గూడిన, దృష్టి = చూపుయొక్క, నాటితకవిధానము = అభినయించు విధమును, ఒకింత = కొంచెము, నడపి = చేసి, (ఇంతకు మున్ను ప్రద్యుమ్నుని నతనిచిత్తరువును గూడఁ దెలిసిన దయ్యు క్రొత్తగా నప్పుడే చూచుచున్నట్లభినయించుచు - అనిభావము) కడున్, పదిలముగాన్ = మిగుల జాగ్రత్తగా, వివరింపన్ = విచారింపఁగా, ఇది=ఈ చిత్తరువునందలిది, అతనిరూపము + అ = నే నింతకు ముందు చూచినపురుషుని యాకారమే, అవునౌను, సందియము లేదు, అనియెన్ = అనిచెప్పెను.

చ. అనుటయు రాగవల్లరి మహోత్తర మోదవిశేషసంభ్రమం
బునఁ బఱతెంచి యప్పులుఁగుముద్దియఁ దద్దయు ముద్దు గారవం
బును జిగురొత్త నెత్తికొని పోయి ప్రభావతిదండఁ బెట్టి యొ
య్యనఁ గొనగోళ్ళఁ దత్తనురుహంబులు దువ్వుచుఁ గూర్మి నిట్లనున్. 56

అర్థము:—అనుటయున్ = అట్లు శుచిముఖి పలికినవెంటనే, రాగవల్లరి, మహా ... సంభ్రమంబునన్ - మహాత్తర = అత్యధికమైన, మోద = సంతోషముచే (గల్గిన), విశేష = ఎక్కువ యగు, సంభ్రమంబునన్ = తొట్రుపాటుతో, పఱతెంచి = పరుగెత్తి వచ్చి, తద్దయున్ = అత్యంతము, ముద్దు = వాత్సల్యమును, గారవంబును = గౌరవభావమును, చిగురొత్తన్=అంకురింపఁగా, అప్పులుఁగుముద్దియన్ = ఆ యాఁడుపక్షిని, ఎత్తుకొనిపోయి = రెండుచేతులతో పొదిగి లేవఁదీసికొనిపోయి, ప్రభావతిదండన్ = ప్రభావతిదగ్గఱ, పెట్టి = ఉంచి, తత్తనురుహంబులు = ఆ యంచయొక్క ఱెక్కలను, ఒయ్యనన్ = మెల్లగా కొనగోళ్లన్ = గోళ్లతుదలతో, దువ్వుచున్, కూర్మిన్ = అనురాగముతో, ఇట్లు, అనున్ = అనెను.

తాత్పర్యము:—“ఇట్టిపురుషుఁ డుండెనా లేఁడా యనుసంశయము పోవ - నేను జూచినపురుషుని యాకృతియే యిది యౌనౌను” అని యంచపలుకఁగనే పట్టరానిసంతసముతోఁ దొట్రిలుచు పరుగెత్తి వచ్చి రాగవల్లరి ప్రేమయు, గౌరవము కలుగఁగా - రెండుచేతుల నాహంసి నెత్తుకొనియరిగి, ప్రభావతిచెంత నిలిపి, ప్రేమసూచకముగా దానిఱెక్కలను గోళ్లకొనలచే మెల్లగాదువ్వుచుఁ బ్రేమతో నిట్లు పలికెను.

అలం. స్వభావోక్తి.

వ్యా. వి:—“అనున్” అను తద్ధర్మార్థక్రియకు - అనెను అని భూతకాలికార్థము. “వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్లు గానంబడియెడును.” అని, బాల. క్రియా. 22. సూత్రవృత్తి - కొనగోరు-గోటియొక్క కొన - ఏకదేశిసమాసము.

ఉ. అంచవు గావు నీవు మము నారసి ప్రోవఁగ మూర్తిమత్త్వమున్
గాంచిన భాగ్యదేవతవు గాని మదుక్తి తెఱంగు నేఁడు గ

ల్పించితి, వే జగంబులను ? లేఁడిటువంటిమనోహరాంగకుం
డంచుఁ గలంచు నిజ్జలరు?హానన మానక నాదుచిత్తమున్. 57

అర్థము:—నీవు, మనున్, ఆరసి=వెదకి, ప్రోవఁగన్=రక్షించుటకై, మూర్తిమత్త్వమున్=రూపమును (మూర్తి = శరీరము-అదికలది-మూర్తిమంతము - దానిభావము - మూర్తిమత్త్వము - శరీరము గలదానిధర్మము-) కాంచిన = పొందిన, భాగ్యదేవతవు = అదృష్టదేవతవు - కాని = అంతియేకాని, అంచవు = హంసవు మాత్రము, కావు. మదుక్తితెఱంగు = ఇట్టివాఁడు లోకమున నుండును + అని వాదించుచున్న నామాట విధమును, గెల్పించితివి = నెగ్గునట్లు చేసితివి, ఈ + జలరుహానన = తామరపువ్వువంటి మోముగల యీమె, ఏజగంబులను = ఏలోకములయందును, ఇటువంటి మనోహరాంగకుండు = ఇట్టిచక్కని రూపము గలవాఁడు, లేఁడు అంచున్, నాదుచిత్తమున్ = నామనస్సును, మానక = విడువక, కలంచున్ = కలఁత నొందించుచున్నది.

అలం:— అపహ్నవము, కావ్యలింగము.

వ. అనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి. 58

అర్థము:—వయస్యన్ = చెలికత్తెను - (ని. ఆళిః సఖీ) వయస్యాచ. అమరము

గీ. రాగవల్లరి నీ వేల? వేగిరించె, దింతమాత్రంబ చాలునే ? యీప్సితార్థ
సిద్ధి కతనిలక్షణము లీ?చిత్రమూర్తి, యందు నే మైనఁగల వేమొ ? యడుగవలయు.

అర్థము:—రాగవల్లరి ! నీవు, ఏల, వేగిరించెదు = తొందరపడెదవు, అప్పుడే పందెము నీది గెలిచిన దని తొందరపడకుము అని భావము. ఈప్సితార్థసిద్ధికిన్ = కోరఁబడిన ప్రయోజనము నెఱనేఱుటకు, ఇంతమాత్రంబు + అ = అవు నాతనిరూపమే యిది యనినమాత్రమే, చాలునే ? అతని లక్షణములు = తాను జూచితి నన్నపురుషునిజాడలు, (చిహ్నములు) ఈ చిత్రమూర్తి యందున్ = ఈ చిత్తరువులోని రూపమందు, ఏమైనన్ = ఏకొన్నియేని, కలవేమొ, అడుగవలయున్ = ప్రశ్నింపవలెను. - హంసిపల్కులలో నాపురుషుఁ డెవ్వరో తెలియలేదు. పందెముకొఱ కడిగినట్లే 'వానిలక్షణము లీప్రతిబింబమున నున్నవా' యని యడిగినచో-ఆలక్షణములను బట్టి కాని, హంసి యాతనికులనామాదులు ప్రసంగవశమునఁ జెప్పుటఁబట్టి కాని తెలిసికొనవచ్చు నని ప్రభావతి యాశయము.

వ. అనిన విని యాహంసి యాచిత్రరూపంబు నిరూపించి, ప్రభావతి నుద్దేశించి యిట్లనియె. 60

అర్థము:—ఆచిత్రరూపంబు = ఆ చిత్తరువులోనిరూపమును, నిరూపించి = తాఁ జూచినపురుషు నిదేయని నిశ్చయించి - తక్కినది సుగమము.

ఉ. ఆరయ నింక నే మడిగెదల్లవె యాతఁడు శంబరుం ద్రిలో
కారిని ద్రుంచునప్పటి ప్ర ? హారకిణంబు లురంబునందు, నా
హా రతికంకణాంకములు?నల్లవిగో మెడయందు పీర శృం
గారకళాఢ్యు ని ట్లితని?గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో! 61

అర్థము:—అతఁడు, త్రిలోకారిన్ = మూఁడులోకములకు శత్రువైన, శంబరున్ = శంబరుఁ డనురాక్షసుని, త్రుంచునప్పటి ప్రహారకిణంబులు = చంపుసమయమందలి (ఆయుధముల) సంబంధ మగుకాయలు, ఉరమునందున్ = రొమ్మునందు, అల్లవె = అవిగో, ఆహా = ఔరా, మెడయందున్, రతికంకణాంకములు, = రతిదేవియొక్క చేతికడియముల చిహ్నములు, అల్లవిగో - ఆరయన్ = పరీక్షించు టకు, ఇంకను = మఱియును, ఏమి, అడిగెదు = ప్రశ్నించెదవు ? అనఁగా ఇఁక నడుగ నక్కఱలేదు అని భావము. వీర శృంగార కళాఢ్యున్ = వీరవిద్యచేతను, అనఁగా శౌర్యముచేతను, శృంగారకళ చేతను, అనఁగా రసికత్వముచేతను, ఆఢ్యున్ = నిండిన వానిని, అతనిన్ = ఆ పురుషుని, గట్టిగన్ = దృఢముగా, ఎఱింగి = తెలిసికొని, ఎవ్వరు, వ్రాసిరో = చిత్రించినారో - కాని - వాస్తవముగానే వ్రాసిరని భావము.

తాత్పర్యము:—అతఁడు మూఁడులోకముల కందలి వారికిని విరోధియగు శంబరాసురుని జంపునప్పుడు తగిలిన యాయుధపు దెబ్బల కాయలు వక్షమున నవిగో! అవిగో రతిదేవి కంకణముద్రలు మెడయందుఁ గనఁ బడుచున్నవి - ఇంకను పరీక్షింప నేమి యడిగెదవు ? వీరశృంగారముల రెండిటను పూర్ణుఁడగు నాతని నెవ్వరు బాగుగాఁ దెలిసి చిత్రించిరో కాని వాస్తవముగానే చిత్రించిరి.

వ్యా. వి. :—అడిగెదవు - సూ. లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు. బాల. క్రియా. 24 చే - వకారము లోపింప 'అడిగెద + ఉ' అని యుండును, సూ. అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు. బాల. సంధి. 11 చే నిత్య సంధియై అడిగెదు, అని రూపసిద్ధి.

వ. ఈ లక్షణ కథనంబుచేత నతని నామ జాత్యాదు లత్యంత ప్రసిద్ధంబులు మీరు మీ యంతనె యెఱింగెదరు గావలయు నంతఃపుర వాసినులు గావున నెఱుంగరో యని యెఱింగించెద నంటినేని.

అర్థము:—ఈ లక్షణ కథనంబుచేతన్ = ఈ గుర్తులు చెప్పుటచేత, అత్యంత ప్రసిద్ధములు = (లోకమున మిగులఁ దెలిసినవి (యగు), అతని నామ జాత్యాదులు = అతనిపేరు జాతి మున్నగునవి, మీయంతన్ + ఎ, మీరు = మీరు స్వయముగానే, ఎఱింగెదరు కావలయును = తప్పక తెలిసి కొందురు. అంతఃపురవాసినులు = రాణివాసమున నుండెడివారు, కావునన్, ఎఱుంగరో = ఎఱుఁగ రేమో యని, ఎఱిఁగించెదను = తెలిపెదను, అంటి నేని = అందునా ?

వ్యా. వి. :—అందు నేని యనుటకుమాఱు 'అంటి నేని' ప్రయుక్తమైనది. సూ. చే దర్థయోగంబున ల్యట్టునకు లిట్టగు. బా. క్రియా. 119. చే - సిద్ధము.

చ. ఎనయఁగ నెవ్వ రెంత మనసిచ్చి వచించిరి తాను వారితోఁ
బనుపడ నంతమాత్ర ప్రతిభాషణ మాడుట యుక్త మంద్రు - మీ
కొనరఁగఁ బన్నిదంపు గెలుపోటలు దీర్పఁగ నిప్పు డేను జె
ప్పినదియ చాలు నింకఁ దలపెట్టుట చెల్లద యెక్కుడేమియున్. 63

అర్థము:—ఎనయఁగన్ = అనుకూల మగునట్లు, ఎవ్వరు, మనసిచ్చి = గుట్టువిడిచి, ఎంత, వచించిరి = చెప్పిరో, వారితోనే, పనుపడన్ = తగునట్లు, అంతమాత్ర = ఆ కొలఁదినే, ప్రతి భాషణము = ప్రత్యుత్తరము, ఆడుట = చెప్పుట, యుక్తము = అర్హము, న్యాయము, అంద్రు = (లోకులు) అందురు. ఒనరఁగన్ = సరిపడునట్లు, పన్నిదంపు గెలుపోటలు = పందెము యొక్క గెలుపును ఓడుటయును, తీర్పఁ గన్ = నిర్ణయించుటకు, ఇప్పుడు, ఏను, చెప్పినదియ = చెప్పినదే, చాలును, ఎక్కుడు = అధికము, ఏమియున్ = ఏ కొంచెమును, తలపెట్టుట = (చెప్ప) ఎంచుట, చెల్లదు = తగదు.

తాత్పర్యము:—ఎవ రెంత మనసిచ్చి మాటాడుదురో వారితోఁ బ్రత్యుత్తరముగా నంత మాత్రము చెప్పుటయే న్యాయ్యము. మీపందెము యొక్క జయాపజయనిర్ణయమున కిప్పుడు నేను చెప్పినదే చాలును. అట్టి పురుషుఁడు లోకమున నున్నాఁడు, లేఁడు, అని కదా మీవాదము. ఉన్నాఁడని నేను ధ్రువపఱిచితిని. కాన మీలో నెవరు గెలిచిరో ఎవరోడిరో తెలియుట కిదియే చాలును. ఇంత కధికము చెప్పుట తగదు. 'చెప్పిన మీమన సె ట్లుండునో' అని వ్యంగ్యము.

అలం. అర్థాంతరన్యాసము - ఇందు తుదిని జెప్పినవిశేషమును దొలుతఁజెప్పిన సామాన్యము సమర్థించుచున్నది.

వ్యా. వి. :—అంద్రు. అను+దు+రు. సూ. తి, దు,టలు పరంబు లగునపు డన్వాదులనుస్థానంబున సున్నయు నుండు దులోపంబును విభాష నగు. బాల. క్రియా. 58 చే. 'అం+దు+రు' అని కాఁగా. సూ. ఇట బిందువు మీఁది 'త, ద' ల కు నిత్య వైకల్పికంబు లయి 'ట, డ' లగు. బాల. క్రియా. 59. చే. డకారము విభాషగా వచ్చి - 'అండురు, అందురు' అనురూపద్వయము సిద్ధించెను. సూ. రు వర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది త, ద, డ ల యుత్వంబునకు లోపంబు విభాషనగు. బాల. క్రియా. 62 చే - అంద్రు, అంద్రు - అని యగును. ఓట = ఓడు ధాతువు కృదంతము. 'సూ. ట వర్ణకంబాడ్వాదుల కగు, నగుచో నంత లోపం బగు. బాల. కృదంత. 7.

గీ. నీవ కద ప్రభావతి యన నిన్ను మున్ను తరుణి నే వింటి రాగవల్లరియె బోటి
పేరు? నీ విపు డన వింటి మీ రిరువురు, నీయెఱుక మఱచెదరు సూపోయి వత్తు.

అర్థము:—తరుణి = ఓయువతీ, నిన్నున్ = నిన్నుఁగూర్చి, మున్ను = ఇంతకుమునుపు, నేన్, వింటిన్ = వినియున్నాను. ప్రభావతి అనన్ = ప్రభావతియనఁగా, నీవేకద - బోటిపేరు = ఈ చెలికత్తెపేరు, రాగవల్లరియె = రాగవల్లరియా? ఇపుడు, నీవు అనన్ = రాగవల్లరి అని పిలువఁగా, వింటిన్ = విన్నాను, మీరు, ఇరువురును, ఈ యెఱుకన్ = (నేఁడు మనకుఁ గలిగిన) పరిచయమును, మఱచెదరు సూ = మఱచిపోయెదరుసుఁడీ? మఱువవల దని భావము, పోయివత్తున్ = పోయెదను.

తాత్పర్యము:—ప్రభావతి యనఁగా నీవే కదమ్మా? నిన్నుఁ గూర్చి ఇంతకు మునుపే విన్నాను, ఈ చెలికత్తె పేరు రాగవల్లరియా? ఇప్పుడు 'రాగవల్లరి నీ వేల వేగిరించెదు' అని నీ వనినప్పుడు విన్నానులే, మీ రిద్దఱు నీనాఁటిపరిచయమును మఱచెదరుసుమా? వెళ్లివచ్చెదను.

వి. :—చూ. చూడుము - అనుదాని రూపాంతరము - డువర్ణము లోపించి, ఊయేలాదిగణకార్యంబు నొంది - చుమ్ము, అగును. ఎడాదులలోని ఎ, ఏలుమాత్రమే యనుప్రయుక్తమై, ఫుజె ఆదేశము కాఁగా - చూ + ము + ఎ, ఏ - చూ + వు + ఎ, ఏ - చూవె, చూవే అని యగును. 'చూ + ము' అనుస్థితియందు మధ్యమమువర్ణకమునకు లోపమువచ్చి - చూ. అని యయి, కళలమీఁద గసడదవాదేశము నొంది 'సూ' అనియు, ద్రుతప్రకృతికముమీఁద సరళాదేశము నొంది 'జూ' అనియు నగుచున్నది. బహువచనము నందు - చూడుఁడు - అనుదానిలోని డు లోపించి - నిర్నిమిత్తముగానే హ్రస్వమై చుఁడు, చుండు, అనియు, చూ + ఁడు + ఎ, ఏ - అనునపుడు 'రుజె' ఆదేశము నొంది - చూరె, చూరే యనియు రూపొంది, కళలపై గసడదవాదేశమును, ద్రుతప్రకృతులపై సరళాదేశమును బొంది - సుఁడు, సుండు, సూరె, సూరే, అనియు 'జుఁడు, జుండు, జూరె, జూరే అనియు నగుచున్నది.' ఇది యి ట్లుండఁగా - ఏకవచనమునఁ బ్రయోగింపఁదగు 'చూ' అనునది యీపద్యమున బహువచనాంత మగు 'మఱచెదరు' అనుదాని కనుప్రయుక్తమగుటచే 'చూ' అనునది అవ్యయ మని కాని, ఏది పరమైనను 'చూ + ము' లోని ముపర్ణకము వలెనే - 'చూ + ఁడు' లోని డుజ్వర్ణకమును లోపించినదని కాని యనుఁకోఁ దగును - ఈ లోపాదేశాదుల క్ఇంతదాఁక ననుశాసనము పుట్టలేదు.

ఉత్సాహ. అనుచు గగనభాగమునకు | నంచ యెగయఁ జూచినన్
దనుజకన్యకాలలామ | తనదు రెండు చేతులన్
వినయ మొప్పఁ బొదుగఁ బట్టి | వేనవేలభంగులన్
దనరఁ బ్రియము చెప్పుచును ముదం బెలర్ప నిట్లనున్. 65

అర్థము:—అనుచున్ = ఇట్లుపలుకుచునే, అంచ=శుచిముఖి, గగనభాగమునకున్ = ఆకాశవీథికి, ఎగయఁజూచినన్ = ఎగిరిపోవ యత్నింపఁగా, దనుజకన్యకాలలామ - దనుజ = వజ్రనాభుఁడనురాక్షసుని యొక్క, కన్యకాలలామ = శ్రేష్ఠురాలగు పుత్రిక, పుత్రికారత్నము - ప్రభావతి, తనదు రెండు చేతులన్, వినయము + ఒప్పన్ = అడఁకువ దోఁపఁగా, పొదుగన్+పట్టి = క్రమ్మునట్లు పట్టుకొని, వేనవేలభంగులన్ = పెక్కువిధములతో, తనరన్ = ఒప్పునట్లు - అనఁగా అనేకవిధములుగా, ప్రియము చెప్పుచును = ఇష్ట మగుమాట పలుకుచు, ముదంబు = సంతోషము, ఎలర్పన్ = (హంసకు) హెచ్చునట్లుగా, ఇట్లు, అనున్ = అనెను.

తాత్పర్యము:—ఈ మాటలు చెప్పుచునే హంసి ఆకసమున కెగిరిపోఁ జూడఁగా, ప్రభావతి యడఁకువతో దానిని తనరెండుచేతులతోడ క్రమ్మునట్లు పట్టుకొని, పెక్కువిధముల ప్రియవచనములను పలుకుచు నాహంసికి సంతోషము హెచ్చ నిట్లు పలికెను.

సీ. నిద్దంపుఁబండువెన్నెలఁ గాయుఁ జెక్కుల, యొప్పు చూడఁగ | నొక్కయుత్సవంబు
మెఱుఁగుదీఁగెలబాగు | మించు పక్ష్మాంతహాటక రేఖ లరయ నొండొక ప్రియంబుఁ
గమనీయ మగుమహాగమనగాంభీర్యాది, విలసనం బీక్షింప | వేఱె యింపు
మాధుర్యధుర్య కోమల వచనామృతం, బనుభవింపఁగఁ గౌతుకాంతరంబుఁ

గీ. గలుగఁ జేయుచు నువ్విళ్లుగొలుపు నీదు, సంగతి యొకింత గని యెట్లు | జాఱ విడుతు
నింక రాగవల్లరి పేరు | నీవు నిజము, ననఁగ నీతో నొనర్తు నెయ్యంపుఁజెలిమి. 66

అర్థము:—నిద్దంపుఁబండువెన్నెల = దట్టమైన ముదురువెన్నెల, కాయు, చెక్కులయొప్పు=చెక్కుల యొక్క యందము, చూడఁగన్ = చూడఁగా, ఒక్కయుత్సవంబున్ = ఒకవిధ మగు నానందమును, మెఱుఁగుదీఁగెలబాగు = మెఱపులయొక్క సొగసు, మించు = అతిశయించునట్టి, పక్ష్మాంతహాటకరేఖలు = చెక్కులలోనల నుండెడిబంగారు తీఁగలను, అరయన్ = చూడఁగా, ఒండొకప్రియంబున్ = ఒకానొక ప్రీతియును, (అనిర్వచనీయ మగు సంతోషమును అన్నమాట) కమనీయము = అందమైనది, అగు మహాగమనగాంభీర్యాది విలసనంబున్, అగు = అయినట్టి, గమన = నడకయందలి, గాంభీర్య = గంభీరభావము, ఆది = మొదలుగాఁగలవానియొక్క, విలసనంబు = సొగసును, ఈక్షింపన్ = చూడఁగా, వేఱు + ఎ-ఇంపు = మఱొకసంతోషమును, మాధుర్య ... తంబు - మాధుర్య = తియ్యఁదనమునకు, ధుర్య = భారవాహకమైన, (తియ్యఁదనముతో నిండిన అని భావము) కోమల = మృదువగు, వచనామృతంబు = మాటలనెడు అమృతమును, అనుభవింపఁగన్ = ఆస్వాదము చేయుచుండఁగా - (త్రాగుచుండఁగా అనిభావము) కౌతుకాంతరంబు = మఱొక వేడుకను, కలుగఁజేయుచున్ = పుట్టించుచు, ఉవ్విళ్లుగొలుపు = తొందర పుట్టించునట్టి, నీదుసంగతి = నీతో కలసియుండుట - నీ సహవాసము, ఒకింత = కొంచెము, కని = పొంది, ఎట్లు, జాఱన్+విడుతున్, ఇంకన్ = ఈపైని, రాగవల్లరి, పేరు = చెలి యను పేరుమాత్రమును, నీవు, నిజమున్ = నిజ మగుచెలివి యును, అనఁగన్ = అనునట్లు - (రాగవల్లరి చెలికత్తెయని పేరుమాత్రమునకే కాని వాస్తవ మగుచెలికత్తెవు నీవే యనిభావము) నీతోన్, నెయ్యంపుఁ జెలిమి = ప్రేమయుక్త మగుస్నేహమును, ఒనర్తును = చేయుదును.

తాత్పర్యము:—తెల్లని నీరెక్కలను, మెఱపుతీఁగలవంటి నీరెక్కల తుది రేఖలును, సొగసగు నీమందగమనమును, కమ్మని నీమృదువాక్కులును, మనసున కొక్కొక్క విధమగు ప్రీతి కలిగించుచుండ, ఎప్పటి కప్పుడు వేడుక పుట్టించునట్టి (నీతోడి సంగాతమును) నీసహవాసమును కొంచెము పొందియు నెట్లు మానఁగలను ? ఈమీఁదట రాగవల్లరి నామమాత్రసఖి, నీవు నిజ మగుసఖివి యనురీతి నీతో ప్రేమయుక్త మగు స్నేహము చేయుదును.

అలం. ఉపమ.

వి:—ప్రకృతి. స్నిగ్ధము - వికృతి. నిద్దము - స్నేహము + నెయ్యము,
'మాధుర్య ధుర్యములు + కోమలములు' అనునప్పుడు విశేషణోభయపద కర్మధారయ సమాసము.

ఆ. ప్రణయ మొప్ప మిగులఁ బ్రార్థించుచున్నట్టి నన్ననుగ్రహించి నాదుచెలిమి
కొడఁబడంగ వలయు నోహంసభామినీ, యనుచు వేడుకొనఁగ నంచ పలికె. 67

అర్థము:—ఓ హంసభామినీ = ఓ యాఁడుహంసా, ప్రణయము = ప్రేమను, ఒప్పన్ = కలుగునట్లు, మిగులన్=అధికముగా, ప్రార్థించుచున్నట్టినన్నున్ = బతిమాలుకొనుచున్న నన్ను, అనుగ్రహించి = దయచూపి నీదానినిగానెంచి, నాదుచెలిమికిన్ = నాస్నేహమునకు, ఒడఁబడంగవలయును = సమ్మతింపవలెను, అనుచున్, వేడుకొనఁగన్, అంచ = శుచిముఖి, పలికెన్ = (ఇట్లు) అనెను.

తాత్పర్యము:—ఓ హంసీ ప్రేమతో ప్రార్థించుచుంటిని. నన్ననుగ్రహించి నామైత్రికి నీవంగీకరింపవలయును అనుచు వేడుకొను ప్రభావతితో శుచిముఖి యిట్లనెను.

వి. :—అనుగ్రహము = అహితమును నివారించుచు హితమును చేయుట. "అనుగ్రహము" అను నామవాచకముపైని ఇంచుగాగముచేరి అనుగ్రహించు అనునామధాతువైనది. ఇచట "అనుగ్రహించి" అనునప్పుడు నన్నును నీదానినిగానెంచి అని లాక్షణికార్థము గ్రహింపకున్నచో సకర్మకార్థము పొసఁగదు.

ఉ. ఇప్పుడు నీవు చెల్మికిని హేతువు గాఁగ గణించినట్టి నా
యొప్పును గిప్పుఁ దా నెచటఁ నుండు ? రహస్యవిచారవిఘ్న మౌ
టెప్పుడు నీకుఁ దోఁచె నపు డింతయు రోసెదు దీనిచేత మీ
యిప్పటి మంతనంపుఁబని యేమఱ కంపుఁడు పోయి వచ్చెదన్. 68

అర్థము:—ఇప్పుడు, నీవు, చెల్మికిని = స్నేహమునకు, హేతువు=కారణము, కాఁగన్=అగునట్లు, గణించినట్టి = ఎంచినట్టి, నా యొప్పును గిప్పును = నా హీనమగు చక్కఁదనము (నిందార్థమున గిప్పు) తాను = అది, ఎచటన్ + ఉండును ? నాయొప్పును జూచికదా నీవు మైత్రి కోరుచుంటివి? ఈయొప్పు శాశ్వతమా ? - అంతేకాక, ఎప్పుడు, రహస్యవిచార విఘ్నము = ఏకాంతమగు నాలోచనకు నడ్డము, (నేను) ఔట = అగుట, నీకున్, తోఁచెనో = కనఁబడెనో, అప్పుడు, ఇంతయున్ = నాస్నేహమునకు, హేతువుగా గణించిన చక్కఁదనము నంతను, రోసెదు=విడిచిపెట్టెదవు, దీనిచేతన్ = నాతో నెట్లయినను స్నేహము చేయవలె ననుయత్నముచేత, మీయిప్పటిమంతనపుఁబని = ప్రస్తుతపు మీ రహస్యకార్యమును, ఏమఱక = మఱువక, అంపుఁడు = నన్నుపోవనిండు, పోయివచ్చెదన్ = పోవుదును.

తాత్పర్యము:—ఇప్పుడు మనచెలిమికి హేతువుగా నీవు గణించుచున్న నాయొప్పు గిప్పు స్థిరముగా నుండునా ? - అదియునుగాక మీయేకాంత మగు నాలోచనకు నే నెప్పు డాటంకముగా నున్నట్లు నీకుఁ దోఁచెనో, అప్పుడు నాస్నేహమునకుఁ గారణముగా నీవు గణించిన నాచక్కఁదనము నంతయు నసహ్యించుకొందువు (లేదా విడిచివైతువు). నాతో చెలిమి చేయవలె నను నీయత్నములోఁ బడి ప్రస్తుతపు మీ రహస్యపుఁబని మఱచిపోక నాకు సెలవిండు. పోయివచ్చెదను.

అలం. :—కావ్యలింగము.

పోయివచ్చెదను = పోయెదను అనిమాత్రమే యర్థమై యుండ వచ్చు ధాతువును జేర్చుట అమంగళార్థము స్ఫురింప కుండుటకే కాని తిరిగివత్తు నని కాదు. దీనిని సౌకుమార్యము అను నొక కావ్య గుణము అని వామనుఁడు అనెను.

"అపారుష్యం సౌకుమార్యం" (12) వృత్తిః :—పరుషేఽర్థే అపారుష్యం సౌకుమార్యం - (పరుషే అమంగళాంతకదాయిన్యర్థే - వ్యాఖ్య) యథా:—మృతం యశశ్శేష ఇత్యాహుః ఏకాకినం దేవతాద్వితీయ మితి, గచ్ఛేత్యత్ర సాధ యేతి చ. కావ్యాలంకార సూత్రవృత్తి 3, అధి. 3 అధ్యా. అపారుష్యము సౌకుమార్య మనుగుణ మనఁబడును - అని సూత్రించి పరుషము - (అమంగళాతంక దాయి యగు నర్థము) నందు పారుష్యము లేకపోవుట సౌకుమార్యము అని వివరించి, మృతుని యశశ్శేషుఁడనియు, ఏకాకిగా నున్నవానిని దేవతాద్వితీయుఁ డనియు, వెళ్లుము అనుదానికి బదులుగా పయనింపసిద్ధమగుము అనియు - ఉదాహరించెను.

వ్యా. వి.:—చెల్మి, చెలిమి - సూ. లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి. బాల. ప్రకీర్ణ. 18. ఒప్పును గిప్పును - సూ. నిందయం దా్రమేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘములకు 'గి, గీ' లగు. బాల. ప్రకీర్ణ. 22.

వ. అనిన విని రాగవల్లరి హంసీమతల్లికం జూచి యిట్లనియె. 69

అర్థము:— హంసీమతల్లికన్ = ఆఁడుహంసలలో శ్రేష్ఠయగు శుచిముఖిని - (ని. మతల్లికా మచర్చికా ప్రకాండ ముద్ఘ తల్లజౌ, ప్రశస్తవాచకా న్యమూని... అనిఅమరము.) చూచి, రాగవల్లరి, ఇట్లు, అనియెన్ = అనెను.

క. పోయెదఁ బోయెద నంచి, ట్లోయంచలతల్లి ! యేల ? యుద్ఘాడింపన్
మాయేకాంతపుఁ బనికిని, నీయునికి విరోధి కాదు ? నిర్వాహకమున్. 70

అర్థము:— ఓ యంచలతల్లీ = ఓ బిడ్డలుగల హంసాంగనా, (కడుపు చలువగలదానా ! అనియు బిడ్డల కష్టసుఖము లెఱిఁగిన తల్లివి కాన పసిబిడ్డ యగు నీ ప్రభావతి కష్టసుఖములు తెలిసికొని కాపాడఁ దగిన దాన వనియు వ్యంగ్యములు.) పోయెద పోయెదను అంచున్, ఉద్ఘాడింపన్ = (మామనస్సులు) కలఁత పెట్టుట, ఏల = ఎందులకు ? నీవు పోయెద ననినప్పు డెల్ల మామనస్సులు కలఁగిపోవు చున్నవి. నీవు మాటమాట కామాటనే యనుట మాకు మిగుల బాధక మగుచున్నది అనిభావము - నీయునికి=నీవిచ్చట నుండుట, మాయేకాంతపుఁబనికిన్ = మారహస్య కార్యమునకు, విరోధి = ఆటంకము, కాదు (సరే కదా), నిర్వాహకమున్ = (ఆ పనిని) నెఱవేర్చునది కూడను, (అగును - అధ్యాహారము.)

వ. ఇదే నిమిత్తంబుగా సఖ్యంబు గావలయు నని ప్రార్థించెదము గాని కేవలం బైన తావకరామణీయకంబునన కాదు. నీదు పలుకుందెరువులు పరికింప నిది నీవును దెలియుట విస్పష్టంబ యైనను శుద్ధాంతస్థితి దోషంబునంజేసి యేమయి యీ మాట మాటుపెట్టక గొబ్బునం జెప్పనేర కున్నవారము, చెప్పి వేడుకొనక యేపనికిని నీవు చొరవమి మొదలన పదిలంబుగాఁ దెలిపినదానవు గావున. 71

అర్థము:—ఇది + ఏ = మారహస్యకార్యము నెఱవేర్చుటయే, నిమిత్తంబుగాన్ = కారణముగా సఖ్యంబు = (మనకు) స్నేహము, కావలయును, అని, ప్రార్థించెదము గాని = కోరుచుంటిమిగాని,

కేవలంబు+ఐన+తావక రామణీయకంబునన్+అ = ఒక్కటి యగు నీసంబంధమైన చక్కఁదనముచేతనే - కాదు ఒక్కనీచక్కఁదనము మాత్రముచేతనే, స్నేహముకావలయు ననికోరుటలేదు అనిభావము - నీదు పలుకుం దెఱవులు = నీమాటలరీతులను, పరికింపన్ = పరీక్షింపఁగా - నీవును + తెలియుట = ఇంతకుమున్నే నీ వెఱిఁగినదానవనుట, విస్పష్టంబు + అ=మిగులవెల్లడియైనదే. (ఈమెచిత్రగతపురుషుని వలచినదని నీవుగ్రహించినట్లు నీమాటలవలనస్పష్టమైనది.) అయినను, శుద్ధాంత స్థితిదోషంబునంజేసి = అంతఃపురమందే యుండుట యనుదోషముచేత, (అంతఃపురకన్యలు తలిదండ్రులకుఁ దెలియకుండ పరులతో నొకపురుషుని గూర్చి చెప్పుట తప్పగును కావున - అని భావము.) ఏము + అయి = మాయంతటమేము, గొబ్బునన్ = వెంటనే, తటుక్కున, చెప్ప నేరక + ఉన్నవారము = చెప్పఁజాలకున్నాము - నీవు, చెప్పి = ఆపనియేదో స్పష్టముగాఁజెప్పి, వేడికొనక = చేయుమని ప్రార్థింపక, ఏపనికిని, చొరమి = దిగకుండుట, మొదలన్ + అ = ముందుగనే, పదిలంబుగాన్ = జాగ్రత్తగా, చెప్పినట్లు కాకుండ ధ్వనించునట్లుగా, తెలిపినదానవు, కావునన్ = కాఁబట్టి - మీఁదికన్వయము.

అలం :—విషమము.

ఉ. వట్టిమఱుంగుఁ బెట్టి నుడువం బని లే, దిది యెల్ల భేరి జో
కొట్టుట కాక ని న్గెలువఁగూడునె మాటల ? నీవు గంటి న
న్నట్టి శుభాంగుఁ డీరమణి యాసల కాస్పద, మిప్పు డాతనిన్
గట్టిగ నన్వయాదికథనంబునఁ దెల్పి యనుగ్రహింపవే. 72

అర్థము:—వట్టిమఱుంగుఁబెట్టి = ప్రయోజనము లేని దాపఱికము చేసి, నుడువన్ = కావలసినపని గాక యితరమును చెప్పినయెడ, పని = ఉపయోగము, లేదు - ఇది = ఈదాఁచిపెట్టి మాటలాడుట, ఎల్లన్ = అంతయును, భేరిన్, జోకొట్టుట, కాక=మాటాడక నిద్ర పొమ్ము అని భేరిని జోజో యనుచు చేతితో చఱచుటయే కాని, అనఁగా భేరి నెంత నెమ్మదిగాఁ జఱచినను పెద్దధ్వని చేయునట్లు, మేము మా రహస్యమును దాఁచి యెంతకొంచెము మాటాడినను మామాటలనుండి పెద్దధ్వనిని (వ్యంగ్యమును) వెల్లడించుచునే యున్నదానవు అనిభావము, మాటలన్ = మాటలచేత, నిన్=నిన్ను, గెలువఁగూడునె= గెలువసాధ్యమా ? నీవు, కంటిని = చూచితిని, అన్నట్టి శుభాంగుఁడు = అని చెప్పిన యాచక్కనివాఁడు, ఈరమణి యాసలకున్ = ఈయింతివాంఛలకు, ఆస్పదము = ఆలంబన స్థానము-ఆశ్రయము అని భావము. ఇప్పుడు, అన్వయాది కథనంబునన్ = (ఆతని) వంశము మొదలగు వానియొక్క చెప్పుటతో, అతనిన్ = ఆ పురుషుని, గట్టిగన్ = స్పష్టముగా, తెల్పి = చెప్పి, అనుగ్రహింపవే = దయచూపుము, రక్షింపుము. నీవు చూచితినన్న పురుషుని నీమెవలచినది. అని మాగుట్టుచెప్పితిమి కాన ఇఁకనాపురుషుని వంశనామాదికము తెలియఁజెప్పుము. అనిభావము.

అలం :—నిదర్శనము.

తే. ఇప్పు డిది చెప్ప కెడసేయు టీలతాంగిఁ, బ్రాణసంకటపఱచు టోపక్షిరమణి
కావునను గావవలయు శీఘ్రంబ చెప్పి, వెనుక నెఱిఁగింతు నీకు మావృత్త మెల్ల.

అర్థము:—ఓ పక్షిరమణి = ఓ పులుఁగుపడఁతీ, ఇది = నేను గోరిన యీయంశమును, చెప్పక, ఇప్పుడు, ఎడసేయుట = ఆలసించుట, ఈ లతాంగిన్ = తీఁగవంటి దేహముగల యీచిన్న దానిని - (అతి సుకుమారి యని సాభిప్రాయవిశేష్యము), ప్రాణసంకట పఱచుట = ప్రాణవాయువుల కిఱుకు గలిగించుట-(అనఁగా శరీరమున ప్రాణవాయువులు నిలుచు తావులేకుండఁ జేయుట, ప్రాణములమీఁదికి తెచ్చుట అని భావము) కావునను=కాఁబట్టి, శీఘ్రంబు + అ = వేగమే, చెప్పి = ఆ పురుషుని వృ-

ఖంతయు తెలిపి కావవలయును = రక్షింపవలెను. మావృత్తము + ఎల్లన్ = మాచరిత్ర యంతయును, వెనుకన్ = నీవు చెప్పిన పిదప, ఎఱింగింతును.

అలం. :—పరికరాంకురము.

వ్యా. వి. :—ప్రాణసంకటము + పఱచు సూ. పడ్వాదులు పరం బగునపుడు మువర్ణకమునకు లోపపూర్ణ బిందువులు విభాష నగు. బాల. సంధి. 46. చే మువర్ణకమున కిటలోపము రాఁగా 'ప్రాణసంకటపఱచు' - అనిర్యైనది.

వ. అనిన శుచిముఖి వచనవక్రత చాలించి యి ట్లనియె. 74

అర్థము:—వచన వక్రత = మాటలందలి వంకరతనమును, చాలించి = మాని-(శ్లేషముచేతను గాని కాకువుచేతను గాని యన్యార్థము స్ఫురింపఁ జెప్పుట వక్రోక్త్యలంకార లక్షణము. అట్టివిధముగా శుచిముఖి భాషించినది. ఇపు డది మానినది అని భావము.)

ఉ. అంతిపురంబుకన్య లఁట ¦ యాత్మ తెఱం గభిధాప్రయుక్తి నొ
క్కింతయు నేర్పరింపరఁట ¦ యి ట్లన ని ట్లని నాకు నాకె య
ర్థాంతరముల్ గడించుకొని ¦ యంజక యెట్లు యువస్తుతుల్ ప్రపం
చింతు నటంచు నుంటి, నిఁకఁ ¦ జెప్పెద మీరలు గుట్టు తెల్పుటన్. 75

అర్థము:—అంతిపురంబు కన్యలఁట = మహారాజుల రాణివాసమున నున్నపడుచులఁట - ('అఁట' అనునవ్యయ మిచ్చట మిగుల గొప్పతనమును సూచించును.) ఆత్మ తెఱంగు=తమ స్థితిని, అభిధాప్రయుక్తిన్= వాచ్యార్థ ప్రయోగముతో - (అనఁగా తాము చెప్పఁదలఁచుకొనిన యర్థమును సూటిగా నాయర్థమునే చెప్పుమాటలతో - అని భావము.) ఒక్కింతయును = ఏ కొంచెమును, ఏర్పరింపరఁట = స్పష్టపఱుపరఁట - ఇట్లు + అనన్ = ఆకన్యలు ఈరీతి పలుకఁగా - ఇట్లు = (దానికి) అర్థ మిట్లు, అని, నాకు నాకె = నాయంతట నేనె, అర్థాంతరముల్=వారి పలుకుల కితర మగునర్థములను, గడించుకొని = సంపాదంచుకొని, కల్పించుకొని, అంజక = భయపడక, యువస్తుతుల్ = పడుచువాండ్ర వర్ణనలను, ఎట్లు = ఏరీతిగా, - ప్రపంచింతున్ = విస్తరింతును, అధికముగా యువకుల చక్కఁదనము మొదలగువాని వర్ణించి చెప్పెదను, అటంచున్ = అనుచు, ఉంటిని = ఊరకయుంటిని, మీరలు, గుట్టు, తెలుపుటన్ = తెలుపుటచే, ఇఁకన్, చెప్పెదన్ = ఇఁకఁ (నిస్సంశయముగా) జెప్పెదను.

తాత్పర్యము:— మహారాజుల రాణివాసమున వసించుపడుచులఁట, వారి సంగతి యేమియో కంఠోక్తిగాఁ జెప్పక, గుట్టుగా మాటాడుచుండ 'ఇ ట్లనిరి కావున దీనియర్థ మిది కాఁబోలు నని నాకు నేనె వేఱర్థము చెప్పుకొని, జంకు లేక పడుచుమగవాండ్ర నెట్లు విస్తరించి వర్ణించి, తెలుపుట యని యుంటిని. మీ రిపుడు మీగుట్టు చెప్పితిరి కావున ఇఁక జెప్పెదను.

వి. :—శబ్దమున కర్థమును జెప్పునట్టి శక్తులు అభిధ, లక్షణ, వ్యంజన అని మూఁడు గలవు. అవయవార్థముతో ఉన్న దున్నట్లు ముఖ్యార్థమును జెప్పునది - అభిధ. ముఖ్యార్థము కుదురక శబ్దముచేఁ జెప్పఁబడు నర్థమందలి గుణక్రియాదులను జెప్పునది - లక్షణ. ఆ లక్షణాశక్తిగూడ విరమించినపిదప వేఱు వే అర్థములను స్ఫురింపఁజేయునది-వ్యంజన. ప్రకృతమున శుచిముఖి 'అభిధాప్రయుక్తిచేఁ జెప్పలేదు' అనెను. ఉన్న దున్నట్లు మీరు చెప్పరైరి అని పలికినదని భావము.

వ్యా. వి. :—నాకు నాకె - ఇట్టి షష్ఠ్యంత ప్రయోగము కనఁబడదు. సూ. షష్ఠ్యంత తదేతద్వ్యాప్త దస్మదాత్మ శబ్దపూర్వకంబు లగు ప్రథమాంత శబ్దంబు లవధారణార్థ కాంతంబులు తఱచుగ స్వయమర్థకంబు లగు. ప్రౌఢ. శబ్ద. 108 చే. పూర్వపదము షష్ఠ్యంతముగను నుత్తరపదము ప్రథమాంతముగాను నున్నప్పుడే

స్వయ మర్థక మగు నని - వానికివాఁడె, నీకు నీవె, నాకు నేనె, తనకుఁ దానె, యని తెలియుచుండ - 'నాకు నాకె' అనునది ప్రామాదికమై యుండునని, నాకు నేనె యనుకొనుట సమంజసము - కాని ముద్రిత ప్రతులందు 'నాకు నాకె యని కనఁబడుచున్నది. విచార్యము. 'నాకు నాకె' అనునది మాండలిక మగు ప్రయోగ మేమో తెలియదు. ఏర్పరించు - ఏర్పఱచు - ఏఱు + పడు - ధాతువుపై ప్రేరణమున ఇంచు క్కును - చుక్కును రాఁగా నేర్పడిన రూపములు. ఏర్పడు + ఇంచు - అని యుండ సూ. శబ్దపల్లవం బగుపడున కించుక్కు విభాషనగు, నగుచో డాకు లఘురేఫం బగు. బాల. క్రియా. 83 చే, ఏర్పరు + ఇంచు - అయి, ఏర్పరించు - అని రూపసిద్ధి గనును. ఏర్పడు + చు - అనియుండ - పడునకుం జుక్కును డా కలఘురేఫంబును నగు. బాల. క్రియా. 82 చే - ఏర్పఱుచు. అని రూపసిద్ధి నొందును.

వ. అని పలికి ప్రభావతిం జూచి నీకు మనోహారి యైన యా పురుషరత్నంబు తెఱంగు
వినుమని యి ట్లనియె. 76

అర్థము:—మనోహారి = మనస్సును హరించినవాఁడు, ప్రియుఁడు - (స్త్రీలింగము - మనోహారిణి) పురుష రత్నంబు = పురుష శ్రేష్ఠునియొక్క, తెఱంగు = విధము, వృత్తము.

క. భారతవర్షమునందున్, ద్వారక యనుపురము గలదు తద్వర్ణన వా
ణీరమణున కైనను దు,ష్పార మపారము సమస్త సౌభాగ్యములన్. 77

అర్థము:—భారతవర్షమునందున్ = జంబూద్వీపమందలి దేశవిశేషమునందు, (ఇది శకుంతలాపుత్త్రుఁడగు భరతునిపేర భారతమనఁ బ్రసిద్ధికెక్కినది.) ద్వారకయనుపురము, కలదు, తద్వర్ణన=దానిని వర్ణించుట, వాణీ రమణునకున్+ఐనన్ = (సకలవిద్యల కధిదేవతయైన) సరస్వతికి భర్త యగు చతుర్ముఖుఁడైన బ్రహ్మకైనను, దుష్పారము = శ్రమచే తుదముట్టింపఁదగినది. బ్రహ్మసైతము మిగుల శ్రమపడి కాని వర్ణింపఁజాలఁడనిభావము, సమస్త సౌభాగ్యములన్ = ఎల్లసంపదలచేతను, అపారము = అధికమైనది.

అలం :—పరికరాంకురము.

వి. :—కురు, హిరణ్మయ, రమ్యక, ఇలావృత, హరి, కేతుమాలా, భద్రాశ్వ, కిన్నర, భారతములు అని వర్షములు తొమ్మిది.

ఆ. ఏను దానిమహిమ నానేర్చినంత వ,ర్ణింతుఁ గొంత యని తలంతునేని
నీవు ప్రకృతయువ కథావిలంబమునకు, నోర్వవేమొ యది యటుండనిమ్ము.

అర్థము :—ఏను=నేను, దానిమహిమన్ = ఆద్వారకయొక్క గొప్పతనమును, కొంత, నానేర్చినంత = నేను నేర్చుకొనినపాటి (నాకు చేతనైనంతలో అనిభావము), వర్ణింతున్, అని, తలంతునేని = తలంచితినా, నీవు, ప్రకృతయువ = ప్రస్తుతము చెప్పఁదగిన పడుచువానియొక్క, కథ = చరిత్రయొక్క, విలంబమ్మునకున్ = ఆలస్యమునకు, ఓర్వవేమొ - (ఓర్వవు + ఏమి + ఓ) = సైఁపఁజాలవేమో, అది = ఆపట్టనవర్ణనము, అటు, ఉండనిమ్ము = అట్లుండనీ (ప్రకృతమున వలదని భావము.)

తాత్పర్యము :—నే నాపట్టనమును నాచేత నైనంతలో వర్ణింప నెంచితినా, నీవు ప్రకృత మైన యువకునికథ యాలస్య మగుచున్న దని సైఁపలే వేమోకదా! దాని నటుండనిమ్ము.

వి. :—సామాన్యముగా నిట్టియెడ కవులు పట్టనమును రేఖామాత్రముగా నైనను వర్ణింపక మానరు, కాని యది కథ కడ్డము వచ్చు నని సూరన యీమాట శుచిముఖినోటఁ జెప్పించుట యౌచిత్యాధాయకము

మఱియు ప్రభావతికిఁ గల్గుచిత్రవృత్తాంతము తెలిసికొనునుత్కంఠ తాను గ్రహించి పలికినట్లు శుచిముఖి చేత లోకస్వభావమును రసవత్తరముగాఁ జెప్పించుట కవియొక్క ప్రౌఢి.

క. నా విని నీ కిది చెప్పం, గావలయునె యెందు మిగులఁ గతరాజవు నీ
వో వరటారత్నమ ! యని, యావనితలు నవ్వ నవ్విహంగి యి ట్లనియెన్. 79

అర్థము :—నాన్ = అనఁగా, విని, ఓ వరటారత్నమ = ఆఁడుహంసలలో శ్రేష్ఠురాలా ! నీకున్, ఇది = ప్రకృతయువకథావిలంబమున కోర్వలే మను నీవిషయము, చెప్పంగా, వలయునె, నీవు ఎందున్ = అన్నిటియందును, కతరాజవు = కథానాయకుఁడువంటి దానవు, దిట్టవు. (ప్రకృతమున ప్రద్యుమ్నుని కథ చెప్పవలసియున్నదికాన కథలు చెప్పుటలో దిట్ట వనియు నర్థాంతరము). అని, ఆవనితలు = ఆస్త్రీలు, నవ్వన్, అవ్విహంగి = ఆయాడుపక్షి (శుచిముఖి) ఇట్లు, అనియెన్.

వ్యాఖ్యము :—అట్లనఁగా నాయింతు లోహంసీలలామా ! ఇట్టిసంగతి నీకుఁ జెప్పవలెనా ? నీ వన్నిటియందును లోకజ్ఞత గలిగి చెప్పఁగలదానవు, అని నవ్వఁగా నది యి ట్లనెను.

వి. :—హంసి యేయాశయముతో నన్నదో చక్కఁగా గ్రహింపఁగల బుద్ధిమతు లాయిరువురు కాంతలు నని తెలియుచున్నది 'కతరాజు' జాతీయము.

ఉ. ఆ నగరంబునన్ యదుకులాభరణం బగు మర్త్యజన్మమున్
బూనిన సర్వభద్రపరిపూర్ణుఁడు కేశవుఁ డుండు నాథుఁడై
యానలినాక్షు షోడశసహస్రవధూప్రియు మిక్కిలిన్ గుణ
శ్రీ నలరించి యష్టమహిషీజను లెంతయు మింతు రున్నతిన్. 80

అర్థము :—ఆనగరంబునన్ = ఆ ద్వారకయందు, యదుకులాభరణంబు = యదువను చంద్రవంశపు రాజుయొక్క, కుల = వంశమునకు, ఆభరణంబు = అలంకారము, అగు మర్త్యజన్మమున్ = అయినట్టి మానవజన్మమును, పూనిన - పొందిన - (యదువంశమున కలంకార మైనమానవజన్మమును పూనుట యనఁగా శ్రీకృష్ణుఁడు మనుజుఁడై యదువంశమున పుట్టుట యావంశమున కాభరణమువలె నైన దన్నమాట.) సర్వభద్రపరిపూర్ణుఁడు = సకల మగు శుభములతో నిండినవాఁడు, (అగు) కేశవుండు = శ్రీకృష్ణుఁడు, నాథుఁడు + ఐ = ప్రభువై, ఉండును. షోడశసహస్రవధూప్రియున్ = పదియాఱువేల స్త్రీలకు భర్తయైన, ఆ నలినాక్షున్ = తామరపూవులవంటి కన్నులు గలయాశ్రీకృష్ణుని, అష్టమహిషీజనులు=ఎనమండ్రు పట్టపుదేవులు, గుణశ్రీన్ = గుణసంపదచే - అనేకసుగుణములచే నని భావము. అలరించి = ఆనందపఱచి, ఉన్నతిన్ = గొప్పతనముచే, ఎంతయున్, అత్యంతము, మింతురు = శోభిల్లుదురు.

తాత్పర్యము :—ఆ పురమందు యదువంశమున మనుజుఁడై పుట్టి, సకలశుభములు గలవాఁడై, శ్రీకృష్ణుఁడు ప్రభువై యుండును. పదియాఱువేల భార్యలతోఁగూడి యున్న యాకృష్ణుని, గుణసంపదచే సంతోషపెట్టుచు నెనమండ్రు పట్టపుదేవు లందఱికంటె గొప్పవారయి యుందురు. (ఆ ద్వారకానగరమునకు ప్రభువు కృష్ణుఁడు. విష్ణువే యదువంశమున మనుజుఁడై కృష్ణుఁ డనుపేరఁ బుట్టినవాఁడు, సకలసంపదలు గలవాఁడు, ఆతనికి పదాఱువేల నూటెనమండ్రు భార్యలు. అందు పట్టమహిషు లైనవా రెనమండ్రు, ఆయెనమండ్రును సకల సుగుణములు గలవారయి యతనిప్రీతికి స్థానములై భార్యలందఱిలో మిగుల గౌరవము నొందుదురు అని భావము.)

ఆ. అందు నగ్రగణ్య ౹ యై యొప్పు రుక్మిణీ, నామధేయ యొకతె ౹ యామగువకుఁ
బట్టి యొకఁడు గలఁడు ౹ ప్రద్యుమ్ననాముఁ, డాయనఘురూప మిది సుధాంశువదన.

అర్థము :—సుధాంశువదన = చంద్రునివంటి మొగముగలదానా, ప్రభావతీ, అంగనన్ = ఆయెన మంద్రడలో, అగ్రగణ్య = తొలుత లెక్కింపఁదగినది - అనఁగా ముఖ్యురాలు - ఐ, రుక్మిణీనామధేయ = రుక్మిణి యనుపేరు గలది, ఒకతె = ఒకర్తె, ఒప్పున్, ఆ మగువకున్=ఆయింతికి, ప్రద్యుమ్ననాముఁడు = ప్రద్యుమ్నుఁడను పేరుగలవాఁడు, పట్టి = కొడుకు, ఒకఁడు, కలఁడు, ఇది = ఈ చిత్తరువందలిది, ఆయనఘురూపము = ఆ పుణ్యాత్ముని యాకారము.

వ్యా. వి. :—నామము - నామధేయము - సమానార్థకములు -'భాగ రూప నామభ్యో ధేయః' (వార్తి. 5. 4. 35) - (భాగధేయము, రూపధేయము, నామధేయము) ఇందలి, ధేయ అనునది స్వార్థిక తద్ధిత ప్రత్యయము.

హంసి భారతవర్షమున ద్వారకాపురమునకు ప్రభువగుకృష్ణుని యష్టమహిషులలో మొదటి దగురుక్మిణి కొడుకైన ప్రద్యుమ్నునిరూప మీచిత్తరువులోనిది అని సూక్ష్మముగా చెప్పి వారి యుత్కంఠ తీర్చి యీ పైని ప్రద్యుమ్నుని గుణములను వివరించుచున్నది.

ఉ. శౌర్యమయుం డతండు భుజ ౹ సత్త్వనిధానము కాంతిరాశి గాం
భీర్యపుఁబ్రోక సత్కళల ౹ పెన్నని రూపము దాల్చినట్టి యౌ
దార్యము పెక్కు లేటికి ను ౹ దాత్తగుణోదయ మా యపూర్వ సౌం
దర్యత కెంత యెంత యుచితం బగు నంతయుఁ గల్గి శోభిలున్. 82

అర్థము :—అతండు, శౌర్యమయుండు = పరాక్రమముతో నిండినవాఁడు, భుజసత్త్వనిధానము = బాహుసంబంధ మగుబలమునకు స్థానము, కాంతిరాశి = కాంతులయొక్క ప్రోగు, గాంభీర్యపు = క్రోధ మోదాదులచే వికారము (మార్పు) నొందకుండుట యనెడి గుణమునకు, ప్రోక= రాశి, సత్కళలపెన్నని = ఉత్తమ మగువిద్యలకు పెద్దగని, రూపముదాల్చినట్టి = కరచరణాద్యవయవముల తోడి యాకారము ధరించిన, ఔదార్యము = దాతృత్వము, పెక్కులు = పెక్కుమాటలు, ఏల = ఎందులకు, ఆ యపూర్వ సౌందర్యతకున్ = అద్భుత మగునాచక్కదనమునకు, ఎంతయెంత = ఏయే ప్రమాణము గల, ఉదాత్త గుణ + ఉదయము = గొప్పవగు గుణములయొక్క సమృద్ధి యెల్లను, ఉచితంబు = తగినది, అగున్ = అగునో, అంతయున్ = అంతంత గొప్పగుణములసమృద్ధి యెల్లను, కల్గి, శోభిలున్ = ప్రకాశించును.

తాత్పర్యము :—అతఁడు మహాశూరుఁడు, బాహుబలశాలి, కాంతులరాశి, లోఁతుగుండెతనము యొక్క ప్రోగు, ఉత్తమవిద్యలకు పెద్దగని, ఆకారము ధరించిన దాతృత్వము, వేయిమాట లెందులకు ? ఆ యద్భుత మగు చక్కఁదనమున కెంతటి సుగుణసంపద తగియుండునో యంతయుఁ గల్గి శోభిల్లును.

అలం :—రూపకము, ఉల్లేఖము.

వ. అని చెప్పిన. 83

శా. సంతోషం బపు డాత్మఁ బిక్కటిలుచున్ ౹ సర్వాంకషంబై శరీ
రాంతర్భాగము పట్టఁజాలక నిలింపారాతిరాట్కన్యక
త్యంతంబున్ వికసిల్లఁజేసె ముఖపద్మంబున్ ద్రపాశిక్షఁ ద
త్కాంతారత్న మొనర్చునట్టి యవహిత్థాయత్నమున్ మీఱుచున్. 84

అర్థము:—అపుడు, నిలిం...కన్యకున్, నిలింప = దేవతలకు, అరాతి = శత్రువు లగు రాక్షసులకు, రాట్ = రాజగు వజ్రనాభునియొక్క, కన్యకున్ = కూఁతు రగు ప్రభావతికి, సంతోషంబు = సంతసము, ఆత్మన్ = మనస్సునందు, పిక్కటిలుచున్ = నిండుకొనుచు - అవకాశము లేకుండ నిండుచు - అని భావము - సర్వంకషంబు = అంతటను వ్యాపించినది, (లేక + అంతను నొరయుచున్నది) ఐ, పట్టన్ = (అసంతోషమును) భరించుటకు, శరీర+అంతః+భాగంబు = దేహముయొక్క లోపలిప్రదేశము, చాలక = చాలకపోవుటచే, త్రపాశిక్షచేన్ = సిగ్గుయొక్క శిక్షచేత, తత్కాంతారత్నము = ఆయన్నులమిన్న, ఒనర్చు నట్టి = చేయుచున్న, అవహిత్థా యత్నమున్ = ఆకారమును దాఁచుటయందలి పూనికను, (సంతసము మొదలగు వానివలనఁ బుట్టువికారములను సిగ్గుమొదలగువానిచేఁ గప్పిపుచ్చుట - అవహిత్థ యనఁబడును.) మీఱుచున్ = అతిక్రమించుచు, ముఖపద్మంబున్ = పద్మమువంటి మొగమును, అత్యంతంబుగా = మిక్కిలి, వికసిల్లంజేసెన్ = వికాసమొందించెను.

తాత్పర్యము:—అపుడు ప్రభావతి సంతోషము మనస్సునందు నిండిపోయి, అంతట నొరయుచు, దేహములోపలిభాగమున నిముడక, శరీరమునఁ బుట్టు వికారములను, సిగ్గుపడి దాఁచుకొంద మని యత్నించినను, సాగనీయక, ముఖమునందు గొప్పవికాసము పుట్టించెను. (సంతోషము కర్త) అనఁగా - అప్పుడు ప్రభావతి సంతోషము హృదయమున పట్టలేకపోయినది. సిగ్గుచే సంతోషచిహ్నములు కప్పుకొన యత్నించినను ఆఁగక ముఖవికాసము హెచ్చినది అనిభావము.

అలం:—అతిశయోక్తి.

వ్యా. వి. సర్వంకషము:—సూ. సర్వ కూలాభ్రకరీషేషు కషః 3. 2. 43 - సర్వంకషః ఖలః - అని సిద్ధాంతకౌముది - సర్వమును రాయిడిపెట్టువాఁడు అనికలదు. కాని భట్టికావ్యమున - సర్వమునుక్రమ్మినది అని శ్లో. సర్వంకషయశః శాఖం రామకల్పతరుం కపిః, ఆదాయాభ్రంకషం ప్రాయాన్మలయంఫలశాలినం - 'సర్వం కషంతి వ్యాప్నువంతి యాని యశాంసి' అని జయమంగళవ్యాఖ్య. ఇచట శరీరాంతర్భాగము నంతను వ్యాపించినది అనినను లేక ఒరయుచున్నది యనినను సరిపడును.

మ. ప్రమదం బొప్పఁగ రాగవల్లరియు నాపద్మాననం జూచి చి
త్రము నీ కిచ్చిన దేవివాక్యమునకున్ దార్కాణగా నామ జ
న్మములున్ వింటిగదమ్మ! తద్వసతియున్ సంసిద్ధి యయ్యెం గదా
కమనీయం బగు నీమరాళికృప నింకన్ మాను మాందోళమున్. 85

అర్థము:—రాగవల్లరియును = (చెలికత్తెయగు) రాగవల్లరికూడ, ప్రమదంబు = సంతోషము, ఒప్పఁగన్ = కలుగఁగా, ఆపద్మాననన్ = పద్మమువంటి మోముగల యా ప్రభావతిని, చూచి, చిత్రము= చిత్తరువును, నీకున్, ఇచ్చిన, దేవి = గౌరీదేవియొక్క, వాక్యమునకున్ = మాటకు, తార్కాణగాన్ = దృష్టాంతముగా, కమనీయ బు = (మనకు) కోరుకొనఁ దగినదియగు, ఈమరాళికృపన్ = ఈహంసియొక్క దయచేత, నామజన్మములున్ =(ఆచిత్రగతపురుషుని) పేరును, పుట్టుకయును, వింటివిగదమ్మ, తద్వసతిన్= అతనివాసస్థలమును, సంసిద్ధియయ్యెంగదా = పూర్తియైనదిగదా ! ఇంకన్, ఆందోళమున్ = (ఆతఁ డెక్కడ వాఁడో, ఎట్లబ్బునో యను) సంశయమును, మానుము = విడువుము.

తాత్పర్యము:—చెలికత్తె యగు రాగవల్లరియును మిగుల సంతసించుచు ప్రభావతిని జూచి 'కలలోఁ గనఁబడి గౌరీదేవి చిత్రఫలక మిచ్చుచు' ఇతండ నీవల్లభుండు, ప్రద్యుమ్నుఁ డనియెడు ప్రభుకుమారుఁ డనినవాక్యమునకు నిదర్శనముగా మన మెల్లప్పుడును కోరుకోఁదగిన యీహంసిదయచేత విన్నావుగదా ! ఆతని నివాసస్థల మెచటనో యనువిషయముకూడ పూర్తియైనది. ఇంక సాందోళనము విడువుము.

వ. ఇమ్మరాళబాలిక యాలాపచాతుర్యంబు చూడఁ గడమకార్యంబును సాధించి పెట్టు నట్టిదిట్టతనంబు గానిపించుచున్నది. మొదలనుండియు సకలకళల సడిసన్న చదురుల ప్రోదిఁ బెరింగినది గాఁబోలుఁ గాలిపెండెరంబు నొక్కటిఁగలిగియున్నది యని తదక్షరంబు లీక్షించి చదువుకొని యాబిరుదంబునకు నరుదుపడి యాహంసివలనం దజ్జన్మ నామ విద్యాభ్యాసాదులు విని మనంబునం గడు ముదం బందుచుం బ్రభావతిం జూచి యోచెలువ మనకొదవ లన్నియుం దీర్చుటకు శరణం బింక నిదియ కాని వేఱొండు గాన మని పలికి యా పులుఁగుఁజెలువకుం దనచెలికత్తె కల తెఱంగు సకలంబును జెప్పి, తదాదిగా నప్పటితుదకు ముదిత కొదవిన మదనావస్థ లెల్ల సవిస్తరంబుగా వినిపించి యింతకుం దెల్లంబుగ నీ పల్లవాధర యాకారంబు పరికించి చూడు మని యి ట్లనియె. 86

అర్థము:—ఈ + మరాళబాలిక = ఈ యంచకన్నెయొక్క, ఆలాపచాతుర్యంబు = మాటనేర్పు, చూడన్ = ఆలోచింపఁగా; కడమకార్యంబును = ప్రద్యుమ్నుని తెచ్చుపని గూడ, దిట్టతనంబు = సామర్థ్యము, సడిసన్న = ఖ్యాతిని బొందిన, చదురుల = నేర్పరులయొక్క, ప్రోదిన్ = పోషణమున, కాలిపెండెరంబు = కాలియం దున్న బిరుదుటందె, తదక్షరంబులు = దానియందలి యక్షరములు, ఆ బిరుదంబునకున్ = ఉపమాతిశయోక్తి కామధేనువు అను బిరుదమునకు, అరుదుపడి = ఆశ్చర్యపడి, తజ్జన్మ... సాదులు - తత్ = దానియొక్క, జన్మ = పుట్టుకయును, నామ = పేరును, విద్యాభ్యాస = విద్యలను నేర్చుట, ఆదులు = మున్నగువానిని, విని, మనకొదవలు = మనకుఁగల కొఱఁతలు, అన్నియును, తీర్చుటకున్ = తొలఁగించుటకు, శరణము = దిక్కు, ఆధారము, పులుఁగుఁజెలువకున్ = ఆఁడుపక్షికి, కలతెఱంగు = నిజమగుస్థితి, తదాదిగాన్ = కలవచ్చినది మొదలుగా, అప్పటి తుదకు = చెప్పుచున్న ఆ సమయము చివరదాఁక, ముదితకున్=ఆయింతికి, ఒదవిన = కలిగిన, మదనావస్థలు = మన్మథసంబంధ మగుస్థితులు, సవిస్తరంబుగాన్ = విరివితోఁ గూడుకొన్నట్లు, పల్లవాధర = చిగురాకువంటి మోవిగలది, పరికించి = పరీక్షించి. (తక్కినది సుగమము)

సీ. నెలఁత ముక్కరయందు నీలంబు గాదు సూ, తెలిదళుకొత్తు ముత్తియము గాని
యువిదసందిళ్ల బాహుపురులు గావు సూ, మితిచూడ నిడిన యూర్మికలు గాని
సుదతిపాలిండ్లఁ గస్తురినల్పు గాదు సూ, కనుదోయి కాటుకకప్పు గాని
రమణికర్ణికల వజ్రపుదీప్తి గాదు సూ, ప్రాఁగెంపుఁదునుకల రంగు గాని
యూర్పు వేఁడిమిఁ గృశత బాష్పోదయమున, గండపాండిమఁ దత్త్రపాకారములను
గానఁబడియెడు నోవిహంగమపురంధ్రి, యింక నీచేత నున్న దీయింతి బ్రదుకు. 87

అర్థము:—ఓ విహంగమపురంధ్రీ = ఓ పక్షివనితా! నెలఁత ముక్కరయందున్ = ఈ చిన్నదాని ముంగర (అడ్డబాస) యందు, తెలిదళుకు = తెల్లనికాంతి, ఒత్తు = కలిగిన, ముత్తియము+కాని = ముత్యము గాని, నీలంబు = ఇంద్రనీలమణి, కాదు సూ = కాదుసుమా, ఉవిదసందిళ్లన్ = ఈ యువతియొక్క బుజములందు, మితి = కొలత, చూడన్ = పరీక్షించుటకు, ఇడిన = పెట్టిన, ఊర్మికలు = ఉంగరములు, కాని = అంతియకాని, బాహుపురులు = దండకడియములు, కావు సూ=కావుసుమా, సుదతి పాలిండ్లన్= (చక్కని పలువరుసగల) ఈ కన్యయొక్క కుచములందు, కనుదోయి కాటుకకప్పు = రెండు కన్నులందలి

కాటుకనలుపు కాని, కస్తురినల్పు = కస్తూరి పూఁతవలని నల్లఁదనము, కాదు సూ = కాదుసుమా, రమణి కర్ణికలన్ = ఈ యింతియొక్క చెవికమ్మలయందు, ప్రాఁగెంపు తునుకలరంగు = పద్మరాగ మణిఖండముల రంగు - (అనఁగా ఎఱ్ఱనిరంగు) కాని, వజ్రపుదీప్తి = వజ్రపుఁ గాంతి, కాదు సూ = కాదుసుమా, ఊర్పు వేఁడిమిన్ = నిట్టూర్పు గాడ్పుల వేండ్రముచేత (తెల్లని ముత్యములును), కృశతన్ = చిక్కిపోవుటచేత, (వ్రేళ్ల యుంగరములును), బాష్పోదయమునన్ =కన్నీటి యతిశయముచేత (కన్నులందలి కాటుక నలుపును), గండపాండిమన్ = చెక్కుల తెలుపుచేత (పద్మరాగముల యెఱ్ఱకాంతియును) తత్తత్ప్రకారములను = ఆ యా విధములుగా - ముత్యములు కమరిపోయి యింద్రనీలములవలెను, ఉంగరములు దండకడియములవలెను, కాటుకకన్నీటి నలుపు కుచముల నలఁదిన కస్తూరినలుపువలెను, పద్మరాగముల రంగు వజ్రాల కాంతివలెను, కానఁబడియెడున్ = కనఁబడుచున్నవి. ఈ యింతిబ్రతుకు = ఈ ప్రభావతి జీవితము, ఇంకన్, నీచేతన్ + ఉన్నది = నీవశమందున్నది.

తాత్పర్యము:—ఓ శుచిముఖీ! కోర్కి ఫలింపకపోవుటచేఁ గల్గుచింతచే వెచ్చనైన శ్వాసము దగిలి ముక్కర యందలి తెల్లనిముత్యము నీలమణివలె నైనది. చూడుము. ప్రియవిరహమున నన్నపానములు లేక చిక్కిపోవుటవలన వ్రేలియుంగరము కొలతచూడ దండకడియ మైనదిసుమా. దుఃఖ రోషాదులవలనఁ గలుగు కాటుకకంటి యశ్రువులరంగు కుచములం దంటికొన్నదికాని పూసిన కస్తూరిరంగు కాదుసుమా. తలఁచినపని నెఱవేర్చుకొనుటకు తగిన యుపాయము తోఁపక, కలుగు విషాదముచేఁబుట్టు చెక్కిళ్ల తెలుపువలనఁ దెల్లనైన చెవులకమ్మలజతయందలి కెంపులరంగు గాని వజ్రాలకాంతి కాదుసుమా ఈ రీతిగా విరహతాపముచే కృశించి రేపగలు దుఃఖించుచు పాలిపోయిన యీమెబ్రతుకు నీచేతిలోనున్నది. (నీ వీమె వాంఛ నెఱవేర్చినచో జీవించును అని భావము.

అలం. :—మొదటిపాదమున - అతిశయోక్తి. రెండవపాదమున - అల్పాలంకారము. మూఁడు నాల్గుపాదములందు తద్గుణము అంగి. భ్రాంతాపహ్నుతి. గీతమున - క్రమాలంకారము, లోకోక్తి.

వి. :—ముక్కర, ఉభయరేఫముగాఁ గనఁబడుచున్నది. నిర్ధారక ప్రయోగములు రెండింటికిని కనఁబడవు. తళుకొత్తు = (ప్రకాశించు) శబ్దపల్లవక్రియ కలదు. తెలిదళుకొత్తు, అంతయు శబ్దపల్లవ మనుట కంటె 'ఒత్తు' నకు విశేషార్థము చెప్పుట మే లని 'ఒత్తు = కలుగు' అని వ్యాఖ్యానింపఁబడెను.

వ్యా. :—ప్రాఁగెంపు - ప్రాఁత+కెంపు = ప్రాతాది సూత్రసంధి.

చ. అరయఁగఁ దల్లి కక్కసెలిఁయండ్రకుఁ దక్కును గల్గినట్టి చు
ట్టఱికము వారికిన్ నెరయఁ డాఁచు రహస్యము లీనిజాంతర
స్మరవికృతిప్రవర్తనలమాటలు, వీని వినంగ నాప్తలై
పరఁగెడునెచ్చెలుల్ చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పు దీఱునే ? 88

అర్థము:—అరయఁగన్ = ఆలోచింపఁగా, ఈనిజాంతర...మాటలు, ఈ = ఇపుడు నేను చెప్పిన, నిజ = తనయొక్క, అంతర = మనస్సునఁ గల్గిన, స్మరవికృతి = మన్మథవికారములచేఁ గల్గిన, ప్రవర్తన = నడవడియొక్క, మాటలు, తల్లికిన్, అక్కసెలియండ్రకున్ = అక్కలకును చెల్లెండ్రకును, తక్కును గల్గినట్టి = మిగిలినట్టి, చుట్టఱికము వారికిన్ = బాంధవ్యము గలవారికిని - అనఁగా చుట్టములకును సైతము, నెరయన్=పూర్ణముగా, డాఁచురహస్యములు = దాఁపఱికము చేయఁదగ్గ యేకాంతములు - అనఁగా తల్లి మొదలగువారి కెవ్వరికినిగూడఁ దెలియఁ జెప్ప వీలులేని రహస్య విషయములు - ఏమని చెప్పఁగలదు ? అని భావము. (అట్టియెడ) వీనిన్=ఈమదనవికార విషయములను, వినంగన్ = వినుటకు, ఆప్తలై = విశ్వాస పాత్రములై, పరఁగెడు = ప్రవర్తిల్లునట్టి, నెచ్చెలుల్ = చెలికత్తెలు, ప్రాణములు + ఇచ్చినన్ =

(ఈమె వాంఛితము తీర్చుటకై వలయు నేని) ప్రాణములే యిచ్చినప్పటికిని - అనఁగా చచ్చి పోయినప్పటికిని, అప్పు = ఈమె యెడఁగలిగిన ఋణము, తీఱునే = తొలఁగునా ? - అంతటి రహస్యములను డాఁపక విశ్వాసపాత్రము లని నమ్మి తమతో చెప్పుకొనఁగా వినినచెలికత్తె లాకార్యసిద్ధికై వలయు నేని ప్రాణములేని యీయవలసియుండును అనిభావము.

వ్యా. వి. :—అక్క+చెలియలు - అక్కసెలియండ్రు - సూ. ద్వంద్వంబునం బదంబుపైఁ బరుషంబులకు గసడదవ లగు. బాల. సంధి. 15 - చుట్టఱికము. చిన్నాదులకు ఱికవర్ణకం బగు. బాల. తద్ధి. 3.

సీ. కావున నోహంసి నీ వెఱుంగని సఖీ, ధర్మంబు లేదు, విద్వజ్జనంబు
సఖ్యంబు నెంచును సాప్తపదీనంబు, గాఁగ న ట్లాట వేగంబ యరిగి
యదుకుమారకునకు హృదయంగమముగ నీ, యతివసౌందర్యాదు లభినుతించి,
యేతన్మనోరథంబీడేర్పవలయు నీ, వని పల్కుటయును నాహంసరమణి

గీ. యతనియొద్ద నీయంగనయంగకముల, చక్కఁదన మెల్ల నొక్క ప్రసంగవశత
నేను మున్న వర్ణించినదానఁ దత్ప్ర, సంగ మెయ్యది యంటేని సకియ వినుము.

అర్థము:—కావునన్ = నీవు ప్రాణసఖి వైతివి (నాదుచెలిమి కోడఁబడంగవలయు నోహంసభామినీ 'అని యీమె ప్రార్థించుటఁజేసి యని భావము)-కాఁబట్టి, నీవు, ఎఱుంగని, సఖీధర్మంబు=సఖుల నీతి, లేదు, విద్వజ్జనంబు = పండితలోకము, సఖ్యంబున్ = చెలిమిని, సాప్తపదీనంబు = ఏడుమాటలు మాట్లాడుటచే సిద్ధించునది, కాఁగన్ = అగునట్లు, ఎంచును = చెప్పును (ఏడుమాట లొండొరులు మాటాడుకొనినచో నెట్టివారికిని స్నేహము కలుగు నని పండితులు చెప్పుదురు అని భావము) అట్లు + ఔటన్ = ఆకారణముచేత వేగంబు + అ = వేగమే, అరిగి = వెళ్లి, యదుకుమారునకున్ = ప్రద్యుమ్నునకు, హృదయంగమముగన్ = మనస్సున కింపగు నట్టిదిగా, ఈయతివ సౌందర్యాదులు = ఈమె చక్కఁదనము మున్నగునవి, అభినుతించి = పొగడి, ఏతన్మనోరథంబు = ఈమె యొక్క కోరికను, నీవు ఈడేర్పవలయున్ = నెఱవేర్పవలెను, అని, పల్కుటయును, ఆహంస రమణి = ఆయాఁడు హంస, అతని యొద్దన్, ఈ యంగన యంగకముల చక్కఁదనము, ఎల్లన్, ఒక్క ప్రసంగవశతన్ = ఒక ప్రసంగము తటస్థించుటచేత, మున్నె, నేను, వర్ణించినదానను = స్తుతించితిని, తత్ప్రసంగము = ఆ ప్రస్తావము, ఎయ్యది, అంటి + ఏని = = అంటివా ? సకియ, వినుము.

తాత్పర్యము:—కాఁబట్టి యోహంసి నీకెల్ల సఖీధర్మంబులు తెల్లమే. పండితులు 'సఖ్యం సాప్తపదీనం స్యాత్' అనిరి. కానవేగమె పోయి యా ప్రద్యుమ్నునకు మనస్సున కింపుగా నీమె సౌందర్యాదులు పొగడి, యీమె కోర్కె నెఱవేర్పు మనఁగా నాశుచిముఖి యిట్లనెను. ఇంతకు మునుపే యతనికడ నొకానొక ప్రసంగమున నీమె యవయవముల సొగసు వర్ణించియే యుంటిని. ఆ ప్రసంగ మే మందు వేమో వినుము.'

వ్యా. వి. :—సాప్తపదీనము.—'సాప్తపదీనం సఖ్యం' సప్తభిః పదై రవాప్యతే సాప్తపదీనమ్ - అని సిద్ధాంతకౌముది (5-2-23) సప్తపద శబ్దమునకంటె 'ఖఞ్' ప్రత్యయము రా - సిద్ధించినది. ఇట సప్తపదము లనఁగా ఏడు మాటలు అనియు, ఏడడుగులు అనియు రెండు విధముల జెప్పిరి. 'వివాహమున సప్తపద సంస్కారము ఏడడుగుల పక్షమే యగును. యదు కుమారుఁడు = యదువు అనఁగా యదువంశమునఁ బుట్టిన కృష్ణుఁడని యర్థము. 'రఘూణామన్వయం వక్ష్యే' 'నిరుధ్యమానా యదుభిః కథంచిత్' ఇతితు రఘు యదు శబ్దయో స్తదపత్యే లక్షణా - అని కౌముది. 2-4-62 సూత్రము యొక్క వృత్తి. రఘువులన - రఘువు సంతానమనియు, యదువు లన - యదువు యొక్క సంతాన మనియు నర్థము అగుటచే - యదు కుమార శబ్దము సాధువగుచున్నది. అంటి + ఏని = అంటేని - అంటివి సూ. లిఙ్లోట్టుల వకారంబునకు

లోపంబు విభాష నగు- బాల. క్రియా. 24-చే వకారలోపము. అపదాది స్వరసంధి - కాఁగా 'అంటి' అని రూపసిద్ధి. పిదప - మధ్యమ పురుషేకార సంధి - 'అంటేని' అగును.

ఉ. ఏ నిటమున్న యివ్వనరుహేక్షణఁ గన్గొని చన్నదాననై
యా నరవర్యుఁ గాంచి యరుదైన తదాకృతిశోభ కెన్న జో
డైనది యీ విలాసవతి యాకృతి చెల్వము కావునం దలం
పైన వచింపఁగా వలసె నాతనియొద్దఁ బ్రసక్తి వెంబడిన్. 90

అర్థము:—ఏను = నేను, ఇటమున్నన్ = ఇంతకు మునుపుగూడ, ఇవ్వనరుహేక్షణన్ = తామర పువ్వులవంటి కన్నులు గల యీమెను, కన్గొని, చన్నదానను + ఐ = వెళ్లిన దాన నయి, ఆ నరవర్యు, = నరులలో శ్రేష్ఠుఁడగు నా ప్రద్యుమ్నునికాంచి, అరుదైన=అద్భుతమైన, తదాకృతి శోభకున్= అతని రూపము యొక్క సొగసునకు, ఎన్నన్ = ఆలోచింపఁగా, ఈ విలాసవతి యాకృతి చెల్వము + అ = ఈ యొయ్యారి యొక్క రూపము సొగసే, జోడు = సమము, ఐనది, కావునన్ = కాఁబట్టి, తలంపు + ఐనన్ = (అతని జూడఁగనే) జ్ఞప్తికిరాఁగా, ఆతని యొద్దన్, ప్రసక్తి వెంబడిన్ = ప్రసంగవశముగా, వచింపఁగా వలసెన్ = చెప్పవలసి వచ్చెను.

తాత్పర్యము:—నేనింతకు మునుపే యీమెను జూచి వెళ్లినదాన నగుటచే ఆ ప్రద్యుమ్నుని చూచి ఆతని యద్భుత సౌందర్యమున కీయొయ్యారి చక్కఁదన మొక్కటే జోడగు నని, ఆతని యొద్ద నేదియో ప్రసంగమందు చెప్పవలసి వచ్చెను.

వ్యా. వి. :—చన్నదానను -చన్న+అది - చన్నయది - ఇది యస్మద్విశేషణ మగునపు డేకవచనమున 'ను' వర్ణమంతాగమము కాఁగా చన్నయది + ను - అని యుండును. పిదప సూ. అది శబ్దంబునకు 'వు, ను' లు పరంబగునపుడును, సంబోధనంబునందును 'దాన' యను నాదేశంబగు. బాల. కారక. 35 చే, (చన్న + దాన + ను) = చన్నదానను - అని యగును.

క. వచియించిన నౌఁగా దను, వచనం బప్పుడేమియు నుడువక యుండె నతం
డచల స్థితి నాకును నది,యె చాలు నప్పటికి నేతదర్థ మెఱుఁగమిన్. 91

అర్థము:—వచియించినన్ = చెప్పఁగా, ఔను, కాదు, అనువచనంబు = అనుమాటను, అతఁడు, ఏమియున్, నుడువక = చెప్పక, అచలస్థితిన్ = చలింపని స్థితితో, ఉండెను. (దీని వలన నాయకునకుండఁ దగిన గాంభీర్యము వ్యక్త మగుచున్నది.) ఏత దర్థము = ఈ విషయము, ఎఱుఁగమిన్ = తెలియక పోవుట చేత, (ఈమె కాతని యందు వలపు గల దని యెఱుఁగ కుండుటచేత) నాకును, అప్పటికిన్, అదియ = అంతమాత్రమే, చాలును = సరిపోయినది.

తాత్పర్యము:—నే నీమె సొగసు వర్ణించితిని, అతఁడు నేమియు ననక యూరకుండెను. ఈమె కాతనిపై వలపు గల దని కాని, వీరిద్దఱను సంధానము చేయవలె నని కాని యనుకొనకపోవుటచే నాకును ఆ ప్రసంగమాత్రముతో నప్పటికి సరిపోయినది.

క. అన విని మనసు చివుక్కుఱు, మనఁగఁ బ్రభావతి వివర్ణ మగువదనముతోఁ
గనుపట్టుడు నింతనె ముగిసెనె కార్యం బేల యింత చింతిల ననుచున్. 92

అర్థము:—అనన్=విని, ప్రభావతి, మనసు, చివుక్కుఱు మనఁగా=కలఁత నొందఁగా, వివర్ణము = కాంతిదొఱఁగినది, అగువదనముతోన్ = అయినముఖముతో, కనుపట్టుడున్ = కనిపింపఁగా - (తన

సౌందర్యము విని యూరకున్నాఁ డని వినఁగానే ప్రద్యుమ్నుఁడు తనయొడ సుముఖుఁడు కాలేదు అనుకొని వెలవెలఁ బోయిన దని భావము). ఇంతన్ + ఎ = ఇంతమాత్రముచేతనే, కార్యము = కోఁదగినపని, ముగిసెను + ఎ=సమాప్త మైనదా ? (కాలేదనిభావము) - ఇంత = ఇంతగా, చింతిలన్ = ఖేదపడుట, ఏల = ఎందులకు ? వగవ నక్కఱ లే దని భావము, అనుచున్ - (వాఁడికన్వయము.)

వ్యా. వి:—చివుక్కు + అను - సూ. "ధ్వన్యనుకరణశబ్దంబుల కనుధాతువు పరం బగునపుడు ము గాగమం బగు. ప్రౌఢ. సంధి. 19. చే - ఒక్క ముగాగమే చెప్పఁబడెను. (చివుక్కుమను) కాని రుగాగమ మును, పర్యాయంబున రెండునుగూడ రాఁ దగు నని యీ ప్రయోగము తెలుపుచున్నది. 'కాంతి శబ్దాది శబ్దాను ద్విరుక్తా స్సంతి నైకశః సాధారణా స్తదన్యే చ వైచిత్ర్యం భూరి వర్తతే.' అను అథర్వణ కారికచే, చివుక్కు మను - చివుక్కు రను - చివుక్కురు మను, అని మువ్విధములు కావచ్చును.

వ. అద్దనుజరాజకన్యక నూరార్చి మంసి యి ట్లనియె. 93

అర్థము:—ఆ + దనుజరాజకన్యకన్ = (ఆవజ్రనాభ) రాక్షసరాజు కూఁతురగు ప్రభావతిని.

మ. అతివా! నిన్ వినిపించువేళఁ బ్రతివాక్యం బేమియున్ లేమిఁ ద
ద్రతికాంతున్ వెసఁ దెత్తుఁ బంపు మని పంతం బాడుకో రాదు గా
ని తగం దెచ్చెద నిశ్చలం బయినపూన్కిన్ సిద్ధగంధర్వదై
వతదైత్యాదికులంబులం దొకని నెవ్వానినిన్ మదిన్ గోరినన్. 94

అర్థము:—అతివా, నిన్=నిన్నున్, నీచక్కదనమును అన్నమాట, వినిపించువేళ=వినునట్లుచేయు (చెప్పునట్టి) సమయమునందు, ప్రతివాక్యంబు=ప్రత్యుత్తరంబు, ఏమియున్=(అవుననికాని కా దని కాని) యే యొకటియును, లేమిన్ = లేకపోవుటచేత, తద్రతికాంతున్ = రతికి భర్త యగునాప్రద్యుమ్నుని,- వెసన్ = శీఘ్రముగా, తెత్తున్, పంపుము, అని, పంతంబు = ప్రతిజ్ఞ (పట్టి) ఆడుకోరాదు = చెప్పుకొన వీలు పడదు - కాని, (పక్షాంతర సూచకము) సిద్ధ ... కులంబులందున్ = సిద్ధ, గంధర్వ, దైవత, దైత్య, మనుష్యేతరులగు సిద్ధాదులయొక్క, కులంబులందున్ = సంఘములందు, (జన్మించిన) ఒకనిన్ = అన్యుని ఎవ్వానినిన్, మదిన్, కోరినన్ = (నీవు) కోరుకొన్నను, నిశ్చలంబు = చలింపనట్టి. (గట్టి) పూన్కిన్ = యత్నముచేత, తగన్ = అనుకూలించునట్లు, తెత్తున్ = తెచ్చెదను.

తాత్పర్యము:—ఓ ప్రభావతీ, నిన్నుగూర్చి నేను చెప్పుచుండఁగా విని, యేమియు ప్రత్యుత్తర మీయక పోవుటచేత ఆప్రద్యుమ్నుని వెంటనే తెచ్చెద నని ప్రతిజ్ఞ పలుకుటకు వీలులేదు. కాని నీమనస్సులోఁ గోరికయున్నయెడల సిద్ధగంధర్వదేవాసురాది మనుష్యేతరసంఘములందలి యేయొకని నైనను గట్టియత్నము చేసి తెచ్చెదను.

అలం. పరికరాంకురము.

వి:—'రతికాంతున్' అనుట. ఇంతకుమున్నే యాతనికి లోకోత్తరసౌందర్యవతి యయి ప్రసిద్ధయైన రతి - భార్య యగుట మౌనమునకు హేతు వని సూచించుటకుఁ జెప్పఁబడెను. ఇదియును, ముందు పద్యమును, ప్రభావతియొక్క మనస్సునందలి దృఢప్రేమను పరీక్షించుటకుఁ జెప్పఁబడినవి.

గీ. తాను జెప్పినవానిని కామిని యితరపురుషు నేఁ గోర నుమచిత్తకమునకు రాదొ
యనవలదు భక్తపరతంత్రకాభవాని, కరయ భవదిష్ట మెయ్యదికయదియ ప్రియము.

అర్థము:—తాను = (గౌరి) స్వయముగా, చెప్పినవానిని, మాని = విడిచి, ఇతరపురుషున్, నేన్ = నేను, కోరను, (అట్లుకోరినచో), ఉమచిత్తమునకున్ = ఆ గౌరిదేవియొక్క మనస్సునకు, రాదో, తెలియదా ? అనవలదు, అరయన్, భవదిష్టము = (నీచేఁగోరఁబడినది) నీకు ఇష్టమైనది, ఎయ్యది = ఏది (అగునో), అదియే, భక్తపరతంత్రకున్=తన్నుఁగొలుచువారి కధీనయైన, ఆభవానికిన్=ఆగౌరీదేవికిని, ఇష్టము, (అగును.).

తాత్పర్యము:—గౌరీదేవి చెప్పినవానిని మాని యితరుల కోరినచో నామెకు తెలియదా యనకుము ఆమె భక్తులకు వశురా లగుటచే నీయిష్టమే యామెకును నిష్ట మగును.

వ. కావున సందిగ్ధఫలం బయిన ప్రద్యుమ్నవాంఛ విడిచి, దేవ దైత్య సిద్ధ విద్యాధర గంధర్వాదులందు నెవ్వాఁడు గావలయు నన్న నతని నతనుపావకప్రజ్వలనధాయ్యామంత్రాయమానం బగుతావకీనసౌందర్యసంపత్సహస్రతమభాగ కథనమాత్రంబున నపాస్తధైర్యుం జేసి తెచ్చి నీకుఁ గింకరుం గావించెద నీ వించుకయు నీ రామణీయకమహిమ యెఱుంగవు గాక యిది వినిన మదనవశంవదహృదయుండు గాని వాఁడునుం గలండె? యదుకుమారుం డొక్కరుండ యనుపమేయరూపలావణ్యగర్వంబునం గన్నుగానకున్నవాఁడు గావలయు నతం డట్ల యుండనిమ్ము. తత్సమాను లనరాదు గాని నానాభువనసంచారిణి నైన నాకు నక్కడక్కడ మిక్కిలిం జక్కని కొమరుఁబ్రాయంపుఁగొమరు లెంద ఱెందఱైనం గనంబడుదురు వారల నందఱ లిఖించి తేవలసినం దెచ్చెద నిచ్చకు మెచ్చువచ్చినవాని వరియింపు మనిన నమ్మాటలు పెడచెవిం బెట్టి యొక్కింత తడవు చింతించి కటకటంబడుచుఁ ప్రభావతి యి ట్లనియె. 96

అర్థము:—కావునన్, సందిగ్ధఫలంబు = సందేహింపఁబడిన ఫలముగలది, ప్రద్యుమ్నవాంఛ = అయినట్టి ప్రద్యుమ్నునివిషయమునఁ గలిగిన కోర్కి, విడిచి, దేవ ... ర్వాదులందున్ - దేవ = ఇంద్రాది దేవతలు, దైత్య = రాక్షసులు, సిద్ధ = సిద్ధులు, విద్యాధర = విద్యాధరులు, గంధర్వ = గంధర్వులు, ఆదులందున్ = మొదలుగాఁ గలవారియందు, ఎవ్వాఁడు = ఎవఁడు, కావలయును, అన్నన్ = నీవు అనినను, అతనిన్ = నీవు కావలె నన్న వానిని, అతను ... మానంబు - అతను = (తనువులేనివాఁడు) మన్మథునియొక్క, పావక = అగ్నియొక్క, ప్రజ్వలన = మండించుటవిషయమున, ధాయ్యామంత్రాయమానంబు=ధాయ్యయనెడుఋక్కుగా నగుచున్నది, (యజ్ఞాదులం దగ్నిని ప్రజ్వలింపఁజేయునపుడు పఠించు ఋక్కునకు ధాయ్య యని పేరు.) అగు, తావకీన ... మాత్రంబునన్ - తావకీన = నీ సంబంధమైన సౌందర్యసంపత్ = చక్కదనముయొక్క యతిశయముయొక్క, - అనఁగా అధికమగు నీ సొగసుయొక్క - సహస్రతమభాగ = వేయవ పాలియొక్క, కథనమాత్రంబునన్ = చెప్పుటచేతనే, అపాస్తధైర్యున్ = పోఁగొట్టఁబడిన ధైర్యము గలవానినిగా, చేసి, తెచ్చి, నీకున్, కింకరున్ = సేవకునిగా, కావించెదన్ = చేసెదను, నీకుఁ బ్రద్యుమ్నునియెడ వాంఛ గలదు, అతనికి నీయెడఁ గలదో లేదో తెలియదు, కాన నాకోర్కి విడిచి దేవరాక్షసాదులందు నీ వెవ్వని వలచినను, వానికడ కేఁగి, నీ సౌందర్యములో వేయవ పాలుమాత్రమే చెప్పి వానిని మదనవివశుని జేసి, వేలయై వచ్చి వాఁడు నీకు దాసుఁ డగు నట్లు చేయుదును - అనిభావము. నీవు, నీ రామణీయకమహిమ = నీ సొగసుయొక్క గొప్పఁదనమును, ఎఱుంగవు గాక=ఎఱుఁగవుగాని, ఇది = ఈ సొగసు, వినినన్ = వినినంతనే, మదన ... హృదయుండు - మదన = మన్మథునకు, వశంవద = లొంగిపోయిన, హృదయుండు = మనస్సుగలవాఁడుగా, కానివాఁడునున్ =

కానట్టివాఁడు గూడ, కలండె = ఉన్నాఁడా - నీ చక్కఁదనమునంగతి నీ వెఱుఁగవు గాని నీ సొగసు చూడ నక్కఱ లేదు, వినినమాత్రముననే కామవశుఁడు కాని వాఁ డని యుండఁడు, అనిభావము. అనుపమేయ...గర్వంబునన్ - అనుపమేయ = పోల్ప శక్యము గాని, సౌందర్య = సొగసుచేతను, లావణ్య = కాంతిచేతను (గల్గిన), గర్వంబునన్ = అహంకారముచేత, యదుకులపూరుండు = కృష్ణునికొడుకగు ప్రద్యుమ్నుఁడు, ఒక్కరుండు + అ = ఒక్కఁడే, కన్నుగానక = వివేకము లేక, ఉన్నవాఁడు, కావలయున్ = అయియుండవచ్చును, అతండు, అట్ల = గర్వించి వివేకము లేక యారీతినే, ఉండనిమ్ము = ఉండనీ, - నాయంత చక్కనివాఁడు లేఁ డనుగర్వముతో ప్రద్యుమ్నుఁ డారీతిగా నుండవచ్చును, వాని నట్లే యుండనిమ్ము, వానిజోలి నీ కెందులకు? అనిభావము. తత్సమానులు = ఆ ప్రద్యుమ్నునితో సరి యగువారు, (అని) అనరాదు = చెప్ప వీలు లేదు, కాని, నానాభువనసంచారిణిని = అన్నిలోకములందు (ఉదకములందు - అని యర్థాంతరము) సంచరించుదానను, ఐననాకున్, అక్కడక్కడన్, మిక్కిలిన్ = అత్యంతమును, చక్కని...కొమరులు - చక్కని = అందమైన, కొమరుప్రాయంపు = యౌవనవయసు గల, కొమరులు = పడుచువాండ్రు, ఎందఱు + ఎందఱు + ఐనన్ = ఎంతమందియో, కనంబడుదురు = చూపట్టుచుందురు, వారిన్, అందఱన్, లిఖించి = చిత్తరువున వ్రాసి, తేవలసినన్ = (నీవు చూచుటకై) తేవలసిన యెడల, తెచ్చెదను, ఇచ్చకున్ = నీ మనస్సునకు, నచ్చినవానిన్ = నచ్చినవానిని, వరియింపుము= కోరుము, ఆ ప్రద్యుమ్ను నంత సుందరు లనరాదు కాని యెల్లలోకములందు సంచరించు నే నందందు చక్కని పడుచువాండ్ర నెందఱనో చూచుచుందును, వారి నందఱను చిత్రించి తెమ్మనినచోఁ దెత్తును, వారిలో నీకు నచ్చినవానిని వరింపుము - అని భావము. అనినన్ = శుచిముఖి యిట్లు పలుకఁగా, అమ్మాటలు = ఆ పలుకులను, పెడచెవిం బెట్టి = వినక, (లక్ష్యపెట్టక అని భావము,) ఒక్కింతతడవు = కొంచెముసేపు, చింతించి = ఆలోచించి, కటకటంబడుచున్ = ఖేదపడుచు, ఇట్లు, అనియెన్=పలికెను.

వి. :—నాయికానాయకులకు సజాతీయులు (సమానులు) గాని విజాతీయులుగాని (అంతకంటె ఎక్కువతక్కువవారు) గాని అగు స్త్రీపురుషులను విన్నను చూచినను హృదయము చలింపక తాము వలచినవారియందే స్థిరముగా నెలకొల్పుట యుత్తమత్వ లక్షణము. కావున సామాన్యముగా కావ్యములందు నాయికానాయకులకట్టి సన్నివేశములు కూర్పఁబడుచుండును. ప్రకృతము ప్రభావతికి ప్రద్యుమ్నునియందు నరుచి కలుగుటకై హంసి యాతఁడు రతిదేవిభర్త యనెను. ఇతర కాంతావశునియెడ ఈర్ష్య జనించుట స్త్రీ లక్షణము కాన. అదియునుగాక యాతఁడు తనయెడ విముఖుఁడనినట్లు సూచించెను. గౌరీదేవియు భక్తుల చిత్తానుసారము చేయునది కావున నామెవలన భయము లేదనెను. త్రిలోకములందుఁ గల యే యువకుని దెమ్మనినఁ దెత్తు ననెను. ఇప్పుడు ప్రభావతి మనసు మాఱునేమో చూడవలయునని హంసి యాశయము. ఇతరు లెవ్వరును ప్రద్యుమ్నుని సాటిగారనియు, గర్వి యని దూఱుచునే యాగర్వము నిరుపమసౌందర్యము వలనఁ గల్గెనని ప్రద్యుమ్నుని శ్రేష్ఠతనే వ్యక్తముచేయుచు వచ్చినది. ఇట్లు విరసముగాఁ బ్రభావతి హృదయము పరీక్షకే శుచిముఖి పలుకఁగా ఉత్తమనాయిక గావున నట్టిమాటలను పెడచెవులనే పెట్టినదికాని యాదరింపలేదు. నైషధమున దేవదూతికల దూత్యము, నలదూత్యము దమయంతీహృదయపరీక్షకైనట్లే యిచటను జరిగినది.

మ. చిరకాలంబుననుండి యేను మదిఁ గాంక్షింపం బ్రియోదంత మి
ట్లరుదారన్ వివరించి ప్రాణసఖివై హంసీ! తుదిన్ యుక్తమే
విరసం బైన వచఃప్రపంచనముచే వేపంగ నిందాఁక నిన్
సరసత్వంబునఁ బ్రౌఢవంచు మదిలోఁ జాలంగ నే నమ్మితిన్. 97

అర్థము:—హంసీ=ఓయాఁడుహంసా!, చిరకాలంబుననుండి=చాలకాలమునుండి, ప్రియోదంతము= భర్తయొక్క వృత్తాంతము, ఏను, మదిన్ = మనసునందు, కాంక్షింపన్ = కోరుకొనగా, ప్రాణసఖివై =

ప్రాణసమాన యగు చెలివై, ఇట్లు, అరుదారన్ = మిగుల నద్భుతముగా, వివరించి, తుదిన్=అంతమందు, విరసంబు=రుచిలేనిది, వెగటు, ఐన వచఃప్రపంచనముచ్=అయినట్టి మాటలయొక్క పెంపుచేత, వేఁపంగన్= బాధింపఁగా, యుక్తమే=తగునా ? ఇందాఁకన్=ఇంతవఱకు, నిన్=నిన్ను, సరసత్వంబునన్ = రసజ్ఞత్వ మందు, ప్రౌఢవు = నిపుణురాలవు, అంచున్, నేన్ = నేను, మదిలోన్ = మనస్సునందు, జాలంగన్= మిగుల, నమ్మితిన్ = విశ్వసించితిని.

వి. చిరకాలంబునఁబట్టి - అనుపాఠము ప్రమాదమై యుండును. పట్టివర్ణకము పరం బగునపుడు సమాగమము వచ్చునే కాని సప్తమీ విభక్తి 'స' ప్రత్యయముపై పట్టివచ్చుట మృగ్యము. "పరుషే సరశే చైవ సమాసే ను సుతో భవేత్! అద్రుతాత్సరసా దందు పట్టి కార్చి విభక్తిషు" అని అథర్వణకారిక. ఉండి పదము పరమగునపుడు పూర్వ మందుండు పంచమికి ద్వితీయాస ప్తములు రావచ్చునను ననుశాసనమున చిరకాలంబుననుండి యనుపాఠము సాధువని యా పాఠము గ్రహింపఁబడినది. (సం.ప్రౌఢః-వికృతి-ప్రోడ)

తే. వజ్రనాభుండు మును స్వయంవరపువిధికి, నను నియోగించి దేవగంధర్వసిద్ధ
యక్షవిద్యాధరాదుల నసురవరుల, విశదముగ వ్రాసి చూపించె వేఱువేఱ. 98

అర్థము:—వజ్రనాభుండు = నాతండ్రి, మును, ననున్, స్వయంవరపు విధికిన్ = నాయంత నేను పతిని వరించు విధానమునకై, నియోగించి=ఆజ్ఞాపించి, వేఱువేఱ + అ=విడివిడిగా, దేవ, గంధర్వ, సిద్ధ, యక్ష, విద్యాధర, ఆదులన్ = మున్నగు దేవకోటిని, అసురవరులన్=రాక్షసశ్రేష్ఠులను, విశదముగన్= స్వచ్ఛముగా, అనుమానము లేకుండ, వ్రాసిచూపించెన్ = (చిత్రకారులను) చిత్రించి చూపునట్లుచేసెను.

వి. వ్రాసి=(తాను) చిత్రించి, చూపించెన్ = అనునది పొసఁగదు-కాన వ్రాసిచూపు = చిత్రించి చూపు, అని శబ్దపల్లవముగా గ్రహించి, ప్రేరణేంచుకొ్కరాఁగా, వ్రాసి చూపించు = చిత్రించి చూపఁజేసెను - అనునర్థమున వ్యాఖ్యానింపఁబడెను.

క. వారలలో నెవ్వానిం, గోరెడు నందాఁక లేదు గొలుపద యుల్లం
బారసి చూడఁగ నైనను, బ్రారబ్ధం బెట్టులున్నయదియొ యెఱుంగన్. 99

అర్థము :—ప్రారబ్ధము = ఈ జన్మమునకుఁ గారణమగు పూర్వజన్మమందలి కర్మవిశేషము, ఎట్లు, ఉన్నదియొ = ఉన్నదో, ఎఱుంగన్ = తెలియను, (కాని) వారలలోన్ = దేవతాగణములందును, రాక్షసు లందును, ఎవ్వానిన్ = ఏ యొకనిని, కోరెడునందాఁకన్ = వరించుదాఁక, లేదు = లేనేలేదు, ఆరసి = పరిశీలించి, చూడఁగనైనను=(వారిచిత్తరువులను) చూచుటకైనను, ఉల్లంబు = మనస్సు, కొలుపదు + అ = అంగీకరింపనే లేదు.

తాత్పర్యము :—నా ప్రారబ్ధ మెట్లున్నదో కాని ఆదేవాసురులం దేయొకరి వరించుదాఁక లేదు సరిగదా, ఆ చిత్రపటములను పరిశీలించి చూచుటకైనను మన సొప్పదాయెను.

చ. జనకుఁడు నప్పు డీసకలసద్గుణపూర్ణుని వ్రాసి చూప నా
కనుపఁడు వ్రాయునంతటిసమర్థులు లేమినొ తా నెఱుంగఁడో
మనుజుఁ డటంచుఁ గైకొనఁడొ మత్కులవైరి తనూజుఁ డంచు మా
నెనొ యెఱుఁగన్ సురారికులనిర్మథనుం డని విందుఁ గేశవున్. 100

అర్థము :— జనకుఁడును = తండ్రిగూడ, అప్పుడు = ఆస్వయంవరసమయమునందు, ఈ సకల సద్గుణపూర్ణుని = (నీవుచెప్పిన) ఎల్లమంచిగుణములతో నిండినయీతనిని, నాకున్, వ్రాసిచూపన్ =

చిత్రించిచూపుటకు, అనుఁపడు = చిత్రకారుల నాజ్ఞాపింపలేదు. (ఈతని రూపమును) వ్రాయునంతటి సమర్థులు = చిత్రించునంతటి శక్తి గలవారు, లేమినో = లేకపోవుటచేతనో, తాను, ఎఱుంగఁడో, మనుజుఁడు = నరమాత్రుఁడు, అటంచున్ = అని, కైకొనఁడో = లెక్కసేయఁడో, మత్కులవైరి తనూజుఁడు = నా రాక్షసవంశమునకుఁ బగవానికొడుకు (వీడు) అంచున్, మానెనో, ఎఱుంగన్ =ఎఱుఁగను, కేశవున్ = శ్రీకృష్ణుని, సురారికులనిర్మథనుండు = రాక్షసవంశములకు నాశకుఁడు, అని, వింటున్ = వినుచుందును.

తాత్పర్యము :—ఆ స్వయంవరవేళ నాతండ్రికూడ నీవు చెప్పిన యెల్లసుగుణములతో నిండిన యీ ప్రద్యుమ్నుని నాకుచిత్రించి చూపుట కాజ్ఞాపింపలేదు. ఈతనిని జిత్రింప సమర్థులు లేకయో, తా నీతని నెఱుఁగఁడో, ఎఱిఁగియు మనుజమాత్రుఁ డని లెక్కసేయకయో, నా రాక్షసజాతిపగవానికొడు కీతఁ డని మానెనో, కారణ మేమియో మాత్రము నే నెఱుఁగను. రాక్షసజాతికి నాశకుఁడు కృష్ణుఁ డనిమాత్రము వినుచుందును.

అలం. :—సందేహము, కావ్యలింగము.

చ. అది తలపోసి కుందఁ దగు ♦ నా యదునందనునందు నున్న నా
మది తెఱఁగున్ జగజ్జనని ♦ మాటలుఁ జెప్పఁగ వించు శంకచే
సెదు పురుషాంతరానుమతి ♦ చేకుఱునో యని నీకు నింక నా
హృదయములోఁతు గానఁబడ ♦ దే నెఱిఁగింతుఁ బ్రతిజ్ఞ యొం డిఁకన్. 101

అర్థము :—అది = కృష్ణుఁడు రాక్షసాంతకుఁడనునది, తలపోసి, కుందఁదగునా = దుఃఖింప వచ్చునా ? యదునందనునందున్ = యదువంశజుఁ డగుకృష్ణునికొడు కగుప్రద్యుమ్నునందు, ఉన్న = నెలకొనిన, స్థిరపడిన, నామది తెఱఁగున్ = నామనఃస్థితియును, జగజ్జనని = లోకములకు తల్లియగు గౌరి యొక్క, మాటలున్, చెప్పఁగన్, వించున్ = వినుచు, పురుషాంతర = (ప్రద్యుమ్నునిగాక) మఱొక పురుషుని, అనుమతి = (వరింప) అంగీకారము, (నాకు) చేకుఱునో=సంభవించునేమో, అని, శంకచేసెదు= సందేహింతువు, ఇంకన్ = ఇంతగా నేను చెప్పినను, నా హృదయము లోఁతు = నామనస్సులోని గుట్టు, కానఁబడదేని = తెలియదేని, ఇంకన్ = ఇప్పుడు, ఒండు ప్రతిజ్ఞ=ఒక శపథము, ఎఱిఁగింతున్= తెలియఁ జెప్పెదను.

తాత్పర్యము:—దేవాసురులు నాకు నచ్చక వరింపలేదు. కృష్ణుని కొడుకును వరించుటకు కృష్ణుఁడు రాక్షసాంతకు డని తలఁచి నాతండ్రి చేసినదానికై నేను విచారింపను. ప్రద్యుమ్ను నందు నా మనస్సు లగ్నమగుటను, గౌరి యాతఁడే నీపతియగు నని చెప్పుటను నీవు వినియు, మఱొక పురుషుని వరింప నంగీకరింతు నేమో యని సందేహించుచున్నావు. నా మనస్సులోని గుట్టు నీకుఁ దెలియని యెడల నొక ప్రతిజ్ఞ చేయుచున్నాను.

వ్యా. వి. :—జగత్+జనని=జగజ్జనని - శ్చుత్వసంధి. పురుష+అంతర+అనుమతి. సవర్ణదీర్ఘసంధి.

క. విను ప్రద్యుమ్నునిఁ దక్కన్, మనమున నే నొరు వరించు ♦ మాట విడువు మా
ఘనుఁ డొల్లకున్నఁ జెందుదు, మనసిజశిఖిఁ దనువు వేల్చి ♦ మఱుసటి మేనన్. 102

అర్థము:—విను = వినుము, ప్రద్యుమ్నునిఁ దక్కన్, మనమునన్ = మనసునందు, ఒరున్ = ఇతరుని, వరించుమాట = నేను వరింతునను మాటను, విడువుము = మానుము, ఆఘనుఁడు = గొప్పవాఁ డగు నతఁడు, ఒల్లక + ఉన్నన్ = ప్రేమింపకున్నచో, తనువున్ = ఈ శరీరమును, మనసిజశిఖిన్ =

మన్మథాగ్ని యందు, వేల్చి = హోమముచేసి, దహించి, మఱుసటి మేనఁ = తరువాతఁగల్గుశరీరముతో (అతనినే) చెందుదుఁ=పొందుదును. తరువాతి జన్మమున ఆప్రద్యుమ్ననే పొందెదనని భావము.

ఉ. ఈతుది పక్షమే మదికి నిప్పుడు నిశ్చిత, మెట్లటన్న ము
న్నాతఁడు వించు నా కథల కట్టిటు పల్కమి గాక తద్గళ
ద్యోతిత కంకణాంక యగు తొయ్యలి నొక్కతెఁ గల్గఁ జెప్పి తీ
వే తప మాచరించెనొకొ యిందుల కారతి ప్రాగ్భవంబునన్. 103

అర్థము:—ఈ తుదిపక్షమే = ఈ చివర పక్షమే - ఈ శరీరము మన్మథాగ్ని కాహుతిచేసి యింకొక శరీరముతో నాతనిని బొందెద ననుపక్షమే, ఇప్పుడు, మదికిఁ = మనస్సునకు, నిశ్చితంబు = నిశ్చయింపఁబడినది. (అనఁగా మనస్సున నిశ్చయించుకొంటిని అని భావము) ఎట్లు? ఏహేతువువలన, అటన్నన్ =అన్నచో, మున్ను=ఇంతకుముందు, ఆతఁడు, వించున్=వినుచును, నాకథలకున్ = నావృత్తాంతములకు, అట్టిటు పల్కమి = ఆటు, ఇటు పల్కకుండుట - ఔను కాదు అనకుండుట, కాక, తద్గళద్యోతిత కంకణాంక - తత్ = అతనియొక్క, గళ = కంఠముచేత, ద్యోతిత = తెల్పఁబడిన, (అని కాని తత్ = ఆతనియొక్క, గళ = కంఠమునందు, ద్యోతిత = ప్రకాశింపఁజేయఁబడిన అని కాని చెప్పనగును) కంకణ= చేతికడియములయొక్క, అంక = ముద్రలు గలది, అగుతొయ్యలిన్ = అగుస్త్రీని, ఒక్కతెన్, ఈవు=నీవు, కల్గన్+చెప్పితి = ఉన్నదానినిగాఁ జెప్పితివి, ఇందులకున్ = ఆ ప్రద్యుమ్నుని కంఠము నిట్లు కౌఁగిలించు కొనుటకు, ఆరతి = ఆరతిదేవి, ప్రాగ్భవంబునన్ = వెనుకటి జన్మమందు, ఏ తపము = ఎట్టి తపస్సు, ఆచరించెనొకొ = చేసినదోకదా!

తాత్పర్యము:—మఱుసటిజన్మమున నతని జెందుదు నను చివరపక్షమే నిశ్చయించుకొన్నాను. ఏల యన నా వృత్తాంత మాతఁడు వినుచు ఔను గాదన కుండుటమాత్రమే కాదు. ఆతని గళమందు తన కంకణ చిహ్నములను ముద్రించినయొకతె కల దని చెప్పితివి. ఆమె యుండ న న్నేల వలచును? పూర్వజన్మమున నా రతిదేవి యే తపస్సుచేసి యట్టి సౌభాగ్యము పొందెనోకదా? అనఁగా నేనట్టి తపస్సుచేసి యుండలేదు. కావున నాకాతఁ డలభ్యుఁడు. అనివ్యంగ్యము. ఈ జన్మమున నీదేహము మదనాగ్నిలో హోమముచేసితినా ముందు జన్మమున నీతపఃఫలముగా నతఁడు నాకుఁ బతి యగును. అని భావము.

వ. అని తదీయం బయిన సతీవాల్లభ్యంబునకు ముచ్చటపడుచు నొక్కింత తలపోసి. 104

అర్థము:— తదీయము = వాని సంబంధమైనది, సతీవాల్లభ్యంబునకున్ = భార్యయందలి ప్రేమకు, ముచ్చటపడుచుఁ = వేడుకపడుచు.

సీ. ఆరతికిఁ గరంబులై తిరే నవ్విభుఁ, గౌఁగిలింపఁగ నబ్బఁగ గరములార!
యాయింతికిఁ గుచంబులై తిరే నతనివ,క్షోనిపీడన మబ్బఁ గుచములార!
యాలతాంగికిఁ జెక్కులై తిరే నారమ్య,శీలు చుంబన మబ్బఁ జెక్కులార!
యానెలంతకు వీనులై తిరే నాకళా,విదుమంతనము లబ్బ వీనులార!
యట్లుగా నోచ కేల నాకైతి రకట, యని నిజావయవంబుల కాత్మ వగచు
బాల్యమునఁ దన్ను రమణసౌభాగ్యకలిత,యనిన సాముద్రికులమాటలరసి తిట్టు.

అర్థము:—కరములార = (నా) చేతులారా! ఆరతికిన్ = ఆ రతిదేవికి, కరంబులు = చేతులు, ఐతిరేని = అయి యుందురేని, ఆ విభున్ = ప్రభువగు నాప్రద్యుమ్నుని, కౌఁగిలింపఁగన్ = కౌఁగిలించు

కొనుట, అబ్బున్ = కలిగియుండును. (అబ్బున్ అను తద్ధర్మార్థకమున కిట సంభావన యర్థము) కుచము లార, ఆ యింతికిన్, కుచంబులు, ఐతిరేని, అతని వక్షోనిక్షిప్తనము = ఆతని ఱొమ్మునొక్క రాయిడి, అబ్బున్, చెక్కులార = చెక్కిళులార, అలతాంగికిన్ = తీఁగవంటి శరీరముగల యామెకు, చెక్కులు, ఐతిరేని, అరమ్యశీలు = మనోహరమగు స్వభావముగల యాతనియొక్క, చుంబనము = ముద్దు, అబ్బున్, వీనులార = చెవులారా, ఆ వెలంతకున్, వీనులు, ఐతిరేని, ఆ కళావిదు = ఆపండితుఁడగు ప్రద్యుమ్నుని యొక్క, మంతనములు = రహస్యపుమాటలు, అబ్బున్, అట్లుగాక = ఆవిధముగాఁగాక, నాకున్ = నాకు సంబంధించినవిగా, అకట, ఏల, ఐతిరి, అని, నిజావయవంబులకున్ = తన యవయవములకొఱకై ఆత్మన్, వగచున్ = ఖేదపడును, బాల్యమునన్ = పసితనమందు, తన్నున్, రమణసౌభాగ్యకలిత...(ఈ స్త్రీ) రమణ=భర్తయొక్క, సౌభాగ్య = ప్రేమతో, కలిత=కూడినది, (అగును అధ్యాహారము) అనిన సాముద్రికుల మాటలు = సాముద్రికమును (హస్తరేఖలను నవయవవిన్యాసమును ననుసరించి శుభాశుభఫలములను జెప్పుశాస్త్రమును) జెప్పుపండితులయొక్క, మాటలు, అరసి = ఎంచి, (అవి ఫలింపలేదని) తిట్టున్ = నిందించును.

తాత్పర్యము:—తన హస్తాద్యవయవములు రతికి అవయవములై పొడమినయెడలఁ బ్రద్యుమ్నునివలన నాయాయవయవములకు వలయుసుఖము లబ్బు ననియు, అట్లుగాక యయ్యో నాకేల యైతి రని ఖేదపడును. సాముద్రికులు తనబాల్యమున 'భర్తయొక్క ప్రేమను పొందఁగల' వని చెప్పినమాట ఫలింప లే దని వారి పల్కులను నిందించును.

వి. :—ఇందు తాననుకొనిన సుఖము తన యవయవములకు లేకుండ, రతిదేవి యొక్కయవయవము లన్నియు ననుభవించుచున్న వే యని యీర్ష్యతోఁ గూడిన విషాదము ధ్వనితము. మఱియు సాముద్రికులు చెప్పిన పతివాల్లభ్యము 'ప్రద్యుమ్నుఁడు తన వృత్తాంతము విని మిన్నకుండుటయే కాక, రతిదేవి కనుకూల నాయకుఁ డగుటచేత వ్యర్థమైనది యని కోపమున నా సాముద్రికమును దిట్టుట ముగ్ధాత్వమునకు సూచకము నగుచున్నది.

వ. ఇవ్విధంబునం బెద్దయుం బ్రొద్దు విరహవేదనాదోదూయమాన మానస యగుచు నుండి యంతట శుచిముఖం జూచి యి ట్లనియె. 106

అర్థము:—ఇవ్విధంబునన్=ఈరీతిగా, పెద్దయుంబ్రొద్దు=చాలసేపు, విరహ...మానస - విరహ= ఎడబాటువలని, వేదనా = బాధచేత, దోదూయమాన = మిగుల పరితపించుచున్న, మానస = మనస్సు గలది.

సీ. ఓ హంసి నిన్ను నే నొక్కటి తుదిమాట, యడిగెద నీహృదయంబునందుఁ
గలయట్లు చెప్పుమీ కల్ల లాడిన నీకు, నాతోడు సుమ్ము ప్రాణసఖి వీవు
తడయక ప్రద్యుమ్నుకడ కింక నొకమాఱు, పోయి దుస్తర మైన నాయవస్థ
చెప్పి చేరికఁ గొంత చేయవచ్చునొ రాదొ, యాదురాశాపాశమెందుఁ దెగని

బంధమై ప్రాణముల వెలువడఁగనీక, యాఁగి పెంచెడు మదనాగ్నినహరహంబు
నీవు చని యవ్వగాములు నిశ్చయించి, యాశఁ దెగఁగోయు మదియ మత్ప్రాణరక్ష.

అర్థము:—ఓహంసి, నేను, నినున్, తుదిమాట = చివరమాట, అడిగెదన్ = కోరుదును, నీ హృదయంబునందున్ = నీమనస్సులో, కలయట్లు = ఉన్న విధముగా, చెప్పుమీ, కల్లలు = అసత్యములు, ఆడినన్ = చెప్పినచో, నీకున్, నాతోడుసుమ్ము = నామీఁదఒట్టు సుమా, ఈవు = నీవు, ప్రాణసఖివి =

ప్రాణము వంటి చెలికత్తెవు. కాన, ప్రద్యుమ్నుకడకున్, ఇంకన్ = మరల, ఒకమాఱు, పోయి, దుస్తరము = దాఁటఁ దరముగాని, నాయవస్థ = నా దుస్థితి, చెప్పి, చేరికన్ = మైత్రిని, చేయవచ్చునో, రాదో = చేయరాదో, ఈ దురాశాపాశము = ఈచెడుకోరిక యనెడు త్రాడు, ఎందున్ = ఏవిధముచేతను, తెగని బంధము, ఐ, ప్రాణములు, వెలువడఁగనీక = పోనీయక, ఆఁగి = ఆఁపి, అహరహంబు = దినదినము, మదనాగ్నిన్ = మన్మథసంబంధ మగు నగ్నిని, పెంచెడున్ = వృద్ధి చేయుచున్నది, (కాన) నీవు, అవుగాములు = కార్యము అగుటయో కాకపోవుటయో, నిశ్చయించి, ఆశన్, తెగఁగోయుము, అదియ = అట్లాశాచ్ఛేదము చేయుటయే, మత్ప్రాణరక్ష = నాయొక్క ప్రాణములను రక్షించుట.

వ్యా. వి:—చేయవచ్చునో రాదో - సూ. శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవక్రియలును సమాప్తంబులై పునర్గృహీతంబులగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాషనగు. ప్రౌఢ. క్రియా. 25. ఆఁగు - అంతర్భావితప్రేరణక్రియ-ఆఁపు అని యర్థము. అవుట + కామి =అవుగాములు-సూ. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపంబు విభాష నగు. ప్రౌఢ. సమాస. 31.

వ. అనుటయు నాతరుణికిం గల హరితనయవరణానురాగం బెవ్వారికి నవారణీయం బనియును, నింక నియ్యాస చెడకుండ నిర్వహింపక తడసినం గడు నెడరు వాటిల్లఁ గార్యంబు దప్పు ననియు నిశ్చయించి యంచ యి ట్లనియె. 108

అర్థము:—ఆ తరుణికిన్ = యువతి యగునాప్రభావతికి, హరి...రాగంబు - హరితనయ= కృష్ణుని కొడుకగుప్రద్యుమ్నునియొక్క, వరణ = వరించుటయందలి, అనురాగంబు = ప్రీతి, అవారణీయంబు = వారింప రానిది, కడున్ = మిగుల, ఎడరు = కీడు, పాటిల్లన్ = కలుగఁగా - కలిగినయెడ, కార్యంబు = చేయఁ దగినపని, తప్పున్ = చెడును.

చ. మదితమిఁ జూడఁ గొన్ని వెడమాటలు పల్కితి, నీవు నమ్ము మే
నిదె భవదీశుఁ దెత్తు నపుడేమి పరాకున మాఱు పల్కఁడో
సుదతి యెఱుంగఁ గాని, యిఁకఁ జూడుము తావక రూపవైభవా
భ్యుదయము విన్కలిన్ బ్రియము పూని యతండు విరాళిఁ గుందెడున్.

అర్థము:—సుదతి = చక్కని పలువరుస గలదానా ? ప్రభావతీ, మదితమిన్ = (నీ) మనసుయొక్క తహ తహను, చూడన్ = పరీక్షించుటకు, కొన్నివెడమాటలు = కొన్ని వ్యర్థములగు పల్కులను, పల్కితిన్ = అంటిని, నీవు, నమ్ముము, ఇదె = ఇదిగో, ఏను = నేను, భవదీశున్ = నీభర్తను, తెత్తున్ = తీసికొని వత్తును, అపుడు = నీ వృత్తాంతమును నేను చెప్పునపుడు, ఏమిపరాకునన్, మాఱు = ప్రత్యుత్తరమును, పల్కఁడో, ఎఱుంగన్ + కాని = ఎఱుఁగను గాని, ఇఁకన్ + చూడుము = ఈ పైయంశము తెలిసికొనుము, (ఇఁకఁజూడుము అనునది జాతీయము) తావక ... విన్కలిన్ - తావక = నీదైన, రూపవైభవ = సౌందర్యసంపదయొక్క, అభ్యుదయము = వృద్ధియొక్క, విన్కలిన్ =వినుటచేత, అతండు = ఆప్రద్యుమ్నుఁడు, ప్రియము = ప్రీతిని, పూని = వహించి, విరాళిన్ = వలపుచేత, కుందెడున్ = బాధ పడుచునే యుండును. (ఇచట సంభావనార్థమునఁ దద్ధర్మక్రియ.)

తాత్పర్యము:—ఓ యింతీ! నీమనసునఁ గల యుత్కంఠను తెలియఁగోరి యేవో కొన్ని వ్యర్థమైన మాటలాడితిని. నీవు నమ్ముము. ఇదిగో నీ భర్తను తెచ్చెదను. నీ మాట చెప్పునపు డతఁడేమి పరాకుననుండి మాఱు చెప్పలేదో కాని యీపయిని జూడుము. నీచక్కఁదనము వినుటచేత ప్రేమవహించి, వలపుచేత బాధపడక మానఁడు.

వ. దీనికి నిమిత్తంబును దైవనియమంబును గల దది విను మెఱింగించెద. 110

అర్థము:—దీనికిన్ = అతఁడు నీచక్కఁదనము విని వలపొంది బాధపడుటకు, నిమిత్తంబును = కారణమును, దైవనియమంబును = భగవంతుని యేర్పాటును, కలదు.

గీ. బ్రహ్మకును సరస్వతికిని బ్రణయకలహ, మయ్యె మునుపొక్కనాఁ డప్పు డబ్జభవుఁడు
తద్విరహపీడ సైరింపఁ దరము గాక, వాణిఁ దేర్పఁ దదాప్తు లెవ్వారొ యనుచు.

అర్థము:—మునుపు, ఒకనాడు, బ్రహ్మకును, సరస్వతికిని, ప్రణయకలహము = పొలయలుక, అయ్యెన్ = కలిగెను, అపుడు, అబ్జభవుఁడు = తమ్మిచూలి, బ్రహ్మ, తద్విరహపీడన్ = ఆ సరస్వతి యొక్క యెడఁబాటువలని బాధను, సైరింపన్ = ఓర్చుటకు, తరముగాక = శక్యముకాక, వాణిన్, తేర్పన్ = ఊరార్చుటకు, తదాప్తులు = ఆమె కిష్టులు, ఎవ్వారొ, అనుచున్.

వి. :—ప్రణయకలహము = క్రీడాసమయమున దంపతులనడుమఁ బుట్టెడుప్రేమతోఁ గూడిన కోపవిశేషము.

క. ఆరసి ననుఁ బిలిపించెను, శారద కడ నప్పు డేను సరసక్రీడా
చారసచివత్వమున సం,చారము గావించుచునికిఁ జంద్రనిభాస్యా. 112

అర్థము:—చంద్రనిభాస్యా = చంద్రునివంటి మోము గలదానా, అప్పుడు = ఆకాలమందు, ఏను, శారదకడన్ = వాణియొద్ద, సరస...సచివత్వమునన్, సరస = సొగసైన, క్రీడా = ఆటలయొక్క, ఆచార = నడుపుట కొఱకగు, సచివత్వమునన్ = మంత్రిత్వమందు (ఆలోచనచెప్పుటయందు అని భావము) సంచారము = ప్రవర్తిల్లుట, కావించుచున్, ఉనికిన్ = ఉండుటచేత, ఆరసి = ఆలోచించి, ననున్, పిలిపించెను.

తా. అప్పుడు నేను వాణియొద్ద సరసమగు క్రీడలవిషయమైన మంత్రిత్వ మందుండుట విని, నన్ను బ్రహ్మ పిలిపించెను.

వ. అట్లు పిలిపించి నన్నుం దనపొలఁతిపొలయలుకం దీర్చుటకుఁ బనుపుచుండి యద్దేవి నుద్దేశించి. 113

అర్థము:—తనపొలఁతి = తనభార్యయొక్క, పొలయలుకన్ = ప్రణయకోపమును, తీర్చుటకున్ = పోఁగొట్టుటకు, పనుపుచుండి = పంపుచు, అద్దేవిని, ఉద్దేశించి = గుఱిచేసి.

సీ. నీసుప్రసాద సన్నిధి మహత్త్వము సుమీ, నిగమరాశి ముఖస్థ మగుట నాకు
నీవిలాస మహర్చిత కావిశేషము సుమీ, సంగీత సాహిత్య సౌరభంబు
నీకటాక్షశ్రీవిపాకభేదము సుమీ, వేణువీణాదుల రాణ లెల్ల
నీ వనుగ్రహలీలఁ గావించుటన సుమీ, యఖిలలోకవ్యవహారసిద్ధి

గీ. కావున నొకింత యోవాణి నీ వలిగిన, నొకవినోదంబు నొదవ దే నోర్చు టెట్లు
విరహ మేకాంత దాస్యకింకరునియందుఁ, గరుణ లేకింత తడ వలుకఁగంగఁదగునె.

అర్థము:—నిగమరాశి = వేదసముదాయము, నాకున్, ముఖస్థము = ముఖమం దున్నది, అగుట, నీసుప్రసాదసన్నిధి మహత్త్వము+అ+చుమీ=నీయొక్క గొప్పయనుగ్రహముతోడి చేరికయొక్క, మహిమయే సుమీ, సంగీతసాహిత్య సౌరభంబు = గానవిద్యయొక్కయు, శబ్దార్థజ్ఞానము యొక్కయు (లేక కవిత్వము యొక్కయు) పరిమళము = తావి-అనఁగా గుణాతిశయము, నీవిలాసచర్చికావిశేషము + అ + చుమి = నీయొక్క ప్రశస్తమైన శృంగారచేష్టలయొక్క గొప్పతనమేసుమా - వేణువీణాదులరాణలు = పిల్లనఁగ్రోవి వీణ మొదలగు వాద్యములయొక్క శక్తి విశేషములు, నీకటాక్ష శ్రీవిపాక భేదము + అ + చుమీ = నీక్రేఁగంటి చూపుల శోభయొక్క పంటవిశేషమే సుమా - అఖిలలోకవ్యవహారసిద్ధి = సమస్తమగు జనముయొక్క వ్యవహారములు నెఱవేఱుట, నీవు, అనుగ్రహలీలన్ = ప్రేమతో నేలికొనుట యను పనిని, కావించుటన్ + అ + చుమీ = చేయుటచేతనే సుమా - కావునన్, ఓవాణి ! నీవు, ఒకింత, అలిగినన్ = కోపించినచో, ఒకవినోదమును, ఒదవదు = (నాకు) కలుగదు, ఏను = నేను, విరహమున్ = ఎడఁబాటును, ఓర్చుట = సహించుట, ఎట్లు = ఏ విధముగా - నగును, ఏకాంతదాస్య కింకరుని యందున్ = రహస్య మగునుపచారములందు సేవకుఁడనైన నాయందు, కరుణ = దయ, లేక ఇంతతడవు = ఇంతసేపు, అలుగంగన్ = కోపింపఁగా, తగునె ?

తాత్పర్యము:—ఓ వాణీ ! నీవు మిగుల ననుగ్రహముతో నిత్యము విడువ కుండుటచేతనే వేద ప్రపంచమంతయు (నీవే వేద స్వరూపవు కావున) నాకు ముఖస్థమైనది. నీ శృంగార చేష్టా విలాసములలోని విశేషములే కదా సంగీతమును సాహిత్యమును. మఱియు వేణువు వీణ మొదలగు వాద్యములనుండి జనించు మాధుర్యము నీ కటాక్ష పరిపాక విశేషము గదా ! అనఁగా నీ కరుణ తోడి చూపు ప్రసరింపకున్న వేణు వీణాది వాద్యములందు మాధుర్యము (రక్తి) కలుగదు సుమీ. అంత యెందులకు? సకల జనులకు వ్యవహారసిద్ధి నీ వనుగ్రహించుట వలననే కలుగుచున్నది. కాన నీ వలిగిన నాకే వినోదంబును కలుగదు. (నా వినోద మనిన భూత సృష్టియే కదా ! అది జరుగదు. నేను విధాత, స్రష్ట యను పేళ్లతో నుండి యేమియు సృష్టి లేక యుండఁగలనా ?) నీ యెడఁబాటు నేను సహింపఁజాలను. రహస్యమైన సేవయందు - శృంగార క్రీడలందు విధేయుఁడనైన నాయందు దయమాలి యింతసేపు కోపించుట న్యాయమా ?

వి. :—సకలములగు లలితకళలును సరస్వతీదేవి శృంగార క్రీడలు. అవి తనకుఁ గావలె ననిన నామె యనుగ్రహింపఁ దగినవే యని భావము. వేదరాశి తన నాలుగు ముఖముల నుండి వెలువడుటకు వాణి నిత్యసన్నిధియే కారణ మఁట - ఆమె తనముఖమున గాయత్రీరూపయై నిత్యసన్నిహిత యగుటచే వేదములు బయలు వెడలెనని ధ్వని. 'గాయత్రీం వేదమాతరం' అని శ్రుతి. ఆ గాయత్రికిని వేదమునకు నభేదము పూర్వమీమాంసా శాస్త్రము చెప్పుచున్నది. అనఁగా బ్రహ్మ నోటి యం దుండువాణియనిన వేదవాణి యన్నమాట. ఈ విషయము కళాపూర్ణోదయమునను "నిగమంబుల పేరిటి నాల్గు రూపులం దనరెడు భార్యమాట జవదాఁటక సృష్టి యొనర్చు వారిజాసనుఁడు" అని సూచింపఁ బడెను. సూరన తనకావ్యసృష్టియందు సరస్వతి నెచ్చటఁ జెప్పినను వేదసరస్వతియే యని గ్రహింపఁ దగును. 'వేదశబ్దేభ్య ఏ వాదౌ నిర్మమే స మహేశ్వరః' అనుసూక్త్యనుసారము బ్రహ్మసృష్టి జరుగుచున్న దని శాస్త్రములు చెప్పుచున్నవి. భావుకుఁ డైనసూరన తనకావ్యములందు వేదస్వరూపము ధ్వనించునట్లు సరస్వతీ బ్రహ్మలను శృంగారమూర్తులఁ నొనర్చి తనయఘటనాఘటనాపటిమ మిందును, ఇంతకంటెఁ గళాపూర్ణోదయమునను ప్రదర్శించి కాంతాసంమితము కావ్యమను లక్షణమును లక్ష్యసమన్విత మొనర్చెను. ఆవేద సరస్వతీ విలాస విశేషములే యఁట సంగీతము సాహిత్యమును, అనఁగా గానము, కవిత్వమును వేదచ్ఛాయను జీవించుచున్నవని ధ్వని. సామవేదజన్యము సంగీత మనియు వేదధర్మప్రబోధకము సాహిత్యము ననియు ప్రసిద్ధము. వేణు వీణాదివాద్యములను శ్రమపడి నేర్చినను జీవనాడి యనఁదగిన 'రక్తి' యావాగ్దేవతా కటాక్షమునఁ గాని కలుగ దనియు, నది పూర్వపుణ్య పరిపాక జన్య మనియు ధ్వనితము. లోకులవ్యవహారము వాక్కువలననే జరుగుచున్నట్లు పైకిఁ దోఁచినను, లోకసంబంధ మగుధర్మాధర్మవ్యవహారనిర్ణయము వేదమువలననే జరుగుచున్నది అని 'వేదో ధర్మమూలమ్' అనుగౌతమధర్మసూత్రార్థ మిందుధ్వనితము. 'సాహిత్యము, సాహితి'

యన శబ్దార్థజ్ఞానము అనునర్థము స్థూలముగాఁ జెప్పఁబడినను, 'శ్లాఘంతే యది సాహిత్యం రసవతీ మజ్ఞా స్తతః కింసుఖమ్.' ఇత్యాదులందు కవితయను విశేషార్థమునసే హెచ్చుగా వాడఁబడినది.

క. అని యేఁ దనుఁ గడు దూఱితి, నని మత్ప్రియకడకు నేఁగి హంసి పలుకుమీ
యనుచు నపు డంతకంతకుఁ, దనరు మనోజార్తిఁ గరము తప్తుం డగుచున్. 115

అర్థము:—హంసి = ఓ యాఁడుహంసా, అని, ఏన్ = నేను, తనున్ = ఆమెను, కడున్ = మిక్కిలి, దూఱితిని = నిందించితిని, అని, మత్ప్రియ కడకున్ = నా ప్రేయసియొద్దకు, ఏఁగి = వెళ్లి, పలుకుమీ, అనుచున్, అపుడు, అంతకంతకున్, తనరు = వృద్ధియగుచున్న, మనోజార్తిన్ = మన్మథునివలని బాధచేత, కరము = అత్యంతము, తప్తుండు = వేఁగిన వాఁడు, అనఁగా బాధింపఁబడినవాఁడు, అగుచున్, పైపద్యముతో నన్వయము.

తాత్పర్యము:—అని నేను తన్ను నిందించితి నని ఓహంసీ నీవు వెళ్లి చెప్పు మని పలుకుచు మదన వికృతి హెచ్చి పీడ భరింపఁజాలక మన్మథు నుద్దేశించి యి ట్లనెను.

వి. :—వెనుకటిపద్యమున సరస్వతిని బెక్కువిధములఁ బొగడి, నీకు నే నేకాంతదాస్యకింకరుఁడనని తనవిధేయత సూచించి, ఇట్లు 'నిందించితిని' అని నిందింపనిదే యనుట ఆదంపతులప్రణయకలహమును నిందలు నెంత సుకుమారతమములో వ్యక్త మగుచున్నవి.

తే. ఏలరా మన్మథుఁడ నన్ను నింత యేచు, టేమి మేలు రానున్నవి యిట్టిపాట్లు
నీకు నిఁకఁ బ్రభావతి యను నెలతపై వి,రాళి కారణముగ వేగిరంబు వలదు. 116

అర్థము:—మన్మథుఁడ! నన్నున్, ఇంత, ఏచుట = బాధించుట, ఏలరా = ఎందుచేతనురా, ఏమిమేలు = (ఇది) ఏమి మంచిపని, ఇఁకన్ = ఈపైని, ప్రభావతి, అను నెలఁతపైన్ = అనుస్త్రీపైని (గలుగు) విరాళి = వలపు, కారణముగన్ = హేతువుగా, నీకును, ఇట్టిపాట్లు = ఇటువంటి బాధలు, రానున్నవి, వేగిరంబు = తొందరపాటు, వలదు.

తాత్పర్యము:—ఓరీ మన్మథుఁడా! నన్నేల యింతగా బాధించెదవు? ఇది యేమి మంచిపని? ఈ పైని ప్రభావతి యనునింతిపై వలపుగొని నీవు నిట్టిపాట్లు పొందఁగలవు. తొందరపడకుము.

క. నా విని యేను రతిప్రియు, భావము న ట్లపహరించు పాటిది యైనన్
నీ వనిన వనిత యెక్కుడె, లావణ్యాదులను రతివిలాసిని కనుడున్. 117

అర్థము:—నాన్ = అనఁగా, విని, ఏను = నేను, నీవు, అనినవనిత = చెప్పినయాప్రభావతి, రతి... భావమును, రతిప్రియు = (రతిదేవి ప్రియురాలుగాఁ గల) మన్మథునియొక్క, భావమును = మనస్సును, అపహరించుపాటిది = అపహరించు శక్తి గలది, ఐనన్ = అగునెడ, లావణ్యాదులను = మేనికాంతి మున్నగువానిచేత, రతివిలాసినికిన్ = శృంగారచేష్టలుగల దగు రతిదేవికంటెను, ఎక్కుడె = ఎక్కువదా, అనుడున్ = అనిప్రశ్నింపఁగా (పైపద్యముతో నన్వయము.)

తాత్పర్యము:—బ్రహ్మ య ట్లనఁగా విని, 'నీవు చెప్పిన యా ప్రభావతి, రతి ప్రియురాలుగాఁగల మన్మథుని మనస్సును చూఱగొను శక్తిగలది యగునెడల, ఆమె, మేని తళుకులు మున్నగు వానిచేత విలాసవతి యగు రతికంటెను గొప్పదా? యని నేను ప్రశ్నింపఁగా,

అలం:—‘రతిప్రియుఁడు’ అనునది సాభిప్రాయ విశేష్యము కావున పరికరాంకురము. విలాసవతి, విలాస యగురతి అను వానిలో విలాసవతి యనునది సాభిప్రాయ విశేషణము కావున పరికరము.

వి. :—స్త్రీలకు ప్రియుని జూచుటచేఁ గలుగునదియు, హర్షము మొదలగువానిని దెలుపునదియు నగు ముఖనేత్రాదివికారము విలాసము. అట్టివిలాసములు గలది విలాసవతి).

క. రతిరూప మెక్కడ? ప్రభా,వతిరూ పెక్కడ? విమర్శవంతులు దెలియన్
రతిసొబగుకంటెను బ్రభా, వతిపస ముమ్మడి నలుమడివాసి మరాళీ! 118

అర్థము:—విమర్శవంతులు = బాగుగా పరిశీలించువారు, తెలియన్ = (తారతమ్యము) తెలిసికొనుటకు, రతిరూపము, ఎక్కడ, ప్రభావతిరూపు, ఎక్కడ, (రెండిటికిని బోలిక లేదని భావము. కాని ఇందు రతిరూపము గొప్పదో, ప్రభావతిరూపము గొప్పదో అని సందేహము కలుగవచ్చునని వివరించుచున్నాఁడు.) ప్రభావతిపస = ప్రభావతియొక్క యందము, రతిసొగసుకంటెను = రతియొక్క యందము కంటెను, ముమ్మడి = మూఁడురెట్లు, నలుమడి = నాలుగురెట్లును, వాసి = అధికము.

తాత్పర్యము:—ప్రభావతిసొగసు రతిదేవి సొగసుకంటె మూఁడు నాలుగురెట్లధికము కాన రతి రూపెక్కడ? ప్రభావతి రూపెక్కడ?

అలం:—విషమము.

వ. ఆ ప్రభావతిరూపంబును మదీయసృష్టియం దతిదుర్లభం బది పార్వతీవరప్రసాద జనితయై పొలుపొందు నని పలికి, నిజాంగనారోషంబుఁ దీర్చుటకు సత్వరంబుగాఁ బనిచిన నే నతని కాలవిలంబనాసహిష్ణుత్వంబు దెలిసినదాననై యప్పు డేమియు నడుగ వెఱచి యరిగితి మఱియుఁ గ్రమక్రమంబున నట్టి ప్రభావతివి నీవ యని నిశ్చయించితిం గావున నీవల్లభుండు భవదాయల్లకభరంబునం బరితప్తుం డగుచు నిన్ను వరియించుటకు నీకంటెను వేగిరించు నని తోఁచుచున్నయది రతివిలాసంబును దదంతరాయంబు సేయం జాలదు నీవు సకలసంశయంబులు నుడిగి సుఖం బుండు మనిన విని యద్దనుజేంద్రనందన తనడెందంబున సందియంబు నొందుచు రాగవల్లరి మొగంబు చూచుటయు నది తదభిప్రాయం బెఱింగి హంసి కిట్లనియె. 119

అర్థము:—ఆప్రభావతి రూపంబును = ఆప్రభావతియొక్క చక్కఁదనమునుఁ (రూపము అనఁగా- ఎట్టినగలచేత నలంకరింపఁబడ కున్నను, దేనిచేత అవయవము లన్నియు నలంకరింపఁబడినట్లు ప్రకాశించునో యది.) మదీయ సృష్టియందున్ = నా దగు సృష్టియందు, దుర్లభంబు = లభింపనిది - నాచే సృజింపఁబడిన యెల్లలోకములందును ప్రభావతి యందమునకు సాటి యగునది యింకొకటిలేదనిభావము. అది = ఆ ప్రభావతి, పార్వతీ వరప్రసాదజనితయై = పార్వతీదేవియొక్క వరరూప మగు నను గ్రహమున పుట్టింపఁబడినదై - (పుట్టిన దని భావము. వరము అనఁగా దేవతలు తమభక్తుల కోరిక పూర్తికై యిచ్చునది.) పొలుపొందును = ప్రకాశించును. అని పలికి, నిజాంగనారోషంబున్ = తన భార్య యొక్క కోపమును, తీర్చుటకై = మాన్పుటకై, సత్వరంబుగాన్ = త్వరతోఁ గూడినట్లు, వేగముగా, పనిచినన్ = (నన్ను) పంపఁగా, నేను, అతనికాల ... త్వంబున్ - అతని = ఆబ్రహ్మయొక్క, కాల విలంబన = జాగుసేయుటయందలి, అసహిష్ణుత్వంబు = సైఁప లేకుండుటను, తెలిసినదాననై, అప్పుడు, ఏమియున్, అడుగన్, వెఱచితి = భయపడి; అరిగితిని - బ్రహ్మ తన భార్యకోపముతీర్ప నన్ను తొందర

పెట్టుటచే ఇఁక నేసంగతియు నడుగ భయపడితిని అని భావము. అట్టి ప్రభావతివి = మన్మథునకు విరాళి పుట్టింపఁ గల సొగసుగల్గిన ప్రభావతివి, నీవు + అ నీవే అని, క్రమక్రమంబునన్, నిశ్చయించితిఁ, కావునఁ, నీవల్లభుండు = నీప్రియుఁడు - ప్రద్యుమ్నుఁడు, భవత్ + ఆయల్లకభరంబునఁ = నీయొక్క యధికమైన వియోగముచేత, పరితప్తుఁడు = పీడింపఁబడినవాఁడు, అగుచున్, నిన్నున్, వరియించుటకున్, నీకంటెను, వేగిరించుచు = త్వరపడుచుండును, అని తోఁచుచున్నది. రతివిలాసంబును = రతిదేవియొక్క శృంగారచేష్టగూడ, తదంతరాయంబు = నిన్నాతఁడు వరించుట కాటంకమును, చేయంజాలదు = చేయలేదు, నీవు, సకలసంశయంబులును, ఉడిగి = విడిచి, సుఖంబుండుము = సుఖముగా నుండుము, అనినఁ, ఆ + దనుజ + ఇంద్ర + నందన = ఆ రాక్షసరాజు కూఁతురగు ప్రభావతి, తనడెందంబునఁ = తన మనస్సునందు, సందియంబున్, ఒందుచున్, రాగవల్లరిమొగంబు, చూచుటయును, అది=ఆ రాగవల్లరి, తదభిప్రాయంబు=ఆమెయొక్క యాశయమును, ఎఱింగి, హంసికిన్ = శుచిముఖితో, ఇట్లు, అనియెన్ = పలికెను.

గీ. ఏమిటికి హితవుగఁ జెప్పి యేయెందు నదికి, తచ్చెరువు నీదుమాట లోయంచగరిత
కాముఁడు ప్రభావతీకాంక్షఁ గలఁగనేని, మనచెలియ కిష్టుఁడు విరాళిఁగొనుట యెట్లు?

అర్థము:—ఓ అంచగరిత ! = ఓ యాఁడుహంసా, ఏమిటికిన్ = దేనికొఱకు, హితవుగన్ = ఇష్టమగునట్లు, చెప్పి = చెప్పనారంభించి, ఎందున్ = దేనియందు, అదికితి = కూర్చితివి. (హిత వగునట్లు దేనికై యారంభించి దేనితో ముడిపెట్టితివి ? - సంబంధములేకుండఁ జెప్పితి వని భావము.) నీదు మాటలు, అచ్చెరువు = ఆశ్చర్యకరములు, కాముఁడు = మన్మథుఁడు, ప్రభావతీ కాంక్షన్ = ప్రభావతి యందలి కోర్కిచేత, కలఁగనేని=కలఁతనొందినయెడ, మన చెలియకున్ = మన చెలి యగు నీ ప్రభావతికి, ఇష్టుఁడు = ప్రియుఁ డగు ప్రద్యుమ్నుఁడు, విరాళిగొనుట = వలపు నొందుట, ఎట్లు = ఏ విధముగాఁ గలుగును ?

మ. అనినన్ నవ్వి మరాళి యిట్లనియెఁ జెలువా కాముఁ డన్వానిని మీ
రును విన్నారు గదమ్మ యాసకల సద్రూపోపమానత్వశో
భనకీర్తి ప్రథితుండు తొల్లిటి సురూపశ్రీఁ గడున్ మించు చె
న్నొనరం బుట్టినవాఁడు రుక్మిణికిఁ బ్రద్యుమ్నుం డనన్ బుత్రుఁడై. 121

అర్థము:—అనినన్, మరాళి=హంసాంగన (శుచిముఖి) నవ్వి, ఇట్లు, అనియెన్, చెల్వా = ఓయింతీ, కాముఁడు = మన్మథుఁడు, అన్వానిన్ = అను పేరుగల వానిఁ గూర్చి, మీరును, విన్నారు గదమ్మ ? ఆసకల ... ప్రథితుండు, సకల = సమస్తమగు సద్రూప = మంచి చక్కని వారికి, ఉపమానత్వ = పోలిక యగుటచేతఁ గల్గిన, శోభనకీర్తి = మేలయిన కీర్తిచేత, ప్రథితుండు = ప్రసిద్ధుఁడు, అగు నామన్మథుఁడు - తొల్లిటి సురూపశ్రీఁ=మునుపటి చక్కఁదనము యొక్క సమృద్ధితో, కడున్=మిక్కిలి, మించు = అతిశయించునట్టి, చెన్ను=సొగసు, ఒనరన్ = కలుగఁగా, రుక్మిణికిన్, ప్రద్యుమ్నుండు, అనన్ = ప్రద్యుమ్నుఁడను పేరితో, పుత్రుఁడై = కొడుకై, పుట్టినవాఁడు.

తాత్పర్యము:—అని రాగవల్లరి పలుక నాశుచిముఖి నవ్వి యిట్లనెను. ఓ చెలువా ! కాముఁడనువానిని మీరు విన్నారుగదా ? లోకమునఁ జక్కని వారికెల్ల నుపమానముగాఁ జెప్పఁబడు సొగసుగల యాకాముఁడే తొల్లిటి తన యా లోకోత్తర సౌందర్యమును గూడ అతిక్రమించు సౌందర్యముతో ప్రద్యుమ్నుఁడను పేరితో రుక్మిణికి కొడుకై పుట్టినాఁడు.

వ్యా. వి. :—అన్వానిన్ - అను + వానిన్ - సూ. అనుకొను లోనగు ధాతుజ విశేషణంబుల యంత్యాకారంబునకు హల్లు పరం బగునపుడు లోపంబు వైకల్పికంబు. ప్రౌఢ. సంధి. 18. చెల్వ = చెలువ

సూ. 'అచ్చికంబులం బదమధ్యంబుల న, ల, ర, డ - ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' బాల. ప్రకీర్ణ. 17. విన్నారు (వినిన + వారు) - వినిన - అనునది సూ. పడ్వాదులసవర్ణంబున కత్వంబును, దుదిహల్లునకు ద్విత్వంబును విభాష నగు. బాల. క్రియా. 51. చే 'విన్న' అని, కాఁగా - 'విన్న + వారు' అనునప్పుడు. సూ. ఉన్న, కల, న, వర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు. బాల. క్రియా. 117 - చే - వకారములోపించి, 'విన్న + ఆరు' అనియయి, సూ. అత్తునకు సంధి బహుళముగా నగు. బాల. సంధి. 4. సూత్రమునందలి బహుళగ్రహణముచే అకారసంధి నిత్యముగా రాఁగా - 'విన్నారు' అని సిద్ధించును. ఇది ధాతుజవిశేషణముగాని భూతకాలిక మధ్యమపురుష బహువచనరూపముకాదు. 'వినితిరి' వింటిరి అనునవి భూతకాలికక్రియాపద రూపములు.

క. అని నిజశంకల కన్నిటి,కిని బరిహారములు చెప్పి ♦ గెంటక యుండన్
దనయాస నిలుప దితిసుత,తనయ రమణుఁ గలయ మిగులఁ ♦ దమకించుమదిన్.

అర్థము:—అని, నిజశంకలకున్ = తనసందేహములకు, అన్నిటికిని, పరిహారములు = పోఁగొట్టున వగు ప్రత్యుత్తరములను, చెప్పి = (శుచిముఖి) పలికి, గెంటక = తొలఁగిపోక, ఉండన్ = ఉండునట్లు, తనయాసన్ = తనకోరికను, నిలుపన్ = నిలువఁబెట్టఁగా - దితిసుతతనయ = రాక్షసుఁ డగు వజ్రనాభుని కూఁతురు ప్రభావతి, రమణున్ = తనప్రియుని, కలయన్ = కూడుటకు, మిగులన్, తమకించుమదిన్ = త్వరపడుచున్న మనస్సుతో.

తాత్పర్యము:—ఈరీతిగా ప్రభావతికిఁ గలిగినసందేహముల కన్నిటికిని పరిహారకముగా ప్రత్యుత్తరములు చెప్పి శుచిముఖి తొలఁగకుండునట్లు తనకోరికను నెలకొల్పఁగా - ఆ ప్రభావతి తనప్రియుని గలియుటకై మిగుల మనసునఁ దత్తఱపడుచు, (ముందున కన్వయము.)

వ. హంసిం జూచి. 123

సీ. నీచెప్పినట్ల యి♦న్నియు నైన మొదలఁ ద,త్పుర మెంత దవ్వొ నీ♦పోవు టెప్పుడు ?
పోయి వేళ యెఱింగి ♦ పొసఁగ నవ్విభున కీ,దృశ మైననాకోర్కిఁ♦దెలుపు టెప్పుడు
తెలిపిన నేవిఘ్న♦ములకు లోఁబడక నా,పై నతఁ డనుకంపఁ ♦ బూను టెప్పుడు ?
పూని దా నిచటికి ♦ రా నొక్క నెపమున, గురునాజ్ఞ దొరకించు ♦ కొనుట యెప్పుడు ?
వట్టి పెనుమచ్చరపురాశి ♦ వజ్రనాభుఁ, డస్మదిచ్ఛకు ననుకూలుఁ ♦ డగుట యెప్పుడు ?
విరహవారిధి నేఁ గడ♦వెళ్లు టెపుడు ?, వలవనిదురాశలను గుమా♦రిలుటె కాక.

అర్థము:—వలవని దురాశలను = (తన్ను) పొందని చెడుకోరికలచేత; (తాను వలచుచున్నను - కోరుచున్నను, తన్ను నొల్లకున్నవి కావుననే ఆ యాశలు దురాశలైనవి అని గ్రహింపఁదగు.) కుమారిలుటె కాక = లోలోనఁ దపించుటయే కాని, నీచెప్పినట్లు + అ, ఇన్నియున్ = ప్రద్యుమ్నుని నామజాత్యాదు లెల్ల, ఐనన్ = యథార్థ మైనప్పటికిని, మొదలన్ = మొదట, తత్పురము = ఆద్వారకాపురము, ఎంతదవ్వొ = ఎంతదూరమో కదా, నీ పోవుట = నీవు వెళ్లుట, ఎపుడు ? పోయి, వేళ = తగినసమయము, ఎఱింగి, పొసఁగన్ = అనుకూలించునట్లు, అవ్విభునకున్ = ఆ ప్రభువునకు, ఈదృశము = ఇటువంటిది, ఐన నాకోర్కిన్ = అయినట్టి నా యభిలాషను, తెలుపుట, ఎపుడు ? తెలిపినన్ = నీవుచెప్పినను, ఏవిఘ్నములకున్ = ఏయాటంకములకు, లోఁబడక = వశముగాక, అతండు, నాపైన్, అనుకంప = దయ, పూనుట, ఎపుడు ? పూని = దయ వహించి; తాను = ఆ ప్రద్యుమ్నుఁడు, ఇచటికిన్, ఒక్క నెపమునన్ =

ఏదే నొకమిషతో, రాన్ = వచ్చుటకు, గురునాజ్ఞన్ = నాతండ్రి యనుమతిని, దొరకించుకొనుట = దొరకునట్లు చేసికొనుట, సంపాదించుకొనుట, ఎపుడు ? వట్టిపెనుమచ్చరపురాశి = (మచ్చరము అనఁగా ఇతరుల మేలు చూచి యోర్వ లేకుండుట) వ్యర్థమైన పెద్దయీర్ష్యల ప్రోగు, వజ్రనాభుఁడు = అయినట్టి నాతండ్రి, అస్మదిచ్ఛకున్ = నాకోర్కికి, అనుకూలుఁడు = సమ్మతించువాఁడు, అగుట, ఎపుడు? విరహవారిధిన్ = ఎడఁబాటను సముద్రమును, నేన్ = నేను, కడవెళ్లుట = కడచుట, దాఁటుట, ఎపుడు ?

తాత్పర్యము :—నీవు చెప్పినట్లు సర్వమును నిజమే యైనను, మొదట నాపట్టన మెంత దూరమో కదా, నీవు వెళ్లు టెప్పుడు ? వెళ్లినను సమయ మెఱిఁగి యాప్రభువుతో నిటువంటి నాకోరిక చెప్పుట యెప్పుడు ? నీవు చెప్పినను నేయాటంకములు లేక యాతఁడు నాపై దయవహించు టెప్పుడు ? దయగలిగి, ఏదే నొకనెపమున నాతఁ డిచటికి వచ్చుటకు నాతండ్రియనుమతిని బొందు టెపుడు? వట్టిమత్సరశీలుఁడైన వజ్రనాభుఁడు నాకోరికకు అనుకూలుఁ డగుట యెపుడు ? నే నీయెడఁబాటనుసముద్రమును దాఁటుట యెపుడు ? అనుకూలింపని యిట్టి చెడుకోరికలచే నాలో నేను కుమిలిపోవలసినదే కాని యివియెల్ల నెన్నఁటికిని ఘటిల్లు నవిగాఁదోఁపవు.

అలం:—విషమము.

వ్యా. వి. :—నీచెప్పినట్లు, (నీవు + చెప్పినట్లు) సూ. ధాతుజవిశేషణ భావార్థకపూర్వవ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకుఁ దఱుచుగ యొక్క షష్ఠి యగు. ప్రౌఢ. కారక. 15 చే - 'నీయొక్క చెప్పినట్లు' అనియై, సూ. యొక్కకు లోపంబు బహుళంబుగా నగు. 16. చే. 'నీచెప్పినట్లు' అగును. నీపోవుట - నీయొక్క + పోవుట అని విగ్రహము. పైసూత్రములోని భావార్థకమున కవ్యవహిత కర్తృపద ప్రథమ. షష్ఠీతత్పురుష సమాసము. గురునాజ్ఞ - సూ. షష్ఠీసమాసంబులం దుకార ఋకారముల కచ్చు పరంబగునపుడు నుగాగమంబగు. బాల. సంధి. 32. దొరకించుకొను - దొరకు ధా. ప్రేరణార్థమున - దొరకించు - ఆత్మనే పదార్థమున కొను - దొరకించుకొను = (దొరకు నట్లు చేసికొను, లభింపఁజేసికొను) - అని రూపసిద్ధి. అలం:—ఉత్ప్రేక్షాధ్వని.

క. అని తాల్మి వదల విడుచుచు, ఘనముగఁ బ్రజ్వరిలు దర్పకజ్వాలనముచే
  ననయము శోషిలి చెలి లో,చనముల వెడలించె మోవిసరసత యెల్లన్. 125

అర్థము:—అని = ఇట్లుపలికి, తాల్మి = ధైర్యమును, వదలన్, విడుచుచున్ = వదలిపోవునట్లుగా విడిచిపెట్టుచు, అనఁగా - పూర్ణముగా విడుచుచు, ఘనముగన్ = అధికముగా, ప్రజ్వరిలు = మండుచున్న, దర్పక జ్వాలనముచేన్ = మన్మథాగ్నిచేత, అనయము = అత్యంతము, శోషిల = కృశించి, మోవిసరసత = వాతెఱయొక్క సారస్యమును-(అనఁగా ఎఱ్ఱఁదనమును అన్నమాట) ఎల్లన్, లోచనములన్ = కన్నులనుండి, వెడలించెన్ = ప్రకటించెను. ఆమె మదనాగ్నిచే బాధనొందుచున్నది గాన నెఱ్ఱనిపెదవి వివర్ణమైనదనియు, కన్ను లెఱుపెక్కె ననియు భావము. అలం:—ఉత్ప్రేక్షాధ్వని.

క. అట్టియెడఁ గట్టెదుర నొక,చెట్టున నురిఁ దగులువడిన ◌ చిలుక వెఱపుతో
  నిట్టటు ఱెక్కలు తటతటఁ,గొట్టుకొనుచు నెగయఁ బెనఁగఁ ◌ గోమలి కనియెన్. 126

అర్థము:— అట్టియెడన్ = అటువంటి సమయమందు, కట్టెదురన్ - కడు + ఎదురన్ = మిగుల ఎదుటితావున, ఒకచెట్టునన్, ఉరిన్, తగులువడిన చిలుక = చిక్కుకొనిన యొకచిలుక, వెఱపుతోన్ = భయముతో, ఇట్టు, అటు, ఱెక్కలు, తటతటన్, కొట్టుకొనుచున్ - ఎగయన్ = ఎగురుటకు, పెనఁగన్ = పెనఁగులాడుచుండఁగా, కోమలి = ఆ ప్రభావతి, కనియెన్ = చూచెను.

క. కని ఘనసంభ్రమమున దిగ్గున లేచి దయాకులం బగు మనోవృత్తిన్
దనతోఁ జెలియును హంసియుఁ, జనుదేరఁగ దానిఁ జేరఁ జనియె రయమునన్. 127

అర్థము:—కని, ఘనసంభ్రమమునన్=అధిక మగు తొట్రుపాటుతో, దిగ్గునన్, లేచి, దయాకులంబు= దయచే కలఁకనొందినది, అగు మనోవృత్తిన్ = అయినట్టి మనోవ్యాపారముతో, (తలఁపుతో నని భావము) తనతోన్ = తన వెంబడిని, చెలియున్ = చెలికత్తెయగు రాగవల్లరియును, హంసియున్ = శుచిముఖియు, చనుదేరఁగన్ = రాఁగా, దానిన్ = ఆ చిలుకను, చేరన్ + చనియెన్ = సమీపింప వెళ్లెను.

క. చని చిలుకఁ గదలకుండఁగ, ననువునఁ దాఁ బొదుగఁ బట్టి యంఘ్రియురి వద
లిచ్చిన నది రయమున నబ్జాభమిని కేల్విడిపించుకొనుచు మింటికి నెగసెన్. 128

అర్థము:—చని = పోయి, చిలుకన్, కదలకుండన్, అనువునన్ = ఉపాయముతో (అది తన్ను కఱవకుండునట్లు) - తాన్ =ఆ ప్రభావతి, పొదుగన్ + పట్టి=(ఆ చిలుకదేహమును) తన చేతితో క్రమ్మునట్లు పట్టుకొని, అంఘ్రియురిన్ = కాలియందలి యురిని, వదల్చినన్ = తొలఁగింపఁగా, అది = ఆ చిలుక, అబ్జాభమినికేల్ = ఆ ప్రభావతి చేతిని, విడిపించుకొని = విడుచునట్లు చేసికొని, రయమునన్ = వేగముతో, మింటికిన్ = ఆకసమునకు, ఎగసెన్ = ఎగిరిపోయెను, ఇందు ఎగసెన్ అని కాని, నెగసెన్ అని కాని చదువవచ్చును. నెగయు నను రూపాంతరమే ఎగయు.

వ. అప్పుడు,

మ. శుకపక్షంబులలోన నుండి తదతిక్షోభంబునం జాఱి ప
త్రిక వడ్డన్ వెఱఁగంది యిట్టు లను దైతేయాధిపాంతఃపురం
బకటా! చోద్యము చూచితే యిది కడున్ హంసీ విచార్యంబు కొం
కక యిం దెవ్వరి కెవ్వ రంపిరొకొ చిల్కం బట్టి తే నోపుదే. 130

అర్థము :—శుకపక్షంబులలోననుండి = చిలుకఱెక్కల నడుమనుండి, తదతిక్షోభంబునన్ - తత్ = ఆ ఱెక్కలయొక్క, అతిక్షోభంబునన్ = మిక్కిలి కొట్టుకొనుటచేత - జాఱి; పత్త్రిక = వ్రాసినయాకు, ఉత్తరము, పడ్డన్ = క్రిందపడఁగా, దైతేయాధిప = రాక్షసరాజగు వజ్రనాభుని, అంతఃపురము = అంతిపురమునందుండెడి స్త్రీ యగు ప్రభావతి, వెఱఁగు + అంది=ఆశ్చర్యపడి, ఇట్టులు, అనున్=అనెను, హంసీ = శుచిముఖీ! అకటా (ఇట ఆశ్చర్యసూచకము) చోద్యము = వింత, చూచితి + ఏ = చూచితివా, ఇది=ఈ పత్త్రిక (వచ్చుటకుఁ గలకారణము), కడున్=మిగుల, విచార్యము = ఆలోచింపఁదగినది, కొంకక = భయపడక, ఇందున్ = ఈ యంతిపురియందుండునట్టి, ఎవ్వరికిన్, ఎవ్వరు = ఆవలనుండి యెవ్వరు, పంపిరొకో = పంపినారో కదా, చిల్కన్, పట్టి = పట్టుకొని, తేన్ + ఓపుదే = తేఁగలవా?

తాత్పర్యము :—ఆచిలుక విడిపించుకొనుటకై మిగుల కొట్టుకొనుచుండ దానిఱెక్కలలోనుండి యొకయుత్తరము క్రింద పడఁగా ప్రభావతి యాశ్చర్యపడి హంసీ! యీవింత చూచితివా? ఇది మిగుల పరిశీలింపఁదగినవిషయము. జంకు లేకుండ నెవ్వ రీయంతిపురమునందలి ఎవ్వరికి నీజాబును బంపిరోకదా! చిలుకను బట్టుకొని తేఁగలవా?

గీ. అని ప్రభావతి పల్కిన హంసి యపుడ, 'కూడఁ జని పట్టి తెత్తుఁ జిక్కువడ కెంత
దవ్వు పాఱెడు' ననుచుఁ బంతమునఁ బఱచె, శీఘ్రగతి నింత నంత నా చిలుకఁ దగిలి.

అర్థము :—అని, ప్రభావతి, పల్కినన్=చెప్పఁగా, హంసి = శుచిముఖి, చని, పట్టితెత్తున్, చిక్క వడక = దొరకక, ఎంతదవ్వు = ఎంతదూరము, పాఱెదున్ = పరుగెత్తుదు ?, అని, అపుడ = ఆక్షణమందే, శీఘ్రగతిన్=వేగముగగమనముతో, ఇంతనంతన్=కొంచెము దూరములో, ఆ చిలుకన్, పగిలి=వెంబడించి, పంతమునన్ = పట్టుదలతో, పఱచెన్ = పరుగెత్తెను.

ఉ. అంతఁ బ్రభావతీసతి వయస్యఁ గనుంగొని యింతి చూచితే
యెంతటిచోద్యముల్ మొదల నిక్కడ ని ట్లురు లెవ్వ రొడ్డిరో
వింత యటన్న నీచెవికి వేఁడిగఁ బల్కు పికాళిఁ బట్టి శి
క్షింతు నటంచు నేఁ గడఁగి చేసిన త ప్పిది యొప్పు నోర్వఁగన్. 132

అర్థము:—అంతన్ = అనంతరము, ప్రభావతీసతి = ఉత్తమస్త్రీ యగు నాప్రభావతి, వయస్యన్ = చెలికత్తెను, కనుంగొని = చూచి, ఇంతి, ఎంతటిచోద్యముల్ = ఎంతెవింతలో, చూచితి + ఏ = చూచితివా? మొదలన్ = మొదట, ఇక్కడన్, ఇట్లు, ఎవ్వరు, ఉరులు = మృగములను, పక్షులను పట్టుకొన నేర్పఱచిన సాధనవిశేషములు, ఒడ్డిరో, వింత = ఆశ్చర్యము, (ఇదిమొదటివింత యన్నమాట) అటు + అన్నన్ = అనఁగా, (వయస్య యనుచున్నది,) నీచెవికిన్, వేఁడిగన్ = వినుటకు నీకు దుస్సహ మగునట్లు, పల్కు=కూయుచుండు, పికాళిన్ = కోయిలలగుంపును, పట్టి, శిక్షింతును, అటంచున్, నేన్ = నేను, కడఁగి = సాహసించి, చేసినతప్పు, ఇది, ఓర్వఁగన్ = సైఁచుట, ఒప్పున్ = తగును.

తాత్పర్యము:— పిదప ప్రభావతి చెలియగు రాగవల్లరిని జూచి యెంతటివింతలో చూచితివే, ముందీయురుల నిక్కడ నెవ్వరు పన్నిరో వింతగా నున్న దనఁగా - వయస్య యనును "నీచెవులకుఁ దాపము గలుగునట్లు కోయిలలుకూయుచుండ వానిని బట్టుకొని శిక్షింతు నని నేను సాహసించి యీ తప్పు చేసితిని. దీనికి నీవు సహింపవలెను."

వి. :—పికములకూఁత విరహులకు బాధకర మని వర్ణించుట కవిసమయము.

క. చిత్రము మిక్కిలి యిపు డీ, పత్త్రికచందంబ యో ప్రభాతాబ్జలస
న్నేత్త్ర యది చూత మనుచున్, బత్త్రిక పుచ్చుకొని విచ్చి భాసురఫణితిన్. 133

అర్థము:—ఈపత్త్రికచందంబు + అ = ఈ యుత్తరము విధమే, మిక్కిలి, చిత్రంబు = అద్భుతముగా నున్నది, ఓ ప్రభాతాబ్జలసన్నేత్ర - ప్రాతఃకాలపు తామరపువ్వులవలె ప్రకాశించు నేత్రములు గలదానా! (కలఁకదేఱి వికసించిన కన్నులుగలదాన వైతి వని భావము.) ఓ ప్రభావతీ, అది = ఆయుత్తరము, చూతము = (మనమిద్దఱమును) చూతము, అనుచున్, పత్త్రిక, పుచ్చుకొని, విచ్చి=మూసియున్న దానిని విప్పి, భాసురఫణితిన్ = మనోహరమగువిధమున.

వ్యా. వి. :—పత్త్రిక. అని తకారద్వయముతో నుండవలె నని పాణినీయము. పత్ ధాతువుకంటె ష్ట్రన్ = త్రన్ - అను ప్రత్యయముచేర్పఁగా - పత్త్రమ్ - అగును. ఈ తకారమునకు లోపవిధానము కానరాదు. కాన 'పత్త్రమ్' అనురూపము చింత్యము. ఈపద్యమందలి ప్రాసములందున్న చిత్ర, నేత్ర శబ్దములలోని తకారమునకు "అనచిచ" అను సూత్రముచే వచ్చు వైకల్పిక తకారము విధించికొని చిత్త్రి, నేత్త్రి అని సవరింపఁబడినది. ముద్రితములందు ఏకతకారముతో నుండుట ప్రామాదికము.

సీ. "శ్రీమత్సరస్వతీ రామాకృపాసంప్ర, యుక్తోపమాతిశయోక్తికామ
ధేను సద్బిరుదాంక దివ్య మంజీర సం, శోభితపాదక శుచి ముఖికిని

ప్రద్యుమ్నుఁ డూర్జిత ప్రణయపూర్వకముగా, ననిపిన యట్టి రహస్యలేఖ
ప్రప్రభాభావతిఁ బలు తెఱంగుల నీవు, వచియింప" నని చదువుచునె యుబ్బి

సంతసము నాఁపఁజాలక చంకవైచుకొనుచు నొకదాఁటుగొని నిన్నుఁ గూర్చి కాంతుఁ
డనిపినట్టి పత్త్రికయె కదమ్మ భాగ్యవతివి నీ వని చెలి ప్రభావతిని బల్కె. 134

అర్థము:—శ్రీమత్...పాదకున్, శ్రీమత్ = శోభగలది యగు, సరస్వతీరామా = సరస్వతియను నింతియొక్క, కృపా=దయచేత, సంప్రయుక్త = కూర్పఁబడిన, తొడుగఁ బడిన అని భావము, ఉపమాతిశయోక్తి కామధేనువు, అను, సద్బిరుద = యోగ్య మగు సామర్థ్యమునకు, అంక = చిహ్నమగు, దివ్యమంజీర = శ్రేష్ఠ మగునందెచే - (గండపెండారముచేత ననిభావము) సంశోభిత = అలంకరింపఁబడిన, పాదకున్ = పాదముగలది యగు, శుచిముఖికిని, ఊర్జిత......పూర్వకముకాన్ - ఊర్జిత = దృఢమైన, ప్రణయ = ప్రీతితోఁ జేయుప్రార్థనము, పూర్వకముగాన్ = తొలుతఁగలదగునట్లు, (అనఁగా దృఢమైన ప్రీతితోగూడిన ప్రార్థనము ముందుగాఁ జేసి యని భావము) అనిపినయట్టి = పంపిన, రహస్యలేఖ = ఏకాంతపుజాబు. ('జాబు' అను నర్థమున లేఖః - పుంలింగము. గీత యను నర్థమున లేఖా = రేఖా. స్త్రీలింగము, కాన 'లేఖ' అని యగుననియు, పుంలింగ 'లేఖ' శబ్దము 'లేఖము' అని యుండఁ దగు ననియు సూ. ని. కాని యీ ప్రయోగము ననుసరించి పుంలింగశబ్దము చరిత్రాదులలోఁ బఠించుకోఁ దగును. చరిత్రాదు లాకృతిగణము.) ప్రప్రభాభావతిన్ - ప్రప్రభా=ప్రకృష్టమగు కాంతిగలది. లక్షణచే మెఱుపు - దానియొక్క, భావతిన్ = కాంతివంటి కాంతిగల దానిని. (ప్రభావతి అని వ్రాయుటకు బదులుగా నుత్కటప్రేమవశుఁడై వ్రాసితినో లేదో యని ప్రభా! యను నక్షరములు రెండుమాఱులు వ్రాసినాఁ డని ధ్వని) పలు తెఱంగులన్ = పెక్కువిధములచే, నీవు, వచియింపన్ = వర్ణించి చెప్పఁగా, అని, చదువుచును+ఎ = (రాగవల్లరి) పఠించుచునె, ఉబ్బి = ఉప్పొంగి, సంతసమును, ఆఁపజాలక, చంకవైచుకొనుచున్ = (రెండవ చేతిలో జాబుండుటచే) ఒక్కచంకనే వేసికొనుచు, (చంక - సం. కక్షః) ఒకదాఁటుగొని =ఒక గంతువేసి, నిన్నుఁగూర్చి=ని న్నుద్దేశించి, కాంతుఁడు=(నీ) ప్రియుఁడు, అనిపినట్టి= పంపినట్టి, పత్త్రికయె కదమ్మ = ఉత్తరమే కదమ్మ, నీవు, భాగ్యవతివి = మంచి యదృష్టముగలదానవు, అని, చెలి = సకియ (రాగవల్లరి), పల్కెన్ = అనెను.

తాత్పర్యము:—శ్రీ సరస్వతీదేవి 'దయతో ఉపమాతిశయోక్తి కామధేను' వనుబిరుదాక్షరములచే చిహ్నితమైన పెండేరము స్వయముగాఁ దొడిగిన కాలుగల శుచిముఖికి ప్రద్యుమ్నుఁడు బలమైన ప్రేమతోఁ గూడినప్రార్థనము ముందు చేసి పంపిన యేకాంతపుజాబు. ప్రప్రభాభావతిని నీవు పెక్కురీతుల వర్ణనపూర్వకముగాఁజెప్ప - అను నంతదాఁక చదువుచునే ఉప్పొంగిపోయి, సంతోషము పట్టఁజాలక, చంకవైచుకొనుచు, ఎగిరి యొక్కగంతువేసి "ఈయుత్తరము నినుఁ గూర్చియేకదమ్మ నీప్రియుఁడు పంపినాఁడు, నీ వెంత యదృష్టవతివి" యని రాగవల్లరి పల్కెను.

వి. :—ఇందు జాబువ్రాయు క్రమమునందలి యౌచిత్యము నుత్యము. ప్రప్రభాభావతి అని వ్రాయుటలో ప్రద్యుమ్నునకుఁ గలప్రేమమున రెండేసి మాఱు లొక్కొక్కయక్షరము వ్రాయుటయే కాక, ఉత్కంఠాతిశయమున మనశ్చలనము గూడఁ గల్గుటయు - దానికిని సరస మగు నర్థవిశేషము కలుగుటయు నదిప్రకృతమున కెంతయు నుచితముగా నుండుటయు సూరనప్రతిభకుఁ దార్కాణములై కావ్యమునకు శోభ గూర్చుచున్నవి. రాగవల్లరి తనచెలికత్తె యభీష్టసిద్ధికి సూచన కనిపింపఁగనే యుప్పొంగి సంతసమున నొక్కగంతువేయుట ఒకచేతిలో నుత్తర ముండుటచే ఒక్కచంకయే వేసికొనుటయు ఆమె యదృష్టమును పొగడుట లోకస్వభావమునకు నద్దమైనది.

అలం:- స్వభావో_

చ. పలికిన నట్లు యున్నదియె ? పత్రికలో నడకించెదో ననున్
జెలి యిటు చూపుమా యనుచుఁ ? జేరఁగఁ బోవుచుఁ జేయి సాచె నా
యలినిభవేణి, తత్సఖియు ? న ట్టిటు పాఱుచు దేవునాన యేఁ
గలయది యంతయున్ జదువఁగా విను చూచెదు కాని నావుడున్. 135

అర్థము:—పలికినన్ = చెలికత్తె యి ట్లనఁగా, పత్రికలోన్ = జాబునందు, అట్లు + అ = ఆ ప్రకారమే, ఉన్నదియె = ఉన్నదా ? ననున్ = నన్నును, అడకించెదు + ఓ = పరిహసించుచున్నావా ? చెలి = ఓ సకియా, ఇటు, చూపుమా, అనుచున్, ఆ యలినిభవేణి = తుమ్మెదలవంటి జడ గల యాప్రభావతి, చేరఁగన్ + పోవుచున్ = సమీపించునట్లు వెళ్లుచు, చేయి, చాచెన్, తత్సఖియు = ఆ చెలికత్తెయు, అట్టిటు = (ఆమెకు దొరక కుండుటకై) ఆ వంకకు నీ వంకకును, పాఱుచున్ = పరుగెత్తుచు, దేవునాన = దేవునితోడు, ఏన్ = నేను, కలయది = ఉత్తరమందున్నది, అంతయున్, చదువఁగాన్ = వినుము, చూచెదుకాని = చూతువులే, తరువాత నీవుచూడ వచ్చునులే అనిభావము. నావుడున్ = అనుటయును.

తాత్పర్యము:—చెలికత్తె యిట్లనఁగా, నా ప్రభావతి ఉత్తరమం దట్లున్నదా? లేక నన్ను పరిహాసము చేయు చుంటివా ? ఏది చూపింపు మనుచు దగ్గఱ కేఁగుచు చేయి చాచెను. చెలికత్తెయునామెకు దొరక కుండుటకై యిటు నటు పరుగెత్తుచు 'దేవునిపై నొట్టు - జాబునందున్న దంతయు నేనుచదువుదును. నీవు వినుము. తరువాత చూతువుగాని' యనుటయు.

ఉ. ఆవిధిఁ దప్ప కున్నఁ జెలి?యా ! ననుఁ జేకొను టెట్లు ? ప్ర ప్రభా
భావతి నాఁగ నెవ్వతయొ ? పత్రిక యింకను లెస్స చూడు నా
కీవల దన్న నె ట్లెఱుఁగ?వే భవదాఖ్యయె కాదె యిట్లుగా
నోవనజాక్షి వర్ణపునరు?క్తిగ వ్రాసినవాఁడు భ్రాంతిచేన్. 136

అర్థము:— చెలియా, ఆవిధిన్ = నీవుచదివినవిధమును, తప్పక = అతిక్రమింపక, ఉన్నన్ = సరిగా ఉత్తరమందట్లే, ఉన్నచో, ననున్, చేకొనుట = (ప్రద్యుమ్నుఁడు) స్వీకరించుట, ఎట్లు = ఎట్లుజరుగును. ప్రప్రభాభావతి, నాఁగన్ =అనఁగా, ఎవ్వతయొ? ఇంకను, పత్రిక=ఉత్తరమును, లెస్సగన్= బాగుగా, చూడుము, నాకున్, ఈవలదు = ఈయవద్దులే, అన్నన్ = అనఁగా, ఓవనజాక్షి = తామర పువ్వులవంటి కన్నులు గలయోప్రభావతీ, ఎట్లు, ఎఱుఁగవే=ఏలయెఱుఁగవు ? భవదాఖ్యయె కాదె=నీపేరే కదా; భ్రాంతిచేన్ = వ్రాసితినో లేదో యను భ్రమచేత, వర్ణపునరుక్తిగన్ = వ్రాసినయక్షరమే మరల వచ్చునట్లుగా, వ్రాసినాఁడు.

తాత్పర్యము:—ఓచెలీ ! నీవు చదివినట్లే లేఖయం దున్నచో ఆతఁడు నన్ను స్వీకరించుట యెట్లు గలుగును? ప్రప్రభాభావతి యన నది యెవ్వతెయో కాని నేను గానుగదా ! నా కీయ వద్దులే. ఉత్తరము నింకను బాగుగా చూడుము. అనఁగా - నీపేరే కదా ! ఎట్లెఱుఁగవు ? ఓ పద్మనేత్రా ! అతఁడు బుద్ధి స్థిరముగా లేక, వ్రాసినయక్షరములే మరల వచ్చున ట్లీరీతిగ, వ్రాసినాఁడు

వ్యా. వి. :—నాఁగన్ - నాన్ - (అను + నుజీ) = సూ. అగున, కను, కనులకు ము, జ్ఞేత్తులు పరంబులగునపుడు కా, నా, కొనలు విభాష నగు. బాల. క్రియా. 96. చే 'నాన్' అనియు, సూ. నుజ్యంతం బగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు. నుజికి విభాష నగు. బాల. క్రియా. 115. చే 'కాన్' అను అగుధాతు నుజ్యంతము చేరఁగా. నాన్, నాఁగాన్-అయి, సూ. దానికి హ్రస్వంబు విభాష నగు. బాల. క్రియా. 116. చే 'నాఁగన్' అని రూపసిద్ధి. ఈన్ + వలదు. ఇచ్చు + నుజీ. అని యుండ సూ. ఇచ్చునకు సర్వంబున 'కీ' యగు. బాల. క్రియా. 92. చే - ఈ సర్వాదేశంబై ఈను, ఈన్, అని

రైనది. నాన్, నాఁగన్ - అనునవి 'అను' ధాతునుజ్యంతములు. 'ఈన్' అనునది "ఇచ్చు" ధాతునుజ్యంతరూపము.

వ. అనుటయు. 137

క. ఎట్టటు కాని మ్మది యిఁక, నట్టెటు పాఱక మృగాక్షి ! యవలఁ జదువు మే
నిట్టే యుండెద నావుడు, గట్టిగ నట్లేని వినుము ! కడమ చదివెదన్. 138

అర్థము:—అని రాగవల్లరి పలుకఁగా, అది = భ్రాంతుఁడై వ్రాసిన యామాట, ఎట్టటు = ఏ విధముగానైనను, కానిమ్ము, మృగాక్షీ = లేడికన్నులవంటి కన్నులదానా! అట్టిటు = అవంకకు నీవంకకు, పాఱక = పరుగిడక, అవలన్ = తరువాత దానిని, చదువుము, ఏను = నేను, ఇట్టే = ఇప్పుడెట్లుండితినో అదే విధముగా (కదలక), ఉండెదన్ = ఉందును, నావుడున్ = అని ప్రభావతి యనఁగా, గట్టిగన్ = దృఢముగా (నిశ్చయముగా), అట్లేని = నీవు చెప్పినట్లు కదలక నిలిచితివేని, వినుము, కడమ = మిగిలినది, చదివెదన్ = చదువుచున్నాను.

వ. అని ప్రథమ శ్రుతాంతంబు నందుకొని యిట్లని చదువం దొడంగె. 139

అర్థము:—అని, ప్రథమ శ్రుతాంతంబును = మొదట (ప్రభావతిచే) వినఁబడినదాని తుదను, అందుకొని, ఇట్లని, చదువన్, తొడంగెన్ = ప్రారంభించెను. మొదట విన్నదాని తరువాత భాగము మొదలు పెట్టి యీ రీతిగాఁ జదువ నారంభించెనని భావము.

సీ. 'ప్రప్రభాభావతిఁ ! బలుదెఱంగుల నీవు, వచియింప నపుడు ! నిర్వచన వృత్తి
నే నున్కి- కల్లగు ! ట్టింతియె కాని యా, యింతియంగము లెవ్వి ! యెట్లు చెప్పి
తవి యెల్ల నట్ల నా ! యాత్మఁ దద్దయుఁ బడి, యచ్చున నద్దిన ! ట్లమర నంటి
మలిచిన గతిని మి ! క్కిలి దృఢత్వముఁ జెంది, స్వగుణ సంపద్గౌర ! వమున నేమొ

యూఁది బడలించుచున్నవి ! యోమరాళి, యధరసుధఁ దేర్పుమని వేడు ! మామృగాక్షి,
నని చదువునంత గొబ్బునఁ ! జని సురారి, పుత్రి సఖిచేతి పత్రికఁ ! బుచ్చుకొనియె. 140

అర్థము:—ప్రప్రభాభావతిఁ బలుదెఱంగుల నీవు వచియింపన్ =(మొదట వినిపించినదాని ఈ యంత్యభాగమును గ్రహించి యిట్లనుచున్నది అనుభావము.) ప్రప్రభాభావతిన్ = మెఱపుతీఁగ యొక్క కాంతి వంటి కాంతిగల ప్రభావతిని గూర్చి, పలుదెఱంగులన్ = పెక్కువిధములుగా, నీవు వచియింపన్ =(వర్ణించి) చెప్పుచుండఁగా, అప్పుడు, నిర్వచన వృత్తిన్ = మాటలేని వర్తనముతో (మాటాడకుండ నని భావము) నేను, ఉన్కి = ఉండుట, కల్లగుట్టు=కపటపు ధైర్యము, ఇంతియె కాని, ఆయింతి యంగంబులు = ఆ ప్రభావతి యవయవములు, ఎవ్వి=ఏవి, ఎట్లు = ఏ రీతిగా, చెప్పితి = చెప్పితివో, అవి ఎల్లన్, అట్లు +అ, నాయాత్మన్ = నామనస్సునందు, పడి = 'నీటిలో రాయిపడినట్లు' పడి, తద్దయున్ = అత్యంతము, అచ్చునన్, అద్దినట్లు = ఒత్తినట్లు, అమరన్ = తగిన రీతిని, అంటి = లగ్నమై, మలిచిన గతిన్ = (ఉలిపైని) చెక్కిన విధమున, మిక్కిలి, దృఢత్వమున్ = స్థిరత్వమును, చెంది=పొంది, స్వగుణ సంపద్గౌరవమునన్, స్వ = తన యొక్క, గుణ సంపత్ =గుణములసమృద్ధియొక్క, గౌరవమునన్+ఏమొ = బరువుచేతఁ గాఁబోలును, ఊఁది=నొక్కిపట్టి, బడలించుచున్నవి = ఆయాస పెట్టుచున్నవి. ఓమరాళి = ఓ యాఁడు హంసా? అధరసుధన్ = మోవి సంబంధమగు నమృతము చేత, తేర్పుము = (నా) ఆయాసము తీర్పుము

**అని**, ఆ మృగాక్షిన్ = ఆ లేడికన్నులవంటి కన్నులుగల యాయింతిని, వేడుము = కోరుము, అని, చదువు నంతన్ = చదువు సరికి, సురారిపుత్రి = ప్రభావతి (సురలకు = దేవతలకు, అరి శత్రువగు వజ్రనాభునియొక్క పుత్రి) గొబ్బునన్ = వేగముగా, చని = (దగ్గఱకు) వెళ్లి, సఖిచేతి పత్త్రిక౯ = చెలికత్తె చేతిలోని జాబును, పుచ్చుకొనియెన్ = తీసికొనెను.

తాత్పర్యము:—ప్రభావతిని పెక్కువిధముల నీవు వర్ణించి చెప్పుచుండఁగా నపుడు నేను మాటాడ కుండుట కపటపు ధైర్యము. అంతియ కాని ఆయింతి యవయవములు నీ వెట్లు చెప్పితివో, అట్లే మనసున దటాలునఁ బడినవై యచ్చొత్తినట్లు ముద్రితములై రాతిపైని చెక్కినట్లు స్థిరములై అందలి యుత్తమ గుణముల బరువుచేత నేమో కాని హృదయము నొక్కిపట్టి యాయాస పెట్టుచున్నవి. కాన నో హంసీ! అధరామృత మిచ్చి నాయాయాసమును దీర్పుమని వేడుకొనుము.' అని చదువు సరికి ప్రభావతి తటాలున దగ్గఱకేఁగి, యాచెలికత్తె చేతిలోని జాబును పుచ్చుకొనెను.

అలం. :—ఉత్ప్రేక్ష, సారము.

వి. :—ప్రభావతి యవయవ వర్ణనము వినుచుండఁ బ్రద్యుమ్నుని మనసున ముందునీటిలో రాయిపడి నట్లుపడి, యందచ్చొత్తినట్లుగానై, శిలపై మలిచినట్లై, క్రమముగా వాని గుణముల బరువుచేత, మనసును నొక్కిపట్టినట్లు బడలిక పుట్టించు చున్నవి యనుట. శ్లో. లీనేవ ప్రతిబింబితేవ లిఖితే వోత్కీర్ణ రూపేవ చ ప్రత్యుప్తేవచ వజ్రలేపఘటితే వాంత ర్నిఖాతేవ చ, సా న శ్చేతసి కీలితేవ విశిఖై శ్చేతోభువా పంచభి, శ్చింతా సంతతి తంతుజాల నిబిడ స్యూతేవ లగ్నా ప్రియా. అను మాలతీ మాధవమునకు ఛాయగా నీపద్యము గోచరించు చున్నది.

ఉత్సాహ. పుచ్చుకొనుడుఁ బెనఁగఁ బోక బోటి చేయి వదలి పో
నిచ్చి నాకుఁ జదువఁ దగద యింతనుండి మిక్కిలిన్
బచ్చిగాఁగ వలపు తేటపఱచి వ్రాసినాఁడొ నీ
యిచ్చఁ జదువుకొనుము వెనుక నిపుడు దాఁచి నావుడున్. 141

అర్థము:—పుచ్చుకొనుడున్ = పుచ్చుకొన్నపిదప, బోటి = చెలికత్తె, పెనఁగఁబోక = గుంజులాడక, చేయి, వదలి, పోనిచ్చి, ఇంతనుండి, మిక్కిలిన్, పచ్చిగాఁగన్ = బట్టబయలగునట్లు, వలపు = ప్రేమమును, తేటపఱచి = ప్రకటించి, వ్రాసినాఁడొ = వ్రాసినాఁడేమొ, ఇంతనుండి = ఇటనుండి, నాకున్, చదువన్ తగదు + అ = చదువనే తగదు, (కాన) ఇపుడు = ఇప్పుడు, దాఁచి, వెనుకన్ = తరువాత, నీయిచ్చన్ = నీయిష్ట ప్రకారము, చదువుకొనుము, నావుడున్ = అనినపిదప.

తాత్పర్యము:—అట్లు ప్రభావతి లేఖ పుచ్చుకొనఁగా చెలికత్తె పెనఁగులాడక, చేయి వదలివేసి 'ఇక్కడనుండి వల పంతయు బయలుపడ పచ్చిగా వ్రాసినాఁడు కాఁబోలును, కాన నేను చదువుట న్యాయ్యము గాదు. ఇపుడు దాఁచి, తరువాత నీయిచ్చ దీఱఁగా చదువుకొనుమనఁగా.

వ. ప్రభావతి భావంబునం గోపలజ్జాలోల యగుచు లేఖ నలిపివేయం బోయిన రాగవల్లరి పెక్కానలిడుచుం బడుచుఁదనంబును మనంబున నింత ఘనంబుగాఁ బూని యున్నదానవే దానవేశ్వరతనూజా నీయోజ మేలు మేలు చాలుం బదివేలు వచ్చె నాచేతికిఁ దెమ్ము తేవేనిం బదిలంబుగాఁ బొదివి దాఁచుము. మొదల నీయాఘునకు నీకుంబని యేమి యామహామహుండు శుచిముఖిపేరం బుత్తెంచినాఁ

డింతియ యాశకుంతకాంత చూచుకొనకుండ మనలో మనమె యడంచిన నది
యెట్లుండు మనము దానితోడం జేసిన ప్రాణసఖ్యం బెట్టిదియగు గట్టిగ నింతవట్టు
నీవ భావించికొను మదియునుంగాక నీపోకడమాలినతనం బేమి చెప్ప వల్లభుండు
వాల్లభ్యంబు నెఱపి యనిపినపత్త్రిక భాగ్యవతులు కులదేవతంబలెం బూజించి
దాఁచికొనుట యొప్పుఁగాక యిట్టట్టు సేయుటకంటె నమంగళంబు గలదే యని
యదరవైచియు బుజ్జగించియు బోధించియు వారించె, నంచయు నించుక దవ్వునన
చిలుకం గూడముట్టి పదంబులం బొదిగి పట్టిన నది యిట్టు నట్టు పెనంగుచుం
గీచుకీచు మని యఱచుచు జరణంబులు గఱచుచు రాక చీఁకాకుపఱిచిన రేసి
'యోసి గడుసుంబులుంగ యెలింగించి చావక వేవేగ నావెంట రమ్ము ఱెక్కలలో
దాఁచుకొని యెక్క డెక్కడి లేఖ లెక్కడకు నడుపుచున్న దానవు రక్కసులఱేని
యోఁడుబిడ్డ నిన్నుంబట్టి తెచ్చునందాఁక నదె కదలకున్నది యనిన నది యిట్లనియె.

అర్థము:—ప్రభావతి, భావంబునన్=మనసునందు, కోప లజ్జాలోల - కోప = తన్ను పరిహసించుటచేఁ గలిగిన, కోపముచేతను, లజ్జా = ప్రద్యుమ్నుఁ డట్లు గుట్టు విడిచి తన్ను నధరామృతము కోరుటచేఁ గలిగిన, సిగ్గుచేతను, లోల = చలించినది, ఆనలు = ఒట్లు, ఇడుచున్ = పెట్టుచు, పడుచుఁదనంబును = పసితనమున నుండు నవివేకమును, ఇంత ఘనంబుగాన్ = ఇంత యధికముగా, నీయోజ = నీపద్ధతి, లేక, నీ నేర్పు, మేలుమేలు = మెచ్చఁదగును, చాలున్, పదివేలువచ్చెన్ = చాల లాభము వచ్చెను. (మిగుల నష్టము వచ్చెను. అనిభావము - వ్యాజస్తుతి.) పొదివి = పొదిగి, ఇతరులకు కనఁబడనట్లు క్రమ్ముకొని, దాఁచుము = మఱుఁగుపఱుపుము, ఈ యాకునకున్ = ఈ జాబునకు - (తాటాకులపైని వ్రాత లన్నియు జరుగునాఁటి జాతీయము) నీకున్, పని = సంబంధము, ఏమి=ఏమి గలదు. (ఈ యుత్తరమునకు నీకు నేమి సంబంధము, అని అనిభావము) ఆ మహామహుఁడు = ఆగొప్ప తేజస్సు గలవాఁడు, లేక గొప్పసంతసము గలవాఁడు, (మహస్స=తేజస్సు, మహము = 1 సంతోషము 2 ఉత్సవము.) ఇంతియ, ఆ శకుంతకాంత = ఆ యాఁడుపక్షి, శుచిముఖి, శకుంతిని. పక్షి శకుని శకుంత శకున ద్విజాః - అమరము) అడంచినన్ = కప్పిపుచ్చినచో, ప్రాణసఖ్యంబు = ప్రాణసంబంధ మగుస్నేహము (కాని దేహసంబంధము కానిది.) భావించికొనుము = ఆలోచించుకొనుము, వల్లభుఁడు = ప్రియుఁడు, వాల్లభ్యంబునన్ = ప్రేమతో, అనిపిన పత్త్రిక = పంపినజాబు, భాగ్యవతులు = (అట్టి) అదృష్టము గల యింతులు, (అట్లనుపుట స్త్రీ సామాన్యమునకు దుర్లభ మన్నమాట) కులదేవతంబలెన్=గృహదేవతవలె, ఇలువేల్పువలె, ఇట్టటు చేయుటకంటెన్ = నలిపి పాడుచేయుటకంటె, అమంగళంబు = అశుభము - (ఇట పాడుచేయుట యని వాచ్యముగా ననక ఇట్టట్టుసేయుట అనుట సౌకుమార్యమను కావ్యగుణము) అని, అదరవైచియున్ = జడిపించియు, ('శుచిముఖికి పంపినయుత్తరమునకు నీకు సంబంధమేమి' మున్నగు వాక్కులచేత నని భావము.) బుజ్జగించియు =లాలించియు - ('నాచేతి కిమ్ము లేకున్న నీవు జాగ్రత్తగా దాఁచి యుంచుము మున్నగు పలుకులచే నని భావము.) బోధించియు=ఉపదేశము చేసియు ('ప్రియుఁడు ప్రేమతో స్వయముగా జాబు నంపుట యెంతటి యదృష్టమే' ఇది యందఱకు లభింపనిది. కావున నా జాబును నిలువేలుపువలెం బూజించుకొనునది మున్నగుపలుకులచేత నని భావము.) వారించెన్ = జాబును నలిపివేయకుండ మాన్చెను. (ఇఁక నటువంక పోయిన) అంచయున్ = శుచిముఖి, ఇంచుక దవ్వునన్ + అ = కొంచెము దూరమునందే, పదంబులన్ = కాళ్లచే, పొదిగి = ఆక్రమించి, క్రమ్మి, ఇట్టునట్టున్ = తప్పించుకొనుటకు, ఈవంకకు= నావంకకు, పెనంగుచున్ = లాగులాడుచు, చీకాకుపఱిచినన్ = కలఁతపెట్టగా, రేసి = కోపించి, (లేక చెలరేఁగి - అనవలెను. ఇట కోపించుట ఉచితము. కాని విజృంభణము కానేరదు. నిఘంటువులందు 'కోపించు' అనునర్థము కనఁబడదు) గడుసుంబులుంగ = ఓచెడుపిట్టా - ("కూళ గడు సన వర్తిల్లుఁ గుజను

పేళ్లు" అని యాంధ్రనామ సంగ్రహము. మానవ 11.) ఎక్కడెక్కడి లేఖలు = ఎందెందుఁగల జాబులు, (అక్కడ, ఇక్కడ, ఎక్కడ, అనునవి వృత్తియందు మాత్రమే వికల్పముగా నౌపవిభక్తికములు,) రక్కసుల ఱేని యాఁడుబిడ్డ = రాక్షసరాజుయొక్క కూఁతురు - ప్రభావతి, అందాఁకన్ = అంతవఱకు.

వ్యా. వి. :— తెమ్ము, తేవు. ఈరెండును తెచ్చుధాతువు నుండి వచ్చిన రూపములు. అందు - ప్రార్థనాద్యర్థమున - తెచ్చు + ము - అని యుండ, సూ. తే, తేరులు తెచ్చున కగు. బాల. క్రియా 93. చే. తెచ్చుధాతువునకు సర్వాదేశముగా 'తే' వచ్చి - తే + ము, తేరు + ము. అగును. తే+ము అనునది సూ. ముజ్ఝు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును, మువర్ణకంబునకు మానుడియునగు. బాల. క్రియా. 61. చే- తెమ్ము అగును. తేరుము అని రెండవ రూపమును సిద్ధించును. తేవు + ఏనిన్ - అనుదానిలోని 'తేవు' అనునది వ్యతిరేకార్థక మధ్యమైకవచనరూపము. తెచ్చు + లజీ - అనియుండ 'లజీ' ముత్తులలోనిదికాన 'తే తేరులు తెచ్చునకగు' అను పైసూత్రమున - తే + లజీ, అనియుండ లకారమునకు మధ్యమ వువర్ణక మాదేశమై, తేవు, అని అగును. తేరు ఆదేశమైనచో లజీ జీత్తుగాన తేర-అయి, వు చేరి, 'తేరవు' అని యగును. 'పుత్తెంచు'- పుచ్చు + తెంచు - సూ. అయ్యాది (తెంచు) పరంబగునపుడు చువర్ణంబు లోపించు. బాల. క్రియా. 112. ఇట 'చు' జాతిపరము కాన రెండుచకారములు లోపింపఁగా - పు + తెంచు-అని యయి, సూ. త్రికంబు మీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. బాల. సమాస 14. లోని బహుళగ్రహణముచే - నిటనిత్యద్విత్వము వచ్చి పుత్తెంచు, అగును. అని కొందఱమతము. పుచ్చు + తెంచు - అనునపుడు మీఁది బాల. క్రియా. 112 చే 'చు' వర్ణంబునకు మాత్రమే లోపంబురా 'పుచ్ + తెంచు' అని యుండ సూ. చకారంబునకు హల్లు రాఁ బరసవర్ణంబగు (హల్లురాన్ = హల్లుపరముకాఁగా) ఆంధ్రశబ్ద సంగ్రహము 5. (ప్రకీర్ణ) 63 సూ. చే. పరహల్లగు తకార సవర్ణమగు తకారము చకారమునకు ఆదేశమై, పుత్ + తెంచు - 'పుత్తెంచు' అని సిద్ధించినది అని కొందఱమతము. పోకడ మాలినతనంబు = పోకడ మాలిన దాని తనము. సూ. తన వర్ణకంబు పరం బగునపుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాష నగు. ప్రౌఢ. తద్ధిత. 2. గడుసుంబులుంగు. (గడుసు + పులుంగు) సూ. సమాసంబుల నుదంత స్త్రీ సమంబులకుం బుం,పులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. బాల. సంధి. 24. చేత - నుగాగమము ద్రుతకార్యములువచ్చి రూపసిద్ధి నొందును. వేవేగ - వేగ + వేగ - సూ. ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 40. లోని 'బహుళగ్రహణముచే 'ఇంచుక నాఁ' డిత్యాదులందలి యంతిమాక్షరంబునకు లోపంబు నగు. అను వృత్తివాక్యముచే 'వేగ' లోని 'గ' లోపింప - వేవేగ- అయినది. 'ఎక్కడికి' అను ముద్రితపాఠములు భ్రాంతిమూలకములు 'అక్కడ, ఇక్కడ, ఎక్కడ' అనునవి వృత్తిమాత్రమందే యౌపవిభక్తికములు. కాని పృథగ్గ్రహణమున ననౌపవిభక్తికములు. కాన 'ఎక్కడకు' అనునది సాధువు.

క. చంపినఁ జంపుము న న్నటు,గొంపో కుండినను జాలుఁ గొసర కదయతన్
జంపిన న న్నొకటిన మఱి,కొంపోయిన నెంద ఱె ట్లగుదురో యెఱుఁగన్. 143

అర్థము:—నన్నున్, చంపినన్ + చంపుము = చంపవలసిన యెడల చంపుము - అటు ఆ ప్రభావతి యున్నవైపునకు, కొంపోక + ఉండినను = తీసికొని వెళ్లకున్నచో, చాలున్ - కొసరక = సంకోచింపక, అదయతన్ = దయలేనివాని తనముచే - (అనఁగా నిర్దయముగా) - చంపినన్ = చంపుచో, నన్నున్, ఒకటిన్ + అ = ఒక్కదానినే (చంపుట యగు నని యధ్యాహారము) మఱి = అట్లుగాక, కొంపోయినన్ = తీసికొని వెళ్లినచో, ఎందఱు = ఎంతమంది, ఎట్లు = ఏ విధముగా, అగుదురో = అగుదురో కదా !

తాత్పర్యము:—నీవు నన్నుఁ జంపవలసినచోఁ జంపివేయుము. ప్రభావతియొద్దకు మాత్రము కొని పోకుము. చంపినచో నాయొక్క చావుతోనే తెమలును. కొనిపోయినచో నెంతమంది యేమగుదురో తెలియదు.

వి :—చంపినఁ జంపుము, చంపిన నన్నొకటిన - తెలుఁగు జాతీయములు.

వ్యా. వి:—కొనిపోవు - కొంపోవు - శబ్దపల్లవ క్రియారూపములు.

వ. అనుటయు, 144

అర్థము:—అనుటయున్ = చిలుక యిట్లు పలుకగా - శుచిముఖి - అధ్యాహారము.

క. నిను విడిచినఁ గొంపోయినఁ, బనికొదువలు లేమి సరియె ♦ పత్త్రిక చే జి
క్కినయది నీ విఁక నీడిగి,లిన నొచ్చుట మీఁదిమిక్కి-♦లి వివేకింపన్. 145

అర్థము:—పనికొదవలు = కార్యలోపములు, లేమి = లేకపోవుట, ఈడిగిలినన్ = ముందునకు రా నని మొండితనముచే దిగలాగినచో, వివేకింపన్ = ఆలోచింపఁగా, మీఁది మిక్కిలి = అధికము, (మీఁదు మిక్కిలి అని వ్యవహారము.)

తాత్పర్యము:—నిన్ను విడిచిపెట్టినను, ప్రభావతి యొద్దకుఁ గొనిపోయినను ఫలమొక్కటే. జాబు మాకు దొరకినది. కాన, మాకుఁ గావలసినపని దానితోనే పూర్తియగును. నీవు నాతో రాక యీడిగిలఁ బడితివా నీవు బాధపడుటమాత్రము మిగులునే కాని నిన్నుమాత్రము కొనిపోకమానను.

తే. వచ్చితేనియు విను ప్రభా♦వతి మనమున, కెట్టిగతినైన దయపుట్ట♦ నేను జెప్పి
నిన్ను విడిపింతు ననుచుఁ ద♦న్విడక బలిమిఁ,గొని చనంగ మరాళి కి♦ట్లనియెఁ జిలుక.

అర్థము:—సుగమము.

తాత్పర్యము:—వచ్చితివా ప్రభావతి మనసునకు దయపుట్టునట్లు చెప్పి నిన్ను నామెచే విడిపింతును. అంతియకాని విడుచు నధికారము నాకులేదు. అని సూచించి బలాత్కారముగా తీసికొని పోవుచుండ శుచిముఖితో చిలుక యిట్లనెను.

వి. :— ఎవరికో యెవ్వరో యుత్తర మంపిరని మాత్రమే కాని శుచిముఖి యది తనకు వ్రాసినదే యని తెలిసినయెడ చిలుకను బాధింపదు. సంభావించి యుండును. అట్లగుచో చంద్రవతీ గుణవతులకథ మఱొకరీతిగా జరిగియుండును. అందులకై పత్త్రిక క్రిందఁబడిన తోడనే శుచిముఖి నక్కడనుండి పంపి వేయుట యెంతయు సముచితము.

ఉ. ఏల చలంబు నీ వడిగె♦దేని వచించెద నాదుగోప్యమున్
బేలవె యార్చి తేళ్లఁ దలఁ♦బెట్ట రహస్యము దప్పు నన్నచోఁ
దాలిమిఁ గప్పిపుచ్చినను ♦ దద్గుణ మొక్కొకచో ఫలించు, నా
వేళఁబపంచుసేయ నొకవీసము ♦ గల్గదు హింస తప్పదున్. 147

అర్థము:—చలంబు = పట్టుదల, ఏల = ఎందులకు? నీవు, అడిగెదు + ఏని = అడిగితివా, నాదు గోప్యమున్ = నారహస్యమును - వచించెదను = చెప్పుదును, ఆర్చి = ఆడించి, తేళ్లన్, తలన్, పెట్టన్ = తేళ్లను తెచ్చి తలమీఁదఁ బెట్టఁగా - (నిర్బంధించి బాధింపగా నని భావము.) బేలవె = మూర్ఖురాలవా? నీవు మూర్ఖురాలవు కావు అని భావము. రహస్యము = దాఁపఁదగిన విషయము, (బయలు చేసినచో) తప్పును = చెడిపోవును, అన్నచోన్ = అను సమయమందు, తాలిమిన్ = ఓరిమితో, కప్పిపుచ్చినను =

మఱుఁగు పెట్టినయెడ, తగ్గుణము = ఆ దాఁచుటవలనఁ గలుగు మంచి, ఒక్కొక్కచోన్ = ఒకొక్కప్పుడు, ఫలించున్ = లాభించును, ఆ వేళన్ = అట్టి నిర్బంధించిన సమయమున, పపంచనేయన్ = వెల్లడిచేసిన యెడల, ఒక వీసమున్ = ఏకొంచెమును (వీసము = పదాఱవ భాగము) కల్గదు = లభింపదు, హింస + తప్పదు + ఉన్, హింసయున్ = ఆపదయును, తప్పదు.

తాత్పర్యము:—ఎందుల కీపట్టుదల ? నీ వడిగినచో నారహస్యమును జెప్పెదను. మూర్ఖురాలవు కావు. నీవు ఎందులకు నెత్తిపైఁ దేళ్లను పెట్టినట్లు నిర్బంధించి బాధింతువు ? దాఁపఁదగిన విషయము చెడు నని నప్పు డోపికతో దాఁచుటవలన నొకొక్కప్పుడు లాభించుటయుఁ గలదు. చెడు నట్టిసమయమున నిర్బంధమున కోర్వలేక వెల్లడించినచో లాభింపకపోవుటయే కాదు. ఆపదయును రావచ్చును; నీతో నారహస్యము చెప్పినచో లాభింపవచ్చును. లేదా కార్యము చెడుటయే కాక మావంటివారికిఁ గొందఱకు ప్రాణహానియు రావచ్చును. ఏది యెట్లయినను చెప్పెదను.

అలం. :—లోకోక్తి, అప్రస్తుతప్రశంస.

వ్యా. వి. :—ఆడు - ధాతువునకు ప్రేరణార్థమున చుగాగమము -ఆడు+చు. సూ. ఆ డోడు కూడుల డకారంబునకుం జుక్కు పరం బగునపుడు శేషం బగు. బాల. క్రియా. 80 చే. ఆరుచు, అర్చు=ప్రేరణేం చుక్కు పరంబగుచో ఆడించు అనియు నగును.

వి. :—పపంచు శబ్ద మే నిఘంటువులను గానరాదు. కాని ప్రపంచనము (విస్తరించుట) అను దానికి వికృతి శబ్దముగా నీకవి ప్రయోగించె ననుకొనఁదగును.

సీ. కావున నొక వివిక్తస్థలంబున నిల్పి, వినుము నాతెప్పెల్ల ♦ వినినవెనుక
నీకుఁ దోఁచినయట్లు ♦ గైకొని చేయుదు, గాని నావుడు హంస ♦ కాంత తనకు
నప్పటి కదియ కార్యముగ వివేకించి, చుట్టుపట్టుల నెందుఁ ♦ జెట్టు చేమ
లేక యొప్పెడు నొక్క ♦ లీలామహీధర, శిఖరంబుపై నిల్చి ♦ చిలుకఁ దనదు

పక్షములఁ బల్మిఁ బట్టి యాపత్త్రికాప్ర,కార మేమియు నీ వింకఁ ♦ గడమవెట్ట
కంతయును నాకు వినిపింపుమనుచుఁ బలికె, నంచతొయ్యలి కదియు నిట్లనుచుఁజెప్పె.

అర్థము:—కావునన్ = ఆకారణముచే, ఒకవివిక్తస్థలంబునన్ = ఒక జనములేనిచోట, నిల్పి = ఉంచి, వినుము = నేనుజెప్పునది యాలింపుము, నాతెప్పు, ఎల్లన్, వినినవెనుకన్ = వినినపిదప, కైకొని = గ్రహించి, నీకున్, తోఁచినయట్లు, చేయుదుగాని = చేయుదువుగాని, చేయవచ్చును. నావుడున్ = అనుటయును, హంసకాంత = ఆఁడుహంస (శుచిముఖి) తనకున్, అప్పటికిన్ = ఆసమయమునకు, అదియ = చిలుక చెప్పినదియే, కార్యముగన్ = చేయఁదగినదిగా, వివేకించి = ఆలోచించి , చుట్టు పట్టులన్ = చుట్టుగల చోట్లయందు, ఎందున్, చెట్టుచేమ = పెద్ద, చిన్న చెట్లు (చేమ ఊఁతపదము) లేక, ఒప్పెడు లీలామహీధర శిఖరంబుపైన్ = ఉన్న క్రీడాపర్వతముయొక్క అగ్రమందు, నిల్చి, చిలుకన్, తనదుపక్షములన్ = తన ఱెక్కలచే, బల్మిన్ = బలముకొలఁది, పట్టి = నొక్కిపట్టి, నీవు, ఆపత్త్రికా ప్రకారము = ఆయుత్తరము సంగతిని= ఏమియున్ = ఏకొంచెమును, కడమ + పెట్టక = మిగుల్పకుండ, నాకున్, వినిపింపుము, అంచున్, పలికెను, అదియున్ = ఆచిలుకయును, అంచతొయ్యలికిన్ = హంసితో, ఇట్లు, అనుచున్ = చెప్పెను.

తాత్పర్యము:—రహస్యము వెల్లడియైనఁ బ్రమాదము కల్గును. కాన నొక రహస్యస్థలమున నన్ను నిలిపి నాతెప్పెదియో విన్ని నీకు తోఁచినట్లు చేయు మనఁగా - నాశుచిముఖి ఆ సమయమున కదియే తలంచిదని

రొయెంచి చుట్టుపట్ల చెట్టుచేమ లేని యొక క్రీడాపర్వతము కొనపై వ్రాలి, చిలుకను తన ఱెక్కలతో గట్టిగాఁ బట్టుకొని, యాయుత్తరమునంగతి యంతయును జెప్పు మనఁగా చిలుక దానితో నిట్లనెను.

క. ద్వారక యనుపురమున కొక, కారణమున నేఁగి నేను గ్రమ్మఱి రాఁగా
జారుతరమూర్తి యొకఁ డొకఁ, డారామములో నతివ్యథాకులుఁ డగుచున్. 149

అర్థము:—క్రమ్మఱి = మరలి, రాఁగా = వచ్చుచుండఁగా, చారుతరమూర్తి = మిగులసుందరమగుదేహముగలవాఁడు, ఆరామములోన్ = పూలతోఁటయందు, అతివ్యథాకులుఁడు = గొప్పవెతచే కలఁత నొందినవాఁడు, అగుచున్.

తాత్పర్యము:— నేను ద్వారకాపురమున కొక పనిమీఁదఁబోయి, తిరిగివచ్చుచుండ నచట నొక పూఁదోఁటలో నొకయందగాఁడు మిగుల మనస్తాపమునొందుచు - ఈ క్రిందివిధమున పలుకుచుండెను.

సీ. కృప నెఱింగింపరే కీరోత్తమములార, వజ్రపురికిఁ బోవువారె మీరు
సదనుగ్రహమునఁ దుమ్మెదలార చెప్పరే, వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁగదరె కోయిలలార, వజ్రపురికిఁ బోవువారె మీరు
తెలుపరే దయఁ జూచి మలయవాయువులార, వజ్రపురికిఁ బోవువారె మీరు

చలువలొసఁగెడు మేఘరాజంబులార, యమలపక్షత నొప్పు రాయంచలార
నిలిచి నామాటలకు మాఱుపలుకరయ్య, వజ్రపురికిని బోయెడువారె మీరు. 150

ఈ పద్యము వ్యాఖ్యానింపఁబడినది. చూ. 3 ఆశ్వాసము. 28.

వ. అని కన్నకన్నవారి నెల్లఁ బ్రార్థించుచుండ విని దయపుట్టి యేల పలవరించెదు? వజ్రపురంబునకు నేఁ బోయెడుదాన నావలన నయ్యెడుకార్యంబుఁ జెప్పు మనిన నత్యాదరుండై. 151

అర్థము:—అని, కన్న కన్నవారిన్ + ఎల్ల = తనకంటికిఁ గనఁబడినవారినెల్లను - (జాతీయము కావచ్చును.) అతి + ఆదరుండు + ఐ = మిగులగౌరవముగలవాఁడై.

తాత్పర్యము:—అని కంటి కగపడినవారి నెల్ల ప్రార్థించుచుండఁగా నేను విని జాలినొంది అట్లేందులకు పలవరింతువు? నేను వజ్రపురమునకు వెళ్లెడిదాననే - నావలన నీకేమిపనికావలయు ననఁగా నాతఁడు మిగుల నాదరముతో ముందుచెప్పఁబోవురీతిని చెప్పెను.

వి. :—కన్నకన్నవారిని - అత్యాదరమునద్విరుక్తి. నలువంకల చూచినవారినెల్ల - అనునర్థమున ప్రయుక్తమనుకోఁదగును.

## ఆశ్వాసాంతము

శా. శ్రౌతస్మార్తపథానువర్తన పరిష్కారాత్మ వర్ణాశ్రమ
స్ఫీతాచారపవిత్రమూర్తి శమగాంభీర్య క్షమా సత్య ని
ష్ఠాతుష్ట్యాది గుణోరుకీర్తి, సముదంచ న్నీతివిద్యా మహా
చాతుర్యాపరకావ్యుఁ డార్యజనతాసంభావ్యుఁ, డత్యంతమున్. 152

అర్థము :—శ్రౌత ... మూర్తి - శ్రౌత = వేదములచేఁ జెప్పఁబడినదియు, స్మార్త = మన్వాది స్మృతులచేత జెప్పఁబడినదియునగు, పథ = మార్గముయొక్క, అనువర్తన = అనుసరణము, పరిష్కార = అలంకారముగాఁగల, ఆత్మ = తనయొక్క, వర్ణ = జాతియొక్కయు, ఆశ్రమ = ఆశ్రమములయొక్కయు, స్ఫీత = అధికమైన, ఆచార = నడవడిచేతను, పవిత్ర = పావనమైన, మూర్తి = దేహముగలవాఁడు, శమ ... కీర్తి - శమ = మనోనిగ్రహము, గాంభీర్య = లోఁతుగుండెతనము (కలఁతనొందుటకు కారణమున్నను మార్పులేకుండుట) క్షమా = ఓర్పు, సత్యనిష్ఠా = సత్యమందలి నిలుకడ (ఏమైనను నిజము నే పలుకుట) తుష్టి = సంతోషము, ఆది = మొదలుగాఁగల, గుణ = గుణములచేత, ఉరు = గొప్పదగు, కీర్తి = కీర్తిగలవాఁడు, సముదంచ ... కావ్యుఁడు - సముదంచత్ = మిక్కిలి యొప్పుచున్న, నీతి విద్యా = నీతిశాస్త్రమందలి, చాతుర్య = నేర్పునందు, అపరకావ్యుఁడు= రెండవ శుక్రాచార్యుఁడును, అత్యంతమున్, ఆర్యజనతాసంభావ్యుఁడు = సద్గుణములచేత పూజ్యులగు జనసముదాయమునకు గౌరవింపఁ దగినవాఁడు, (అమరామాత్యుఁడు.)

తాత్పర్యము :—శ్రుతులందును, స్మృతులందును జెప్పఁబడినప్రకారము తన వర్ణాశ్రమముల లను సక్రమముగా నాచరించువాఁడును, శమదమాది సద్గుణములచే విఖ్యాతినొందినవాఁడును, నీతిశాస్త్ర జ్ఞానము విషయమున శుక్రాచార్యునంతవాఁడును (శుక్రుఁడు రాజనీతిశాస్త్రకర్త) పూజ్యులకుఁ బూజ్యుఁడును, (అగు అమరామాత్యుఁడు).

క. చారిమకారి మహత్తర, గౌరిమహారి మహనీయ గాఢయశుఁడు గం
భీరిమ వారినిషాదుఁడు, భూరిమదారి మహిమవ్యపోహకుఁ డెపుడున్. 153

అర్థము :—చారిమకారి = సొగసును గలిగించునట్టియు, గౌరిమ హారి = తెల్లదనముచే మనోహరమైనట్టియు, మహనీయ = పూజింపఁ దగినదియు, గాఢ = దట్టమైనదియు నగు, యశుఁడు = కీర్తిగలవాఁడు, గంభీరిమ = గాంభీర్యమునందు, వారినిషాదుఁడు = సముద్రుఁడు, భూరిమద = ఎక్కువమదము గల, అరి = పగవారియొక్క, మహిమ = గొప్పతనమునకు, వ్యపోహకుఁడు - వి + అప + ఊహకుఁడు= అణఁచువాఁడు, అందమైన, స్వచ్ఛమైన పూజ్యమైన, దట్టమైన, కీర్తిగలవాఁడును, సముద్రమువలె గంభీరుఁడును, కామాద్యరిషడ్వర్గము నిర్మూలించినవాఁడును, (అగు అమరమంత్రి)

వి. :—ఈ పద్యమున 'గంభీరి మదారి నిషూదుఁడు' అనియు, గంభీర మదారి అనియు రెండు పాఠము లగపడుచున్నవి. దీనిపై విశేషణము శత్రువిజేత యని యుండుటచే నిది పునరుక్తి కావలయును. మఱియు గంభీరి - అనునది విచార్యము. ఇంక నిందలివారు బహిశ్శత్రువు లనియు మీఁది విశేషణమునకుఁ జెప్పఁబడిన వా రంతశ్శత్రువులనియు నెట్లో సాధింపఁ జూచినచో శబ్దాలంకారమునకు వైరూప్యము కలుగును. చారిమ, గౌరిమ, (గం) భీరిమ, భూరిమ - అని కవియాశమైనట్లు స్పష్టము. కావున నీ పాఠములు రెండును గూడ ప్రామాదికములై యుండు నని 'వారి నిషాదుఁడు' అయియుండునని వ్యాఖ్యానింపఁ బడినది. గాంభీర్యమున సముద్రునితోడను, గంగాదినదుల తోడను బోల్చుట కవి సమయము ('సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవానివ' రామాయణము. గంగానది వర్ణించుచు విశ్వగుణాదర్శనమున 'గాంభీర్యేణ గదాధరస్య హృదయం మాధుర్య త స్తద్గిరం' అనియు గలదు. కావున — 'దారి నిషాదుఁడు' అన నర్థమేమియుఁ గుదురక - 'వారి నిషాదః వారీణి నిషీదంత్యస్మిన్ ఇతి' అనువ్యుత్పత్తిచెప్పి, సముద్రముఅని వ్యాఖ్యాతము. 'రామాయణమున' మానిషాద ప్రతిష్ఠాం' అను శ్లోకవ్యాఖానమున మా లక్ష్మీర్నిషీదత్యస్మిన్ - మానిషాదః = లక్ష్మీస్థానం, అనియుండుటయు, వారిధి, అబ్ధి, ఉదధి, మున్నగునవి వారి నిషాద శబ్దార్థబోధకము లగుటయు దీని కాధారములు.

స్రగ్విణి. ఇందు పూతక్రతాయీతనూ జార్థరా, ణ్ణందన స్వాంతభూనైషధేళాసుతా
మందసౌందర్య సంస్మారకాకార సం, స్పందిత స్త్రీధృతిప్రాభవుం డెంతయున్.

అర్థము:--ఇందు ... ప్రాభవుండు - ఇందు=చంద్రుని యొక్కయు, పూతక్రతాయీ తనూజ = (శచీదేవియొక్క కొడుకగు) జయంతుని యొక్కయు, అర్థరాట్ +నందన= (ధనపతియగు కుబేరునికొడుకగు) నలకూబరునియొక్కయు, స్వాంతభూ = (మనసునఁ బుట్టువాఁడగు) మన్మథునియొక్కయు, నైషధ=(నిషధ దేశమునకు రాజగు) నలునియొక్కయు, ఇళాసుత = (ఇలుఁడనురాజు పార్వతీశాపమున స్త్రీత్వము నొంది 'ఇళా' నామధారియైనప్పుడా ఇళకు కొడుకైపుట్టిన) పురూరవసునియొక్కయు, అమంద = అధికమగు, సౌందర్య = చక్కఁదనమునకు, స్మారక = తలపింపఁజేయునట్టి, ఆకార = రూపముచేత, సంస్పందిత = చలింపఁజేయఁబడిన, స్త్రీ = స్త్రీలయొక్క, ధృతిప్రాభవుండు = ధైర్యాతిశయము గలవాఁడు.

తాత్పర్యము:—చంద్ర, జయంత, నలకూబర, మన్మథ, నల, పురూరవసులయొక్క చక్కదనమును స్మరింపఁజేయు తనయాకారముచేత స్త్రీల ధైర్యమును జలింపఁజేయువాఁడును. (స్త్రీల మనస్సును చలింపఁ జేయు లోకోత్తర సౌందర్యముగలవాఁ డన్నమాట).

వ్యా. వి. పూతక్రతాయీ - పూతాః క్రతవః యేన, పూతక్రతుః - క్రతువులు పవిత్రమొనర్చువాఁడు పూతక్రతువు = ఇంద్రుఁడు, అతనిభార్య - అను నర్థమున 'పూతక్రతోరైచ' అను పాణినీయము చొప్పున ఐకారమును, ఙీప్రత్యయమును రాఁగా 'పూతక్రతాయీ' అని సిద్ధించినది.

## గ ద్య ము

ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ
సౌజన్యగేయ, సూరయనామధేయ ప్రణీతం బైన ప్రభావతీప్రద్యుమ్నం
బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# ప్రభావతీ ప్రద్యుమ్నము

## సవ్యాఖ్యానము

### చతుర్థాశ్వాసము

క. శ్రీరుచిరతరుఁడు విమలా,చారధురంధరుఁడు సుకవి సముదయగోష్ఠీ
సారస్యపరుఁడు పింగళి,సూరనయమరార్యవరుఁడు సురగురుఁ డుక్తిన్. 1

అర్థము:—పింగళిసూరన యమరార్యవరుఁడు = పింగళిసూరనయొక్క కొడుకైన యమరయ్య యను పరమపూజ్యుఁడు, శ్రీ...తరుఁడు - శ్రీ = సిరులచేత (లేదా - శరీరశోభచేత), రుచిరతరుఁడు = మిగుల మనోహరుఁడు, చక్కనివాఁ డని భావము. సుకవి...పరుఁడు - సుకవి=ఉత్తమకవులయొక్క, సముదయ= సంఘముయొక్క, గోష్ఠీ = సభలయందలి, సారస్య = సరసతయందు - రసజ్ఞతయందు, పరుఁడు = ఆసక్తుఁడు, ఉత్తమకవుల సభలయందు వారితో సల్లాప మొనర్చి యందలి రసజ్ఞతఁ గ్రహింప నిచ్ఛగలవాఁడు, ఉక్తిన్ = మాటాడుటయందు, సురగురుఁడు = బృహస్పతి.

అలం:—ఉల్లేఖము.

వ. ఆరామవర్తియైన కుమారోత్తముండు నన్నుం జూచి యోచిలుకలకులభూషణంబ నాకు నీవలన నయ్యెడు ప్రయోజనంబు విను మా వజ్రపురంబున శుచిముఖియను రాజహంసి గలదు. దాని నరసి యొక్కలేఖ యందింపవలయు ననియె నే నతని యతిదైన్యాతిభారంబు భావించి కారుణ్యపరవశత్వంబు నొందిన దాననై తక్కిన యాగాములు లెక్కసేయక యీకమ్మ హంసి కిచ్చు టెంతియకదా యని కొంచు వోయిన నెంతతప్పు వాటిల్లెడు ననుతలంపున నియ్యకొని యయ్యాకు పత్త్రంబు లోన లీనంబుగాఁ గట్టించుకొని వచ్చి యిప్పువ్వుఁదోఁటలోని కొలంకులు కలహంస కుల కలకలాకులంబు లగుటయుఁ దత్కన్యకాపరిచయంబున నున్న నిన్నుఁ బరికించి.

అర్థము:— ఆరామవర్తి = పూఁదోఁటయందు చరించుచున్నవాఁడు, ఐనకుమారోత్తముండు = అయినట్టి కుమారులలో శ్రేష్ఠుఁడగు నతఁడు, చిలుకల కులభూషణంబు + అ = చిలుకలయొక్క కులమున కలంకారమైనదానా! ప్రయోజనంబు = కార్యము, రాజహంసి = కాళ్లు, ముక్కును నెఱ్ఱగనుండు తెల్లని యాఁడుహంస. (ని. రాజహంసాస్తు తే చంచు చరణై ర్లోహితాస్సితాః అని అమరము. రాజహంసస్య స్త్రీ రాజహంసీ.) కారుణ్యపరవశత్వంబునన్ = దయకు వశమగుటచేతను, (కరుణః = కరుణావాన్, తస్య భావః కారుణ్యమ్, బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞ్ అని అమర సుధావ్యాఖ్య) కరుణము = కరుణగలది, దానిభావము కారుణ్యము, ఔగాములు = అవుటయు కాకుండుటయు (అగుట - అవుట - ఔట. అగు ధాతు భావార్థక రూపాంతరములు. సూ. భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు ప్రౌఢ. సమాస. 31. చే టవర్ణకములోపించి 'ఔ+కామి' అయి గసడదవాదేశముచే, ఔగాములు అయినది.) కొంచువోయినన్ = వెనుదీసినయెడ - కొంచు:—నానా. 1 కొంకు, సందేహము, 2 తక్కువ, లోపము,

3 మదము, గర్వము, 4 ముఱికి, చెమట, (కొంచుఁబోయిన అను ముద్రిత పాఠములు ప్రామాదికములు.) ఇయ్యకొని = అంగీకరించి, ఆకు = జాబు - పతత్త్రింబులోనన్ = (పక్షి) ఱెక్కయందు, లీనంబు = అణఁగియున్నది, కలహంసకుల కలకలాకులంబులు = కలహంసల గుంపుయొక్క కోలాహలముచేత వ్యాప్తమైనది, తత్కన్యకాపరిచయంబునన్ = ఆకన్యయగు ప్రభావతియొక్క స్నేహముతో.

గీ. ఇచటశుచిముఖియనుహంస యీగడయొక,కొంత దొరకునోయంచు నక్కుజమునందు
నొయ్య నిలిచితి నంతనె యురిని దగులు,కొంటి లో నైతి నీపాట్లకున్ మరాళి. 3

అర్థము:— ఈగడ = జాడ, ఆ + కుజమునందున్ = ఆచెట్టునందు, ఒయ్యన్ = మెల్లగా, ఈపాట్లకున్ = ఈ బాధలకు, లోనైతిన్ = వశమైతిని.

తాత్పర్యము:—ఆకన్యకచెంత నీ వగపడినంత (హంసివగుటచే) ఇచట శుచిముఖిజాడ కొంత తెలియు నేమో యని యాచెట్టుమీఁద వ్రాలి యురిఁ దగుల్కొని యీబాధలలోఁ బడితిని.

వ. అని చెప్పుటయు. 4

క. తన కార్యమ యది యగుటకు, ననయము ముద మొదవ మదిన యడఁచి యిది యెఱిం
గినయది యింతియ కావల,యును బత్త్రికచంద మింత యొనరునె యనుచున్. 5

అర్థము:—అది తన కార్యము + అ = తనకు సంబంధించినపనియే, అగుటకు, అనయము = మిక్కిలి, ముదము = సంతసము, ఒదవన్ = కల్గఁగా, మదిన్ + అ = మనసునందే, అడఁచి = అడఁచుకొని, ఇది ఎఱింగినది, ఇంతియ = ప్రద్యుమ్నుఁడు జాబిచ్చుట తాను తెచ్చుట మాత్రమే, కావలయును, పత్త్రిక చందము=ఆ జాబు విధము, ఇంత + ఒనరునే = ఇంతఅనుకూలముగా నున్నదే, అనుచున్.

తాత్పర్యము:—చిలుక యట్లు చెప్పఁగా విని హంసి ఆపని తనదే యగుట కెంతో సంతసము కలుగ మనస్సుననే యడఁచుకొని, 'యీ చిలుక జాబిచ్చుట తెచ్చుట మాత్రమే యెఱిఁగినది కావలయును. ఉత్తరము సంగతి యింత యనుకూలముగానున్నదే. మీఁది కన్వయము.

వ. కావున నింక నీ పత్త్రికాప్రసంగంబు నిస్సారంబుగాఁ బోనాడి ప్రసంగాతరంబున మఱపించి విడిచెద నని హంసి చిలుక కిట్లనియె. 6

అర్థము:—కావునన్, ఈ పత్త్రికాప్రసంగంబు = ఈ యుత్తరముప్రస్తావనము, నిస్సారంబుగాన్ = సారము లేనిదిగా - ముఖ్యము కానట్లు, పోనాడి = నిందించి, (లేక తృణీకరించి) ప్రసంగాంతరంబునన్ = మఱొక మాటలు తలపెట్టుట చేతను, మఱపించి = మఱచిపోవునట్లుచేసి.

ఆ. పక్షిపేర వ్రాసి పత్త్రిక యనిపెడు, నట్టివాఁడు భ్రాంతుఁ డగుట నిజము
నా కతం డనిపిన యాకమ్మ యె ట్లుండె, నేమి మిగుల నొరసి యడుగ. 7

అర్థము:—పక్షిపేరన్=పక్షియొక్క పేరుపెట్టి, పత్త్రిక=జాబు, అనిపెడు నట్టివాఁడు, భ్రాంతుఁడు = బుద్ధినిలుకడలేనివాఁడు, వెఱ్ఱివాఁడు, అగుట, నిజము. నాకున్, అతండు, అనిపిన కమ్మ = పంపినజాబు, మిగులన్, ఒరసి = ఒత్తుడుచేసి, అడుగన్ = (ఆ జాబును గూర్చి) అడుగుటకు, ఎట్లు + ఉండెన్ + ఏమి = ఎట్లున్న నేమి ప్రయోజనము. ప్రయోజనము లే దని భావము.

క. నీ వాపురికిని మొదలం, బోవం బని యేమి చెప్పుము యథార్థముగా
నా వుడును నీళ్లు నమలుచు, నా విహగము చెప్పఁ గొంక నంచయు దానిన్. 8

అర్థము:—మొదలన్ = ముందు, నీవు, ఆపురికిని = ఆ ద్వారకకు, పోవన్, పని, ఏమి=ఏమి కల్గెను, యథార్థముగాన్ = నిజముగా, చెప్పుము, నావుడును = అని పలికిన పిదప, ఆ విహగము (విహాయసమున= ఆకసమునఁ బోవునది విహగము) చిలుక, నీళ్లునమలుచున్ = మ్రింగుటయే కాని నమలుట యక్కఱ లేని నీళ్లను నమలి నట్లు, "నేనా ? అక్కడకా" అని యిట్లు ప్రయోజనములేని మాటలు పలుకుచు, చెప్పన్= (నిజము) చెప్పుటకు, కొంకన్ = జంకఁగా, అంచయున్ = శుచిముఖియు, దానిన్ = ఆ చిలుకను. మీఁది కన్వయము.

ఆ. బిగియఁ బట్టి యెందు బెణఁకనీ కడిగె నే, యర్థ మింముఁ గలదొ యను తలఁపున
జడియ కదియుఁ జత్తు సరిపోదు మాటపట్టీక చెప్ప ననుచు వీఁక నుండె. 9

అర్థము:—బిగియన్ + పట్టి = గట్టిగాఁ బట్టుకొని, ఎందున్ = ఏ కొంచెమందును, బెణఁకనీక = కదలనీయక, ఏయర్థము = ఏమి సంగతి, ఇందున్ = ఈ చిలుక యొక్క సందేహమునందు, కలదొ, అను తలంపునన్, అడిగెన్, అదియున్ = ఆ చిలుకయును, జడియక = బెదరక, చత్తున్ = చచ్చిపోదును, సరిపోదున్ = నశింతును, (అంతియకాని) మాటపట్టు + ఈక = ఒట్టుపెట్టుకొననిదే, చెప్పను, అనుచున్, వీఁకన్ = దైన్యముతో, (లేక తెగువతో) ఉండెన్.

తాత్పర్యము:—ఈ చిలుక సందేహించుటలో నే మర్థమున్నదో యని గట్టిగా నొక్కి పట్టుకొని కదలనీయక యడుగఁగా ఆ చిలుకయు చత్తును, నాశన మగుదు నంతియకాని శపథము చేసినఁగాని చెప్ప నని తెగువతో నుండెను.

వి. :—సరిపోవు, మాటపట్టిచ్చు - జాతీయములు.

ఆ. నవనిధానములును దవిలి యిచ్చి న నైన, మెడలమీఁదఁ గత్తి యిడిన నైన
జాల రనఘచరితు లేలినవారి ర,హస్యభంగమునకు ననుమతింప. 10

అర్థము:—తవిలి=వెనుకొని, నవనిధానములును = కుబేరుని తొమ్మిది నిధులును, (పాఁతఱలును) - ఇచ్చినన్ + ఐనన్ = ఇచ్చినప్పటికిని, మెడలమీఁద, కత్తి, ఇడినన్ + ఐనన్ = (నఱకుటకు) పెట్టి నప్పటికిని, అనఘ చరితులు = మంచి నడతగలవారు, ఏలినవారి రహస్యభంగమునకున్ = తమ్మును బోషించువారి యేకాంతపు విషయముయొక్క హానికి, అనఁగా, తమ ప్రభువుల రహస్యవిషయములను బయలుపఱచుటకు, అనుమతింపన్ + చాలరు = ఒప్పుకొనలేరు.

తాత్పర్యము:—ప్రేమతో కుబేరుని నవనిధులను దెచ్చి యిచ్చినను సరే, కత్తియెత్తి నఱక సిద్ధమైనను సరే మంచిప్రవర్తన గలవారు తమ్ముఁ బోషించువారి రహస్యవిషయమును వెలిపుచ్చ నొప్పుకోఁ జాలరు.

అలం:—అప్రస్తుత ప్రశంస.

వి. :—నవనిధులు: మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, ఖర్వము (ఖర్వమునకుబదులు వరము అని కొందఱు) ఇవి కుబేరునివి.

వ. హంసియు దానికి మాటప ట్టిచ్చె నదియు నిట్లని చెప్పె. 11

అర్థము:—మాటపట్టిచ్చె = శపథముచేసెను, ఒట్టుపెట్టుకొనెను.

క. వినుము వజ్రనాభుతమ్ముఁడు, సునాభుఁ డను ఘోరరాక్షసుండు గలఁడు త
త్తనయలు గల రిద్దఱు సొబ,గున నధికలు చంద్రవతియు గుణవతియు ననన్. 12

అర్థము:—వినుము, వజ్రనాభుతమ్ముఁడు, సునాభుఁడు, అను=అనుపేరుగల, ఘోరరాక్షసుఁడు = క్రూరుఁడైన రక్కసుఁడు, కలఁడు = ఉన్నాఁడు, చంద్రవతియున్, గుణవతియున్, అనన్ = అనఁగా - అనుపేళ్లతో, సొబగునన్ = చక్కఁదనమందు, అధికలు = గొప్పవారగు, తత్తనయలు = ఆసునాభుని కూఁతులు, ఇద్దఱు, కలరు = ఉన్నారు.

తాత్పర్యము:—వినుము వజ్రనాభుని తమ్ముఁడు క్రూరుఁ డగు నసురుఁడు సునాభుఁ డనువాఁ డున్నాఁడు. వాని కిద్దఱు కూఁతులు. మిగుల చక్కనివారు. చంద్రవతి గుణవతి అని వారిపేళ్లు.

చ. అతఁ డొకనాఁడు నారదు విహారవశంబున నాత్మసత్సభా
గతుఁ డగువాని సద్వినయ గౌరవపూజలఁ దన్పి సౌవిద
ప్రతతులఁ గూర్చి లోపలికిఁ బంచెను దేవులు నక్కుమారికా
ద్వితయము మ్రొక్కి రాతనికి దీవన లందుటకై వినీతితోన్. 13

అర్థము:—అతఁడు = ఆసునాభుఁడు, ఒకనాఁడు, విహారవశంబునన్ = వేడుకగాఁ దిరుగుటకు లోఁగినవాఁ డయి, వేడుకగాఁ దిరుగుచు నని భావము, ఆత్మసత్సభాగతుఁడు+అగువానిన్ =తన యుత్తమమైన సభను పొందినవానిని - అనఁగా తన సభకు వచ్చినవానిని అని భావము, నారదున్ = నారదమునిని, సద్వినయ గౌరవపూజలన్ = యోగ్యమగు నడఁకువచేతను, గౌరవ = గారవించుటచేతను, పూజలన్ = అర్ఘ్యపాద్యాదుల నొసఁగుటచేతను, తన్పి = తృప్తిపఱచి, సౌవిదప్రతతిన్ =కంచుకుల గుంపును, కూర్చి= సాయమిచ్చి, లోనికిన్ =తన ఇంటిలోపలికి, పంచెను = పంపెను, దేవులును = పట్టపురాణులును, అక్కుమారికాద్వితయమున్ = ఆ చంద్రవతీ గుణవతు లిద్దఱును, దీవనలు, అందుటకై, వినీతితోన్ = వినయముతో, ఆతనికిన్ = ఆ నారదునకు, మ్రొక్కిరి. (సౌవిదులు - సౌవిదల్లులు = అంతఃపురపుఁ గావలివారు.)

తాత్పర్యము:—ఒకనాఁడు విహారార్థము తనసభకు వచ్చిననారదు నాసునాభుఁడు వినయముతో గౌరవము చూపుచు పూజించి యంతఃపురపుఁగావలివారిని తోడిచ్చి లోపలికి పంపఁగా, రాణులును చంద్రవతీ గుణవతులును దీవెన లందఁగోరి యాయనకు మ్రొక్కిరి.

సీ. ఇవ్విధమ్మున నమ్మునీశ్వరుఁ బూజించి, యతని యాశీర్వాదము లందుటకును
దన యంతిపురమువారిని సునాభుఁడు నియ, మించి పంచిన పరమేష్ఠిసుతుని
వారును వివిధోపచార పూజలచేత, సంతుష్టుఁ జేయుచోఁ జంద్రవతియు
గుణవతియును భక్తిఁ బ్రణమిల్లఁ బతిమనో, వల్లభలై పుత్రవతుల రగుచు

నొప్పుఁ డనుచును దీవించె నప్పు డచటి, దాదు లోమునివర్య యీతలిరుఁబోండ్ల
కధిపు లెవ్వారు వారల నానతిండు, నావుడును గొంత చింతించి నారదుండు. 14

అర్థము:— మీఁది పద్యార్థమందుఁ గొంత గ్రహింపఁబడి, తరువాత విషయము చెప్పఁబడుచున్నది. సునాభుఁడు, ఇవ్విధమునన్ = వినయపూర్వకముగా, గౌరవించి = పూజించి, అతని యాశీర్వాదము = ఆ నారదుని దీవనలు, అందుటకున్=పొందుటకు, తనయంతిపురమువారిని=తన యంతఃపుర రక్షకులను, నియమించి = లోనికిఁ గొనిపోవ నేర్పాటుచేసి, పంచినన్, పరమేష్ఠిసుతుని = బ్రహ్మపుత్రుని, నారదుని, వారును = అంతిపురమందలి రాణులు మున్నగువారు, వివిధ + ఉపచార + పూజల చేతన్ = పెక్కువిధము లగుసేవలచేతను, సత్కారములచేతను, సంతుష్టున్ = సంతసించిన వానినిగా, చేయుచోన్ = చేయునప్పుడు, చంద్రవతియున్, గుణవతియును, భక్తిన్, ప్రణమిల్లన్ = మ్రొక్కఁగా, పతిమనోవల్లభలు + ఐ = (మీమీ) భర్తలయొక్క మనస్సులకు ప్రియులై - (ప్రేమస్థానములై అని భావము) పుత్రవతులు = కొడుకులు గలవారు, అగుచున్, ఒప్పుఁడు, అనుచును, దీవించెన్, అప్పుడు, అచటి దాదులు = అచటనున్న (వారిని పెంచిన) దాసీజనము, (ధాత్రి యన పెంపుడు తల్లి - తద్భవము - దాది.) ఓ మునివర్య = మునులలో శ్రేష్ఠుఁ డగునో నారదా! ఈతలిరుఁబోండ్లకున్ = (చిగురాకువంటి మేనులుగల) ఈయింతులకు, అధిపులు = భర్తలు, ఎవ్వారు = ఎవరు, (అగుదురో) వారలన్, ఆనతిండు = సెలవిండు చెప్పుఁడు. నావుడును = అనినపిదప, నారదుండు, కొంత = కొంచెముసేపు, చింతించి = ధ్యానించి. మీఁది కన్వయము.

వ్యా. వి. :—ఆనతి + ఇండు. సూ. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు. బాల. సంధి. 5 చే ఆనతిండు, ఆనతియిండు - అగును.

మత్తకోకిల. వీరి కిద్దఱకుం గ్రమంబున ♦ విస్ఫురద్గుణశోభితుల్
ద్వారకానగరాశ్రయుల్ యదు♦వంశజుల్ గదసాంబు ల
న్వారు నాథులు కాఁగలా రని ♦ వారి కానతియిచ్చె, న
న్నారదోక్తికి వారు చిత్తము♦నన్ విచారము సంధిలన్. 15

అర్థము:—విస్ఫురద్గుణశోభితుల్ = ప్రకాశించుచున్న (శౌర్యధైర్యాది) గుణములచే నలంకరింపఁబడినవారును, ద్వారకానగరాశ్రయుల్ =ద్వారకయను పురము వాసస్థానముగాఁ గలవారును, యదువంశజుల్= యాదవవంశమునఁ బుట్టినవారును (అగు) గదసాంబులన్వారు = గదుఁడు సాంబుఁడు - అను పేళ్లు గలవారు, వీరికిన్, ఇద్దఱకున్, క్రమంబునన్ = వరుసగా - చంద్రవతికి గదుఁడును, గుణవతికి సాంబుడును, నాథులు = భర్తలు, అయ్యెదరు, అని, వారికిన్=ఆదాదులకు, ఆనతి యిచ్చెను = చెప్పెను. అన్నారదోక్తికిన్ = నారదుని యాపలుకునకు, వారు = ఆదాదులు, చిత్తమునన్ = మనస్సునందు, విచారము = వగ, సంధిలన్ = కలుగఁగా, మీఁది కన్వయము.

వి. :—విచార శబ్దమునకు సంస్కృతమున, ఆలోచన, తీర్పు మున్నగునర్థములు కలవు. తెలుఁగున 'సంతాపము' అను నర్థమునఁగూడ వ్యవహరింపఁబడినది.

వ్యా. వి. :—కాఁగల+వారు. సూ. ఉన్న, కల, న, వర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపంబు విభాష నగు. బాల. క్రియా, 117 చే. వకారములోపింప 'కాగల+ఆరు' అని కాఁగా, బహుళగ్రహణముచే అత్తునకు నిత్యసంధియయి 'కాఁగలారు' అను రూపము సిద్ధించును. అనువారు. సూ. అను, కొను లోనగు ధాతుజ విశేషణంబుల యంత్యాకారంబునకు హల్లు పరం బగునపుడు లోపంబు వైకల్పికంబు. ప్రౌఢ. సంధి. 13, చే - 'అన్వారు' అగును.

గీ. కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చు♦కొంటి మొకటి, నెన్న నెక్కడి ద్వారక♦యెక్కడిగద
సాంబు లివి విన్నఁ బెనుచేటు ♦ స్వామిచేత, నసురులకుఁ బగవీ డఁట♦యాపురంబు,

అర్థము:—కుడిచి కూర్చుండి = తిని కూర్చుండి, (పనిలేక, యని భావము) ఒకటిన్, వెతన్ = ఒక దుఃఖమును, తెచ్చుకొంటిమి, ఎన్నన్ = ఆలోచింపఁగా, ఎక్కడి ద్వారక, ఎక్కడి గదసాంబులు, అనఁగా ద్వారకయును గదసాంబులును లభింపనివా రనిభావము, ఇవి = ఈ మాటలు, విన్నన్ = వినినయెడ, స్వామిచేన్ = ప్రభువగు సునాభునిచే, పెనుచేటు = పెద్దహాని, కలుగును. అనునది అధ్యాహారము. ఆపురంబు = ఆద్వారక, అసురులకున్ = రాక్షసులకు, పగవీడఁట = శత్రుపట్టనమఁట. (అఁట ప్రసిద్ధిని దెలుపునది.)

తాత్పర్యము:—పని లేనిపనిగా నీదుఃఖ మొకదానిని తెచ్చుకొన్నాము. ద్వారకయును గదసాంబులును లభించువారు కారు. ఈ మాటలు ప్రభువు వినెనా హాని వచ్చును. రాక్షసుల కానగరము శత్రుస్థాన మఁట.

చ. అని తమలోనఁ దా రడఁచి రా పలు కెందును సుబ్బకుండ న
ద్దనుజవరేణ్యకన్యకలు తాపసవాక్యము విన్నయాదిగా
మనమునఁ గూర్మి హెచ్చి నియమంబులు నోములు దానధర్మవ
ర్తనలుఁ గరంబు సల్పుదురు తద్గదసాంబశుభంబె కోరుచున్. 17

అర్థము:—అని, ఆపలుకు = ఆ నారదుని మాట, ఎందును, సుబ్బక + ఉండఁగన్ = బయలు పడకుండునట్లు, తమలోనన్ = తమమనస్సులందు, తారు = దాదులు ఎవరికివారే, అణఁచిరి = కప్పిపుచ్చుకొనిరి, ఆ + దనుజవరేణ్యకన్యకలు = రాక్షసశ్రేష్ఠుఁ డగు నా సునాభుని కూఁతులు (చంద్రవతీ గుణవతులు) తాపసవాక్యము = నారదముని పలుకును, విన్నయాదిగాన్ = వినినది మొదలుగా, మనమునన్ = మనస్సునందు, కూర్మి = అనురాగము, హెచ్చి, తద్గత ... శుభంబె - తత్ = ఆ, గదసాంబ = గద సాంబుల యొక్క, శుభంబు + ఎ = క్షేమమునె, కోరుచున్, నియమంబులున్ = నిష్ఠలును, నోములున్ = వ్రతంబులును, దాన ధర్మవర్తనలును, దాన = ఈవులును, ధర్మ = పుణ్యము గలుగు, వర్తనలును = నడవడులును, కరము = అత్యంతము, సల్పుదురు = చేయుదురు.

తాత్పర్యము:—అని దాదు లానారదుని పలుకు నెందును వెలిపోకుండునట్లు తమ మనస్సులందే తాము కప్పిపుచ్చుకొనిరి. ఆ చంద్రవతీ గుణవతులు నారదవాక్యము విన్నది మొదలు మనస్సులందు ప్రేమ యధికమై ఆ గదునకు సాంబునకు క్షేమము గలుగఁ గోరుచు, నిష్ఠగలిగి, వ్రతములు, దానములు, చేయుచు పుణ్యమగు ప్రవర్తనలను గలిగియుందురు.

చ. క్రమమున భోగయోగ్య మగుప్రాయము నిండుచు రాఁగ భర్తృసం
గమనమనోరథంబు నతిగాఢము గాఁగ బతిప్రవృత్తి లా
భము గడు దవ్వు గా నలసి బాలిక లిద్దఱుఁ దద్దయున్ గత
క్షమఁ గుసుమాస్త్రబాణములఁ గాంతియ చిక్కఁగఁ జిక్కి రే మనన్. 18

అర్థము:—భోగయోగ్యము = సుఖమునకు దగినది - సుఖ మనుభవించుటకుఁ దగినది అనిభావము అగుప్రాయము = అయిన వయస్సు (జవ్వనము), క్రమమునన్ = కాలమునడచుటచేత, కాలక్రమమున నని భావము, నిండుచున్ + రాఁగన్ = పూర్ణ మగుచుండఁగా, భర్తృసంగమన మనోరథంబున్ = మగలతోడ కూడుకొనుట యందలి కోర్కియును, అతిగాఢము = మిక్కిలిదృఢము, కాఁగన్ = కాఁగా, పతిప్రవృత్తి లాభము - పతి = (తమ) మగలయొక్క, ప్రవృత్తి = వార్తయొక్క, (వార్తా ప్రవృత్తిర్వృత్తాంతః. అని అమరము.) లాభము = లభించుట, కడున్ = మిగుల, దవ్వు = దూరము, కాన్ = కాఁగా, అలసి=

ఆయాసపడి, బాలికలు, ఇద్దఱున్, తద్దయున్ = అత్యంతము, గతత్రపన్ = పోయినయోర్పుతో - (అనఁగా ఓర్పులేక.) కుసుమాస్త్రబాణములన్ = (పూవులాయుధముగాఁగల) మన్మథుని బాణములచేత, కాంతియ = శరీరకాంతి మాత్రము, చిక్కఁగన్ = మిగులునట్లు, చిక్కిరి = కృశించిరి.

తా:— క్రమముగా సుఖానుభవమునకుఁ దగిన వయస్సు నిండుచుండఁగా, పతులను గలిసికొనవలె నను కోర్కి కలుగఁజొచ్చెను. భర్తలవార్త యేమియుఁ దెలియ కుండుటచే ఓర్పులేక మదనాస్త్రములచేత పీడితలై దేహమునఁ గాంతి యొక్కటియే మిగులునట్లు చిక్కిరి.

ప్రాయము - (నానా) 1. పోకడ, 2. చావు, 3. అధికభాగము, 4. తఱచు,బాహుళ్యము. 5. వయస్సు, ని. ప్రాయో వయసి బాహుళ్యే - అని వైజయంతి.

చ. అచ్చపలాక్షు లిద్దఱును ♦ నర్మిలిఁ బెంచియుఁ బల్క నేర్పియున్
ముచ్చటకాపుగాఁ దమ వినోదపుటెచ్చెలిగా ననున్ గడున్
మచ్చికఁ జూతు రాసతుల ♦ మన్ననకుం దగఁ బ్రత్యుపక్రియా
సచ్చరితంబుఁ జూపఁగ నజస్రము నేనును గోరుచుండుదున్. 19

అర్థము:—ఆ + చపలాక్షులున్ = చంచలమగు నేత్రములుగల యా కన్యలు, ఇద్దఱును, అర్మిలిన్= ప్రేమతో, పెంచియున్, పల్కన్ = మాటాడుట, నేర్పియున్, ముచ్చటకాపుగాన్ = సల్లాపములాడు వాఁడుగాను, తమ వినోదపు టెచ్చెలిగాన్ = తమకు కాలక్షేపము చేయు మిత్రముగాను, ననున్, కడున్, మచ్చికన్ = ప్రేమతో, చూతురు=చూచుచుందురు - కాపాడుదురు. నేనును, ఆ సతులమన్ననకున్ = ఆ యింతులయొక్క యాదరమునకు, తగన్ = తగునట్లు, ప్రత్యుపక్రియా సచ్చరితంబు = చేసినమేలునకు మఱుమేలు సేయుట యను మంచి నడవడిని, చూపఁగన్, అజస్రము = ఎల్లపుడును, కోరుచుండుదును.

వి. :—ముచ్చటకాపు - (కాఁపుఅనునది సానుస్వారముగానొక పాఠము కనఁబడుచున్నది. మఱియు "ముచ్చటకాఁడు" అనుపదము, వేంకటనాథుని పంచతంత్రమున సల్లాపము చేయువాఁడు అనునర్థమునఁ గనఁబడుచున్నది. ఆ శబ్దమునకే యిది యపపాఠమువలెఁ దోఁచుచున్నది. 'చిలుక' యని యంతట గనఁబడు చున్నది. కాని యది యాఁడుచిలుకయని గానరాదు. కాన మగచిలుకగనే భావించినచో 'ముచ్చటకాఁడు' అనుట సరిపడును. 'అంచమగువ, అంచచెలువ' అని శుచిముఖిని చెప్పినరీతిని - 'చిలుక చెలువ' అని కాని 'శుకి' అనికాని యెచటను చెప్పఁబడలేదు. కాపు-అనునపు డర్థమును పొసఁగునట్లులేదు. ఇంకను విచార్యము.

క. కావున వారల యప్పటి, భావజశరపీడఁ జూచి ♦ భామినులారా
మీవల్లభుల శుభస్థితి, నావెరవునఁ దెలిసి వత్తు ♦ నమ్ముఁడు మదిలోన్. 20

అర్థము:—కావునన్ = వారికిఁ బ్రత్యుపకారము చేయ నిచ్చ గలదాన నగుటచే, వారల... పీడన్- వారల = ఆయిరువురయొక్క, అప్పటి = ఆసమయమందలి, భావజ = మన్మథునియొక్క, శర=బాణము చేత నైన, పీడన్ = బాధను, చూచి, భామినులారా = ఓ యింతులారా !, మీవల్లభుల = మీ ప్రియుల యొక్క, శుభస్థితిన్ = క్షేమముతో నుండుటను, నావెరవునన్ = నాయొక్క నేర్పుచేత, తెలిసి, వత్తును మదిలోన్, నమ్ముఁడు.

తా.:— భర్తల జాడ తెలియక శ్రమ నొందుచున్న వారలతో నా నేర్పుచే మీ ప్రియులు సుఖముగా నుండుటను తెలిసికొని వత్తును నన్ను నమ్ముఁడు. మీఁది కన్యయను,

గీ. మఱియు నప్పటికొలఁదిని మంతనముగఁ, జేరి మీకోర్కెఁ జెప్పవచ్చినను జెప్పి
మాఱుమాట యేఁ దెచ్చెదన్ మానసముల, నన్యచింతలు మాని నన్ననుపుఁడనుచు.

అర్థము:—మఱియును = మీ పతుల క్షేమము తెలిసికొనుటయే కాదు, అప్పటికొలఁదిని = ఆ కాలపు పరిమితిని బట్టి, అవకాశమునుబట్టి యని భావము. మంతనముగన్=రహస్యముగా, చేరి=సమీపించి, మీకోర్కెన్, చెప్పవచ్చినను=చెప్పవీలయినచో, చెప్పి, ఏన్=నేను, మాఱుమాట = ప్రత్యుత్తరమును, తెచ్చెదను, అన్యచింతలు = ఇతరమగు విచారములు, మాని, నన్నున్, అనుపుఁడు = పంపుఁడు, అనుచున్ (మీఁది కన్యయము)

తా. మీ భర్తల క్షేమస్థితి తెలిసికొనుటమాత్రమే కాదు. అవకాశమునుబట్టి వారిదగ్గఱకుఁజేరి రహస్యముగ మీ కోర్కె చెప్పుటకు వీ లయినచో చెప్పి వా రేమందురో ఆ సంగతి మీకు చెప్పెదను. నన్ను పంపుఁడనుచు.

వ. ఏను మ ద్విరహాసహత్వంబునం జేసి వార లనుపంజాలక యనుమానించినను మానక యపుడ కదలి ద్వారకాపురంబున కరిగి నాచేత నైనపాటి గమన కార్యంబు సాధించుకొని తిరిగి వచ్చునప్పు డా లేఖ యట్లు ప్రాప్తం బయ్యెఁ దత్ప్రకారంబును వినిపించితి నన్నుఁ బ్రభావతి చూచి గుఱు తెఱింగనేని చంద్రవతీగుణవతులకు నేమి కొఱగామి సంఘటిల్లునో యని తలంకెద నవ్వనితలకు మత్పునర్దర్శనంబునకై మితి పెట్టిన దినంబు నేఁడ కావున నెంత వంతం బొరలుచున్నవారో వారికిం బొడసూప వలయు న న్ననిపి యనుగ్రహింపుము. 22

అర్థము :—ఏను = నేను, మద్విరహాసహత్వంబునంజేసి = నా యెడఁబాటుయొక్క సహింపఁ జాలమిచేత (నాయెడఁబాటును సహింపలేక), వారలు, అనుపంజాలక = పంపలేక, నాచేతనైనపాటి = నాకు శక్యమైనంతమాత్రము, గమనకార్యంబు = వెళ్లుటవలనఁజేయఁదగినపని, సాధించుకొని = చేసికొని, ప్రాప్తంబు = పొందఁబడినది, తత్ప్రకారంబును = ఆలేఖయొక్క విధమును, వినిపించితిన్ = చెప్పితిని, కొఱగామి = అపాయము, సంఘటిల్లునో = కలుగునో, అని, తలంకెదను = భయపడుచున్నాను, మత్+ పునః + దర్శనంబునకై = నాయొక్క మరలఁగనిపించుటకై, మితి = హద్దు, వంతన్ = దుఃఖముచే, పొరలు చున్నారో = పరితపించుచున్నారో, పొడసూపవలయున్ = కనిపింపవలయును, నన్ను, అనిపి = పోనిచ్చి, అనుగ్రహింపుము = దయచూపుము.

తే. ఘనపయోవృష్టికిని జాతకములు వోలెఁ, గొమరు వెన్నెలకును జకోరములు వోలె
భాస్కరోదయమునకు నబ్జములువోలె, నెదురు చూతురు నారాక కిందుముఖులు.

అర్థము:— ఇందుముఖులు = చంద్రునివంటి మోములు గలవారు, అగు నా చంద్రవతీ గుణవతులు, నా రాకకున్ = తిరిగి నేను వచ్చుటకై, ఘనపయోవృష్టికిని - ఘన = మేఘము యొక్క, పయః = జలములయొక్క, వృష్టికిని = వానకు, చాతకములు + పోలెన్ = వానకోయి లలవలె, కొమరువెన్నెలకును = నిండు వెన్నెలకొఱకు, చకోరములు + పోలెన్ = వెన్నెలపులుఁగుల వలెను, భాస్కర + ఉదయమునకున్ = సూర్యునియొక్క పొడుపునకై, అబ్జములు + పోలెన్ = తామరల వలెను, ఎదురుచూతురు = ఎదురు చూచుచుందురు, ప్రతీక్షించుచుందురు.

తాత్పర్యము:—నేఁడే మితి కావున సాకన్యలు నారాకకై మేఘునివాననీటికై చాతకములవలెను, పండువెన్నెలకై చకోరములవలెను, ప్రొద్దుపొడుపునకై తామరలవలెను నెదురు చూచుచుందురు.

అలం:—మాలోపమ.

వి. :—చాతకములు నేలఁ బడిన యుదకము ద్రావక వానగురియునప్పు డాకసమునుండి నీరుద్రాగు ననియు, చకోరములు వెన్నెలను దిను ననియు కవిసమయములు. ఉపమానోపమేయములు సమాన లింగములై యుండవలె నని నియమము. అట్టియెడ ఇందుముఖులు - (స్త్రీలింగము) ఉపమేయము. చాతకములు, చకోరములు, (పుంలింగములును) అబ్జములు (నపుంసకలింగమును) ఉపమానములుగా నిందు కనఁబడు చున్నవి. 'న లింగవచనే భిన్నే న హీనాధికతాపివా, ఉపమాదూషణా యాలం యత్రోద్వేగో న ధీమతాం, స్త్రీవ గచ్ఛతి షండోయం వక్త్యేషా స్త్రీ పుమానివ, ప్రాణా ఇవ ప్రియోయం మే విద్యా ధనమి వార్జితా. కావ్యాదర్శము. ద్వితీయపరిచ్ఛేదము 51, 52 న దండ్యాచార్యులు నిరూపించిరి. మఱియు 'ఉపమానోపమేయయో ర్లింగవ్యత్యాసో లింగభేదః.' అని యొకదోషమును కావ్యాలంకారసూత్రవృత్తి యందు వామనుఁడు చెప్పి, తత్పరిహారకములుగా 'ఇష్టః పుం నపుంసకయోః ప్రాయేణ' అనియు, 'లౌకిక్యాం సమాసాభిహితాయా ముపమాప్రపంచే చ' అనియు సూత్రించి 'లౌకిక్యా ముపమాయాం సమాసాభిహితాయా ముపమాయా ముపమాప్రపంచే చేష్టో లింగభేదః ప్రాయేణేతి, లౌకిక్యాం యథా - 'ఛాయేవ సతస్య' 'పురుష ఇవ స్త్రీ' అని వృత్తియందు వివరించెను. కావున నిచటి లింగవ్యత్యాసము దండి వామనుల మతములనుబట్టి దోషము కానేరదు.

వ. అనుటయు. 24

ఆ. ఏను నిన్ను విడువ । కిట్లు వచ్చెద నీవు, చెప్పినంతవట్టు । నప్పుడఁతులఁ
బిలిచి నాయెదుటను । గల దనిపించిన, విడుతు మదుపకార । వృత్తి దెలిపి. 25

అర్థము:—అనుటయున్ = చిలుక చెప్పినపిదప, ఏను = నేను, నిన్నున్, విడువక = పట్టి విడిచి పెట్టక, ఇట్లు + అ, వచ్చెదన్, - నిన్ను నాఱెక్కలనడుమ బిగించి పట్టుకొనియే వచ్చెదను అని భావము. అప్పుడఁతులన్, పిలిచి, నాయెదుటను, నీవు, చెప్పినంతవట్టు = చెప్పినయావద్విషయమును, కలదు=ఉన్నది- (నిజమనిభావము.) అనిపించినన్, మదు, ... వృత్తి - మత్ = నాయొక్క, ఉపకార = ఉపకరించునట్టి, వృత్తి = వ్యాపారమును - నేనుజేయఁదగు నుపకారము నని భావము, తెలిపి = (వారికి) ఎఱుఁగఁజెప్పి, (నిన్ను) విడుతున్ = విడిచిపెట్టెదను.

వి. :—కలదనిపించు = యథార్థమనిపించు - జాతీయము.

క. అనవుడు నట్టుల కా ని,మ్మనుచుఁ దదాక్రాంతమూర్తి । యగుచునె వెసఁ దాఁ
జని చిలుక కెళవు లరయుచు, సునాభకన్యలు వసించు । శుద్ధాంతమునన్. 26

అర్థము:—అనవుడున్ = హంసి యనినపిదప, అట్టులు + అ = నీవు చెప్పినట్లే, కానిమ్ము, అనుచున్, చిలుక, తదా...మూర్తి, తత్ = ఆహంసిచేత, ఆక్రాంత = క్రమ్మఁబడిన, మూర్తి = దేహము గలది, అగుచున్ + ఎ = అగుచునే, వెసన్ = శీఘ్రముగా, చని, కెళవులు = చుట్టుప్రక్కలు, అరయుచున్ = (ఎవ్వరులేరు గదాయని) పరిశీలించుచు, సునాభకన్యలు=చంద్రవతీ గుణవతులు, వసించు శుద్ధాంతమునన్ = ఉండునట్టి యంతఃపురమునందు. (మీఁది కన్వయము)

తాత్పర్యము:—హంసి యట్లుపలుకగా నా చిలుక యాహంసఱెక్కల నడుమ నిర్బంధమున నున్నది యయియే, యిటునటు పరులెవ్వరు లేరుగదా యని పరిశీలించుచు చంద్రవతీ గుణవతులుండు మేడయందు ''వ్రాలి'' అను ముందు పద్యములోని దానితో నన్వయము.)

క. ఒక సౌధవిటంకమత,ల్లిక మాటుగ వ్రాలి లాఁతి § లేమ లచటఁ జే
రికఁ బొలయకుండ నారసి, యకలంకస్వరతఁ బిలిచె § నాకన్నియలన్. 27

అర్థము :—ఒక ... మతల్లిక - ఒక, సౌధ = మేడయొక్క, విటంకమతల్లికన్ = ప్రశస్తమగు నొక కపోతపాలికయందు (కొణిగయందు), మాటుగన్, వ్రాలి, లాఁతిలేమలు = ఇతరస్త్రీలు, అచటన్, చేరికన్ = సమీపమందు, పొలయకుండన్ = సంచరింపకుండుట, అరసి = చూచి, ఆకన్నియలన్ = ఆ చంద్రవతీగుణవతులను, అకలంకస్వరతన్ = నిర్మల మగుస్వరము కలుగుటతో, అనఁగా భయకంపములు లేనియట్లు సహజమగు తనయెలుఁగుతో, పిలిచెన్ = పిలిచెను.

తాత్పర్యము :—చిలుక యాకన్యకలమేడను జూపింప, శుచిముఖి దాని నట్లే తనఱెక్కలసందున బిగియఁబట్టి యామేడవిటంకమున వ్రాలఁగా - నాచిలుక తాను నిర్బంధమునఁజిక్కి, భయకంపములు పొందుచున్నట్లుగాక, పూర్వము వారి నెట్లు పిలిచెడిదో, యట్టికంఠస్వరముతోనే చంద్రవతీగుణవతులను బిలిచెను.

వి. :— విటంకము - ని. 'కపోతపాలికాయాం తు విటంకం పుంనపుంసకమ్' అని అమరము. ముంజూరునకు సమీపమున పావురములు మొదలగునవి యుండుటకుఁ గట్టినగూఁడు అని కొందఱును, మేడలు మొదలగువానియందుఁ బావురాలు మున్నగునవి యుండుట కేర్పఱచిన చదరము లగుకంబము లని కొందఱును చెప్పిరి. 'కొణిగఁ బారావతకులము వదర, చెదరి కపోతముల్ కొణిగ చేరక తారకవీథిఁ బాఱఁగా' మున్నగుప్రయోగముల ననుసరించి విటంకము, కొణిగ సమానార్థకము లని తెలియుచున్నది. 'తనాబి' కావచ్చును.

క. పిలుచుటయు వార లిది మన, చిలుకయెలుం గనుచు నుల్లసిల్లి రపుడు వీ
నుల నూఁదు కప్పురపుఁ జలు,వలఁ బోలి విరాళియలఁత § వడినది తీర్పన్. 28

అర్థము :—పిలుచుటయున్ = పిలిచినవెంటనే, వారలు, ఇది, మనచిలుకయెలుంగు = మన చిలుకయొక్క కంఠధ్వని, అనుచున్, వీనులన్ - చెవులయందు, ఊఁదుకప్పురపుఁజలువలన్ + పోలి = ఊఁదినట్టి పచ్చకర్పూరపు చల్లఁదనమువలె, అది = ఆ కంఠస్వరము, విరాళియలఁత = వలపువలని బడలికను, తీర్పన్ = తొలఁగింపఁగా, ఉల్లసిలిరి = సంతసించిరి.

అల. :—ఉపమ.

గీ. అట్లు సంతసిల్లి § యతిసంభ్రమంబున, నరుగుదెంచి హంసికావృత మగు
చిలుక తెఱఁగుఁ జూచి § వెలవెలఁబాఱఁ ద,ద్భయనివృత్తిగాఁగఁ § బలికెఁ జిలుక..

అర్థము :—అట్లు, సంతసించి, అతిసంభ్రమమునన్ = మిగులఁ దొట్రుపాటుతో, అరుదెంచి = వచ్చి, హంసికావృతము = హంసిచే నావరింపఁబడినది, అగుచిలుకతెఱఁగున్ = అయినచిలుకయొక్క స్థితిని, చూచి, వెలవెలఁబాఱన్ = (ఆకన్యలు) తెల్లఁ బోవఁగా, చిలుక, తద్భయనివృత్తి = వారి భయము తొలఁగిపోవుట, కాఁగన్ = అగునట్లు, పలికెన్ = (ఈరీతిగా) అనెను.

క. నిను నంపినవారికి నీ,కును హితమె యొనర్తుఁ § బ్రాతికూల్యం బొకప
ట్టునఁ జేయ ననుచు నిదినా,కు నిజము చేసినది మీరు § కొంకకుఁడు మదిన్. 30

అర్థము:—నినున్, అంపినవారికిని = పంపిన సునాభకన్యలకును, నీకును, హితము + ఎ = మేలునే, ఒనర్తున్ = చేయుదును, ఒక పట్టునన్ = ఏసందర్భము నందును, ప్రాతికూల్యంబు=(మీపనికి) వ్యతిరేకము, చేయను, అనుచున్, ఇది = ఈ హంసి, నాకున్, నిజము చేసినది = ప్రమాణము చేసినది (ఒట్టిడు కొన్నది.) మీరు, మదిన్, కొంకకుఁడు= భయపడకుఁడు,

తాత్పర్యము:—'నిన్ను పంపిన వారికిని నీకును మేలే చేయుదును. కాని యెన్నఁడును విరుద్ధము చేయను' అని యిది నాకై యొట్టు పెట్టుకొన్నది. మనస్సులో మీరు భయపడకుఁడు.

వ. అని తనకును దానికిం బ్రాపించిన సంబంధంబు తెఱంగునుం దాను మాటపట్టు పుచ్చుకొని తనకార్యరహస్యంబుఁ దెలుపుటయుం దెలిపి యేను మీ దాన నగుట మీచేత వెల్లనాడించుకొని మీ కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చిన దని చెప్పి తత్ప్రార్థనావశీకృత హృదయ యగు హంసిచేత విడువంబడి యేను బోయిన కార్యంబు వివరించెద నని వారల వేఱువేఱ పేరు గ్రుచ్చి యి ట్లనియె.

అర్థము:—అని, ప్రాపించిన = కలిగినట్టి, మాటపట్టు = వాగ్దానము, లేక ప్రమాణము, తన కార్యరహస్యంబున్ = తాను జేయఁదగిన పనియొక్క గుట్టు, వెళ్లన్ + ఆడించుకొని = స్పష్టముగా చెప్పించుకొని, ఎక్కించి = కావించి, విడుచుటకున్ = (నన్ను) విడుచుటకు, వచ్చినది, తత్ ... హృదయ-తత్ = ఆ కన్యల యొక్క, ప్రార్థనా = కోరికకు, వశీకృత = వశమైన, లొంగిన, హృదయ = మనస్సుగలది, పోయినకార్యంబు = వెళ్లినపని- ( నే నేపనికై వెళ్లితినో ఆ పని. అని యర్థము.) సూ. కర్మాదులకుం బ్రాధాన్య వివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించు. బాల. సమాస. 26. వేఱువేఱు+ అ=వేఱువేఱుగా, ఒక్కొక్కటిగా, పేరు = వారి పేరు, గ్రుచ్చి = గ్రహించి, పిలిచి, వేఱువేఱన్ అని యొక పాఠమును, 'వేరువేరన్' అని యొక పాఠమును ముద్రితము లగపడుచున్నవి. రెండును బ్రామాదికములు. 'ప్రత్యేకముగా, విడివిడిగా' అను నర్థమున వేఱు వేఱు + అ = వేఱువేఱ, లేక 'వేఱువేఱు' అని యుండును. కాని ఔపవిభక్తికమునకు వలె 'అన్ ప్రత్యయము వచ్చుటెట్లు ? 'వేరువేరన్' అనుపాఠ మౌపవిభక్తికము కావున శబ్ద స్వరూపము కుదిరినను సాధురేఫయుత మగుటచే వేరు = వృక్షమూల మని యర్థము కల దగుటచేత ప్రకృతమున కుపయోగించుట యెట్లు ? కాన 'వేఱువేఱ' యను పాఠము గ్రహింపఁ బడినది.

గీ. చంద్రవతి నీదుప్రాణేశుఁ డింద్ర నిభుఁడు, గదుఁడు ద్వారక నున్నాఁడు ముదముతోడ,
గుణవతీ నీదు ప్రియుఁడు సాద్గుణ్యరాశి, తనరుచున్నాఁడు సాంబుఁ డెంతయుశుభమున.

అర్థము:—చంద్రవతి, ఇంద్రనిభుఁడు = దేవేంద్రునితో సమానుఁడు, సాద్గుణ్యరాశి = మంచి గుణములు గలిగియుండుటయొక్క, రాశి (సత్ = మంచి, గుణ = గుణములు గలవాఁడు, సద్గుణుఁడు, సద్గుణుని యొక్క భావము, సాద్గుణ్యము - అట్టి సాద్గుణ్యముయొక్క రాశి-సకల సద్గుణ రాశి యని భావము.

క. ప్రకటితచాతురి నా రాజకుమారులతోడ నుచిత సమయములన్ మ
చ్చికచేసితి నేఁ గ్రమమున, నొకఁ డెఱుఁగక యుండ నొకనియొద్దకుఁ జనుచున్.

అర్థము:—ప్రకటిత చాతురిన్ = వెల్లడింపఁబడిన నేర్పుతో, ఆ రాజకుమారుల తోడన్ = ఆరాచ కొడుకులతో (గదసాంబులతో) ఉచిత సమయములన్ = తగిన వేళలందు, ఒకఁడు ఎఱుఁగక యుండన్, ఒకని యొద్దకున్ = ఇతరుని యొద్దకు, చనుచున్ = పోవుచు, నేన్ = నేను, క్రమమునన్, మచ్చికచేసితిని = పరిచయము చేసికొంటిని.

తా. చిలుక తాను చంద్రవతీ గుణవతులను గూర్చి గదసాంబు లిద్దఱు నున్నపుడు ప్రసంగించినచో సిగ్గుపడి యభిప్రాయ ప్రకటనము చేయకపోవచ్చును. కాన వేఱువేఱుగా నున్నప్పుడు ప్రసంగించితి ననుట యెంతయు నుచితముగా నున్నది.

క. విదితము చేసితి మీమీ, హృదయేశుల కంత మీయభీష్టము తెఱఁగుల్
తుద నంతయుఁ దెలిపితి మీ, బ్రదుకుల తదుపేక్షనైకపర్యంతతయున్. 34

అర్థము:—మీమీ హృదయేశులకున్ = మీమీభర్తలకు, మీయభీష్టము తెఱఁగుల్ = మీయిరువుర కోరికవిధములు, విదితము చేసితిని = తెలియఁబడినవిగాఁ జేసితిని (తెలిపితి నని భావము.) తుదన్ =చివరకు, మీబ్రదుకుల ...... పర్యంతతయుఁ - మీబ్రదుకుల = మీజీవితములయొక్క, తత్ = వారియొక్క, ఉపేక్షణ = ఉపేక్షించుటయే, ఏక = ముఖ్యమగు, పర్యంతతయుఁ = హద్దుగలిగి యుండుటయు - (వారుపేక్షించుట హద్దుగా మీబ్రదుకు లున్నవి. వా రుపేక్షించిరా మీబ్రదుకులు లేవు అని భావము.) అంతయున్ = సర్వమును, తెలిపితిని.

తాత్పర్యము:—చంద్రవతీ! నీకోరిక నీపతితోను, గుణవతీ! నీకోరిక నీపతితోను ముందు తెలిపి తుదిని "మీరుపేక్షించితిరా వారు జీవింపరుసుఁడీ" యని చెప్పివచ్చితిని - మీబ్రదుకులు వారియుపేక్షా పర్యంతములన:—తమయందుఁ బతుల కపేక్ష యుండు నని జీవించియున్నారు. అట్లుగాక యుపేక్షించి రని తెలిసినక్షణమందే యాకన్య లిరువురును మరణింతు రని భావము.

తే. వారు నేయుపాయములను వదలక వరి,యించువారైరి మిమ్ము మీరింతలోన
ధృతి సడలనిత్తు రే నాత్మహతియ కాక,పతిహననపాతకము గల్గఁబల్కి- రపుడు.

అర్థము:—అపుడు = నే నట్లు చెప్పినపుడు, వారును = వారుగూడ, మిమ్మును, ఏయుపాయములను = ఏవెరవులచేతనైనను, వరియించువారు = పెండ్లాడఁగోరినవారు, ఐరి, (మఱియు) ఇంతలోనన్ = వారు వరించు లోపల, ధృతి = ధైర్యమును, సడలనిత్తురేని = (మీరు) జాఱిపోనిత్తురా, ఆత్మహతియ = (ఆత్మహత్య) తమ్ముఁ దాము చంపుకొనుట (వలనిపాపమొకటి) యే కాక, పతిహననపాతకము = మగని (యొక్క) చంపుటవలనిపాపమును, కల్గన్ = కలుగుటను, పల్కిరి.

తాత్పర్యము:—అంతట వా రిరువురు నేయుపాయములచేత నైనను మిమ్ముఁ బెండ్లాడ నంగీకరించిరి. మఱియు నింతలోన మీరు ధైర్యము వీడితిరా మీకు ఆత్మహత్యాపాతకమే కాక పతిహత్యాపాపముగూడఁ గలుగు నని యనిరి.

సీ. అని చెప్పుటయు విని యాకన్యకలు కరం,బులఁ గర్ణయుగళంబు మూసికొనుచుఁ
దమ కంత యే లగుఁ దాము దీర్ఘాయుర,న్వితు లగుదురుగాక యతి వియోగ
వనరాశి నేమును మునుఁగక తమమాట, యూస పెన్దెప్పగా నచల మైన
తాల్మి నీఁదుచు నుండెదము తమ కస్మదీ,యప్రాణసంరక్షయందుఁ దగిన

గీ. త్రోవ మాభాగ్యవశమునఁదోఁచుదాఁక, నోర్చుటయకాక తమకింప యుక్తమగునె
యని పలికి యూరకుండిన నంచచెలువ, వారి కి ట్లను సముచిత వాక్యసరణి.

అర్థము:—అని, చెప్పుటయున్ = (చిలుక) చెప్పఁగా, ఆకన్యకలు = ఆచంద్రవతీ గుణవతులు, విని, కరంబులన్ = చేతులతో, కర్ణయుగళంబున్ = చెవుల రెంటిని, మూసికొనుచున్, తమకున్, అంత = అంతసాహసము, ఏల = ఎందులకు, అగున్ = కలుగును, (తాము మరణించునంతటి సాహసము వారి కెందులకు కలుగును. అనిభావము) తాము = వారు, దీర్ఘాయుః + అన్వితులు = పెద్ద దగు కాలముతోఁ గూడినవారు, అగుదురుగాక, అతివియోగవనరాశిన్ = గొప్పదగు నెడఁబాటను సముద్ర

ముందు, ఏమును = మేమును, మునుఁగక, తమమాటయాస = వారిమాటవలనఁ గల్గిన వాంఛ, పెనుతెప్ప = పెద్ద తెప్ప, కాఁగన్ = అగుచుండ, అచలమైనతాల్మిన్ = చలింపని యోరిమితో, ఈఁదుచున్ = (ఈవియోగసముద్రమందు) ఈఁదుకొనుచు, ఉండెదము, తమకున్ = వారికి, అస్మదీయ ప్రాణసంరక్షయందున్ = మాసంబంధమగు ప్రాణములయొక్క కాచుటయందు, తగినత్రోవ = తగినట్టి యుపాయము, మాభాగ్యవశమునన్ = మాయదృష్టమునకు లోఁబడుటచే, తోఁచుదాఁకన్ = కనఁబడుదాఁక, ఓర్చుటయె = సహించుటయే, కాక = కాని, తమకింపన్ = వేగిరపడుట, యుక్తము = అర్హము, అగునె (కాదు అనిభావము.) అని పలికి, ఊరక + ఉండినన్=మిన్నక యుండఁగా, అంచచెలువ = హంసాంగన శుచిముఖి, సముచిత వాక్యసరణిన్ = మిగుల తగినట్టి పలుకులరీతిని, ఇట్లు, అనున్ = అనెను.

అలం:—రూపకము.

క. మీపతు లిట వచ్చుట కుచి,తోపాయము మిగులఁ దడయ కొక్కటి తగ నే
నాపాదించెద మీరలు, నాపై దయ మఱవకుఁడు మనంబులయందున్. 37

అర్థము:—మీపతులు=మీ భర్తలు, ఇట=ఇచటికి, వచ్చుటకున్, మిగులన్, తడయక=ఆలసింపక, ఉచిత + ఉపాయము = తగినవెరవు, (పన్నుగడ) ఒకటి, ఏను = నేను, ఆపాదించెదను = కలిగింతును, మీరలు, నాపైన్, దయన్, మనంబులయందున్, మఱవకుఁడు.

వ. ఏను ప్రభావతికిఁ బ్రాణసఖినై యుండుదుఁ గావున నాచెలువపనుపున నీచిలుక నిట్లు దగులుకొని వచ్చితి నిది నిమిత్తంబుగా నైన మీతోడిమైత్రి దొరకె నింక నిక్కడ మిక్కిలి దడయఁదగదు పోయి వచ్చెద నచ్చట నిచ్చటిరహస్యంబు వెలివోవ నీక తగినయుత్తరం బిచ్చి కప్పిపుచ్చెద నిచ్చలంపుమనంబుల నుండుం డని పలికి యామాటల కత్యంతసంతుష్టాంతరంగ లగు నాయంగనల వీడ్కొని వజ్రనాభతనయ కడ కరుదెంచి యి ట్లనియె. 38

అర్థము:—ఏను = నేను, ప్రాణసఖిని = దేహమునకుఁగాక ప్రాణములకే సఖురాలను, ఆచెలువపనుపునన్ = ఆయింతి యాజ్ఞచే, తగులుకొని = వెంటాడి, ఇది=ఈవెంటాడివచ్చుట, నిమిత్తంబుగాన్ = కారణముగా, ఐనన్ = అయినప్పటికి, మీతోడిమైత్రి = మీ యిద్దఱితో స్నేహము, తడయన్ = ఆలసింపఁగా, వెలివోవనీక = బయలుపడనీయక, తగిన యుత్తరంబు = తగినట్టి సమాధానము, నిచ్చలంపుమనంబునన్ = నిశ్చలమైన మనస్సుతో, అత్యంత ... రంగలు - అత్యంత = అధికముగా, సంతుష్ట = సంతసించిన, అంతరంగలు = మనస్సులుగలవారు (అంతః + అంగము - అంతరంగము), అరుదెంచి = వచ్చి.

క. చెలువా నీసౌభాగ్యపు, విలసనమ కదమ్మ యెచట వీక్షించిన న
ర్మిలి నీపతి నీకై చిం,తిలి యనిపినలేఖ యఁట కాదే తెలియంగన్. 39

అర్థము:—చెలువా = ఓ సుందరీ, ఎచటన్ = ఎక్కడ, వీక్షించినన్=చూచినను, నీ సౌభాగ్యపు విలసనము + అ - కదమ్మ = నీ యదృష్టముయొక్క విలాసమే కదా, లేదా నీచక్కఁదనపు విలాసమేకదా, తెలియంగన్ = తెలిసికొనఁగా, అర్మిలిన్ = ప్రేమచే, నీపతి, నీకున్ + ఐ, చింతిలి = వగచి, అనిపిన = పంపిన, లేఖయఁటకదే = ఉత్తరమఁటకదా, - నే నాచిలుక యేమో యని వెంబడింప అచటను నీ యదృష్ట విలాసమే కానఁబడెను. ఎ ట్లన ఆచిలుక తెచ్చినజాబు నీపతి ప్రేమతో పంపినదఁట. నీ వెంతచక్కని భాగ్యవతివి కానిదే నీపతి ముగ్ధుఁడై యట్లు వ్రాయఁడు. అని అభిప్రాయము.

అలం:—కావ్యలింగము.

వి:— ఇందు హంసి వచ్చుటతోడనే చిలుకసంగతి యెత్తక, 'నీ సౌభాగ్య విలాసమే యెల్లెడ కననగుచున్న' దని స్తుతించుట, రాత్రిందివము తన్నుఁ బ్రేమించునో లేదో యని యెవనికై తపించుచున్నదో, ఆప్రియుఁడే వ్రాయుట, అందు నంగీకారము తెలుపుటయు తలఁపునకుఁ దెచ్చినయెడ ప్రభావతి చిలుకమాట మఱచిపోఁగల' దనుకొనిన హంసియొక్క బుద్ధివిశేషము ఇందు వ్యంగ్యము, మఱియు శుచిముఖి తనచాతుర్యమున నెంతవారినైనను దా ననుకొనిన త్రోవకుఁ దేఁగల దనియు, నిట్లే ముందు వజ్రనాభుని గూడ వశ మొనర్చుకోఁగలదనియు వ్యక్త మగుచున్నది.

వ. అనిన నక్కన్యకారత్నంబు నవ్వుచు ని ట్లనియె. 40

వి:—ఇందుఁ బ్రభావతి హంసి మాటుపెట్టుచున్న సంగతి గ్రహించి యా చిలుకవిషయమునే యడుగుచున్నట్లు పైకిఁ దోఁచినను, లజ్జావిజిత మన్మథయగు ముగ్ధానాయికగావునఁ - దనప్రియునిమాట యెత్త సిగ్గుపడుట వ్యంగ్యము. కావుననే ప్రియవిషయక మగు మాట ప్రభావతి మఱుఁగు పఱచుచు నిట్లనుచున్నది.

క. అడుగఁగ వలసినయది యే, నడుగుదు విశదముగ మొదల ǂ నాచిలుక య దె
క్కడిది యిటఁ దేక యేటికి, విడిచితి నీకడుపు కందǂవిత్తుగ హంసీ. 41

అర్థము:—హంసీ, ఏను, అడుగఁగన్ + వలసినయది = అడుగువలసినసంగతి, ముఖ్యమైనది యని భావము, విశదముగన్ = స్పష్టమగునట్లు, అడుగుదున్ = అడుగుచున్నాను, మొదలన్ = ముందుగా (చెప్పుము. అధ్యాహారము) ఆ చిలుక, ఎక్కడిది, (వృత్తియం దొపవిభక్తికము) ఇటన్ = ఇక్కడకు, తేక = తీసికొనిరాక, ఏటికిన్ = ఎందులకు, విడిచితి = విడిచిపెట్టితివి. నీ కడుపు కందవిత్తు గన్ - నీకడుపు = నీ సంతానము, కందవిత్తు=కందవిత్తనము పాఁతినచో ననంతమై యెల్లకాలమును నెట్లు మొలచుచుండునో యట్లే యవిచ్ఛిన్నము, కన్ = కాను, అగుఁగాక. అని ప్రేమసూచక మగు వ్యాజనింద.

వ్యా. వి. :—(కాన్) కాను' అనునది అగుధాతువుయొక్క తుమర్థకరూపము. ఇది తు మున్నంతము లకును, క్రియావిశేషణములకు ననుప్రయుక్తమగునపుడే హ్రస్వమై కన్ అగును. కాని ప్రత్యేకప్రయోగమున హ్రస్వము నొందకుండుట సామాన్యమైనను, నీకవి యిచటనే కాక ('పిఱువీకు - కానున్నది యనుటకు, కనున్నది' అని కళా. 1·72 లోను నీనాథుఁడు కానున్నాఁడు అనుటకు కనున్నాఁడు. కళా. 5.72 లోను హ్రస్వయుక్తరూపము నుపయోగించినాఁడు ప్రౌఢవ్యా. కర్త 'భావ్యర్థంబున'నున్న' పరంబగు నపుడు హ్రస్వంబు గానంబడియెడి. అని పై కళాపూర్ణోదయ ప్రయోగముల ననుసరించి సూత్రించెను. కాని 'ఉన్న' పరము కాకున్నను నిట్టివి స్వతంత్రములై కొన్ని యితని కవితయందుఁ గలవు.

వ. అనుటయు శుచిముఖి యి ట్లనియె. 42

క. నీపతి నీకై కుందుచు, నాపేరను లేఖ యనిపెనాఁ డని విని యే
నాపులుఁగువలనఁ దెలిసి ము,దాపూర్ణత నుబ్బి విడిచి ǂ యనిపితి దానిన్. 43

అర్థము:—అనుటయున్ = ప్రభావతియనఁగా, శుచిముఖి, ఇట్లు, అనియెన్, నీపతి, నీకై = నీకొఱకు, కుందుచున్ = తపించుచు, నా పేరను, లేఖ = ఉత్తరమును, అనిపినాఁడు = పంపెను, అని, ఏను, ఆ పులుఁగువలనన్ = ఆచిలుక వలన, విని, తెలిసి=(అతఁడు నీపై ననురాగమున వ్రాసియుండునని) తెలిసికొని, ముదాపూర్ణతన్ = (ముత్ + ఆపూర్ణతన్) సంతసముచే నిండిన దాననగుటచే, ఉబ్బి = ఉప్పొంగి, దానిన్ = ఆ చిలుకను, విడిచి = నాకాళ్లనడుమనుండి వదలి, అనిపితిన్ = పంపివైచితిని.

తాత్పర్యము:—నీభర్త నీకొఱకు బాధపడుచు నాచేత లేఖ నంపినాఁడని చిలుక చెప్పఁగా వినుట తోడనే యాతని భావము ప్రభావతియెడ ననురక్తము కానిచో నేల వ్రాయు నని విమర్శించి తెలిసికొని, సంతోషముచేఁ బరవశయై యాచిలుకను విడిచివైచితిని అనెను.

క. మన కిమ్మనుచు నతం డని,చిన పత్త్రిక దొరకె నొరులచేఁ బడ కిదియే
మనకుం బదివే లెట్లఁట, జనని మ్మాచిలుక తద్విచారం బేలా. 44

అర్థము:—మనకున్, ఇమ్ము, అనుచున్, అతండు = నీప్రియుఁడు, అనిచిన పత్త్రిక = పంపిన యాజాబు, ఇతరులచేన్ = పరులచేతియందు, పడక, = ఇతరులకు దొరకకుండ - అని భావము (మనకున్) దొరకెన్, ఇదియే, మనకున్, పదివేలు = పదివేలరెట్లు లాభము (లేదా పదివేలు సొమ్మిచ్చినట్లు) ఆ చిలుక, ఎట్లఁట = ఎట్లైననుసరే, చననిమ్ము = పోనీ, తద్విచారంబు = ఆచిలుక వృత్తాంతమునుగూర్చి పరి శీలించుట, ఏలా = ఎందులకు ?

వి. :—చంద్రవతీ గుణవతులతో మీసంగతి ప్రభావతితోఁ జెప్ప నని చెప్పుటచేత దానిని ప్రభావతి యడిగినను నామెకు సందేహము కలుగకుండ సహేతుకముగాఁ దప్పుకొనఁ జెప్పిన శుచిముఖి చాతుర్యమిందు వ్యక్తము.

సీ. అని రాగవల్లరిఁ గనుఁగొని యాపత్త్రి, కార్థ మే విన్నట్లె యగుఁగదమ్మ
చదువుకొంటిరె యన్న నది తాను జదివిన,యంతయుఁ జెప్పి నన్నవలఁ జదువ
నీక తా నొడిసి యాయాకు బలిమిఁ బుచ్చుకొనియె నీపడు చనవిని మరాళి
యటమీఁదఁ దెలియ నాయము కాదు మనకు న, నన్యప్రకాశనీయంబు లైన
ప్రేమభంగులఁ దా నేమియేమి వ్రాసి, యనిపినాఁడో కడున్ రహస్యంబు గాఁగ
నట్టియాకాముకుని కూర్ములతని సతియె, చదువుకొని మోదసంపదఁబొదలనిమ్ము.

అర్థము:—అని, రాగవల్లరిన్, కనుఁగొని, ఆ పత్త్రికార్థము=ఆజాబునందలి విషయము, ఏన్=నేను, విన్నట్లు + ఎ, అగున్ + కదమ్మ, చదువుకొంటిరె (మీరిద్దఱును అన్నమాట) అన్నన్ = అనఁగా, అది = ఆరాగవల్లరి, తాను, చదివినయంతయున్, చెప్పి = 'అధరసుధఁ దేర్పు మని వేడు మామృగాక్షి' అను నంతదాఁకఁ జెప్పి, ఈపడుచు, నన్నున్, అవలన్ = ఆపయిని, చదువనీక, తాను, ఒడిసి = హఠాత్తుగాఁ బట్టుకొని, ఆయాకున్ = ఆపత్త్రికను, బలిమిన్ = బలాత్కారముచే, పుచ్చుకొనియెన్, అనన్, మరాళి, విని, అటమీఁదన్, మనకున్, దెలియన్, నాయము, కాదు, అనన్యప్రకాశనీయంబులు = ఇతరులకు వెల్లడింపఁదగనివి, ఐన ప్రేమభంగులన్ = అయిన వలపురీతులను, ఏమి యేమి, వ్రాసినాఁడో, ఆకాముకుని కూర్ములు = ఆ ప్రియుని యనురాగము దెలుపు వాక్యములను, అతని సతియె = అతని భార్యయె, కడున్, రహస్యంబు, కాఁగన్, చదువుకొని, మోదసంపదన్=సంతోషాతిశయముచేత, పొదలనిమ్ము =వర్ధిల్లనిమ్ము.

వి. :—నాయికా నాయకుల కొండొరులయందు మనస్సు దృఢముగా లగ్నమగుట ప్రేమ మనఁబడును. ఈ పద్యమునందలి శుచిముఖి మాటలలోని భావమునే రాగవల్లరియుఁ బ్రదర్శించి యుండెను కాని 'నాకుఁ జదువఁ దగద యింతనుండి మిక్కిలిన్ బచ్చిగాఁగ వలపు తేటపఱిచి వ్రాసినాఁడొనీయిచ్చఁ జదువుకొనుము'అను రాగవల్లరివాక్యమున శుచిముఖి పలుకులందలి సౌకుమార్యము చూపట్టును. దీనివలన శుచిముఖియొక్క చాతుర్యము, ప్రౌఢియు, వ్యక్తములు.

క. ఓ వనిత ! లేఖలోనఁ బ్రభావతి యనఁ బోయి ప్రప్రభాభావతి యం
చీ విధమున వ్రాసిన భ్రాంత్యావిష్టుం డేమి వ్రాయఁడమితపుఁ గూర్ముల్. 46

అర్థము:—ఓ వనిత, లేఖలోనన్, ప్రభావతి, అనఁబోయి = అని వ్రాయఁబోయి, ప్రప్రభాభావతి, అంచున్, ఈ విధమున, వ్రాసిన, భ్రాంత్యావిష్టుఁడు = భ్రమచే నావేశింపఁ బడినవాఁడు - భ్రమకు వశమైనవాఁడు అని భావము. అమితపుఁ గూర్ముల్ = మితిలేనట్టి ప్రేమను దెలుపు మాటలను, ఏమి, వ్రాయఁడు. ఏమియైనను మానక వ్రాసియే యుండునని తాత్పర్యము.

వ్యా. :—అమితము + కూర్ములు - పుంపులు, నుగాగమమును కలుగఁగా - అమితపుఁ గూర్ముల్ - అని సిద్ధించెను. భ్రాంతి + ఆవిష్టుఁడు - భ్రాంత్యావిష్టుడు. యణాదేశసంధి.

వి. :—పేరు వ్రాయుటలోనే ఒకమాఱు వ్రాయఁదగిన యక్షరము రెండేసిమాఱులు వ్రాయుట తనివినొందని ప్రేమచేత నని తెలియుచుండ నింకను బ్రేమను దెలుపువిషయము లెన్ని వ్రాయఁడు ? అని భావము.

అలం:—కావ్యార్థాపత్త్యలంకారము, అనుమానాలంకారను.

క. వెఱఁ గయ్యెడు నే నపు డీ తరుణిగుణంబులు నుతింపఁ దాను విరక్తి
స్థిరునట్ల యుండి తోడన, విరహార్తుఁడ నైతి ననుట వివరింపఁ జెలీ. 47

అర్థము:—చెలీ, నేను, అపుడు, ఈ తరుణి గుణంబులు = ఈ చిన్నదాని గుణంబులు, నుతింపన్ = వర్ణించుచుండఁగా, తాను, విరక్తి స్థిరునట్లు + అ = అనురాగము లేమియందు నిశ్చలునివలె - ఏమియు ననురాగము లేనివానివలెనని భావము. ఉండి, తోడనె = వెంటనే, విరహార్తుఁడను = ఎడఁబాటుచే పీడింపఁ బడినవాఁడను, ఐతిన్, అనుట, వివరింపన్ = ఆలోచింపఁగా, వెఱఁగు = ఆశ్చర్యము, అయ్యెడున్ = కలుగుచున్నది.

తాత్పర్యము:—చెలియా నే నీప్రభావతి గుణములు వర్ణించుచుండ ప్రేమలేమిచేతఁ జలింపని మనస్సుగలవానివలె నుండి, వెంటనే యెడఁబాటువలనిపీడ నొందితి నని వ్రాయుట చూడ నాకే యాశ్చర్యము కలుగుచున్నది.

వి. :— విరక్తి స్థిరుఁడు - రక్తియన ప్రేమము - తద్విరుద్ధము విరక్తి = ప్రేమలేకుండుట, దాని యందు స్థిరుఁడు - అనఁగా చలింపని మనస్సుగలవాఁడు.

క. ప్రాయపువాఁడఁట సదృశ శ్రీయుక్తిఁ దలిర్చు బిత్తరిన్ వినునఁట యూ
హా యాతనియాత్మ యినుమొ, యాయో కులిశంబొ నెఱి దొలఁగక యుండన్. 48

అర్థము:— ప్రాయపువాఁడు + అఁట = యౌవనవయసు గలవాఁడఁట, సదృశ శ్రీయుక్తిన్ - సదృశ = సమానమగు, శ్రీ = శోభయొక్క, యుక్తిన్ = కలయికచే - సమాన మగుచక్కఁదనము గలుగుటచే, తలిర్చు = ప్రకాశించు, బిత్తరిన్ = విలాసవతిని గుఱించి, వినునఁట = విన్నాఁడఁట, (ఆ మీఁద) నెఱి = స్థైర్యము, ధృతి, తొలఁగక = పోవక, ఉండన్ = ఉండుటకు, ఆతనియాత్మ = ఆ పడుచువాని హృదయము, ఇనుమొ = ఇనుమా, లేక, యాయో = యాయియా, కులిశంబో = వజ్రాయుధమా ?

అలం:—ప్రతిషేధము, సమము.

వ. అదియునుం గాక. 49

గీ. సకలసౌభాగ్య భాగ్యలక్షణ గుణైకఖని ప్రభావతి సిద్ధసంకల్ప గాక
యుండునేని శాస్త్రము లిన్నియును బుధులకు, బ్రత్యయానర్హతనువృథాభరమె కావె.

అర్థము:—సకల...ఖని, సకల = సమస్తమైన, సౌభాగ్య = (ప్రియున కానందము గలిగించు) చక్కదనమునకును, భాగ్య=అదృష్టమునకును, లక్షణ = గుఱుతులైన, గుణ = 'సకల' దీనితో నన్వయము) గుణములకు, ఏక = ముఖ్యమగు, ఖని = గని (వంటిది) యగు, ప్రభావతి, సిద్ధసంకల్ప = నెఱవేఱిన తలఁపుగలది, కాకయుండునేని = కాకుండినయెడల - సకలమగు సుగుణ స్థానము కాన, ఈమె తలఁచినపని నెఱవేఱకయే యుండునేని అని భావము. శాస్త్రములు + ఇన్నియును = లక్షణములచే ఫలములను నిర్ణయించి చెప్పుసాముద్రికాది శాస్త్రములన్నియును, ప్రత్యయానర్హతను = విశ్వసింపఁదగని వగుటచేత, బుధులకున్ = పండితులకు, వృథాభరమె = వ్యర్థమగు బరువైనవే, కావా = అగు నన్నమాట.

తాత్పర్యము:—సౌభాగ్యమునకు నదృష్టమునకు చిహ్నములైన సకలసుగుణములు గల యీప్రభావతి తాను సంకల్పించినది సిద్ధింపకుండుటయే కల్గునేని సకలశాస్త్రములును నమ్మఁదగినవి కాక, పండితులకు వ్యర్థమగు బరువుగాఁ గావలసివచ్చును.

అలం:—సంభావనము, అతిశయోక్తిభేదము - అని, కావ్యప్రకాశము.

వి. :—విధి (అవశ్యము చేయవలసినది) నిషేధము (తప్పక విడువఁదగినది) యీరెంటిని దెలుపునట్టి వేదములును, మన్వాదిస్మృతులును, శాస్త్రములు. - వ్యాకరణ పురాణేతిహాసాదులును, గజాశ్వశకున సాముద్రికాదులునుగూడ శాస్త్రములే యనిరి కొందఱు - ఇవి యన్నియుఁ గూడ నమ్మటకు వీలు లేక పోవలసి వచ్చును. పండితులు వానిని జదువుటయు వృథా భారమే యగును.

వ. అనినం బ్రభావతి దాని కిట్లనియె. 51

సీ. ఇపుఁ డేమి గంటి? నాకెక్కడిసిద్ధసంకల్పత? గుమ్మడికాయలోన
నావగింజయుఁ బోదు హంసి! నాచింతాభరంబులో లేశమాత్రము నుడుగుట
గలదె యీవేళకుఁ దలపోసి చూచినఁ, దాదృశాశ్చర్య సౌందర్య కోమ
లాంగుఁ డవ్విభుఁడు నాకై యెంత యలసెనో, యెంత కుందెనో యనునట్టి వెతయు

గీ. నొకటి తొంటికంటె విశేషమొదవె నేఁడు, దీనిఁ దరియింప నికనెద్ది తెరువు చెపుమ
యసురపతి యెల్లఁ డాతనియల్లుఁ దనము, పురమితని యాజ్ఞలే కెట్లుఁ జొరఁగరాదు. 52

అర్థము:—హంసి = ఓ శుచిముఖీ, ఇపుడు, ఏమి, కంటి = ఇప్పు డేమి చూచితివి. (నన్ను సిద్ధ సంకల్ప వనుట కేమి చూచి యంటివని భావము) గుమ్మడికాయలోనన్ = గుమ్మడికాయ యంతటి పెద్ద సంకల్పములో, ఆవగింజయు = ఆవగింజయంతటి యతిసూక్ష్మాంశముకూడ, పోదు = నెఱవేఱదు, నాకున్, ఎక్కడిసిద్ధసంకల్పత = సంకల్పము నెఱవేఱుట యెక్కడ? నెఱవేఱదని భావము, తలపోసి = (మొదటినుండియు జరిగినది) జ్ఞప్తికిఁ దెచ్చుకొని, చూచినన్ = పరిశీలించినచో, ఈవేళకున్ = ఇప్పటి వఱకు, నాచింతాభరమ్ములోన్ = నాయొక్క విచారాతిశయములో, లేశమాత్రము = కొంచెమేనియు, ఉడుగుట గలదె = తగ్గుట యున్నదా - లేదని భావము. (ఇది యిట్లుండ) తాదృశ...కోమలాంగుఁడు, తాదృశ = అటువంటి, ఆశ్చర్య = అద్భుతమైన, సౌందర్య = చక్కఁదనముగలట్టియు, కోమల = సుకుమారమైన, అంగుఁడు = దేహముకలవాఁడు, అవ్విభుఁడు = ఆప్రభువు, నాకై, ఎంత, అలసెనో = డస్సెనో, ఎంత, కుందెనో = ఖేదపడెనో, అనునట్టి వెతయున్ = అనునీరీతి వగపు, ఒకటి = మఱొకటి, తొంటికంటెన్ = మునుపటికంటెను, నేఁడు, విశేషము = అధికమై, ఒదవెను = కల్గెను. దీనిన్ = ఈవిచారమును, తరియింపన్ = దాఁటుటకు, ఎద్ది = ఏది, తెరువు = త్రోవ, (ఉపాయము) చెపుమ=

చెప్పుము, అసురపతి = రాక్షసరాజు (వజ్రనాభుఁడు), ఆతనియల్లుఁడనమున్ = ఆప్రద్యుమ్నుఁ డల్లుఁడగుటను, ఒల్లఁడు=ఇష్టపడఁడు, ఇతనియాజ్ఞ = ఈ నా తండ్రి శాసనము, లేక, ఎట్లును = ఏరీతిగను, పురము = పట్టనమందు, చొరఁగరాదు = (ప్రద్యుమ్నునకు) ప్రవేశింపరాదు.

తాత్పర్యము:—ఇప్పు డేమి చూచి సిద్ధసంకల్పనంటివి. నాకుఁ దలఁచినపని నెఱవేఱుట యెక్కడిది? ఈ యుత్తరము వచ్చుట గుమ్మడికాయలో ఆవగింజయుఁ గాదు. నాఖేదము నేఁటిదాఁక లేశమును తగ్గినదా? ఇది యిట్లుండ అంతటిచక్కని మృదువగు దేహము గల యాప్రభువు నాకై యెంత డస్సెనో ఎంత వగచెనో యనునింకొకపీడ మునుపటికంటె అధికముగా కల్గినది. దీని నెట్లు దాఁటుదునో యుపాయము చెప్పుము. వజ్రనాభుఁడు ప్రద్యుమ్నుఁ డల్లుఁడగుట కొప్పఁడు. అతని యనుమతిలేనిదే ప్రద్యుమ్నుఁ డీపురమునఁ జొర వీలులేదు.

అలం. :—లలితము, కావ్యలింగము, విషమము.

వి:— "గుమ్మడికాయలో నావగింజయుఁబోదు "అనునది లోకోక్తి. పెద్దపనియందు నే కొంచెమును నెఱవేఱనప్పు డుపయోగింతురు. దీనియం దాశయు, నిరాశయు రెండును స్ఫురించును.

వ్యా. వి. :—అల్లునియొక్క భావము. సూ. "తనవర్ణకంబు తాదర్థ్యంబునం దగు." బాల. తద్ధిత, 1 - అల్లు (యొక్క) తనము - సూ. ఉదంతస్త్రీసమంబులకును నదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు. బాల. సంధి. 35. కాని 'అల్లుఁడు' జాతివాచక మనినను, లేక అల్లువాఁడు = (మామకుటుంబమున) నల్లుకొనువాఁడు, అను వ్యుత్పత్తిగల 'అల్లువాఁడు' అనుదాని రూపాంతర మగుటచే ధాతుజవిశేషణ మనినను 'నుగాగమము' ప్రాప్తింపక, 'రాముతనము' వలెనే 'అల్లుతనము' అనియే యుండును. అయినను ముద్రితప్రతులు రెంటను 'అల్లుఁడనము' అని నుగాగమ విశిష్టమై యున్నది. దాని కాధారము కనఁబడదు.'వెజ్జుఁదన మేల యని మది లజ్జ వొడమి' మనుచ. 5. 13 లోని 'వెజ్జుఁదనము' అనునదియు నిట్టిదే. అల్లుందనము, వెజ్జుందనము' వంటి నిర్ధారకములు దొరకినచో నిట్టివి ప్రయోగవిశేషము లనఁదగి యుండును.

వ. అనుటయు శుచిముఖి ప్రభావతి కిట్లనియె నోపువ్వుఁబోఁడి నీపలికినయంతయుఁ దప్పదు నీవిభునిరాకకు నాకవిరోధి యనుమతి సాధించుటకు నుపాయం బొక్కటి గలదు. దాని నేన యెఱుంగుదు నీకు ననువైన సమయంబున నన్ను సరసకథాప్రవీణ యనియును సకలవిద్యాధురీణ యనియును బ్రభువుల నుబుసుపుచ్చి మెచ్చింప నేర్చు ననియును నిచ్చకు వచ్చునట్లుగా భవజ్జనకుం జెప్పి సమ్ముఖమునకు రప్పించుకొనునట్లుగాఁ జేయు మటమీఁదటి కార్యమునకు దైవంబు గలదు పోయివచ్చెద నిచ్చటికోలంకులన యుండెదఁజుమీ మాట వడిన పిలిపింతు గాని యనుచు వారిద్దఱు వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ బ్రభావతియు సఖీసహితయై గృహంబున కరిగె నంత నక్కాంత యొక్కసమయంబున. 52

అర్థము :—ఓపువ్వుఁబోఁడి = పువ్వువంటి మేనుగల యోప్రభావతీ! నీపలికినయంతయున్ = ప్రద్యుమ్నుని యల్లుతనము వజ్రనాభుఁ డంగీకరింపమియు, నతనియనుమతి లేక ప్రద్యుమ్నుఁ డపురమునఁ జొరలేకపోవుటయు, తప్పదు = నిజమే యగును. (అయినను) నీవిభునిరాకకున్ = నీమగఁ డిటకు వచ్చుటకు, నాకవిరోధి = స్వర్గమునకు (అసఁగా లక్షణచే స్వర్గమునందలివారికి) పగవాఁ డగువజ్రనాభుని యొక్క, అనుమతిన్ = అంగీకారమును, సాధించుటకున్ =సంపాదించుటకు, అనువు=అనుకూలము, వీలు, సరసకథాప్రవీణ=చక్కనివృత్తాంతములను జెప్పుటయందు నేర్పరి, సకలవిద్యాధురీణ = అన్నిశాస్త్రములకు

భారవాహాకురాలు (అనఁగా అన్నివిద్యలయందుఁ బాండిత్యము గలది యని భావము), ఉబుసుపుచ్చి = వేడుకమాటలతో పనిలేనికాలము గడిపి, ఇచ్చకున్ = మనస్సునకు, వచ్చునట్లుగా, భవన్+జనకునకున్ = నీతండ్రికి, సమ్ముఖంబునకున్ = ఎదుటికిని, రప్పించుకొనునట్లు = తనకొఱకై పిలిపించుకొనురీతిగా, దైవంబు = అదృష్టము, కొలంకులన్+అ = సరస్సులందే, మాటపడిన్+అ = చెప్పినవెంటనే, (మాట బడిన - అనిపాఠాంతరము) నన్నుఁబిలుపింపుమని నీ తండ్రి యనినచో ఆమాట వెంబడినే అని భావము. పిలిపింతుగాని = పిలిపింపుదును, (ఇటతద్ధర్మాద్యర్థకమునకు విధి యర్థము, కాని యనునది 'కాక' అనుదాని వలెనే వాక్యాలంకారము.) వీడ్కొని = విడిచి, నిజేచ్ఛన్ = తన యిచ్చవొప్పున, సఖీసహిత = చెలికత్తెతోఁ గూడుకొన్నది.

వి.:—ఇంతదనుక శుచిముఖి - ప్రభావతితో ప్రద్యుమ్నుఁడు తనకొఱకు వచ్చునను నట్లే కాని యేయొక మాటయందును వజ్రనాభవధ నిమిత్తము వచ్చునని స్ఫురింప సీయలేదు. ఎంతటిక్రూరుఁడైనను తండ్రియొక్క మృతి యనినచో ప్రభావతి యిష్టపడదు. ఒకవేళ కామాధీనయై యిష్టపడినను మనసున కష్టపడుచుండుట వైరస్యాపాదకము కావచ్చునను దూరదృష్టితోనై యుండును. మఱియు వజ్రనాభు నెదుటకు ప్రభావతి తన్ను రప్పించుట కాదఁట. వజ్రనాభుఁడే తనకై రప్పించుకొనునట్లు ప్రభావతి చెప్పవలెననుటలో ప్రభావతిమౌగ్ధ్యమును శుచిముఖిప్రౌఢియు వ్యంగ్యములు.

చ. వెలుపలికొల్వు వీడ్కొలిపి ✽ విశ్రుతతేజుఁడు వజ్రనాభుఁ డిం
పలరఁగ రాణివాసమున ✽ నాడెడి పాడెడి పువ్వుఁబోండ్ల సే
వలు గొనుచుండఁ జేరి తగు ✽ వర్తన నొప్పుచుఁ ద న్నతండు వ
త్సలతయు గారవంబు వెదచల్లెడు మాటల నాదరింపఁగన్. 54

అర్థము:—విశ్రుతతేజుఁడు - విశ్రుత=ఎల్లరచే వినఁబడినది, ప్రసిద్ధము - అగు తేజుఁడు=ప్రతాపము గలవాఁడు,(అగు) వజ్రనాభుఁడు, వెలుపలి కొల్వు=వెలుపల నున్నట్టి సభను, (ఇట సభయనఁగా సభయందలి జనము అని లక్షణార్థము) వీడ్కొలిపి = సెలవిచ్చి పంపి, ఇంపు + అలరఁగన్ = సంతసముగలుగఁగా, రాణివాసమునన్ = అంతఃపురమునందు, ఆడెడి...సేవలు - ఆడెడి=నాట్యము చేయునట్టియు, పాడెడి = గానమొనర్చునట్టియు, పువ్వుఁబోండ్ల = స్త్రీలయొక్క (వేశ్యలయొక్కఅని భావము), సేవలు = ఉపచారములు, కొనుచున్ = స్వీకరించుచు, ఉండన్ = ఉండఁగా, చేరి = సమీపించి, తగువర్తనన్ = తండ్రికడ వర్తింపఁదగినవిధమున చరించుటతో, ఒప్పుచున్, తన్నున్ = ఆ ప్రభావతిని, అతండు = తండ్రి, వత్సలతయున్ = అనురాగమును, గారవంబున్ =ముద్దును, వెదచల్లెడు=ప్రకటించు, మాటలన్, ఆదరింపఁగన్ = మన్నింపఁగా - (మీఁది కన్వయము)

తా.:—ప్రసిద్ధమగు ప్రతాపము గల యావజ్రనాభుఁడు బహిరంగసభ పూర్తిచేసి, అందలివారికి సెలవిచ్చిపంపి సంతసమున నంతిపురములోనికి వచ్చి వేశ్యలయాటపాటలు వినుచున్నసమయమున ప్రభావతి సమీపించి యుచితరీతిని ప్రవర్తించుచు తన్ను నాతఁడు ప్రేమయు, ముద్దును ప్రకటించు మాటలచే మన్నింపఁగా,

వి. :—వత్సలత = బాలురయందుఁ బెద్దవారు చూపెడు ప్రేమ విశేషము. వత్సము = పుత్రాదులగు స్నేహపాత్రులందుఁ జూపెడు నభిలాషము-అది కలవాఁడు వత్సలుఁడు. (వత్స+లచ్) - వాని భావము- వత్సలత, వత్సలత్వము, వాత్సల్యము - అని రూపసిద్ధి.

వ్యా. వి. :— ఆడెడి + పాడెడి - విశేషణోభయ పదకర్మధారయము. ఆడెడి పాడెడి+పువ్వుఁ బోండ్లు - విశేషణ పూర్వపద కర్మధారయము. ఆడెడి వారొకరు, పాడెడువారొకరు అగుచో ద్వంద్వ సమాసమై, ప్రౌఢవ్యాకరణమునఁ జెప్పిన 'సూ. ద్వంద్వంబునం బూర్వ పదాంత్యావయవంబునకు లోపం

బొంజెనగు' నను దానికి లక్ష్యమగును. ఇట అట్లుగాక యాడెడివారును, పాడెడివారు; నొకరే కొన సామా నాధికరణ్యమున కర్మధారయమే యగును.

వ. తదీయరత్నసింహాసనసమీపంబునఁ బ్రవర్తిల్లుచు నల్లన ప్రసంగంబు దిగిచి సవినయ మధురభాషణంబుల ని ట్లనియె. 55

అర్థము:—తదీయ = అతని (తండ్రి) సంబంధమైన, రత్న = మణివికారమైన, సింహాసన = రాచగద్దెయొక్క, సమీపంబునన్ = చేరువయందు, ప్రవర్తిల్లుచున్ = సంచరించుచు, ప్రసంగంబు = ప్రస్తావన, తిగిచి = తెచ్చి, సవినయమధురభాషణంబులన్ = అడఁకువతోఁగూడినట్టియు, తియ్యనివగు పలుకులతో, ఇట్లు = చెప్పఁబోవురీతిగా, అనియెన్.

క. మన బొడ్డనబావులలో, ననుదినముఁ జరించు నంచగలం బొక హంసా
గన యేమి చెప్పఁ దండ్రీ, కని విని నే నెందు నెఱుఁగ గని విద్యలకున్. 56

అర్థము :—తండ్రీ, మన బొడ్డనబావులలోన్ = మనకోనేఱులలో (నడుమనూయి గల కోనేఱును బొడ్డనబావి - యందురు.) అనుదినమున్ = ప్రతిదినమందును, చరించునంచలయందున్ = మసలుచుండు హంసలలో, ఒకహంసాంగన = ఒకయాఁడుహంస, (కలదు. అధ్యాహారము) చెప్పన్ = చెప్పుటకు ఏమి (ఉన్నది) నేను, ఎందును, కని = చూచి, విని=వినియు, ఎఱుఁగను, (అది) విద్యలకున్= సకలశాస్త్రములకును, గని = స్థానము (సుమా).

తాత్పర్యము:—తండ్రీ! మన కోనేఱులలో ప్రతిదినము తిరుగుచుండు హంసలలో నొకయాఁడు హంస కలదు. దానిఁ గూర్చియేమి చెప్పుదును? అది యెల్ల విద్యలకుఁ గని సుమా! అట్టిదాని నెందును నేను కనలేదు, వినలేదు.

చ. శుచిముఖి యండ్రు దానిని వచోనిపుణత్వమునందు సత్కథా
రచనలయందు నీతివిదురత్వమునందు బహుశ్రవావలో
కచణతయందు నెందు సరి గానము దానికి వేయు నేల దా
ని చతురతా విశేషములు గీవ కనన్ వలయున్ మహాత్మకా. 57

అర్థము:—మహాత్మకా = గొప్ప మనస్సు గలవాఁడా, దానిని, శుచిముఖి, అండ్రు = అందురు, వచోనిపుణత్వమునందున్ = మాటాడుటలోని నేర్పునందును, సత్కథారచనల యందున్ = ఉత్తమమగు వృత్తాంతముల సృష్టియందును, నీతి విదురత్వమునందున్ = నీతిశాస్త్ర వేత్తృత్వమునందును, అనఁగా నీతిశాస్త్రమును బాగుగా తెలిసియుండుట యందును, బహు...చణత యందును - బహు = పెక్కు (శాస్త్రాది విషయములు) శ్రవ = వినుటచేతను, అవలోక = చూచుట చేతను, చణతన్ = (కలిగిన) ప్రసిద్ధియందును, దానికిన్ = ఆ హంసికి, ఎందును = ఏతావునను, సరి = సమానమగు దానిని (వానిని) కానము = చూడము, వేయున్ + ఏల = వేయిమాట లెందులకు, దాని చతురతా విశేషములు = దాని యొక్క నేర్పునందలి విశేషములు, నీవు + అ = నీవే, కనన్ వలయున్ = చూడవలెను.

తాత్పర్యము:—మహాత్మా! దానిపేరు శుచిముఖి. మాటలాడు నేర్పునందును, మంచి కథలను నిర్మించి చెప్పుటయందును, నీతిశాస్త్ర పాండిత్యమందును, పెక్కువిషయములు వినుట వలనను, చూచుట వలనను కలిగిన ప్రసిద్ధియందును - (లౌకికజ్ఞాన సమృద్ధియందును) దానికి సాటి యెచటను చూడము. పెక్కుమాట లెందులకు? దాని నేర్పరితనమును నీవు స్వయముగా చూచితీరవలెను.

వ్యా. వి. :—అంద్రుః అను+దు+రు. సూ. తి, దు, ట లు పరంబగునపుడ ద్వ్యాగముల 'ను' స్థానంబున సున్నయు నుండు. 'దు' లోపంబును విభాషనగు. బాల. క్రియా. 58. చే. అం+దు+రు-కాఁగా సూ. ఇట బిందువు మీఁది 'త,ద' లకు నిత్యవైకల్పికంబులయి 'ట,డ' లగు. బాల. క్రియా. 59 చే. అండురు, (అందురు) అగును. సూ. 'రు' వర్ణకంబు పరంబగు నపుడు సున్నమీఁది త, ద, డ, ల యుత్వంబునకు లోపంబు విభాషనగు. బాల. క్రియా. 62 చే - అంద్రు. అను రూపము సిద్ధించెను.

తే. అనుడు నాదైత్యపతి తనకోయనుఁగుఁగూఁతు,మాట లొక ముద్దు సేయుచుఁజోటిఁ బనిచి
యమ్మ! రప్పింపవే చూత కమ్మరాళి, ననియె నింతియు రప్పించెఁహంసి నపుడ.

అర్థము:—అనుడున్ = అనిన పిదప, ఆదైత్యపతి = ఆ రాక్షసరాజు (వజ్రనాభుఁడు), తన యనుఁగుఁ గూఁతు మాటలు = తన ప్రియ పుత్రిక యొక్క పలుకులను, ముద్దుసేయుచున్ = లాలన పూర్వకముగా నాదరించుచు, అమ్మ, (వాత్సల్య ద్యోతకము) బోటిన్ = చెలికత్తెను, పనిచి = పంపి, అమ్మరాళిన్ (ఆ + మరాళిన్) = ఆ హంసిని, రప్పింపవే = రావింపుము, చూతము, అనియెను, ఇంతి యును = ప్రభావతి గూడ, హంసిన్ = శుచిముఖిని, అపుడు + అ, రప్పించెన్ = (చెలికత్తె నంపి) రావించెను.

వ. రప్పించి ముందట నిడుకొని శుచిముఖి! నీదు విద్యావిలసనంబు విన్నవించిన నయ్య వినవలయు నని వేడుకపడుచున్నవాఁడు. శాస్త్రప్రసంగంబు సేయు మనిన నదియును.

అర్థము:—రప్పించి=అట్లు రావించి, ముందటన్=తనయుందు, ఇడుకొని = నిలుపుకొని, శుచిముఖి, (సంబోధనము) నీదు విద్యావిలసనంబు = నీచదువుల యొక్క ప్రకాశమును, (నేను) విన్నవించినన్, అయ్య = తండ్రి, వినవలయును, అని, వేడుక పడుచున్నవాఁడు = ఉత్సాహపడుచున్నాఁడు, శాస్త్ర ప్రసంగంబు = శాస్త్రములయొక్క ప్రస్తావన, చేయుము - శాస్త్రములం దేదే నొక విషయమునైఁ ప్రసం గింపు మని భావము. అనినన్, అదియును = ఆ శుచిముఖియును.

క. వీనులకు సుధారసముల, సోనలు వర్షించు మృదులసుస్వరఫణితిం
దా నిట్టటు గ్రుక్కక పని, లేనిపునఃపదము లిడక లీల దలిర్పన్. 60

అర్థము:—వీనులకున్ = చెవులకు, సుధారసముల సోనలు = అమృతరసములయొక్క జల్లులను, వర్షించు=కురియునట్టి, మృదుల సుస్వరఫణితిన్=మెత్తని, మంచి కంఠధ్వనిగల వాక్కుచే, ఇట్టు + అటు - ఇట్టటు = ఇటునటు, గ్రుక్కక = తొట్రుపడక, పనిలేని = ఉపయోగింపని, పునఃపదములు = రెట్టించిన మాటలు - (అనఁగా ప్రకృతమున కుపయోగింపనివియు, ఇదివఱ కొకసారి చెప్పినవియు నగు మాటలు - పునరుక్తము లని భావము.) ఇడక = ఉపయోగింపక, లీల = విలాసము, తలిర్పన్ = ఒప్పగా. (మీఁది కన్వయము.)

వి:—మాటాడునపుడు చెప్పినమాటనే మరల మరల చెప్పిన విరసముగాఁ గనఁబడును. అట్టిదోషము లేకుండ పలుకుట ప్రౌఢి యనఁ బడును. గౌతమమతమునఁ జెప్పఁబడిన పదాఱుపదార్థములలో పదియాఱవ దగు నిగ్రహస్థానము (పరాజయ నిమిత్త మగునది) నందలి ప్రతిజ్ఞాహాని మున్నగు నిరువదినాలుగు భేదములలో 'పునరుక్తము' ఒకటిగా పరిగణింపఁబడినది. వాదమం దట్టిపునరుక్తము కలిగినయెడ ఆవాది పరాజితుఁ డైనట్లు చెప్పఁబడును. కాన పునరుక్తము పరాజయమునకు నిమిత్తమనఁబడినది. అదియే యీ పద్యమున పునఃపదము - అని మధ్యమపదలోప సమాసముగా ప్రయుక్త మైనది.

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్త శాస్త్రంబు వ
క్కాణించెన్ గడుఁ బూర్వపక్షములు జోఁకన్ బెంచుచున్, బెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దుదిన్ సిద్ధాంతముల్ నిల్పుచున్. 61

అర్థము:—పూర్వపక్షములు = వాదమునకుఁ బ్రశ్నరూపమగు మొదటియంశములను, జోఁకన్ = వేడుకతో, కడున్ = అధికముగా, పెంచుచున్ = వృద్ధి చేయుచు, పెంచి, అట్లు వృద్ధిచేసి, అక్షీణ ప్రౌఢిన్ = క్షీణింపని - ఎక్కువైన నేర్పుతో, తిరస్కరింపుచున్ = నిరాకరించుచు - ఖండించుచు, తుదిన్ = చివరకు, సిద్ధాంతమున్ = తగిన యుత్తరములను (ప్రమాణములచే నిర్ణీతమగు విషయము సిద్ధాంత మనఁబడును) నిల్పుచున్ = స్థిరపఱుచుచు, కాణాదంబును=(కణాదుఁడను ఋషిచే ప్రోక్తమైన) వైశేషిక మనుశాస్త్రమును, గౌతమీయమును = (గౌతమమునిప్రోక్త మగు) న్యాయశాస్త్రమును, సాంఖ్యంబున్ = (కపిలఋషిప్రోక్త మగు) తత్త్వశాస్త్రమును, భుజంగాగ్రణీమార్గమున్ - భుజంగ = సర్పములలో, అగ్రణీ = (ముఖ్యుఁడగు శేషునియవతారమగు) పతంజలియొక్క, వాణీమార్గమున్ = వాక్కులపద్ధతిని - యోగశాస్త్రము లేదా వ్యాకరణమహాభాష్యమును, జైమినీయమతమున్ = జైమినిమహర్షిప్రోక్త మగు పూర్వమీమాంసామతమును, వ్యాసోక్తశాస్త్రంబున్ = వ్యాసునిచే ప్రోక్తమగు నుత్తరమీమాంసా శాస్త్రమును, వక్కాణించెన్ = వ్యాఖ్యానించెను. అనఁగా స్ఫుటముగా నుపన్యసించెనని భావము.

తాత్పర్యము:—వైశేషికము, న్యాయము, సాంఖ్యము, యోగము, పూర్వోత్తర మీమాంసాశాస్త్ర ములు - వీనినే షడ్దర్శనము లందురు. కొందఱు యోగమునకు మాఱుగా "పాణినే రెమినే శ్చైవ వ్యాసస్య కపిలస్యచ, కణాద స్యాక్షపాదస్య దర్శనాని ష డేవహి" అని పాణినీయమును చెప్పిరి. ఈ యాఱింటియందు నొక్కొక్క (దర్శనము) శాస్త్రము నెత్తుకొని యం దెన్నియో పూర్వపక్షములను జేయుచు, ఆ చేసినవాని నన్నిటిని దననేర్పుబలిమిని ఖండించి తుదకు నన్నిటియందును సిద్ధాంతములను స్థిరపఱుచుచు స్ఫుటముగా నుపన్యసించెను. ఏ శాస్త్రమం దెన్నిపూర్వపక్షము లానర్చెనో వాని నన్నిటిని నాశాస్త్రపద్ధతినే ఖండించుచు, సిద్ధాంతములను నిలుపుచు వచ్చె నని భావము.

వి. :—వైశేషికము, దీనినే కాణాదమందురు. (కణాదుఁడు చెప్పెనుగాన) విశేష మగు పదార్థము గల దనువారు వైశేషికులు. "నిత్యము లగుపరమాణువులు మొదలగువానియందుఁ బరస్పరభేదమును దెలుపు ధర్మము విశేషము. ఈ మతమున ద్రవ్యాదులగు సప్తపదార్థములు విచారింపఁబడును. ఈ విచారమువలన దుఃఖనాశరూప మగు మోక్షము వచ్చును." అని యిందుఁ జెప్పఁబడును.

గౌతమీయము:—గౌతమునిచే రచింపఁబడినన్యాయశాస్త్రము. దీనియందు 'ప్రమాణ, ప్రమేయ, సంశయ, ప్రయోజన, దృష్టాంత, సిద్ధాం, తావయవ, తర్క, నిర్ణయ, వాద, జల్ప, వితండా, హేత్వాభాస, ఛల, జాతి, నిగ్రహస్థానములు' అను పదాఱు పదార్థములు నిరూపింపఁబడును. ఈ పదార్థ తత్త్వము నెఱుఁగుటవలన మోక్షము గలుగు నని యిందుఁ జెప్పఁబడెను.

సాంఖ్యము:— ఇది నిరీశ్వరము, సేశ్వరము అని ద్వివిధము.

నిరీశ్వర సాంఖ్యదర్శనము:—దీనికి కపిలాదులు కర్తలు. ఈ మతమున 'ప్రకృతి, మహత్తు, అహంకా రము, శబ్ద, స్పర్శ, రూప, రసగంధములు, త్వక్చక్షుః,శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములు, మనస్సు, పృథివ్యప్తే జోవాయ్వాకాశములు, పురుషుఁడు, అని పదార్థములు (తత్త్వములు) ఇరువదియైదు. ఇందు ప్రకృతి ప్రధాన మనుపేర పరసహాయము గాంచకయే ప్రపంచ నిర్మాణముచేయు ననియు - ఈ ప్రకృతికంటె వేఱగు పురుషు నెఱుంగుటయే మోక్షము' అనియుఁ జెప్పఁబడెను. అద్వైతు లీ ప్రకృతినే 'మాయ' అని యందురు.

సేశ్వరసాంఖ్య దర్శనము:— దీనికి పతంజలి ప్రభృతులు కర్తలు. కపిలాదులచే నిరూపింపఁ బడిన మీఁది యిరువదియైదు తత్త్వములేకాక 'ఈశ్వరుఁడు' అను నింకొక తత్త్వము కూడఁ జేర్పఁబడుటచే నీ దర్శనమున తత్త్వము (పదార్థము) లిరువదియాఱు.

పాతంజలము:—దీనిని యోగశాస్త్ర మందురు. మనసును బాహ్యపదార్థములనుండి మరలించి భగవంతునియందు నిలుపుట యోగము. యమనియమాదు లెనిమిదియు నీయోగమున కంగములు అని యిందు వివరింపఁబడును. మీఁదఁ జెప్పఁబడిన సేశ్వరసాంఖ్యమిదియే.

జైమినీయము:—జైమినిచే రచింపఁబడిన పూర్వమీమాంసాశాస్త్రము. యజ్ఞాదికర్మముల స్వరూపమును, వానిఫలములను, నాకర్మముల నొనర్ప నధికారముగలవారిని నీశాస్త్రము నిరూపించెను.

వైయాసకము:—వ్యాసప్రోక్తములగు బ్రహ్మసూత్రము లనుపేరఁ బ్రసిద్ధ మగు నుత్తర మీమాంస. జీవునికంటె వేఱుగాని బ్రహ్మయొక్క స్వరూపము చక్కఁగ నిందు విచారింపఁబడెను.

పాణినీయమునే గ్రహించినపక్షమున శబ్దమే బ్రహ్మము. ఆశబ్దబ్రహ్మము వర్ణములచే స్ఫుటమొనర్పఁ బడునట్టియు, అర్థములను స్ఫుటమొనర్చునట్టిదియుఁగాన 'స్ఫోటము' అను సంజ్ఞతో వ్యవహరింపఁబడును. ఆశబ్దబ్రహ్మమును (స్ఫోటమును) పొందుటకుసాధనము శబ్దానుశాసనము (వ్యాకరణము). అధికారి యాశాస్త్ర మందు నిష్ణాతుఁడు. బ్రహ్మమును బొందఁగోరు వాఁడావ్యాకరణము నవశ్యము పఠింపఁదగును. అని యీదర్శన సిద్ధాంతమైనట్లు మహాభాష్యకారులయు, వాక్యపదీయకర్త యొక్కయు నిర్ణయము.

మ. స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నేవేళ నె
ద్ది మతం బప్పుడు వానివానికి నుపాధిగ్రస్తతా వ్యాప్తిభం
గ ముఖానేక సుదూషణంబుల వెసం గల్పించుఁ దా నన్యశా
స్త్రమతస్థాపనవేళ నవ్విహగి దైత్యశ్రేష్ఠుఁ డోహో యనన్. 62

అర్థము:—అవ్విహగి = ఆయాఁడుపక్షి - శుచిముఖి, ఏవేళన్ = ఏసమయమందు, ఎద్ది = ఏదిన మతంబు = ఇష్టమో, (అద్ది = దానిని, అధ్యాహారము) దృఢానుమానములన్ = బలమైన యనుమా, ప్రమాణములచేత, స్వమతిప్రౌఢిన్ = తనబుద్ధిచాతుర్యముచేత, సంస్థాపించున్ = తిరుగు లేనట్లు నెలకొల్పును, అన్యశాస్త్ర మతస్థాపనవేళన్ = తా నింతకు మున్ను స్థాపించినశాస్త్రముకంటె నితరములగు శాస్త్రము లంగీకరించిన యభిప్రాయములను స్థిరపఱుపఁదలచిన సమయమందు, వానివానికిన్ = తా నింతకు మున్ను చెప్పిన యనుమానప్రమాణముల కన్నింటికిని, ఉపాధి...దూషణంబులన్-ఉపాధిగ్రస్తతా=ఉపాధి యను దోషముతోఁ గూడియుండుట, వ్యాప్తిభంగ=వ్యాప్తిభంగము, ముఖ=మొదలుగాఁగల, సుదూషణంబులన్ = నివారింపరాని దోషములను, దైత్యశ్రేష్ఠుఁడు = రాక్షసోత్తముఁడు, ఓహోయనన్ = బళీ యనునట్లు (ఇంతకు మున్ను తిరుగులేని వని చూపఁబడిన యనుమానప్రమాణములను వరుసగా నంతకంటె బలమైన ఉపాధిగ్రస్తత్వాది దోషములను జూపి ఖండించుట కాశ్చర్యపడి సెబా సని వజ్రనాభుఁడు మెచ్చుకొనునట్లు) వెసన్ = శ్రీఘ్రముగా - ఆలోచించి శ్రమపడకుండ వెనువెంటనే అనిభావము. కల్పించున్ = సృష్టించును. గట్టిదోషములను కల్పించునని భావము.

ఉపాధిగ్రస్తత్వము:—ఎచ్చట ధూమము (పొగ) ఉండునో అచ్చట వహ్ని (నిప్పు) ఉండు ననుట వాస్తవము. అట్లుగాక యెచట వహ్ని యుండునో, అచట నెల్ల ధూమ ముండు ననుట ఉపాధిగ్రస్త మనుదోష మగును. సాధ్య మున్నచోట నుండి సాధన మున్నచోట నుండనిది 'ఉపాధి' అని తర్కశాస్త్ర సిద్ధాంతము. సాధన (హేతువు) మగు వహ్ని యున్నచోట నెల్ల సాధ్య మగు ధూమమే యుండు ననుసెడ - అయోగోళకమున (కాల్చిన ఉక్కుగుండునందు) వహ్ని యున్నది. ధూమము

లేదు. కాన నిట్లనుట యనుమానదోషములలో "ఉపాధిగ్రస్తము" అను నొకదోష మగును. దానితోఁ గూడియుండుట "ఉపాధిగ్రస్తత. (త్వము)

వ్యాప్తిభంగము:—హేతువున్నచోటనెల్ల సాధ్య మున్నచో "వ్యాప్తి" యనఁబడును. ఆపర్వతము వహ్ని గలది. ధూమము కలది కాన, అను ననుమానమందు హేతువైన ధూమమున్న పర్వతమున తప్పక వహ్ని యుండును. కావున "యత్రధూమ స్తత్ర వహ్నిః" అని వ్యాప్తి. ఇట్టి యనుమాన ప్రమాణమున దోషమెట్లుండుననిన:—ఈభూభాగము లోహాదులచే అనఁగా గునపము మొదలగువానిచే (లేఖ్యము) భేదింపఁదగినది. పార్థివము (భూవికార) మగుటవలన - అనినచో ఎక్కడెక్కడ పార్థివత్వ (మట్టిసంబంధ) ముండునో యక్కడక్కడ లోహలేఖ్యత్వము (గునపము మొదలగువానిచే భేదించుట) కలుగవలెను గదా. కాని పార్థివ మైన వజ్రమునందు నీలోహ లేఖ్యత్వము పొసఁగదు. కాన వ్యాప్తికుదురలేదు. ఇట్టియనుమాన ములందు "వ్యాప్తిభంగము"అను దోషము పట్టిన దని తార్కిక సిద్ధాంతము.

వ. మఱియును. 63

గీ. కావ్య నాటకాలంకార గాన మదన, శాస్త్రపరిచయమహిమంబు జాలపాద
భామినీమణి నెఱపె నుద్దామపటిమ, నా యసురభర్త మెచ్చి పురే యనంగ. 64

అర్థము:—జాలపాద భామినీమణి = శ్రేష్ఠురాలగునాహంసి (జాలము=వలవంటి, పాదములుగలది. హంస - 'పక్షి' యని కేశవనిఘంటువు) కావ్య ... మహిమంబున్ - కావ్య = ప్రబంధములయొక్కయు - (శ్రవ్యకావ్యములయొక్క అని భావము), నాటక = నాటకములయొక్కయు, అలంకార = అలంకార శాస్త్రముయొక్కయు, గాన = సంగీతశాస్త్రము యొక్కయు, మదనశాస్త్ర=కళాశాస్త్రముయొక్కయు, పరిచయ = అభ్యాసమువలనఁ గలిగిన, మహిమంబున్ = పాండిత్యాతిశయమును, ఆ యసురభర్త = ఆరాక్షసరాజు, మెచ్చి = సంతోషించి, పురే యనంగన్="సెబాసు" అని పలుకఁగా, ఉద్దామపటిమన్= అధికమగు సమర్థతతో, నెఱపెన్ = ప్రకటించెను.

తాత్పర్యము:— ఆశుచిముఖి కావ్యములు, నాటకములు, అలంకార, సంగీత, కళాశాస్త్రములును తా నధికముగా నభ్యసించుటవలనఁ గలిగిన పాండిత్యవిశేషమునకు - రాక్షసరాజు సంతసించి సెబా సని మెచ్చుకొనునట్లు తన సామర్థ్యాతిశయమును ప్రకటించెను.

వి. కావ్యము:— (కవికర్మము కావ్యము అనివ్యుత్పత్తి) - శబ్దార్థసమన్వయము పూర్తిగా నైనపిదప వాక్యార్థము నలంకరించునట్టి యింకొక యర్థము స్ఫురింపఁజేయు శబ్దవ్యాపారము వ్యంజన యనఁబడును. అట్టివ్యంజనావృత్తిచేత కర్తవ్యములందు ప్రవృత్తిని (చేయఁదగినవానియందుఁ బ్రవర్తించుటను) నిషిద్ధములం దప్రవృత్తిని (వేదశాస్త్రములచే నిషేధింపఁబడిన యకార్యములందుఁ బ్రవర్తింపక పోవుటను) నుపదేశించు గ్రంథము. ఇట కావ్యము అన శ్రవ్యకావ్యము (రామాయణాదికము) అని తెలియఁదగును.

నాటకము:— పురాణాది ప్రసిద్ధుఁడగు ధీరోదాత్తుఁడు నాయకుఁడుగను, శృంగారవీరరసములలో నొకటి ప్రధానముగను, తక్కిన రసము లప్రధానములుగను, రచింపఁబడునది. దీనిని దృశ్యకావ్యము అందురు. కావ్య మొక్కటియే 'శ్రవ్య, దృశ్య' విభాగముచే రెండువిధములు అయినను, కావ్యశబ్దముచే శ్రవ్యకావ్యమును, నాటక శబ్దముచే దృశ్యకావ్యమును పండితులవ్యవహారమున గనఁబడుచున్నది.

అలంకారశాస్త్రము:—ఉపమాయమకాద్యలంకారములను, శృంగారాదిరసములను, మాధుర్యాది గుణములను, శబ్దార్థగతదోషములను లక్ష్య లక్షణ సమన్వితమొనర్చి బోధించుశాస్త్రము.

గానశాస్త్రము:—స్వర, తాళ, లయ, రాగాదిభేదముల బోధించుశాస్త్రము.

మదనశాస్త్రము:— స్త్రీ, పురుషజాతులను, సురతబంధవిశేషములను, దంతక్షత, నఖక్షతాది స్వరూప ప్రయోజనములను, మదనకళా స్వరూపమును, తత్సంబంధి విషయప్రపంచమును బోధించు శాస్త్రము. కామశాస్త్రమని, కళాశాస్త్రమని దీనినే యందురు.

వ. అంత నద్దనుజనాయకుండు శుచిముఖముఖం బవలోకించి నీవును నానాదిగంత చారిణివి నీ కనినయద్భుతంబు లే మేనియుం గలిగిన నెఱింగింపు మనవుడు నాయంచ యించుక విచారించుట యభినయించి యి ట్లనియె. 65

అర్థము:—అంతన్, ఆ + దనుజనాయకుండు = ఆరాక్షసరాజు, అవలోకించి = చూచి' నానాదిగంతచారిణివి = అన్నిదిక్కుల తుదలందు (గూడ) సంచరించుదానవు, (ఆదిగంతచారిణివి యనుపాఠమున దిక్కులతుదలపర్యంతము తిరిగెడుదానవు అని యర్థము.) ఇంచుక విచారించుట = కొంచె మాలోచించుట, అభినయించి = నటించి, ఇంతకు పూర్వమే యంతయు నిశ్చయించుకొన్నను, నాలోచించిన ట్లాతనికిఁ దోఁచునట్లు నటించి అని భావము.

గీ. కనినచోద్యంబు లెన్నియో ◌ కలవువాని, నేమి చెప్పుదు నందులో ◌ నెల్ల నాకు
నతివిచిత్రమై తోఁచిన ◌ యది నిశాచ,రాధిప వచింతు నొక్కటి ◌ యవధరింపు. 66

అర్థము:—నిశాచరాధిప=రాక్షసరాజా (నిశయందు చరించువారు రాక్షసులు) కనినచోద్యంబులు= చూచిన వింతలు, ఎన్నియో, కలవు, అవధరింపుము = చిత్తగింపుము. (వినుము అనిభావము.)

వ్యా. వి. :—అవధరింపు. సూ. 'మధ్యమపురుష ముపర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపపూర్ణ బిందువులు విభాష నగు. బాల. సంధి. 47.(ఇట వాక్యావసానము గాన ముపర్ణకమునకు లోపము కలిగినది.)

ఆ. నటుఁ డొకండు భద్ర◌నాముండు మ న్నొక్క,చోటఁ దాపససభ ◌ నాటనేర్పు
వలన మెచ్చుఁ జేసి ◌ వరముగా నత్యద్భు,తంపు నాట్యపటిమ◌పెంపు వడసి. 67

అర్థము:—భద్రనాముండు = భద్రుఁడను పేరుగలవాఁడు, ఆటనేర్పు = నాట్యమందలి చతురత, నాట్యపటిమపెంపు = నటనయొక్క గొప్ప నేర్పు - (ఇంతకు మునుపటి నేర్పుకంటె చిత్రమును, అధికమును నగు దానిని అని భావము.) సాత్వికము, ఆంగికము, నాహార్యకము, వాచికము నను చతుర్విధాభినయ ములచేత ధీరోదాత్తాదినాయకుల యవస్థలననుకరించుట నాట్యము.

సాత్త్వికము:— స్తంభ, ప్రళయాదులు - పరగతసుఖదుఃఖాదులను భావించి పరులవలెఁ దానగుట సత్త్వమనియు, దానివలనగలుగుభావములు సాత్త్వికములనియుఁ జెప్పఁబడెను. అవి యెనిమిది. వాని నభియించుట సాత్త్వికాభినయము.

ఆంగికము:—చేయి, కన్ను మున్నగు నవయవములచే నర్థమును ప్రకటించుట.

ఆహార్యకము:—అనుకరించు నవస్థ కుచితమగు నగలు, వస్త్రములు ధరించుట.

వాచికము :—రసముల కనుకూలమగు రాగాదులతోఁ బద్యములను, లయ రాగ సమన్వితముగాఁ బదములను పఠించుట. ఈనాల్గువిధములగు నభినయములచే నెవరెవరియవస్థలను ప్రకటించునో, యా యాయి పాత్రములతోఁ దాదాత్మ్యము - (ఆ పాత్రలరూపమగుట) - అభేదమును పొందుట నాట్యము.

సీ. ఏడుదీవులఁ జరియించుచు నున్నవాఁ,డని చెప్పి యతనినాట్యములవేళ
గలయట్టి యద్భుతంబులు సర్వమును సవి,స్తరముగ వినిపింపఁ దానవేంద్రుఁ
డాశ్చర్యకౌతుకాయత్తాత్ముఁ డగుచు నే,నును గొంతకొంత యాతని తెఱంగు
విని చూడవలయు నన్వేడుక నుండుదు,నీవు ప్రవీణ వన్నిటను హంసి

గీ. యానటుని నిచ్చటికిఁ దెచ్చితేని మెచ్చు, గలదు నీ కని ప్రేమతోఁబలికె నదియు
నట్లు చేసెద నని దనుజాధినాథు,వీడ్కొని ప్రభావతిని జూచి వినయ మొప్ప. 68

అర్థము:—ఏడుదీవులన్ = సప్తద్వీపములందును, చరియించుచు నున్నవాఁడు = తిరుగుచున్న వాఁడు, అని, చెప్పి = అని ముందు సూచించి, (పిదప) అతని నాట్యముల వేళన్, కలయట్టి = అద్భుతంబులు = వింతలు, సర్వమును = అన్నియును, సవిస్తరంబుగన్ = విరివితోఁ గూడినదగా, (పెంచి యని భావము) వినిపింపన్ = చెప్పఁగా, ఆశ్చర్య + కౌతుక + ఆయత్త + ఆత్ముఁడు = అద్భుతమునకును, వేడుకకును వశమైన మనస్సు గలవాఁడై, ప్రవీణవు = నేర్పరివి, తెచ్చితి + ఏని = తేఁగలవేని, నీకున్, మెచ్చు = బహుమానము, కలదు - (నీకు బహుమతి నిత్తు నని భావము) దనుజాధినాథునిన్ = రాక్షసరాజును, వీడ్కొని = విడిచి, ప్రభావతిన్, జూచి, వినయము + ఒప్పన్ = అడఁకువతో నని భావము.

వి. ఏడుదీవులు.— జంబు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలము, పుష్కరము.

వ్యా. వి. :—తెచ్చితేని - తెచ్చితివి+ ఏని - సూ. లిఙ్మధ్యమపురుషైకవచనంబునకు లోపంబు విభాషనగు. బాల. క్రియా. 24 చే. వకారలోపము అపదాదిస్వరసంధికలిగి తెచ్చితి - అయినది. ఈ భూతకాలికక్రియ సూ. చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. అను బాల. క్రియా. 119 చే. చేదర్థకమగు 'ఏని'తోఁ గూడుటచేత భవిష్యదర్థము (తెత్తువేని, తేఁగలవేని యను నర్థము) న ప్రయోగింపఁబడెను.

ఉత్సాహ:—అనిపెదే ముదంబుతోడ నమ్మ ! పోయి వత్తునా
యనుచు నదియుఁ గొన్నియడుగు లనుప నేఁగుదేర నో
వనరుహాక్షి ! యింతయున్ భవత్ప్రియార్థమే సుమీ
మనమునందు నిది యెఱింగి మైత్రి మఱవకుండుమీ. 69

అర్థము:—అమ్మ (వాత్సల్యద్యోతక మగు సంబోధనము), ముదంబుతోడన్ = సంతోషముతో, అనిపెదే = పంపెదవా 'సెలవిమ్ము' అని భావము. పోయివత్తునా = పోదునా ? అనుచున్, అదియున్ = ఆ ప్రభావతియు, కొన్నియడుగులు = కొన్నియడుగులదూరము, అనుపన్ = సాగ నంపుటకు, ఏఁగుదేరన్ = రాఁగా, ఓవనరుహాక్షి = ఓయింతీ (వనము = నీరు, వనమందు మొలచినది - వనరుహము = తామరపూవు, వనరుహములవంటి కన్నులు గలది వనరుహాక్షి.) ఇంతయున్ = నేను చేయు నీయత్నము - భద్రుఁ డనునటుని దెచ్చి నాట్యము చేయింప నేను వెడలుచుండుట, భవత్ప్రియార్థమేసుమీ = (నీకు నాట్యాది కళలన్నఁ బ్రియము కాన) నీప్రీతికొఱకే సుమీ. (అని యందఱకుఁ దెలియునర్థము) భవత్ = నీయొక్క, ప్రియార్థమేసుమీ=భర్తకొఱకేసుమీ యని ప్రభావతి తెలిసికోఁదగు నర్థాంతరము. (కావుననే) ఇది = ఈయర్థాంతరము, మనంబునందున్ = నీ మనసునందే, ఎఱిఁగి = తెలిసికొని, మైత్రి = మన స్నేహము, మఱవక, ఉండుమీ.

తాత్పర్యము:—అమ్మా! నన్నుఁ బిలిపించితివి. మీతండ్రి కోరిక వింటివిగదా! కాన నాట్యము చూడవచ్చునను సంతసముతో నన్నుఁ బంపుము. పోయివత్తును అనుచుఁ దన్ను సాగనంపఁ గూడ

వచ్చుచున్న ప్రభావతితో - ఓయింతీ! ఈయత్న మంతయు నీప్రీతికొఱకేసుమీ - ఏమి యా ప్రీతి యందువేమో! నటరూపము ధరింపఁజేసి నీ ప్రియుని దెచ్చుటకొఱకే. ఈ రహస్యము నీ వెఱింగి, మనకుఁగలిగినచెలిమి మఱవకుమా.

అలం:—గూఢోక్తి.

వి. :—ప్రభావతి కొక్కరితకు ప్రియునికొఱ కనినట్లును, మిగిలినవారి కెల్లరకు ప్రీతికొఱకు, అనినట్లును రెండర్థములు స్ఫురింపఁ బలుకుట శుచిముఖి ప్రౌఢి యనఁదగును. ఇంతకుమున్న ప్రద్యుమ్నుని దెచ్చుటకు వజ్రనాభుని సమ్మతికుు తనకుఁ గలిగింపుమన ప్రభావతి యట్ల చేసినది. కాని యచట ప్రద్యుమ్నుని ప్రసంగ మేమియు రాలేదు. అట్టియెడ హంసి భద్రుని దెచ్చుట కేఁగుచున్నది. నా ప్రియుని రాక యే మైనదో యని ప్రభావతి కలవరపడుచుండవచ్చు నని భావించి యితరులకు వేఱుగాఁ దోఁచు నట్లును, ప్రభావతికి అమ్మా! నీ భర్తకొఱకేసుమీ యీనాట్యప్రదర్శనాదికయత్న మంతయును నని సూచించినది.

వ్యా. వి. :—వత్తునా. వచ్+చుదు+నా - సూ. చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు. అను బాల. క్రియా. 108 చే. వచ్ + తు + నా. అయి, 'చకారంబునకు హల్లు రాఁ బరసవర్ణం బగు (రాన్ = పరముకాఁగా) శబ్దలక్షణ సంగ్రహము. 5. 63. సూత్రముచే. వచ్ - లోని చకారమునకు తకారము రాఁగా - వత్తునా అని సిద్ధించినది.

వ. అనుచు గూఢవృత్తిఁ దదిష్టసాధనపరత సూచించి యనిపించుకొని ద్వారకా
నగరంబునకుం బోయి తాను వజ్రనాభుచేత భద్రనామధేయనటునిం దోడ్కొని
తెచ్చుటకు నియుక్త యగుట కృష్ణున కెఱింగించి వజ్రనాభానుజుం డగు సునాభుని
కూఁతులు గదసాంబులకు భార్యలు గాఁగల రని నారదవచనంబులకలిమి చెప్పి
ప్రద్యుమ్నున కసురజయ సాహాయ్యకంబు నడుప గదసాంబు లరుగువా రని
నిశ్చయించిన యా చక్రధరుని నిశ్చయంబు వాసవునకు విన్నవింప దివంబునకుం
జనుచుం బ్రద్యుమ్ననింటి కరిగి యతం డప్పుడు ప్రభావతీ వియోగతాపాతి
భారంబున నసురుసు రగుచు మిగుల నొగిలి తదుదంతచింతం జేసి నిజాగమనంబ
కోరుచున్నవాఁడు గావున నతనిచేత నతిమాత్రాదర గౌరవంబు వడసి యేకతంబున
నతనితోడ,

అర్థము:— అనుచున్, గూఢవృత్తిన్ = రహస్య మగు వ్యాపారముతో (ఇతరులకుఁ దెలియకుండు రీతిని) తదిష్టసాధనపరతన్ - తత్ =ఆ ప్రభావతియొక్క, ఇష్ట = కోరిన పనియొక్క, సాధన=నెఱవేర్చుట యందలి, పరతన్ =ఆసక్తిని, సూచించి, అనిపించుకొని = పోవ ననుమతి నొంది, ద్వారకానగరంబునకున్, పోయి, భద్రనామధేయనటునిన్ - భద్రుఁ డనుపేరుగల యాటకానిని, నియుక్త = ఆజ్ఞాపింపఁబడినది, వజ్రనాభ + అనుజుండు = వజ్రనాభుని తమ్ముఁడు, నారదవచనంబుల కలిమి = నారదవాక్యము కలుగుట, అసురజయ సాహాయ్యకంబు = రాక్షసుని గెలుచుటయందుఁ దోడ్పాటు, నడుపన్ = జరిగించుటకు, చక్రధరుని = (చక్రమును దాల్చినవాఁడగు) శ్రీకృష్ణునియొక్క, నిశ్చయంబు = నిర్ణయమును, తదీయ శాసనంబును = ఆతనిసంబంధ మగునాజ్ఞను, వాసవునకున్ = ఇంద్రునకు, దివంబునకున్ = స్వర్గమునకు, ప్రభావతీ...భారంబునన్ - ప్రభావతియొక్క, వియోగ = ఎడఁబాటువలని, తాప = బాధయొక్క, అతిభారంబునన్ = అతిశయముచేత, అసురుసురు = మిగుల డస్సినవాఁడు, అగుచున్, తదుదంత-చింతన్ + చేసి - తత్ = ఆ ప్రభావతియొక్క, ఉదంత = వృత్తాంతము విషయమైన, చింతజేసి = ధ్యానముచేత,

నిజాగమనంబు+అ = తనయొక్క (శుచిముఖియొక్క) ఆగమనంబ= రాకయే, అతిమాత్రాదర గౌరవంబు= అత్యంతాధికమగు నాదరముతోఁ గూడినమర్యాద, పడసి = పొంది, ఏకతంబునన్ = రహస్యమందు.

సీ. ఒకచిల్కచేతఁ బ✽త్త్రిక యంచితే నాకు?, ననిచితి; నది నీకు ✽ నందెనొక్కొ?
యనుచు నెవ్వరిఁ గూర్చి ✽ యది వారికిని జేరె, నాయింతికి శుభంబె ✽ హంసరమణి?
నాలేఖయందుట ✽ నామాట యనవచ్చు, మ న్నట్టికొదవ రా ✽ మూల మెద్ది?
పత్త్రిక కడు దైన్య ✽ పడి నీవు పంచు టె?, ట్లాకాంతపై నెంత ✽ హాళికలిమి,
నాసతియుభవద్విరహాగ్ని ✽ నంత గుందె, నన్ను నెఱుఁగుట యెట్లు మున్ ✽ వాంఛసేయ?
శివ లిఖించి యిచ్చినది నీ ✽ చెలువు దాని;, కేమిటికి నిచ్చె? వరుఁడు నీ ✽ కీతఁ డనుచు.

ఈ పద్యమున హంసికిని ప్రద్యుమ్నునకుఁ జరిగినప్రశ్నోత్తరరూపమైన సంవాదము చెప్పఁబడుచున్నది.

అర్థము:—ఒకచిల్కచేతన్, పత్త్రిక = ఉత్తరమును, అంచితి + ఏ = పంపితివా? (అని హంసి ప్రశ్నము) అనిచితిన్ = పంచితిని, అది, నీకున్, అందెనొక్కొ = చేరినదా? (అని ప్రద్యుమ్నుని ప్రత్యుత్తరమును, ప్రశ్నమును) ఎవ్వరిఁగూర్చి = ఎవరి నుద్దేశించి, అనుచుట = పంపుట ('జరిగెనో' అధ్యాహారము) అది = ఆ జాబు, వారికిని, చేరెన్, (హంసిసమాధానము), హంసరమణి = ఓ యాఁడుహంసా, ఆ యింతికిన్ = ఆప్రభావతికి, శుభంబె = క్షేమమా? (అని ప్రద్యుమ్నుని ప్రశ్నము). ఆలేఖ = ఆ యుత్తరము, అందుటన్ = చేరుటచేత, ఆ మాట = క్షేమమే అని నీ వన్నమాటయే, అనవచ్చును = అనుటకు వీలగుచున్నది (శుచిముఖి ప్రత్యుత్తరము.) మున్ను = ఈ యుత్తర మందుటకు ముందు, అట్టికొదవ = క్షేమమునకు లోపము, రాన్ = వచ్చుటకు, మూలము = ప్రధానహేతువు, ఎద్ది, (అని ప్రద్యుమ్నుని ప్రశ్న). కడున్, దైన్యపడి = దీనత్వము నొంది, నీవు = పంచుట, ఎట్లు = పంపుట యెట్లు కలిగెను? (హంసివేసిన ప్రతిబంది ప్రశ్నము) ఆ కాంతపైన్ = ఆ యింతిమీఁద, ఎంతన్ = ఎంతయును, అత్యంతము, (ఇట 'ఎంతో' అనిపాఠమున్నచో స్వారసికముగ నుండును. ముద్రితములందు 'ఎంతహాళి' అనియే యుండుటచే సముచ్చయ 'ను' వర్ణము సంధివశమున లోపించినట్లు భావించి, ఎంతను = ఎంతయును అను నర్థము వచ్చునట్లు ముద్రితపాఠమే వ్యాఖ్యానింపఁబడెను.) హాళి = ఆసక్తియొక్క, కలిమిన్ = కలుగుట చేత, (పంపితిని అని ప్రద్యుమ్నుని మాట). ఆ సతియున్ = ఆ మగువయు, భవద్విరహాగ్నిన్ =నీయొక్క వియోగమనెడు నగ్నిచేత, విరహతాపముచేతనని భావము - అంత = నీవు ఖేదపడినంతగా, కుందెన్ = ఖేదపడెను (అని హంసిప్రత్యుత్తరము). మున్ = నాజాబు చేరకమునుపు, వాంఛసేయన్ = కోరుటకు, నన్నున్, ఎఱుఁగుట ఎట్లు, కలిగెను అధ్యాహారము, (ప్రద్యుమ్నుని ప్రశ్న.) దానికిన్ = ఆయింతికి, నీచెలువు = నీ చక్కదనమును, శివ = పార్వతీదేవి, లిఖించి = చిత్రించి, ఇచ్చినది, (హంసి ప్రత్యుత్తరము). ఏమిటికిన్ = ఎందులకై, ఇచ్చెను = చిత్రించియిచ్చెను? (ప్రద్యుమ్నుని ప్రశ్నము). ఈతఁడు, నీకున్, వరుఁడు = పెనిమిటి, అనుచున్ (వ్రాసియిచ్చెను అధ్యాహారము - శుచిముఖి సమాధానము.)

మ. అనుచున్ మాటకు మాటగా వరుసతో ✽ హంసీకులోత్తంస మా
తనికిన్ దైత్యతనూజ కోర్కి తెఱఁగుం ✽ దన్మూలముం జెప్పి యి
ట్లను నే నీ కిది నాఁడె తెల్పుటకుఁ గా ✽ దా చేసితిన్ జాలఁ ద
ద్ఘనశోభాస్తుతి, నీ వొకించుకయుఁ జి ✽ త్తం బీమిఁ జాలించితిన్. 72

అర్థము:—అనుచున్, మాటకున్, మాటగాన్ = ఆ ప్రశ్నకు నుత్తరమగునట్లు, అ హంసీకులోత్తంసము = ఆఁడుహంసల సముదాయమునకు శిరోభూషణమగు నా శుచిముఖి, (ని.-పుంస్యుత్తంసావతం

సౌచ కర్ణపూరేఽప్పి శేఖరే. అనిఅమరము.) ఆతనికిన్ = ఆ ప్రద్యుమ్నునకు, దైత్యతనూజ కోర్కి తెఱఁగున్ = ప్రభావతియొక్క కోరికవిధమును, తన్మూలమున్ = ఆ కోరికకు ముఖ్యకారణమును (గౌరీదేవి చిత్తరు విచ్చుట) చెప్పి, ఇట్లు, అనున్ = అనెను, నేన్, నీకున్, ఇది = ప్రభావతికోరిక, నాఁడె = ఆ దినము ననే, తెల్పుటకున్, కాదా = తెల్పుటకేకదా, తద్ఘనశోభాస్తుతిన్ = ఆమెయొక్క గొప్ప దగుసొగసు యొక్క, వర్ణనను, చాలన్, చేసితిని, (కాని) నీవు, చిత్తంబు + ఈమిన్ = మనసిచ్చి మాటాడకపోవుట చేత, చాలించితిన్ = చెప్పుట మానివేసితిని.

వ్యా. వి. :—ఈమి - ఇచ్చుధాతువుయొక్క వ్యతిరేక భావార్థకము. సూ. ఇచ్చునకు సర్వంబునకు 'ఈ' యగు. బాల. క్రియా. 92. 'ఈయమి' అని రూపాంతరము.

వి. :—ఆకన్న ప్రతిమసుద్దులు, మాకు మునుపు కలిమిఁజేసి మహనీయ తదీయాకృతి పొలు పంతయు భవ, దాకృతిఁ గని యతఁ డితండ యనుకొంటి మొగిన్, అని చెప్పఁగనే గౌరీదేవి యా పురుషునిపై రేమి చెప్పను ? ఆ ప్రతిమ నాపె కేల యిచ్చెను ? అను నిట్టిప్రశ్న మొక్కటియు నాతఁ డడుగ లే దని జ్ఞప్తి కెలయించినది.

వ. ఆ ప్రభావతి నన్ను నత్యంతప్రియసఖిం గా నడుపుకొనుచున్నది గావున దాని గుట్టించుకయు నే నెఱుంగనిది లేదు కనియు వినియు సమస్తంబు నాకళించిన దాన నని యతనికి భవానీకృపానుగ్రహ పతిప్రకారంబు సకలంబునుం తెలిపి యి ట్లనియె.

అర్థము:—అత్యంత ప్రియసఖిన్ + కాన్ = ఎక్కువ యిష్టురా లగు చెలినిగా, నడుపుకొను చున్నది = జరుపుచున్నది, దానిగుట్టు = దాని రహస్యము, ఆకళించినదానను = తెలిసికొన్నదానను, భవానీ...ప్రకారంబు - భవానీ = గౌరీదేవియొక్క, కృపా = దయచేతను, అనుగ్రహ = (హిత సంపా దనమందును అహిత నివారణమునందును ప్రవృత్తి - అనుగ్రహము) అట్టిఅనుగ్రహముచేతను (సంభవించిన) పతి = భర్తయొక్క, ప్రకారంబును = విధమును, సకలంబును = గౌరీవరముచే ప్రభావతిపుట్టుట మొదలు కలలోఁగనఁబడి చిత్తరువునిచ్చుట మున్నగు నెల్లవృత్తాంతమును, తెలిపి, ఇట్లు, అనియెన్ = చెప్పెను.

చ. భవదమలాకృతిప్రతిమఁ బర్విన యప్పుడు చూపు క్రమ్మఱన్
దివ మరలింప రాక సుదతిన్ గతచేష్టితఁ జేసె నోయదు
ప్రవరుఁడ యేమి చెప్పుదును రాగ, కుతూహల, విస్మ, యాతిగౌ
రవమున నెంత ప్రేఁ గగుచు రాపడి యుండెనొ కాని యత్తఱిన్. 74

అర్థము:—ఓ యదుప్రవరుఁడ = యదువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడా, చూపు = ప్రభావతి యొక్క దృష్టి (కర్త), భవ...యప్పుడు - భవత్ = నీయొక్క, అమల = స్వచ్ఛమైన, ఆకృతి = రూపము యొక్క, ప్రతిమన్=బొమ్మయందు, పర్వినయప్పుడు = ప్రసరించిన సమయమందు, రాగ...గౌరవమునన్- రాగ = (అనురక్తియొక్కయు) ప్రేమయొక్కయు, కుతూహల = ఉత్సాహము (వేడుక) యొక్కయు, విస్మయ = ఆశ్చర్యముయొక్కయు, అతి గౌరవమునన్ = ఎక్కువ గొప్పతనముచే, ఎంత = ఎంతగా, ప్రేఁగు = బరువైనది, (బరువెక్కినది) అగుచున్, రాపడి = ప్రమాన్పాటు నొంది, ఉండెనొకాని = ఉన్నదో కాని, ఏమి, చెప్పుదున్ = ఏమియుఁ జెప్పఁజాలను, అత్తఱిన్ = ఆ సమయమందు, క్రమ్మఱన్ = (ప్రతిమనుండి) మరలునట్లు, తివన్ = ఆకర్షించుటకును, కదలింపన్ = కదల్చుటకును, రాక = వశముగాక, సుదతిన్ = (చక్కని పలువరుసగల) ఆ ప్రభావతిని, గతచేష్టితన్ = పోయిన చేష్టలుగల దానినిగా, చేసెన్ = చేసెను.

...ర్యము:—ఓ యదూత్తమా! నీ నిర్మలాకారముగల ప్రతిమయందు నా ప్రభావతిచూపు వ్యాపించినప్పుడు, ప్రేమ, యుత్సాహము, ఆశ్చర్యమును, ఎక్కువగుటచేత నాచూపెంతగా బరువెక్కినదో కాని, ఏమి చెప్పుదును. ఆ ప్రభావతి నాసమయమున చేష్టలు లేనిదానినిగాఁ జేసినది.

అలం:—ఉత్ప్రేక్ష, సమాసోక్తి. (ఇందు స్తంభము అను సాత్త్వికభావము చెప్పఁబడెను.)

వ్యా. వి. :—తివన్ - సూ. తిగుచు ధాతువునన్నంతమునకు తివ్వ, తివ ననియు నగు. ప్రౌఢ క్రియా. 20 అని కలదు. కాని సూర్యరాయాంధ్రనిఘంటువున 'తివ్వు' అను ప్రత్యేకధాతువు 'విటమత్స్య వ్రాతమున్ దివ్వుచున్' అను కుమారసంభవము. 8 ఆశ్వాసము 58 ప. ఉదాహరణముతోఁ జూపఁబడుటచే తివు అను రూపాంతరముగల 'తివ్వు' ధాతువుయొక్క తుమున్నంతరూపమగుచున్నది. అర్థమున నైక్యమున్నను 'తిగుచు, తివుచు' ధాతువులతో - దీనికి సంబంధములేదు.

చ. కొసరక చూపుచేతఁ గడుఁగ్రోలిన నీచెలువంబు చెల్వ మా
నసమున నెంత మిక్కిలి ఘనంబుగ హత్తెనొ కాని యప్పుడో
రసికశిఖావతంస! యదురత్నమ! కాకరకాయరీతిగాఁ
గిసలయపాణి చన్నుఁగవ క్రేవ గగుర్పొడిచెం బొరిం బొరిన్. 75

అర్థము:—కొసరక = సంకోచింపక - తగ్గక, చూపుచేతన్ = దృష్టిచేత, కడున్ = ఎక్కువగా, క్రోలిన = త్రాగిన, నీ చెలువంబు = నీ సొగసు, చెల్వ = ఆ ప్రభావతియొక్క, మానసమునన్ = మనస్సునందు, ఎంత, మిక్కిలి, ఘనంబుగన్ = ఎంత యెక్కువ దట్టముగా, హత్తెనొకాని = లగ్నమైనదొ కాని (అంటినదో కాని యని భావము), ఓ రసికశిఖావతంస = శృంగారాదిరసము లెఱిఁగినవారికి శిరోభూషణమా, యదురత్నమ = యదువంశమువారిలో శ్రేష్ఠుఁడా! (ప్రద్యుమ్నుఁడా) అప్పుడు = ఆ ప్రతిమను జూచుచున్న సమయమున, కిసలయ...క్రేవన్ - కిసలయపాణి = చిగుళ్లవంటి చేతులుగల యా ప్రభావతియొక్క, చన్నుఁగవ = చన్నులజంటయొక్క, (రెండు కుచములయొక్క అని భావము), క్రేవన్ = పార్శ్వమునందు, కాకరకాయరీతి = (పైకిఁ బొటమరించిన చిన్నచిన్న చర్మపుభాగములు గలుగు) కాకరకాయవిధము, కాన్ = కలుగునట్లు, పొరింబొరిన్ = మాటిమాటికి, గగుర్పొడిచెను = పులకాంకురములతో నిండె నని భావము.

తాత్పర్యము:—రసికశేఖరుఁడవగు నో యాదవశ్రేష్ఠుఁడా! ఆమెచూపు వెనుదీయకుండ నీయందము త్రాగి వైచఁగా - ఆయందము పేరుకొని మనసున నెంత దట్టముగా తగులుకొని యున్నదో కాని, ఆ చూచెడుసమయమున పైభాగమున గఱిగఱిగా నుండుకాకరకాయవిధముగా స్తనములపార్శ్వభాగమున గగ్గురుపాటు కలెను.

అలం:—నిరవయవరూపకము, ఉత్ప్రేక్ష, ఉపమ.

వి. :—ఇందు రోమాంచమను సాత్త్వికభావము వ్యంగ్యము.

ఉ. వావిరి నెల్లప్రొద్దును భవత్పరిరంభణచుంబనాది నా
నావిధభోగలీలకు మనంబున నువ్విళులూరుచున్కి ప్రీ
డావతి దెల్పెఁ గొన్నినిశలం గను మూసినయంతమాత్రఁ బై
పై విలసిల్లు కుట్టమిత భావవిశేష విజృంభణంబులన్. 76

అర్థము:—వావిరిన్ = క్రమముగా, ఎల్లప్రొద్దును = పగ లంతయును, భవత్...లీలకున్ - భవత్ = నీయొక్క, పరిరంభణ = కౌఁగిలి, చుంబన=ముద్దిడుకొనుట, ఆది=మొదలుగాఁగల, నానావిధ= పెక్కురీతులగు, భోగ = సుఖానుభవముయొక్క, లీలకున్ = విలాసమునకు, మనంబునన్ = మనస్సునందు, ఉవ్విళులూరుచున్ + ఉన్కిన్ = కుతూహలపడుచుండుటచేత, వ్రీడావతి = సిగ్గుగలద-ఆయింతి, కొన్ని నిశలన్ = కొన్నిరాత్రులందు, కను = కన్ను, మూసినయంతన్ = మూసినవెంటనే, నిదురింప నారంభించినప్పుడే - అనిభావము. పైపైన్ = మీఁదు మీఁదికి, విలసిల్లు = కనవచ్చునట్టి, కుట్టమిత భావ విశేష = కుట్టమితమను శృంగార చేష్టాభేదములయొక్క, విజృంభణంబులన్ = అతిశయములను, తెల్పెన్= ప్రకటించెను, కుట్టమితమనఁగా - కేశగ్రహణము, అధరపీడనము మున్నగువానిచేత పైకిఁ గోప మభినయించుచున్నను, లోపల నమితానందము నొందునట్టి స్త్రీలచేష్ట. 'కేశస్తనాధరాదీనాం గ్రహే హర్షేపి సంభ్రమాత్। ఆహుః కుట్టమితం నామశిరః కరవిధూననం. అని సాహిత్యదర్పణము.

తాత్పర్యము:—పగలెల్లను, నీకౌఁగిలి, నీ చుంబనము మొదలగు నానావిధ సుఖానుభవములనే యెంచుకొనుచు వేడ్కపడుచుండుటచే, కొన్నిరాత్రులందు కన్ను మూసినవెంటనే కుట్టమిత భావములను దెలుపుచు వచ్చెను. (అనఁగా నిద్రింపఁ గన్నుమూసిన వెంటనే నీవు కచ, కుచాదిగ్రహణ మొనర్చినట్లో, మోవిని దంతక్షత మొనర్చినట్లో కలఁ గని మనసునం దానంద మున్నను వ్రీడావతి కావునఁ జైకి కోప మభినయించు చేష్టలను ప్రకటించుచు వచ్చెనని భావము) - ఇందు 'సంకల్పము' అను మదనావస్థ.

అలం:—కావ్యలింగము, పరికరము.

మ. కలలం గూడినవేళ నెట్టి పొలయల్కల్ పుట్టెనో యేమి నీ
వలనం దప్పు ఘటిల్లెనో యెఱుఁగఁ దత్స్వప్నాగమామర్షవి
హ్వలిత స్వాంతయపోలె నిద్ర నెఱయన్ వర్జించెఁ బద్మాక్షి య
క్షు లహోరాత్రము లందుఁ బద్మకుముదస్ఫూర్తిన్ విడంబింపఁగన్. 77

అర్థము:—కలలన్ = స్వప్నములందు, కూడినవేళన్ = మీ రిరువురును గలిసికొనినప్పుడు, ఎట్టి పొలయల్కల్ = ఎటువంటి ప్రణయకోపములు, పుట్టెనో, నీవలనన్ = నీయెడ, ఏమి, తప్పు = అపరాధము, ఘటిల్లెనో = కలిగెనో, యెఱుఁగన్ = తెలియను, (కాని) పద్మాక్షియక్షులు = తామరలవంటి కన్నులు గల యాసుందరి కన్నులు, అహోరాత్రంబులన్ = పగటియందును రాత్రియందును, (వరుసగా) పద్మకుముదస్ఫూర్తిన్ - పద్మ = తామరలపూలయొక్కయు, కుముద = తెల్లకలువల యొక్కయు, స్ఫూర్తిన్ = శోభన వికాసమును, విడంబింపఁగాన్ = అనుకరింపఁగా - తత్...పోలెన్ - తత్ = అట్టి, స్వప్న = కలలయొక్క, ఆగమ = వచ్చుటయందుఁ గలిగిన, అమర్ష = కోపముచేతను, విహ్వలిత = చలించిన, స్వాంతయపోలెన్ = మనస్సుకలదివలెనే, నిద్రన్, నెఱయన్ = పరిపూర్ణముగా, వర్జించెన్= విడిచెను.

తాత్పర్యము:—కలలయందు మీ రిరువురును గలిసికొనినప్పుడు ప్రణయకలహము లేమైనను పుట్టినవో, లేక యింకొక నాయికను స్మరించుట మున్నగు నపరాధము నీయందుఁ గనవచ్చెనో యేమో నే నెఱుఁగను. కాని యామె కన్నులు పగలు తామరలవలెను, రాత్రులు కలువలవలెను వికసించియే యుండఁగా ఆ స్వప్నమందు వచ్చిన కోపముచే చలించిన మనస్సుగలదానివలె నిద్రను పూర్తిగా విసర్జించినది. కన్ను మూసిన నట్టి దృశ్యమే వచ్చునని భయముచే నిద్రనే విసర్జించినదని భావము.

అలం:—ఉత్ప్రేక్ష, యథాసంఖ్యము.

వి. :—ఇందు జాగర మను మదనావస్థ వర్ణింపఁబడినది.

క. చిత్తజమహాగ్నికాఁకల, నెత్తుదఱిగి వన్నె యెక్కె నెంతయు నెమ్మే
న త్తరుణికి జను లందఱు, పుత్తడిబొమ్మ యను మాట బొం కేల యగున్. 78

అర్థము:—ఆ+తరుణికిన్ = ఆ ప్రభావతికి, నెమ్మేను - (నెఱ+మేను) దేహము, చిత్తజ...... కాఁకలన్ - చిత్తజ = మన్మథుని సంబంధమైన, అగ్ని = అగ్నియొక్క, కాఁకలన్ = తాపములచేత, ఎత్తు, తఱిగి = తూకమునందుఁ దక్కువయై, (కృశించిపోయి యని భావము) ఎంతయున్ = అత్యంతము, వన్నె యెక్కెను, కాంతిచే నతిశయించెను. జనులు, అందఱును, పుత్తడిబొమ్మ = బంగారుబొమ్మ అను మాట = అనుచుండునట్టి మాట, బొంకు = అసత్యము, ఏల, అగున్ = అగును, అసత్యము కాదు అని భావము.

తాత్పర్యము:—బంగారుబొమ్మవలె చక్కని దనుభావమున జను లెల్ల నాప్రభావతిని పుత్తడిబొమ్మ యనుచుందురే కాని యామె బొమ్మయుఁ గాదు. ఆమెదేహము బంగారమునుగాదు. అయినను నేఁటి మదనాగ్నిచేఁ గలిగిన కాకలవలన బంగారును కరఁగించినకొలఁది తూకము తగ్గి వన్నె హెచ్చినట్లే యామె దేహమును ఎత్తుదఱిగి - అనఁగా కృశించిపోయి వన్నె యనఁగా శరీరశోభ హెచ్చుచుండుటచే జనులు 'పుత్తడిబొమ్మ' అను మాట సత్య మైనది.

అలం:—రూపకము, నిరుక్తి. గీ. అధికయోగమువలన నన్యార్థఘటన, నామముల కైనను నిరుక్తి నా నెసంగు. ఆంధ్ర చంద్రాలోకము. 141. ఇందు 'కార్శ్యము' అను మదనావస్థ చెప్పఁబడినది.

వ్యా. వి. :—నెమ్మేను - నెఱ + మేను - సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబు (ఈ ప్రాఁతాది సంధికార్యము) లు కొండొకచోఁ గానంబడియెడి. బాల. సంధి. 39. ఎత్తుదఱుగు, వన్నెయెక్కు - ఈ రెండును శబ్దపల్లవక్రియలు.

సీ. రోలంబ నికురుంబ నీలిమశ్రీఁబోలె, వేణి ముట్టుట కడు విరస మయ్యె
సమద కోకిల శుకస్వరసామ్యమునఁబోలె, సఖులసల్లాప మసహ్య మయ్యెఁ
బరిపూర్ణ చంద్రబింబ సమత్వమునఁబోలె, నిలువుటద్ద మదర్శనీయ మయ్యె
బ్రసవాస్త్ర వివిధమార్గణ వర్ణధృతిఁబోలె, రత్నభూషాళి యగ్రాహ్య మయ్యె
వేయుఁ జెప్పఁగ నేల నీవిలసనంబు, లుల్లమునఁ దలపోయుట యొకటి దక్క
బహుదినంబులనుండి యాపడఁతి కితర, వస్తురుచు లన్నియును గానివాయయ్యె.

అర్థము:—రోలంబ......శ్రీఁబోలెన్ - రోలంబ = తుమ్మెదలయొక్క, నికురుంబ = గుంపుల యొక్క, నీలిమశ్రీన్+పోలెన్ = నల్లఁదనపుశోభను బోలిన శోభచేతనో యనునట్లు, వేణిన్ = అల్లిన జడను, ముట్టుట = తాఁకుట, కడున్, విరసము + అయ్యెన్ = ఇష్టములేనిదయ్యెను, సమద...బోలెన్ - సమద = మదముతోఁగూడిన, కోకిల, శుక = కోయిలయొక్కయు చిలుకలయొక్కయు, స్వర = కంఠధ్వనితోడి, సామ్యమునన్ + పోలెన్ = పోలిక గలుగుటచేతనో యనునట్లు, సఖుల సల్లాపములు = చెలికత్తెలమాటలు, అసహ్యము = సహింపరానివి, అయ్యెన్, ప్రసవాస్త్ర......బోలెన్ - ప్రసవాస్త్ర = పువ్వులు ఆయుధములుగాఁ గలవాఁడగు మన్మథునియొక్క, వివిధ = పెక్కుతెఱఁగు లైన, మార్గణ = బాణములయొక్క, వర్ణ = కాంతియొక్క, ధృతిన్ + పోలెన్ = ధరించుటచేతనో యనునట్లు, పువ్వులయొక్క రంగులుగల వగుటచేతనో యనునట్లు అని భావము. రత్నభూషాళి = రతనపునగలయొక్క సముదాయము, అగ్రాహ్యము = గ్రహింపరానిది - అనఁగా ధరింప రానిది, అయ్యెన్, వేయున్ = పెక్కు మాటలు, చెప్పఁగన్ = చెప్పుట, ఏల, నీవిలసనంబులు = నీసోయగములు, ఉల్లమునన్ = మనస్సునందు,

తలపోయుట, ఒకటి = ఒకమాత్రము, తక్కన్, బహుదినంబులనుండి = పెక్కుదినములనుండి, ఆపడఁతి కిన్, ఇతరవస్తురుచులు = మిగిలినపదార్థము లందలి కోరికలు, అన్నియును, కానివాని = సరిపడనిబంధుత్వము గలవి, అయ్యెన్ = అయినవి - స్మరింపరానివయ్యెను అని భావము.

తాత్పర్యము:—జడను చక్కఁగ దువ్వుకొనక, చెలికత్తెలతోడి యిష్టగోష్ఠి సైపఁజాలక, అద్దము చూచుకొనక, రత్నాభరణములు ధరింపక, రేవగలు నీసొగసును ధ్యానించుట దక్క నేయితరవస్తువునందును కోరికలేని దాయెను. ఇందు 'అరతి' యను మదనావస్థ వర్ణింపఁబడెను.

అలం:—ఉత్ప్రేక్ష.

వి:—తుమ్మెదలు, కోయిలలు మున్నగునవి మనసునందలి వలపు నుద్దీపింపఁ జేయును. కావున వీని నుద్దీపన విభావములని శాస్త్రజ్ఞు లనినారు. ప్రియుని కంటె నితరము లన్నిటియందును విరక్తి గల్గుట 'యరతి' యందురు. ఆయరతిచేతనే ఉద్దీపన సామగ్రీ సామ్యము గల జడమున్నగుపదార్థము లామె కసహ్యము లైనవి.

క. వెదకికొని తానె యిటు రా,మది సాహస మొంది కదలు ♦ మాటికి, నీరూ
పెదుటఁ దనకంతఁ దోఁచిన, మదిరేక్షణ తత్తఱిలుచు ♦ మగుడున్ లజ్జన్. 80

అర్థము:—మదిరేక్షణ = మదించిన కాటుకపులుఁగులవంటి కన్నులుగల ప్రభావతి, వెదకికొని = (నీకై) వెదకు కొనుచు, తానె = స్వయముగానె, ఇటు = ఇచటికి, రాన్ = వచ్చుటకు, మదిన్, సాహసము = చొరవను, ఒంది = పొంది, మాటికిన్ = తఱుచుగా, కదలున్ = బయలుదేఱు చుండును, అంతన్ = అంతలో, నీ రూపు, ఎదుటన్, తనకున్, తోఁచినన్ = చిత్తరువునందు గోచరింపఁగా, తత్తఱిలుచున్ = కంపమొందుచు, లజ్జన్ = సిగ్గుచేత, మగుడున్ = మరలును, నిన్నుఁ జేరుట కంత తహతహపడుచున్నది. నీ వుపేక్షించుట తగదు సుమా యని ధ్వని. నీరూపు చిత్తరువునం దెదుటఁ గనఁబడఁగనే నిజముగా నీ వెదుట నున్నా వనియు, ఉండఁగా బయలుదేఱుట తెలివితక్కువవలె నీవు భావింతు వనియు, కలఁగుచు, సిగ్గుచే వచ్చుట మానెను. తనసాహసము వ్యర్థమగుట వ్యక్తమై, సిగ్గుపడునని భావము.

వి. :—మాటికిన్, సారెకున్ - ఈ రెండును ముహురర్థ కావ్యయము లనియు, వీని ఆమ్రేడిత రూపములు 'మాటిమాటికిన్, సారెసారెకున్' అని నిఘంటువులందు జెప్పఁ బడియెను. ఈ పద్యము పూర్వార్థమున 'హ్రీత్యాగము', ఉత్తరార్థమున 'ఉన్మాదము' అను మదనావస్థలు సూచింపఁబడినవి. హ్రీత్యాగాంతావస్థలు సూచింపఁబడవలెనే కాని కార్యరూపమునఁ జూపుట రసభంజకము లగునని పెద్దలమతము. కాన అట్లే యిందు సూచింపఁబడెను.

క. ఆ పడతి యడలఁజేసెను, జూపఱ నపు డేమి చెప్ప ♦ శోషిలుచు గడున్
నీ పత్త్రిక యానిమిషము, లోపల రాదేనిఁ బాటిలు దశాంతరమున్. 81

అర్థము:—ఆపడఁతి, కడున్, శోషిలుచున్ = కృశించుచు, చెప్పన్ = చెప్పుటకు, ఏమి = ఏమి యున్నది, అపుడు, చూపఱన్ = చూచువారిని, అడలఁ జేసెను = ఈమె యెట్లుండునో యని భయపడు నట్లు చేసెను. అనఁగా నామెను చూచినవా రందఱు నింత కృశించినదే యీపై నేమగునో కదా యని భయ మొంది రని భావము. నీ పత్త్రిక = నీ యుత్తరము, ఆ నిమిషములోపలన్ = ఆ చేరిన నిమిషమునందే, రాదేనిన్ = రానియెడల, దశాంతరమున్ = మఱియొక యవస్థయును, అనఁగా మరణావస్థ గూడ అని భావము. పాటిలున్ = సంభవించి యుండును, మన్మథదశ లించుమించుగా నన్నియుఁ బొందిన ట్లింతకు మున్నె చెప్పి యున్నది. కావున తుది దశను వాచ్యముగాఁ జెప్పుట యమంగళమును, నిషిద్ధ మగుటచే

వ్యంగ్యముగా చెప్పి విడిచినది. ఈ మదనావస్థలలో పదియవ దగుమరణము వర్ణింప రాదని, శాస్త్రకారుల సిద్ధాంతము. 'మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః' అని ప్రతాపరుద్రీయము. వ్యాఖ్యయందు, ధనిక హేమచంద్రాద్యనుసారేణ సాక్షాత్తదుదాహరణ స్యాఽమంగలత్వాత్తద్యోగోఽత్ర వివక్షితఇతి. శారదా తనయ స్తు మరణేఽభినయోనాస్తీత్యేతత్కావ్యేన పఠ్యతే ఇత్యాహ అని కలదు. ఇతరుల మరణము వర్ణించి నను దోషముకాదు. ఆలంబనచ్ఛేదము కలుగును గాన నాయికా నాయకుల మృతి చెప్పరాదని నియమము.

వ. అని యాపత్త్రిక యుపకారంబునుం దాత్కాలిక స్థితికారణంబగుట యొక్కటియ
 కాని యక్కన్యకు మిక్కిలిం దాపంబు గావించు చున్నది యె ట్లంటేని. 82

అర్థము:—ఆ పత్త్రిక యుపకారంబునున్ = ఆయుత్తరము వలని మేలుసైతము, తాత్కాలికస్థితి కారణంబు = అప్పటి యునికికి - (అప్పటికి జీవించియుండుటకు మాత్రము అని భావము) హేతువు, అగుట, ఒక్కటియ = ఒక్కటే, కాని, అక్కన్యకున్, మిక్కిలిన్ = అత్యంతము, తాపంబు = బాధను, కావించుచున్నది, - ఎట్లు, అంటేని (అంటి = అంటివి + ఏని) = అందువా ? (వినుము.)

క. క్రిందటిదినములు విరహదశం దా నలఁగుటయ కాని సరిగ నిపుడు నీ
 వుం దనకై కుందుట విని,యెం దరుణికి నింక నిమిష మేడై తోఁచున్. 83

అర్థము:—క్రిందటి దినములు = నీజాబు చేరక పూర్వపు దివసములందు, విరహదశన్ = వియోగావస్థచేత (ఎడఁబాటుచేత నని భావము) (తాను, అలఁగుటయే అని కాని, "తాన్, నలఁగుటయే" అనికాని విభాగ మొనర్చుకోవచ్చును) = శ్రమపడుటయే, కాని, నీవున్, సరిగన్ = తనతో సమముగా, ఇపుడు, కుందుట = బాధ నొందుట, వినియెన్ (కాన) ఇంకన్ = ఈమీఁదట, తరుణికిన్, నిమిషము= ఱెప్పపాటు కాలము, ఏడై = ఒకసంవత్సరమై, తోఁచున్ = కనఁబడును. (నీయందే ధ్యానము నిలిపి కాలము వెళ్లింపలేక బాధపడుచుండును.)

అలం:—లోకోక్తి, అతిశయోక్తి.

ఉ. భావన చేసి చూడ క్షణభంగుర మింతులతాల్మికల్మి వా
 తావిల పల్లవాంచల హిమాంబుకణంబును నంతకంటె మే
 ల్గావున నింక నెంత యవిలంబమునన్ గృప నేఁగి ప్రోచెదో
 దేవరచిత్త మాసతియదృష్టము వేయును జెప్ప నేటికిన్. 84

అర్థము:—భావనచేసి చూడన్ = ఆలోచించిచూడఁగా, ఇంతులతాల్మికల్మి = స్త్రీలయొక్క ధైర్యసంపద, క్షణభంగురము = క్షణకాలమున నశించునది, వాతా...కణంబును-వాత = గాలిచే, ఆవిల= కలఁతనొందిన (కదలింపఁబడిన అని భా.), పల్లవ = చిగురాకుయొక్క, అంచల=కొనయందలి, హిమాంబు= మంచునీటియొక్క, కణంబును = బొట్టు, (బిందువు) గూడ, అంతకంటెన్ = ఆ యింతుల ధైర్యముకంటె, మేలు = మంచిది (స్థిరమైనది అని భా.) ఎంత యవిలంబమునన్ = ఆలసింపక యెంత శీఘ్రకాలమున, కృపన్ = దయచే, ఏఁగి = వెళ్లి, ప్రోచెదో = రక్షింతువో (ఆ రక్షణము), దేవరచిత్తము = ప్రభువు మనస్సున కధీనమై యున్నది, ఆసతియదృష్టము = ఆయింతి యదృష్టము ననుసరించి యున్నది, (అంతియ కాని పురుషయత్నమునకు వశమైనది కాదు అని భావము), వేయును = పెక్కుమాటలు, చెప్పన్ = చెప్పుట, ఏటికిన్ = ఎందులకు ?

తాత్పర్యము:—స్త్రీల ధైర్యమును గూర్చి బాగుగా నాలోచించి చూడ-నిమిషములో నశించునదియని తెలియఁదగును. గాలికి కదలు చిగురాకుకొన నున్న మంచుసీటిబొట్టంతకంటె స్థిర మైనది. కావున నీవిఁక నెంతవేగముగా దయచేసి యామెను రక్షింతువో, నీచిత్తము, ఆమెయదృష్టము. పెక్కుమాటలిఁక నెందులకు?

అలం. :—వ్యతిరేకము, కావ్యలింగము, లోకోక్తి.

వ్యా. వి. :—ప్రోచెదో - ప్రోచెదవు + ఓ - సూ. లిఙ్గాట్టులవకారంబునకు లోపంబు విభాష నగు. బాల. క్రియా. 24. చే. వకారము లోపింప - 'ప్రోచెద + ఉ' అనియుండ, అపదాదిస్వరసంధిచే 'ప్రోచెదు' అగును - పిదప 'ఓ' కారముతో ఉత్త్వసంధి, ప్రోచెదో, అనియగును.

వ. అనిన విని యతండు. 85

(సుగమము)

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో, ఱెక్కలు గట్టుకొని దివిజరిపు మేడలపై
నక్కొమ్మఁ జూచు టెప్పు డెప్పు, డొక్కో యనునంత తమకము న్నది మదిలోన్. 86

అర్థము:—ఱెక్కలు, కట్టుకొని = (పక్షివలె నెగిరివెళ్లుటకై,) ఱెక్కలవంటి సాధనములు గూర్చుకొని, గ్రక్కునన్ = శీఘ్రముగా, చని = వెళ్లి, దివిజరిపుమేడలపైన్ = దేవతలకు విరోధి యగు వజ్రనాభుని మేడలమీఁద, వ్రాలుదునో = చేరుదునా? అక్కొమ్మన్ = ఆ ప్రభావతిని, చూచుట, ఎప్పుడు + ఎప్పుడు + ఒక్కో = ఎప్పుడెప్పుడు, అనునంతతమకము = అనునంతటివేగిరపాటు, మదిలోన్ = మనసునందు, ఉన్నది.

తాత్పర్యము:—ఱెక్కలు కట్టుకొని రివ్వున నెగిరిపోయి వజ్రనాభునిమేడలపై వ్రాలుదునా? అట్లు వ్రాలి యం దుండుప్రభావతిని చూచుట ఎప్పుడెప్పుడా?యని మనసునం దెంతయుఁ దమకించుచునే యుంటిని.

అలం. :—అతిశయోక్తి.

తే. ఏమి సేయుదు నాదైత్యునియ్యకోలు,
లేక వీ డెవ్వరికిఁ జొరరాక యునికి
యరసి వేఁగుచు నున్నాఁడ నమరపతియు,
హరియుఁ దలపోయుకార్య మే మయ్యెఁ జెపుమ. 87

అర్థము:—ఏమి చేయుదును = వెళ్లుట కుపాయము కనఁబడ దేమి చేయఁగలను, ఆ దైత్య + ఇయ్యకోలు - ఆ రాక్షసుని యనుమతి, లేక=పొందక, వీడు = ఆ వజ్రపురమున, ఎవ్వరికిన్ = ఎట్టివారికైనను, చొరరాక యునికి = ప్రవేశింప వీలుగా కుండుట, అరసి= తెలిసికొని, వేఁగుచున్నాఁడన్ = తపించుచున్నాను, అమరపతియు = దేవేంద్రుఁడును, హరియున్ = శ్రీకృష్ణుఁడును, తలపోయు కార్యము = ఆలోచించుచున్నపని, ఏమి, అయ్యెన్, చెపుమ = చెప్పుమా.

వ్యా. వి. ఇయ్యకోలు. 'ఇయ్యకొనుట' కు రూపాంతరము. సూ. భావంబునం దనుప్రయుక్తంబగు కొనుటకుం 'గోలు' విభాష నగు. ప్రౌఢ. క్రియా. 13. ఇందలి 'ఇయ్య' అనునది ఇచ్చుధాతువుతో సంబంధములేని యవ్యయ మనియు దానికి 'సరే' అని యంగీకారము తెలుపుటయే యర్థ మనియు, 'నా సుతునకు భార్య వగు మనిన...ఇయ్య యనియె. అను - భార. ఆది. 4. 141. పద్యముదాహరించి

సూర్యరాయనిఘంటువు నిర్ధరించెను. ఇయ్యకొను శబ్దపల్లవక్రియ. దానిభావార్థకము ఇయ్యకొనుట, రూ. ఇయ్యకోలు. చెప్పుము - చెప్పు ధాతుప్రార్థనార్థకరూపము. బహువచనము - చెప్పుఁడు - ఈ రెండు రూపములు మాత్రము ద్విత్వము లేనివి. తక్కిన 'చెప్పు' ధాతువునుండి సిద్ధించు నన్నిరూపములును ద్విత్వసహితములే యగుటచే బాలవ్యాకరణము వీనిని "అక్కటాదులలోఁ బఠించి ద్విత్వలోపము వికల్పముగా విధించెను." చెప్పుము - చెపుము, చెప్పుఁడు = చెపుఁడు - అదాదులలోని అకారముచేరఁగా చెప్పుమ, చెపుమ - చెప్పుఁడ - చెపుఁడ - అనియు నగును.

వ. అనిన శుచిముఖి యతనిం జూచి యో కుమారక నీకుఁ దత్పుర ప్రవేశచింత వలదు తదుపాయంబు హరి నిశ్చయించుకొని యున్నవాఁడు వజ్రనాభకార్యంబునకు నేను భవదిష్టసాధనానుకూల్యంబు చింతించి నిన్నే యనుపునట్లుగాఁ జేసితి వాసుదేవుం డిప్పుడ యేతదర్థంబు నిన్నుఁ బిలిపించి యనుపుచున్నవాఁడు వజ్రికి నిది యెఱింగించి వజ్రపురంబున కరిగి యేనును దగిన తెఱంగునం దావకీనకార్యానుగుణ్యంబు నడుపు చుండెద నని పలికి యతని వీడ్కొని చనియె నప్పుడు. 88

అర్థము :— తత్పురప్రవేశచింత = ఆపట్టనమందుఁ బ్రవేశించుటకొఱకు విచారము, తత్ + ఉపాయంబు = దాని కగువెరవు, భవదిష్ట ... కూల్యంబు - భవత్ = నీయొక్క, ఇష్ట = కోరికయొక్క, సాధన = నెఱవేర్చుటకు, ఆనుకూల్యంబు = తోడ్పడుటను, చింతించి = ఆలోచించి, ఏతదర్థంబు = (ఏతత్ + అర్థంబు - ఇది ప్రయోజనముగాఁగలది) దీనినిమిత్తము, వజ్రికిన్ = (వజ్రాయుధము గలవాఁడు) ఇంద్రునకు, తగిన తెఱంగునన్ = తగినట్టిరీతిని, తావ ... గుణ్యంబు - తావకీన = నీసంబంధమైన, కార్య= (ప్రభావతితో కలియుటయను) పనికి, అనుగుణ్యంబు = తగియుండుటను, నడపుచుండెదను = జరిగించుచుందును, వీడ్కొని = విడిచి.

సీ. అమరారికరులకుంభములు వ్రయ్యఁగ మొత్త,రమణిచన్నులు నఖాగ్రముల నొత్త
సమదరాక్షస రథచక్రంబు లిలఁ గూల్పఁ, గాంతశ్రోణికి నూడిగంబు సల్ప
నసురేంద్రజయ శంఖ మవనిపైఁ బ్రేయింపఁ, గామినికంఠంబు కౌఁగిలింప
వజ్రనాభునిధను ర్వార్తలు గడతేర్పఁ, బడఁతికనొబ్మసంజ్ఞఁ బను లొనర్ప

దైత్యు మెఱుఁగుఁదూపులు దళితములు సేయఁ,దత్తనూజచూపులు ఫలితములు సేయ
నుదుటుఁదనమును వలపు నొండొంటితోడ,దంటగొని క్రమ్మ నెమ్మదిఁదాల్చెనతఁడు.

వీరశృంగారకళాఢ్యు ని ట్లతని గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో (3.61) అనువాక్యమున కుదాహరణముగా నిందుఁ బ్రద్యుమ్నుఁడు వర్ణింపఁబడుచున్నాఁడు.

అర్థము:— అతఁడు = ఆ ప్రద్యుమ్నుఁడు, అమరారి...కుంభములు - అమరారి = దేవతలకు పగతుఁడగు వజ్రనాభునియొక్క, కరులకుంభములు = ఏనుఁగుల కుంభస్థలములు, వ్రయ్యన్ = పగులునట్లు, మొత్తన్ = కొట్టుటకును, రమణిచన్నులు = ప్రభావతి స్తనములను, నఖాగ్రములన్ = గోళ్లకొనలచేత, ఒత్తన్ = నొక్కుటకును - (శౌర్యముచేత ఏనుఁగు కుంభస్థలములను పగులఁగొట్టఁదలచినంతనే వానిని పోలిన ప్రభావతీస్తనములు స్మృతికి రాఁగా వలపుచే నఖక్షతము లొనర్ప నిచ్చ పొడమును, ఇట్లే యీపద్యమంతయు వీరశృంగారములు జతగూడి కనఁబడును.) సమద ... చక్రంబులు - సమద = మదముతోఁ గూడిన, రాక్షస = వజ్రనాభుని, రథచక్రంబులు, ఇళన్ = భూమియందు, కూల్పన్ = పడఁగొట్టుటకు

(రథచక్రములను స్మరింపఁగనే వానిని బోలియుండు ప్రభావతి శ్రోణి జ్ఞప్తికి రాఁగా) కాంతశ్రోణికిన్ = ప్రభావతియొక్క పిఱుఁదునకు, ఊడిగము సల్పన్ = సేవచేయుటకును, అసురేంద్రజయశంఖము = విజయమును సూచింప నూఁదెడు వజ్రనాభుని శంఖమును, అవనిపైన్ = భూమిమీఁద,. వ్రేయింపన్ = పడఁగొట్టుటకును, (శంఖాకారముగల) కామినికంఠంబు = ప్రభావతి గళమును, కౌఁగిలింపన్ = కౌఁగిలించుటకును, వజ్ర ... వార్తలు - వజ్రనాభుని, ధనుః = వింటియొక్క, వార్తలు = వృత్తాంతములను, కడతేర్పన్ = నశింపఁజేయుటకును, (ధనురాకారము గలుగుటచే స్ఫురించిన) పడఁతి ... సంజ్ఞన్ - పడఁతి = ప్రభావతియొక్క; కనుబొమసంజ్ఞన్ = కనుబొమ్మసన్నచే, పనులు, ఒనర్పన్ = చేయుటకును, దైత్య ... దూపులు - దైత్య = రక్కసునియొక్క, మెఱుఁగు + తూపులు = వాఁడిబాణములను, దళితములు = చీల్పఁబడిన వానినిగా, చేయన్ = చేయుటకును, (బాణాకారముగలుగుటచే స్ఫురించిన) తత్తనూజ = అతని కూఁతు రగు ప్రభావతియొక్క, చూపులు = దృష్టులు, ఫలితములు = ఫలము గలవానిని - (సార్థకమైన వానిని.) చేయన్ = చేయుటకును - ఉదుటుఁదనమును = ఔద్ధత్యమును, వలపును = కామమును, ఒండొంటితోడన్ = ఒకదానితో నొకటి, దంటగొని - జతగూడి, క్రమ్మన్ = క్రమ్ముకొనఁగా (వ్యాపించి వశము చేసికొనఁగా) నెమ్మది = అట్టిమనస్సును, తాల్చెన్ = ధరించెను. మనస్సుకలవాఁ డయ్యె నని భావము. 'నెమ్మదిఁదాల్చె' అనుపాఠ మున్నచో నెమ్మదిన్ = మనస్సునందు, తాల్చెన్ = ధరించెను - అని స్వారసికముగాఁ గుదురును. కాని ముద్రితములందు 'నెమ్మది' కళగా పఠిత మగుటచే నట్లే వ్యాఖ్యానింపఁబడినది.

వి. :—ఔద్ధత్యము =(ఉదుటుఁదనము) గర్వము, వీరరసభావమగుటచే వీరమును, వలపు - శృంగారరసభావ మగుటచే శృంగారమును ఇందు సమీకరింపఁబడినవి. (గర్వో మద స్తథోగ్రత్వం భావా వీరే భవం త్యమీ అనియు, ఆత్మోపభోగకరణం స్పృశంతీ ప్రియవర్త్మనా, యా జహౌ తీతరాన్ భోగాన్సా స్పృహే త్యభిధీయతే అనియు - ప్రతాపరుద్రీయ తద్వ్యాఖ్యలందుఁ గలవు.) ఇట్టిభావముల కలయికను 'భావసంధి' అందురు. (శృంగారబీభత్సములకును, వీరభయానకములకును విరోధము గలదు. కాని శృంగారవీరములకు లేదు. ఈయర్థ మీ క్రింది శాస్త్రమునఁ దెలియఁదగు. 'మున్ను శృంగారబీభత్సములకు నొంట, దరులు తమలోన వీరభయానకములు.' - కావ్యాలంకార చూడామణి, 2.139.) ఇట్టి భావసంధి చమత్కార జనకము కావుననే మహాకవులు స్వీకరించుచు వచ్చిరి.

మ. "పరుఁజూచుక్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోష రాగోదయా
విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్,
జరగన్"............భాగ. 10. ఉత్త: 178.

ఇందు "వీరంబు శృంగారమున్" అని రసము వాచ్యమైనది. కాని, నాచనసోముని ఉత్తరహరివంశమున నీ నరకాసుర వధఘట్టముననే,

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందార కే
సరమాలామకరంద బిందుసలిలస్యందంబు లందంబులై
తొరుఁగన్ బయ్యెదకొం గొకింత తొలఁగన్ దోడ్తో శరాసారమున్
దరహాసామృత పూరమున్ గురియుచున్ దన్వంగి కేళీగతిన్. 1. 161 ప.

అని వీరశృంగారములు వ్యంగ్య మొనర్పఁబడినవి.

అలం:—తుల్యయోగిత. ఈ పద్యమందు స్మృత్యలంకారమును, భావికమును నర్థశక్తి మూలముగ ధ్వనించుట రమణీయము.

సీ. అంతట గోవిందుఁ డతనుని గదసాంబులను బిలిపించి యలంఘ్యదర్పు
వజ్రనాభుని బ్రహ్మ వరబలోద్ధతుని దేవహితార్థమై త్రుంపవలయుటయును
దన్మహత్త్వంబును దత్పట్టణప్రవేశం బన్యులకు నసాధ్యం బగుటయుఁ
దాను మరాళిచేఁ దగ ఘటింపించిన తదుపాయమును విశదముగఁ జెప్పి.

గీ. యందు రుక్మిణీసుతుఁడు భద్రాఖ్యరూపు, గదుఁడు పారిపార్శ్వకుని యాకారము మఱి
సాంబుఁడు విదూషకుని ప్రకారంబుఁ దాల్చి, చనఁగ నియమించి పంచెను దనుజపురికి.

అర్థము:—అంతటన్ = ఆసమయమున, గోవిందుఁడు = కృష్ణుఁడు, అతనునిన్ = (దేహము లేనివాఁడగు మన్మథుని యవతార మగు) ప్రద్యుమ్నునిని, గదసాంబులను పిలిపించి, అలంఘ్యదర్పున్ = దాఁటరాని గర్వముగలవాఁడును (అపారమగు నహంకారము గలవాఁడును), బ్రహ్మవరబలోద్ధతునిన్ = బ్రహ్మయొక్క వరముచేఁ (గల్గిన) శక్తిచే మిడిసిపడుచున్నవాఁడును, అగు, వజ్రనాభునిన్, దేవహితార్థమై = దేవతల క్షేమముకొఱకై, త్రుంపవలయుటయును = చంపవలసి వచ్చుటయును, తన్మహత్త్వంబును = ఆ రాక్షసుని యొక్క గొప్పతనమును, తత్పట్టనప్రవేశంబు = వానియొక్క పట్టనమునఁ జొచ్చుట, అన్యులకున్ = (వాని యనుమతిని బొందని) ఇతరులకు, అసాధ్యంబు = శక్యము కానిది, అగుటయును, తాను, మరాళిచేన్ = శుచిముఖిచేత, ఘటింపించిన = కూర్చునట్లు చేసిన, తదుపాయంబున్ = నాట్యప్రదర్శనార్థము భద్రుఁడను నటుఁడు వానిచేఁ బిలిపింపఁబడునట్టి పన్నుగడయును, విశదముగన్ = స్పష్టముగా, చెప్పి, అందున్ = ఆ నాట్యమునందు, రుక్మిణీసుతుఁడు = ప్రద్యుమ్నుఁడు, భద్రాఖ్యరూపున్ = భద్రుఁ డను నటుని యాకారమును, గదుఁడు, - పారిపార్శ్వకుని యాకారమును, మఱి, సాంబుఁడు, విదూషకుని ప్రకారంబును = విదూషకుని విధమును, తాల్చి = ధరించి, చనఁగన్ = వెళ్లుటకు, నియమించి = ఏర్పఱచి, దనుజపురికిన్ = రాక్షసునిపట్టణమగు వజ్రపురమునకు, పంచెను = పంపెను.

వి. :—పారిపార్శ్వకుఁడు. పార్శ్వం పరి - పరిపార్శ్వం. అవ్యయీభావ సమాసము - పరిపార్శ్వం వర్తత ఇతి, పారిపార్శ్వకః - నటునకు ప్రక్కనే యుండువాఁడు. అని వ్యుత్పత్తి. "భరతే నాభినీతం యోభావం నానారసాశ్రయం, పరిష్కరోతి పార్శ్వస్థః స భవే త్పారిపార్శ్వకః" (నటునిచే నభినయింపఁబడినదియు శృంగారాదిరసముల కాశ్రయమును నగు సాత్త్వికాది భావమును ప్రక్కనుండి రాగతాళాదులచే రంజిల్లఁజేయువాఁడు పారిపార్శ్వకుఁడు) అనియు.

విదూషకుఁడు:—తదాత్వ ప్రతిభో నర్మ చతుర్భేద ప్రయోగవిత్, వేదవి న్నర్మవాదీ యో నేతుః స స్యాద్విదూషకః (సమయోచితమై నవనవోన్మేషమగుబుద్ధిగలవాఁడును, నర్మము, నర్మస్ఫింజము, నర్మస్ఫోటము నర్మగర్భము నను నాలుగువిధముల నర్మము నెఱిఁగినవాఁడును, పరిహాసపూర్వకముగ మాటాడువాఁడును, నాయకునకు మిత్రుఁడు, వేదము చదివినవాఁడును నగునటుఁడు విదూషకుఁడు) అనియు - భావప్రకాశమున వివరింపఁబడెను.

ప్రద్యుమ్నుఁడు - రుక్మిణికొడుకు, సాంబుఁడు = జాంబవతికొడుకు - గదుఁడు = "గదాగ్రజో ముంజకేశో దాశార్హో దశరూపభృత్" అని కృష్ణపర్యాయ పదములును - సపితృవ్యం గదం వీరం సాంబం చాధాబ్రవీత్తథా-అని హరివంశము, విష్ణుపర్వము 96 అధ్యా, 44 శ్లో. [సః = ప్రద్యుమ్నుఁడు, పితృవ్యం = పినతండ్రియగు, గదం = గదుని) అనియు నుండుటంబట్టి కృష్ణునకు గదుఁడు తమ్ముఁడని తెలియఁదగును - సాంబుఁడు = ప్రద్యుమ్నునకు సవతిసోదరుఁడు - అని తెలియఁదగును.

ఆ. ఆముగురును పరస్పరావిదిత స్వప్రియాంగనా సమాగమానుగుణతఁ
బ్రమద మొంది రపుడు ప్రత్యేక మీయాత్ర, నాదుభాగ్య విలసనంబ యనుచు.

అర్థము:—ఆముగురును=ప్రద్యుమ్నుఁడు, గదుడు, సాంబుఁడును, పరస్పరా...గుణతన్, పరస్పర = ఒండొరులచేత, అవిదిత = తెలియఁబడని (ఒండొరు లెఱుఁగనట్టి), స్వప్రియాంగనా = తమతమ ప్రియురాండ్రయొక్క, సమాగమ = కలయికకు, అనుగుణతన్ = అనుకూలమైన దగుటచే, ఈ యాత్ర = ఈ ప్రయాణము, నాదుభాగ్యవిలసనంబు + అ = నా యదృష్టము బలు లగుటయే, అనుచున్, అపుడు, ప్రత్యేకము = ఒక్కొక్కరుగా, ప్రమదము = సంతోషమును, ఒందిరి = పొందిరి.

తాత్పర్యము:— ప్రద్యుమ్నగదసాంబులు ముగ్వురును తమలో నొండొరులకుఁ దెలియకుండనే తమతమ ప్రియురాండ్రను కలిసికొను నవకాశము కలుగుటచేత, నెవరికి వారే 'ఈ ప్రయాణము నా పూర్వ పుణ్యఫలముగా ఘటిల్లె'నని సంతసించిరి.

మనముల ని ట్లుబ్బుచును నటవేషంబు, ధరియించి తమకును దగినయట్టి
వారసీమంతినీవ్రాతంబు గొలువ వై, ణిక వైణవిక మౌరజిక జనాది
నాట్యసామగ్రి మున్ భద్రున కెట్టిది, యట్టిదియై కనుపట్టుచుండఁ
గదలి యథోచితగతిఁ బయనంబులు, వర్తిల్లఁగా నేఁగి వజ్రపురము

గీ. ప్రాంతమునను శాఖానగరములయందు, విరివి చూపట్ట మేళంబు విడిసి విడిసి
యతివిచిత్రంబు లగుతమయాటనేర్పు, లెల్ల నెఱపిరి కడు వార్త కెక్కుచుండ. 92

అర్థము:—ఇట్లు, మనములన్ = మనస్సులందు, ఉబ్బుచున్ = ఉప్పొంగుచు, నటవేషంబు = ఆటకాండ్ర వేషమును, ధరియించి, తమకును, తగినట్టి = స్త్రీవేషధారణమున కనువైన, వారసీమంతినీ వ్రాతంబు = భోగపుస్త్రీల సముదాయము, కొలువన్ = సేవించుచుండఁగా, వైణిక...సామగ్రి - వైణిక = వీణవాయించువారును, వైణవిక = పిల్లనఁగ్రోవితో పాడువారును, మౌరజికజన = మద్దెల వాయించువారి సముదాయమును, ఆది = మొదలుగాఁ గల, నాట్యసామగ్రిన్ = ఆటకుఁగావలయు సాధనసముదాయము, మున్ = ఇంతకుమునుపు, భద్రునకున్, ఎట్టిది = ఎటువంటిది (గలదో), అట్టిది + అ + ఐ = (సరిగా) అటువంటిదే యయి, కనుపట్టుచుండన్ = (చూచుజనులకు) గోచరించుచుండఁగా, కదలి = బయలుదేఱి, యథోచితగతిన్ = తగినట్టి గమనముతో, పయనంబులు = ప్రయాణములు, వర్తిల్లుచుండన్ = జరుగుచుండఁగా, ఏఁగి, వజ్రపురప్రాంతమునను=(వజ్రపురమునకు ముందుగాఁ బ్రవేశింపక) దాని సమీపగ్రామము లందును, (క్రమముగా) శాఖానగరములందున్ = వజ్రపురపుపేటలయందును, విరివి = విస్తృతి, (వ్యాప్తి) చూపట్టన్ = కనిపించునట్లు, (తాము వచ్చి నాట్యమొనర్చునట్లు నలుదెస వ్యాప్తి కలుగునట్లు), మేళంబు విడిసి విడిసి = నటీనటులయొక్క జట్టురూపమున నందందుబసచేసి చేసి, అతివిచిత్రంబులు = అత్యద్భుతములు, అగు తమయాటనేర్పులు, ఎల్లన్, కడున్ = మిక్కిలి, వార్తకున్ = ప్రసిద్ధికి, ఎక్కుచుండన్, నెఱపిరి = ప్రకటించిరి.

వి. :—మేళమువిడియు - అనునది బహుళః - 'మేళముచేయు' వంటి శబ్దపల్లవక్రియ యగును. మేళమువిడిసి విడిసి - సూ. శబ్దపల్లవక్రియలును, ద్వ్యవయవక్రియలును సమాస్తంబులయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు. ప్రౌఢ. క్రియా. 25. ధరియించి, కదలి, ఏఁగి, నెఱపిరి, అనుక్రియలకెల్ల కర్తలు ప్రద్యుమ్నాదులే యగుటచే విడియు క్రియకును వారలే కర్తలగుట ప్రకరణోచితము. నడుమనుండు 'మేళము' విడియుధాతువునకుఁ గర్తయగుట కుదురదు. 'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తమై విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవములు నాఁబడు.' అను విధిచే - అర్థవైలక్షణ్యము శబ్దపల్లవమున కొక లక్షణము కౌన - విజయంబుచేయు=వమ్ము, సభవిరియు = సభచాలించు, మున్నగువాని వంటిదై యుండును,

శాఖానగరము మూలనగరము (రాజధాని) కంటె నితరమగు పురము అని "అమరము." తరుస్థానీయస్య మూలనగరస్య శాఖేవ శాఖానగరమ్ - తరుస్థానీయమగు మూలనగరమునకు శాఖ (కొమ్మ) వంటిది శాఖానగరము అని శబ్దకల్పద్రుమము.

క. దనుజేంద్రుఁడు తద్వార్తలు, వినుచున్ హృదయమునఁ బొదలు వేడుకతో వా
రిని బిలిపించెను వారును, జని యాదనుజునకు నుచితసమయమునందున్. 93

అర్థము:—దనుజేంద్రుడు = రాక్షసరాజు, తద్వార్తలు = ఆ నాట్య వృత్తాంతములు, పొదలు= అతిశయించుచున్న, వేడుకతోన్ = ఉత్సాహముతో, (తక్కినది సుగమము).

క. తమ నాట్యవిద్య చూపఁగ, సమకట్టి తదర్హమైన సన్నాహ విశే
షము తోడ నేఁగుదెంచిరి, రమణ దలిర్పంగ నృత్యరంగస్థలికిన్. 94

అర్థము:—తమ నాట్యవిద్యన్ = తమయొక్క నటించుట యను విద్యను, చూపఁగన్ = ప్రదర్శించుటకు, సమకట్టి = సిద్ధపడి, తదర్హము (తత్ + అర్హము) = ఆ నాట్యమును జూపుటకుఁ దగినది, ఐన = అయినట్టి, సన్నాహ విశేషముతోడన్ = యత్నవిశేషముతో, (కట్టుదిట్టములతో అని యైనను కావచ్చును.) రమణ =సొగసు, తలిర్పఁగన్ = ప్రకాశింపఁగా, నృత్యరంగస్థలికిన్ = నాట్యమున కేర్పడిన వేదిక మీఁదికి, ఏఁగుదెంచిరి = వచ్చిరి.

తాత్పర్యము:—వజ్రనాభుఁడు పిలిపింప నాతని సన్నిధికి వచ్చి యాతనికిఁ జూపఁ దగిన సమయమందు తమ నాట్యవిద్యను చూపుటకై యాప్రద్యుమ్నాదులు తత్తద్వేషముల కుచితము లగు సాధన సామగ్రితో నృత్యమున కేర్పడ్డ వేదికకు వచ్చిరి.

వ. శుచిముఖి యటమున్న తన పలికిన క్రమంబున వచ్చి వజ్రనాభుని యాదరంబు వడసి ప్రవర్తిల్లుచుం, బ్రభావతికిం జంద్రవతీ గుణవతులకుం దత్పతుల రాక తెఱంగెఱింగించి, వియోగ తాపంబున మిగుల నొగులకుండఁ దదాశా శీతలోపచారంబున సేద దేర్చుచు నుండి, యప్పు డట్లేఁతెంచిన ప్రద్యుమ్నునకు క్షణక్షణ ప్రవర్ధమాన ప్రభావతీ రాగ వృత్తాంతంబున నౌత్సుక్యంబుఁ బెనుచుచు, నతి గూఢంబుగా రాకపోకలు గావించు చునికిం జేసి, యతనితోడ నేఁడు నీ హృదయవల్లభ నీ నాట్యంబు చూడ వచ్చు నని చెప్పి, తదాగమనీయ హర్మ్యస్థలంబును జూపి పోయె నంత. 95

అర్థము:—శుచిముఖి, అటమున్న = అంతకుముందే, తన పలికిన క్రమంబునన్ = తాను చెప్పిన విధముగా, వచ్చి - భద్రుని బిలిచి తీసికొని వచ్చెద నని చెప్పిన ప్రకారముగాఁ జేసి వచ్చి, వజ్రనాభుని యాదరంబు = వజ్రనాభునివలని మన్నన, పడసి = పొంది, ప్రవర్తిల్లుచున్ = చరించుచు, ప్రభావతికిన్, చంద్రవతీగుణవతులకున్ - ముగ్గురకు, తత్పతులరాక తెఱంగు = వారి పెనిమిటులు వచ్చువిధంబు, ఎఱింగించి, వియోగతాపంబునన్ = ఎడఁబాటువలని పీడచేత, మిగులన్, నొగులకుండన్ = బాధపడకుండునట్లు, తదా ... చారంబునన్ - తత్ = భర్తలు కలియుదురు అనునట్టి, ఆశా = కోరికయనెడి, శీతలోపచారంబునన్ = చలువకొఱకగు చికిత్సచే, సేదదేర్చుచు=ఆయాసము తీర్చుచు, ఉండి (ప్రభావతీ చంద్రవతీ గుణవతులకు వారిభర్తలు వచ్చినవిధము చెప్పి, వారు మిమ్ములను గలియుదు రని వారి వియోగ తాపమును జల్లార్చుచుండి.) అప్పుడు, అట్లు = నటరూపముతో, ఏఁతెంచిన ప్రద్యుమ్నునకున్, క్షణ ...

వృత్తాంతంబునన్ - క్షణక్షణ = ప్రతినిమిషమందును, వర్ధమాన = పెరుఁగుచున్న, ప్రభావతీరాగ = ప్రభావతియొక్క ప్రేమసంబంధమైన, వృత్తాంతంబునన్ = వార్తచేత, ఔత్సుక్యంబున్ = ఉత్కంఠను, (తహతహను) పెనుచుచున్ = హెచ్చుచేయుచు, అతిగూఢంబుగాన్ = మిక్కిలి రహస్యముగా, రాకపోకలు = వచ్చుటయు వెళ్లుటయును, కావించుచున్ + ఉనికిన్ + చేసి = చేయుచుండుటచేత, అతనితోడన్ = ఆ ప్రద్యుమ్నునితో, నేఁడు, నీ హృదయవల్లభ = నీ ప్రియురాలగు ప్రభావతి, నీ నాట్యంబు, చూడన్ = చూచుటకు, వచ్చును, అని, చెప్పి, తదాగమ ... స్థలంబునున్ - తత్ =ఆమె (యొక్క) ఆగమనీయ = రాఁదగిన, హర్మ్య = మేడయందలి, స్థలంబునున్ = చోటునుగూడ, చూపి, పోయెన్, అంతన్.

వి. :—రాగము:- ప్రియునితోఁ గలియుటకై యధికమగు తలపోఁత. ఔత్సుక్యము:- మనోహరము అగు వానిని జూచుటకుఁ బొందు వేగిరపాటు.

సీ. వజ్రనాభుఁడు రాజ్యవైభవం బెంతయు,మెఱసి నానాబంధుమిత్రసచివ,
సంఘంబుతోడ నాస్థాన మహామండ,పమునందు నొడ్డోలగమున నుండి,
పరులదృష్టికి నగోచరమగు సంవృత,స్థలి నిల్చి రాణివాసపు జనంబు
చూచునట్లుగఁ జేసి సొంపారువేడ్కతో, సావధానస్వాంతుఁడగుచుఁ జూడ

సంవిహితరంగమంగళాచారుఁ డగుచు, సురహితముగ మాయానాట్యసూత్రధార
వృత్తి గైకొని శంబరద్వేషి యొనరెఁ, బూర్వరంగప్రవర్తన పొందుపఱుప. 96

అర్థము:—వజ్రనాభుఁడు, రాజ్యవైభవంబు=ప్రభుత్వసంపత్తిని - దొరతనపునీటును, ఎంతయున్ = అత్యంతము, మెఱసి = ప్రకాశింపఁజేసి, నానా ... సంఘంబుతోడన్ - నానా = పెక్కు, బంధు = చుట్టములయొక్కయు, మిత్ర = స్నేహితులయొక్కయు, సచివ = మంత్రులయొక్కయు, సంఘంబుతోడన్ = సముదాయముతో, ఆస్థాన మహా మండపంబునందున్=దర్బారు తీర్చునట్టి పెద్దచావడియందు, ఒడ్డోలగమునన్ = నిండుకొలువునందు, ఉండి, పరులదృష్టికిన్ = ఇతరుల చూపునకు, అగోచరము = కనఁబడనిది, అగు, సంవృతస్థలిన్ = తెరలు మున్నగువానిచే మఱుఁగు గావించినచోటను, నిల్చి = ఉండి, రాణివాసపు జనంబు = అంతఃపురమందలి స్త్రీలందఱును, చూచునట్లుగన్, చేసి, సొంపారు = అధికమగు, వేడ్కతోన్ = ఉత్కంఠతో, సావధాన స్వాంతుఁడు = ఏకాగ్రతతోఁ గూడిన మనస్సు గలవాఁడు, అగుచున్, చూడన్=చూచుచుండఁగా (తన దొరతనము మెఱయ బంధువులు, చెలికాండ్రు, మంత్రులు, మున్నగువారెల్లరతోను, దర్బారుతీర్చు పెద్దచావడియందు నిండుసభతీర్చి యుండి, రాణివాసపుస్త్రీలందఱు నితరులకుఁ గన్పట్టకుండ తెరలు మున్నగువానిచే మఱుఁగైన స్థలమున నుండి చూచునట్లు చేసి, 'నాట్య మెప్పుడు చూతునా' యను తహతహతో చూచుచుండె ననిభావము.) పిమ్మట, శంబరద్వేషి= శంబరుఁడను రాక్షసునకు వైరియగు ప్రద్యుమ్నుఁడు, సంవిహిత...చారుఁడు - సంవిహిత = కూర్పఁబడిన-చేయఁబడిన, రంగ = నృత్యముకొఱకైన, మంగళాచారుఁడు = లోకపాలాదిపూజా విధానముగలవాఁడు, (రంగో నృత్యే రణక్షితౌ. అని విశ్వః నిఘంటువు) అగుచున్, సురహితముగన్ = దేవతలకు క్షేమము కలుగునట్లు, పూర్వరంగప్రవర్తన = నాట్యశాలయందు నటాదులకు కలుగుచుండు దురదృష్టరూపోపద్రవముల శాంతికొఱకు సూత్రధారాదినటులచే నొనర్పఁబడు కర్మవిశేషము. "పూర్వరంగము - యన్నాట్యవస్తునః పూర్వం రంగ విఘ్నోపశాంతయే, కుశీలవాః ప్రకుర్వంతి పూర్వరంగస్స ఉచ్యతే" అని సాహిత్య దర్పణము. అట్టి పూర్వరంగకర్మాచరణమే - పూర్వరంగప్రవర్తన, దానిని - పొందుపఱుపన్= చక్కఁగా నెఱవేర్చుటకై, తాను = ప్రద్యుమ్నుఁడు, మాయానాట్య సూత్రధారవృత్తిన్ = కపటమైన నాటకసూత్రధార ప్రవర్తనతో, ఒనగెన్ = ఒప్పెను. (అంతటఁ బ్రద్యుమ్నుఁడు తాను నృత్యముకొఱ

కగులోకఫాలాదిపూజ లొనర్చికొని కపటనాటక సూత్రధారుఁడై, నాట్యమున ప్రవర్తిల్లు నటాదుల కేయుపద్రవము కలుగకుండుటకై చేయునట్టి పూర్వరంగమను విధానము నడుపుటకై నిలిచెను. పూర్వరంగ మెట్లుండునో మీఁదటి రెండుపద్యములందును వివరింపఁబడును.)

వి. :—సూత్రధారుఁడు: సూత్రం ధారయతీతి సూత్రధారః అని వ్యుత్పత్తి. సూత్రమును ధరింపఁజేయువాఁడు అని దాని కర్థము. సూత్రమనఁగా సూచనమనియు, సూచనమనఁగా ఆంగిక, వాచి, కాహార్య, సాత్త్వికము లను నలుతెఱంగుల యభినయములచేత నటుఁడు తనయందు ప్రేక్షకులకు నాయకతాదాత్మ్య బుద్ధి గలిగించునట్టి నాట్యమే యనియు-ఈనాట్యమే 'సూచన, సూత్ర' శబ్దములచే వ్యవహరింపఁబడుననియు దానిని పాత్రలచే ధరింపఁజేయువాఁడు కాన 'సూత్రధారుఁ'డయ్యె ననియు శాస్త్రజ్ఞుల వివరణము. భరతుఁడు "ఆసూత్రయన్ గుణాన్ నేతుః కవే రపిచ వస్తునః,రంగ ప్రసాధన ప్రౌఢః సూత్రధార ఇహోదితః" (కథానాయకుని యొక్కయు, కవి యొక్కయు, కథయొక్కయు గుణవిశేషములను వర్ణించుచు రంగప్రసాధనము (రంగస్థలము నలంకరించుట) నందు నేర్పరి యగువాఁడు సూత్రధారుఁడు) అనెను.

మాతృగుప్తాచార్యుఁడు:—"నాట్యోపకరణాదీని సూత్ర మి త్యభిధీయతే, సూత్రం ధారయ తీత్యర్థే సూత్రధారో నిగద్యతే" (నాట్యమునకు వలయునుపకరణాదులు సూత్ర మనియు వానిని ధరింపఁజేయువాఁడు సూత్రధారుఁడు) అనెను.

మఱియు:—"చతురాతోద్యనిష్ణాతో౽నేక భూషాసమావృతః । నానాభాషణతత్త్వజ్ఞో నీతిశాస్త్రార్థ తత్త్వవిత్ । నానాగతి ప్రచారజ్ఞో రసభావవిశారదః । నాట్యప్రయోగ నిపుణో నానాశిల్పకళాన్వితః । ఛందోవిధాన తత్త్వజ్ఞః సర్వశాస్త్రవిచక్షణః । తత్తద్గీతానుగ లయ కలాతాలావధారణః । అవధాయ ప్రయోక్తాచ యోక్తౄణా ముపదేశికః । ఏవం గుణగణోపేతః సూత్రధారోభిధీయతే" ('తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము' అనఁబడు చతుర్విధవాద్యముల నేర్చినవాఁడు, పెక్కునగలు దాల్చినవాఁడు, ఎల్లపలుకుల (భాషల) గుట్టెఱిఁగినవాఁడు, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము నెఱిఁగినవాఁడు, పెక్కునడకల ప్రచారమును, రసము, భావము, నాట్యప్రచారమును దెలిసినవాఁడు, సకలశిల్పకళలు, ఛందోవిధానము, సకల శాస్త్రములు తెలిసి, ఆయాగీతములకుఁ దగిన లయ, కళా, తాళములయందు నిశ్చయజ్ఞానము కలవాఁడు, మెలఁకువతో తా నభినయించువాఁడు, అభినయించువారి కుపదేష్టయు, నైన గుణగణములు గలవాఁడు సూత్రధారుఁడు అనెను.)

ఈ లక్షణములు గలసూత్రధారు లిద్ద ఱనియు, మొదటివాఁడు పూర్వరంగము గావించి వెడలిపోయినపిదప వాని యాకారముగుణములు గల మఱొకనటుఁడు రంగప్రసాధనము చేసి కావ్యార్థమును ప్రస్తావించు (స్థాపించు) నని కొంద ఱనిరి. 'పూర్వరంగం విధా యాదౌ సూత్రధారే వినిర్గతే । ప్రవిశ్య తద్వదపరః కావ్య మాసూత్రయే న్నటః' అని రత్నాపణమును - 'నాందీం పఠిత్వా నాట్యాదౌ సూత్రధారే వినిర్గతే' అను మార్పుతో దశరూపకమును చెప్పుచున్నవి.

సాహిత్యదర్పణమున- పూర్వరంగ మొనర్చువాఁ డొకఁడు, తరువాత వానివంటివాఁడు మఱొకఁడును సూత్రధారు లిర్వు రుందు రని యొకకారిక నైవిధమున చెప్పియు - కావ్యార్థస్య స్థాపనాత్ స్థాపకః తద్వదితి - సూత్రధారసదృశ గుణాకారః - అని వ్యాఖ్యచేసి 'ఇదానీం పూర్వరంగస్య సమ్యక్ ప్రయోగాభావాత్ ఏకఏవ సూత్రధారః సర్వం ప్రయోజయ తీతి వ్యవహారః' ఇప్పుడు పూర్వరంగము పూర్ణముగా నడుపుట లేదు. కాన ఒక్కఁడే సూత్రధారుఁడు సర్వము నడుపుచున్నాఁడు (లోపలనిల్చి నాంది పఠించి తెరతొలఁగఁగానే తానే రంగస్థలమున నిల్చి ప్రరోచన, ఆముఖమును నడపుచున్నాఁడు)-అని తెలుపుటచే ఒకఁడు మాత్రమే సూత్రధారుఁ డుండఁదగు నని కొందఱమత మున్నట్లు తెలియుచున్నది.

ప్రకృత మగు నీపద్యమున రెండుపక్షములకును దావుగలదు. మాయాసూత్రధారుఁడు కాన ప్రద్యుమ్నుఁడు నాట్యశాలయందలి నేపథ్యమునందు పూర్వరంగకృత్యము నాందీపద్యాంతముగా జరిపి, నాంద్యంత

మున రంగమున బ్రవేశించి ప్రరోచనయు, నాముఖమును గలుగు ప్రస్తావన నడిపిన నడుపవచ్చును. లేదా, నేపథ్యమున నొకరూపముతోను, రంగస్థలమున వేఱొకని రూపముతోను మాయాబలమున నిరువు రనినట్లు తోఁచినను తోఁప వచ్చును.

అవతారిక :—ఆపూర్వరంగ మెట్లు ప్రవర్తిల్లెనో 98, 99 పద్యములలో వర్ణింపఁబడుచున్నది.

శా. గాంధారప్రముఖ స్వరశ్రుతికళా ౹ గంభీరవారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాది సం
బంధిస్వానపరంపరా మహిమయున్ ౹ మద్దెళ్లధింధింధిమిం
ధింధోంధిక్కి, ధిమిక్కి, శబ్దభరమున్ ౹ దీపింప నాపూర్ణతన్. 98

అర్థము :—గాంధార ... గాంధర్వంబున్ - గాంధార = షడ్జాది సప్తస్వరములలో మూఁడవ స్వరము (అది) ప్రముఖ=మొదలుగాఁగల, స్వర = శ్రుతికి ననంతరము కల్గి, స్నిగ్ధమై, యనురణన రూపము నొంది, శ్రోతల చిత్తమును స్వయముగా రంజింపఁజేయు-ధ్వనివిశేషములయొక్కయు, శ్రుతి=స్వరముయొక్క మొదటియవయవ మగుధ్వనివిశేషములయొక్కయు, కళా = విద్యలందు, (లేక - స్వరమునందును, శ్రుతి యందును - కలా = తాళమువేయునపుడు చూపుఘాతాభావమునందును) గంభీర = మిగులజ్ఞానము గల వారు - (అయిన) వారాంగనా = వేశ్యలయొక్క, గాంధర్వంబున్ = సంగీతమును - ఘనస్వనంబున్ = కంచుతాళములయొక్క ధ్వనియును, తతనిక్వాణంబున్ = వీణాదితంత్రీవాద్యముల ధ్వనియును, వంశాది ... మహిమయున్ - వంశాది = వేణువు (వెదురుగొట్టము) మొదలగువానికి, సంబంధి = సంబంధముగల సుషిరవాద్యములయొక్క, స్వాన = ధ్వనులయొక్క, పరంపరా = వరుసలయొక్క, మహిమయున్ = అతిశయమును, మద్దెళ్ల ... భరమున్ - మద్దెళ్ల = చర్మముచేఁ కట్టబడునట్టి మృదంగాదు లగు అనద్ధవాద్యముల యొక్క, ధింధిం ... ధిమిక్కి, మొదలగు, శబ్ద =(అవ్యక్త) ధ్వనులయొక్క, భరమున్ = అతిశయమును, ఆపూర్ణతన్ = నిండుఁదనముతో, దీపింపన్ = ప్రకాశింపఁగా - (మీఁదికన్వయము). ఇందు పంచమహాశబ్దములను చెప్పెను. (1) తతము = వీణాది తంత్రీవాద్యము, (2) ఆనద్ధము = చర్మముచే కట్టఁబడిన మృదంగాది (3) సుషిరము = రంధ్రములువేసి ముఖవాయువుచే నూదెడు వేణువు, సన్నాయి మొదలగునది, (4) ఘనము = కంచుతాళములు మున్నగునవి, (వీనిని చతుర్విధవాద్యములందురు.) (5) వేశ్యల తౌర్యత్రికము - (సేనాకలకలధ్వని యనికొందఱు) అను నైదింటివలనఁ బుట్టుశబ్దము లను 'పంచమహాశబ్దము' లనిరి.

వి. :—స్వరములలో మొదటిదగు షడ్జము మాని, 'గాంధారము మొదలగు' అని చెప్పుటవలన - గాంధార మనునది-గాంధారగ్రామ మని తోఁచుచున్నది. గాంధార= స రి గ మాదిసంజ్ఞలలో 'గ' యనునది గాంధారమునకు సంజ్ఞకావున, గాంధారము, ప్రముఖస్వర = ప్రధానస్వరముగాగల, శ్రుతి = (షడ్జాదిస్వరముల యారంభకావయవమగు) ధ్వనివిశేషము. ఇట్లుఅనినచో గాంధారగ్రామ మగును. 'ప్రథమశ్రవణాచ్ఛబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః, సాశ్రుతిః సంపరిజ్ఞేయా స్వరావయవ లక్షణా. ఇతి స్వరారంభకావయవః శబ్దవిశేషః అని కొందఱు; కొందఱు 'శ్రుతిర్మాతా లయఃపితా' యనియును 'శ్రుతిభ్యఃస్యుః స్వరాః షడ్జర్షభగాంధారమధ్యమాః, పంచమో ధైవత శ్చాథనిషాద ఇతి సప్తతే'. తేషాంసంజ్ఞా - 'సరిగమపధనీ త్యపరా మతా' అనియు, స్వరములకు శ్రుతి కారణము (జనని)యని చెప్పియున్నారు, కాన గాంధారము ప్రధానస్వరముగాఁగల శ్రుతియనిన గాంధారగ్రామమునకు హేతువగు శ్రుతులయొక్క, కళా=విద్యయందు, ఆవేశ్యలు గంభీర లనుకోఁదగును. గాంధారగ్రామము దేవలోకమునఁ గాని యితరత్ర లేదు.

గ్రామము:— 'యథా కుటుంబినః సర్వే ప్యేకీభూతా భవంతిహి, తథా స్వరాణాం సందోహో గ్రామ ఇ త్యభిధీయతే' కుటుంబవంతు, లందఱు నొక్కచో నుండినయెడ అది గ్రామ మైనట్లే సప్త

స్వరముల సముదాయము గ్రామమగునని భావము. - అందు మొదట నేస్వరముతో నారంభించిన నా స్వరముయొక్క పేరితో నా గ్రామము చెప్పఁబడును. "షడ్జగ్రామము, గాంధారగ్రామము ఇత్యాది - షడ్జ మధ్యమ గాంధారా స్త్రయోగ్రామా మతా ఇహ, షడ్జగ్రామో భవేదత్ర మధ్యమగ్రామ ఏవచ, సురలోకే చ గాంధారో గ్రామః ప్రచరతి స్వయం" (షడ్జాది సప్తస్వరములవలన గ్రామ సప్తక మేర్పడు నవకాశమున్నను షడ్జ, గాంధార, మధ్యమ గ్రామములు మాత్రమే సంగీతమున స్వీకరింపఁ బడినవి. అందు మనుజలోకమున షడ్జ, మధ్యమ గ్రామములు మాత్రమే వ్యవహరింపఁ బడుచున్నవి. గాంధార గ్రామము దేవలోకమునఁ బ్రచార మందున్నది.) అని సంగీత దామోదరము. ఈ భావమే కుమారసంభవ వ్యాఖ్య యందును 'షడ్జమధ్యమ నామానౌ గ్రామౌ గాయంతి మానవాః, నతు గాంధారనామానం - స లభ్యో దేవయోనిభిః.' అని కలదు.

కావున 'అట్టి మానవాతీత మగు గాంధారగ్రామము స్వీకరించి వారాంగనలు సంగీతము నెఱపిరి.' అని చెప్పుటకే 'గాంధార ప్రముఖస్వర' ఇత్యాదిగాఁ జెప్పఁబడె ననుకోఁ దగును. 'సరిగమపధని' యనునది షడ్జగ్రామము.'గమపధనిసరి'గాంధారగ్రామము."రిమయోః శ్రుతి మేకైకాంగాంధా రశ్చే త్సమాశ్రయేత్, పశ్రుతిం ధో నిషాదస్తు ధ శ్రుతిం స శ్రుతింశ్రితః, గాంధారగ్రామ మాచష్ట తదా తం నారదో మునిః, ప్రవర్తతే స్వర్గలోకే గ్రామో సౌన మహీతలే." సంగీత దర్పణము. (ఋషభ మధ్యమముల యొక్క యొక్కొక్క శ్రుతిని గాంధార మాశ్రయింపఁగా - ధైవతము పంచమ స్వరమును, నిషాదము ధైవతమును, షడ్జమును నాశ్రయించి యున్నచో నది గాంధారగ్రామ మనియు, అది స్వర్గలోకముననే కాని భూలోకమున లేదని నారదుఁడు చెప్పెను. ముందు పద్యమున 'చతుర్దశ మద్రక గీతభేదములు దురాపము లంద్రు, వర్తిలె నవియును నిఖిల కళలునుగల రౌక్మిణేయు శిక్షవలన' అనుటంబట్టి మానవుల కలభ్యమగు నీగాంధారగ్రామమును గూడ ప్రద్యుమ్ని శిక్షవలన నేర్చిన నిపుణ లగు వారాంగనలు గాన మొనర్చి రని తెలియుచున్నది.

గాంధర్వము = గానము అనుటకు. తన పాండిమము చూపులనె యుంచి గాంధర్వమవనికిఁ దెచ్చిన యంచయాన. వసుచ. 2.27. 'పదస్థః స్వరసంఘాత స్తాలేన సహ సంగతః (సంగత స్తథా. అని ముద్రితము) ప్రయుక్త శ్చావధానేన గాంధర్వ మభిధీయతే' అని దత్తిలుఁడు. 'రంజకస్వర సందర్భో గీతమిత్యభి ధీయతే, గాంధర్వం గాన మిత్యస్య భేదద్వయ ముదీరితం, అనాది సంప్రదాయం యద్గంధర్వైః సంప్రయుజ్యతే, నియతః శ్రేయసో హేతుస్తద్గాంధర్వంజగు ర్బుధాః' శ్రోతల మనసును రంజింపఁ జేయునది గీతము. అది గాంధర్వము, గానము అని రెండు విధములు. అందు గాంధర్వము వేదమువలె గురుశిష్య పరంపరా ప్రాప్తమై గంధర్వులచేఁ బ్రయోగింపఁ బడునది. అని సంగీత రత్నాకరము.

పంచమహా వాద్యములు పూర్వరంగమునఁ బ్రవర్తిల్ల వలె ననియు, నా ప్రకారమే యయ్యాది యారంభింపఁ బడెననియు నీ పద్యమునఁ దెలుపఁబడినది. (1) సంగీతము (2) తతము (3) ఆనద్ధము (4) సుషిరము (5) ఘనము అనవాని ధ్వనులచే దశదిశలు నిండిపోయినవి. ఆ గానము నాతోద్యము నెట్లు ప్రవర్తిల్లెనో యీ మీఁదటి పద్యమునఁ దెలుపఁబడుచున్నది.

సీ. సరవిఁ జంచత్పుట చాపపుటోద్ఘట్ట, షట్పితాపుత్రక సంజ్ఞ లమర
వెలయు చుండెడు సమ విషమ తాళప్రవృత్తులు నాల్గు ప్రస్తార కలన వలనఁ
గలుగు నానాతాళములు యథోక్తస్ఫూర్తిఁ, బరగు నేలాది ప్రబంధ చయముఁ
దత్తదర్థస్థాన దత్తపటాక్షర, బిరుదాది కాంగ విస్ఫురణ దనర

గీ. క్షితిఁ జతుర్దశ మద్రకగీతభేద,ములు దురాపము లంద్రు వర్తిలె నవియును
నిఖిల కళలును గల రౌక్మిణేయు శిక్ష,వలనఁ దన్నాట్య కర్మ ప్రవర్తనమున.

అర్థము:—తన్నాట్యకర్మ ప్రవర్తనమునన్ = తత్ - ఆ, నాట్య = ముందు జరుగ నున్న నాటకమునకు సంబంధించిన, కర్మ=పూర్వరంగముయొక్క, ప్రవర్తనన్=జరుపుటయందు - ముందు జరుగఁబోవు నాట్యము నిర్విఘ్న పరిసమాప్తి నొందఁ గావించు దేవపూజాది రూపమగు పూర్వరంగము జరుపుటయందు, ఎల్లకళలును=సకలవిద్యలును (దివ్యములు, మర్త్యములునుగూడ),కల రౌక్మిణేయు శిక్షన్=కలిగిన ప్రద్యుమ్నుని యొక్క బోధనముచేత, సరవిన్ = క్రమముతో, చంచత్పుట ... సంజ్ఞలు - చంచత్పుటము, చాపపుటము, ఉద్ఘట్టము, షట్పితాపుత్రకము - అనుపేళ్లు, అమరన్ = కలుగఁగా, వెలయుచుండెడు = ప్రసిద్ధము లగు, సమ విషమ తాళ ప్రవృత్తులు = సమము, విషమము, నను తాళముయొక్క వ్యాపారములు గల, నాల్గును= మీఁద జెప్పిన చంచత్పుటాదులు నాలుగును, - రెండుగురువులు, నొకలఘువు, నొకప్లుతమును గలది చంచత్పుటము (తాలే చంచత్పుటే జ్ఞేయం గురుద్వంద్వం లఘుః ప్లుతం. సం. దామో.) అది సమము = చతురస్రము (చతురస్ర స్తథా త్ర్యస్ర ఇతి తాలో ద్విధా మతః) చంచత్పుట శ్చాప (చ) పుట ఇతి నామ్నా తయోః క్రమాత్ - సం. రత్నా.) అనియు - ఒక గురువు నొక లఘువు నొకప్లుతము గలది చాచపుటము. (గురు ర్లఘుః ప్లుతంచైవ భవే చ్చాచపుటాభిధే, సం. దా.) అది విషమము = త్ర్యస్రము (అనిమీఁది. సం. రత్నా. లోఁ జెప్పఁబడెను) ఒకగురువు నొక మగణము - (మూఁడుగురువులు) నొకనగణము- (మూఁడులఘువులు) - గలది-ఉద్ఘట్టము ('ఉద్ఘట్టకేతు గమనాః' అని సం. దామో.) అదియును, విషమము = త్ర్యస్రము (ఉద్ఘట్టోపి త్ర్యస్రభేదః. సం. ర.) గురువు లఘువు గురువు గురువు లఘువు, గురువు లఘువు - గలది షట్పితాపుత్రకము.(గల గాల గలాశ్చైవ షట్పితాపుత్రకేమతాః. సం.దామో). అదియును విషమము= త్ర్యస్రవిశేషము. (షట్పితాపుత్రక స్త్ర్యస్రభేదః విశేషోత్ర ప్లుత మాద్యంతయోర్భవేత్. సం. ర. ఆద్యంతములు ప్లుతములై యుండవలెనని యీ గ్రంథము. కాని పైని జాతినసంగీతదామోదరమున నిట్లులేదు. (విమర్శనీయము). ప్రస్తారకలనవలనన్=ఆతాళములను ప్రస్తరించుటవలన (చందస్సువలెనే, తాళమును తెలిసికొనుట క్రొత్తవి సృష్టించుకొనుట మున్నగు విశేషములను వివరించుమార్గము - ప్రస్తారము. 'సర్వప్లుతాత్సమారభ్యమాత్రా నివహనిర్మితా, (తావత్ప్రస్తారయే దంతే యావత్సర్వం ద్రుతం భవేత్. అనియు, 'అర్ధమాత్రంద్రుతం జ్ఞేయ మేకమాత్రం లఘు స్మృతం, ద్విమాత్రంతుగురు జ్ఞేయం గురుద్వంద్వం లఘు ప్లుతం.' అని మాత్రావివరణమును. సం. దామో.) కలుగు = పుట్టుచున్న, నానాతాళములు = పలురీతుల తాళములు. (ద్రుతములఘువు మున్నగువానిచే సమముగాఁ జేయఁబడిన క్రియచే (పనిచే) నృత్తగీతవాద్యముల మితి నేర్పఱచుకొలము తాళ మనఁబడును. 'తాలఃకాల క్రియామానం. అని అమరము) యథోక్తస్ఫూర్తిన్= శాస్త్రమునఁ జెప్పఁబడినపద్ధతిచేత, పరఁగు నేలాదిప్రబంధచయమున్ = లోకమునఁ బ్రసిద్ధము లగు 'ఏల' మున్నగుప్రబంధముల సముదాయమును, (సూడము అను సంజ్ఞగల ప్రబంధసముదాయ మని భావము) తత్త ... విస్ఫురణ - తత్తత్ = ఆయాయంగములకు, అర్హ = తగినట్టి, స్థాన = స్థలములందు, దత్త = ఈయఁబడిన, నెలకొల్పఁబడిన, పటాక్షర = (పాఠాక్షర, పాటాక్షర - అని సంగీతశాస్త్రమున నుండుటచే 'పటాక్షర' ప్రామాదికమై యుండవచ్చును. పాఠాక్షర అనికాని, పాటాక్షర అనికాని పఠించిన, లెస్స. 'తథఖోతేమితిజ్ఞేయాః పాఠవర్ణా మృదంగజాః, ... తక్కతంథంధిదో తాధి పాఠఖండే త్వయంక్రమః' అని సంగీతదామోదరమును, 'పాటో వాద్యాక్షరోత్కరః' అని సంగీత రత్నాకరమును చెప్పుచున్నవి.) 'ధిం ధిం ధిమి తక్క' మున్నగు మృదంగ శబ్దానుకరణవర్ణములయొక్కయు, బిరుద=ప్రబంధమురచించిన వాని యొక్కయు, వర్ణముయొక్కయు ప్రశస్తి, ఆదిక=మొదలగు,అంగ=(ఆప్రబంధముల) అవయవములయొక్క, విస్ఫురణ = ప్రకాశము, తనరన్ = ఒప్పఁగా - చతుర్దశ ... భేదములు - చతుర్దశ = పదునాలుగు సంఖ్యగల, మద్రక గీతభేదములు = మద్రకము మున్నగు ఏలాగీతవిశేషములు, క్షితిన్ = భూమియందలి, (మానవులకు) దురాపములు = పొందశక్యముగానివి, అండ్రు = అందురు - అవియును = అట్టి మద్రకాది గీతములును, వర్తిలెన్ = సాగెను.

తాత్పర్యము:—ఆ ప్రద్యుమ్నుని శిక్షచేత నా నాట్యసంబంధంబగు పూర్వరంగమున ఇష్టదేవతారాధనముచేసి పంచవాద్యములను కుశీలవులు ప్రవర్తిల్లఁ జేయునపుడు చంచత్పుటము, చాపపుటము, ఉద్ఘట్టము, షట్పితాపుత్రకము ననుసంజ్ఞలు గల సమ, విషమ (తాళ) గతులు గల నాలుగుతాళములును

ప్రస్తారమువలనఁ బెక్కుతాళములును - శాస్త్రోక్తరీతి నొప్పు ఏలా, కరణ, ఢేంకీ, వర్తనీ, ఆ ఝొంబడ, లంభ, రాస, ఏకతాళ - అను ప్రబంధములును - అందు వానికిఁ దగిన స్థలములందు కూర్పఁబడిన "ధింధిం తక్క" ప్రభృతి పాటాక్షరములు, బిరుదులు మొదలగు నా ప్రబంధావయవములును ప్రకట మగుచుండగా - మానవులకు గాంధార గ్రామమువలెనే లభింపని మద్రకము, అపరాంతము ఉల్లోప్యము ప్రకరులు ? (ప్రకర్యము ?), వేణకము, రోవిందకము, ఉత్తరము, (7) ఛందకము, ఆసారితము, వర్ధమానకము, పాణిక, ఋక్కులు, గాథలు, సానుగీతులు - (7) అను పదునాలుగు గీతవిశేషములును ప్రవర్తిల్లెను.

వి. :—భూలోకమున మానవులకు లభింపని గాంధారగ్రామమున గానమును, మద్రకాది విశిష్ట గీతములును, ఆ పూర్వరంగవిధియందు మాయా నాట్యసూత్రధారుఁ డగు ప్రద్యుమ్నుని శిక్షచే కుశీలవులు ప్రవర్తిల్లఁజేసిరి. ఇఁక నానాట్యముయొక్క వైచిత్ర్యము దీనివలన నూహింపఁ దగును. చంచత్పుటాదులు - (తాళములు) ఏకాధికశతే తాళే షష్టిర్ముఖ్యా తమా ఇమే - అనుటచే మొత్తము నూటయొక్కటి యనియు, అందు నఱువది ముఖ్యము లనియు, సంగీతదామోదరమునఁ జెప్పఁబడినవి. అందును చంచత్పుటాదులు నాల్గును ముఖ్యతమములై యుండనోపు. కావున నా నాలుగే యిందు గ్రహింపఁబడినవి. ఏలాదులు సూడమను గీతసముదాయమున కంగములగు ప్రబంధము లని సంగీత రత్నాకరమున "ఏలా కరణ ఢేంకీభిః, వర్తన్యా ఝొంకఢేన చ, లంభ రాసైకతాళీభి - రష్టభి స్సూడ ఉచ్యతే" అని చెప్పి-ఏల యను ప్రబంధమున పదియాఱు చరణము లుండుననియు, వానిని రెండుసారులు గానముచేసి పదుమూఁడవ పదాదిని నిలుపవలె ననియు, మంఠ, ద్వితీయ, కంకాల, ప్రతి, తాలములలో నొక తాళముతో పాడవలెననియు, దానియందు త్యాగ, సౌభాగ్య, శౌర్య, ధైర్యము లుండవలె ననియు "పునర్గీత్వా ధ్రువేత్యాగః, గ్రహస్తు విషమో భవేత్", ఏలా సామాన్యలక్ష్మైతత్ పూర్వాచార్యై రుదాహృతం, మంఠద్వితీయ కంకాల ప్రతితాలేషు కశ్చన, తాలో ఽ స్యాం త్యాగసౌభాగ్య శౌర్య ధైర్యానువర్ణనం - అని ఏలా సామాన్యలక్షణము చెప్పి, ఏలలు నాల్గు విధములనియు - వానిని వినువారికిని పాడెడువారికిని ధర్మార్థ కామములను బూరించుననియు, (అ + ఇ + లా = ఏలా) దీనికి అకారము విష్ణువు, ఇకారము మన్మథుఁడు, లకారము లక్ష్మి, అధిదైవతము లనియు - ఫలములను జెప్పెను. "ఏలా శ్రోతుః ప్రయోక్తుశ్చ ధర్మకామార్థ సిద్ధిదా,గణమాత్రా వర్ణదేశ విశిష్టా స్తా శ్చతుర్విధాః, అకారే దైవతం విష్ణు రకారే కుసుమాయుధః, లక్ష్మీర్లకార ఏలానా మితి వర్ణేషు దేవతాః" మగణాదులందలి గణములచే రచింపఁబడినవి గణైలలు. (ఆఱుమాత్రలుగల) ఛగణ (ఐదుమాత్రలు గల) పగణాది మాత్రాగణరచితములు మాత్రైలలు, గణనియమము లేక యక్షరములలెక్కచే రచింపఁబడినవి వర్ణైలలు, కర్ణాటలాట గౌడాంధ్రద్రావిడభాషలయందు రచితములు దేశైలలు, అనియు వీనియం దింకను బెక్కుభేదములు గలవనియు సంగీతరత్నాకరము తెలుపుచున్నది.

ఉ. ఆ వనజాక్షనందనుఁడు నంతట నాంది దగం బఠించి యిం
పావహిలం బ్రరోచనయు నాముఖముం దనరార నొప్పు ప్ర
స్తావనతో ముఖాదు లగుసంధులు సాంగతఁ బెంపుమీఱ గం
గావతరాది నాటకము లాడె ననేకము లద్భుతంబుగన్. 100

ఈవిధమున నపూర్వరీతిని బూర్వరంగకృత్యము నంతయు యథావిధిగా నెఱపి,

అర్థము:—అవనజాక్షనందనుఁడున్ = శ్రీకృష్ణుని కొడుకగు నాప్రద్యుమ్నుఁడును, అంతటన్ = నటు లానర్చు కృత్యము ముగిసినపిదప, నాంది = పూర్వరంగమునకుఁ దుదియంగమగు నాందీపద్యమును, మంగళశ్లోకమును, తగన్ = తగినరీతిగా, పఠించి = చదివి - నాంద్యంతమున రంగస్థలమునఁ బ్రవేశించి, ఇంపు = సభ్యులకు నాటకము చూడవలెనను వేడుక, ఆవహిలన్ = కలుగునట్లు, ప్రరోచనయున్ = నాటకముయొక్కయు, కవియొక్కయుఁ బ్రశస్తిని వర్ణించి సభ్యుల నభిముఖులుగాఁ జేసికొనెడు నొక

ప్రస్తావనాంగమును, (పిదప) ఆముఖమును = రాఁబోవు కథాంశము గాని, పాత్రప్రవేశముగాని సూచించు నట్టి మఱొక ప్రస్తావనాంశమును, తనరారన్ = అతిశయించునట్లుగా, ఒప్పు = తగిన, ప్రస్తావనతోన్ = నటితోఁ గాని, మారిషునితోఁ గాని, పారిపార్శ్వకునితోఁగాని ప్రరోచనాముఖములరూపమున జరుపు సంభాషణముతో, ముఖాదులు = ముఖము మొదలుగాఁ గలవి (ముఖము, ప్రతిముఖము, గర్భము, అవమర్శము, నిర్వహణము, అను) సంధులు = ఐదు సంధులును, సాంగతన్ = వాని యఱువది నాలుగంగముల తోడను, పెంపుమీఱన్ = అతిశయింపఁగా, అనేకములు = పెక్కులైన, గంగావతరాది నాటకములు = భగీరథుఁడు గంగను భూలోకమునకుఁ దెచ్చువస్తువుగల గంగావతరణము మొదలగు రూపకములను, అద్భుతంబుగన్ = ప్రేక్షకుల కాశ్చర్యము కలుగునట్లు, ఆడెన్ = అభినయించెను.

తాత్పర్యము:—పూర్వరంగము తుదిని ప్రద్యుమ్నుఁడు మంగళశ్లోకముతో రంగమంగళము పూర్తి చేసి, ప్రరోచనయు, నాముఖమును జక్కఁగ నొప్పునట్లు పారిపార్శ్వకుఁడగు గదునితోఁగూడి ప్రస్తావన ముగించి, యఱువది నాలు గంగములు గల ముఖాదిసంధులు పరిపూర్ణముగా మెఱయ గంగావతరణము మొదలగు నాటకముల నెన్నియో యద్భుతముగా నభినయించెను.

వ్యా. వి. :—గంగావతరము - అవతరము = అవతరించుట అని భావార్థమున 'ఋదోరప్' అను పాణినీయముచేత సిద్ధము. 'నిజత్రినేత్రావతరత్వ బోధికాం' నైషధ. 1-6 శ్లో. 'భయస్య పూర్వావతర స్తరస్వినా' శిశుపాలవధ 1-43శ్లో. అవతారము, అవతరణము అని ప్రచురమగు వ్యవహారము.

నాంది:—క్రియారూప, వాగ్రూప యని రెండువిధములు. నాట్యారంభమున నందికిఁ జేయుపూజ - క్రియారూపయగు నాంది. 'నందీవృషః కోపి మహేశ్వరస్య రంగత్వ మాదౌ కిల ఖే జగామ । తద్రంగ ముద్దిశ్యకృతాంతు పూజాం నాందీతి తాం నాట్యవిదో వదంతి'-నంది యనునొకవృషభము శివునకు నాట్యము చేయ రంగస్థల రూపమునొందెను. రంగస్థల రూపుఁడైన యానందికిఁ జేయుపూజ నాంది యనఁబడెను. అని భరతుఁడనెను.

రెండవది వాగ్రూప యగునాంది:—అది మంగళాశీర్నమస్క్రియా యుతమును, శ్లోకాత్మకమునై బహువిధముల నుండును.

'ఆశీర్నమస్క్రియారూపశ్లోకః కావ్యముఖోదితః । నాందీతి కథ్యతే తస్యాం పదాదినియమోపివా। శంఖమాంగల్య చక్రాబ్జకోక కైరవశంసినీ । యత్రాష్టాభి ర్ద్వాదశభి రష్టాదశభి రేవ వా । ద్వావింశత్యా పదై ర్వాపి సా నాందీ పరికీర్త్యతే' - అని కోహలుఁడు చెప్పెను.

నాందీ శబ్దార్థమునుగూర్చి - నందికిఁజేయుపూజయని - క్రియారూప-చెప్పబడఁగా, మాలతీమాధవ వ్యాఖ్యయందు - ఆశీర్వాగాది నానందయతీతి నందః - పచాద్యచ్. నందఏవ నాందః - ప్రజ్ఞాదిత్వా దణ్ ప్రత్యయః - టిడ్ఢాణఞ్ ఇత్యాదినాఙీప్. అని 'వాగ్రూప' చెప్పఁబడెను. (ఆశీర్వాదముచే సంతసింపఁ జేయుట నందము - నందమే నాందము అగును. స్త్రీలింగవివక్షయందు ఙీప్ వచ్చి 'నాంది' యగును.)

'ఆశీర్వచనసంయుక్తా స్తుతి ర్యస్మా త్ప్రవర్తతే। దేవద్విజనృపాదీనాం తస్మా న్నాందీతి సా స్మృతా। (ఆశీర్వచనరూప మగు దేవద్విజనృపస్తుతి యిందుండును గాన దీనికి నాంది యనుసంజ్ఞకల్గెను) - అని కొందఱును, (ఇది వాగ్రూపయగును.)

'నందంతి దేవతా యస్మాత్ తస్మా న్నాందీ ప్రకీర్తితా' (దీనివలన దేవత లానందింతురు గాన నాంది) అని భరతుఁడును జెప్పి యున్నారు. కవులును, సభ్యులును, నటులును దేనిచే నానందింతురో అది నాంది యని నాట్యప్రదీపమునఁ గలదు. (ఈ నిర్ణయ ముభయమునకును సరిపడును.)

ఇది నాటకాదుల మొదటనుండును. దీనియందు మంగళవాచకములగు పదములును, శబ్దముచేఁ గాని, యర్థముచేఁగాని కావ్యార్థసూచనయును, చంద్రునినామమును నుండవలెను. మొదటిసూత్రధారుఁడు మధ్యమస్వరమునఁ జదువవలె నని నాందికిఁ గల నియమములు.

ప్రరోచన:—కథానాయక, కవి, సభ్య, నటులను, దేశకాలములను ప్రశంసించి, సభ్యుల చిత్త వృత్తుల నున్ముఖ మొనర్చుట.

("ప్రరోచనాతు సా ప్రోక్తా ప్రకృతార్థప్రశంసయా । సదస్య చిత్తవృత్తీనా మున్ముఖీకరణం చ యత్ । ప్రశంసా ద్వివిధా ప్రోక్తా చేతనాచేతనాశ్రయా । చేతనాస్తు కథానాథ కవి సభ్య నటాః స్మృతాః। అచేతనా దేశకాలౌ కాలో మధు శరన్ముఖః॥ దేశస్తు దేవతా రాజ తీర్థస్నానాది రుచ్యతే') ఆ ప్రరోచన 'విస్తారరూప, సంక్షేపరూప' అని రెండువిధములు. కథానాయక కవి సభ్య నటుల వేఱువేఱు వాక్యము లలోఁ గాని పద్యములలోగాని వర్ణించిన నది విస్తరప్రరోచన, ఒకపద్యమందే చెప్పిన సంక్షేపప్రరోచన.

ఆముఖము:—సూత్రధారుఁడు నటితోఁ గాని, విదూషకునితో గాని, పారిపార్శ్వకునితోఁ గాని తనకార్యము నిమిత్తమై పుట్టిన చిత్రములగు వాక్యములచేత ప్రస్తుతకార్యముం జెప్పుట.

'నటీ విదూషకోవాపి పారిపార్శ్వక ఏవవా । సూత్రధారేణ సహితాః సల్లాపం యత్రకుర్వతే । చిత్రవాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభి ర్మిథః । ఆముఖం తత్తువిజ్ఞేయం నామ్నా ప్రస్తావనాపి సా' అని సాహిత్యదర్పణము. ఇందు దశరూపకమందువలెనే ఆముఖమే 'ప్రస్తావన' యని చెప్పబడెను.

ప్రస్తావన:—పైన చెప్పిన ప్రరోచన, ఆముఖమును అంగములుగాఁగలది. సూత్రధారుఁడు, నటి మొదలగువారితోఁ జేయుసంభాషణమున వీథ్యంగము లాముఖమున కూర్పఁబడుట ప్రస్తావన. (ఉద్ఘాత్య, కథోద్ఘాతాదులు వీథ్యంగములు.)

ముఖాదిసంధులు:—ఒక ప్రయోజనముతో సంబంధించిన కథాభాగములకవాంతర ముఖ్యప్రయోజన ముతోఁ గలుగుసంబంధము సంధి యనఁబడును. 'అంతరైకార్థసంబంధ స్సంధి రేకాన్వయే సతి' ఏకేన ప్రయోజనేన అన్వితానాం కథాంశానా మవాంతరైక ప్రయోజన సంబంధః సంధిః అని – సాహిత్యదర్పణము.

బీజాదులగు అర్థప్రకృతు లైదును – ఆరంభము మొదలగు నైదవస్థలతో వరుసగా కూడుటవలన ముఖాదులగు నైదు సంధు లగును.

(1) ఆరంభ మను నవస్థతో 'బీజము' అను నర్థప్రకృతి సంబంధించినచో 'ముఖసంధి'
(2) 'యత్నము' అను నవస్థతో 'బిందువు' అను నర్థప్రకృతికూడుట 'ప్రతిముఖసంధి.'
(3) 'ప్రాప్త్యాశ' అను నవస్థతో 'పతాక' అను నర్థప్రకృతి కూడుట 'గర్భసంధి'
(4) 'నియతాప్తి' అను నవస్థతో 'ప్రకరి' అను నర్థప్రకృతి కూడుట 'విమర్శసంధి'
(5) 'ఫలాగమము' అను నవస్థతో 'కార్యము' అను నర్థప్రకృతికూడుట 'నిర్వహణసంధి'

ముఖాదిసంధులకు అఱువదినాలు గంగములు గలవు. నాటక వస్తువు (ఇతివృత్తము) పంచసంధి వ్యాపియై యుండును. ఇంకను వివరించుట శాఖాచంక్రమము, గ్రంథవిస్తరము నని సూచింపఁబడినది. నాటకలక్షణ గ్రంథములవలన వివరము లింకను దెలిసికొనఁ దగును.

సీ. ఆనాటకప్రయో । గావసరముల భ, గీరథాద్యాకార । ధారణమును
గంగాది నిమ్నగా । గతియుఁ గైలాసాది, నగకల్పనమును నా । నావన ప్ర
పంచనంబును బశు । పక్షి మృగాది జం,తు విశేషరూప వృ । త్తులును మఱియు
నెచటి కెయ్యది యోగ్య । మచటఁ దత్తద్వస్తు, సృష్టి పన్నిదము వే । సియును గృతక
గీ. మగుట నిశ్చయింపఁగలేక । యబ్రపడుచుఁ, జూచి సామాజికులు తమ । సొమ్ము లెల్ల
నొసఁగులుగ వైవ నడుపుచు । నొప్పుమీఱె, రుక్మిణీసుతుండుమాయా । నిరూఢిమెఱసి.

అర్థము:—రుక్మిణీసుతుండు = ప్రద్యుమ్నుఁడు, ఆనాటక ప్రయోగావసరములన్ = ఆనాటకముల యొక్క ప్రయోగించు (ప్రదర్శించు) కాలములందు, మాయానిరూఢిన్ = మాయయొక్క బలమును, మెఱసి = మెఱయఁజేసి, ప్రకటించి (అంతర్భావిత ప్రేరణక్రియ) (లేక - మాయానిరూఢిన్ = మాయ యొక్క శక్తిచేత, మెఱసి = ప్రకాశించి, ఒప్పి,) భగీరథాద్యాకార ధారణమును = భగీరథుఁడు మొదలగు వారి రూపమును ధరించుటయును, గంగాది నిమ్నగాగతియు = గంగ మొదలగు నదులయొక్క నడకయును, కైలాసాది నగకల్పనమును=కైలాసము మున్నగు కొండలయొక్క సృష్టియును, నానావన ప్రపంచనమును= పెక్కువిధములగు నడవులయొక్క విరివియును, పశు...వృత్తులును, పశు = ఆవు మున్నగు చతుష్పా జ్జంతువులు, పక్షి = పిట్టలు, మృగ = లేళ్లు, ఆది = మొదలుగాఁగల, జంతువిశేష = వేర్వేఱు ప్రాణుల యొక్క, రూప = ఆకారములును, వృత్తులును = వ్యాపారములును, మఱియును, ఎచటికిన్, ఎయ్యది, యోగ్యము = తగునో, అచటన్, తత్తద్వస్తుసృష్టిన్ = ఆయాపదార్థములయొక్క కల్పనమును, నడుపు చున్ = సాగించుచు (చేయుచు), సామాజికులు = సభయందున్నవారు, పన్నిదము వేసియున్ =పందెము వేసియును - (అనఁగా ఎ తయేని యత్నించియు నని భావము.) కృతకము=కల్పితము, అగుట, నిశ్చయింప లేక, అబ్రపడుచున్ = ఆశ్చర్య మొందుచు, చూచి, తమసొమ్ములెల్లన్ = తమతమ నగలనన్నిటిని, ఒసఁగులుగన్ = కానుకలుగా, వైవన్ = కూర్చున్నచోటనుండియే విసరివేయఁగా, ఈయఁగా నని భావము. ఒప్పుమీఱెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:—ఆప్రద్యుమ్నుఁడు మాయాబలముచేత - నానాటకము లభినయించు సమయములందు భగీరథాదులరూపము దాల్చుచు, కైలాసము మొదలగు కొండలు, పెక్కువిధములగు నడవులు, సింహ గవాది జంతురూపములు, వానివానివ్యాపారములును, ఎక్కడ కేది తగియుండునో అక్కడ అట్టివాని కల్పన మును కావించుచు - సభ్యులు తమలోఁ దాము పందెములు వేసికొని యెంతగా వాస్తవము తెలిసికొంద మని యత్నించినను నవి యన్నియు మాయచే కల్పింపఁబడిన వని నిశ్చయించుకో లేక, వెఱఁగందుచు, తమ నగ లన్నియు బహుమతులుగా నీయఁగా - తన నేర్పు ప్రకటించెను.

వి. :—పశు, మృగశబ్దములు జంతుపర్యాయములనినచోఁ బునరుక్తి, యగునని పశువులనఁగా - సింహగవాదులనియు, మృగములన లేళ్లు అవియు వ్యాఖ్యానింపఁబడెను. పక్షాంతరమున - పశు = గ్రామ్య ములగు గోమహిషాదులును, పక్షి = పిట్టలును, మృగ = గోమహిషాదులు కాని యితరము లగుచతుష్పాత్తు లును, ఆది = మొదలుగాఁగల, జంతువిశేష = ప్రాణిభేదముల యొక్క, రూపములును, చేష్టలును - అని చెప్పవచ్చును. 'పశు' శబ్దమునకు గ్రామ్యజంతు వగు గోమహిషావికాదులు అనునర్థము లేకున్నను, 'పశు పాలకుఁడు, పశుధనము, పాశుపాల్యము ఇత్యాదులందును, తద్భవమగు 'పసి' శబ్దమునందును గ్రామ్య జంతువు లగు గోమహిషాదు లను నర్థము లాక్షణికముగానో రూఢిగానో భాసించుటచే తదనురోధమున ప్రయుక్తమై యుండును. ఆప్టేనిఘంటువున మాత్రము పశుః - A cattle (both singly and collectively) అనికలదు.

'మాయ' యన:—లేనివాని నున్నట్లు గోచరింపఁజేయుశక్తి, కావున నాతఁ డితరులవలె వేషము వేసి కొన నక్కఱలేకయే యితరులకుఁ దా నేరూపమునఁ గాన్పింప సంకల్పించునో వారికి మాత్రమే యట్లు కనఁ బడును. ఏపదార్థము లచట లేకున్నను నున్నట్లు చూపవలె ననుకొనిన నా పదార్థము లచట నున్న ట్లితరు లకుఁ గనఁబడుచుండును. ఈ విశేషము ముందుపద్యమునఁ దెలియును.

వ. ఇవ్విధంబున నాత్మీయ దివ్యమాయాప్రపంచసముదంచిత నాట్యవంచితులం గావించి
నర్తంచరుల ధనసంచయంబు నూఁచముట్టుగా దోఁచుకొనుచుం జూచుఖేచరులకు
వేడ్కఁ బుట్టించుచు. 102

అర్థము:—ఆత్మీయ ... వంచితులన్ - ఆత్మీయ = తనదైన, దివ్య = దేవతాసంబంధమగు, మాయా ప్రపంచ = మాయయొక్క యాధిక్యముచే, సముదంచిత = బయలుపఱుపఁబడిన, నాట్య = నటనావిశేషముచేత, వంచితులన్ = మోసపుచ్చఁబడినవారిని, నక్తంచరుల = రాత్రిచరించువారగు రాక్షసుల యొక్క, ధనసంచయంబు = ధనసముదాయమును, ఊఁచముట్టుగాన్ = నిశ్శేషముగా, ఖేచరులకున్ = ఆకసమునందిరుగువారికి, దేవతలకు.

మ. ప్రియకాంతామణి చూడ్కికిన్ నిజవపుఃశ్రీతోన తోఁచెన్ మహా
నయమాయానిధి రుక్మిణీసుతుఁడు నానాభూమికాధారణుం
డయి, భద్రుం డయి పోల్చువేళ "నహి మాయాయా మసంభావ్య మ
స్తి" యటంచున్ బుధులాడు మాట మదిఁ జింతింపంగ బొంకే లగున్. 103

అర్థము:—మహానయమాయానిధి = గొప్ప నీతికిని మాయకును స్థానమగు, రుక్మిణీసుతుఁడు = ప్రద్యుమ్నుఁడు, నానాభూమికాధారణుండు = పెక్కువిధములగు భగీరథాది పాత్రల వేషములను ధరించువాఁడు, అయి, పోల్చువేళన్ = కనఁబడునప్పుడును, భద్రుండు + అయి = భద్రుఁడను నటుని వలె మాఱి, పోల్చువేళన్ = కనఁబడునప్పుడును (గూడ) ప్రియ...చూడ్కికిన్ - ప్రియ = ప్రేమ గల, కాంతామణి = స్త్రీరత్నమగు ప్రభావతియొక్క, చూడ్కికిన్ = చూపునకు, దృష్టికి, నిజ వపుఃశ్రీతోన్ + అ = తనయొక్క (వాస్తవమగు) శరీరముయొక్క శోభతోనే, తోఁచెన్ = గోచరించెను. మాయాయాం = మాయయందు, అసంభావ్యం = సంభవింపఁదగనిది (ఏదియును), నహి = లేదుగదా, అటంచున్ = అనుచు, బుధులు = పండితులు, ఆడుమాట = అనుకొనువచనము, బొంకు, ఏల, అగున్ = ఎట్లగును, ఏవిధమునను కల్ల గా దని భావము.

తాత్పర్యము:—మహామాయలు నేర్చినయాప్రద్యుమ్నుఁడు రంగస్థలమున భగీరథాదిపాత్రలరూపమును దాల్చినపుడును, నాట్యము లేనియపుడు భద్రునివలె మాఱినపుడును, వజ్రనాభాదుల కాయారూపములతోఁ గనఁబడుచున్నను ప్రభావతిచూపునకుమాత్రము వాస్తవ మగుతనరూపరేఖావిలాసములతోనే కనఁబడుచుండెను. మాయయందు సంభవింపని దేదియు నుండదు. (అనఁగా మాయకు సాధ్యముకానిది యుండదు.) అని పండితులు పలుకుమాట యసత్య మెట్లగును?

అలం.:—అర్థాంతరన్యాసము.

వి.:—లోకమందలి నటులు భూమికాధారణమునకై వస్త్రాభరణాదులు తత్తదుచితములగునవి ధరించుట సామాన్యము. ప్రద్యుమ్నుని భగీరథాది పాత్రధారణములందు సంకల్పమాత్రమున నా యా రూపము లెదుటివారికి గోచరించునే కాని యాతఁడు మార్పుచెందఁడు. ఇదియే మాయ. ఈ యర్థమును దెలుపుటకే ప్రభావతికి స్వస్వరూపముతోనే యెప్పుడును గనఁబడెడువాఁ డని విశేషించి చెప్పవలసివచ్చెను.

శివుఁడు తప మొనర్చుచున్న యర్జునునితో కిరాతరూపమున వచ్చి యుద్ధముచేయుతఱి-నాతని గాండివమునారిని మాయ మొనర్ప, నాతఁడు గాండివముతోనే మాయాకిరాతుని శిరమున మోఁదఁజొచ్చెను. అప్పుడు గాండీవతాడనమున గంగ, చంద్రకళ, నాగేంద్రుఁడు నలఁగిపోయిరని హరవిలాసమున నున్నది. శివుఁడు మాయచే నర్జునునకు కిరాతరూపమునఁ గనఁబడుచున్నాఁడే కాని నిజముగా తన శరీరమును నాహార్యమును మార్చుకోలేదు. కావుననే

సీ. కఱకు వెండ్రుకలలోఁ బఱచు మందాకిని, సుకుమార దేహంబు స్రుక్కఁబాఱె
నవతంసకుసుమ మాల్యంబైనశశిరేఖ, బ్రహ్మకపాల రంధ్రమునఁ దూఱె
సెట్టియంబుగ బిగ్గఁ జుట్టిన పెనుఁబాము, బిగి యూడి నొసటిపై డిగఁగ జాఱె
నళిక నేత్రము కిత్తి యారజ్యమానమై ఱెప్పల తుదలందు నిప్పు లుమిసె

గీ. నగజ భయ మొందెఁ బ్రమథులు బెగడు గుడిచి, యుపనిషత్తులు ఘోషిల్లె నొక్క పెట్టఁ
కాలకంఠునిమూళి శృంగాటకమున, గాండివంబునఁ దాడింపఁ గాండవప్రంధు. అని వర్ణింపఁబడినది. ఇదియుఁ గూడ నట్టిదే.

శా. ఆ భవ్యుం డటము నొకొక్క నెప మొప్పారన్ మరాళీప్రది
ష్టాభిజ్ఞాన గవాక్ష లక్ష్య దనుజాధ్యక్షాత్మజా వక్త్రవీ
క్షాభద్రంబును సారెకుం దనకుఁ గల్గం జేసికొంచున్కి న
ట్లాభామామణికిం బ్రభుస్తుతి విలీనార్థంబుగా నిట్లనున్. 104

అర్థము:—ఆ భవ్యుండు = ఉత్తముఁ డగు నా ప్రద్యుమ్నుఁడు, అటమున్న = నాట్యము చేయు నపుడు (నాటక మాడునపుడు), ఒకొక్క నెపము = ఒక్కొక్కమిష, ఒప్పారన్ = కలుగునట్లు, మరాళీ ... భద్రంబును, మరాళీ=శుచిముఖిచేత, ప్రదిష్ట = చూపఁబడిన, అభిజ్ఞాన = గుర్తుగల, గవాక్ష = కిటికీ నుండి, లక్ష్య =చూడఁదగిన, దనుజ+అధ్యక్ష+ఆత్మజా=రాక్షసనాయకుని కూఁతురగు ప్రభావతియొక్క, వక్త్ర = ముఖము యొక్క, వీక్షా = చూచుట యనెడు, భద్రంబును = శుభమును, సారెకున్=పలుమాఱు, తనకున్, కల్గఁజేసికొంచున్ + ఉన్కిన్ = తనకుఁ గల్గునట్లు చేసికొనుచుండుటచేత, అట్లు = ఆ విధము గానే, ఆభామామణికిన్ = స్త్రీలలో శ్రేష్ఠురాలగు నామెతో, ప్రభు ... ర్థంబుగాన్ - ప్రభు = ప్రభువగు వజ్రనాభుని యొక్క, స్తుతి = స్తోత్రమునందు, విలీన = అణఁగియున్న, అర్థంబుగాన్ = అర్థము కలదిగా, ఇట్లు = ఈ క్రింది విధమున, అనెన్ = పల్కెను.

తాత్పర్యము:— ఆ ప్రద్యుమ్నుఁడు నాటక మాడునప్పుడు ఏదో యొక్కొక్క నెపముతో - అంతకు మునుపు శుచిముఖి గుర్తుఁగాఁజూపిన గవాక్షమునుండి కనఁబడు ప్రభావతీముఖమును చూచుభాగ్యము పలుమాఱు తనకు లభించుటచే - అట్లు తాను చూచితి నన్నసంగతి ప్రభావతికిఁ దెలుపఁదలఁచి ప్రభుస్తుతియం దాయర్థ మిముడునట్లు ఆమెతో నీరీతి ననెను.

చ. సకలవిశేషశోధనకుఁ జాలిన యోనెఱజాణ వజ్రనా
భకులవతంసరత్నమ ప్రభావతి రోహిత కంటకంబు తా
వకమగు చూపు నాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వెఁ గాన న
త్యకలుషవృత్తి నాసుకృతమంతయు నేఁడుసుమీ ఫలించుటల్.

వజ్రనాభ పక్షమున :

అర్థము:—సకల=కళలతోఁ గూడినవారు, అనఁగా విద్యావంతులు. వారిలోని, విశేష=భేదముయొక్క, శోధనకున్ = పరీక్షకు (విద్యావంతులలోని విశేషము పరీక్షించుటకు) చాలిన=శక్తి గలిగిన, ఓ నెఱజాణ= ఓగొప్ప నేర్పరీ, వజ్రనాభ, కులవత సరత్నమా = వంశమునకుఁ దలమానికమా, (శిరోమణీ) ప్రభావ = ప్రతాపముచేత, తిరోహిత = డాఁగిన, కంటకంబు = నీచ శత్రువులు గలది. (కోశదండములచేత - (ధనము చేతను, సేనాబలముచేతను-గలిగిన తేజస్సునకు ప్రభావము, ప్రతాపము అనిపేళ్లు. 'సప్రతాపః ప్రభావశ్చ యత్తేజః కోశదండజం. అని అమరము) అగు, తావకము = నీ సంబంధమైన చూపు (కర్త) నాపయిన్, ప్రవర్ధిత రాగతన్=పెంపఁబడిన ప్రేమమునుచేత, పర్వెన్ = ప్రసరించెను, కానన్=కావున, నాసుకృతము= నాపుణ్యము, అంతయున్, అకలుషవృత్తిన్ = నిర్మలమగు రీతితో, ఫలించుటల్=ఫలరూపము నొందుటలు, నేఁడుసుమీ = నేఁటికిఁ జుమా (కలిగెను అధ్యాహారము.)

వి. :—కళలతో = విద్యలతోఁ గూడినవారు - సకలులు = కళావేత్తలు, కళలకును, విద్యలకును భేదమున్నను కవులు రెంటిని పర్యాయములుగా వాడుచుందురు.

'యద్యత్స్యా ద్వాచికం సమ్యక్కర్మ విద్యాభిసంజ్ఞికం, శక్తో మూకోఽపి యత్కర్తుం కళా సంజ్ఞంతు తత్స్మృతం.' (వాగింద్రియముచే నేర్వఁదగినది విద్య. మూఁగవాఁడు సైతము నేర్వఁదగిన నర్తనము మొదలగు వ్యాపారము కళ) అని యభియుక్తోక్తి.

ప్రభావతీ పక్షమున:

అర్థము:—సకల విశేషశోధనకున్ - సకల = సమస్తమగు విద్యావివేక రూపలావణ్య సౌభాగ్య సౌశీల్యాభిజాత్యాదులగు నెల్లవానియందలి, విశేష = ఆధిక్యముల యొక్క, శోధనకున్ =పరీక్షకు, చాలిన= నిలుచు శక్తిగల, ఓ నెఱజాణ = ఓ గొప్ప నిపుణురాలా ! (స్త్రీకి నుండఁదగిన యెల్లగుణములందలి గొప్ప తనము పరీక్షించినచో-ఆ పరీక్షకు నిలుచు సామర్థ్యముగల నెఱజాణా. అని భావము.) వజ్రనాభకుల వతంస రత్నమ=వజ్రనాభుని యొక్క వంశమునకు శిరోభూషణమగు రతనమా, ప్రభావతి (ఇది సంబుద్ధి.) రోహిత కంటకంబు=లేళ్లకు విరోధియైన - రోహిత మనునది ఒకజాతి లేడి. ని. గోకర్ణ పృషతైణర్శ్య రోహితాశ్చమరో మృగాః. అని అమరము) తావకంబు = నీ సంబంధమైనది, అగుచూపు, (లేళ్లకువిరోధి - అనఁగా లేళ్లను పోలినదియని యార్థి యగు ఉపమ.) నాపయిన్ - ప్రవర్ధితరాగతన్ = పెంపఁబడిన ప్రేమగలుగుటతో - అధికప్రేమతో, పర్వెన్ = ప్రసరించెను, తక్కినది వెనుకటియర్థమే.

అలం:— సభంగ (శబ్ద) శ్లేషము. ప్రభావతిరో, హితకంటకంబు - ధరింపఁబడిన - లేక ప్రయోగింపఁ బడిన - సూదిమొన - లేక - ముల్లుగలదియైన, తావకంబగుచూపు = నీదగుదృష్టి - నీచూపు ముల్లు (సూదిమొన) ధరించినదివలె హృదయమును వేధించుచున్నది అనిభావము - అని యైనను జెప్ప వచ్చును.

గీ. నీకు నామీఁదఁ గలయట్టి నెయ్యమును మ,హోదరము నీవు పనిచిన హాంసి చెప్ప
నాత్మలో నవరత నాట్యప్రసంగ, మున నిను భజించు వేడుక ఘనము నాకు.

అర్థము:—నీకున్, నా మీఁదన్, కల, నెయ్యమును = (వజ్రనాభపక్షమున) స్నేహమును (ప్రభావతి పక్షమున) వలపును, మహోదరమును = గొప్పగౌరవమును, నీవు, పంచిన హాంసి, చెప్పన్, (వజ్రనాభపక్షమున) ఆత్మలోన్ = మనస్సునందు, అనవరత = ఎడతెగని, నాట్యప్రసంగమునన్ = నాట్యసంబంధముచేతను, (ప్రభావతిపక్షమున) ఆత్మలోనన్ = మనసునందు, నవరత = నూతనమగు సురతసంబంధమయిన, నాట్య = నర్తనముయొక్క, ప్రసంగమునన్ = వ్యాపారముచేత - అని. నినున్, భజించు = సేవించు, వేడుక, నాకున్, ఘనము అధికము అయ్యెను అని యధ్యాహారము.

అలం.:—సభంగశ్లేషము.

క. నను నేలికొను మవశ్యం, బును నీయూడిగము చిత్తమున కెక్కఁగ నే,
నొనరింతు నేఁటితమి నీ, మనమున నెంతయు నిడుకొని మన్నింపఁదగున్. 107

వజ్రనాభపక్షమున :

అర్థము:—ననున్, ఏలికొనుము, అవశ్యంబును = తప్పక, నీయూడిగము = నీ కొఱకుఁ జేయు (నాట్యరూప) సేవను, చిత్తమునకున్ = మనస్సునకు, ఎక్కంగన్ = నచ్చునట్లుగ, నేను, ఒనరింతున్= చేయుదును, నేఁటితమి = ఈనాఁడు గలిగిన వేడుక, మనమునన్, ఎంతయున్ = అధికముగా, ఇడుకొని= ఉంచుకొని, మన్నింపన్, తగున్ = నన్నుక్షఆదరింపవలెను. ప్రభావతిపక్షమున ; ననున్, ఏలికొనుము, అవ

శ్యంబును, నీయూడిగము = నీకొలకగు సేవను, చిత్తగునకున్, ఎక్కంగన్, నేఁటితమిన్ = ఈరాత్రి యందు, నేను, ఒనరింతును, (ఈసంగతి) నీమనమునన్, ఇడుకొని, ఎంతయున్, మన్నింపన్, తగున్.

అలం.:—అభంగ (అర్థ) శ్లేషము. అందు నుభయభాషాశ్లేషము. రాత్రియను నర్థమున 'తమి' శబ్దము సంస్కృతసమము. 'ఉత్కంఠ' యనునర్థమున తెలుఁగు దేశ్యపదము.

క. అన విని కపోలయుగళము, ఘనపులకితముగ మరల్చెఁ గ్రక్కున నాత్మా
ననము ప్రభావతి యాలో,కన జాలకమునకు నెడగఁ గడు లజ్జమెయిన్. 108

అర్థము:—అనన్ = ఇట్లు రెండర్థములు స్ఫురింపఁ బ్రద్యుమ్నుఁడు పలుకఁగా, ప్రభావతి విని, కపోలయుగళము = చెక్కిళ్లజంట (రెండు చెక్కిళ్లు), ఘనపులకితము = దట్టమగు గగుర్పాటు గలది, కన్ = కాఁగా, గ్రక్కునన్ = తటాలున, ఆత్మాననమున్ = తనయొక్క మొగమును, ఆలోకనజాలకము నకున్ = చూచుటకు నేర్పఱచిన కిటికీకి, ఎడగన్ = దూరముగా, కడులజ్జమెయిన్ = అధికమగు సిగ్గుచే, మరల్చెన్ = మరలించెను.

తాత్పర్యము:—వజ్రనాభస్తుతి రూపముగాఁ దన్నుఁ గలియవత్తు ననునర్థము స్ఫురింపఁ బ్రద్యుమ్నుఁ డనఁగా విని ప్రభావతి చెక్కులు పులకింపఁగా - మిగులసిగ్గుచేతఁ దనముఖమును చూచుట కేర్పఱచిన కిటికీకి దూర మగునట్లు తటాలున తొలఁగించుకొనెను.

వి. :—ఘనము. ని. "ఘనం నిరంతరం సాంద్రం" అని అమరము. పులకలు పుట్టినది - పులకితము తారకాదులలోనిది కావున ఇతచ్ప్రత్యయము వచ్చినది.

చ. అపుడు తదీయపార్శ్వగతయైన మరాళవధూటి దానవా
ధిపతనయం గనుంగొని మదిం గనుఁగొంటివె యాత్మనాథు వా
క్యపదవిఁ దోఁచునట్టి యితరార్థము సర్వము నాననాబ్జముం
ద్రప నిటు ద్రిప్పి తింతి గరుదాల్చెఁ గపోలము, చాలు నావుడున్. 109

అర్థము:—అపుడు, తదీయపార్శ్వగత= ఆ ప్రభావతిప్రక్క నున్నది, ఐన+మరాళవధూటి=అయిన హంసాంగన, శుచిముఖి, దానవాధిప తనయన్ = రాక్షసరాజుయొక్క కూఁతురగు ప్రభావతిని, కనుంగొని= చూచి, ఇంతి = ఓ ప్రభావతీ!, ఆత్మనాథు = నీ భర్తయొక్క, వాక్యపదవిన్ = మాటలయొక్క మార్గమందు, తోఁచునట్టి = స్ఫురించుచున్న, ఇతరార్థము = వేఱర్థము, సర్వమున్, మదిన్ = మనసునందు, కనుఁగొంటివె = తెలిసికొంటివా? కావుననే, త్రపన్ = సిగ్గుచేత, ఆననాబ్జమున్ = తామరపువ్వువంటి మొగమును, ఇటు = (నేను నిల్చిన) యీ ప్రక్కకు, త్రిప్పితి = త్రిప్పినదానవు, కపోలము = చెక్కిలి, గరుదాల్చెన్ = పులకించెను. చాలున్ = నీవా యితరార్థము గ్రహించుకొంటి వనుట కిది యొకటియే చాలును, నావుడున్ = అనుటయును.

తాత్పర్యము:—ఆ సమయమున నామెచెంత నున్నశుచిముఖి యామెను జూచి నీ నాథుని మాటల ధోరణియందు స్ఫురించు రెండవ యర్థము నీ మనస్సున గ్రహించితివే? గ్రహించితివి కావుననే సిగ్గుచె ముఖ మిటుత్రిప్పితివి. చెక్కిలి గగుర్పొడిచెను. ఇఁకఁ జాలునులే. నీవు గ్రహించుకొన్నట్లు విశదమైనది అని పలికినపిమ్మట.

అలం:—కావ్యలింగము. 'గరుదాల్చెఁ గపోలము చాల నావుడున్' అను పాఠమున - కపోలము చాలన్ = అధికముగా, గరు = గగుర్పాటును, తాల్చెన్ = ధరించెను, నావుడున్ - అని సమన్వయము.

క. విచ్చలవిడి ననుఁ బేర్కొని, యిచ్చను గల దెల్ల బలికి యిదె నేఁటినిశన్
వచ్చెద ననుచున్నాఁ డిఁక, నిచ్చో నిఁక నర్థ మెద్ది యితరము దీనన్. 110

అర్థము:—విచ్చలవిడిన్ = యథేచ్ఛముగా, ననున్, పేర్కొని = (ప్రభావతి యని) పేరుపెట్టి పిలిచి, ఇచ్చను = మనస్సునందు, కలది = ఉన్నట్టి ప్రేమను, ఎల్లన్ = అంతయును, పలికి, ఇదె=ఇదిగో, నేఁటినిశన్ = నేఁటిరాత్రి, వచ్చెదను, అనుచున్నాఁడు, ఇఁకన్ = ఇంతకంటె, ఇచ్చోన్ = ఇప్పుడు, దీనన్ = దీనియందు, మఱి, ఇతరము = వేఱగు, అర్థము, ఎద్ది = ఏమి (ఉన్నది.)

తాత్పర్యము:—యథేచ్ఛముగా నన్ను ప్రభావతీ యని పేరుపెట్టి పిలిచి, మనసునఁ గల దంతయుఁ జెప్పి - ఇదిగో, యీ రాత్రి వత్తు ననుచున్నాఁడు. ఇంతకంటె దీనియం దితరార్థమే మున్నది.

వి. :—ఈయర్థమెక్కటియే ప్రభావతికిఁ దెలియుట యన నామెకు నాట్యముపై దృష్టి లేక ప్రద్యుమ్నుని యాకారచేష్టాదులందే తన్మయురాలై యుండె నని ధ్వనితము. ఆతఁడు తనవంకఁ జూచి, తనకే సమన్వయించునట్లును, సభాపతివంకఁజూచి చదివి నప్పు డతనికే యన్వయించునట్లును బఠించుచుండె నని యెఱుంగక పోవుట ముగ్ధాలక్షణము కావచ్చును. 'కామీస్వతాంపశ్యతి' అను నట్లైనను గావచ్చును.

వి. :—చోటు శబ్దమునకు దేశము, కాలము నను రెం డర్థము లున్నవి గాన - 'ఇచ్చో' అనునపుడు - ఈవేళ - యనునర్థము చెప్పఁబడినది.

క. ఎవ్వరు వినుటకుఁ గైకొనఁ, డివ్విభుఁ డిది యేమి భ్రాంతి యెత్తెనొకో నా
కెవ్విధి ప్రాప్త మొకోయని, నివ్వెఱపడి యింతతడవు నిలిచితి వినుచున్. 111

అర్థము:—ఇవ్విభుఁడు = ఈ ప్రభువు, ఎవ్వరు=ఎట్టివారు, వినుటకున్ = వినుటను, కైకొనఁడు= లక్ష్యముచేయఁడు, ఇది = ఈ లక్ష్యపెట్టకుండుట, ఏమి = ఏమియోకదా, భ్రాంతి = మతిభ్రమణము, వెఱ్ఱి, ఎత్తెనొకో=కలిగినదా ? నాకున్, ఎవ్విధి = ఎట్టియదృష్టము, ప్రాప్తమొకో = సంభవింపనున్నదో (ఏమిహాని కలుగనున్నదో) అని = అనితలఁచుకొని, నివ్వెఱపడి = ప్రమాన్పడి, (నిశ్చేష్టురాలనై యన్నమాట) ఇంతతడవు = ఇంతసేపటిదాఁక, వినుచున్, నిలిచితిన్.

తా. :—'ఈ ప్రభు వితరులెవరు వినుటను లెక్కింపఁడు, ఇదేమి ? ఈతనికి వెఱ్ఱియెత్తినదా ? నా కెట్టి దురదృష్టము పట్టనున్నదో' అని నిశ్చేష్టురాలనై యింతదాఁక వినుచు నట్లే నిలిచిపోయితిని.

వి. :—మిగుల రహస్యముగాఁ జెప్పఁదగినమాట యంత బహిరంగముగాఁ జెప్పుట వెఱ్ఱికి లక్షణమే యగును. అంతఃపురద్రోహమెంచి తండ్రి యాతనిని శిక్షించినను, ప్రద్యుమ్నుని వలననే తనగుట్టు తెలిసికొని కన్యాధర్మము తప్పితి నని నన్ను శిక్షించినను, నా దురదృష్టమే యగునుగదాయని భయము సూచింపఁబడు చున్నది.

వ్యా. వి. :—ఎవ్వరు వినుటకుఁ గైకొనఁడు. అనువాక్యమున 'వినుటకు' అనుదానిషష్ఠికి ద్వితీయా విభక్త్యర్థము. సూ. షష్ఠీస్థానికం బగు కువర్ణకం బొక్కొకచో ద్వితీయాదివిభక్తులకు మాఱుగాఁ దత్తదర్థం బులం జూపట్టెడి. ప్రౌఢ. కారక. 13 చే. వినుటను - అని ద్వితీయార్థము చెప్పఁబడినది. లేదా వినుటకు సంశయింపఁడు అని కాని, భయపడఁడు అని కాని "కైకొనఁడు" అను క్రియాపదమున కర్థముచెప్పవలెను. కాని "కైకొను" ధాతు వన్నియర్థములందును సకర్మకముగానే నిఘంటువులం దగపడు చున్నది. ఈ యర్థ మును కనఁబడదు. అకర్మక మనియుఁ గనఁబడదు. కాన మొదటిపక్షమే గ్రహింపఁబడెను. హరి కిభంబులు ఘోర్కొనునయ్యె-భారత. ఆర. 4.88 లో, హరికిన్ = హరిని, అనినట్లే ఇచటఁగూడ నని యెఱుంగునది

వ. అనుడు శుచిముఖి యా శశిముఖి నీక్షించి. 112

అర్థము:—శశిముఖిన్ = చంద్రునివంటి మొగముగల దానిని, ప్రభావతిని, ఈక్షించి=చూచి.

మ. అతివా! యన్నిట జాణ నీమగఁడు నీ కా చింత యుక్తంబు గా
దతఁ డర్థద్వితయోక్తి నీకు నుచితం బైనట్టు నీకున్ సభా
పతి కర్హంబగు రీతి నాతనికిఁ దోఁపన్ బల్కెనాఁ డేది నీ
మతిఁ దోఁచెం బ్రకృతంబు గామిఁ బరు లాత్మం గాన రాయర్థమున్. 113

అర్థము:—అతివా = ఇంతీ! నీమగఁడు, అన్నిటన్ = అన్నివిషయము లందును, జాణ = నేర్పరి, నీకున్, ఆ చింత=గుట్టు బయ లయ్యెనేయను విచారము, యుక్తంబు = తగినది, కాదు, అతఁడు, అర్థద్విత యోక్తిన్=రెం డర్థములు గల వాక్యముచే, నీకున్, ఉచితంబు = తగినది, ఐనట్టు = తగినవిధముగా, నీకున్ - సభాపతికిన్ = సభకు నాయకుఁడగు వజ్రనాభునకు, అర్హంబు = తగినది, అగురీతిన్ = అయిన పద్ధతిచే, అతనికిన్ = ఆ సభాపతికిని, తోఁపన్ = గోచరించునట్లు, పల్కినాఁడు, ఏది = ఏయర్థము, నీమదిన్ = నీమనస్సునందు, తోఁచెన్ = స్ఫురించెనో, (అది) ప్రకృతంబు = ప్రస్తుతము, కామిన్ = కాకపోవుచేత, ఆయర్థమున్ = నీమనసునఁ దోఁచిన యర్థమును, పరుల్ = ఇతరులు, ఆత్మన్+కానరు= తలంపరు.

తాత్పర్యము:—ఇంతీ! ఏ మనుకొనుచున్నావో కాని, నీమగఁ డన్నివిషయములందును నేర్పరి. అతఁడు వెల్లివాఁడే యను విచారము తగదు. అతఁడు రెండర్థముల వాక్యముచే నీకుఁ దగినట్లు నీకును, సభాపతిగానున్న నీతండ్రికిఁ దగిన ట్లతనికిని తోఁచునట్లు పల్కినాఁడు. నీమనస్సున స్ఫురించిన యర్థము ప్రకృత నాట్యమునకు సంబంధించినది కాదు. కాన నితరు లెవ్వరు దానిని గ్రహింపఁజాలరు.

వ్యా. వి. :— ద్వితయము, ద్వయము - అన జంట లేక కవ యని యర్థము. అర్థములయొక్క ద్వితయము కలది అని బహువ్రీహి. అట్టి ఉక్తి. విశేషణ పూర్వపదకర్మధారయము - రెండర్థములుగల వాక్యము అని తాత్పర్యము.

క. సకియా! నానార్థోక్తుల, నొకనియమము తెలియు మర్థ ముచితం బెచ్చో
టికి నెద్ది యదియ యచ్చోఁ, బ్రకటము హరి శ్రీవిభుఁ డను పల్కునఁ బోలెన్. 114

అర్థము:—సకియా = ఓచెలీ, నానార్థోక్తులన్ = పెక్కర్థములుగల పదముల విషయమున, ఒక నియమము = ఒక యేర్పాటు(కలదు.) తెలియుము = తెలిసికొనుము, హరి శ్రీవిభుఁడు అను పల్కునఁ బోలెన్ - (హరి = విష్ణువు, శ్రీవిభుఁడు = లక్ష్మికి మగఁడు) అనువాక్యమందువలెనే - హరి శబ్దమునకు, ఇంద్రుఁడు, చంద్రుఁడు, యముఁడు మున్నగు పెక్కర్థములున్నను శ్రీవిభు శబ్దసంబంధమువలన విష్ణువే యయిన విధముననే, ("యమానిలేంద్ర చంద్రార్క విష్ణుసింహాంశువాజిషు, శుకాహికపి భేకేషు 'హరి' ర్నా కపిలే త్రిషు. అని అమరము) ఎచ్చోటికిన్ = ఏప్రదేశమునకు, అర్థంబు + ఎద్ది = ఏయర్థము, ఉచి తంబు = తగినదో, అచ్చోన్ - ఆప్రదేశమునందు, అదియ = అదే, ప్రకటము = ప్రసిద్ధము (అగును.)

తాత్పర్యము:-చెలీ! పెక్కర్థములుగల శబ్దముల విషయమున నొక నియమమున్నది. 'హరి శ్రీవిభుఁడు' అనువాక్యమున యమాదు లనేకము లర్థము లున్నను శ్రీవిభుశబ్దసాన్నిధ్యమువలన విష్ణు వనియే బోధము కలుగునట్లు, ఏయర్థ మెచ్చటికి నుచిత మగునో యాప్రదేశమం దాయర్థమే స్ఫురించును.

వి. :—నానార్థములు గలపదములప్రయోగమున నర్థనిర్ణయమునుగూర్చి యిట్లు చెప్పఁబడినది.

'సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా । అర్థః ప్రకరణం లింగం శబ్ద స్యాన్యస్య సన్నిధిః । సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః । శబ్దార్థ స్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః' అని సంయోగము, విప్రయోగము, సాహచర్యము, విరోధము, అర్థము (ప్రయోజనము), ప్రకరణము, లింగము, అన్యశబ్దసన్నిధి, సామర్థ్యము, ఔచిత్యము, దేశము, కాలము, వ్యక్తి (లింగము), స్వరము, అభినయాదులు - అనునవి వాచకమునకు (పదమున) కనేకార్థములు సంకేతము లైనపు డొక్కయర్థమును మాత్రమే బోధించును - అని సాహిత్యదర్పణము. ఈయర్థమునే ప్రాచీనులు కొంచెము భేదముతో నిట్లనిరి. 'శక్తిగ్రహం వ్యాకరణోపమాన, కోశా ప్తవాక్యాద్వ్యవహారతశ్చ, వాక్యస్య శేషాద్వివృ తేర్వదంతిసాన్నిధ్యతః సిద్ధపదస్య వృద్ధాః'అని. ఇది యేకానేకార్థములు గల సకలపదముల కర్థ బోధముగలుగు విధమునకై చెప్పినది.

ఈవిషయమునే శుచిముఖి యీపద్యమున సూచించినది - నాట్యము చూడవచ్చిన వారందఱును నటుఁడు సభాపతిని స్తుతించుచున్నాఁ డనుకొందురే కాని యెవ్వరికిని గనఁబడక యిచట నున్న నిన్ను (ప్రభావతిని) నుద్దేశించి యనుచున్నాఁ డని యేయొకరును భావింపరు అనెను. ఇందు శుచిముఖియొక్క లోకజ్ఞత శాస్త్రజ్ఞతయును వ్యక్తము లగుచున్నవి.

వ. కావున నీవల్లభుండు నిన్నుఁ బలికిన పలుకు లన్యు లెఱిఁగిరో యనుశంక విడువు మతం డితరులకు నాట్యావసానసమయ సముచిత స్తోత్రప్రకరణబలంబునఁ దోఁచుచున్న యర్థాంతరంబుచేతఁ బ్రభువు నుపచరించి యిదె యతనిచేఁ దనవిడిదికి ననిపించుకొని చనుచున్నవాఁ డని పలికి శుచిముఖి యంతం బలికినట్ల చేయు రౌక్మిణేయుం జూపి తనతలంపు యథార్థం బగుట తార్కాణించె నట్లు విహగమహిళా రహస్య సంభాషణ రసానుభవంబున విభాసిల్లుప్రభావతియు రాగవల్లరీసహితంబుగా గృహంబున కరిగి ప్రియసమాగమ త్వరమాణ మానస యగుచు నుండె నంత. 115

అర్థము:—శంక = సందేహము, (లేదా - భయము, ని. శంకా సందేహ భయయోః - అమరము) నాట్యావసాన ... బలంబునన్ - నాట్య = నాటకముయొక్క (లేక - నృత్యముయొక్క) అవసానసమయ= ముగియువేళకు, సముచిత = తగినట్టి, స్తోత్రప్రకరణ = స్తుతిచేయు సందర్భముయొక్క, బలంబునన్ = శక్తిచేత, అర్థాంతరంబుచేతన్ = నీవు తెలిసికొనినది గాకవేఱర్థముచేత, ఉపచరించి = (పొగడ్తచే) సేవించి, అనిపించుకొని = సెలవుగైకొని, చనుచున్నవాఁడు = ఇప్పుడే వెళ్లుచున్నాఁడు. పలికినట్లు + అ = చెప్పిన విధముననే, చేయు = వజ్రనాభుఁడు వెళ్లిరమ్మని సెలవీయ వెడలుచున్న, రౌక్మిణేయున్ =రుక్మిణి కొడు కగు ప్రద్యుమ్నుని, చూపి, తనతలంపు = తన యూహ, యథార్థంబు = వాస్తవము, నిజము, అగుట, తార్కాణించెను = రుజువుపఱచెను, విహగమహిళా = ఆఁడుపక్షియగు శుచిముఖియొక్క, రహస్య = ఏకాంతమగు, సంభాషణ = మాటలయందలి, రస = ప్రేమయొక్క, అనుభవంబునన్ = పొందుటచేత. (లేక, సంభాషణరస = మాటలనెడు అమృతముయొక్క అనభవముచేత ననియుఁ జెప్పవచ్చును.) ప్రియ...మానస - ప్రియ = మగనితోడి, సమాగమ = కలయికకై, త్వరమాణ = వేగిరపడుచున్న, మానస = మనస్సుగలది.

వ్యా. వి:—అనిపించుకొను- అనుచు (=పంపు) ధాతువుపై ప్రేరణమున ఇంచుగాగమము-అనిపించు-ఆత్మనేపదార్థక 'కొను' ధాత్వనుప్రయోగమున - అనిపించుకొను = పంపునట్లుచేసికొను - సెలవుతీసికొను అని భావము.

ఉ. ఎప్పుడు వచ్చుఁ గాంతుఁ డినుఁ డె ప్పుడు గ్రుంకు నటంచు నాత్మలో
ముప్పిరిగొన్నరాగము స ె ముత్కటమై కనుదోయి కుబ్బఁగా

దొప్పఁగఁదోఁగు చూడ్కిని వధూమణి సారెకుఁ జూడఁగాఁ జుమీ
యిప్పొలు పొందె నీతఁ డన హేళి క్రమంబున దాల్చె రక్తిమన్. 116

అర్థము :— కాంతుఁడు = ప్రియుఁడు, ఎప్పుడు + వచ్చున్ = ఎప్పటికివచ్చును, ఇనుఁడు = సూర్యుఁడు, ఎప్పుడు = ఎప్పటికి, క్రుంకెడిన్ = అస్తమించును, అటంచున్ = అనుకొనుచు, ఆత్మలోన్ = మనస్సునందు, ఉప్పిరిగొన్నరాగము = మిక్కిలి దృఢమగు ప్రేమ మనెడి యెఱ్ఱకాంతి, సముత్కటము + ఐ = అధికమై, కనుదోయికిన్ = కన్నులజంటలోనికి, రెండుకన్నులలోనికి, ఉబ్బఁగాన్ = పొంగఁగా, తొప్పఁగఁదోఁగు = (ఆ యెఱుపునందు) మిగుల మునిఁగిపోయిన, చూడ్కిన్ = చూపుచే, వధూమణి = (స్త్రీలలో మిన్నయగు) ప్రభావతి, సారెకున్ = మాటిమాటికి, చూడఁగాన్ + చుమీ = చూచుటచేతనే సుమా, ఇప్పొలుపు = ఈ యందమును, ఈతఁడు = ఈ సూర్యుఁడు, ఒందెన్ = పొందెను, అనన్ = అనునట్లు, హేళి = సూర్యుఁడు, క్రమంబునన్ = వరుసగా, రక్తిమన్ = ఎఱ్ఱదనమును, పొందెను.

తాత్పర్యము :— ప్రియుఁ డెప్పుడు వచ్చును. సూర్యుఁ డెప్పుడు గ్రుంకు ననుచు మనసులో పెన వేసికొనుచున్న రాగము (ప్రేమ మనెడి యెఱ్ఱకాంతి) యధికమై రెండుకన్నులలోనికి పొంగిరాఁగా, ఆ యెఱ్ఱఁదనమందుఁ బూర్తిగా మునిఁగిన చూపుచే ప్రభావతి మాటిమాటికిఁ జూచుటచేతనే సుమీ యితఁ డిట్టియందమును బొందె ననునట్లు సూర్యుఁడు క్రమముగా రక్తిమను బొందెను.

అలం. :— ప్రద్యుమ్నుఁడు 'రాత్రి వచ్చెద' ననెను. ప్రభావతి ప్రియసమాగమోత్కంఠితయై ప్రియుఁ డెప్పుడు వచ్చును. ఈసూర్యుఁ డెప్పుడు క్రుంకును. అని కార్యకారణములకు వ్యత్యాసముగా బల్కినది. సూర్యాస్తమయము కారణము. ప్రియాగమను కార్యముగదా. కావున నిట అత్యంతాతిశయోక్తి మనసులో పెనవేసికొనుచున్నది ప్రేమము కాని ఎఱుపు కాదు. ప్రేమము ఎఱుపు అను రెండర్థములు గల రాగశబ్దప్రయోగము చేసి తాద్రూప్యరంజనము చెప్పుటవలన శ్లిష్టరూపకము. రాగమునందు జలధర్మ మారోపింపఁబడి కన్నులలోనికిపొంగి చూపు లా రాగమునందు జలమందువలె మునుఁగుట చెప్పుటచే పరిణామాలంకారము. తెల్లనికన్ను లెఱ్ఱవాఱె నను ధ్వనివలన తద్గుణాలంకారధ్వని. అట్లు మాటిమాటికి నెఱ్ఱనిచూపులచే చూచుటయే సూర్యుని క్రమప్రాప్తమగు నెఱ్ఱఁదనమునకు హేతువుగా సంభావించుట వలన హేతూత్ప్రేక్ష. సహజముగా నెఱ్ఱగనుండుసూర్యుఁడు ప్రభావతి చూపులచే క్రమముగా నెఱ్ఱవాఱె ననుటవలన అనుగుణాలంకారము. ఇందు అంగి ఉత్ప్రేక్షయు, నితరములగు నతిశయోక్త్యాదు లంగములు నగుటచే సంకరము.

వ్యా. వి. :— మూఁడు + పిరులు - సూ. సమానాధికరణం బగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. బాల. సమాస. 17 చే. మూ + పిరులు, ముప్పిరులు కాఁగా - సూ. ద్విరుక్తం బగు హల్లుపరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగు. బాల. సమాస. 13 చే - 'ముప్పిరులు' అని యయి, సూ. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు. మిశ్రంబునకుఁ గాదు. బాల. సమాస. 13 చే, 'ముప్పిరి' యయ్యెను.

ఉ. అంబుధిలోని కంతటను హంసుఁడు డిగ్గె దినాంతమజ్జనా
ర్థంబునుబోలె, నట్టియెడఁ దత్తటి నాఱఁగఁ గట్టినట్టి ర
క్తాంబరమో యనంగఁ దనరారెఁ గడుం గడసంజకెంపు యం
తం బొడసూపెఁ దారకలు తత్పత నోద్గత బిందులో యనన్. 117

ఈపద్యమున సూర్యునియందు యతిత్వ మధ్యవసింపఁబడి సంధ్యాధర్మములు యతి ధర్మములుగా నుత్ప్రేక్షింపఁ బడుచున్నవి.

అర్థము:—అంతటను=అప్పుడు, హంసుఁడు=సూర్యుఁడను యతీశ్వరుఁడు. (ని. హంసః స్మరే ఖగే యతౌ నిర్లేప భూభుజి, జీవేఽర్కేఽశ్వే. అని నానార్థ రత్నమాల.) దినాంత మజ్జనార్థంబును బోలెన్ = సాయంతనమునఁ జేయవలసిన స్నానముకొఱకో యనునట్లు, సన్న్యాసులకు మూఁడు సంధ్యలయందు స్నానము విహితము. త్రిషవణ స్నానమని దానికి సంజ్ఞ. అంబుధి లోనికిన్ = (పడమటి) సముద్రములోనికి, డిగ్గెన్ = దిగెను. (సూర్యపక్షమున అస్తమించె ననియు, యోగి పక్షమున జలమున దిగెననియు భావము) అట్టియెడన్ = ఆ సమయమున, తత్తటిన్ = ఆ సముద్రపుటొడ్డున, ఆఱఁగన్=తడి పోవునట్లు, కట్టిన = వ్రేలఁగట్టిన, రక్తాంబరము + ఓ = కాషాయ వస్త్రమో, అనంగన్, కడసంజకెంపు = సాయంసంధ్యయొక్క వైభవము - అనఁగా సంధ్యారాగము, కడున్ = మిక్కిలి, తనరారెన్=ఒప్పెను, తత్పతన ... బిందులు + ఓ - తత్=ఆసూర్యుని యొక్క, పతన = (పాటు.) పడుటచేత, ఉద్గత = మీఁదికెగసిన, (యతిపక్షమున - నీటియందు మునుఁగుటచేత - అని యర్థము) బిందులో = నీటిబొట్లో, అనన్ = అనునట్లు, తారకలు = నక్షత్రములు, పొడసూపెన్ = ఉదయించెను.

తాత్పర్యము:—త్రిషవణస్నానము యతికి విహితమగుటచే సూర్యుఁడను యతీశ్వరుఁ డాసంధ్యా కాలమున స్నానమునకై సముద్రమున మునిఁగెనో యనునట్లు సూర్యాస్తమయ మయ్యెను. ఆ సంన్యాసి సముద్రతీరమున నాఱఁగట్టిన కాషాయవస్త్రమో యనునట్లు సంధ్యారాగము మెఱసెను. పిమ్మట నాయతీశ్వరుఁ డాపడమటిసముద్రమున స్నానార్థము నీటియందుఁ దటాలునఁ జొచ్చినపుడు పై కెగసిన నీటిబొట్లో యనునట్లు చుక్కలు తోఁచెను.

అలం. :—హంసుఁడనెడు హంసుఁడు - శ్లిష్టరూపకము. తదను ప్రాణితములై, మొదటివాక్యమున ఫలోత్ప్రేక్ష, తక్కిన రెండువాక్యములందు ద్రవ్యోత్ప్రేక్ష. మూఁడిటికి సంసృష్టి.

వి. :—హంసుఁడు చతుర్విధ సన్న్యాసులలో నొకఁడు "చతుర్విధా భిక్షవ స్తే కుటీచక బహూదకౌ, హంసః పరమహంసశ్చ యోఽత్ర పశ్చాత్స ఉత్తమః" అని భారతము. కుటీచక, బహూదక, హంస, పరమ హంసలని సన్న్యాసులు నాల్గువిధములవా రనియు,వీరిలో ఉత్తరోత్తరముశ్రేష్ఠులుఅనుటచే హంసుఁడుకుటీచక బహూదకులకంటె శ్రేష్ఠుఁడును, పరమహంసునికంటె కొంచెము తక్కువయుననిభావము. సన్న్యాసు లాఱు విధములవా రనియు, భారతము పేర్కొనిన నలువురుగాక 'తురీయాతీతుఁడు, అవధూతుఁడు' అని మఱి యిరువురను 'బ్రహ్మవిద్యాదీపిక' చెప్పుచున్నది. ఈమతమున నార్గురు అని తేలినది. హంసునకు తపోలోకము ప్రాప్తించునని యందే కలదు. మఱియు సన్న్యాసికి విధించిన ధర్మములలోనిది రక్తాంబరధారణము - "దండం కమండలుం రక్తవస్త్రమాత్రంతు ధారయేత్" అని బ్రహ్మవైవర్తము - ప్రకృతిఖండము. 33. అధ్యా. "సర్వన్యాసీ హరా భూప! ధర్మః సన్న్యాసినాం ధ్రువం, రక్తైకవాసా దండీచ బిభర్తి మృత్కమండలుం ..............ఇతి సంన్యాసినాం ధర్మ ఇత్యాహ కమలోద్భవః" అని బ్రహ్మవైవర్తము. శ్రీకృష్ణజన్మఖండము. 56 అధ్యా. (దండకమండలువులు కాషాయ వస్త్రమును సన్న్యాసి ధరింపవలెను. అని సన్న్యాసి ధర్మములందు బ్రహ్మ చెప్పెను.) 'అథ పరివ్రా డేకశాటీ ముండీ ఉదకపాత్రీ అరణ్యనిత్యః, భిక్షార్థీ గ్రామం ప్రవిశే న్నాసాయం' - అని మైత్రాయణ శాఖ. ఇత్యాదులు పెక్కు ప్రమాణములు గలవు. ఇందు శాంతరసధ్వని, అంగియగు శృంగారమునకు బీభత్సమువలె విరోధికాదు. కావున నిరాక్షేపము.

> క. శాంతము సర్వోత్తరరుచి,మంతం బట్లగుట వైరమైత్రులు లేవీ
> చింతన మెఱుఁగని కవి కవ,గంతవ్యం బగునె రసవికాసప్రతిభల్.
> అని కావ్యాలంకారచూడామణి, ద్వితీయోల్లాసము. 138.

క. తోరపుఁజీకటు లంతన్, మారోత్సవకలనమునకు ౕ మదిఁ బొంగుచు ది
జ్జారీజను లాడెడిక,స్తూరివసంతములయొప్పు ౕ చొప్పడ నెరసెన్, 118

అర్థము:—అంతన్ = అటుపిమ్మట, దిఙ్నారీజనులు - దిక్ + నారీజనులు, దిక్కులనెడు స్త్రీజనములు, స్త్రీ సముదాయము, మారోత్సవకలనమునకున్ = మన్మథుని సంబంధమగు నుత్సవము జరుపుటకు, మదిన్ = మనసునందు, పొంగుచున్ = ఆనందించుచు, ఆడెడి = (క్రీడార్థము) చల్లుకొనునట్టి, కస్తూరి వసంతములన్ = (ఒండొరులపైఁ జల్లుకొనుటకు) కస్తూరి కలిపిన నీటియొక్క, ఒప్పు = సొగసు, చొప్పడన్ = కలుగునట్లు, చీఁకటులు, సెరసెన్ = వ్యాపించెను.

తాత్పర్యము:-దిక్కులను స్త్రీలు మన్మథోత్సవము సిద్ధించుటకు మనసున సుప్పొంగుచు నొండొరులపైఁ జల్లుకొనునట్టి కస్తూరివసంతములవలె చీఁకటు లెల్లదెసల వ్యాపించెను.

కస్తూరి కలిపిన నీరు మేనిపైఁబడి స్రవించుచున్న స్త్రీ లె ట్లుందురో లేఁత చీఁకటులు వ్యాపించుచున్నదిక్కు ల ట్లున్న వని భావము.

అలం:—రూపకానుప్రాణిత నిదర్శనాలంకారము.

వి. :—వసంతము - దేశ్య మనియు పసుపు సున్నము కలిపిన యెఱ్ఱనీళ్లు అని యర్థముతో శబ్దరత్నాకరమున నున్నది. కాని 'కలపుంస్కోకిలకంఠ కోమలకుహూకార స్ఫురత్పంచమ, స్థల దధ్వన్యము లైన కాలముల మార్కండేయ నాథేశ్వరున్, లలితోరస్కుఁడు వీరభూపతి వసంతంబాడ్చు నవ్వీటివీథులఁ గర్పూరహిమాంబు సంకుమద కస్తూరీ పటీరంబులన్'. అను కాశీఖండ పద్యమునను, భీమఖండమందలి వసంత ఋతువర్ణనమునను, పుష్పాళ్లు, పసుపు, గంధపుటుండలు, గొజ్జంగనీరు, జవ్వాదిపంకము, పునుఁగు, పసుపునీరు, నేయి, నూనె, కుంకుమ, సిందూరము, మంచి గంధము, కస్తూరికా జలము, పచ్చకప్పురపు నీరు, అగరు - మొదలగు సుగంధ ద్రవ్యములు యువతీ యువకులు చల్లుకొనుచు, నుత్సవ మొనర్చినట్లు గలదు - నాఁడు వసంతోత్సవములం జల్లుకొను ద్రవ్యములందు హెచ్చుగా కుంకుమాదులగు నెఱ్ఱరంగు గలద్రవ్యములు వాడుటచే నిటీవలఁ దత్ప్రతినిధులుగా పసుపు సున్నము గలిపిన నీళ్లు మాత్రము జనవ్యవహారమున నిల్చిపోయి యుండును. వసంతము - అనఁగా వసంతోత్సవమునఁ జల్లుకొను నెఱ్ఱనీళ్లు అను నర్థమున సంజ్ఞాపరమై, అట్లా నీళ్లేరంగువైనను ఒండొరులపై నుత్సవములలోఁ జల్లుకొనుట - వసంతములాడుటయై యుండును. భాగవతమున 'యశోదకు శ్రీకృష్ణుఁడు పుట్టినాఁ డని వచ్చిచూచిన గోపగోపీజనము లుబ్బి 'నేతులఁ బెరుఁగులను బాలనీళ్లను వెన్నం బ్రీతి వసంతము లాడిరి ... గొల్లల్' అనికలదు. ఇది పుత్రోత్సవ సందర్భము. ఇందు పరిమళద్రవ్యములు లేనే లేవు. గొల్లలకు లభించు విలువగల ద్రవద్రవ్యములు మాత్రమే యగుచున్నవి. వాని నొండొరులపై నానందముతో చల్లుకొనుట వసంతములాడుట యైనది. కావున నిది యర్థమున వైలక్షణ్యమునొందిన సంస్కృతపదమే యనుకొనుట సమంజసము. సంశయము అను నర్థమున వ్యవహృతమగు అనుమానము, అభ్యంతరము = అడ్డము మున్నగు శబ్దములవంటిది యనుకొనఁదగును.

వ్యా. వి. :—తొరపుఁజీఁకటులు-తొరము+ చీఁకటులు. పుం, పులును, ముగాగమము, ద్రుతకార్యములు కలుగఁగా నైన రూపము. దిక్ + నారీ = దిఙ్నారీ, (దిగ్నారీ) అనునాసికసంధి. (సంస్కృతము.)

వ. అంత. 119

క. ఐరావణకరి కర ధూత్కార వమథు రేణుపటలికైవడిఁ గుత్కీ-
లారిదిశఁ దెలుపు దోఁచెను, దారలు ప్రథమోత్థబిందుసంతతిగతిఁ బరఁగెన్. 120

అర్థము:—ఐరావణ...కైవడిన్ - ఐరావణకరి = ఐరావతమను (నింద్రుని) ఏనుఁగుయొక్క, కర = తొండముయొక్క, ధూత్కార = 'ధూ' అను ధ్వనిగలుగ నిట్టూర్పువిడుచుటవలనఁ గలిగిన, వమథు = (తొండమునుండిపుట్టు) నీటితుంపురులయొక్క, రేణుపటలికైవడిన్ = చూర్ణపుగుంపువలె, కుత్కీలారిదిశన్ = తూర్పుదిక్కునందు (కుత్కీలములకు = పర్వతములకు, అరి = శత్రువు - ఇంద్రుడు -

అతనిదిక్కు = తూర్పు) తెలుపు=చంద్రోదయమునకు పూర్వము కనవచ్చు - తెల్లరంగు, తోఁచెను = కనఁబడెను, ప్రథమోత్థబిందుగతిన్ = (ఆ కరశీకరములలో) తొలుతగా వెలువడిన నీటిబిందువులవలె, తారలు = నక్షత్రములు, పరఁగెన్ = ఒప్పెను.

తాత్పర్యము:—ఐరావతమను నింద్రుని యేనుఁగుయొక్క తొండమునుండి త్రుస్సుమను నిట్టూర్పువలన వెలువడిన నీటితుంపురుల కణముల సముదాయమో యనునట్లు తూర్పుదిశను తెలుపుకననయ్యెను. ఆచిమ్మునపుడు ముందుగా వెలువడిన పెద్దతుంపురులవలె నక్షత్రము లొప్పెను.

అలం.:—ఉత్ప్రేక్షల రెంటికిని సంసృష్టి.

వి. :—ఏనుఁగు తొండముతో ఉచ్ఛ్వాసము విడుచునపుడు తొలుతటివమధువులు పెద్దతుంపురులుగా వెలువడును. ఆ వాయువునకు బలము కలుగుటచే తరువాతి తుంపురులు ముక్కలై సూక్ష్మరూపముగా ఆవిరి వలె వ్యాపించుట సహజము. కావుననే మొదటిబిందువులవలె నక్షత్రములును, తరువాత నుచ్ఛ్వాసబలమున నలిగిపోయి సూక్ష్మములైన బిందువుల సముదాయమువలెఁ దెల్లఁదనమును గనవచ్చెనని భావము.

వి. :—కుత్కీలము = కు + ఉత్కీలము, ఇట సవర్ణదీర్ఘము రావలసినను నీపదము శకంధ్వాదుల లోని దగుటచే పూర్వరూపసంధికలిగి కుత్కీలము అయ్యెను.

ఐరావతము:— ఇరా = నీరు, అదికలది. ఇరావంతము = సముద్రము - ఇరావంతమునఁబుట్టినది. అని వ్యుత్పత్తి.

ఐరావణము:— ఇరయా వణతి - నీటి (కెరటముల) చే ధ్వనించునది. ఇరావణము = సముద్రము - దానియందుఁబుట్టినది అని వ్యుత్పత్తి.

వ. అనంతరంబ.

> తివిరి త్రియామకున్ సొగసు ⁑ దిద్దికొనంగఁ బురోదిశాళి దా
> గవుసెన వెల్వరించు మణి ⁑ కల్పితదర్పణమో యనంగఁ గై
> రవకుల బంధుమండలము ⁑ రాజిలె నోలి నిలీయమానమై
> మివులఁ గళంకలక్ష్మతఁ దమీప్రతిబింబము నంత నేర్పడన్.

అర్థము:—అనంతరంబు + అ = వెంటనే, సొగసు = చక్కఁదనమును, దిద్దికొనంగన్ = లోపము లేనట్లు సవరించుకొనుటకు, త్రియామకున్ = రాత్రి (అనునాయిక) కొఱకుఁగాను, పురోదిశాళి - (పురః + దిశా + ఆళి) తూర్పుదిక్కు అను చెలికత్తె, తివిరి = యత్నించి, తాన్=తానై, గవుసెనన్ = వస్త్రరూప మగు పైకప్పును, వెల్వరించిన = తొలఁగించిన, మణికల్పితదర్పణము + ఓ = మణిచే నిర్మింపఁ బడిన యద్దమో, అనంగన్ = అనునట్లు, కైరవ ... మండలము - కైరవ = తెల్లకలువలయొక్క, కుల= సముదాయములకు, బంధు = చుట్టమగు చంద్రునియొక్క, మండలము = బింబము, (కర్త) కళంక లక్ష్మతన్ = మచ్చ యను మిషతో, మివులన్ = అత్యంతము, నిలీయమానమై = అణఁగియున్నదై, తమీప్రతిబింబమున్ = రాత్రియొక్క ప్రతిబింబమును, అంతన్, ఏర్పడన్ = స్పష్టపడుచుండఁగా, ఓలిన్ = క్రమక్రమముగా, రాజిలెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:—రాత్రియను నాయిక తనసొగసు దిద్దుకొనుట కని, తూర్పు దిక్కనెడి చెలికత్తె గవుసెన తొలఁగించి యెత్తిపట్టిన యద్దమో యనునట్లుగా నుదయించి, తనయందణఁగియున్నమచ్చ యనెడుమిషమున రాత్రియొక్క ప్రతిబింబముగూడ క్రమముగా స్పష్టపడుచుండ చంద్రమండలము ప్రకాశించెను.

అలం:—రూపకము, అపహ్నవము, ఉత్ప్రేక్ష. ఇం దుత్ప్రేక్షఅంగి. రూపకాపహ్నవము లంగములు. కాన సంకరము. చంద్రునియం దారోపింపఁబడిన దర్పణధర్మము ప్రకృతమైనరాత్రి ప్రతిబింబ గ్రహణోపయోగి యగుటచేత పరిణామాలంకారధ్వనికూడఁ గల దనఁదగియున్నది.

వి. :—పురోఽగ్రే ప్రథమే చ స్యాత్. విశ్వనిఘంటువు - పురోదిశ = ప్రథమ దిక్కు, తూర్పు. దిక్శబ్దమే. ఆకారాంతమై దిశా అనియగును. 'ఆబంతంచ హలంతానాం యథావాచా నిశాదిశా.' అని సిద్ధాంత కౌముది. ని. 'ఆళిః సఖీ వయస్యాచ - ఆలిఃసఖ్యావళీ అపి' అమరము.

కళంకలక్ష్యత:—ని. 'వ్యాజోఽపదేశో లక్ష్యంచ' అని అమరము. కళంక మనెడు లక్ష్యము, మిషగలది - కళంక లక్ష్యము. (బహువ్రీహి) దాని యొక్క భావము - కళంకలక్ష్యత - అనఁగా కళంకమనెడు మిష,అని భావము.

'గవిసెన' అను ముద్రిత పాఠములు రెండును పొరపాటు.' 'విండ్లఁ గౌసెనల్ చుట్టి' అని మనుచరిత్ర 4. ఆశ్వాసము 33. గౌసెన, గవుసెన యగుట న్యాయ్యము "వాయిరవుర్వ్యక్రతవా" అని చింతామణి.

గీ. తామరసలక్ష్మ లాచంద్రమామరాకఁ, గలఁగుచును గుముదాళికై తొలఁగె నపుడు
తొలఁగుబావయె కాఁడె తమ్ముల వరించు, నట్టి సతులకు నతఁడు మున్నెట్టిఁ డైన. ౭౨

అర్థము:— తామరసలక్ష్ములు = తామరపూవులశోభలనెడి పద్మవాసినులగు లక్ష్ములు, ఆచందమామరాకన్ = ఆచంద్రునిరాకచేత, చంద్రుఁడు వచ్చుటచేత నని భావము, కలఁగుచును = కలఁతనొందుచు, అపుడు, కుముద + ఆళికై = తెల్లకలువలగుంపులలో నుండుటకు, తొలఁగెన్ = తప్పుకొనెను, (మాటువడెను), అతఁడు = ఆచంద్రుఁడు, మున్ను = పూర్వము, ఎట్టిఁడు = ఎట్టిబంధువు, ఐనన్ = లక్ష్మియు, చంద్రుఁడును సముద్రమునఁ బుట్టుటచే లక్ష్మి కాతఁడు సోదరుఁడే యైనను - తమ్ములన్ = సోదరులను - (పద్మములనని యర్థాంతరము), వరించునట్టి = వివాహము చేసికొనఁగోరునట్టి, సతులకున్ = స్త్రీలకు - లక్ష్ము లనెడి మరదండ్రకు, తొలఁగుబావయె = తొలఁగఁదగిన బావ, భర్తయొక్క యన్నయే, కాఁడా - శత్రు వని పద్మపరమైన యర్థము. చంద్రుఁడును, పద్మములును (అబ్జములే) నీటఁబుట్టినవే కాన తామరలు చంద్రునకుఁ దమ్ము లగును. అట్టితమ్ములను వరించుటచే లక్ష్మి చంద్రునకు మఱఁదలివావి యయ్యెను.

తాత్పర్యము:—చంద్రునిరాక జూచి తామరలయందలి లక్ష్ములు కలఁకనొంది, వెంటనే తెల్లకలువల పంక్తులను జేరినవి. అది న్యాయమే యని కవి సమర్థించుచున్నాఁడు. అంతకు మును పేవావి యైనను తమ్ములను వరించిన కాంతలకు - తమ్ములయన్న తొలఁగుబావ కదా యగును అని.

అనఁగా:—చంద్రుఁ డుదయింపఁగనే పద్మములకు శోభ తగ్గినది. కలువలకుఁ గ్రొత్తగ శోభ వచ్చును అని భావము.

వి. :—'శోభాసంపత్తి పద్మాసు లక్ష్మీః శ్రీరపికథ్యతే' అనుటం జేసి 'లక్ష్మి' యన విష్ణుపత్నియును శోభయును నర్థములగును. చంద్రుడును లక్ష్మియు సముద్రమునఁ బుట్టుటచే నంతకుమున్ను చంద్రునకు సోదరి యైనను, లక్ష్మి - (అబ్జములగు) చంద్రుని తమ్ములను వరించుటచేత మఱఁదలి వావి గల దయ్యెను. లోకములో స్త్రీకి అక్కమగఁడును బావయే. భర్త యన్నయు బావయే. అక్కమగఁడగుబావను మఱఁదండ్రు దరిఁజేరి పరియాచకములాడుదురే కాని మగనియన్నయగు బావకుఁ దొలఁగుదురు. కాన ఇచట మగని యన్నయగు బావవావిగల చంద్రుని రాకకు లక్ష్మి తమ్ములనుండి తొలఁగి కలువలగుంపును జేరెనని చమత్కరింపఁబడినది. కలువలు చంద్రునకు భార్యలు. కావున నా సంఘమునఁ జేరి వారితో నానందించుచుండె నని ధ్వని.

అలం:—శ్లేషానుప్రాణితమయిన యర్థాంతరన్యాసము.

చ. పనుపడ వేణునాళములుఁ బగ్గములుం బలెఁ గ్రిందఁ బర్వు శో
భనకిరణప్రకాండములు భాసిలఁ జందురుఁ డొప్పె నెంతయున్
మనసిజుఁ డెల్లప్రాణుల మనంబులు చేలుగ రాగబీజముల్
పెనుజతనంబుతోడ వెదపెట్టెడు రౌప్యపుజడ్డిగం బనన్. 124

అర్థము:—మనసిజుఁడు = మన్మథుఁడు, ఎల్లప్రాణుల మనంబులు = చేలు, కన్ = కాఁగా - (అందు) రాగబీజముల్ = స్త్రీపురుషుల కొండొరులందుఁ గలుగు ప్రేమ యనెడువిత్తనములను, వెద పెట్టెడు = (విత్తనములు) నాటెడు, రౌప్యపుజడ్డిగంబు = పొలముదున్నినపిదప చదునుచేయు యంత్రమున కమర్చి విత్తనములు పోసెడు వెండి పిడుత, అనన్ = అనునట్లు, క్రిందికిన్ = తనక్రిందిభాగమునకు, (అనగా భూమిమీఁదికి) పర్వెడు = (నలుదెస) వ్యాపించుచున్న, శోభనకిరణప్రకాండములు, చక్కని మేలైన కిరణములు, వేణునాళములున్ + పగ్గములున్ + బలెన్ = వెదురుగొట్టములవలెను, త్రాళ్లవలెను, పనుపడన్ = అను వగునట్లు, చంద్రుఁడు - ఎంతయున్ = అత్యంతమును, ఒప్పెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:—ప్రాణికోట్ల మనస్సులనెడు చేలయందు వలపనెడు విత్తనములను, మన్మథుఁడతి యత్నముతో నాటునట్టి - గొర్తిమీఁద నమర్చిన వెండిపిడుతయో యనునట్లు, క్రిందికి ప్రసరించు కిరణములు వెదురుగొట్టములు త్రాళ్లవలె నమరఁగా - చంద్రుఁడు ప్రకాశించెను.

అలం. :— రూపకము.

వి. :— దున్నినచేను చదునుచేయుటకై యుపయోగించుసాధనమును గొర్తు అందురు. చదునుచేయు నపుడే చాలుగా విత్తనము లాభూమిపైఁ బడునట్లు ఆగొర్తిపైని మూఁడు చిల్లులుగల పిడుత నొక దానిని బెట్టి దానియందు విత్తనములు పోసి, ఆగొర్తికి నెడ్లను బూన్చి త్రోలుదురు. అట్లు విత్తనములు పోసి యమర్చిన యాపిడుతకు జడ్డిగ మనిపేరు. ఆ జడ్డిగను గొర్తియందు నిలిచి యుండుట కాధారముగా క్రింద వెదురుగొట్టములు త్రాళ్లనుబెట్టి బంధింతురు. అట్లే వెండితోఁజేసిన జడ్డిగమువలె చంద్రుఁడును, దాని కాధారములగువెదురుకఱ్ఱలవలెను త్రాళ్లవలెను కిరణములును, దున్నినచేలవలె సకలప్రాణుల మనస్సులును, అందు నాటెడు విత్తనములవలె వలపును, కృషికునివలె మన్మథుఁడును నున్నారన్నమాట. మన్మథుఁడు యువతీ యువకుల హృదయములందు ప్రేమబీజములను వెదచల్లుటకు చంద్రుఁడు నాతని కిరణప్రసారమును ముఖ్యసాధనములుగా నున్న వని ఫలితార్థము.

చ. నెలయను వెండికుండఁ గడునించి నిశాఖ్యచకోరనేత్ర యిం
పలరఁగ నంబరాహ్వయ మహానటమూర్తి మహాభిషేకమున్
జలుపఁగ నెల్ల దిక్కుల వెసం బ్రవహించెడు పాలవెల్లి నాఁ
బొలిచె సమస్తమున్ జలువఁ బొంద నమందత సాంద్ర చంద్రికల్. 125

అర్థము:—నిశాఖ్యచకోరనేత్ర = రాత్రియను స్త్రీ (చకోర = వెన్నెలపులుఁగులవంటి, నేత్ర = కన్నులుగలది స్త్రీ.) నెల = చంద్రుఁడు, అనువెండి కుండన్, కడున్ = అత్యంతము, నించి = పూరించి, ఇంపు = ప్రీతి, అలరన్ = కలుగునట్లు, అంబరా ... షేకమున్ - అంబర = ఆకాశమను, ఆహ్వయ = పేరుగల, మహానట = శివునియొక్క, మూర్తి = శరీరముయొక్క, మహాభిషేకమున్ = గొప్పస్నానమును, చలుపఁగన్ = చేయఁగా, ఎల్లదిక్కులన్ = అన్నిదిక్కులందు, వెసన్ = శీఘ్రముగా, ప్రవహించెడు, పాలవెల్లి = పాలప్రవాహము, నాన్ = అనునట్లు, సాంద్రచంద్రికల్ = దట్టమగు వెన్నెలలు సమస్తమున్ = జగత్తంతయును, చలువపొందన్, అమందతన్ = హెచ్చుతో, పొలిచెన్ = ఒప్పెను

తాత్పర్యము:—రాత్రియను స్త్రీ, చంద్రుఁడను వెండికుండను (పాలతో) నింపి యాకాశ మను శివుని శరీరమునకు గొప్పయభిషేకము చేయఁగా నన్నివైపులను ప్రవహించు పాలప్రవాహమో యనునట్లు దట్టమగు వెన్నెలలు జగమున కంతకుఁ జలువఁ గూర్చుచు ప్రసరించెను.

అలం. :—రూపకానుప్రాణితమగు నుత్ప్రేక్ష. అంబరాఖ్యుఁడగు మహానటుఁడనఁగా – అంబర శబ్దముచే చిదంబరక్షేత్రమును, మహానటశబ్దముచే అచటి నటరాజేశ్వరుఁడును ఆతనికి ప్రతిరాత్రియందును జరుగు క్షీరాభిషేకమును స్ఫురించుట చేతను, ఆనటరాజపూజ జగమునకంతకు క్షేమంకర మనియు స్ఫురించుటచేతను 'సమాసోక్తి' కూడఁగలదు.

వి. :—పంచమహాభూతములును, సూర్యచంద్రులును, సోమయాజియు శివుని మూర్తులు. కాన అష్టమూర్తి యనఁబడును. అం దాకాశ మొకమూర్తి (దేహము) 'అష్టమూర్తి రహిర్బుధ్న్యో మహాకాలో మహానటః' అని శివుని నామములును గలవు. చిదంబరమున నటరాజనామమున ఆకాశలింగరూపియై యెల్లపుడు నానందతాండవ మొనర్చుచుండు ననుటయుఁ బ్రసిద్ధము.

చ. తొలఁకెడు హాసకాంతుల విధుద్యుతిఁ బ్రోచి, చకోరమైత్రి జో
 కలు మెఱయించు కన్గవల కల్కితనంబునఁ బుష్పలావికల్
 తలఁపులు కొల్లలాడి మిగులం భ్రమయించి యువవ్రజంబుచే
 వెల లధికంబుగాఁ గొనుచు వేడుక నమ్మిరి పువ్వు లంగడిన్. 126

అర్థము:—అంగడిన్ = బజారునందు, పుష్పలావికల్ = పూవులమ్మెడు స్త్రీలు, తొలఁకెడు హాసకాంతులన్ = చిందుచున్న నవ్వులకాంతులచేత, విధుద్యుతిన్ = చంద్రుని కాంతిని – వెన్నెలను, ప్రోచి = అధికముచేసి, చకోరమైత్రి జోకలు = చకోర పక్షులయొక్క స్నేహమురీతులను, మెఱయించు = ప్రకాశింపఁజేయు – (చకోరములతోడి పోలికను దెలుపునట్టి), కన్గవల = కన్నుల జంటలయొక్క, కలికితనంబునన్ = చక్కఁదనముచేత, తలఁపులు = మనస్సులను, కొల్లలాడి = దోఁచుకొని, అపహరించి, మిగులన్ భ్రమయించి=ఎక్కువగా భ్రాంతిని పుట్టించి, యువవ్రజంబుచేన్=పడుచువాండ్ర సముదాయము చేత, వెలలు, అధికంబుగాన్, కొనుచున్ = తీసికొనుచు, పువ్వులు, వేడుకన్ = ఉత్సాహముతో, అమ్మిరి.

తాత్పర్యము:—ఆ సమయమున బజారులో పువ్వులమ్మెడు స్త్రీలు తమ నవ్వుల కాంతులచే వెన్నెలను వృద్ధిచేయుచు (వెన్నెలకంటెఁ దెల్లనగు నవ్వులకాంతులు గలవా రయి) చకోరములవంటి కన్నుల సోయగముచేత యువజనులను వశపఱచుకొని, భ్రాంతిపుట్టించి ఎక్కువవెలలనుగొనుచు పువ్వు లమ్మిరి.

అలం:—అనుగుణము, ఉపమ.

గీ. అప్పుడు ప్రభావతికి నొక్కయతివ విరులు, గొనుచుఁ బోవంగ నందు నింపునఁజరించు
 తేఁటిగమిలోనఁ దా నొక్కతేఁటి యగుచు, నేఁగె మాయాఘనుండు రతీశ్వరుండు.

అర్థము:—అప్పుడు, ప్రభావతికిన్, ఒక్కయతివ = ఒకస్త్రీ, విరులు = పువ్వులు, కొనుచున్ = పిలిచి తీసికొని, పోవన్ = వెళ్లుచుండఁగా, అందున్ = ఆపువ్వులందు, ఇంపునన్ = సంతోషముతో, చరించు = తిరుగుచున్న, తేఁటిగమిలోనన్ = తుమ్మెదల గుంపులో, మాయాఘనుండు = మాయచే గొప్పవాఁడు – గొప్పమాయ గలవాఁ డని భావము. అగు – రతీశ్వరుండు = ప్రద్యుమ్నుఁడు, తాను, ఒక్క తేఁటి=ఒకతుమ్మెద, అగుచున్, (ఒకతుమ్మెదగా పరిణామ మొంది అని భావము.) ఏఁగెన్=వెళ్లెను.

తాత్పర్యము:—ఆసమయమున నొక స్త్రీ వచ్చి ప్రభావతికొఱకు సంగడిలో పూవులు కొని వెళ్లుచుండఁగా ఆపూవుల పరిమళమునకు వానియందుఁ దిరుగుచున్న తుమ్మెదలలో తా నొక తుమ్మెదగా మాఱిపోయి, మాయావి యగు ప్రద్యుమ్నుఁ డాతుమ్మెదలతోపాటు వెళ్లెను.

అలం. :—పరికరము.

వ. అటమున్న పతిసమాగమోత్సవ సముత్సాహంబునంజేసి యపరాహ్ణంబున నుండియుం గ్రీడాభవన పర్యంకాది సముచిత నూతన సంస్క్రియా సంపాదనంబునకుం దగిన పరిచారికల నియోగించుచున్న ప్రభావతి మనోరథం బెఱింగి రాగవల్లరి యతిప్రయత్నంబున. 128

అర్థము:—అటమున్న + అ = అంతకుముందే, పతి...సముత్సాహంబునంజేసి - పతి = మగనితోడ, సమాగమ = కలసికొనుటయను, ఉత్సవ = పండుగయందలి, సముత్సాహంబునంజేసి = వేడుకచే, అపరాహ్ణంబుననుండియున్ = పగటిచివరభాగ మగువేళ నుండియు (జాముప్రొద్దువేళనుండియు నని భావము.) క్రీడా...సంపాదనంబునకున్ - క్రీడాభవన = పడుకటిల్లు, పర్యంక = మంచము, ఆది = మున్నగువానియొక్క, నూతనసంస్క్రియా = క్రొత్త దగు (సంస్కారము) బాగుచేతయొక్క, సంపాదనంబునకున్ = సంపాదించుటకు - (పడుకటిల్లు, మంచము మున్నగునవి యింతకు మును పున్నదానికంటె నెక్కువ పరిశుభ్రము చేయించుటకు, అనిభావము) తగినపరిచారికలన్, నియోగించుచున్న = ఆజ్ఞాపించుచున్న, ప్రభావతిమనోరథంబు = ప్రభావతియొక్క కోరిక, ఎఱింగి = పతిసమాగమత్వరను దెలిసికొని, రాగవల్లరి, అతిప్రయత్నంబునన్ = అధికమగు పూనికతో.

వి. :—ప్రభావతి నాట్యము పూర్తిగాఁ జూచి శుచిముఖీరాగవల్లరులతో నింటికి వచ్చి ప్రియసమాగమము తలఁచికొని తత్తఱించుచు - సూర్యాస్తమయము చంద్రోదయమునగుదాఁక, కేళీగృహశయ్యాదుల సంస్క్రియలు చేయించుచుండ రాగవల్లరి తలయంటు, తలదువ్వుట, జరిపినపిదప మార్చిమార్చి వివిధ వస్త్రాభరణ మాల్యముల ధరించుకొనుచునే యున్నది. అంతటఁ బ్రభావతి కయి తెచ్చినపూవులందలి తుమ్మెదలతో ప్రద్యుమ్నుఁడు దా నొక తుమ్మెదయై యటకు వచ్చెను. అట్లగుచో నాట్య మెప్పుడు జరిగెను ? పగలా ? రాత్రియా ? పగలు నాట్యము జరుగునా ? రాత్రియే యైనచో అపరాహ్ణము నుండి ప్రభావతి వాసకసజ్జిక యెట్లగును ? అని శంకింపఁ బనిలేదు. భద్రుఁడు నాట్యము చేసినపుడు బ్రహ్మచారులు నటుల నుద్దేశించి 'పగలెల్ల నాటల భ్రమయించుచును సందుగొందు లెల్ల నెఱింగికొనుచు రేయి కన్నగాండ్రగుచు నగళ్లు ప్రవేశించి' అని పలికిన యుపశ్రుతి మాటలను బట్టియు, ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని స్తుతించుసెపమున 'నేటిరాత్రి నిన్నుఁ గలియుదు నని పలికిన పలుకులను బట్టియు నాట్యము పగటివేళనే జరిగిన దనియు, మధ్యాహ్నమునకుఁ బూర్తి యయ్యె ననియుఁ గ్రహింపఁ దగును. తరువాతనే ప్రభావతి యపరాహ్ణాది వాసక సజ్జిక యయ్యెను. కొల మెట్లు మాఱుచున్నదో సూర్యాస్తమయాదులచే కవి వ్యక్త మొనర్చెను. గేహాదేహాదుల సంస్కారములయెడఁ దృప్తిపసక ప్రభావతి వెన్నెలలో చెలికత్తె తనకై తెచ్చిన పూవులను సాదరముగాఁ బుచ్చుకొనినట్లు ముందు చెప్పఁబడుచున్నది. కొనఁ బూర్వోత్తర సందర్భములందు శంకింపఁ బనిలేదు. అపరాహ్ణమునుండి ప్రభావతి యెట్లు ప్రవర్తించెనో వర్ణిత మైనతరువాత నామె శరీరాలంకరణాదికము వర్ణింపఁ బడుచున్నది.

క. చెలువకు సంపెఁగనూనెం, దలయంటి సుగంధవాసితము లగు చూర్ణం
బుల నలుఁగుఁ బెట్టి గంధా,మలకం బిడి చుమురు దిగిచి మజ్జన మార్చెన్.

అర్థము:—రాగవల్లరి - చెలువకున్ = ప్రభావతికి, సంపెంగనూనెన్ = సంపంగి నూనెచేత, తల యంటెన్ = తలకును, జుట్టునకును జక్కఁగా నంటుకొనునట్లు రాచెను. సుగంధవాసితములు = పరిమళ వస్తువులు కలుపుటచే సువాసన వొందినట్టి, చూర్ణములన్ = నలుఁగు పిండిచేత, (శరీరమున) నలుఁగుపెట్టెను, చకురు = సంపంగినూనె యంటుటచే శిరసునకు జుట్టునకు నంటియున్న జిడ్డును, గంధామలకంబు = మంచి వాసనగల యుసిరికపప్పును, ఇడి = ఆ పప్పుయొక్క రసముపోసి రుద్ది, తిగిచెన్ = పోఁజేసెను. పిదప, మజ్జన మార్చెను = స్నానము చేయించెను.

తాత్పర్యము:— తలయందును వెండ్రుకలయందును బాగుగా నింకు నట్లు సంపంగినూనె రాచి, పరిమళ ద్రవ్యముల కలయికచే సువాసనవేయు నలుఁగుపిండిచేత శరీరమున నలుఁగుపెట్టి, తలయందలి జిడ్డువోవ నటకలిపెట్టి రుద్ది పిదప గోర్వెచ్చని నీరుపోసి స్నానము చేయించెను.

వి. :—గంధామలకము = అటకలి-తుంగముస్తలపొడి, వట్టివేళ్లపొడి, ఉసిరికపప్పుపొడి, చందనపు పొట్టు, సీకాయపొడిలో కలిపి నీళ్లతో నునుకఁగొట్టి యభ్యంగమున మలయాళీయు లుపయోగింతు రనియు నదియే 'అటకలి' యనియు చెప్పుదురు. గంధామలకము, చందనామలకము అనిదానికే సంజ్ఞలు కావచ్చును. క...పసుపు గలిపిన గంధామలకము పెట్టిరి. మఱి, హైమఘటాంబువుల జలక మార్చిరి సతికిన్. అని యీ కవియే కళా 7. 64 లో ప్రయోగించెను. ఈయర్థ మీక్రిందివానియందును గోచరించును.

'శిరసంటెనూనియన్' 15 వ పద్యమునఁ జెప్పి 'పెట్టె గంధ మొక కాంత వధూటిశిరోజ పాళికిన్' 18 పద్యమునను 'చంద్ర,కలశిబూని నవామృతమ్ములఁ జకోర, చపలనయనకు వేలార్చె...అని 19 చంద్రికా పరిణయము 6 అశ్వాసమున జెప్పఁబడుటచే చందనము పెట్టుట యన గంధామలక మనియే తోఁచుచున్నది.

'గమ్మన వలచు చొక్కపు మంచిగందంపు టటకలి వెట్టె వామాక్షియోర్తు' వాసవదత్తాపరిణ యము 5. 37. మంచిగందంపు టటకలి = గంధామలకము.

'కామిని యోర్తు శిరోరుహంబులం దటకలి పెట్టె గంధమున ... నృపాలక మాళికి సంతసంబుగన్. వాసవ. 5-47. 'పువ్వుబోఁడికి గోళ్ల దువ్వి గంధామలకము వెట్టె నొక్క సైకత నితంబ. రాజశేఖర చరిత్రము. 3-159.

చ. చెలికి మెఱుంగుపావడలచేఁ దడియార్చెను ధూపవాసనల్
దలకొలిపెన్ బ్రసూన సదలంకృతి మీఱఁగ వేఱువేఱ మె
చ్చు లరసి కీలుగంటు జడసొల్లెము ద్రేలుడుఁ గొప్పు మూఁడు మూ
లలబిగికొప్పు పెక్కుగతులన్ నిలిపెం బలుమాఱు విప్పుచున్. 130

అర్థము:—చెలికిన్ = ప్రభావతికి, మెఱుంగు పావడలచేన్ = ప్రకాశించుచున్న సన్నని వస్త్రములచే, తడియార్చెను = (రాగవల్లరి) తడివోవ నొత్తెను, ధూపవాసనల్ = అగరు మున్నగు సుగంధ ద్రవ్యముల పొగవలనఁ గలుగు పరిమళములను, తలకొలిపెన్ = వహింపఁ జేసెను. వేఱువేఱ = వేఱువేఱు విధములుగా, ప్రసూన సదలంకృతి = పువ్వుల యొక్క చక్కని యలంకరించుట, మీఱఁగన్ = అతిశయింపఁగా - ఒక విధము కాదని మఱొక విధముగా పూల నలంకరించి, మెచ్చులు = ప్రభావతియొక్క కోరికలు, అరసి = తెలిసికొని, కీలుగంటు = జాఱుముడి, జడ = పాయలు జేసి యల్లఁబడిన కురుల గుంపు - వేణి, చొల్లెము = జడచుట్టు, ద్రేలుడుఁ గొప్పు, మూపుపైకి జాఱునట్లువేసిన కొప్పు, మూఁడు మూలల బిగి కొప్పు = మూఁడువైపుల బిగింపఁబడిన చెంపకొప్పును, పలుమాఱు విప్పుచున్ = వేసినది మరల విప్పి వేయుచు, పెక్కుగతులన్ = అనేక విధములుగా, నిలిపెన్ = రచించెను.

తాత్పర్యము:—రాగవల్లరి యాప్రభావతికి సొగసైన సన్నని బట్టలచే తడి యార్చి పెక్కువిధము లగు కమ్మతావుల ధూపములు వేసెను. పూవులచే వేఱువేఱువిధముల నలంకరించి, యామె కేది యిష్టమగునో యని కీలుగంటు, జడ, జడచుట్టు, జాఱుకొప్పు, చెంపకొప్పు వేసియు మాటిమాటికి విప్పుచు పెక్కురీతుల రచించి చూపెను.

వ. అప్పు డా రాగవల్లరి ప్రభావతి నుద్దేశించి. 131

చ. విరిసిన నొక్కయొప్పు నర ♦ వీడిన వేఱొకయొప్పుఁ జిక్కుపా
టొరసిన నొక్కయొప్పు నది ♦ యూడ్చిన వే ఱొక యొప్పు వేణిభా
వరచన నొక్కయొప్పు ముడి ♦ వైచిన వేఱొకయొప్పు కొప్పుగాఁ
బరఁగిన నొక్కయొప్పుఁ గను♦పట్టక మానదు నీకచంబులన్. 132

అర్థము:—అప్పుడు, ఆరాగవల్లరి, ప్రభావతిని, ఉద్దేశించి, విరిసినన్ = విడిపోయినచో, ఒకయొప్పును = ఒక యందమును, అర = సగము, వీడినన్ = విడిపోయినయెడ, వేఱొకయొప్పును, చిక్కుపాటు = చిక్కుపడుట, ఒరసినన్ = పొందినయెడ, ఒక్కయొప్పును, అది = ఆ చిక్కుపాటు, ఊడ్చినన్ = ఊడఁజేసినయెడ, వేఱొకయొప్పును, వేణిభావరచనన్ = జడగా నగున ట్లల్లినచో, ఒక్కయొప్పును, ముడివైచినన్, వేఱొకయొప్పును, కొప్పుగాన్, పరఁగినన్ = ఉండినచో, ఒకయొప్పును, నీకచంబులన్ = నీతల వెండ్రుకలయందు, కనుపట్టక మానదు = గోచరింపక మానదు, ఎటు లున్నను సొగసుగా నుండు నని భావము.

అలం. :—ఉల్లేఖము.

వి. :— ఆమె ప్రభావతిజుట్టు నెన్నివిధములుగా ముడిచినను నన్నివిధములరచనలందు నందమే కనఁబడిన దనుటచేఁ ప్రభావతియొక్క జుట్టున సహజసౌందర్యము కలదనియు, ప్రభావతికూడ నిరుపమాన సౌందర్యము గలదనియు వ్యక్త మగుచున్నది

క. తెఱవా! సందిట సందెఁడు, నెఱివెండ్రుక లాయితములు ♦ నీలము లివి యే
తెఱఁగున ముడిచిన నీకున్, గొఱఁత గలదె? యవియ జట్టి ♦ గొను నీవిభునిన్.

అర్థము:—తెఱవా = ఓ చిన్నదానా!, నీకున్, నెఱివెండ్రుకలు = వక్రములైన కేశములు, సందిటన్ సందెఁడు = సందిటితో కొలిచి చూచినయెడ సరిగా సందిలిపరిమాణము గలవి, (సందిటితో సందెఁడు, అనిజాతీయము.) ఆయతములు = పొడుగైనవి, నీలములు = నల్లనివి, (లేదా యింద్రనీలములు - వానివలె నల్లగ నిగనిగలాడుచున్నవి.) ఇవి = ఇట్టి యీ వెండ్రుకలు, ఏతెఱఁగునన్ = ఏ విధముగా, ముడిచినన్, నీకున్, కొఱఁత = లోపము, కలదె, ఎట్టిలోపమును లే దని భావము. ఏ మన, అవియ - (ఇచట 'ఇవియ' యనుట స్వారసికము. ఆ వెండ్రుకలు దువ్వుచున్న రాగవల్లరి అవియ యనుట యుచితముగా నుండదు.) నీ విభున్, జట్టిగొనున్ = వశపఱచుకొనును.

తాత్పర్యము:—అప్పు డా రాగవల్లరి ప్రభావతితో ని ట్లనుచున్నది. ఓ చిన్నదానా! నీ తలవెండ్రుక లివి పొడుగుగా నిగనిగలాడు నీలములవలె మెఱయుచు సందిటితో సందెఁ డున్నవి. ఇవి యేరీతిగా ముడిచినను నీకు లోపమేమి కలుగును? నీ యత్నమేమియు నక్కఱలేకుండ నివియే నీ భర్తను వశపఱుచుకొనఁగలవు. అనఁగా నిట్టి నీతలకట్టు చూచినచో నీ మగఁడు ముగ్ధుఁడై నీకు విక్రీతదాసుఁ డగును.

అలం. :—అతిశయోక్తి.

వి. :—సందిలి = ప్రగండము, దండ కాని 'రెండు సందిళ్లు పట్టి కూర్చుండఁబెట్టె' అని కళా. 7.145. స బట్టి రెండు దండచేతులెత్తి యా చేతులవ్రేళ్లు, గలుపఁగా నేర్పడు వలయాకారమును గూడ 'సందిలి' యనఁబడుచున్నది. ఇచ్చట నీయర్థమే పొసఁగును.

వ్యా. వి. :—సందిటన్. సందిలి ఔపవిభక్తికము. సందిలి + చేతన్ = టివర్ణమంతాదేశమై - (సందిటి + చేతన్.) 'ఔపవిభక్తికంబుల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.' బాల. అచ్చిక. 38. (సందిటి + అన్) అయి - అపదాది స్వరసంధిచే - 'సందిటన్' అయినది. సందిలి + ఎఁడు. సూ. మానార్థంబున కేకత్వంబున 'ఎఁడు' వర్ణకంబగు. బాల. తద్ధిత. 25చే. ఎఁడు వర్ణకప్రాప్తి. సూ. 'ఎఁడు వర్ణకంబు పరం బగునపుడు లివర్ణంబు లోపించు'. బాల. తద్ధిత. 26 చే లివర్ణలోపము, అపదాదిస్వర సంధియును. సందేఁడు అని యగును.

క. అనుచు విరుల్ కచబంధం, బునఁ జెరివెడు సఖిని మరలి పొలఁతుక వైచెన్
దనచేతి పువ్వుబంతిని, గినుకయుఁ జిఱునవ్వుఁ గన్నుఁగ్రేవలఁ దొలఁకన్. 134

అర్థము:—అనుచున్, కచబంధంబునన్=కొప్పునందు, విరుల్=పూలను, చెరివెడు సఖిని=తుఱుముచున్న రాగవల్లరిని, పొలఁతుక = ప్రభావతి, మరలి = వెనుకకుఁ దిరిగి, కినుకయున్ = కోపమును, చిఱునవ్వున్, కన్నుఁగ్రేవలన్ = కన్నుల తుదలనుండి, తొలఁకన్ = వెలువడఁగా, తనచేతి పువ్వుబంతిని, వైచెన్ = ఆమెపై విసరెను - (లేదా 'తనచేతి పువ్వుబంతితోఁ గొట్టెను' అని యైనను జెప్పవచ్చును.)

తాత్పర్యము:—తన వెన్నువంకఁ గూర్చుండి యి ట్లనుచుఁ గొప్పునందు పువ్వులు ముడుచుచున్న రాగవల్లరివంకఁ దిరిగి కంటి తుదలందు కోపమును జిఱునవ్వును కనఁబడ ప్రభావతి యామెపై తనచేత నున్న పూబంతిని విసరెను.

వి. :—పరిహాసించినందులకు సమాధానము చెప్పలేక ముగ్ధాత్వముచేత కోపమును, మగఁడు వశమగు ననుటవలనఁ గలిగినయానందమునకు సూచకముగ చిఱునవ్వును గల్గెను. ఇందు మాధుర్యమను కావ్యగుణము పరిస్ఫుటమగుచున్నది. 'చిత్తద్రవీభావమయో హ్లాదో మాధుర్య ముచ్యతే' అని సాహిత్య దర్పణము. చిత్తము ద్రవించుట యాహ్లాదమనియు, యాహ్లాదమే మాధుర్య మనియు నిర్వచనము. ఇట్టి మాధుర్యమే కళాపూర్ణోదయమున వాణీబ్రహ్మల ప్రణయకోపమునందును వ్యక్త మగును.

'ఘనయత్నంబున నవ్వడంచుకొనుచున్ గంజాక్షియున్ నాథ యే
మనినం గోపము వచ్చు మున్నది సుఁడీ యత్యంతమున్ న న్నిఁకన్
జెనకన్ రాకుఁడు చాలు నవ్వులని వైచెన్ గాంతుమీఁదన్ నిజ
స్తనగుచ్ఛప్రతిమల్లహల్లక దళోద్యత్కందుకం బంతటన్. 5. 60.

వ. అంత. 135

తే. ఆచెలువ యక్షకర్దమం బాదిగాఁగ, గలపములభేదములు తన వలచినట్లు
సంఘటింపించి కుంకుమ చందనాదు, లలఁది నలిపించుకొనియె మే లరసి యరసి.

అర్థము:—ఆ చెలువ = ఆ ప్రభావతి, తనవలచినట్లు = తాను కోరినరీతిని, సంఘటింపించి = బాగుగాఁ గూర్పించి, సిద్ధము చేయించి, యక్షకర్దమంబు = కర్పూరము, అగరు, కస్తూరి, తక్కోలములు కలిపిన గంధము, ఆదిగాఁగన్ = మొదటి దగునట్లు (మొదలైన అని భావము.) కలపములభేదములు = వేరేఱు పైపూఁతలును, మేలు = మంచిరకము, అరసి యరసి = మిగులఁబరీక్షించి, కుంకుమ చంద

నాదులు = కుంకుమపూవు, మంచిగంధము నున్నగు నవియు, అలఁది = శరీరమునఁ బూసికొని, నలిపించు కొనియెన్ = (పరిమళము మాత్రము మిగిలి యామైపూఁతలు) నలిఁగి రాలిపోవునట్లు రాయించుకొనెను.

తాత్పర్యము:— తాను కోరినవిధముగా యక్షకర్దమాదులగు మైపూఁతలను, మంచిరకము కుంకుమ చందనాదులను శరీరమునఁ బూసికొని వానిపరిమళముమాత్రము మిగులునట్లు చెలికత్తెచే నవి యన్నియు నలిఁగి రాలిపోవునట్లు రాయించుకొనెను. ఆపదార్థములు శరీరమున లేకున్నను వానిసంస్కారము మిగులును. (ఇయ్యది నాగరక పద్ధతి.)

గీ. మృగమదాదులఁ జుక్కబొ ట్టగిసెయాకు,
బొట్టు పూర్ణచంద్రతిలకంబు నెలవంక
విధము నామము గుమ్మడి విత్తు నామ,
మొకటి కా దని యొకటి యా యువిద దాల్చె. 137

అర్థము:—ఆ + ఉవిద = ఆప్రభావతి, మృగమదాదులన్ = కస్తూరి మున్నగువానిచే (కుంకుమ, కర్పూరము మొదలగునవి వానిచే) చుక్కబొట్టు=చుక్కవలె నుండుబొట్టు, అగిసెయాకుబొట్టు=అవిసెయాకు వంటి యాకారముగల బొట్టు, పూర్ణచంద్ర తిలకంబు = నిండు చంద్రుని యాకారము గల బొట్టు, నెలవంక విధము నామము = చంద్రరేఖవలె వంకరగా నుండు బొట్టు, గుమ్మడివిత్తు నామము = గుమ్మడిగింజ యాకారముగల బొట్టు, (వీనిని) ఒకటి + కాదు + అని = ముం దొకటి ధరించి యదికాదని, ఒకటి = మఱొకటి, తాల్చెన్ = ధరించెను.

వి. :—నామము = బొట్టు అను నర్థమున దేశ్యము కాని, సంస్కృతపదము కాదు. కస్తూరిచే చుక్కబొట్టు, అగిసెయాకునుబొట్టును, కర్పూరముచే పూర్ణచంద్ర తిలకము, నెలవంక బొట్టును, కుంకుమచే గుమ్మడిగింజ బొట్టును ధరింతు రని తోఁచుచున్నది. అగిసెయాకు బొట్టుగూడ కుంకుమముచే ధరింప వచ్చును. 'ప్రియాగమవేళ గృహము తనువు, సవరించు నింతి వాసకసజ్జ. నరసభూపాలీయము. 2. 40. ఈ లక్షణముచే ప్రభావతి వాసకసజ్జానాయిక. అందును ముగ్ధ గావున నాయకుని మన సెట్లుండునో తెలియక దేహాలంకరణమం దేమి, గృహాలంకరణమం దేమి తృప్తిలేక యుత్కంఠచే నలఁగుచుండెను. ఇందలి 129 పద్యము మొదలు 144 దాఁక నీ విషయమే వర్ణింపఁబడినది.

తే. వెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్దియలును నందెలు మొలనూళ్లు నంగుళీయ
కంకణాంగదహారతాటంకముఖ సమస్త భూషణములు దాల్చె మార్చి మార్చి.

అర్థము:—వెలఁది = ప్రభావతి, మార్చి మార్చి = (ఒక్కొక్క తరగతి నగ లెన్నియో శిల్ప విశేషమున నామె కుండుటచేఁ దృప్తిలేక) మార్పు చేసి చేసి, మట్టెలు=కాలి బొటనవ్రేలి ప్రక్క వ్రేలికిఁ బెట్టెడు చుట్లు, పిల్లాండ్లు = కాలి చిటికెనవ్రేలి వెనుకవ్రేలికిఁ బెట్టెడి చుట్లు, వీరమద్దియలును = కాలి బొటనవ్రేలికిఁ బెట్టెడి చుట్లును, అందెలును = పాదకటకములును, మొలనూళ్లను = రశనలును, అంగు ళీయ...భూషణములు - అంగుళీయ= (చేతివ్రేళ్లకుఁ బెట్టెడి) యుంగరములును, కంకణ=(చేతులకుఁబెట్టు.) కడియములును, హార రత్నాల సరులును, తాటంక = కమ్మలును, ముఖ = మొదలుగాఁగల, (ఇంకను = కర్ణభూషణములు, పాపటబొట్టు, సూర్యచంద్రులు, కొప్పువల మున్నగు శిరోభూషణములును అన్నమాట) తాల్చెను. పాదాది శిరఃపర్యంతము నే యే యవయవమున కే యే నగ ధరింపఁ దగునో వానిలో మేలిరక మేటి యవి ధరించె నని భావము.

వి. :—ఆంధ్రభాషార్ణవమున - సీ॥...మను వీరమద్దె నా మట్టె యనఁగ, బిబ్బిలికాయనాఁ బిల్లాఁడి యనఁ జిటిబొద్దు నాఁగను గ్రమంబుగఁ బదాంగుళీవిభూషలు..., అని కాలిబొటనవ్రేలు మొదలు చిటికెన

వ్రేలుదాఁక నైదువ్రేళ్లకుఁ బెట్టుచుట్లు. 1. వీరమద్దె, 2. మట్టె, 3. బిబ్బిలికాయ, 4. పిల్లాఁడి, 5. చిటిబొద్దు, అని వరుసగాఁ జెప్పఁబడినవి. కాని యిందు వ్యత్క్రమముగాను ససమగ్రముగాను జెప్పఁబడెను.

వ్యా. వి. :—పిల్లాండ్లు, పిల్లాఁడి - శబ్దమునకు. బ. వ. లు వర్ణకము పరము కాఁగా - (పిల్లాఁడి+లు) ఉత్వము వచ్చి 'పిల్లాఁడు+ లు' అయి, సూ. బహువచనంబు పరంబగునపుడు డ, ల, ట, ర, ల యుత్వంబు నకు లోపంబు బహుళంబుగా నగు. బాల. ఆచ్చి. 12. చే - 'పిల్లాఁడ్లు' అయి - సూ. సమాసపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందువునకుం బూర్ణం బగు. బాల. ఆచ్చిక. 15. చే - పిల్లాండ్లు. అని రూపము సిద్ధించెను.

క. ఒక్కొకతోయము సొమ్ములె, పెక్కుదెఱంగు లవి యునికిఁ బెంపున నివి యొం
డొక్కటి మీఱుచుఁ దనప్రభ, నెక్కుడగుటఁ ద్రిప్పి త్రిప్పి యింతి ధరించున్.

అర్థము:—ఇంతి = ప్రభావతి, ఒక్కొకతోయముసొమ్ములు + ఎ = ఒక్కొక్కవిధమగు నగలే, పెక్కు + తెఱంగుల + అవి = అనేకరీతుల శిల్పవిశేషము గలవియై, ఉనికిపెంపునన్ = అధికముగా నుండుటచే, ఇవి = ఈ పయిని జెప్పిన నగలు, ఒండు = ఒకటి, ఒక్కటిన్ = వేఱొకదానిని, మీఱుచున్ = మించుచు, (ఒకదాని నొకటి మించుచు అనిభావము.) తనప్రభన్ = తన(మేని) యొక్కకాంతిచే, ఎక్కుడు + అగుటన్ = అధికము లగుచుండుటచేత, త్రిప్పి త్రిప్పి = మార్చి మార్చి, ధరించున్ = తాల్చును.

తాత్పర్యము:—ఒక్కొక్కవిధమగునగలు శిల్పభేదముచే పలురీతుల నున్నవి యెన్నియో యుండుట చేతను, అవి గూడఁ నొకదాని మించి యొకటి యుండుట, తనశరీరకాంతిచే మఱింతమించుచుండుట చూచి నిశ్చయించుకొనలేక మార్చి, మార్చి ధరించెను. దీనివలన ప్రభావతియొక్క, ముగ్ధాత్వమును, సౌభాగ్య సమృద్ధియును వ్యక్తములు.

వి. :—తోయము. తెలుఁగుపదము. క. లెగ దినుసు తోయ మనఁగను, నెగడుఁ బ్రకారంబునకును నెఱి నామములై. అని ఆంధ్రనామశేషము. 38.

సొమ్ము=నగ, సీ. అడరు భూషణసంజ్ఞ తొడగు తొడవు మిన్న సొమ్మనంగ...ఆంధ్రభాషార్ణవము.

ఉ. అంచలపట్టొకింతతడ వబ్రపుమంజిడి కొంతసేపుఁ గ్రొ
మ్మించుఁజెఱంగుదళ్లుఁ గడుమేలిమి మాదళముల్ బవంతు లొ
క్కించుక యించు కంతవడి యింపున నొక్కటి మెచ్చ కొక్కటిం
జంచలనేత్ర దాల్చెఁ బ్రియుసమ్మత మెట్లగునొక్కొ యన్మదిన్. 140

అర్థము:—చంచలనేత్ర = చలించుచున్న కన్నులు గలది, ప్రభావతి, ప్రియుసమ్మతము = మగని కిష్టము, ఎట్లు = ఏవిధముగా, అగునొక్కొ = అగునో కదా, అన్మదిన్ = అను నూహతో, ఒకింతతడవు = కొంచెముసేపు, అంచలపట్టు = చుట్టు నంచలరీతి జలతారు నేసిన యంచులు గల పట్టుచీరను, కొంతసేపు, అబ్రపుమంజిడి=వింతయైనయెఱుపు మించిన పసుపురంగుచీరను, ఒక్క+ఇంచుక, ఇంచుకంతవడి=కొంచెము కొంచెము సేపు, క్రొమ్మించుఁ జెఱంగుదళ్లు=తొలకరిమెఱుపులవలె జలతారుతో నేసిన యంచులు గలిగి తళ్లు అనఁగా అలలవలె రంగులచేఁ జిత్రింపఁబడిన వస్త్రములను, (తళ్లు = గట్టును కొట్టుకొను చిన్నయలలు అని సూర్యరాయ నిఘంటువు.) కడున్ = మిక్కిలి, మేలిమి = శ్రేష్ఠములైన, మాదళముల్ = ఆకుపచ్చరంగు వస్త్రములను, బవంతులు = ఇండ్లవలె నేర్పడిన గళ్లుగల చీరలును, ఇంపునన్ = సంతసముచే, లేక ప్రేమచే, ఒక్కటిన్, మెచ్చక, తాల్చెన్ = ధరించెను.

వి. :—మంజిడి అన ఎఱుపు మించిన పసుపురంగు చీర అని సూ. ని. కాని మంజిష్ఠాశబ్ద భవమైనచో - 'ముదురు ఎఱుపు' అగు నని తోఁచుచున్నది. శివరాత్రి మాహాత్మ్యము 4. 6. పద్యమున. అరుణోదయ వర్ణనమున 'మం, జిష్ఠారాగము మండలంబున నధిష్ఠింపన్ నిలింపాధిభూ, కాష్ఠామధ్యమునందుఁ దోఁచెను శతాంగ్రప్రష్ఠ సర్వద్విష, జ్జ్యేష్ఠుఁడు...అని యుండుటచే' మంజిష్ఠ యన గాఢమగు రక్తవర్ణమనుట నిశ్చయము. దానికి వైకృతము కాన - గాఢరక్తవర్ణమగు వస్త్ర మనుట న్యాయ్యము.

చ. తరుణి యొకింతసేపు చిఱుతదమ్ములపుంబసతోడి మోవి మే
గరగరికన్ విరాజిలుచుఁ గమ్మలు దీఁగెయుఁ బూని వేణికా
సురభితఁ బొల్చు యొక్క-పరిశుద్ధపు సైకపుటొల్లెఁ గట్టి భా
సురతఁ గడున్ వెలార్చెఁ బెఱ సొమ్ముల కోపమి యన్మిషంబునన్. 141

అర్థము:—తరుణి = ప్రభావతి, పెఱసొమ్ములకున్ (మీఁదఁజెప్పఁబడిన యలంకారములకంటె) ఇతరములగు నలంకారములను ధరించుటకు, ఓపమి=ఓపికలేక పోవుట, అన్మిషంబునన్ = అనెడి నెపమున (వెనుకటి నూతనాలంకరణ మంతయు మాని) ఒకింతసేపు, చిఱుదమ్ములపుంబస తోడిమోవిన్ = స్వల్పమగు తాంబూలరాగము గల పెదవితోడను, మే గరగరికన్ = శరీరమునొక్క తళుకుతోను, లేక సొగసుతోను, విరాజిలుచున్ = ప్రకాశించుచు, కమ్మలున్ = కర్ణభూషలును, తీఁగయున్ = ఒకవిధమగు కంఠభూషయును (మాత్రము), పూని = వహించి, వేణికాసురభితన్ = (పువ్వుల యలంకరణము తీసివేసినను) జడయొక్క పరిమళముతో, పొల్చు = ఒప్పు, ఒక్క-పరిశుద్ధపు = ఒకనిర్మలమైన, (సైకము+ఒల్లె) సైకపుటొల్లెన్ సన్ననిబట్టను, కట్టి - భాసురతన్ = (సహజమగు) కాంతిని, వెలార్చెన్ = ప్రకటించెను.

తాత్పర్యము:—అన్నివిధములగు పూవులయలంకరణము, నగలు, వస్త్రములు, అంగరాగములును మార్చిమార్చి ధరించి, యీ నగలు మున్నగువానిని ధరింప నోపిక లేదనుమిషతో, కొంచెముసేపు తాంబూలరక్తిమ పెదవియందుఁ గన్పట్ట, శరీరలావణ్యము మాత్రము దోఁపమెఱయుచు, చెవులకుఁ గమ్మలును, మెడలో తీఁగయను చిన్ననగను మాత్రము దాల్చి, జడయొక్క సువాసన మాత్రమే మిగులునట్లు పూలను దీసివేసి స్వచ్ఛమైన యొకసన్నపు చీర కట్టుకొని, తనసహజమగు శోభను ప్రకటించెను. 'అదికా దని యిది, ఇది కా దని యది' అని యన్నివిధముల నలంకరణములును చేసికొని చూచినది. తృప్తి లేక కొంతసే పన్నియు మాని పరిమిత మగునలంకరణముతో నున్నను సహజ మగుశోభతోనే యొప్పుచుండెను. 'కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం' అనినట్లు మధురమగు నాకారముల కేది యుంచినను అలంకారమే యగును గదా.

వ. వల్లభ మనస్సమాకర్షణ కౌశలా కౌశల సందేహంబునం జేసి యెందును మనః స్థైర్యంబు లేక. 142

అర్థము:—వల్లభ = మగనియొక్క, మనః = మనస్సుయొక్క, సమాకర్షణ = ఆకర్షించుటయందు, కౌశల + అకౌశల = నేర్పుకలుగుట, లేకపోవుటల విషయమైన, సందేహంబునన్ - ప్రియునిమనస్సు నాకర్షించుటయందు తనకు నేర్పు కలదోలేదో యను సంశయముచేనని భావము, ఎందును=భూషణవస్త్రాదుల ధరించుటయందు, మనఃస్థైర్యంబు = మనసు నిలకడ, లేక.

ఉ. శ్రీ లలితాంగరాగములుఁ జీరలు సొమ్ములు నేర్చి యేర్చి తా
మేలుతరంబుఁ దాల్చియును మెచ్చక మార్చుచు నెన్నిమాఱులున్,

జాలక దిద్దినట్టిదియె సారెకుఁ దిద్దుచు మించుటద్దమున్
గేల ధరించి చూచుఁ బరికించుఁ బొరింబొరి సద్మసంస్క్రియల్. 143

అర్థము:—శ్రీ లలితాంగరాగములున్ = శోభచే మనోహరములైన మైపూఁతలును, చీరలును, సొమ్ములున్ = నగలును, తాన్ = తాను, ఏర్చియేర్చి = ఏఱి యేఱి - లేక - ఎక్కువగా పరిశోధించి, మేలుతరంబున్ = (వాని యన్నిటిలోను) మంచిరకమును, తాల్చియును, మెచ్చక, మార్చుచున్, ఎన్ని మాఱులున్ = (మార్చి యలంకరించుకొనుటకు) ఎన్నిసార్లును, చాలక, దిద్దినట్టిదియె = సవరించినది, సారెకున్ = మాటిమాటికిని, దిద్దుచున్, మించుటద్దమున్ = మెఱయుచున్న యద్దమును, కేలన్ = చేతియందు, ధరించి, చూచున్ = చూచుకొనును, పొరింబొరిన్ = మరల మరల, సద్మసంస్క్రియల్ = పడుకటింటి యొక్క చక్కఁజేయుటలను, పరికించున్ = పరీక్షించును.

వ్యా. వి. :—మించుటద్దము (మించు + అద్దము) కర్మధారయము గాన 'టుగాగమము' వచ్చినది.

సీ. కేళీగృహంబు మున్గిట గరగరిక లా, లోకించు గంధాంబుసేక మరయు
నలుకుపూఁతల పరిమళముఁ బరీక్షించు, రంగవల్లికల తెఱంగుఁ జూచు
సకినలమంచంబుజాడ విమర్శించుఁ, గుంకుమపరపుభంగులు గణించు,
హొంబట్టుతలగడయొప్పు విచారించు, నగరుధూపముల సోయగము లెంచు,

గీ. నలరుటోవర్లు మేల్కట్లు నంగరాగ, పూర్ణపాత్రికలును గందవొడిబరిణలు
జాలవల్లిక లాదిగా సముపభోగ, సాధనశ్రీలు పరికించుసారె కబల. 144

అర్థము:—అబల = ప్రభావతి, కేళీగృహంబు మున్గిటన్ = పడుకటింటియొక్క ముందుభాగమునందలి, గరగరికల్ = అలంకారములను, ఆలోకించున్ = పరిశీలించును, గంధాంబుసేకము = పరిమళముగల నీటితోఁ దడుపుటను, అరయున్ = పరిశీలించును, (ఇట్లే మున్దటి పరీక్షించున్ మున్నగు క్రియాపదముల కన్నిటికి నర్థము) అలుకు పూఁతలపరిమళమున్ = భూమికిఁ జేసినలేపములయు, గోడలు మున్నగు వాని లేపనములయొక్కయు సువాసనను, పరీక్షించున్, రంగవల్లికల తెఱంగున్ = ముగ్గులయొక్క విధములను, చూచున్, సకినలమంచంబుజాడన్ = ధ్వనించునట్టి కృత్రిమపు పక్షులచేతను, కీలుబొమ్మలచేతను నలంకరింపఁ బడిన శయ్యయొక్క విధమును, విమర్శించున్, కుంకుమపరపు భంగులు = కుంకుమపూవు నించి కుట్టిన పరపు (అనికొందఱు - ఎఱ్ఱరంగు పట్టుతోఁ గుట్టినపరపు అని కొందఱు.) దానియొక్క స్థితిని, గణించున్, హొంబట్టు తలగడయొప్పున్ = బంగారువన్నె గలపట్టుతోఁ గుట్టిన ఉపధానముయొక్క సొగసును, విచారించున్, అగరు ధూపముల సోయగమున్ = అగరువత్తుల పొగయొక్క యందమును, ఎంచున్, అలరు + ఓవర్లు - అలరుటోవర్లు = పువ్వులచే నలంకరింపఁబడిన గదులను, మేల్కట్లు = (పడకయిల్లు, పందిరి మున్నగువాని) పైభాగమునఁ గట్టెడు పెద్ద వస్త్రవిశేషములు - వితానములు, (చాందిని లని భావము) అంగరాగ పూర్ణపాత్రికలు = మైపూఁత ద్రవ్యములతో నిండిన గిన్నెలును, గందవొడిబరిణలు = బుక్కాతో నింపిన కరాటములును, జాలవల్లికలు = తమలపాకుల పెట్టెలును (పాందానులును), ఆదిగాన్ = మొదలు గాఁగల, సముపభోగసాధన శ్రీలు = సుఖమును బొందుటకు సాధనము లగుపదార్థములయొక్క సమృద్ధిని, సారెకున్ = మాటిమాటికిని, పరికించున్ = పరీక్షించును.

అలం:—ఉదాత్తానుప్రాణిత, కారకదీపకాలంకారము.

వ్యా. వి. :—హొంబట్టు-హొన్ను + పట్టు - ప్రాంతాదిసంధి. అలరుటోవర్లు - అలరు + ఓవర్లు- టుగాగమసంధి. గందవొడి - గందము + పొడి. సూ. ఆచ్ఛికసమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్య వైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి. ప్రౌఢ. సమాస. 36,

వ. ఇట్లు వర్తించుచున్న యన్నీలవేణి యాపువ్వు లాదరంబునం బుచ్చుకొనియె నట్టి యెడ నిట్టు నట్టుఁ జెదరి పఱచు తుమ్మెదపదువు పొది వదలి యొదిఁగి యదు కుమారుం డక్కుమారిక సవరించు శ్రవణోత్పలంబులోనం గానరాకుండ నడంగి యుండె నప్పు డప్పడంతి ముప్పిరిగొను రాగవేగంబునఁ బ్రియాగమనవిలంబంబు సహింపలేక బహిష్ప్రాణంబు లన నొప్పు శుచిముఖీరాగవల్లరుల నేకతంబునకుం బిలి పించి శుచిముఖి కిట్లనియె. 145

అర్థము :—అన్నీలవేణి = నల్లనిజడగల యాప్రభావతి, ఆ పువ్వులు = పుష్పలావికలనుండి కొని బోటికత్తె తెచ్చిన యాపూవులను, పుచ్చుకొనెను - (ఇంతకుఁ బూర్వము చెప్పిన ప్రభావతిహృదయాందోళన మంతయు, నాట్యమై గృహమునకు వచ్చినది మొదలుగా వెన్నెల వచ్చిన తరువాత భృంగరూపుఁ డగు ప్రద్యుమ్నునితోఁ గూడ బోటి పూవులు తెచ్చి యిచ్చుపర్యంతము జరిగిన దని యనుసంధించుకోఁ దగును.) పఱచు = ఎగిరిపోవుచున్న, తుమ్మెదపదువుపొది = తుమ్మెదలగుంపుయొక్క, సంబంధము, (లేక మఱుఁగు? ఆశ్రయము?) వదలి, ఒదిఁగి = దాఁగి యుండి, సవరించు = అలంకరించుకొనిన, శ్రవణోత్పలంబునన్ = చెవియందలి కలువలో, ముప్పిరిగొను = అధికమగుచున్న, రాగవేగంబునన్ = ప్రేమాతిశయముచేత, ప్రియ + ఆగమనవిలంబంబు = ప్రియునిరాకయొక్క యాలస్యమును, బహిః + ప్రాణంబులు = శరీరమునకు వెలుపలనున్న తనప్రాణములు - అనన్ + ఒప్పు = అనఁదగిన - ప్రాణసమాన లని భావము, ఏకతంబునకున్ = ఏకాంతస్థలమునకు.

శా. రాఁడయ్యెన్ హృదయేశుఁ డీహృదయభారం బెట్లు సైఁతున్ క్షణం
బేఁడై యున్నది యేటికిం దడసెనో § యేవిఘ్నముల్ పుట్టెనో
నేఁ డేఁతెంచుప్రయత్నమున్న నకటా § నీతోడఁ జెప్పండె యె
వ్వాఁ డీరీతి యెఱింగెనో యపుడు నన్ § వాక్రుచ్చి య ట్లాడఁగన్. 146

అర్థము :—హృదయేశుఁడు = ప్రియుఁడు, రాఁడయ్యెన్ = రాలేదు, ఈ హృదయభారంబు = మనస్సునందలి యీబరువు (అనఁగా ఆందోళనాతిశయ మని భావము.) ఎట్లు, సైఁతున్ = సహింతును, క్షణంబు, ఏఁడు + ఐ = ఏఁడాది యట్లై, ఉన్నది, ఏటికిన్, తడసెనో = ఆలసించెనో, ఏవిఘ్నముల్ = ఎట్టిఆటంకములు, పుట్టెనో = కలిగెనో, అకటా = అయ్యో, నేఁడు, ఏఁతెంచుప్రయత్నము = వచ్చెడి సన్నాహము, ఉన్నన్ = ఉన్నచో, నీతోడన్, చెప్పండె = చెప్పకుండునా, అపుడు = నాట్యము తుదిని, నన్ = నన్నును, వాక్రుచ్చి = పేరుపెట్టి, అట్లు, ఆడఁగన్ = పలుకఁగా, ఎవ్వాఁడు = ఎవఁడు, ఈరీతి = ఇట్లు జరుగు విధము, ఎఱింగెనో = తెలిసికొనెనో ?

తాత్పర్యము :—ప్రియుఁడు రాలేదు. మనసున ఉత్కంఠాభారము భరింప లేకుంటిని. క్షణ మొక యేఁడుగా నున్నది. ఎందుచే నాలసించెనో ? ఆటంకము లేవేని పుట్టె నేమొ ? అయ్యో ! నేనెంత మతి లేనిదాననే ? నిజముగాఁ దాను రాఁ దలంచుకొనిన నీతో తప్పక జెప్పియుండఁడా ? అపుడు నాపే రెత్తి యారీతిగా ననుటచే ని ట్లీరాత్రి యిక్కడకు రానున్నాఁ డని ఎవఁడేని తెలిసికొనె నేమో !

అలం. :—కావ్యలింగము, లోకోక్తి.

వి. :—'నీచేతఁ జెప్పింపఁడే' అనిప్రౌఢవ్యాకరణపాఠము. క్త్వార్థేకారసంధికై ('చెప్పి+ఇంపఁడే') చూపఁబడినది. ఆపక్షము గ్రహించినను, తరువాత 'వాఁడరీతి నెఱింగెనో యపుడునన్ వాక్రుచ్చి యట్లాడఁగన్' అని యుండవలెనుగదా ? అర్థ మెట్లు పొసఁగును ? కావున నాపాఠమును ప్రమాదమే.

ఆ సూత్రమునకై యుదాహరించుటయును ప్రమాదమే. ఒకవేళ 'చెప్పంపఁడే' అనుపాఠ మున్నను అది క్త్వార్థకసంధియుఁ గాదు. చెప్పు+అంపు - అని ధాతువునకు ధాతువుకూడి శబ్దపల్లవముగును గాదా?-ముద్రితప్రతులందు చెప్పండె, అనియు 'నీచేత' అనుటకు బదులు 'నీతోడ' అనియు నుండుటచే ప్రౌఢవ్యాకరణ పాఠము దుర్బల మనక తీఱదు.

వ్యా. వి. :—రాఁడయ్యెన్, భూతంబున లజికి లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తంబగు. బాల. క్రియా. 114. - రాఁడయ్యెన్ = వచ్చియుండలేదు - అని భావము.

శా. ఆహా యప్పటి కట్లు నన్ దలఁచెఁ గా ళ్ కంతఃపురంబుల్ సుదు
ర్గాహంబుల్ పెఱవారి, కెట్లు చొరఁ శక్యంబ? యైనఁ గానీ కడున్
మాహాత్మ్యంబున మేటి యంటి వతనిన్ ళ్ దౌవారికాత్యుగ్ర స
న్నాహం బెక్కడ నుండు రావలసినన్ ళ్ రాలేఁడె యెట్లైనియున్. 147

అర్థము:—ఆహా = అయ్యో! (ఇటసంతాపద్యోతకము). అప్పటికిన్, నన్ = నన్నుఁగూర్చి, అట్లు = సులభముగాఁ జేరవచ్చునని, తలఁచెఁగాక = తలఁచెనే కాని, అంతఃపురబుల్ = రాజస్త్రీ లుండు చోటు, పెఱవారికిన్ = ఇతరులకు, సుదుర్గాహంబుల్ = అత్యంతము చొరరానివి, (కాన) చొరన్ = చొచ్చుటకు, ఎట్లు, శక్యంబు = (అతనికి) సాధ్య మగును? ఐనన్ + కానీ = అట్లయినప్పటికిని, మాహాత్మ్యంబునన్ = గొప్పతనముచే, మేటి = శ్రేష్ఠుఁడు, (అని) అతనిన్ - వానినిగూర్చి, అంటివి = చెప్పితివి, (కాన) రావలసినన్ = రా నక్కఱగలిగినయెడల, దౌవారిక + అత్యుగ్రసన్నాహంబు=ద్వారపాలకులయొక్క భయంకరమైనయత్నము, ఎక్కడన్ + ఉండున్ = ఎక్కడను గూడ కలుగ దని భావము. (ఇట నీ యర్థ మంతగా నుచితము కాదు. 'రావలచినన్', అనికాని 'రాఁదలఁచినన్' అనికాని పాఠముండుట లెస్స. 'వలయు, ధాతువునకు 'కోరు' అనునర్థము కాని 'తలఁచు' అను నర్థము కాని కన్పట్టదు.) ఎట్లైనియున్ = ఏవిధముగా నైనను, రాలేఁడె + రాఁజాలఁడా? తప్పకరాఁగలుగు నని భావము.

వ్యా. వి. :—సుదుర్గాహము. అత్యంతము చొర నశక్యమైనది. ఈయర్థమున నఞ్తోఁ గాని యితర పదముతోఁ గాని సమసించినను, సమసింపకున్నను యత్ప్రత్యయము వచ్చి అగాహ్యము, గాహ్యము ఇత్యాది రూపము లొందును. కాని ఈషత్, దుః,సు. అనునవి పూర్వమందున యెడ 'ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్. 3. 3. 126. పాణినీయముచే ఖల్ ప్రత్యయమువచ్చి ఈషద్గాహము, సుగాహము, దుర్గాహము అని విశేషరూపము నొందును. ఇచట 'సు'తోఁ ప్రాది సమాసమై 'సుదుర్గాహము' అని యైనది.

దౌవారికుఁడు. తత్రనియుక్తః 4.4.69 పాణినీయముచే ద్వార శబ్దమునకు ఠక్ప్రత్యయము రాఁగా సిద్ధించిన రూపము.

క. వత్తు నవశ్యము నేఁడని, చిత్తము తమి రేఁచి యంతఁ ళ్ జింత యొకతెపై
హత్తిన నది వృథ పుచ్చినఁ, బుత్తురు మగవారిమాటళ్పొసఁగదు నమ్మన్. 148

అర్థము:—(ఒకతెతో) నేఁడు, అవశ్యము = తప్పక, వత్తును = వచ్చెదను, అని, చిత్తము తమి = మనస్సునందలి వేడుక, రేఁచి = ప్రేరించి, అంతన్ = తోడనే, ఒకతెపైన్ = వేఱొక స్త్రీపైని, చింత = ధ్యానము, తలంపు, హత్తినన్ = గట్టిగా కలుగఁగా, అది = ఆ మొదట వత్తుననిన మాట, వృథపుచ్చినన్ = వ్యర్థము చేసినను, పుత్తురు = చేయఁగలరు, కాన, మగవారిమాట, నమ్మన్ = నమ్ముట, పొసఁగదు = కుదురదు. నమ్మవీలులేదని భావము.

అలం :—అప్రస్తుత ప్రశంస,

వ్యా. వి :—వత్తును, పుత్తురు - (వచ్చు+దును, పుచ్చు+దురు) సూ. చు వర్ణంబుతోడ దుర్థ కారంబు తకారంబగు. బాల. క్రియా. 108 చే వచ్ + తును, పుచ్ + తును. అయి. సూ. 'చకారంబునకు హల్లురాఁబరసవర్ణంబగు (శబ్దలక్షణ సంగ్రహము. 5.63. వత్+తును, వత్తును, పుత్+తును = పుత్తును, అగును. వృథపుచ్చినన్ వృథపుత్తురు. అనుటకు మాఱుగా వృథపుచ్చినన్ పుత్తురు అని ప్రయుక్తమైనది. సూ. శబ్ద పల్లవ క్రియలును ద్వ్యవయవ క్రియలును బునర్గృహీతంబు లగుచో దత్పూర్వావయవంబులకు లోపంబగు. ప్రౌఢ. క్రియా—25 చే శబ్దపల్లవక్రియ కాన సాధువైనది.

క. అనఘాత్మకుఁ డతఁ డాతని, నన నే మున్నది మదీయకమైన యదృష్టం
బును దూఱుట గా కెట్లది, యొనర్ప నున్నదియొ చంద్రికోగ్రదవాగ్నిన్. 149

అర్థము:—అతఁడు, అనఘాత్మకుఁడు = పాపములేని మనస్సు గలవాఁడు, మాట యిచ్చి మోసపుచ్చునట్టివాఁడు కాఁడు అని భావము. మదీయము=నాయది, ఐన యదృష్టంబును = వెనుకజన్మమున జేసికొన్న కర్మమును, దూఱుట = నిందించుట, (తగును) కాక = కాని, అతనిన్ = అట్టియుత్తముని, అనన్ = నిందింపఁగా, ఏమి = ఎట్టిప్రయోజనము, ఉన్నది, అది = నాయదృష్టము, చంద్రికోగ్ర దవాగ్నిన్ = వెన్నెల యనెడు భయంకరమగు కార్చిచ్చునందు, ఎట్లు = ఏరీతి, ఒనర్ప నున్నదియొ = చేయ నున్నదో !

తాత్పర్యము:—అతఁ డేపాపచింత లేనివాఁడు. అట్టియెడ నాయదృష్ట మిట్టిదయ్యె నని దానిని నిందించుట తగును గాని అతని నిందింప నేమి ప్రయోజనము? ఆ నాయదృష్ట మీ దవాగ్నివంటి వెన్నెలయం దేరీతిగా చేయనున్నదో కదా ?

అలం:—ఆక్షేపము, రూపకము.

వ. అని చంద్రు నుద్దేశించి.

అర్థము:—సుగమము.

క. నీశైత్యము నమ్మితి న,త్యాశన్ హిమధాముఁడును సుధాంశుఁ డనంగా
నో శశధర! యేలా ఘృత, కోశాతకి వయ్యె దేమి కగూడెడు దీనన్. 151

అర్థము:—ఓ శశధర = (కుందేటిని దాల్చిన) ఓచంద్రా ! (నిన్ను) హిమధాముఁడును = చల్లని కాంతిగల వాఁడును, సుధాంశుఁడును = అమృతరూపమైన కిరణములుగలవాఁడును, అనంగాన్ = అని (జనులు) పల్కఁగా, అత్యాశన్ = పేరాసతో, నీశైత్యమున్ = నీచల్లఁదనమును, నమ్మితిన్ = నీయందుఁ దప్పక చలువ యుండు నని నమ్మితి నని భావము. ఘృతకోశాతకివి = నేతిబీఱకాయవు, ఏల = ఎందులకు, అయ్యెదు = అయ్యెదవు, దీనన్ = అట్లు చల్లఁదనముగలవాఁడ వనుపే రిట్లు వ్యర్థము చేసికొనుటచే, ఏమి= ఏలాభము, కూడెడున్ = కలుగును ? ఏమియు కలుగదు. మీఁదుమిక్కిలి నింద రాఁగలదు అనివ్యంగ్యము.

అలం:—హిమధాముఁడు, సుధాంశుఁడు అను రెండువిశేషణములును సాభిప్రాయము లగుటచే పరికరాలంకారము. నేతి బీఱకాయ వంటివాఁడ వనక నేతిబీఱకాయవే అనుటచే నిదర్శనముఁ గూడఁ గలదు.

వి. :—నేతిబీరకాయ యని సంజ్ఞయే కాని దానియందు నేయిలేనట్లే హిమధాముఁడ వనియు, సుధాంశుఁడ వనియు పేరుమాత్రమే కాని నీయందుఁ జలువయు, సుఖమును గలిగించుశక్తియుఁ గూడ లేవు అనిభావము,

క. చలువ యొనరించినంతయు, ఫల ముష్ణత విడువు మదియ § పదివే లింకన్
జలిపందిరి వెట్టుట కడ, వలఁ బోమొత్తమియె మాకు § వనజారాతీ! R.C 152

అర్థము:—వనజారాతీ = నీటఁ బుట్టినతామరలకు పగవాఁడా, చంద్రా, ఉష్ణతన్ = వేఁడిని, విడువుము, అట్లువిడిచితివా - చలువ యొనరించినంత + అ + ఫలము = చల్లఁదనము కావించినంత - (కలిగించినంత) లాభమే యగును. ఇదియ = క్రొత్తగా వేఁడిని దాల్పనట్టి యీ చిన్నపనియె, ఇంకన్, మాకున్, పదివేలు = పదివేలమడుఁగులు మేలు చేసినట్లు (అగును). కడవలన్ = నీటికుండలను, పోన్ - మొత్తమియె = పగులఁగొట్టకుండుటే, చలిపందిరి = చలివేంద్ర, ప్రప, పెట్టుట = నెలకొల్పుట.

తాత్పర్యము:—ఓ చంద్రా! నీవు నీటఁ బుట్టినతామరలకు విరోధివి - నీ వీ వెచ్చఁదనము విడిచితివేని చల్లఁదన మిచ్చినంతటి పుణ్యము. అట్లొనర్చితివా? పదివేలరెట్లు మేలు చేసినట్లు సంతసింతును. చలిపందిరి లోని నీటికడవలను బగులఁ గొట్టకున్నచో చలిపందిరి పెట్టినంత పుణ్యము.

అలం:—పరికరాంకురము, ఉల్లాసము, లోకోక్తి.

సీ. శ్యామకంఠలలాట § సామీప్య పరితప్య, మానంబులుగఁ గళల్ § మార్చి మార్చి
సింధూదకాంత స్సమింధన బడబాన, లోగ్ర కీలలసెగ § నూని యూని
ప్రత్యమావాస్య సంభవ దర్కసంయోగ, కలితాధికోష్ణిమఁ § గ్రాఁగి క్రాఁగి
విప్రయోగోష్ణ పాంథప్రాణ పరిపాన, భూమజం బగుకాఁక § పొంది పొంది

కాలకూటాహ్వయభ్రాత § పాలుపట్టి, పుచ్చుకొనుదాహకత్వంబు § ప్రోచి ప్రోచి
యింతవేఁడిమి సాధించితేమొ చంద్ర, నన్ను వేఁచుటకే ప్రయత్నంబుతోడ.

అర్థము:—చంద్ర - (ఇదిసంబోధనము) శ్యామ...మానంబులుగన్ - శ్యామకంఠ = (నల్లనికంఠము గలవాఁడు) శివునియొక్క, లలాట = నొసటి (యందలిమూఁడవకంటి యగ్ని)యొక్క, సామీప్య=చేరువను, పరితప్యమానంబులుగన్ = మిక్కిలి కాల్పఁబడుచున్న వగునట్లు, వేఁడెక్కునట్లు, మార్చి మార్చి = (అన్నికళలకు వేఁడి యెక్కునట్లు శివుని మూఁడవకంటియగ్ని చేరువ నొక్కొక్కటియే నుంచుచు) మార్పు చేసి, చేసి, సింధూ...సెగ - సింధూదక = సముద్రపునీటియొక్క, అంతః = లోపల, సమింధన = మండు చుండునట్టి, బడబానలి = ఆఁడుగుఱ్ఱముయొక్క యాకృతిగల యగ్నియొక్క, ఉగ్ర = భయంకరమైన, కీలల = మంటలయొక్క, సెగను = వేఁడిని, ఊని యూని = మిగులవహించి, ప్రత్యమా...కోష్ణిమన్ - ప్రత్యమావాస్య = అన్ని యమావాస్యలయందును (సూర్యచంద్రు లేకస్థానమున నుండు తిథి యమావాస్య) సంభవత్ = కలుగుచున్న, అర్క = సూర్యునియొక్క, సంయోగ = కలయికచే, కలిత = పొందఁబడిన, అధిక + ఉష్ణిమన్ = పెద్దదగువేఁడిచేత, క్రాఁగి క్రాఁగి = మిక్కిలిగాకాలి, విప్ర...భూమజంబు - విప్ర యోగ = ఎడఁబాటుచేత, ఉష్ణ = వెచ్చనైన, పాంథప్రాణ = వియోగుల ప్రాణవాయువులయొక్క, పరిపాన = త్రాగుటయొక్క, భూమజంబు = ఆధిక్యమువలనఁబుట్టినది, అగు కాఁక = ఉష్ణతను, పొంది పొంది = ఎక్కువగాఁబొంది, కాలకూటాహ్వయభ్రాత = హాలాహలవిషమను సోదరునితోడి, పాలు = భాగముగా, పట్టి, పుచ్చుకొను దాహకత్వంబు = పుచ్చుకొనిన కాల్చెడుశక్తిని, ప్రోచిప్రోచి = బాగుగాఁ బెంచి, నన్నున్, వేఁచుటకే = కాల్చుటకే, ప్రయత్నంబుతోడన్ =మిక్కిలిజతనముతో, ఇంతవేఁడిమి = ఇంతయధికమగువేఁడిని, సాధించితి + ఏమొ = సంపాదించితివేమో కదా!

తాత్పర్యము:—చంద్రా! శివునిలలాటనేత్రము దగ్గఱగా నొక్కొక్కకళనే మార్చి మార్చిబాగుగా కాల్చియును, సముద్రోదకములలోపలనుండు బడబాగ్నియొక్క భయంకరమగు మంటలవేఁడిని వహించియు

ఎల్లయమావాస్యలందును సూర్యునితో కలియుటచేత కలిగిన హెచ్చువేఁడిచే బాగుగా కొలియును, నాయి కల నెడఁబొసిన బాటసారుల వేఁడిప్రాణవాయువులను త్రాగుటవలనివేఁడిని బొందియు, హాలహలమను సోదరునితో భాగముగాఁ గొన్న కొల్చుటయనుశక్తిని బాగుగా వృద్ధిచేసియు, ఇంత వేఁడిమి సంపాదించి తివిగదా! ఇది యంతయు నన్నుఁదపింపఁజేయుటకయియే చేసితివా ?

అలం:—సంబంధాతిశయోక్తి, ఫలోత్ప్రేక్ష.

వి. :—బడబానలము:—మన్మథుని దహించినపిదప శివుని నేత్రాగ్ని జగత్తును గూడఁ గాల్పఁబూన బ్రహ్మ యాయగ్నిని బడబా (ఆఁడుగుఱ్ఱము) రూపమునఁ జేసి సముద్రునితో దీనిని నీయందు దాఁచి యుంపుము. నీనీరే దీని కాహారముగా నీయం దుండును. నేను వచ్చి చెప్పినప్పు డీబడబాముఖ మగునగ్నిని విడువుము. అనినట్లు కాలికాపురాణము 41 అధ్యాయమునఁగలదు.

అమావాస్య:—(అమా=సహ, వసతోఽస్యాంచంద్రార్కౌ) సూర్యచంద్రు లీతిథియందు కూడి యుందురు. కాన అమావాస్య అని వ్యుత్పత్తి రూపాంతరములు, అమావస్య, అమామాస్యా, అమామస్య.

ప్రాణము వాయురూపము గాన దానిని త్రాగితివి యని చెప్పుటవలన చంద్రునియందు సర్పత్వము, క్రౌర్యము వ్యంగ్యములు.

చ. ప్రథమకళల్ నెలన్ నెల నుపాయన మిచ్చుచు వహ్నిసూర్యులన్
బృథుతరమైన మైత్రిఁ గడుఁబ్రీతులఁ జేయుట యీదృశోష్ణిమ
ప్రథమఫలీభవ ద్విరహిబాధకె కావలయున్ శశాంక ! యీ
పృథివి నధర్మికెన్నఁ బరపీడయె యుత్తమలాభ మెప్పుడున్. 154

అర్థము:—శశాంక = (కుందేలు గుర్తుగాఁగలవాఁడా) చంద్రా ! ప్రథమకళల్ = మొదటి కళలను (మొదటి రెంటిని అని ప్రకృతము), నెలనెలన్ = ప్రతిమాసమందును, ఉపాయనము = కానుకగా, ఇచ్చుచున్, వహ్నిసూర్యులన్ = అగ్నిని, సూర్యుని, పృథుతరము = మిగులఁ బెద్దది, ఐనమైత్రిన్ = అయినట్టి స్నేహముచేత, కడున్ = మిగుల, ప్రీతులన్ = సంతసించిన వారినిగా (లేక తృప్తులనుగా) చేయుట - (ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవిః అని ప్రసిద్ధము) ఈదృశో ... బాధకె - ఈదృశ = ఇటువంటి; ఉష్ణిమ = వేఁడికి, ప్రథమ ఫలీభవత్ = మొదటి ఫలమగుచున్న, విరహిబాధకున్ + ఎ = విరహులకు పీడగల్గించుటకే, కావలయున్ = అయి యుండును. (అట్లు పీడించుటవలన లాభమేమియన) - ఈ పృథివిన్= ఈ భూమియందు (సర్వసామాన్యముగా జరుగుచున్నది.) ఎన్నన్ = గణింపఁగా, ఎప్పుడున్ = సదా, అధర్మికిన్ = పాపాత్మునకు, పరపీడయె = ఇతరులను బాధించుటయే, ఉత్తమ లాభము = గొప్ప లాభము.

తాత్పర్యము:—చంద్రా ! అగ్నికిని సూర్యునకును, ఇతరదేవతలకంటె ముందుగా మొదటికళలను కానుకగా నిచ్చి ప్రతిమాసమునందును మిగుల మిత్రత్వముతో వారిని తృప్తులను చేయుచున్నందులకు మొదటి ఫలముగా - వారివలనఁ బ్రాప్తమైన దుర్భరమగు వేఁడిచేత విరహులను బాధించుచుంటివి. పాప శీలునకు పరపీడయే పరమ లాభము గదా ! (పాపాత్ముఁడితరులు దుఃఖపడుచున్నచో చూచి సంతసించును. అదియేవానికి లాభము. అగ్నివలన సూర్యునివలన నీవు పొందినవేఁడికి మొదటి లాభమేమన - విరహులను బాధించుటయే. వారు దుఃఖపడుచున్నచో నీకు సంతోషమన్నమాట.)

అలం:—ఉత్ప్రేక్ష, అర్థాంతర న్యాసము.

వ్యా. వి. :—ఫలీభవత్ = ఫలముకానిది ఫలముగా నగుచున్న, అని అభూత తద్భావమునఁ చ్విప్రత్యయము. భూధాత్వనుబంధమును గలిగినది - ధర్మము = పుణ్యము - కానిది, అధర్మము=పాపము

శీలముగాఁగలవాఁడు అను నర్థమున ఇన్ ప్రత్యయము రాఁగా అధర్మి యయ్యెను. పాపస్వభావుఁ డని ఫలితార్థము.

చ. చలువయె భ్రాంతిమూలము నిశాకర! యింకొకఁ డెన్నిచూడఁ గే
వలమును వేఁడిపుం బ్రకృతివాఁడవ యెట్లనినన్ జకోరముల్
వెలయుఁ గడంక నీయుడుకువెన్నెల జుఱ్ఱుచు దానఁజేసి కాఁ
కలవడ, శైత్యముల్ మరగినట్టివి నిప్పుల మేఁత కోర్చునే. 155

అర్థము:—నిశాకర = (రాత్రిని జేయువాఁడా) చంద్రా! చలువయే = నీయందుఁ జల్లదనమే కలదనుట, భ్రాంతిమూలము = భ్రాంతికారణముగాఁ గలది, (ఉన్నది లేనట్లును లేనిది యున్నట్లును గోచరించుట భ్రాంతి) ఇంకన్ + ఒకఁడు = మఱియొకటి (విశేషము) ఎన్ని చూడఁగాన్ = పరిశీలింపఁగా, కేవలమును = అచ్చముగా, వేఁడిపుం బ్రకృతివాడవు + అ = వేఁడి స్వభావముగలవాఁడవే (సుమీ) ఎట్లు + అనినన్ = అది యెట్లనినయెడల, చకోరముల్ = వెన్నెలపులుఁగులు, నీయుడుకు వెన్నెలన్ = వేఁడి దగు నీవెన్నెలను, కడంకన్ = పూనికతో, జుఱ్ఱుచున్ = నోటితో నెగఁబీల్చుచు, దానఁజేసి = ఆకారణమున, కాఁక = వేఁడి, ఉష్ణత, అలవడన్ = అలవాటుకాఁగా, వెలయున్ = ప్రసిద్ధి నొంది యున్నవి, శైత్యముల్ = చలువలు, చలువగల పదార్థములు, మరగినట్టివి = అలవాటుపడినవి, (అయినచో) నిప్పుల మేఁతకున్ = నిప్పులనుదినుటకు, ఓర్చునే = సహించునా ?

తాత్పర్యము:—చంద్రా! నీయందు చల్లఁదన మున్న దనుట పెద్దభ్రమ. పరిశీలింప నింకొక విశేషము! అచ్చముగా వేఁడిప్రకృతివాఁడవు కూడను. ఏ మనిన - (చకోరములు వెన్నెలఁ ద్రాగుననియు, నిప్పులు తినుననియు వర్ణించుట కవిసమయము.) వెన్నెలపులుఁగులు నీయుడుకువెన్నెల జుఱ్ఱుట కలవడినవి కావుననే నిప్పులను మేయఁగలుగుచున్నవి. వెన్నెలలో చలువయే యుండి, చకోరములు దానికే యలవడి నచో నిప్పులను మేయుట కోర్వఁగలవా ? కావున నీయందుఁ జల్లదనము లేకపోవుటయేకాదు. ఉన్న దంతయు వేఁడియే యనియు నీ వుష్ణ ప్రకృతివాఁడ వనియుఁ దెలియుచున్నది.

అలం:—హేత్వపహ్నవము, కావ్యలింగము.

మ. ఇటుగా కొక్కొక కాలదోషమున నో ! నేమో విపర్యాస మ
న్నిటియందున్ మలయానిలుండు నిదిగో ! నెమ్మేనికిం జాల ను
త్కటతాపం బొనరింపఁజొచ్చె నిదియుం ! ద్వచ్చంద్రికాజాల సం
ఘటనాదౌష్ట్యమొ రాజధర్మ మనుచుం ! గ్రౌర్యంబుఁ దాఁ బూనెనో. 156

అర్థము:—ఇటుగాక = నీవు వేంఁడపుఁబ్రకృతివాఁడవగుటయేకాక, ఒక్కొక కాలదోషమునన్ = ఒకొక్క కాలమందలి చెడ్డతనముచే, అన్నింటియందున్, విపర్యాసము = వ్యత్యాసము, తలక్రిందు, కానేమో, ఇదిగో, మలయానిలుండును = మలయపర్వతమునుండి వచ్చు గాలిసైతము, నెమ్మేనికిన్ (నెఱ+మేనికిన్) ఎల్లశరీరమునకును, ఉత్కటతాపంబును = అధికమగు నుడుకును, చాలన్ = అధికముగా, బొనరింపఁ జొచ్చెను = కలిగింపఁ బూనెను, ఇదియున్ = ఇట్లు కలిగించుటగూడను, త్వచ్చంద్రికాజాల సంఘటనాదౌష్ట్యమొ = నీవెన్నెలగుంపుయొక్క కూడికవలనఁ గల్గిన చెడ్డతనమో, (లేక) రాజధర్మము = ప్రభుధర్మము, చంద్రధర్మము అనియు రెండర్థములు. అనుచున్, తాన్ = ఆమలయానిలుఁడు, క్రౌర్యమున్ = క్రూరతను, పూనెనో = వహించెనో.

తాత్పర్యము:— నీవు వేఁడి ప్రకృతివాఁడవు వౌటయే కాదు. ఒక్కొక్క కాలమునఁ గలుగు చెష్టితనముచే అన్నిటియందును, వ్యత్యాసము కలుగును కాఁబోలును. ఇదిగో మలయానిలుఁడుగూడ నామేనికి మిగుల సంతాపము కలిగించుచున్నాఁడు. ఇది నీ వెన్నెల సంపర్కమునఁగల్గిన కీడో, లేక రాజధర్మము గదా యని తానును నీవలె క్రౌర్యమును వహించెనో - తెలియదు. ('యథారాజా తథాప్రజాః, అనికదా)

అలం. :—అర్థాంతరన్యాసము, విషమము, శ్లేషానుప్రాణిత మగుసందేహము.

వ. అని దక్షిణానిలు నుద్దేశించి. 157

అర్థము:—అని = అట్లు చంద్రుని నిందించి, దక్షిణానిలున్ = దక్షిణదిశనుండి వచ్చు మలయ వాయువును, ఉద్దేశించి = గుఱిచేసి.

క. తలఁప జగత్ప్రాణుఁడవై, వెలసిన నీ విట్లు నన్నుఁ వేఁచుట తగునే
యిల వెలుఁగు చేను మేసిన, మలయానిల యెద్ది కాఁపుఁ మదిఁ జింతింపన్. 158

అర్థము:—మలయానిల = ఓమలయవాయువా, తలఁపన్, జగత్ప్రాణుఁడవు = జగత్తులకుఁ బ్రాణమవు, జీవశక్తివి - ఐ, వెలసిన నీవు = ప్రసిద్ధికెక్కినట్టి నీవు, నన్నున్ = బాలికనగు నన్నును, వేఁచుట = తపింపఁజేయుట, తగునే? ఇలన్ = భూమియందు, వెలుఁగు = చేని రక్షకై చుట్టును ప్రాఁతినకంచెయే, చేను, మేసినన్ = తినినచో, మదిన్ + చింతింపన్=ఆలోచింపఁగా, కాఁపు=రక్షించు నది, ఎద్ది = ఏది కలుగును ?

తాత్పర్యము:—ఓమలయవాయువా ! నీవు జగములందలి సకలప్రాణులకు ప్రాణమవు గదా, ఆ ప్రాణులలో నొకబాల నైన న న్నిట్లు తపింపఁజేయుట తగునా ? పశువులు వచ్చి చేను మేయకుండ చేనిచుట్టు నేర్పఱచిన కంచెయే యాచేను మేసివేసినయెడల దానిని కాపాడున దేదియుండును ?

అలం:—పరికరాంకురము, లోకోక్తి, దృష్టాంతము.

వ. అని యతని వేఁడిమి మాన్పుటకై యనేక ప్రకారంబులం దూఱియుం బ్రార్థించియు గుణంబు గానక విసివి యి ట్లనియె. 159

అర్థము:—అని, దూఱియున్ = నిందించియును, ప్రార్థించియున్ = బతిమాలియును, గుణంబు = మంచితనము, కానక = చూడజాలక.

సీ. అంతకాశాసమాశ్రయాతత్వ మరసినఁ, జలువకు నీకును జాలదవ్వ
రౌద్రమూర్తిత్వవార్తలు విచారించినఁ, జలువకు నీకును జాలదవ్వ
దహనసారథ్య తత్పరత భావించినఁ, జలువకు నీకును జాలదవ్వ
శ్రీఖండ విషధరోచ్ఛిష్టత యెంచినఁ, జలువకు నీకును జాలదవ్వ
గీ. పలుకు లేటికి నీయందు మలయపవన, చలువగల దనునట్టి సంశయము దగదు
వసుధ నెందైనఁ జండాల వాటియందు, బ్రాహ్మణగృహంబు వెదకుట భ్రాంతిగాదె.

అర్థము:—మలయపవన = మలయగిరినుండివచ్చు నోవాయువా ! అంతకాశాసమాయాతత్వము - అంతక = ప్రాణులను జంపునట్టి యమునియొక్క, ఆశా = దిక్కగు దక్షిణమున నుండి, సమాయాతత్వము=

వచ్చుట, అరసినన్ = పరిశీలించినను, రౌద్ర ... వార్తః - రౌద్ర = అందఱను దుఃఖపెట్టువాఁడగు శివుని దగు, మూర్తిత్వ=శరీరమగుటయొక్క, వార్తలు=వృత్తాంతములు, విచారించినన్ = ఆలోచించినను - (శివుని యష్టమూర్తులలో వాయు వొకటి కౌన.) దహనసారథ్య తత్పరతన్ = సకలమును కాల్చివేయునట్టి యగ్నియొక్క రథచోదకత్వమునం దాసక్తిగల్గుటను, భావించినన్ = తలంచినను, శ్రీఖండ ... చ్ఛిష్టత - శ్రీఖండ = మంచిగంధపుఁ గొండయందలి, విషధర = విషము నోట ధరించియుండు పాములయొక్క ఉచ్ఛిష్టతన్ = ఎంగిలి యగుటను, ఎంచినన్ = ఆలోచించినను, చలువకును, నీకును, చాలదవ్వు=మిక్కిలి, దూరము, సంబంధములేదు అని భావము, పలుకులు = (పెక్కు) మాటలు, ఏటికిన్ = ఎందులకు? నీయందున్, చలువ, కలదు = కలదేమో, అనునట్టి, సంశయము = సందేహముకూడ, తగదు = కూడదు, వసుధన్=భూమియందు, ఎందైనన్=ఎక్కడనైనను, చండాలవాటిలోనన్ = మాలపల్లెయందు, బ్రాహ్మణ గృహంబును, వెదకుట, భ్రాంతి = (మతి) భ్రమణము, కాదె = తప్పకయగు నని భావము.

తాత్పర్యము:—సకలప్రాణులను సంహరించు యముని దిక్కునుండి నీరాక. జగము లన్నిటి నేడ్పించు శివుని యెనిమిది దేహములలో నీ వొకటి. అన్నిటిని దహించు నగ్నికి సారథివి నీవు. మలయగిరి యందలి పాముల విషపు నోళ్లచే ఎంగిలిచేయఁబడు వాఁడవు. ఇట్టి మహోగ్ర స్వరూపులతో నిత్య సంబంధముగల నీయందు చలువ యుండు ననుమాట నమ్మరానిది. ఎచటనైనను గాని మాలపల్లెలో బ్రాహ్మణ గృహమును వెదకుట వెఱ్ఱిగాదా?

అలం. :—పరికరాంకురము, విషమము, అపహ్నవము, దృష్టాంతము.

వి. :—యముని దిక్కునకు వెళ్లు ప్రతి ప్రాణియుఁ జావవలసినదే. అట్టియెడ నా దిక్కున నుండి బ్రతికి వచ్చుచున్నవాఁడనిన యమునికంటెఁ గాని, యమునియంత గాని, క్రూరుఁడు కానిదే రాలేఁడని వ్యంగ్యము.

రుద్రుఁడు - రోదయతీతి - రుద్ + ణిచ్ - సూ. రోదేర్ణిలుక్చ. ఉణాది. 2-20. ఇతి రక్ప్రత్యయః- రుద్రః - జగములను రోదింపఁజేయు వాఁడు. అని శాకటాయనాదుల మతము. పురాణములందు 'బ్రహ్మ సృష్టి చేయునపుడు క్రోధముతో నున్న సమయమున నీలలోహితుఁడు పుట్టి వెంటనే రోదనము చెయ రుద్రుఁడని నామకరణ మొనర్చె ననియు, అతఁడు శివుని యవతార మనియుఁ గలదు. ప్రకృతమునఁ బురాణ వ్యుత్పత్తి కంటె శాకటాయన వ్యుత్పత్తియే సమంజసముగా నున్నది.

ఉ. దక్షిణ గంధవాహ నినుఁ దన్మలయద్రుమరూఢ గూఢపా
ద్భక్షణ నింత కెంతయు నపాయము పొందదె పొందకుండఁగా
నిక్షుశరాసనుండు విరహిశ్వసితోపచయక్రియన్ విము
క్తక్షయుఁ జేసెఁ గావలయుఁ గాక తదుష్ణత నుష్ణ మెక్కఁగన్. 162

అర్థము:—దక్షిణగంధవాహ = ఓ దక్షిణవాయువా! తన్మలయ...భక్షణన్ - తత్ = ఆమలయగిరి యందలి, మలయద్రుమ = మంచి గంధపుఁ జెట్లయందు, రూఢ = పుట్టిన, గూఢపాత్=పాములయొక్క, భక్షణన్ = తినుటచేత, నినున్ = నిన్ను, ఇంతకున్ = ఈపాటికి, ఈ నాఁటివఱకు, అని భావము, ఎంతయున్ + అపాయము = గొప్పదగు హాని, పొందకుండఁగాన్ =కలుగకుండునట్లు, ఇక్షుశరాసనుండు= చెఱకు విల్లుగాఁగల మన్మథుఁడు, విరహిశ్వసితోపచయక్రియన్ = విరహి జనులయొక్క నిట్టూర్పు గాడ్పులవలన పుష్టికలుగునట్లు చేయుచికిత్సచేతను, తదుష్ణతన్ (తత్ + ఉష్ణతన్)=విరహుల యా నిట్టూర్పు లందలి వేడిచేత, ఉష్ణము = వేఁడి, ఎక్కఁగన్ = (నీ శరీరమున) కలుగునట్లుగా (చేసి), విముక్తక్షయున్= విడువఁబడినకృశత్వముగలవానినిగా - క్షయవ్యాధినుండి విడువఁబడిన వానినిగా, చేసెన్ + కావలయును +

కాక = చేసి యుండవచ్చును. (కాక - అనునది వాక్యాలంకారము) - లేకున్న పాము కఱచుటచే నీపాటికి మరణించియే యుందువు - అని భావము.

తాత్పర్యము:— ఓరీ! దక్షిణవాయువా! మలయపర్వతమందలి మంచి గంధపుచెట్లయందలి పాములు నిన్నుఁ గఱచినను నీవు చావకుండుటకు కారణము - మన్మథుఁడు వియోగులకు నిట్టూర్పు గాడ్పులను హెచ్చుచేసి, ఆ గాడ్పులచేత నీకు పుష్టిని, ఆ గాలులందలి వేఁడిచేత నీకుఁ జలువలు గ్రమ్మకుండ వేఁడిని, వృద్ధిపొందించుచుండుటయే యగును. లేకున్న నీపాటికి నపాయ మొందియే యుందువు.

వి. :—పాము కఱచినచో ఆ విషముచేత రక్తము విఱిగిపోయి వాతము శరీర మంతయును గ్రమ్ముట వలన దేహి మరణించుట సామాన్యము. ఇచట దక్షిణవాయువును క్షీణించిపోకుండ విరహులయొక్క నిట్టూర్పుగాడ్పులచే పుష్టియును, విషముచే వాతము గ్రమ్మకుండ వెచ్చని విరహుల యూర్పుగాడ్పులచే వేఁడియును కలిగించి - మన్మథుఁ డుపచార మొనర్చియుండును అని భావము.

అలం. :—ఇందు మన్మథునియందు వైద్యధర్మమును వాయువునందు సర్పదష్టుఁడైనవాని ధర్మములును స్ఫురించునటుల చెప్పఁబడుటచే సమాసోక్తి.

పాము కఱచినను వాయువు చావకుండె ననువాక్యమునకు విరహులయొక్క వెచ్చని నిట్టూర్పు గాడ్పులచే - ఉష్ణతయు, పుష్టియు మన్మథుఁడుకలిగించినాఁ డనువాక్యము హేతు వగుటచే కావ్యలింగము. అట్లయి యుండునను సంభావనచే ఉత్ప్రేక్ష. ఇందు కావ్యలింగమునకును ఉత్ప్రేక్షకును అంగాంగి భావము వలన సంకరము. సమాసోక్తికిని, ఉత్ప్రేక్షకును సంసృష్టి.

వ. అని మలయ సమీరు నుపాలంభించి. 163

అర్థము:—మలయ సమీరున్ = మలయ పర్వతమునుండి వచ్చుగాలిని, ఉపాలంభించి = నిందించి.

## ఆ శ్వా సాం త ము

శా. పాథోరాశిగభీరు సద్వితరణ ప్రాగల్భ్య మందారు భూ
నాథాస్థాన విధేయవర్తను నపైనః పద్ధతీ వర్తనున్
యాథాతథ్య విధప్రయోగ వివిధోపాయార్జితద్విణ్మదో
న్మాథఖ్యాతసునీతికౌశలు నసహ్నాగ్రచ్ఛిదాపేశలున్. 164

అర్థము:— పాథోరాశిగభీరున్ = సముద్రమువలె లోఁతైనవానిని - (లోఁతుగుండెకలవానిని అని భావము.) సద్వితరణ ... మందారున్ - సత్ = యోగ్యమైన, వితరణ = ఈవి యందలి, ప్రాగల్భ్య = నేర్పువిషయమున, మందారున్ = కల్పవృక్షమైనవానిని, భూ...వర్తనున్ - భూనాథ = రాజులయొక్క, ఆస్థాన = సభలయందు, విధేయ = అడఁకువగల, వర్తనున్ = నడవడి గలవానిని, అపైనః...వర్తనున్ - అప + ఏనః = పాపరహితమైన - (పుణ్యప్రదమైన), పద్ధతీ = మార్గమందు, వర్తనున్ = సంచరించువానిని, యాథా ... కౌశలున్ - యాథాతథ్య = సత్యముయొక్క, విధ = సమృద్ధిగల, (ని. విధా గజాన్నే ఋద్ధౌచ ప్రకారే వేతనే విధౌ. అని విశ్వనిఘంటువు.) ప్రయోగ=వ్యవహారముగలది (ఇదినీతికి విశేషణము.) వివిధోపాయ = సామాదులగు పెక్కుపాయములచేతను, ఆర్జిత = సంపాదింపఁబడిన, ద్విట్ + మద = శత్రువులగర్వముయొక్క, ఉన్మాథ = నాశనముచేత, ఖ్యాత = ప్రసిద్ధికెక్కిన, సునీతి = ఉత్తమనీతి యందు, కౌశలున్ = నేర్పుగలవానిని, (ఎల్లప్పుడు సత్యముతోనే వ్యవహరించుచు, సామాద్యుపాయములచే

పగవారిగర్వమును హరింపఁగల నీతిశాస్త్రవేత్తయు ననిభావము) అసన్మార్గ = దుష్టమార్గమును (లేక దుష్టుల యొక్కమార్గమును) ఛిదా=ఛేదించుటయందు, పేశలున్ =నేర్పుగలవానిని. (ని. దక్షేతు చతుర పేశలపటవః. అని అమరము.)

తాత్పర్యము:— సముద్రమువలె లోఁతుగుండెతనము గలిగి కామాదులకు వశముకానివానిని ఉత్తమదాన నైపుణియందు కల్పవృక్షము వంటి వానిని, రాజసభలం దడఁకువతో సంచరించువానిని, కూట నీతిగాక - సత్యమైన ప్రయోగముతోఁ గూడిన చతురుపాయములచే శత్రుగర్వము హరించు ప్రసిద్ధి గల్గిన యుత్తమనీతి చాతుర్యము గలవానిని, చెడ్డత్రోవల మాన్పిన నేర్పరిని - (అమరామాత్యుని).

వ్యా. వి. :—పద్ధతి - క్తిన్నంతమగు పద్ధతిశబ్దమునకు 'కృదికారాదక్తినః' అను వార్తికముచే 'ఙీష్' అప్రాప్తమగుటచే - ఙీష్ వికల్పముగా ప్రాప్తించుటకై - పద్ధతిశబ్దము బహ్వాదిగణమున పఠింపఁబడి సూ. 'బహ్వాదిభ్యశ్చ - 4. 1. 45 చే పద్ధతీ, పద్ధతి అను రెండురూపములును సాధింపఁబడినవి. యాథా ము, ని. యథార్థంతు యథాతథమ్ అని అమరము. యథాతథముయొక్క భావము - యాథాతథ్యము= సత్యము - విశేష్యము.

క. వ్యాచక్షాణ సుధీజన, వైచక్షణ్యోదయాభివర్ధనవైద
గ్ధీచుంచు రవిజకృతమై, త్రీచుంచు విశృంఖలాష్టదిక్చరకీర్తిన్. 165

అర్థము:—వ్యాచక్షాణ ... కీర్తిన్, వ్యాచక్షాణ = వక్కాణించుచున్న, సుధీజన = పండిత సముదాయము యొక్క, ('పురాణేతిహాస కావ్యాదుల వివరములను తెలుపునట్టి పండితుల యొక్క' అని భావము) వైచక్షణ్య = పాండిత్యము యొక్క, ఉదయ = ఉత్పత్తిని, అభివర్ధన = వృద్ధిఁ బొందించునట్టి, వైదగ్ధీ చుంచు = పాండిత్యముచే ప్రసిద్ధమైనదియును, (అమరామాత్యుని పాండిత్యము పురాణేతిహాసాదులను వివరించి చెప్పఁగల పండితుల పాండిత్యము నభివృద్ధిచేయునది. అనిభావము.) రవిజ = కర్ణునితో, కృత = చేయఁబడిన, మైత్రీ చుంచు=స్నేహముచే ప్రసిద్ధమైనదియు, (దానమందు కర్ణునితో మైత్రి గలది యని భావము.) విశృంఖల = అడ్డులేకుండునట్లు, అష్ట దిక్చర = ఎనిమిది దిక్కులందుఁ దిరుగునట్టిదియు నగు, కీర్తిన్ = కీర్తిగల వానిని.

తాత్పర్యము:—సర్వగ్రంథములను వ్యాఖ్యాన మొనర్చు పండితులకుఁగూడ పాండిత్యమును వృద్ధిచేయు నట్టి పాండిత్యముచేతను, కర్ణునిదానముతో సమమగు దానముచేతను, ప్రసిద్ధికెక్కి యష్ట దిక్కులం దమరామాత్యునికీర్తి చరించుచున్నది. మహాపండితుఁడు, మహాదాత - యని ఫలితార్థము.

వ్యా. వి. :—వ్యాచక్షాణుఁడు - వి + ఆఙ్ పూర్వకచక్షిఙ్ ధాతువుపై - సూ. తాచ్ఛీల్య వయో వచన శక్తిషు చానశ్ 3. 1. 130 అనుపాణినీయముచే - వ్యాచక్షి + ఆన - 'వ్యాచక్షాణ' అనురూపము సిద్ధించును. ఇది "చానశ్" ప్రత్యయాంతము.

మాలిని. అమలమప్రియసూనున్ యామినీశోపమానున్
గమలభవమనీషున్ గణ్యవాక్ప్రౌఢి శేషున్
శమదమగుణనిష్ఠున్ శాస్త్రచింతాగరిష్ఠున్
ప్రమథపతిసుభక్తున్ బ్రహ్మవిద్యానురక్తున్. 166

అర్థము :—అమలమప్రియసూనున్ = అమలమ్మయొక్క ముద్దుబిడ్డఁడైనవానిని, యామినీశోపమానున్ = (రాత్రికి ప్రభువగు) చంద్రుఁడు పోలికగాఁ గలవానిని, కమలభవమనీషున్ = బ్రహ్మయొక్క బుద్ధివంటి బుద్ధిగలవానిని, గణ్య... శేషున్ - గణ్య = లెక్కింపఁదగిన, వాక్=సంభాషణమందలి, ప్రౌఢి =

నేర్పుచేత, శేషున్ = సహస్రముఖములు గల శేషాహివంటివానిని, శమ = అంతరింద్రియనిగ్రహము, దమ = బహిరింద్రియనిగ్రహము, (అను) - గుణ = గుణములందు, విష్ఠున్ = స్థితిగలవానిని, శాస్త్ర = తర్క-వ్యాకరణాది శాస్త్రములయొక్క, చింతా = విచారణముచేత, గరిష్ఠున్ = గొప్పవానిని, ప్రమథపతి = శివునకు, సుభక్తున్ = ఉత్తమభక్తుఁడైనవానిని, బ్రహ్మవిద్యానురక్తున్ = వేదాంతవిద్యలందు ఆసక్తి గలవానిని.

తాత్పర్యము :—అమలమ్మయొక్క ముద్దుబిడ్డఁడును, సౌందర్యమున చంద్రునిబోలినవాఁడును, బ్రహ్మవంటి బుద్ధిమంతుఁడును, సంభాషణమున శేషాహివంటివాఁడును, శమదమాదులుగలిగి, శాస్త్రవిచార మొనర్చుకొనుచు, శివభక్తుఁడై, వేదాంతవిద్యయం దాసక్తుఁడునగు అమరామాత్యుని.

వి. :—అమలమప్రియసూనున్ - అనుచోట - రేఫ సంయుక్త పకారము పరమైనను మకారము లఘూచ్చారణముగానుండిననే ఛందస్సు కుదురును. ఇట్టిదే షష్ఠ్యంతములందును 'సూరప్రధాన ప్రియపుత్రు నకున్' 1 ఆ. 46 వ పద్యమునను గలదు.

## గ ద్య ము

ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్య (జే) గేయ, సూరయనామధేయ ప్రణీతం బైన ప్రభావతీప్రద్యుమ్నం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



# ప్రభావతీ ప్రద్యుమ్నము

## సవ్యాఖ్యానము

### పంచమాశ్వాసము

క. శ్రీఫల తులసీ సక్తుఫ, లా ఫుల్లజ్జాతి విచికిల ప్రముఖ ద్ర
వ్యాఫల్గు కృతేశ్వర పూ,జా ఫలచిద్గణ్యు నమర ♦ సచివవరేణ్యున్. 1

అర్థము:—శ్రీఫల...గణ్యున్ - శ్రీఫల = మారేడుదళములు, తులసీ = తులసిపత్త్రి, సక్తుఫలా = జమ్మియాకులు, ఫుల్లత్ = వికసించుచున్న, జాతి = జాజిపువ్వులు, విచికిల = మల్లెపూవులు, ప్రముఖ = మొదలైన, ద్రవ్య = పూజావస్తువులచేత, అఫల్గు = నిస్సారముకానియట్లు, బలముగా - విరివిగా-అని భావము, కృత = చేయఁబడిన, ఈశ్వరపూజా = శివార్చనమునకు, ఫల = ప్రయోజనమైన, చిత్ = జ్ఞానముచేత, గణ్యున్ = (లెక్కింప) స్తుతింపఁదగినవానిని, అమరసచివవరేణ్యున్ = అమరయమంత్రిశ్రేష్ఠుని. (ముందుఁజెప్పఁబోవు పురుషవాచపదము ద్వితీయాంతముగాన వెనుకటి యాశ్వాసాంతపద్యములందలి విశేషణములును, ఈ యాశ్వాసాదిపద్యములందలి విశేషణములును నా విభక్తియందే కనఁబడుచున్నవి. ఇట్లే వెనుకటియాశ్వాసాంత, తదనంతరాశ్వాసాదిపద్యములందలి విశేషణములును ప్రథమాంతములుగా నుండి యుపక్రమింపఁబడు కథయందలి పురుషునితో కృతిపతి కభేదము చెప్పుటకై యిట్లు కవి స్వీకరించెనని యూహింపఁ దగును. ఇట్టియాచారము నన్నెచోడునికుమారసంభవమునను గానఁబడుచున్నది.

వ. మన్మథు నుద్దేశించి యాకన్యకాతిలకంబు. 2

అర్థము:—కన్యకాతిలకంబు = కన్యలలో మిన్న యగు ప్రభావతి - ఇంతకుమున్ను చంద్రుని మలయానిలమును దూఱినది. ఇప్పుడు మన్మథుని నిందింపఁ దలఁప ప్రద్యుమ్నుఁడే యామన్మథుఁ డగుటచే ని ట్లనుచున్నది.

ఉ. భూనుతలీల రుక్మిణికిఁ ♦ బుట్టి మనోభవ! మత్ప్రియత్వమున్
బూనినవాఁడ వీవ యఁట ♦ పూర్వపు నీయతనుత్వధర్మమున్
మానక యేఁచుచున్న నది ♦ మామకభాగ్యము, ని న్నెటాడఁబో
గా నెటు వచ్చునో తడవఁగా వెఱతున్ గరముల్ మొగిడ్చెదన్. 3

అర్థము:—మనోభవ=ఓ మన్మథుఁడా (మనసునఁబుట్టువాఁడు అని. వ్యు.) రుక్మిణికిన్, భూనుతలీలన్- భూ = భూమియందలి ప్రజలచేత, నుత=కొనియాడఁబడిన, లీలన్=విధమున, పుట్టి, మత్ప్రియత్వమున్ = నాకు పతి యగుటను, పూనినవాఁడవు = పొందినవాఁడవు, నీవ+అఁట = నీవేఁనట, పూర్వపు = వెనుకటి, నీయతనుత్వధర్మమున్ = నీ మన్మథధర్మమును (శరీరములేనివాఁడవై విరహులను బాధించు స్వభావము నన్నమాట) మానక = విడువక, ఏఁచుచున్నన్ = పీడించుచున్నయెడ, అది = ఆ బాధించుట, మామకభాగ్యము = నాదగు నదృష్టము. అంతియకాని, నిన్నున్, ఎటు = ఏ రీతిగా, ఆడఁబోఁగాన్ =

నిందింప నెంచినచో, ఎటు వచ్చునో=ఆ నిందవలన నెట్టి కీడు మూడునో,(కాన) తడవఁగాన్ =చంద్రుని, వాయువును వలె నిన్నుఁ గూర్చి ప్రస్తావించుటకు, వెఱతున్, కరముల్ = రెండుచేతులను, మొగిడ్చెదన్= జోడింతును, (బాధింపకు మని) నమస్కరింతును.

అలం:—కావ్యలింగము 'పూర్వపు నీయతనుత్వధర్మమున్' అనుచో వెనుకటి జన్మమందలి నీ పిశాచత్వమును అని ధ్వని.

వ. అని పలుకుచున్నప్పు డంత కంతకుం బెల్లయిన యాయల్లకభరంబునం బెల్లగిల్లు నుల్లంబు తాల్మి నిల్వరింపం జాలక యబ్బాలాలలామంబు.

అర్థము.— అంతకంతకున్ = క్రమక్రమముగా, పెల్లు = అధికము, ఆయల్లకభరంబునన్ = విరహతాపాతిశయముచే, పెల్లగిల్లు = తొలఁగుచున్న, ఉల్లంబుతాల్మి = మనస్సునందలి ధైర్యమును, నిల్వరింపంజాలక = నిలుపుకొన లేక, ఆ + బాలాలలామంబు = బాలికలలో శ్రేష్ఠురాలగు నా ప్రభావతి.

గీ. నాఁడె చనకుండ లేఖఁ బ్రాణములు నిలిపి, యంత భరపడి వచ్చి నేఁడాత్మవీక్ష
నోర్వరానినాతమికి నట్లొనరఁ బలికి, ప్రియుఁడు తుదకిట్లు విడిచె నన్నియును వృథగ.

అర్థము:—ప్రియుఁడు, ప్రాణములు = నా ప్రాణవాయువులను, నాఁడు + ఎ = హంసిపేర చిలుకచే నుత్తర మంపిన యా దినమందే, చనకుండన్ = పోవకుండ, లేఖన్ = ఉత్తరముచేత, నిలిపి=నిలఁబెట్టి, అంతన్ = పిదప, భరపడి = కష్టపడి, వచ్చి=(నటరూపమున) వచ్చి, నేఁడు, ఆత్మవీక్షన్=తన్ను జూచుటచేత (కలిగిన), ఓర్వరాని = భరింపశక్యము కాని, నాతమికిన్ = నాతహతహ తగ్గుటకై, అట్లు + ఒనరన్ = సభాపతిని స్తుతించు నెపమున ఈరాత్రివత్తునని యర్థము తోఁచునట్లు, పలికి, అన్నియు న = ఈచేసినవియును జెప్పినవియును, వృథగన్ = వట్టివియగునట్లు, తుదకున్ = చివరకు, ఇట్లు, విడిచెన్ = విడిచివేసెను.

తాత్పర్యము:—ప్రియుఁడు నా ప్రాణములను చిలుకచే నంపిన యుత్తరముచేత ఆనాఁడు ముందుగా నిలఁబెట్టినాఁడు. పిదప నానాశ్రమల కోర్చి వచ్చినాఁడు. నాట్యమునఁ దన్ను నేను జూచినప్పుడు పొందిన యుత్కంఠను సభాపతిస్తుతి మిషమున శమింపఁ బలికినాఁడు. ఈ చేసినవి చెప్పినవి సర్వమును వ్యర్థమగునట్లు తుట్టతుద కిట్లు నన్ను విడిచినాఁడు.

వి. 'అన్నియును వృథగ' అనునపు డిఁక నేను జీవింపను గాన సర్వము వ్యర్థము అని తనమరణమును ధ్వనింపఁజేసినది. మఱియు ప్రియుఁ డయ్యును నిట్లొనర్చె ననుటలో నవ్యాజప్రేమ గలవాఁ డని సాభిప్రాయము.

అలం:—పరికరాంకురము. 'విషాదము' అను సంచారిభావము.

మ. అనుచున్ ఱెప్పలు తేలవైచుచు విశుష్యత్కంఠయై రుక్మిణీ
తనయా మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పు మీ
యనుప ల్కించుక నాలుకన్ దడుపుచున్ ప్రాణార్తి దీపింపఁ జ
య్యనఁ బూఁబాన్పున వ్రాలఁబోవుటయు మీనాంకుండు చిత్రంబుగన్. 6

అర్థము:—అనుచున్, ఱెప్పలు = కంటి ఱెప్పలు, తేలవైచుచున్, విశుష్యత్ + కంఠ = శోషించుచున్న (ఎండిపోవుచున్న) కంఠము గలదియై, తాపాతిశయముచే నని భావము. రుక్మిణీతనయా = ఓ ప్రద్యు

మ్నుఁడా, మీఁదటన్+ఐనన్ = ముందు జన్మమందైనను, నీవు+అ=నీవే, పతివై=భర్తవై, తద్ధర్మము = ఆ పతిధర్మమును, ఈడేర్పుమీ = నెఱవేర్పుమా, అను పల్కు = అనుమాటను, నాలుకన్ = నాలుకచేత, ఇంచుక = కొంచెము, తడుపుచున్ = తేమగలదిగాఁ జేయుచు, (తడవుచున్ అనుపాఠము గ్రహించినచో అను పలుకును నాలుక చేతనే నెమ్మదిగా పలుకును - కంఠమెండిపోవుటచేత, అనుకోఁదగును.) ప్రాణార్తి = ప్రాణబాధ, దీపింపన్=ప్రకటముకాఁగా, చయ్యనన్ = తటాలున, పూఁబాన్పునన్ = పువ్వుల సెజ్జపైని, వ్రాలఁ బోవుటయున్ = పడిపోవ నుండఁగా, మీనాంకుండు=చేపటెక్కెము గాఁగల వాఁడు - మన్మథుఁడు, ప్రద్యుమ్నుఁడని యర్థము. చిత్రంబుగన్=వింత యగునట్లు - (మీఁది కన్వయము.)

తాత్పర్యము:—అని పల్కుచు కంటిఱెప్పలు తేలవైచుచు, కంఠమెండిపోవఁగా 'ఓ రుక్మిణీపుత్రా! మీఁదటి జన్మమందైనను నీవే నాకు భర్తవై భర్తృధర్మము అనఁగా నన్నుఁ గాపాడుట యను ధర్మమును నెఱవేర్పుమా అను పలుకును నాలుకచేతఁ దడుపుచు నిఁక ప్రాణము నిలువ దన్నంత బాధ ప్రకటమగునట్లు పువ్వుల పాన్పుపై వ్రాలఁబోవు తఱిని నద్భుత మొదవునట్లు ప్రద్యుమ్నుఁడు.

వి. :—పలుకులను నాలుకచేఁ దడుపుట యనఁగా హృదయమందలి తాపముచే నాలుక యెగిరిపోవుచుండుట వలనఁ దడుపుకొనుచు మాటలాడినది. అనఁగా పలుకలేక పలికిన దని వ్యంగ్యము. ఇందు తాపము, మోహము - అను సంచారిభావములు పూర్వోత్తరార్థములందుఁ జెప్పఁబడెను.

వ్యా. వి. :—పూఁబాన్పు - పూవు+పాన్పు - ప్రాఁతాది సంధి.

వ. సంభ్రమంబునఁ గర్ణోత్పలంబు వెలువడి నిజరూపంబు తోడ. 7

అర్థము:—సంభ్రమంబునన్ = తొట్రుపాటుతో, కర్ణోత్పలంబు - కర్ణ = (ప్రభావతి) చెవియందలి, ఉత్పలంబు = కలువ నుండి, వెలువడి = బయటికి వచ్చి, నిజరూపంబు తోడన్ = తనయొక్కయాకారముతో, మనుష్య రూపముతో నని భావము.

క. హా! తాలిమి వదలెదు సు, మ్మేఁ తెంచియ యున్నవాఁడ ♦ నిదె నీపతి న
నోఁ తరుణి! చూడు మని తా, నాతల్పమునందు నిలిచి ♦ యక్కునఁ జేర్చెన్. 8

అర్థము:—ఓ తరుణి = ఓ యువతీ, హా = అయ్యో (సంతాపార్థకము), తాలిమిన్ = ధైర్యమును (లేక ఓరిమిని), వదలెదుసుమ్ము = విడుతువుసుమా - విడువవల దని భావము, ఇదె = ఇదిగో, ఏఁతెంచియ యున్నవాఁడను = నేను వచ్చియే యున్నాను. నీపతిని = నీకు భర్తనగు, నన్నున్, చూడుము, అని, ఆతల్పమునందున్ = ఆ ప్రభావతి పాన్పునందు, నిలిచి = కూర్చుండి, అక్కునన్ = ఱొమ్మునందు, చేర్చెన్ = (పూఁబాన్పున వ్రాలఁబోవు ప్రభావతిని) చేర్చుకొనెను, కౌఁగిలించుకొనె నని భావము.

వి. :—నిలుచు ధాతువునకు, నిలఁబడుట, కూర్చుండి లేచుట, ఆఁగు మున్నగు నర్థములు ప్రసిద్ధములు. 'కూర్చుండు' అనునర్థము క్వాచిత్కముగాఁ గలదు. ఆయర్థమున నిది ప్రయుక్తము.

మ. అతిశీఘ్రంబున నాలతాంగియుఁ దదీ♦యాలింగనస్పర్శనా
మృతసేకంబున మూర్ఛ దేఱుచు నె యు♦న్నీల్మలన్మహానంద మూ
ర్ఛిత యయ్యెన్ మగుడన్, బదంపడి మదిం ♦ జేష్టల్గనింపంగఁ దాఁ
బఁ గన్ఱెప్పలు విచ్చి చూచి భయకం♦పస్వేద లజ్జాత్మయై.

అర్థము:—ఆ లతాంగియున్ = తీఁగవంటి మేను గల యాప్రభావతియును, తదీ ... సేకంబునన్ - తదీయ = అతనిదైన, ఆలింగన = కౌఁగిటియొక్క, స్పర్శన = తాఁకుటయనెడి, అమృతసేకంబునన్ = అమృతపు స్నానముచేత, అతిశీఘ్రంబునన్ = వెనువెంటనే, మూర్ఛ = మోహము (సొమ్మ) నుండి, తేఱుచున్ = మేల్కొనుచునే - 'చైతన్యము నొందినవెంటనే' అనిభావము. మగుడన్ = మరల, ఉన్మీల ... మూర్ఛిత - ఉన్మీలత్ = ప్రకాశించుచున్న - లేక వికసించుచున్న, మహానంద = గొప్పసంతసముచే, మూర్ఛిత = మూర్ఛపోయినది, అయ్యెన్, పదంపడి = తరువాత, మదిన్ = మనస్సునందు, చేష్టల్ = చూచుట, వినుట మొదలగు నింద్రియవ్యాపారములు, జనింపంగన్ = పుట్టఁగా - కలుగఁగా, తాన్ = తాను, పతిన్ = భర్తయగు ప్రద్యుమ్నుని, కన్నెప్పలు = కంటిఱెప్పలను, విచ్చి, చూచి, భయ ... ఆత్మయై, భయ = భయము, కంప = వణఁకుట, స్వేద = చెమ్మటలు, లజ్జ = సిగ్గు, ఆత్మయై = దేహమందుఁ గలదియై, (అని వ్యధికరణ బహువ్రీహి.)

తాత్పర్యము:—ఆ ప్రభావతియును ప్రద్యుమ్నుని కౌఁగిటి స్పర్శముచే వెనువెంటనే మూర్ఛనుండి మేల్కొని, మహానందమున మునిఁగిపోయి, మరల వివశయై, వెంటనే తేఱుకొని మనస్సునందు చేష్టలు గలిగి, భయము, వణఁకు, చెమ్మటలు, సిగ్గును నొక్కుమాఱు పైకొనఁగా - (నిలువలేకపోయినది).

అలం:—పూర్వరూపము - తల్లక్షణము. క. తనరారుఁ బూర్వరూపము పునరాత్మగుణాప్తి యైనఁ బురహరకంఠాంశు నిలిప్తుఁ డయ్యు నీయశమున శుభ్రశరీరుఁడయ్యె భుజగేంద్రుఁ డనన్ - ఇచట ప్రభావతి మూర్ఛిత యైనది. నాయకస్పర్శమునఁ దెలివినొంది, నాయకుని జూచినయానందమున మరల మూర్ఛితయై పూర్వరూపము నొందినది. కావున పూర్వరూపాలంకారము (పద్యము పూర్వార్థమున నేకలదు.)

క. చిరకాంక్షిత నిజపరిరంభ రసస్థితిఁ జొక్కి యున్న § పతిచేతులు స
త్వరత విడిపించుకొని యోవరిలోనికిఁ బాఱిపోయె § వనజాక్షి వడిన్. 10

అర్థము:—వనజాక్షి = తామరలవంటి కన్నులు గలది - ప్రభావతి, చిర...స్థితిన్ - చిర = చాల కాలమునుండి, కాంక్షిత = కోరఁబడిన, నిజ = తనయొక్క, పరిరంభ = కౌఁగిటి సంబంధమైన, రస = అనురాగమందు, స్థితిన్ = ఉండుటచేత, చొక్కి = పరవశుఁడై, ఉన్నపతిచేతులు = ఉన్నట్టి భర్తయొక్క చేతులను, సత్వరతన్ = వేగముగా, విడిపించుకొని, ఓవరిలోనికిన్ = లోపలి గదిలోనికి, వడిన్ = త్వరితముగా, పాఱిపోయెన్ = పరుగెత్తెను.

తాత్పర్యము:—ఎన్నాళ్లనుండియో కోరుకొనుచున్న తన కౌఁగిలి నేఁడు లభించుటచేత పరవశుఁడై యున్న భర్తచేతులను ప్రభావతి తటాలున విడిపించుకొని, లోపలిగదిలోనికి వేగముగా పరుగెత్తి పోయెను.

సీ...వాసగృహసంజ్ఞ, యఱ యనఁగ నోవరి యనఁగ...నలరు...ఆం. భా. 2. 17.

వ. ప్రద్యుమ్నుండును శుచిముఖి రాగవల్లరులం జూచి యి ట్లనియె. 11

అర్థము:—స్పష్టము.

ఉ. సర్వయువాధికుం డను యశశం బెసఁగు న్నను నేలికొన్నమ
త్పూర్వ సమస్తపుణ్యఫలభూమిక మీచెలి యీవిలంబ మే
నోర్వమిఁ జూడ కిట్లరుగు § టొప్పునె ? తోడ్కొని రండు పోయి గాం
ధర్వవివాహలీలకు ముదమ్మున మీరలె పెండ్లిపెద్దలై. 12

అర్థము:—సర్వయువాధికుండు = పడుచువాండ్రందఱకంటెను గొప్పవాఁడు, అను యశంబు = అనునట్టికీర్తి, ఎసఁగు + ననున్ - ఎసఁగు న్ననున్ = కలిగినట్టి నన్నును, ఏలికొన్న = వశపఱుచుకొన్నట్టిది యును, మత్పూర్వ...భూమిక - మత్ = నాయొక్క, పూర్వ = వెనుకటి (జన్మములందలి) సమస్త = ఎల్ల, పుణ్య = పుణ్యకర్మములయొక్క, ఫల=పంటయొక్క, భూమిక=మాఱురూపము (నగు) మీచెలి = మీచెలికత్తెయగు ప్రభావతి, ఏను=నేను, ఈవిలంబము = ఈజాగును, ఓర్వమిన్ = సహింపలేకపోవుటను, చూడక = ఆలోచింపక, ఇట్లు = ఈవిధముగా, అరుగుట = వెళ్లిపోవుట, ఒప్పునె=తగునా ? గాంధర్వ వివాహలీలకున్ = గాంధర్వవివాహమను క్రియకు, మీరలు +ఎ = మీరిద్దఱుమాత్రమే, ముదంబునన్ = సంతోషముతో, పెండ్లిపెద్దలు + ఐ = వివాహమహోత్సవము నడపు నాయికలై, పోయి = వెళ్లి, తోడ్కొని = వెంటఁబెట్టుకొని, రండు.

గాంధర్వవివాహము:— వధూవరులు తమలోఁ దా మంగీకరించి యమంత్రకముగాఁ జేసికొను వివాహము. ఇది యెనిమిది విధము లగు వివాహములలో నొకటి. (1. బ్రాహ్మము, 2. దైవము, 3. ఆర్షము, 4. ప్రాజాపత్యము, 5. ఆసురము, 6. గాంధర్వము, 7. రాక్షసము, 8. పైశాచము అని వివాహ మెనిమిది విధములు.

తాత్పర్యము:— పడుచువాం డ్రందఱకంటె నధికుఁడ నని పేరొందిన నన్ను వశము చేసికొనినది యును, నాపూర్వ పుణ్యములయొక్క ఫలరూప మైనదియు నగు మీ చెలికత్తె, యిట్టిజాగును నేను సైఁపఁజాల నని తలఁపక, పరుగెత్తుట న్యాయ మౌనా ? కాన మీ రిద్దఱే పెండ్లినడపు పెద్దలై గాంధర్వ వివాహము చేయుటకై యామెను తీసికొని రండు.

వ్యా. వి. :—ఎసఁగు + ననున్ - ఉదంత తద్ధర్మార్థకవిశేషణ మగు 'ఎసఁగు' అనుదానికి అచ్చు పర మగునపుడువచ్చు నుగాగమము 'ననున్' లోని నకారరూప హల్లుపర మగునపుడును వచ్చుట విశేషము. ఇట్టివి క్వాచిత్కముగా రాయలనాఁటి వాఙ్మయమునఁ గనఁ బడుచున్నవి. 'పొల్పగుంజవిక' మనుచ. 5. 76. 'అమరుం దుమ్మెద చాలునా నొనరె.' వసు 2. 72. 'అయ్యింతి చెక్కులఁ బోలుం దెలనాకులున్.' పాండురంగ. 1. 29. 'పాయసాన్నములు నూరుంగాయలున్.' ఆముక్త. 1. 82.

వి. :—భూమిక - నాట్యమున ధరించువేషము, మాఱురూపము. (ని. 'పాత్రాణి నాట్యేఽధికృతా స్తత్తద్వేషాస్తు భూమికాః.' అని. హేమచంద్రుఁడు.)

వ. అనిన విని రాగవల్లరి నవ్వుచు నతనిం జూచి. (స్పష్టము) 13

చ. తనవిరహాసహిష్ణుత విధం బఖిలంబును నీవు వింటి గా
యనయము నాడుకోఁగ నిపు డంచు మనంబున నెత్తు సిగ్గునన్
మునుఁగుచుఁ గుందుచున్నదియె ముద్దియ నీతమకం బెఱింగి ని
ల్వని తెఱఁ గొక్కతప్పుగఁ దలంచెదుసూ చతురుండ వన్నిటన్. 14

అర్థము:—ఇపుడు, అనయమున్ = అత్యంతమును, ఆడుకోఁగన్ = చెప్పుకొనఁగా, తన = ఆమె యొక్క, విరహాసహిష్ణుతన్ = వియోగమును సైఁపలేక పోవుట యొక్క, విధంబు = రీతిని, అఖిలంబును = అంతయును, నీవు, వింటిగా = వింటివిగదా, అంచున్ = అనుకొనుచు, మనంబునన్, ఎత్తు = కలుగుచున్న, సిగ్గునన్, మునుఁగుచున్, ముద్దియ = ప్రభావతి, కుందుచున్నదియె = తపించుచున్నదే (కాని మఱి యొకటి కాదు) నీతమకంబు = నీ తహతహను, ఎఱింగి = తెలిసియుండియు, నిల్వని తెఱఁగు = నిలిచియుండని విధము, ఒకతప్పుగన్ = ఒకయపరాధముగా, తలంచెదుసూ = తలంచెదవేమోసుమా - అన్నిటన్ = ఎల్ల విషయములందును, చతురుండవు = నేర్పరివి. కావున తలంప వని నానమ్మకము.

తాత్పర్యము:—ప్రభావతి ముద్దియ. అనఁగా ముగ్ధ. కావున తనవిరహము భరింపలేకుంటను చెప్పు కొనుచుండఁగా నీ వది యంతయు వింటి వని పట్టరాని సిగ్గుచే తపించుచు పరుగెత్తినదియే కాని నీతమకము నెఱుఁగకకాదు. అట్లుపాఱిపోవుట తప్పుగా నెంచెద వేమో సుమా. కారణము చెప్పితిని గదా, అదియుం గాక నీ వన్నివిషయములందు నేర్పరివి. 'కావున ఇంతకు మున్నే గ్రహించి యుందువు' అని వ్యంగ్యము.

అలం. :—ఆక్షేపాలంకార ధ్వని.

వ. అనిపలుకు నంత నతనికి శుచిముఖియు ని ట్లనియె. 15

అర్థము:—సుగమము.

ఆ. నీవు సకలనాయికావిశేషస్వభా, వములు నెఱిఁగినట్టి వాఁడ వైన
నాకుఁ దోఁచినంత యాకన్యచిత్తంబు, విధము నీకు విన్నవింతు వినుము. 16

అర్థము:—నీవు, సకల...భావములు - సకల = ఎల్ల, నాయికావిశేష = నాయికలందలి భేదములను, స్వభావములు = (వారివారి) చిత్తవృత్తులను, ఎఱిఁగినట్టివాఁడవు, ఐనన్ = అయినప్పటికి, ఆకన్య చిత్తంబు విధము = ఆ ప్రభావతియొక్క మానసికస్థితి (ఇప్పు డామె మన స్సె ట్లున్నదో ఆ సంగతి అన్నమాట) నాకున్, తోఁచినంత = తెలిసినంత, నీకున్, విన్నవింతున్, వినుము.

వ్యాము:—నాయిక లెన్నివిధముల నుందురో, వారి తలంపు లెట్లుండునో నీకుఁ దెలిసిన విషయమే, అయిన నిప్పు డాప్రభావతి మన సెట్లుండునో నాకు తోఁచిన మాత్రము విన్నవింతును వినుము.

వి. :—రాగవల్లరి 'నీ వన్నిటన్ జతురుఁడ' వనుటను శుచిముఖి దీనిలో వివరించినది.

ఉ. తాఁ గడు వేగిరించెఁగద తద్గతి నీవు నెఱుంగ - సిగ్గునన్
లోఁగుచు నింతనుండి యిఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా
నేఁగుచుఁ గోరు నీబలిమి నీప్సితసిద్ధిగ "వీఁపు గానరా
డాఁగుట" దీనిపేరు నిబిడం బిది బాలిక కెల్ల నాత్మలోన్. 17

అర్థము:—తాన్ = తాను, కడున్=ఎక్కువగా, వేగిరించెఁగద = తొందరపడెనుగదా, తద్గతిన్= ఆ తొందరపడుటను, నీవు, ఎఱుంగన్ = తెలిసికొనుటచేత, సిగ్గునన్ = సిగ్గుచే, లోఁగుచున్ = జంకుచు, వెనుదీయుచు, ఇంతన్ = ఇచ్చట, ఉండి, - ఇచ్చట నీ సన్నిధియం దుండియును, ఇఁకన్, లోనుగన్ = వశమగుటకు, ఒల్లక = సమ్మతింపక, పట్టన్ + పట్టన్+కాన్ = ఎన్నివిధములఁ బట్టుకొన యత్నించినను, ఏఁగుచున్ = వెళ్లిపోవుచు, నీ బలిమిన్=నీ బలాత్కారమును, ఈప్సితసిద్ధిగన్ = కోరిక నెఱవేఱుటగా, కోరున్ = అభిలషించును, దీనిపేరు = ఇట్లు నీ కౌఁగిలి విడిపించుకొని యేఁగుట, వీఁపు = వెన్ను, కానరాన్=కనఁబడునట్లు, డాఁగుట = దాఁగికొనుటసుమా, ఇది యెల్లన్ = నేనుచెప్పినదంతయు, బాలికకున్=ముగ్ధ యగుప్రభావతికి, ఆత్మలోన్ = మనసునందు, నిబిడంబు = అధికముగాఁగలదు.

తాత్పర్యము:—నిన్నుఁ గలియుటకు తాను మిక్కిలి త్వరపడెను గదా! కాని తన తొందరపాటు నీకుఁ దెలియుటచే సిగ్గుపడి - యిచ్చట నిల్చి నీకు వశమగుట కిష్టపడక, యెన్ని విధములఁ బట్టుకొను చున్నను నిలువఁబడక వెడలిపోయి నీవు బలాత్కరించుటను వాంఛించుచుండును. ఇంతకంటె వేఱు భావ మామె కుండదు. ఇదియే దృఢముగా నుండును. కారణ మేమన నీవు రాలేదని విరహతాపమున మూర్ఛ గూర్ఛఁ బొందినది, అది నీకును ప్రత్యక్షమే కదా! అంత గాఢప్రేమ గలదయ్యును సిగ్గును జయింపలేక,

హృదయము విప్పి చెప్పియు, దాఁగఁబోయిన దనుట ముగ్ధాలక్షణము - ఇది యెట్లున్న దన - నెన్ను గానిపింపఁ దాఁగన ట్లున్నది. తన కితరులు కనిపింప కుండిరని తలంచే కాని తన నీఁపు యితరులకుఁ గనఁబడునని యెఱుఁగక దాఁగినవిధ మిదియే సుమా! అని యనినది.

అలం:—నిదర్శనము.

వి:—నాయికా విశేష స్వభావము లెఱిఁగినవాఁడు గావున నాతనికి 'ముగ్ధానాయిక సుమీ' యని హంసివాచ్యముగాఁ దెలుపక, తల్లక్షణములచేత స్ఫురింపఁ జేసినది.

వ. కావున నప్పడుచు తప్పేమి కలిగిన నదియు నొక్క యనురాగ విలసన విశేషంబ కా నెఱింగుకొని యనుగ్రహంబు వదలక పరిగ్రహింతు గాని వే ఱొండుగఁ దలంచెదు సుమీ యేము పోయి యా ముద్దియకు బుద్ధిచెప్పి యెత్తుకొని వచ్చెద మని రాగవల్లరియుం దానునుం దత్సమీపంబునం దెరమఱుంగున నుండి తమ పలుకు లాలకించి వినుచున్న యన్నెలఁత పాలికిం బోయి యల్పస్వరంబున ని ట్లనియె. 18

అర్థము:—కావునన్, అప్పడుచుతప్పు=ఆతరుణియొక్క యపరాధము, ఏమి కలిగినను, అదియును, ఒక్క = ఒకవిధమగు, అనురాగ = ప్రేమ సంబంధమగు, విలసన = ప్రకాశము యొక్క, విశేషంబు + ఆ=విశేషమే, కాన్ = అగునట్లు, ఎఱింగికొని = తెలిసికొని, అనుగ్రహము = దయ, పరిగ్రహింతుగాని= స్వీకరింతువేకాని, ఎత్తుకొని వచ్చెదము = వెంటఁబెట్టుకొని వచ్చెదము, ఆలకించి = ఆదరించి, వినుచున్న, అల్పస్వరంబునన్ = చిన్నగొంతుతో - నెమ్మదిగా నని భావము.

వి. :—ఆలకించివిను = శ్రద్ధతో విను - అని జాతీయమై యుండును, 'అంచలాన యాలకించి వినుఁడు' అని చంద్రాంగద చరిత్రము. 4-59. లోఁ గూడఁ గలదు.

'ఆలకించు' అనునది - ఆఙ్ పూర్వక 'లక్ష' ధాతువునుండి వచ్చినది. 'లక్ష దర్శనాంకయోః' అని 'లక్ష' ధాతువునకు దర్శనమను నర్థముండుటచే 'అంతటఁజూచు' అనుదానికి ఛాయగా - 'ఆదరించు, శ్రద్ధవహించు' అని ఆలకించు ధాతువునకు నర్థము కల్గెనని గోచరించు చున్నది.

ఆ. తలిరుఁబోఁడి మంచి దానవు గల్గి తి, ట్లరుగు టెంతురమ్మ యధిపు మనసు
విరస మయ్యెనేని వెర వెద్ది మఱి చక్కఁ, జేయ నీవ చింత చేసి చూడు. 19

అర్థము:—తలిరుఁబోఁడి = చిగురువంటి దేహము గలదానా!, మంచిదానవు, కల్గితి = లభించితివి, ఇట్లు = ఈ రీతిగా, అరుగుటెంతు రమ్మ = (ఏకన్యలైనను తమ్మాదరించుచున్న మగలను త్రోసివైచి, దాఁగుటకై) వచ్చెదరా?, అధిపుమనసు=మగని మనస్సు, విరసము = విరక్తిఁ జెందినది, అయ్యెనేని, మఱి, చక్కఁజేయన్ = బాగుపఱుచుటకు, వెరవు = ఉపాయము, ఎద్ది = ఏమున్నది, నీవు + అ = నీవే చింతచేసి = పరిశీలనమొనర్చి, చూడుము.

వ్యా. వి.:—కలిగితి (వి) సూ. లిఙ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు. బాల. క్రియా. 24 చే వకారలోపమును, అపదాదిస్వరసంధియుఁ గల్గి 'కలిగితి' అనురూపమై 'ఇట్లు' అనుదానిలోని ఇకారము పరము కాఁగా మధ్యమపురుషైకార నిత్య సంధియై - 'కలిగితిట్లు' అగును. చింతచేసిచూడు (ము) అవసానంబున మధ్యమపురుష ముఃవర్ణకలోపము వచ్చినరూపము.

వ. అనిన శుచిముఖికి రాగవల్లరి యి ట్లనియె. 20

అర్థము:— సుగమము.

క. అప్పటి కట్లరుదెంచుట, తప్పనరాదంత మనము ౯ దండ నునికిఁ దా
నప్పుడుచుఁదనము మానక, యిప్పుడఁతుక యంతవెఱ్ఱి ౯ యే యిఁకఁజేయన్. 21

అర్థము:— అంతన్ = అప్పుడు, మనము, దండన్ = చేరువను, ఉనికిన్ = ఉండుటచే, అప్పటికిన్ = ఆసమయమునకు (తగినట్లుగా) అట్లు = ఆరీతిగా, అరుదెంచుట = వచ్చివేయుట, తప్పు, అనరాదు = అనఁగూడదు, ఇఁకన్ = ఈమీఁదట, ఇప్పుడఁతుక = ఈచెలియ, అప్పుడుచుఁదనము = వెనుకఁజేసిన బాల్యచేష్ట (అవివేకపుఁబని అనిభావము) మానక = విడువక, చేయన్ = చేయుటకు, అం నీవనుకొనినంత తెలివిలేనిదికాదు.

తాత్పర్యము:—ఆసమయమున మనము దగ్గఱ నుండుటచే సిగ్గుపడి యిట్లు చాటునకు వచ్చుట తప్పనఁదగదు. మనము వెడలిన తరువాత అట్టిచిన్నతనపుఁబని మరలఁ జేయుటకు నీ వనుకొనినంత వెఱ్ఱిది గాదు లే.

వ. అని ప్రభావతి నవలోకించి. (స్పష్టము)

క. వరుఁడు సమాగమకాంక్షన్, త్వరితపడుచు నుండ నిచటఁ ౯ దడయుట తగ దో
వరవర్ణిని రార మ్మొక్క, సరవిని దమి యుండ దెల్ల ౯ సమయములందున్. 23

అర్థము :—ఓవరవర్ణిని = (మంచిదేహకాంతిగల) ఓప్రభావతీ, వరుఁడు = పెండ్లికొడుకు, (ప్రద్యుమ్నుఁడు) సమాగమకాంక్షన్=పొందుటయందలి కోర్కిచే, త్వరితపడుచున్+ఉండన్=వేగిరపడు చుండఁగా, ఇచటన్, తడయుట = ఆలసించుట, తగదు, రారమ్మ = వేగరమ్మ, (అత్యాదరమున ద్విరుక్తి) ఎల్లసమయములందున్, తమి = ఉత్సాహము, ఒకసరవిని = ఒకక్రమమున, ఉండదు

తాత్పర్యము :—ఓ చెలియా! నీప్రియుఁడు, నిన్నుఁ గలియుకోర్కితో త్వరపడుచుండఁగా, నీ వాలసించుట తగదు. వేగ రమ్మ. ఏమన-కలిగిన యుత్సాహ మెవ్వరికైనను సర్వదా యొక్కరీతిగానుండదు.

అలం. :—కావ్యలింగము.

వ్యా. వి. :—రా రమ్మ - రమ్మ + రమ్మ - సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముదు ఙ్జులకు లోపంబు విభాషనగు. బాల. సంధి 49 చే మువర్ణమునకు లోపము వచ్చి, హ్రస్వమునకు నిమిత్త మగు మువర్ణకము లోపింపఁగనే (ర) అనుదానిపై దీర్ఘాకారము వచ్చి రా + రమ్మ = రారమ్మ అగు చుండ - సూ. 'ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు' అను ప్రౌఢ. సంధి. 23 అనువాదమాత్ర మగుచున్నది.

వ. అని కేలు పట్టి తివియఁ బోయి యా లజ్జావతిచేత విదుల్పులం బడి నగుచు ని ట్లనియె. 24

అర్థము:—కేలు = చేయి, పట్టి=పట్టుకొని, తివియఁబోయి = లాగఁబోయి, ఆ లజ్జావతిచేతన్=సిగ్గరి నా ప్రభావతిచే, విదుల్పులన్ = విక్షేపములను, పడి = పొంది,

క. ఏరీతిం బెనఁగిన నెవ్వా రెఱుఁగరు నీదు గుట్టు వనితామణి! రో R·C
ళ్లా రోఁకండ్లం బాడిన, కూరుము లిప్పు డింతఁ దాఁచుకొన్న నడఁగునే. 25

అర్థము:—ఏ రీతిన్ = ఏ విధముగా, పెనఁగినన్ = లాగులాడినను, నీదుగుట్టు = నీ లోఁతును (రహస్య మగునీకోర్కెని) ఎవ్వారు, ఎఱుఁగరు, రోళ్లా రోఁకండ్లన్ = రోళ్లయందు రోఁకండ్లతో దంచు సమయములందు, పాడిన = పరిపాటిగా స్త్రీ లందఱును నిత్యము పాడుకొనిన, కూరుములు = ప్రేమలు - (మీ ప్రేమలు మావంటివారి కందఱకు దంపుళ్లపాటగా నైనవి. అనఁగా వెల్లడి యైనవి అని భావము) ఇప్పుడు, ఇంత = ఇంతయెక్కువగా, దాఁచుకొన్నను, అడఁగునే = మాటుపడునా?

అలం:—(రోళ్లా రోఁకండ్లన్ బాడినది) లోకోక్తి.

వి. :—'రోళ్లా రోఁకళ్లాపాడిన' అనియే కవిప్రయుక్తమై యుండును. జాతీయము కావున గ్రామ్యతా దోషజుష్టము కానేరదు. గ్రామ్యత్వము వారింప 'రోఁకళ్లా' అనుదానిని 'రోఁకండ్లన్' అని సవరించినను 'రోళ్లా' అనునది సవరింప వీలుకాదే! కావున 'రోళ్లా రోఁకళ్లా పాడిన' అనియే గ్రహించుట యుక్తము. చమత్కారమునకొఱకు, పాత్ర ననుసరించి గ్రామ్యరూపప్రయోగములు లేక పోలేదు. 'సీరాముసేఁ' (మను. 4. 16) వంటిదే యిదియు ననుకోఁదగును. దోషమే యగుచో రెండును దోషయుక్తము లగును. కాని యొకటి దోషయుతమును, ఒకటిదోషరహితము నగుట పొసఁగదు.

వ. అని వెండియు నతిప్రయత్నంబున. 26

అర్థము:—వెండియున్ = మరల, అతిప్రయత్నంబునన్ = మిక్కిలిపూనికతో.

సీ. విభుఁడు దండనె యిది వినుచున్నవాఁ డెంత, గబ్బివే యిది లజ్జక్రమమె యనియు
నతఁ డిది సరకుసేయమిగ భావించిన, నప్పు డేమి యగుదు వీవబల యనియు
రసికశేఖరుఁడు సర్వజ్ఞుఁడు ప్రియుఁడు నీ, కొలఁదిన నడుచు భీతిలకు మనియు
నతిగోప్య మీ శుభావాప్తి దీనికి నింత, తడయు టొప్పమి యెట్లు దలఁప వనియు

మఱియు నెన్నియొ బిసిబిసిమాట లమరఁ, బ్రియము చెప్పియు నదరవైచియు హితాను
వృత్తిఁ దెలిపియు నొకకొంత మెత్తఁబడఁగఁ, జేసి కేల్వట్టి తిగిచె నా చెలువఁ గదల.

అర్థము:—విభుఁడు=మగఁడు, దండన్+ఎ=చేరువనె, ఉండి, ఇది=మన యీవాదులాట, వినుచున్న వాఁడు, ఎంతగబ్బివి + ఏ = ఎంతగర్వము గలదానవే, ఇది = ఇట్లు నీవు దాఁగుట, లజ్జక్రమము + ఎ = సిగ్గుయొక్క పద్ధతి యౌనా, అనియును, అతఁడు = నీమగఁడు, ఇది=ఈ దాఁగుటను, సరకుసేయమిగన్ = లెక్కచేయ కుండుటగా, భావించినన్ = తలఁచినచో, అబల = బలములేనిదానా, అతివా, అపుడు, ఏమి, అగుదు = ఏమైపోదువు, అనియు, ప్రియుఁడు = మగఁడు, రసికశేఖరుఁడు = శృంగారరస మెఱిఁగినవారికి శిరోభూషణమును, సర్వజ్ఞుఁడు = ఎల్లవిషయము లెఱిఁగినవాఁడు - (ఎల్లనాయికల స్వభావములను దెలిసినవాఁ డని భావము) నీ కొలఁదిన్ + అ = నీశక్తి ననుసరించియే, నడుచున్ = ప్రవర్తించును, భీతిలకుము = భయపడకుము, అనియును, ఈ శుభావాప్తి = ఈమేలు లభించుట, అతి గోప్యము = మిక్కిలి దాఁపఁదగినది - ఏమాత్రము బయల్పడినను హానికర మగునని భావము, దీనికిన్ = ఇట్టి శుభ సంఘటనకు, ఇంత, తడయుట = ఆలసించుట, ఒప్పమి = తప్పుగా, తలపవు + ఎట్లు = ఆలోచింప వేమి, అనియును, మఱియును, బిసి బిసి మాటలు = మార్దవమును కౌఠిన్యమును గలమాటలు, ఎన్నియొ, అమరన్ = కలుగునట్లు, ప్రియము, చెప్పియు = ఇచ్చకములు పలికియు, అదరవైచియు = భయపెట్టియు,

హితానువృత్తిన్ = హితమైన పని ననుసరించుటను, తెలిపియున్, ఒకకొంత = కొంచెము, మెత్తఁబడఁగన్ + చేసి = సమ్మతింపఁజేసి, ఆ చెలువన్ = ఆ ప్రభావతిని, కేల్ + పట్టి=చేయిపట్టుకొని, కదలన్ = ఆచటనుండి వెడలునట్లు, తిగిచెన్ = లాగెను.

త్రాము:—'నీప్రియుఁడు దగ్గఱనే యున్నాఁడు. మన యీవాదులాట వినుచున్నాఁడు. ఇది యంతయు నీగర్వ మనుకొనును. సిగ్గున కిది లక్షణము కాదుసుమా' యనియు, 'నీ వీడాఁగుట - నాతఁడు తన్ను లక్ష్యపెట్టలే దని యనుకొనినచో నీప్రబదు కేమి యగునో తెలిసికొంటివా' యనియును, 'నీప్రియుఁడు శృంగారరస మెఱిఁగినవారిలో గొప్పవాఁడు, సర్వము తెలిసినవాఁడు, కాన నీశక్తి ననుసరించియే ప్రవర్తించును. భయపడకుము' అనియును, 'ఈశుభసంఘటన మెచ్చటను దెలియరానిది గదా, దీనికై యింత యాలసించినచో తప్పగునని యెంచ వేమి' అనియును, ఇంకను మృదువును, కఠినములగు మాటలతో నిచ్చకములాడియును, భయపెట్టియు, హిత మగు కార్యము ననుసరించు విధమును దెలిపియు, కొంచెము మెత్తఁబడఁజేసి, అచటనుండి కదలునట్లు చేయి పట్టుకొని యాప్రభావతిని లాగెను.

వి. :—ఈమాటలు తెర కవ్వలినుండి ప్రద్యుమ్నుఁడు వినునట్లుగా చెప్పుటవలన ప్రభావతి ననునయించుట ప్రకృతమైనను, బాలికల స్వభావ మిట్లు లజ్జాభరితమై యుండునే కాని గర్వము కాదు. నిన్ను లెక్కసేయ లే దని వైరస్య మొందితివేని యబలయైన యీకన్యకకు దిక్కే ముండును? శృంగార రసము నెఱిఁగినవారిలో నధికుఁడవై యెల్లనాయికల స్వరూపస్వభావము లెఱిఁగినవాఁడవు కానఁ బురుషసాన్నిధ్య మెఱుఁగక భయపడుచున్న యీమెయిచ్చ ననుసరించి లాలించి భయము తీర్చి ప్రవర్తింపవలెను జుమా. అతిరహస్యముగా ఘటిల్లిన యిట్టిశుభమునకు ముద్దరా లగుటచే సిగ్గున మునిఁగి కాలయాపన చేసినను సైఁపవలెను. అని ప్రద్యుమ్ననకుఁ గూడ హితబోధము వాచ్యము గాక వ్యంగ్య మగుచున్నది.

'రసికశేఖర, సర్వజ్ఞ' శబ్దములు రెండును సాభిప్రాయ విశేషణములు గాన, అలం. :—పరికరము.

'సాభిప్రాయే విశేష్యేతు భవే త్పరికరాంకురః' అనియు, 'అలంకారః పరికరః సాభిప్రాయ విశేషణైః' అనియు చంద్రాలోకమున వరుసగా లక్షణము లీయఁబడినవి.

వ్యా. వి. :— 'గర్వి' శబ్దభవము గబ్బి. ఇది తెనుఁగున మహన్మహతులకు రెంటికిని జెందును. సంస్కృతమున గర్వి. పుం. గర్విణీ. స్త్రీలింగము. తెలుఁగున స్త్రీప్రత్యయ మీశబ్దమునకు విధింపఁబడమి యుభయసాధారణ మైనది.

సీ. తిగిచిన రాక యీడిగిలం బడుచును ల, జ్జాలసత్వమున మల్లాడి యాడి
నిలు నిలు మొకమాట గల దని నిలిపి ప, ల్కుట కేమియును లేక గ్రుక్కి-గ్రుక్కి-
యడు గడుగునకు నత్యంత నిర్బంధంబు, సలిపెడు నందాఁక నిలిచి నిలిచి
తెరువున నర్గళా దిక మేది చేతి కం, దినఁ బట్టు విడువక పెనఁగి పెనఁగి

యిందుబింబాస్య కడు నలయించెఁ జెలిని, విసివిపోదు గదా యను వెఱపు నొదవ
విభుని నూతన సంగమ వేళఁ గరము, వక్రములువో పడంతుల వర్తనములు .28

అర్థము:—ఇందు బిం బాస్య = చంద్రబింబమువంటి ముఖముగలది, ప్రభావతి, తిగిచినన్ =లాగినను, రాక, ఈడిగిలంబడుచును = ముందునకు రా నని కూలఁబడుచు, లజ్జాలసత్వమునన్ = సిగ్గుచేఁ గలిగిన మాంద్యముచేత, మల్లాడియాడి = మిగుల పెనఁగులాడి, నిలు నిలుము = ఆఁగు మాఁగుము, ఒకమాట = నీతోఁ జెప్పవలసినయొక విషయము, కలదు, అని, నిలిపి = చెలి నాఁపి, పల్కుటకున్ = చెప్పుటకు, ఏమియును, లేక, గ్రుక్కి గ్రుక్కి = గుటకలు మ్రింగి మ్రింగి, అత్యంతనిర్బంధంబు = మిగుల

బలవంతము, సలిపెడు నందాఁకన్ = చేసెడిపర్యంతము, అడుగడుగునకున్ = ప్రతిపాదన్యాసమునకును, నిలిచి నిలిచి = ఆఁగిపోయి (అడుగడుగునకున్, అత్యంత నిర్బంధము సలిపెడునందాఁకన్, నిలిచినిలిచి యను క్రమమున నైన నన్వయింపవచ్చును.) తెరువునన్ = త్రోవయందు, అర్గళాదికము = తలుపు గడియ మొదలగునది, ఏది = ఏవస్తువు, చేతికిన్, అందినన్ = దొరకినను, పట్టువిడువక = పట్టుకొనిన హస్తబంధను విడిచిపెట్టక, పెనఁగిపెనఁగి = మిగుల పీఁకులాడి, విసివిపోదుగదా = (చిన్నఁ దోడ్కొని వెళ్లుచున్న రాగ వల్లరి) విసుగు చెందదుగదా, అనువెఱపున = అనుభయముగూడ, ఒదవన్ = (తనకుఁ) కలుగగట్లు, చెలిని, కడున్ = మిగుల, అలయించెన్ = ఆయాసపెట్టెను, విభుని నూతన సంగమవేళన్ = ప్రియుని క్రొత్త కూటమి సమయమునందు, పడతులవర్తనములు = స్త్రీలయొక్క నడతలు, కరము = అత్యంతము, వక్రములు + పో = మిగుల కుటిలములు గదా.

అలం. :— స్వభావోక్తి, అర్థాంతరన్యాసము.

వ్యా. వి. :—నిలుచు + ము. సూ. పిలుచుమొదలగువానికి ముత్తు పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగా లోపించు. బాల. క్రియా. 102. చే చువర్ణము లోపింప 'నిలుము' అగును, నిలుము + నిలుము. సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుజ్ఞులకు లోపంబు విభాష నగు. బాల. సంధి. 49. చే. నిలునిలుము అయినది. అడుగునకున్ + అడుగునకున్. సూ. ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 41. చే. 'అడుగడుగునకు' అయినది.

క. ప్రకృతిజ్ఞయు హితనిర్వాహికయు నగుట నల్లనల్ల నేనుఁగుఁ గంబా
నకుఁ దిగిచినట్లు యత్నా, ధికతం జెలి తెచ్చె నాసతిం బతికడకున్. 29

అర్థము:— చెలి = చెలికత్తెయగు రాగవల్లరి, ప్రకృతిజ్ఞయున్ = స్వభావము నెఱిఁగినదియును, హితనిర్వాహికయున్ = హితమగుదానిని సమకూర్చునదియును, అగుటన్ = అగుటచేత, అల్లన్ + అల్లన్ = మెల్లమెల్లగా, ఏనుఁగున్, కంబానకున్ = కట్టుఁగొయ్యకు, తిగిచినట్లు = ఆకర్షించినరీతిని, ఆసతిన్ = ఆప్రభావతిని, పతికడకున్ =మగనియొద్దకు, యత్నాధికతన్ =పూనికయొక్క హెచ్చుచేత-పెద్దయత్నముచే ననిభావము, తెచ్చెన్ = తోడ్కొనివచ్చెను.

తాత్పర్యము :—రాగవల్లరి ప్రభావతియొక్క స్వభావ మెఱిఁగినదియు, నామెకు క్షేమమునొనర్చు నదియుఁ గాన, ఏనుఁగును కట్టుఁగఱ్ఱకుఁ దెచ్చిన ట్లతియత్నముచే భర్తయొద్దకుఁ దెచ్చెను. (మావటివాఁడు బెదరించియు, లాలించియుఁ గట్టుకొయ్యయొద్దకు నేనుఁగును త్రోలుకొనివచ్చికట్టును. లేకున్న లొంగదు.)

అలం. :—ఉపమ.

వ. అట్లు తెచ్చి. 30

క. అనయము చేరిక యగుతఱి, ననివార్యవ్రీడ భయభరాకులగతియై
తనవెనుక నొదుఁగ నొదుఁగఁగ, వనితామణిఁ దేర్చి తేర్చి వల్లభుఁ జేర్చెన్. 31

అర్థము:—అనయము = అంత్యము, చేరిక=సమీపము, అగుతఱిన్ = అగుచున్నప్పుడు, అనివార్యవ్రీడన్ = వారింపరాని సిగ్గుచేత, భయభరాకులగతియై = అధికమగు భయముచేత తొట్రుపడుచున్న నడక గలదై, తనవెనుకన్ =చెలికత్తెయొక్క వెనుకభాగమునందు, ఒదుఁగన్ + ఒదుఁగఁగన్ =సంకుచితావయవయై డాఁగియుండఁగా, వనితామణిన్ = స్త్రీలలో శ్రేష్ఠ యగు నాప్రభావతిని, తేర్చి తేర్చి = మిక్కిలి యూశ్వాసించి, వల్లభున్ = ప్రియుని, చేర్చెన్ = కూర్చెను.

తాత్పర్యము:—ఆ ప్రభావతిని భర్త దగ్గఱకుఁ దెచ్చునపుడు సమీపించినకొలఁది సిగ్గు హెచ్చె, భయముచే నడక తొట్రుపడఁగా చెలికత్తె వెనుక నొదిఁగియుండెను. అంత నాచెలికత్తె యామె ననునయించి ప్రియునితోఁ గూర్చెను.

వ. ఇట్లు దగ్గఱఁ దెచ్చి యజ్జలజాక్షి యత్యూర్జితసముజ్జిహాసాదుర్జయ లజ్జాసముద్వేగయు నుద్దామరోమహర్షణ స్వేదోద్భేద సాదితప్రకృతి మకరికాపత్త్రాంగరాగయుఁ, బురఃస్థితి పరిత్యాగ యత్నసంక్షోభ సంచలీభవ దుత్తరీయపార్శ్వపునః పునరాలక్ష్యమాణ వక్షోజకుంభతట విజృంభమాణాభోగయు, నగ్రదృష్టిప్రసార పరిహార నియమ నియతకటాక్షసంచార చారుకర్ణగోళకూలంకష లోలలోచన ద్రాఘిమ శ్లాఘనీయ ముఖపరావృత్తి పౌనఃపున్య ధన్యాయి తోభయోపాంతభాగయు, నైన యెలనాఁగం జూపుచు నా పురుషరత్నంబుం గటాక్షించి. 32

అర్థము:—ఇట్లు = ఈవిధముగా, దగ్గఱన్ = సమీపించునట్లు, తెచ్చి, అజ్జలజాక్షి = ఆరాగవల్లరి, అత్యూర్జిత...వేగయున్ - అత్యూర్జిత = మిక్కిలి దృఢమైన, సముజ్జిహాసా = విడువవలె ననెడి కోర్కిచేత, దుర్జయ = గెలువ శక్యముకాని, లజ్జా = సిగ్గును, సముద్వేగ = వెఱపును, వేగయున్ = వేగమును గల్గినదియును - (సిగ్గును, భయమును, తొందరను విడువవలె నని యెంత యత్నించినను విడువ లేనిదియుఁ నని భావము.) ఉద్దామ ... రాగయున్ - ఉద్దామ = అధికమైన, రోమహర్షణ = గగుర్పాటు యొక్కయు, స్వేద = చెమటయొక్కయు, ఉద్భేద = పుట్టుటచేతను, సాదిత = విడిపోవఁజేయఁబడిన, - కరఁగునట్లు చేయఁబడిన, ప్రకృతి = స్వరూపముగల, మకరికాపత్త్ర = (స్త్రీల చెక్కిళ్లు మున్నగుతావులందు మొసలియాకారముగా కస్తూరి, కర్పూర కుంకుమ చందనాదులచే వ్రాయు రేఖలు) మకరికలును, అంగరాగయు = మైపూఁతయును గల్గినదియు - (గగుర్పాటును, చెమ్మటలును హెచ్చుపెరిఁగి మకరికాపత్త్రములను, మైపూఁతను కరఁగించి వేసిన వని భావము.) పుర...భోగయున్ - పురః = ఎదుర, స్థితి = నిలుచుటను, పరిత్యాగ = విడుచుటయందలి, యత్న = పూనికచేఁ గలిగిన, సంక్షోభ = కలఁతచేత, సంచలీభవత్ = కదలిపోవుచున్న = జాఱిపోవుచున్న, ఉత్తరీయ = పైఁటకొంగుయొక్క, పార్శ్వ = ప్రక్కనుండి, పునః పునః = మాటి మాటికి, ఆలక్ష్యమాణ = కనఁబడుచున్న, వక్షోజకుంభ = కుండలవంటి స్తనములయొక్క, తట = ప్రదేశముల యొక్క, విజృంభణ = వికాసము సంబంధమగు, ఆభోగయున్ = పరిపూర్ణత గలదియును - మగనియెదుట నిలువకుండుటకై కలఁత నొందుటచే జాఱినపయ్యెద ప్రక్కనుండి కనఁబడుచున్న చన్నుదోయి యొక్క పరిపూర్ణ వికాసము గలదై - (పరిపూర్ణవిజృంభణము గల స్తనములు జాఱుచున్న పైఁటప్రక్కనుండి కనఁబడుచుండె నని భావము.) అగ్రదృష్టి... భాగయు - అగ్ర = ముందటికి, దృష్టిప్రసార = చూపులను వ్యాపింపఁ జేయుటయొక్క, పరిహార = విడుచుటయందలి, నియమ = ఏర్పాటుచేత, నియత = ఆఁపివేయఁబడిన, కటాక్షసంచార = కడగంటి చూపులయొక్క సంచారము గలవియును, చారు = అందమైనవియును, కర్ణగోళ = వట్రువయగు చెవులకు, కూలంకష = (ఒడ్డనొరసెడు) రాపాడు నట్టివియు, లోల = చలించుచున్నవియునగు, లోచన = కన్నులయొక్క, ద్రాఘిమ = (దైర్ఘ్యము) పొడవుచేతను, శ్లాఘనీయ = కొనియాడఁదగిన, ముఖపరావృత్తి = మొగముప్రక్కకుఁ ద్రిప్పుకొనుటయొక్క, పౌనఃపున్య = మరల మరలఁ గావించుటచేతను - (పునః పునర్భావముచేతను) ధన్యాయిత = పుణ్యము కలవిగాఁ జేయఁబడిన, ఉభయ + ఉపాంత భాగయున్ - రెండు పార్శ్వ ప్రదేశములు గలదియు - ప్రియుఁ డెదుటనుండుటచే నటువంక చూచుట మాని మొగము ప్రక్కకుఁ ద్రిప్పి యాకర్ణాంత విశాలమగు కన్నులతో నిటునటు చూచుచుండె నని భావము.) ఐన యెలనాఁగన్ = అయిన యాయువతిని, ప్రభావతిని, చూపుచున్, ఆపురుషరత్నంబున్ = పురుషులలో శ్రేష్ఠుఁడగు నాప్రద్యుమ్నుని, కటాక్షించి = కడగంటితోఁజూచి (ఇట్లు పలుకుచున్నది.)

చ. పడఁతులచర్య లిట్టివి నృపాలకుమారక నేఁటిదాఁక గు
ట్టెడలఁగ నీదు కూటమి యపేక్షఁ బడంగల పాటు లెల్లఁ దాఁ
బడి, యిపు డిష్ట మబ్బుతఱిఁ బాఱుచుఁ దాఱుచు, నేక్రియం బెనం
గెడుఁ గనుఁగొంటె ? యంచుఁ జెలికేల్ గదియించె రతీశు చేతితోన్.

అర్థము:—నృపాల కుమారకా = ఓరాజపుత్రా, పడఁతులచర్యలు = స్త్రీలయొక్క చేష్టలు, ఇట్టివి. ఈరీతిగా నుండునవి. (ఏమన) నేఁటిదాఁకన్, గుట్టు = దాఁపఱికము, ఎడలఁగన్ = తొలఁగు నట్లు - (బహిరంగముగా నని భావము) నీదుకూటమి యపేక్షన్ = నీకలయికయందలి కోరికచేత, పడంగల పాటులు=పొందఁ గలిగిన బాధలు, ఎల్లన్=అన్నియును, తాన్=తాను, పడి=పొంది, ఇపుడు, ఇష్టము = వాంఛితము, అబ్బుతఱిన్ = లభించు సమయమునందు, పాఱుచున్ = పరువెత్తుచును, తాఱుచున్=సమీ పించుచు, ఏక్రియన్=ఏరీతిగా, పెనంగెడున్=పెనఁగులాడుచున్నదో, కనుగొంటె=చూచితివా, అంచున్, చెలికేల్ = ప్రభావతియొక్క చేతిని, రతీశుచేతితోన్ = ప్రద్యుమ్నుని యొక్క చేతితో, కదియించెన్ = కూర్చెను.

తాత్పర్యము:—రాకుమారా! స్త్రీలచేష్ట లిట్లే యుండును. నేఁటిదాఁక గుట్టు విడిచి, నిన్నుఁ బొందఁగోరి పడవలసిన పా ట్లన్నియుఁ బడి ఇపుడా కోరిక సఫలము కానుండఁగా, నీమె యెట్లు పెనఁగులాడు చున్నదో చూచితివా యనుచు ప్రభావతిచేతిని ప్రద్యుమ్ను చేతితోఁ గూర్చెను.

అలం. :—అర్థాంతర న్యాసము.

క. ప్రమదంబున రాకొమరుఁడు, కమలాక్షిఁ బరిగ్రహించె గాంధర్వవివా
హాముచే 'నయం ముహూర్త, స్సుముహూర్తో౽స్తం'చుఁ గెలనశుచిముఖి నవ్వన్. 34

అర్థము:—శుచిముఖి, కెలనన్ = పార్శ్వమందు (ఉండి) అయం ముహూర్తః = ప్రభావతిచేతిని ప్రద్యుమ్నుఁడు గ్రహించిన యీవేళ, సుముహూర్తః=మంచి సమయము, అస్తు =అగుఁగాక, అంచున్ = అని పలుకుచు, నవ్వన్, రాకొమరుఁడు=ప్రద్యుమ్నుఁడు, గాంధర్వ వివాహముచేన్ = గాంధర్వ మనఁబడు వివాహ పద్ధతిచేత, కమలాక్షిన్ = ప్రభావతిని, పరిగ్రహించెన్ = చేకొనెను.

తాత్పర్యము :—అప్పుడు ప్రక్కనున్న శుచిముఖి నవ్వుచు - 'అయంముహూర్తః సుముహూ ర్తో౽స్తు'అనఁగా సంతసమున ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని గాంధర్వవిధిని బరిగ్రహించెను. 'సుఖత్వా దబహు క్లేశా దపిచావరణాదిహ, అనురాగాత్మకత్వాచ్చ గాంధర్వః ప్రవరో మతః. (సుఖహేతువగుట వలనను, ఏవిధమగుక్లేశము లేని దగుటచేతను, వరణసంవిధానము లేకపోవుటవలనను, వివాహామునకు ముఖ్యమగు నను రాగము పరిపూర్ణముగ నిం దుండుటచేతను, గాంధర్వము శ్రేష్ఠము) అని వాత్స్యాయనుఁ డనెను.

క. అపు డించుకతడ వన్యో, న్యపాణిసంస్పర్శ సంభృతానంద స్తం
భపరీతాత్మత నుండిరి, ప్రపంచ మంతయును మఱచి పతియున్ సతియున్. 35

అర్థము:—అపుడు, ఇంచుక తడవు = కొంచెముసేపు, పతియును = మగఁడును, సతియును = పెండ్లామును, అన్యోన్యపాణి...ఆత్మతన్ - అన్యోన్య = ఒండొరులయొక్క, పాణి సంస్పర్శ = చేతుల తాఁకిడిచేత, సంభృత = ధరింపఁబడిన, ఆనంద = సంతోషముచేత కలిగిన, స్తంభ = మ్రాన్పాటుతో, పరీత = వ్యాప్తమైన, ఆత్మతన్ = శరీరము గలవా రగుటతో - చలనములేని శరీరములు గలవారై అని భావము, ఉండిరి.

తాత్పర్యము:—అప్పుడా యిరువురు నొండొరుల చేతులస్పర్శమునఁ గలుగు నానందముచే నిశ్చేష్టులై ప్రపంచమెల్ల మఱచియుండిరి.

వ. తదనంతరంబ. 36

క. తనరెడు లజ్జాభయవా, సన లుద్బోధమునఁ దనర్పఁ సతి కనుఁగొని మె
ల్లన నిలుఁ డని యాన లిడన్, జని రొక్కొక నెపము చెప్పి సకియ లిరువురున్. 37

అర్థము:—తదనంతరంబు+అ=ఆవెంటనే, తనరెడు = అధికమైన, లజ్జాభయవాసనలు = సిగ్గు యొక్కయు, భయము యొక్కయు, సంస్కారములు, ఉద్బోధమునన్ = వికాసముతో, తనరన్ = అతిశయింపఁగా, సతి=ప్రభావతి, కనుగొని = (చెలులను) చూచి, నిలుఁడు = వెడలక యుండుఁడు, అని, మెల్లనన్, ఆనలిడన్ = ఒట్లుపెట్టఁగా, సకియలు, ఇరువురున్ = చెలికత్తెలిద్దఱును-రాగవల్లరియును, శుచిముఖియును, ఒక్కొక నెపము, చెప్పి, చనిరి = వెళ్లిపోయిరి.

తాత్పర్యము:—ప్రభావతి - సిగ్గును, భయమును అధికముకాఁగా, చెలులను వెడలకుండుఁడని (పతి విను ననుశంకచే) మెల్లగా నొట్లుపెట్టుచుండ - చెలు లిరువురు నొక్కొకనెపము చెప్పి వెడలిపోయిరి.

వ. అప్పుడు ప్రద్యుమ్నుండు. 38

క. నిలువక యటు పోచున్నా, రలికుంతల! చెలుల నేల యానపొడిచె దేఁ
జెలికాఁడఁ గానె యని పై, దలి చెవిలోఁ జెక్కు చెక్కుఁదార్కొనఁ బలికెన్. 39

అర్థము:—అప్పుడు, ప్రద్యుమ్నుఁడు, అలికుంతల = తుమ్మెదలవంటిజుట్టుగలదానా !, చెలులన్= చెలికత్తెలను, ఏల = ఎందులకు, ఆనపొడిచెదు = (పోవలదని) ఆజ్ఞాపింతువు (లేక - ఒట్టిడెదవు), వారు నీ వాజ్ఞాపించినను - నిలువక=ఆఁగక, అటు, పోచున్నారు = వెళ్లుచున్నారు, ఏన్ = నేను, చెలికాఁడన్, కానె, కానా ? అని, చెక్కు = తనచెక్కిలి, చెక్కున్ = ప్రభావతిచెక్కిలిని, తార్కొనన్ = తగులునట్లు, పైదలిచెవిలోన్ = ఆ యింతియొక్క చెవియందు, పలికెన్.

ఈ పద్యము మొదలుకొని 44 పద్యము వఱకు కన్యావిస్రంభణము వర్ణింపఁబడుచున్నది. ప్రథమ సమాగమమున నాయకుఁడు ముగ్ధయగు నాయికకుఁ దనయందు విశ్వాసము కలుగునటు చేయుకృత్యము కన్యావిస్రంభణమని కామశాస్త్రము చెప్పును .'ప్రథమ ముపగతాయాం బాలికాయాంచ చేష్టాం, తమసి రహసి చాహుః సంస్తుతాయాం తరుణ్యాం, క్షణమిహ పరిరంభం పూర్వకార్యేనకుర్యా, న్ముఖమభివద నేన స్వేన తాంబూలదానమ్' ... 'స్తనముకుళమథాస్యాః సంస్పృశే త్పాణిజాగ్రైః। కరతలముపగూహ్యోఽనాభి నీత్వా వికర్షేత్ ...' 'ఇతి మృదుపరిపాట్యోత్సంగమానీయయుంజ। న్నధిక మధికమేవం భీషయేచ్చక్రమేణ॥' ... ఇత్యాది. రతిరహస్యము. కన్యావిస్రంభణాధికారము. 10, 15, 16 శ్లోక.

వ్యా. వి. :—పోవుచున్నారు. పోవుఅనుదానిలోని 'వు' వర్ణమునకు దుగాగమము గాని, ముత్తులు గాని పరమగునపుడు మాత్రమే లోపము వికల్పముగా నగు నని యుండ - వర్తమానకాలిక చువర్ణకము పరమగు నపుడును వు వర్ణలోపము చేయఁబడుట యపూర్వము. ఇట్టిదే కళాపూర్ణోదయము. 3. 88. లోఁ గూడ 'నీ కార్యార్థమె పూని తా నెచటికేనిం గొంచుఁ బోచున్నవాఁ, డో...'అని కలదు. సూరనకుఁ బూర్వమునఁ గాని, పరమునఁ గాని యిట్టిది మఱొక కవి ప్రయోగించినట్లు లేదు. 'చనుచున్నారు' అని యిందును, 'చన్చున్నాఁడు' అని కళాపూర్ణోదయ మందును కవి ప్రయుక్తమై యుండునా అని సంశయము. సరస్వతీ, వావిళ్లప్రతులందు రెంటను, మల్లాదివారి ప్రతియందును గూడ 'పోచున్నాఁడే' యనియే యున్నది. ఇంకను విచార్యము.

వ. అప్పుడు. 40

చ. ఉవిద తదుక్తి కంతఁ జెవి యొగ్గక, పోఁ బెనఁగన్ విభుండు కే
ల్దవిలిచి చుట్టు నించుకయెడన్ భుజముల్ వలగొల్పి పొమ్మనన్
సువదన వెల్వడం దిరుగ శ్రోణి, భుజ, స్తన, వేణికాభర,
శ్రవణ, కపోలముల్ పతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్. 41

అర్థము:—ఉవిద = ప్రభావతి, అంతన్ = అప్పుడు, తదుక్తికిన్ = ఆతనిమాటకు, చెవియొగ్గక, అనుకూలముగా చెలిని నిల్పక, పోన్ = వెడలిపోవుటకై, పెనంగన్ = లాగులాడఁగా, విభుండు = ప్రద్యుమ్నుఁడు, కేలు = చేతులరెంటిని, తవిలిచి = దగుల్కొనఁజేసి, చుట్టును = ప్రభావతికన్ని వైపులను, భుజముల్ = తనబాహువులను, ఇంచుకయెడన్ = కొంచెమెడముగా, వలగొల్పి = చుట్టఁబెట్టి, (వలయాకారముగానిల్పి అని భావము) పొమ్ము, అనన్ = అనఁగా, సువదన = చక్కనిమొగముగలది, ప్రభావతి,; వెల్వడన్ = తప్పించుకొనిపోవుటకై, తిరుగన్ = ఇటు నటు దిరుగఁగా, శ్రోణి... కపోలముల్ - శ్రోణి = పిఱుఁదులును, భుజ = భుజములును, స్తన = కుచములును, వేణికాభర = పెద్దదగు జడయును, శ్రవణ = చెవులును, కపోలముల్ = చెక్కిళులును, పతిని = మగనిని, సారెకున్ = మాటిమాటికిని, సోఁకుచున్ = తగులుచు, ఇంపులన్ = ఆసక్తులయందు, వలపులయందు, తేల్చెన్ = తేలునట్లు చేసెను.

తాత్పర్యము.— ప్రభావతి ప్రియుని మాటకు చెవియొగ్గక వెడలిపోవ లాగులాడఁగా - ప్రియుఁడు తనరెండు చేతులను వలయాకారముగా భుజములు సోఁకకుండ చుట్టును నిల్పి వెళ్లుమన - ప్రభావతి వాని విడిపించుకొని వెడలుటకై యిటు నటు తిరుగుచుండ - పిఱుఁదులు, భుజములు, స్తనములు, వేణి, చెక్కులు, మాటిమాటికి భర్తకుఁ దగిలి యాతనిని వలపులయందు ముంచి తేల్చెను.

వి. :—కేలుదవిలిచి - ఒక చేతి వ్రేళ్ల నొకచేతి వ్రేళ్లసందులందుఁ జొనిపి అని భావము. ఇచట 'కేలు' అనఁగా 'పంచశాఖము' అని కవి వివక్ష. కాని పైభాగము కాదు. కేల్వాదులు నిత్యైకవచనాంతములని ప్రౌఢవ్యాకరణకర్త యనెను. కాని యిట బహువచనముగాఁ గనఁబడుచున్నది. చ. అన విని ధర్మసూనుఁడు కృతాంజలియై తగ భీష్ముడాయ నల్లన చని కేలఁ బాదకమలంబు లమర్చి శిరంబుసోఁక వందన మొనరించినన్...భార. శాంతి. 2. 156. కేలన్ = 'రెండు చేతులయందు' అని యర్థము స్పష్ట మగు చుండుటచే నిత్యబహువచనముగాఁ దొలుత నుండి, క్రమముగా ఏకవచనమునఁ గూడ వ్యవహృత మైనట్లు గోచరించుచున్నది. 'కేల్దవిలిచి చుట్టు నించుక యెడన్' అని లడల కభేద యతి వాడఁబడినది. ఇట్టిదే చ. నిజగౌరవోన్నతు, ల్దలపవుగాని మా దృశ జడస్థితిఁ దెప్పల దేలుచున్న...వసు చ. 2. 134. కలదు.

వ. అంత. 42

చ. నళినదళాక్షి సిగ్గరితనంబుగదా యని యింత చెల్లునే ?
యలయఁ బెనంగి తంచు విభుఁ డంగన హస్తము పట్టి నిల్పి చె
క్కిలి మిగులం జెమర్పఁ బులకింపఁగ ఘర్మకణావళుల్ నఖం
బులఁ గొని పాఱమీటుచునుబొల్పుగ మే నిమిరెం గరంబునన్. 43

అర్థము:—నళినదళాక్షి = తామరఱేకులవంటి కన్నులగలుదానా, సిగ్గరితనంబుగదా = సిగ్గుగలదాన వగుట గదా, అని, ఇంత = ఇంతగా సిగ్గుపడుట, చెల్లునే = తగునా, అలయన్ = శ్రమ కలుగునట్లు, పెనంగితివి = పెనఁగులాడితివి, అంచున్ = అనుచు, విభుఁడు = మగఁడు, అంగనహస్తము = ప్రభావతి

చేతిని, పట్టి = పట్టుకొని, నిల్పి = ఆఁపి, చెక్కిలి, మిగులన్ = ఎక్కువగా, చెమర్పన్ = చెమ్మటలుగలది యగునట్లు, పులకింపఁగన్ = గగుర్పొడుచునట్లు, ఘర్మకణావళుల్ = చెమటబిందువుల మొత్తమును, నఖంబులన్ = గోళ్లతో, కొని = గ్రహించి, పాఱన్ = దూరముగా పడునట్లు, మీటుచున్ = చిమ్ముచు, కరంబునన్ = చేతితో, మే = శరీరమును, నిమిరెన్ = మెల్లగా రాచెను.

వ్యా. వి. :—సిగ్గరి. సిగ్గు + అరి 'సూ. అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు. బాల తద్ధిత. 17.

సీ. మఱియుఁ గపోలచుంబన సమీపతయాస, రిత్తమంతనము సారెకు వచించి,
యభివీక్షణేచ్ఛ నమ్రాననం బెగనెత్తి, కొనగోళ్లఁ బలుమఱుఁ గురుల దువ్వి
చనుగుబ్బ లంట ముచ్చటపడి మాటికిఁ, బయిఁటపై నెరసులు పాఱమీటి
గనయంబు ముట్టుటకును జేరికలుగ వే, మాఱును మొలనూలిమణులు దుడిచి

బెదరుడిపి వ్రీడ జాడ్యంబు వదలఁ జేసి, కాంత నొగి మెత్తమెత్తనఁ గౌఁగిలించె
నీవి తనయంతటనె జాఱె నెయ్యమెఱఁగి, పాణిఁ జెక్కిలి నొక్కి చుంబనముచేసె.

అర్థము:—మఱియున్, కపోలచుంబన ... యాసన్ - కపోల = చెక్కిటియొక్క, చుంబన = ముద్దుపెట్టుకొనుటకైన, సమీపత = దగ్గఱ యగుటయందలి, ఆసన్ = కోరికచేత - ముద్దుపెట్టుకొన సమీపింప వలె ననిన యాశచేత ననిభావము ('చుంబన సమాగతి' యను పాఠమున - చుంబన = ముద్దుపెట్టు కొనుటయొక్క, సమాగతి = ప్రాప్తియొక్క, ఆసన్ = కోర్కిచేతను, అని యర్థము చెప్పుకొనఁ దగును.) రిత్తమంతనము = వట్టి యేకాంతమును - అనఁగా చెప్పవలసినది యేమియు లేకున్నను ఏదియో యున్నట్లు రహస్యమని చెప్పుట. సారెకున్ = మాటి మాటికి, వచించి = (చెవియందు) చెప్పియు, అభివీక్షణేచ్ఛన్ = చూచుటయందలి కోర్కిచే, నమ్రాననంబు = వంగిన ముఖమును, ఎగనెత్తి = మీఁది కెత్తి, పలుమఱున్ = పెక్కుమాఱులు, కురులన్ = తలవెండ్రుకలను, గోళ్లన్ = గోళ్లతో, దువ్వి, చనుగుబ్బలు = వట్రువయైన కుచములను, అంటన్ = ముట్టుటకు, ముచ్చటపడి = తహతహపడి, మాటికిన్ = పెక్కుసారులు, పయిఁటపై నెరసులు = పైఁటమీఁదబడిన నలుసులను, పాఱన్ + మీటి = దూరముగాఁ బడఁజిమ్మియు, గనయంబు = పోఁకముడిని, ముట్టుటకును = తాఁకుటకు, చేరికలు = చేరుటలు, కన్ = కలుగునట్లు, మొలనూలిమణులు = మొలత్రాటియందలి రత్నములను, వేమాఱు = పెక్కుమాఱులు, తుడిచి, బెదరు = భయమును, ఉడిపి = పోఁజేసి, వ్రీడజాడ్యంబున్ = సిగ్గుచేఁ గలిగిన మాంద్యమును, (లేక వ్రీడన్ = సిగ్గును, జాడ్యంబున్ = మాంద్యమును, అనియైనను జెప్పవచ్చును.) వదలఁజేసి = పోఁగొట్టి, కాంతన్ = ప్రభావతిని, ఒగిన్ = క్రమముగా, మెత్తమెత్తనన్ = మిగుల నొత్తనట్లు, కౌఁగిలించెన్, నీవి = పోఁకముడి, తనయంతటనె, జాఱెన్ = విడిపోయెను, (ఇచట మీఁదివాక్యము ననుసరించి 'జాఱన్ = విడిపోఁగా' అనుపాఠ మున్నచో బాగుగ నుండును. ఏకకర్తృకవాక్యముల నడుమ భిన్నకర్తృకవాక్య ముండుట క్రమభంగ దోష మగును.) నెయ్యము = అనురాగమును, ఎఱఁగి, పాణిన్ = చేతితో, చెక్కిలి, నొక్కి = నొక్కిపట్టి, చుంబనముచేసెన్ = ముద్దుపెట్టుకొనెను. (నానా. నీవి=1. పోఁకముడి, 2. మూలధనము, 3. పందెపుసొమ్ము. గనయము = 1. పోఁకముడి, 2. వింటికొప్పు.) ఇందు వర్ణింపఁబడిన నాయకునిచేష్ట లన్నియు నాయికకుఁ దనయందు-విస్రంభణము = విశ్వాసముకలిగించుకొఱకే యని తెలియఁదగును - ఇది కామశాస్త్రప్రసిద్ధము.

వ. తదనంతరంబ.

ఉ. శౌరిసుతుండు బాలికను ♦ శయ్యకుఁ దార్చి యదీర్ఘయత్నత
ద్వారణసంప్రబుద్ధరసతన్ దరితీపుగ మించు బాహ్య నా
నారతభోగలీలల మనంబునఁ జొక్కుచుఁ జొక్కఁజేసెఁ బో
తా రత మల్ప మల్పముగఁ ♦ దన్మతియోర్పుకొలందిఁ జేయుచున్. 46

అర్థము:—శౌరిసుతుండు = కృష్ణునికొడుకగు ప్రద్యుమ్నుఁడు, బాలికను = ముగ్ధయగుప్రభావతిని, శయ్యకున్ = పాన్పునకు, తార్చి = చేరఁదీసి, అదీర్ఘ...పరతన్ - అదీర్ఘయత్న = ఎక్కువయత్నము లేని, తద్వారణ = ఆమెయొక్కనివారించుటచేతను, సంప్రబుద్ధ = తెలియఁబడిన - (మిక్కిలి మేల్కొనిన - అని యైనను జెప్పవచ్చును.) రసతన్ = అనురాగము గలవాఁడగుటచేతను, తరితీపుగన్ = తమకము కలుగ, మించు = ప్రకాశించునట్టి, బాహ్యానానారత = వెలుపటివగు (కౌఁగిలి, ముద్దులు, నఖ, దంతక్షతములు మొదలగు) పెక్కువిధముల రతులయొక్క, భోగలీలలన్ = సుఖక్రియలచేతను, మనంబునన్ = మనసునందు, చొక్కుచున్ = పరవశుఁడగుచు, తాన్ = తాను, తన్మతియోర్పుకొలందిన్ = ఆమె బుద్ధియొక్క యోరిమిప్రమాణముతో - ఆమె యెంతదాఁక నోరువఁగలదో కనిపెట్టి యంతదాకనే, రతము = సంభోగమును (ఆభ్యంతరరతిని) అల్పమల్పముగన్ = కొంచెముకొంచెముగ, చేయుచున్, చొక్కఁజేసెఁబో = పరవశురాలి నొనర్చెనేకదా!

తాత్పర్యము:—బాలిక యగుప్రభావతిని ప్రద్యుమ్నుఁడు పాన్పుచేర్చి, తా నొనర్చు నాలింగన చుంబనాదిక్రియా రూప మగు బాహ్యరతిలీలలను వారించుట మానసున్నను, నావారించుట కొంచెమే యగుటచే నామెకుఁ గూడ నిష్టమైనట్లు గ్రహించి, తా నాక్రియలచేఁ జొక్కుచు, ఆమె యొంతవఱకోర్వఁగలదో తెలిసి, దాని కనువుగ నల్పాల్పముగ నాభ్యంతరరతము నొనర్చుచు నామెను జొక్కజేసెను.

అలం. :—పరికరము.

వి. :—బాలికాశబ్దము ముగ్ధాత్వద్యోతకము. అంతియకాని పసిపాపకాదు. 'అష్టవర్షాభవేత్కన్యా నవవర్షాతు రోహిణీ। దశవర్షాభవే ద్గౌరీ బాలా తత్షోడశావధి' అని, గుణపతాకునిమత మని వాత్స్యాయనకు. పదిమొదలు పదియాఱేండ్లనడుమ వయస్సుగలది 'బాల' అని కామకలాపరిభాష. 'బాహ్యానానా రతలీలలన్' అని బాహ్యరత మని చెప్పి, తరువాత 'రత మల్ప మల్పముగ' అని 'రత' మనుచు సామాన్యముగాఁ జెప్పినను పరిశేషన్యాయమున ఆభ్యంతరరత మని గ్రహింపఁదగు. 'బాహ్య మాభ్యంతరం చేతి ద్వివిధం రతముచ్యతే! తత్రాద్యం చుంబనాశ్లేషనఖదంతక్షతాదికం। ద్వితీయం సురతం సాక్షా న్నానాకరణ కల్పితం' అని వాత్స్యాయనుఁడు. 'తన్మతియోర్పుకొలంది' ప్రద్యుమ్నుఁడు ప్రవర్తించుటకుహేతువు ఆమెకుఁ దన యందు ననురాగము కల్గుట కని. కన్యావిస్రంభణప్రకరణమున వాత్స్యాయనుఁ డిట్లు చెప్పెను.

'ఏవం చిత్తానుగో బాలా ముపాయేన ప్రసాధయేత్, తథా స్య సానురక్తా చ సువిస్రబ్ధా ప్రజాయతే, నాత్యంత మానులోమ్యేన న చాతి ప్రాతిలోమ్యతః, సిద్ధిం గచ్ఛతి కన్యాసు తస్మా న్మధ్యేన సాధయేత్, ఆత్మనః ప్రీతిజననం యోషితాం మానవర్ధనం, కన్యావిస్రంభణం వేత్తి యస్స తాసాం ప్రియో భవేత్,అతిలజ్జాన్వితే త్యేవం యస్తు కన్యా ముపేక్షతే,సో నభిప్రాయవేదీతి పశువ త్పరిభూయతే, సహసా వాప్యుపక్రాంతా కన్యాచిత్త మవిందతా, భ్రమం విత్రాస ముద్వేగం సద్యోద్వేషం చ గచ్ఛతి' అని ఇందు నాయిక ముగ్ధగా నిరూపింపఁబడెను. 'నవనవకామ యౌవనసనాథయు నల్పరతంబు గల్గున, య్యువిదయె ముగ్ధ... అని' నరసభూపాలీయము. 1 '...రతౌ వామాకథితా మృదుశ్చ మానే సమధికలజ్జావతీ ముగ్ధా.' అని. సాహిత్యదర్పణము. (అదీర్ఘయత్నవారణమే రతియందు వామాత్వము.)

గీ. సౌరభమె చిక్క లోనికి ♦ జాఱెనొక్కొ, రాయిడికిఁ గాక బహిరంగ ♦ రాగ మెల్ల
నన్నఁగ నినుమడించుచు నంతరంగరాగ, మలరఁ బెనఁగిరి దంపతు ♦ లతులరతుల. 47

అర్థము:—సౌరభమె = పరిమళముమాత్రమే, చిక్కన్ = మిగులఁగా, బహిరంగరాగము - బహిః అంగరాగము = దేహముపైని బూసికొనినపూఁత, (బహిరంగ = ప్రకటమైన, రాగము = అనురాగము - అని యర్థాంతరము.) ఎల్లన్ = అంతయును, రాయిడికిన్ = సమ్మర్దమునకు, ఓక = సహింపఁజాలక, లోపలికిన్ = దేహములలోపలికి, పోయెనొక్కొ, అనఁగన్, అంతరంగ + రాగము = లోపలిసంభోగమందలి యనురాగము, ఇనుమడించుచున్ = రెట్టించుచు, అలరన్ = ప్రకాశింపఁగా, (అంతః + అనురాగముతో, గలియఁగా ద్విగుణమయ్యెనని భావము.) దంపతులు = ఆల్మగలు, అతులరతులన్ = సాటిలేని సురతక్రియలచే, పెనఁగిరి = కలిసిరి, ఆలింగనాదులచే నొండొరుల దేహములఁ బూసికొనిన గంధము కుంకుమము మొదలగువానిపూఁత జాఱిపోఁగా నాయంగరాగమును బాహ్యసురతమందలి యనురాగముతో నభేదాధ్యవసాయమొనర్చి, పరిమళముమాత్రమే దేహములందు మిగులఁగా, ఆలింగనాదులసమ్మర్దమునకుఁ దాళలేక లోనికిం బోయెనేమో యని యుత్ప్రేక్షింపఁబడి, బాహ్యరతమున కనంతరము కలుగు నాభ్యంతర రతమున అనురాగము ద్విగుణిత మగుటకు హేతువుగా నుత్ప్రేక్షింపఁబడెను.

తాత్పర్యము:—వారిరువుర కౌఁగిళ్లరాయిడికిని బహిరంగము (= వెలుపల దేహములందుండెడు పూఁతలనెడి బహిరంగమగు అనురాగము) పరిమళము మాత్రమే దేహములందు మిగులఁగా, తక్కినదంతయు దేహములోనికి పోవుటచేత, అంతకుమున్నంతరంగములం దుండెడి రాగము ద్విగుణమై, దానిచే నాదంపతులు సాటిలేనట్లు క్రీడించిరి. ఇందు బహిః + అంగరాగము, బహిరంగ + రాగము, అనియు, అంతః + అంగరాగము, అంతరంగ + రాగము అనియు - అంగరాగము = మైపూఁత - రాగము = అనురక్తి, ప్రేమము, అనియు తెలియఁదగును.

అలం.:—శ్లిష్టరూపకానుప్రాణితమగు ఉత్ప్రేక్ష.

వ. ఇవ్విధంబున. 48

చ. స్వకుతుకపూర్తిగాఁగ రతి సల్పి సుషుప్తి వహించి రంత నా
యికయును నాయకుండుఁ దమయిద్దఱయంగములున్ విమిశ్రభా
వకలనఁ జిక్కుఁజీరుపడ వైచిన చంపక నీలకంజమా
లికలతెఱంగునన్ బరఁగ లేఁజెమటల్ నునుగాలి నాఱఁగన్. 49

అర్థము:—నాయికయును = ప్రభావతియును, నాయకుఁడున్ = ప్రద్యుమ్నుఁడును, స్వకుతుకపూర్తి - స్వ = తమయొక్క, కుతుక = ఉత్కంఠ, (కమకము) యొక్క, పూర్తి = నిండుట, (తీఱుట యన్నమాట) కాఁగన్ = కలుగునట్లు, రతి, సల్పి, అంతన్ = అటుమీఁద, చిక్కుజీరుపడన్ = చిక్కుగాఁ బెనఁగొనునట్లు, వైచిన = వేసిన, చంపక = సంపెంగలయొక్కయు, నీలకంజ = నల్లకలువలయొక్కయు, మాలికలతెఱంగునన్ = దండలవిధమున, తమ యిద్దఱయంగములున్ = నాయికయొక్క పచ్చనిదేహమును, నాయకునియొక్క నల్లనిదేహమును, విమిశ్రభావకలనన్ = ఒండొంటితోఁ గలిసి యుండుటతో, పరఁగన్ = ఒప్పఁగా, లేఁజెమటల్ = చిఱుచెమటలు, నునుగాలిన్ = పిల్లగాడ్పుచే, ఆఱఁగన్ = ఇంకిపోవఁగా, సుషుప్తిన్ = నిద్రను, వహించిరి = పొందిరి.

తాత్పర్యము:—తమ మనసులం గల తహతహ తగ్గిపోవునట్లు రతిచేసి ప్రభావతియును, ప్రద్యుమ్నుఁడును తమ యిరువుర యవయవములు పెనఁగొనుటచేత సంపంగి పూలదండయు నల్లకలువదండయుఁ జిక్కుపడునట్లు పడవైచినరీతిని, నొప్పఁగా సురతాయాసమునఁ బొడమిన చిఱుచెమటలు సన్నగాలికి నాఱిపోఁగా నిద్రవోయిరి.

వి. :—కంజము = నీటియందుఁ బుట్టినది - పద్మము అని యోగరూఢశబ్దము, అయినను నీలశబ్ద పర్యాయములతో పద్మపర్యాయ శబ్దములు సమసించినచో 'నల్లకలువ' యను నర్థమునందు రూఢము లగును. 'అథనీలాంబు జన్మచ, ఇందీవరంచ నీలే స్మిన్' అని అమరము. ఇట్లే 'రక్త' శబ్దపర్యాయ శబ్దములతో 'ఉత్పల' శబ్దము సమసించినచో - 'ఎఱ్ఱతామర' అని యర్థమగుచున్నది. 'అథరక్త సరోరుహం। రక్తోత్పలం కోకనదమ్' అనియమరము. అదియుంగాక లోకమున నల్లకలువ లుండునే కాని నల్లతామరలు లేకుండుట ప్రసిద్ధము. కావున నీలకంజము లన నల్లకలువ లనియే గ్రహింపఁదగును.

అలం:—ఉపమ, యథాసంఖ్యము (క్రమము).

వ్యా. వి. :—లేఁజెమటలు - లేఁత + చెమటలు, ప్రాఁతాదిసంధి.

వ. అంత. 50

క. అరుణాంశుపటలి యను వాసరరాజపురోధృత ధ్వజంబుకొనన్ వి
స్ఫురిత మగు రత్నమో యన, సురపతిదిశయందు వేగుఁజుక్క వెలింగెన్. 51

అర్థము:—అంతన్ = అనంతరము, సురపతి దిశయందున్ = ఇంద్రుని దిక్కగు తూర్పున, వేగుఁ జుక్క = తెల్లవాఱుజామున నుదయించు నక్షత్రము (శుక్రగ్రహము), అరుణాంశుపటలి = ఎఱ్ఱనికిరణముల ప్రోగు, అను = అనెడి, వాసరరాజ = దిననాథుఁడగు సూర్యునియొక్క, పురః = ఎదుట, ధృత = ధరింపఁబడిన, ధ్వజంబుకొనన్ = జెండాతుదను, విస్ఫురితము = ప్రకాశించునది, అగు రత్నమో = అయి నట్టి మణియో, అనన్ = అనునట్లు, వెలింగెన్ = ప్రకాశించెను.

తాత్పర్యము:—సూర్యోదయమునకుఁ బూర్వము వేగుఁజుక్క పొడుచుటయు, ఆ వేగుఁజుక్క వెనుకనే సూర్యకిరణకాంతిపుంజము తోఁచుటయు నిత్యము జరుగును. ఇందు ఆ యెఱ్ఱనికిరణసముదాయము సూర్యునియెదుట నెత్తఁబడిన జెండా (గుడ్డ) వలెను, వేగుఁజుక్క యా జెండాకొనను మెఱయు రత్నమో యనునట్లుండె ననియు వర్ణింపఁబడెను.

అలం:—రూపకానుప్రాణితమగు వస్తూత్ప్రేక్ష.

వి. :—వేగుఁజుక్క యెఱ్ఱగా నుండును. కాన రత్నముగా నుత్ప్రేక్షింపఁబడినది. నవరత్నములలో మాణిక్య మొక్కటే మిగుల నెఱ్ఱనిది. తక్కినవి భిన్నకాంతులు గల వగునప్పుడు మాణిక్యము లేక కెంపు అనక రత్న మని సామాన్యముగా నిందు గ్రహింపఁబడుటకుఁ గారణము కవిసమయము. 'సామాన్యగ్రహణే వారిముచాం కృష్ణత్వ మేవహి, రక్తత్వ మేవ రత్నానాం పుష్పాణాం శౌక్ల్య మేవచ.' సామాన్యముగాఁ (అవిశేషముగా) జెప్పవలసినయెడల మేఘములు నల్లనివనియు, రత్నము లెఱ్ఱనివనియు, పువ్వులు తెల్లని వనియు - కవులు వర్ణింతురు అని ప్రమాణము.

చ. యదుకులచూళికాభరణ మంతట మేల్కొని, నిద్రచొక్కనన్
వదలినకౌఁగిలి న్మొలపునన్ బిగియించుచుఁ జెక్కు చెక్కటన్
గదియఁగ నొత్తి యొత్తి తనకాంతను మేల్కొలిపెన్ మృగాక్షియున్
నిదుర దొఱంగి చూచుచునె నేత్రము లెప్పటి మూసె సిగ్గునన్. 52

అర్థము:—అంతటన్ = ఆ సమయమున, యదు...భరణము - యదుకుల = యదువుయొక్క వంశమునఁ బుట్టినవారికి, చూళికాభరణము=శిఖయందలినగ - అనఁగా యాదవశ్రేష్ఠుఁ డగు ప్రద్యుమ్నుఁడు, మేల్కొని= తెలివివొంది, నిద్రచొక్కనన్ = నిద్రవలనఁ గలిగిన వివశత్వముచేత, వదలిన = విడిపోయిన,

కౌఁగిలిన్ = బాహుబంధమును, మెలపునన్ = నేర్పుతో, బిగియించుచున్, చెక్కు చెక్కిటన్ = (ప్రభావతి) చెక్కిలియందు, కదియఁగన్ = తాఁకునట్లు, ఒత్తియొత్తి = మిక్కిలినొక్కి, తనకాంతను = తనప్రియురాలిని, మేల్కొలిపెన్, మృగాక్షియున్ = (లేడికన్నులవంటి కన్నులు గలది) ప్రభావతియును, నిదుర, తొలఁగి = విడిచి, చూచుచును + ఎ = (చలించు చూపులతో) చూచియు చూచుటలోనె, సిగ్గునన్, నేత్రములు = కన్నులు, ఎప్పటిన్ = ఎప్పటివలె - అంతకు ముందటివలె, మూసెన్ = మూసికొనెను.

తాత్పర్యము:—అట్లు శుక్రోదయము కాఁగానే ప్రద్యుమ్నుఁడు మేలుకొని, నిద్రమత్తున విడిపోయిన బాహుబంధమును నెమ్మదిగా బిగించుచు బ్రియురాలి చెక్కునఁ దనచెక్కు చేర్చి, యొత్తి యొత్తి యామెను లేపెను. ఆమెయును మేల్కొనెను. కాని కన్నులు విచ్చి చూచియు చూచుటతోనే సిగ్గుచే మరల మూసికొనెను.

అలం. :—స్వభావోక్తి, 'మృగాక్షి' సాభిప్రాయ విశేష్యమగుట 'పరికరము.'

వ్యా. వి. :—కౌఁగిలిన్-ఔపవిభక్తికత్వము వికల్పము. కౌఁగిటిన్. మేల్కొను - ప్రేరణరూపము, మేల్కొలుపు.

సీ. అంతఁ గామిని కన్ను లర విచ్చి సురతసం, క్షుభితవేషము పతి చూడకుండఁ
దనదుచెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి, పొరిపొరి నది దానఁ బులకితముగఁ
గెంగేల నతనికౌఁగిలి యాఁగి యెడఁగొంచుఁ, జేలాంచలము పెఱచేతఁ దడవి
తెచ్చి పాలిండ్లపై మీఁదికిఁ జొనుపుచు నితం, బావృతి నరసి రెండవ చెఱంగు

గీ. కటితటం బెత్తియెత్తి క్రిందటికిఁ బరపి, లోను గా దానిపై యంచుతో నమరఁగఁ
బొక్కిలి గదించి పట్టి మూఁపున నరవిరి, వదలు తుఱు మానుకొనుచు లేవంగఁ గడఁగె.

అర్థము:—అంతన్, కామిని = ప్రభావతి, (కామము = వలపుగల యాడుది. అనిః కన్నులు, అర = సగముగా, విచ్చి, సురత = సంభోగముచేత, సంక్షుభిత=కలఁగిపోయిన - చెదరిపోయిన యని భావము, వేషము = (తన) వస్త్రాభరణాది ధారణము, పతి, చూడక + ఉండన్, తనదు చెక్కిలి, మొగంబునకున్ = (పతియొక్క) ముఖమునకు, అడ్డముగన్, చేర్చి, పొరిఁబొరిన్ = అత్యంతము, అది = (తన) ఆ చెక్కిలి, తాన = తనంతఁదానై, పులకితము = గగురుపాటుగలది, కన్ = కాఁగా, కెంగేలన్ = (మార్దవముచే) ఎఱ్ఱనగు నఱచేతితో, అతనికౌఁగిలి, ఆఁగి = ఆఁపి, - తన్నాతఁడు కౌఁగిలించుకొనకుండఁ జేసి, ఎడగాంచున్ = అవకాశము కలిగించుకొనుచు, చేలాంచలము = పైఁటకొంగు, పెఱచేతన్ = రెండవ చేతితో, తడవి తెచ్చి = వెదకిపట్టుకొని తెచ్చి, పాలిండ్లమీఁదికిన్ = స్తనములపైకి, చొనుపుచున్ = దూర్చుచు, నితంబ + ఆవృతిన్ = మొలకు కప్పు లేకుండుటను, అరసి = చూచికొని, రెండవచెఱంగు = కట్టుకొంగును, కటితటంబు = మొలను, ఎత్తి యెత్తి = పలుమఱు పైకెత్తి, క్రిందటికిని = మొలకును పిఱుఁదులకును క్రిందుభాగమునకు, పరపి = వ్యాపింపఁజేసి, లోనుగాన్ = (పిఱుఁదులక్రిందనుండి చుట్టివచ్చిన యాకట్టుకొంగు) లోపల నుండునట్లు, దానిపై యంచుతో = ఆ కొంగుయొక్క మీఁది యంచుతో, అమరఁగన్ = కూడునట్లు, పొక్కిలి = నాభిని, కదించి = కదియించి, చేర్చి, పట్టి = పట్టుకొని, మూఁపునన్ = భుజశిరస్సునందు, (అంసమునం దన్నమాట), అరవిరి = సగము విడిపోయినదియును, వదలు = జాఱిపోవునదియు, (నగు) తుఱుము = కొప్పును, ఆనుకొనుచున్, లేవంగఁగడఁగెన్ = లేచుటకై యత్నించెను.

తాత్పర్యము:—మగఁడు తన్నట్లు నిద్రనుండి మేల్కొలుప సంభోగమునఁ జెదరి యుండిన తన వేషమును బతి చూడకుండ పరుండియే సవరణ చేసికొను ప్రభావతియొక్క చేష్ట లిందు వర్ణితములు. నిదుర నుండి మేల్కొని కన్నులు తెఱవఁగనే మగనికౌఁగిటిలోఁ దా నుండుట తెలిసికొని, కొంచెముసేపు సిగ్గుచే కనులు

మూసికొని, మరల కన్నులు సగము విచ్చి, రతియందుఁ జెదరిపోయిన వస్త్రాద్యలంకారములు భర్త చూడకుండ నాతని మొగమునకు తనచెక్కిలి యడ్డముగాఁ బెట్టి, పరుండియే, ఆతని కౌఁగిలి నొకచేతితో నాఁపి, రెండవ చేతితో ముందుగా పైఁటకొంగు స్తనములమీఁదికిఁ దెచ్చుకొని కప్పుచు, మొలనుండి బట్ట జాఱిపోవుట గమనించి, ఆకట్టుకొంగును కటి కొంచెము కొంచెముగాఁ బలుమ ఱెత్తి పిఱుఁదులక్రిందనుండి నాభిపైప్రకు తెచ్చి యా కొంగుకొన లోపల నుండునట్లు పైయంచులో కలిపి నాభిపైఁ జేర్చి పట్టుకొని, సగము విడిపోయి జాఱుచు మూఁపున వ్రేలు కొప్పు నానుకొని లేవ యత్నించెను.

అలం:—స్వభావోక్తి - ఇందు భర్త తన సంక్షుభితవేషము చూడకుండనే ప్రక్కను బరుండియే సవరణచేసికొన నింత శ్రమ మొందుటకు లజ్జయే హేతువు. దానిని వ్యంగ్య మొనర్చుచుఁ బ్రభావతియొక్క నేర్పును, సౌకుమార్యము, ముగ్ధానాయికాత్వమును కవి ప్రకటించెను.

క. ఈ చాడ్పునఁ బానుప్పుపై, లేచుచుఁ గడు నింపు గులుకు లేమ విలాస
శ్రీచేఁ జిత్తము కరఁగఁగ, నాచెలువుఁడు మగుడఁ దిగిచి యక్కునఁ జేర్చెన్.

అర్థము:—ఈ చాడ్పునన్ = ఈ విధముగా, పానుపుపైన్ = పానుపుమీఁదనుండి, లేచుచున్, కడున్, ఇంపు = సొగసును, కులుకు = చిమ్ముచున్నట్టి, లేమ = ప్రభావతియొక్క, విలాస శ్రీచేన్ = (భర్త తన్నుఁ జూచుటచేఁ గలుగు తాత్కాలిక వికారము - విలాసము, అట్టి) శృంగార చేష్టలయొక్క యతిశయముచే, చిత్తము = మనస్సు, కరఁగఁగన్, ఆ చెలువుఁడు = ఆ సొగసుకాఁడు, మగుడన్ = మరల, తిగిచి, = ఆకర్షించి, లాగి, అక్కునన్ = ఱొమ్మునందు, చేర్చెన్ = చేర్చుకొనెను.

తాత్పర్యము:— వెనుకటిపద్యమున కరఁగిపోయిన మైపూఁతతో, పయ్యెదయు, కట్టుకొంగును గూడఁ జాఱిపోయిన బట్టకట్టుతో, విడిపోయిన కొప్పుతో, నున్న నాయికారూపమున జుగుప్సాస్థాయిక మగు బీభత్సరసము స్ఫురించి, 'బెడిదమౌ శృంగార బీభత్సములకు నంకాపాంకములు' అనులక్షణముచొప్పున ప్రకృత మగు శృంగారమునకు విరోధము కలుగునని యాబీభత్సలేశము గూడ స్ఫురింపకుండుటకై - ఈవిధముగాఁ బాన్పుమీఁదనుండి లేచుచు ప్రభావతి చూపిన విలాసములచే మనసున నానందము పట్టఁజాలక ప్రద్యుమ్నుఁ డామెను సగముసగముగాఁ గట్టుకొన్న బట్టతో నున్నను మరల హృదయమునఁ జేర్చుకొనెను. అనఁగా నాలింగన మొనర్చెను అనిభావము.

వి. :— ఆమె పాన్పునుండి లేచుచుఁ జూపిన విలాసములతో మనసుకరఁగిపోవుటచే వేష మెట్లున్నదో నాయకునకు స్ఫురింప నవకాశము లేకుండ వర్ణించి పైని సూచించిన రసవిరోధము తొలఁగింపఁ బడినది. అట్టి బీభత్సరససూచన కవకాశము లేకుండుటకే 'స్వకుతుకపూర్తి గాఁగ' అను 49 పద్యమున 'లేఁజెమట లున్న గాలి నాఱఁగన్' అని ముందుగానే కని మేల్కొనె నని యెఱుంగునది. ఇట్టి పట్టున సామాన్యముగా నింత సవిమర్శముగా నేకవియు వర్ణింపలేదు. వర్ణింపఁ బూనుచో రసవిరోధము కలుగకుండ నిట్లు సమర్థించుట యసాధ్యము కావున. దీనివలన సూరన ప్రతిభావిశేషము వ్యక్తము. భోజచరిత్రమున కాళిదా సొక్కఁడు మాత్రమే రత్యంతస్త్రీని నాచితి చెడకుండ బీభత్సశంక కలుగకుండ వర్ణించె ననియొక శ్లోకము కనఁబడుచున్నది. 'శాంతే మన్మథసంగరే రణజితాం సత్కార మాతన్వతీ, వాసోఽదా జ్జఘనస్య పీనకుచయో ర్హారం శ్రుతేః కుండలే, బింబోష్ఠస్యచ వీటికాం సువదనాపాణ్యో ర్ఘ్మణత్కంకణే, పశ్చాల్లంబిత కేశపాశనిచయే బంధో హి యుక్తక్రమః' రత్యంతమున - బట్టలేని దిస్సమొలతో, హారములు త్రెవ్వినచనుఁగవతో, కమ్మ లూడిపోయిన చెవులతో, తాంబూలరక్తిమ చెడినమోవితో, కంకణశూన్య మగుహస్తములతో, విడిపోయిన కొప్పుతో నున్నస్త్రీస్వరూపము బీభత్సమునకు నాలంబ మగుట నిస్సందేహము. ఆరూపము వర్ణించుచు జుగుప్స లేశ మైనను స్ఫురింపకుండ - సురతము మన్మథయుద్ధము కావున, యుద్ధము ముగిసినపిదప జేతలగు యోధులకు బహుమానములును, భయపడి వెన్నాడిన యోధులకు బంధనాది శిక్షలును ప్రభువులు నెఱపుట లోకమున నుండుటచే నాయిక యాప్రకారమే మన్మథయుద్ధమున ముందు

భాగమున నిల్చి తనకు జయమును సమకూర్చిన జఘనమునకు వస్త్ర (బహుమాన) మును, కుచములకు ముత్యాలహారములును, చెవులకుఁ గుండలములును, అధరమునకు తాంబూలమును, చేతులకు గణగణ మను మణి కంకణములును బహుమాన మొసఁగి, యుద్ధసమయమున ముందునకురాక, బెదరి పరువెత్తఁ జూచిన కేశపాశమునకు బంధన శిక్ష వేసినది. అది యుద్ధనీతి క్రమమే కదా. అని రసాంతరస్ఫూర్తియే కాని బీభత్స శంకాలేశము గూడ కలుగనట్లే యిచ్చటను గ్రహింపఁదగును. 'యథాస్మై రోచతే విశ్వం త థేదం పరివర్తతే.'

విలాసము :—అనఁగా శృంగారచేష్టావిశేషము. 'క. పతిఁ గనఁ దాత్కాలిక మగు, నతులవికారము విలాస మగు.' అని నరసభూపాలీయము.

వ. తదనంతరంబ కార్యాంతరచింత చిత్తంబునఁ బొడమఁ దనవదనంబు ముదితచెవిం గదియించి యోయువిద యిది మొదలుగ మాపు లెల్ల నిచ్చటికి వచ్చెదఁ గాని ఱేపులు దప్పకుండ మావిడిదిన యుండకున్న రహస్యభంగంబు పుట్టిన మన మనోరథంబు విఘ్నాకులం బగుం గావున నిక్కడనుండి మదీయ నివాసంబుదాఁక భూవివరంబు గల్పించుకొని పోయెదఁ దద్ద్వారం బన్యుల కెఱుకపడ కుండు నట్లుగ సంవరణంబు గావింపు మని చెప్పి యప్పలుకులకు నాలజ్జావతి యంగీకారసూచనంబుగాఁ దల యెగుర వైవ నుక్తప్రకారంబున నిజనికేతనంబునకరిగెఁ బ్రభావతియుఁ దద్బిలంబు తగు తెఱంగున సంవృతంబు గావించె నంత. 55

అర్థము :—తదనంతరంబు + అ = ఆవెంటనే, కార్యాంతరచింత = వేఱొకపనియందలితలంపు, చిత్తంబునన్ + పొడమన్ = జ్ఞప్తికిరాఁగా, తనవదనంబు = తనముఖము, కదియించి = చేర్చి, మాపులు= రాత్రులు, ఱేపులు = పగటివేళలు, రహస్యభంగంబు = రహస్యమునకుహాని, మనోరథంబు = కోరిక, విఘ్నాకులము = ఆటంకములచే గలఁతనొందినది, మదీయనివాసంబు = నాదగువిడిదకు, భూవివరంబు = భూమియందలికన్నము, సొరంగము, తత్ + ద్వారంబు = ఆసొరంగముయొక్కముఖము, సంవరణము = కప్పుట, లజ్జావతి = ప్రభావతి (లజ్జకలదికావున మాటచెప్పలేక) అంగీకారసూచకంబుగన్ = తనసమ్మతికి గుర్తుగా, ఉక్తప్రకారంబునన్ = చెప్పినరీతిగా, నిజనికేతనంబునకున్ =తన (విడిసిన) యింటికి, తద్బిలంబు= ఆసొరంగము, సంవృతంబు = మూయఁబడినది.

తాత్పర్యము:—తరువాత వేఱొకకార్యము తలఁపునకురాఁగా ప్రభావతి చెవిలో ఓచెలీ! నేఁడు మొదలు రాత్రు లిటకు వచ్చుచుందును. పగలు మావిడిదియందే యుందును. లేకున్న రహస్యము బయల్పడును. కాన నిక్కడనుండి మావాసగృహమునకు సొరంగము త్రవ్వుదును. ఇతరులకు తెలియకుండ దాని ద్వారము మూసియుంచుము. అననామె తలయూఁచెను. ప్రద్యుమ్నుఁ డట్లే యేఁగెను. ప్రభావతియు నాబిల ద్వారము మూయించెను. ఆసమయమున.

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు 'వివిధం శ్ఛంద స్త్రియామాంత రం
తిమయామో భగవాన్ ఋషిః, కుసుమధన్వీ దేవతా, మానినీ
రమణాయాం వినియోగ' యంచు నిది యారంభింపఁ గాఁబోలు నా
నమరెం దద్ధ్వని మానినుల్ రతికిఁ దార్మై నాథులన్ బైకొనన్. 56

ఈపద్యమున కోడికూఁతను మహామంత్రముగా కవి వర్ణించుచున్నాఁడు. సామాన్యముగా మంత్రములకు ఋషి, చ్ఛందో, దేవతా వినియోగము లుండును. కొన్నిటి కీనాలుగు గాక, బీజ, శక్తి, కీలకములు నుండును. అయ్యవి మంత్రశాస్త్రసిద్ధములు.

అర్థము:—కుక్కుటంబు = కోడి, సమయ = (సమయాః శపథాచార, కాల, సిద్ధాంత సంవిదః– అని అమరము) మంత్రశాస్త్ర సిద్ధాంతములయొక్క, అభిజ్ఞతన్ = తెలియుటచేతను, (రాత్రి, పగలు, వేకువ మొదలగు కాలభేదముల నెఱిఁగిన దగుటచేతను అని యర్థాంతరము) వివిధం ఛందః = గాయత్ర్యుష్ణి క్త్రిష్టు బాదికములగు పెక్కులు ఛందస్సు, త్రియామాంతిః + అంతిమ భాగః = రాత్రియొక్క మూఁడు జాములలోఁ దుదిజాము, భగవాన్ = భగవంతుఁడైన, ఋషి (సర్వ శక్తులుగలవాఁడు భగవంతుఁడు. మంత్రములను గనుఁగొన్నవాఁడు ఋషి.) కుసుమధన్వీ = పువ్వు విల్తుఁడు, మన్మథుఁడు, దేవతా = దేవత. మానినీరమణాయాం = కోపించిన యింతులయొక్క ప్రీతియందు, వినియోగః = ఉపయోగము, అంచున్ ఇది = కోడికూఁతరూప మైన మన్మథ మంత్రమును, ఆరంభింపఁగాఁ బోలున్ = (జప మొనర్ప) మొదలు పెట్టినది కాఁబోలును, నాన్ = అనునట్లు, తత్ + ధ్వని = ఆకూఁత, మానినుల్ - మానము గానిస స్త్రీలు (మాన మనఁగా నాయకుఁ డపరాధ మొనర్చినపుడు నాయిక వహించు కోపము. అట్లు కోపించిన వారు మానినులు) రతికిన్ = సంభోగమునకు, తామై = (నాయకుల ప్రార్థనము లేకయే తెల్లవాఱిపోవు చున్న దను భయమున) తమంతఁదామే, నాథులన్ = భర్తలను, పైకొనన్ = కవియఁగా, అమరెన్ = (తద్ధ్వని) ఒప్పెను.

తాత్పర్యము:—కుక్కుటము కోపించిన స్త్రీలను భర్తలతోఁ గలుపు సమయము (కాలమును మంత్రశాస్త్ర సిద్ధాంతము) నెఱిఁగినది. కావున మన్మథ మంత్రమునకు నంగములగు ఋషిదేవతాచ్ఛందోవిని యోగములను స్మరించి మంత్రజప మారంభించెనో యనునట్లు కూసెననియు, ఆమంత్రజపము వెంటనే సిద్ధించి, కోపించిన స్త్రీలు భర్తల ప్రార్థనము లేకయే తమంతఁ దామే వారితోఁ గూడి రనియుఁ దెలియఁ దగును. అలం. :—ఉత్ప్రేక్ష, రూపకానుప్రాణితము.

వి. :— సామాన్యముగా ఏ దేవతయొక్క మంత్ర ముపాసన చేయఁబడునో ఆ మంత్రమున కా యుపాస్యదైవతమే దేవత యగును. కావున 'కుసుమధన్వీదేవతా' అని యిందుఁ జెప్పఁ బడుటచేత మన్మథమంత్ర మని వ్యాఖ్యానింపఁ బడినది. 'అస్య శ్రీకుసుమధన్వి మంత్రస్య, త్రియామాంత రంతిమ యామో భగవాన్ ఋషిః, వివిధం ఛందః, కుసుమధన్వీ దేవతా, మానినీరమణాయాం వినియోగః' అని మంత్రమున కంగనిర్ణయ మని తెలియఁదగును. 'వివిధం ఛందః' అని యుండుట సమంజసము, ఏమన ఆ మంత్రమునకు ఛందస్సు - వివిధము, ఋషి - రాత్రి మూఁడవజాము. దేవత - కుసుమధన్వి. మానినీ ప్రీతియందు - (దీనికి) వినియోగము అనికదా! మంత్రమున కంగములు అట్టియెడ వివిధచ్ఛందః - అని నపుంసకలింగ మగు మంత్రశబ్దమునకు విశేషణ మొనర్చి యర్థ మెట్లో సాధింపఁబడుఁగాక. ఆగమసిద్ధాంత మున కది విరుద్ధమును, ప్రక్రమభంగమును దప్పవు. అంతర్ (అంతః) అవ్యయము. ని. అంతర్మధ్యే తథా ప్రాంతే స్వీకారార్థేపి దృశ్యతే. (విశ్వనిఘంటువు.) మానవతులు సాధారణముగా కోడికూఁత వినుటతోడనే కోపము విడిచి తెల్లవాఱిపోవుచున్న దని పతులఁ గలియుదు రని కవులు వర్ణించుట పరిపాటి. ప్రద్యుమ్నుఁడు కోడికూయునప్పటికే తనవిడిదికి వెళ్లినాఁడని తెలియఁదగును.

వ. మఱియు నాసమయంబున వాసర ప్రత్యాసత్తినిమిత్త విరహాశంకా సముత్కరిత సంతాపంబున లోపలిపట్టు వదలి వెలికి నిర్గమించు నిఖిల కాముక ద్వంద్వసముదయ హృదయంబుల చలువలం ద్రోవ యడ్డగించి, గద్దుఱికి యాక్రమించెనో యనఁగఁ దనరారుచు హారమాక్తికంబు లత్యంత శైత్యంబునం బ్రవర్తిల్లె. నచిరభావి యైన భావజ వశంవద స్త్రీపురుష పరస్పర పరిరంభ విశ్లేష ఖేదవేదనా ప్రాచుర్యంబు సూచించు భంగి, నొండొంటి యంటు విడిచి, బిరు సెడలిన దళంబులతో నతివిరళం బగుచు మేల్కట్టు పువ్వుదండలుం దమయంతర్గుణంబుల కొలఁది విశదంబుగాఁ దెలిపె. నన్యోన్యసన్నిధిం జెన్నుమీఱు దంపతు లింపుసొంపున నాదరింపం బెంపొందు

# ప్ర భా వ తీ ప్ర ద్యు మ్న ము

సౌభాగ్య వైభవంబు నేఁటి కిదియ కదా యను హృదయౌత్సుక్య విలసన విశేషం
బునం బోలెఁ దాంబూలంబు లచలితంబుగా రుచుల ప్రచురతం బచరించెఁ.
బ్రచుర సురతంబులఁ జరించు నుద్దామ యౌవన మద మదనమత్త మత్తకాశినీ
మణుల మణిత రణితంబులజోక నేకసంతన గ్రహించి యంచిత ప్రౌఢదక్షతం
బరీక్షు యిచ్ఛుభావ మావహిల్ల గృహశారికా కీర పారావత కులంబులును గల
కలిత లయలలిత కల కాకు భావంబు దులకించు కులుకుఁబెలుంగు గల కలికి
పలుకుల వికలంబులుగాఁ గులుకరింప దొరకొనియెఁ బ్రతికల నవనవాయితప్రౌఢి
యువ మిథున రతి పరిమళంబులఁ గలపడంబయి పొలు పెసఁగ వికసనారంభ శుంభ
దంభోజ ముకుళ సుకుమార సౌరభంబు వెదచల్లుచు నల్లనల్లన సంచరించు చల్ల
కరువలి బలంగంబులు తెరువరులతనువులనవిరళంబుగఁ దలకొనం బులకాంకురంబులు
మొలపించె. గత దివసావసాన సమయంబున జిగీషిత దేశాంతరుం డైన భా
స్వంతుచేత నాత్మతేజస్సమర్పణానల్పలాలనాపురస్సరంబుగా నియోగింపంబడియుం
దమతమ యున్నభవనంబుల నివసించుకొంచెపుఁ జీఁకటులనే కాని నానా తమో
నీకంబులం బోకార్ప లేనితప్పు గలిగియున్నవి గావున, నావేళ కాసన్నంబయిన
యావాసరాధీశురాక యాకర్ణించి కార్యవైకల్యంబున నాకులత్వంబు నొందెనో
యన నేపు దఱిగి దీపకళికలు వెలవెలం బాఱె. విక్రమ విహారంబు ముగియించి
గవుసెనఁ బొదివిన కుసుమ కోదండు వెండిజలపోఁత తళుకుటరిగ తెఱంగున మెఱుం
గడంగి యుడురాజ మండలంబు మాఁగుడువాఱి కానిపించెఁ. దొల్లి నిజ సంతతి
హితార్థినియై సురభి ప్రార్థింప నిలింపవిభుం డమృతం బిడుట ప్రత్యక్షమయ్యెనో
యనునట్లుగా దట్టంబగుచు శాద్వల ప్రదేశంబులం బ్రకాశించు ముక్తాఫల స్థూల
ప్రాలేయ బిందు బృందంబు పశ్చిమ రాత్రగోచర ప్రచార్యమాణ పశువిసరంబుల
చేతఁ గసవుతోఁ గూడ గ్రసింపఁబడుచు నుండ గగన ముకుర పరిదృశ్యమాన తదీయ
ప్రతిబింబవిభ్రమ దృఢీకారపారీణంబులై తారకంబులు క్రమంబునం బలుచగాఁ
దొడంగెఁ, బ్రాబోధికంబు లైన భూపాల దేవగాంధారి ప్రముఖ రాగాభోగ
సౌగంధ్యబంధురగాంధర్వనాద మేదుర మృదువాద్యవిశేష పోషిత సూత మాగధాది
క్రియమాణ స్తుతిపాఠరవంబులు ప్రభుద్వారంబులఁ దోరంబులై సొంపుమీఱె.
నపరరాత్ర స్వాధ్యాయాధ్యయన శబ్దస్థానంబుల నైన యాదేశంబులుంబోలె
నిర్భరక్షీరభార భిద్యమాన పీనాపీన స్మార్యమాణ తర్ణకోపసరణ రణరణిక సంభ్రమ
సముదిత సముత్థాన ధైనుక గంభీరహంభారావంబులు విజృంభించెఁ, జంద్రాస్తమయ
సంభవ క్లేశ భవ పరిఘూర్ణార్ణవ ధ్వానంబు పెక్కువను వెక్కిరించినట్లు మిక్కిలి
నక్కజపుబాహుళ్యంబు నెరపు మాహాసందోహ దోహనిస్వాన సాహచర్యసమధిక
దధిమథన విధివిహిత ఘుమఘుమఘోషంబులు ఘోషంబులందు గండూషిత
దిక్కంబు లగుచుఁ బిక్కటిల్లె నప్పుడు.

అర్థము:—మఱియున్, వాసర...సంతాపంబునన్ - వాసర = పగటియొక్క, ప్రత్యాసత్తి = సమీపించుట, నిమిత్త=కారణముగాఁగల, విరహ = ఎడఁబాటువిషయమునఁ (గల్గు), శంకా = భయముచేత, సమంకురిత = పుట్టిన, సంతాపంబునన్ = కాఁకచేత, లోపలిపట్టు = హృదయమందలి బంధము, వదలి, వెలికిన్ = బయటికి, నిర్గమించు = వెలువడిన, నిఖిల...హృదయంబులన్ - నిఖిల = ఎల్ల, కాముక = సురతేచ్ఛగల స్త్రీపురుషులయొక్క, ద్వంద్వ = జంటలయొక్క, సముదయ = సముదాయముయొక్క, హృదయంబుల = మనస్సులందలి, చలువలన్ = చల్లదనములను, త్రోవయడ్డగించి = ప్రసరింపకుండ నడ్డుకొని, గడ్డు + ఉఱికి = ఎక్కువగా మీఁద దుమికి, ఆక్రమించుకొనెనో=వశపఱచుకొనెనో యనునట్లు, హారమౌక్తికంబులు = హారములందలి ముత్యాలు, అత్యంతశైత్యంబునన్ = మిక్కిలి చల్లఁదనముతో, ప్రవర్తిల్లెన్ = ఉండెను. పగటివేళ సమీపించినది. ఒండొరుల నెడఁబాయవలయునే యనుభయముచే కాముకీకాముకుల హృదయములందు పెద్దతాపము పుట్టఁగా అంతకుముందా హృదయములందున్న చలువ లన్నిటిని నిరోధించి వశపఱచుకొన్నవో యన్నట్లు వారిముత్యాలహారములందలి ముత్యములు మిగుల చల్లఁదనము నొందినవి. ముత్యములు ప్రాతఃకాలశీతవాయువులకుఁ జల్లపడఁగా - దానిని పైవిధముగ నుత్ప్రేక్షించెను.

అలం:—క్రియోత్ప్రేక్షానుప్రాణిత మగు వస్తూత్ప్రేక్ష.

అచిరభావి = త్వరలోనే కాఁగలది, ఐన...ప్రాచుర్యంబు, ఐన = అయినట్టి, భావజ = మన్మథునకు, వశంవద = లోఁబడిన, (భోగాసక్తులైన) స్త్రీ పురుష = నాయికానాయకులయొక్క, పరస్పరపరిరంభ = ఒండొరులను కౌఁగిలించుకొనుటలయొక్క, విశ్లేష=విడిపోవుటవలని, ఖేద = దుఃఖముచేఁ గలిగిన, వేదనా= బాధయొక్క, ప్రాచుర్యంబు = ఆధిక్యమును, సూచించుభంగిన్ = తెలియఁజేయు విధమున, ఒండొంటి యంటు = ఒకదానితో నొకటి కలిసియుండుటను, విడిచి, బిరుసు = కఱకుఁదనము, ఎడలిన = పోయిన, దళంబులతోన్ = ఱేకులతో, అతివిరళంబులు = మిక్కిలి పలుచనివి, అగుచున్, మేల్కట్టు పువ్వు దండలున్ = వితానములందలి పువ్వులదండలును - (మేలుకట్టు అనఁగా ఉల్లభము చాందినీబట్ట) తమ యంతర్గుణంబు = తమలో నున్న స్వభావముయొక్క (పువ్వులలోపల నుండు దారముయొక్క అని యర్థాంతరము), కొలఁది = ప్రమాణమును, విశదంబుగాన్ = స్పష్ట మగునట్లు, తెలిపెను. అనఁగా - కామాయత్తులైన స్త్రీపురుషుల కౌఁగిళ్లిఁక త్వరగా విడిపోవ నున్నవని సూచించుచున్నట్లు, చాందినీ గుడ్డలం దలంకరింపఁబడిన పూలదండలలోని పువ్వుల ఱేకుల బింకముతగ్గి యొండొంటితో సంబంధము లేక పలుచనై తమలో నణఁగియున్న దారములు బయలుపడ వాడిపోయినవి అని భావము.

అలం:—ఉత్ప్రేక్ష. శ్లేషము. (గుణము, నానా 1. స్వభావము 2. దారము 3. వింటినారి 4.ఆవృత్తి

అన్యోన్యసన్నిధిన్ = ఒండొరులదగ్గఱను, చెన్ను = సొగసు, మీఱన్ = అతిశయింపఁగా, దంపతులు = ఆలుమగలు, ఇంపుసొంపునన్ = సంతోషాతిశయమున, ఆదరింపన్ = (తమ్మును అనగా తాంబూలములను) ప్రేమింపఁగా, పెంపొందు = గౌరవము నొందునట్టి, సౌభాగ్యవైభవంబు = చక్కదనపుసంపద, నేఁటికిన్ = ఈదినమునకు, ఇదియకదా = ఇదేకదా, అను = అనెడి, హృదయ...విశేషంబునంబోలెన్ - హృదయ = మనస్సునందలి, ఔత్సుక్య = తహతహ - లేక - వేగిరపాటుయొక్క, విలసనవిశేషంబునం బోలెన్ = విలాసాతిశయముచేతనువలె, తాంబూలంబులు = (దంపతులు సురతసమయముల సేవింపఁ బుక్కిళ్ల నిల్చియున్న) వీడ్యములు, అచలితంబుగాన్ = చలింపకుండునట్లు, రుచుల ప్రచురతన్ =కాంతుల పెంపును, పచరించెన్ = కలిగించెను, దంపతు లొండొరులను సమీపించి సంతోషముతో తమ్ము నాదరింపఁగా మేటిగౌరవమొందు భాగ్య మీనాఁటి కింతయే కదా (తెల్లవాఱిన తరువాత నా యాల్మగలు వేఱు వేఱుగా నుండి తమ్మాదరింతురే కాని యిట్లు కలిసికొని యాదరింపరు గదా యని భావము) యను మానసికోత్సాహముచేతనో యనునట్లుగా వారల పుక్కిళ్లనుండు తాంబూలములు సుస్థిర మగు నధికకాంతు ను బ్రకటించెను. దంపతులు పుక్కిళ్లనున్న తమ్ములముల నుమిసివేసి యొవరిత్రోవ వార లరిగి రని ఫలి

తార్థము. ప్రచురసురతంబులన్ = అధిక మగు సంభోగములచేతను, చలించు, ఉద్దామ...మణుల-ఉద్దామ = అధికమగు, యౌవనమద = పడుచుఁదనపు గర్వముచేతను, మదన = మన్మథునిచేతను (కామునిచేతను), మత్త = మదించిన (ఒడలెఱుఁగకయున్న), మత్తకాశినీమణుల = స్త్రీరత్నములయొక్క (అన్నులమిన్నలయొక్క) మణితరణితంబుల జోకలు = మణితధ్వనులయొక్క పద్ధతిని, (రతికాలమున స్త్రీలకంఠమున మేఘధ్వనివలెఁ బుట్టుధ్వనివిశేషము. దీనిని పావురాపలుకు అనియునందురు.) ఏకసంతతన్ + అ = ఒకసారి వినుటచేతనే, గ్రహించి = నేర్చుకొని, అంచితప్రేక్షాదక్షతన్ = ఒప్పుచున్న బుద్ధిసామర్థ్యముచే, పరీక్షయిచ్చు భావము = ఎవరైనను బరిశీలింపఁ బూనినయెడఁ దప్పక చెప్పవలె నను నూహ, ఆవహిల్లన్ = కలుగఁగా, గృహ ... కులంబులును, గృహ = ఇంటియందలి (పెంపుడువి యన్న మాట) శారికా = గోరువంకలయు, కీర = చిలుకలయు, పారావత = పావురములయొక్కయు, కులంబులును = గుంపులును, కలకలిత = కోలాహలమయిన, లయలలిత = లయచేత మనోహర మయిన, కల = అవ్యక్త మధురమగు, కాకు భావంబు = (ధ్వనిసంబంధమగు) వికారము, తులకించు = ప్రకటించునట్టి, కులుకు పెలుంగున్ = అందమగు (కంఠ) స్వరమును, కల = పొందిన, కలికిపలుకుల = ముద్దుపలుకులను, అవికలంబులుగాన్ = ఎడతెగనివి యగునట్లు, కులుకరింపన్ = చిమ్ముటకు, దొరకొనియెన్ = ఆరంభించెను. (రాత్రి యౌవనగర్వమున నొడలు తెలియని కామినులు రతికాలమునఁ జేసినమణితధ్వను లేకసంతనే గ్రహించి పరీక్షయిచ్చుటకావృత్తి చేయుచున్న వేమో యనునట్లు పెంపుడుచిలుకలు, గోరువంకలు, పావురములు మధురముగా కోలాహలముగాఁ గూయఁజొచ్చెను.

అలం. :—ఉత్ప్రేక్ష. (ఊర్ధ్వముచ్ఛ్వసితే కంఠనాసికం హుంకృతం మణిత మభ్రఘోషవత్ - అని మణితలక్షణము రతిరహస్యమునఁ జెప్పఁబడెను, నృత్యగీతవాదముల సమన్వితము లయ యనఁబడును.)

ప్రతికల ... పరిమళంబులన్ - ప్రతికల = ప్రతిక్షణమున, నవనవాయిత = మిక్కిలి క్రొత్తదియగుచున్న, ప్రౌఢి = నేర్పుగల, యువమిథున = పడుచుదంపతులయొక్క, రతిపరిమళంబులన్, కలపడంబు = కలసిపోయినవి, అయి, పొలుపు = సొగసు, ఎసఁగన్ = అతిశయింపఁగా, వికసనా ... సౌరభంబు - వికసన = విరియుటయొక్క, ఆరంభ = ఆరంభించుటచేత, శుంభత్ = ప్రకాశించుచున్న, (వికసింప మొదలిడిన యని భావము.) అంభోజముకుళ = తామర మొగ్గలయొక్క, సుకుమార = కోమలమైన, సౌరభమున్ = పరిమళమును, సారెకున్ = మాటిమాటికి, వెదచల్లుచున్ = నలువంకచిమ్ముచు, అల్లనల్లనన్ = మెల్లమెల్లగా, సంచరించు = తిరుగు, ప్రసరించునట్టి, చల్లకరువలి బలంగంబులు = చల్లనివాయువుల సముదాయములు, తెరువరుల = (భార్యల నెడసి పయనించు) బాటసారులయొక్క, తనువులన్ = దేహములందు, అవిరళముగన్ = దట్టముగా, తలకొనన్ = అతిశయించునట్లు, పులకాంకురంబులు = లేఁత గగుర్పాటులను, మొలపించెన్ = పుట్టించెను. ప్రాతఃకాల మందవాయువులు రతికేళినిమగ్నులయిన పడుచుదంపతుల మేనితావులతో వికసించుచున్న తామరమొగ్గల పరిమళము గలయఁగా నాపరిమళద్వయమును స్వీకరించి ప్రియురాండ్ర నెడసియున్న బాటసారులపైఁ బ్రసరించి వారిదేహములఁ బులకింపఁజేసెను. ఈరెండు వాసనలును బాటసారులగు వియోగుల వలపున కుద్దీపనములయ్యెనని భావము.

గతదివసావసాన సమయంబునన్ = కడచిన సాయంకాలమునందు, జిగీషితదేశాంతరుఁడు = పోవఁ గోరఁబడిన మఱియొక దేశము గలవాఁడు - మఱొకదేశమునకుఁ బోవఁగోరినవాఁ డని భావము. ఐనభాస్వంతుచేతన్ = అయినట్టి సూర్యునిచేత, ఆత్మ ... సరంబుగాన్ - ఆత్మ = తనయొక్క, తేజః = కాంతియొక్క. (ప్రతాపముయొక్కఅని యర్థాంతరము) సమర్పణ = ఇచ్చుటయనెడి, అనల్ప = గొప్పదగు, లాలనా = బుజ్జవము, పురస్సరంబుగాన్ = (ముందునడచునదిగా) ముందు కలది యగునట్లుగా, నియోగింపంబడియున్ = ఆజ్ఞాపింపఁ బడియుఁ గూడ, తమ యున్నభవనంబులన్ = తాము (దీపములు) ఉన్నట్టి యిండ్లయందలి, కొంచెపుఁ జీఁకటులనే = స్వల్పమగు చీఁకటులను మాత్రమే, కాని - నానాతమః + అనీకంబులన్ = సమస్తమగు చీఁకటుల గుంపులను, పోకార్పలేని = నశింపజేయలేనట్టి, తప్పు, కలిగియున్న యవి, కావునన్, ఆవేళకున్ = ఆ సమయమునకు, ఆసన్నంబు = సమీపించినది,

అయిన, ఆవాసరాధీశు = దినాధిపతి యగు సూర్యునియొక్క, రాక = వచ్చుట, ఆకర్ణించి = విని, కార్య వైకల్యంబునన్ = చేయఁ దగిన పనిపాడగుటచేత, ఆకులత్వంబు = కలఁతను, పొందెనో యనన్ = పొందిన వేమో యనునట్లు, ఏపు = అతిశయము, తఱిగి = తగ్గి, దీపకళికలు = దీపపు మొగ్గలు, వెలవెలంబాఱెన్ = తెల్లఁబడియెను. ఒక ప్రభువు తన యధికారము నంతయు నొసంగి, యే దే నొక పనియందు నియోగింప నియుక్తుఁడైన యా సేవకుఁ డాపని కొంచెము మాత్రమే చేసి, పూర్తిచేయలేని సమయమున నా ప్రభువు వచ్చుచున్నాఁడని తెలిసినయెడ నాభృత్యుఁడు తన తప్పునెంచి యెట్లు తెల్లఁబోవునో అట్లే కడచిన సాయంకాలమున సూర్యుఁడు తన తేజస్సు నిచ్చి నెల కొల్పిన దీపము లాతనివలె నెల్ల చీఁకటులను నశింపఁ జేయక, తా మున్న యిండ్లయందలి చీఁకటులను మాత్రమే నశింపఁజేసి, యా సూర్యుఁడు వేఁపయందు వచ్చుట తెలిసికొని తమకు నియుక్తమైన పని పూర్ణముగాఁ జేయలేని తమతప్పు తలంచికొని కలఁతచే తెల్లఁ బోయినట్లు దీపములు తెల్లఁబడెనని భావము.

అలం. :—సమాసోక్తి, ఉత్ప్రేక్ష, పరికరము. (వాసరాధీశుఁడు = సాభిప్రాయము)

వి. :—సాయంకాలమున సూర్యుని తేజ స్సగ్నియందు ప్రవేశించునని శ్రుతి ప్రసిద్ధము. 'సౌరం తేజ స్సాయ మగ్నింప్రవిశతి' అనియు 'ఆదిత్యో వా అస్తం య న్నగ్ని మను ప్రవిశతి' అనియు 'అగ్నిం వా ఆదిత్యః సాయ మగ్నిం ప్రవిశతి' యనియు పెక్కువేద ప్రమాణములు గలవు. ఇచట అగ్ని యన దీప శిఖలందలి యగ్ని.

విక్రమ విహారంబు = పరాక్రమ క్రీడను (శౌర్యము చూపుటను) ముగియించి = పూర్తిచేసి, గవుసెనన్ = కప్పు గుడ్డచేత, పొదివిన = కప్పినట్టి, కుసుమకోదండు = పువ్విలుకానియొక్క - మన్మథుని యొక్క, వెండి జలపోఁత = వెండినీటి మెలాము యొక్క, తళుకు = ప్రకాశముగల, అరిగ తెఱఁగునన్ = డాలు విధమున, మెఱుంగు = కాంతి, అడంగి = పోయి, ఉడురాజ మండలంబు = చంద్రమండలము, మాఁగుడువాఱె = మలినమై, కానిపించెన్ = గోచరించెను, మన్మథుఁడు తన వీరవిహారము చాలించి, వెండి నీరానిన గవుసెనయందు పొదిగిన (డాలు) కేడెమో యనునట్లు కాంతి తగ్గిపోయి చంద్రబింబము మాఁగుడు పాఱెను.

అలం. :—ఉత్ప్రేక్ష.

తొల్లి = పూర్వము, సురభి = గోమాత (ని. సురభిశ్చంపకే స్వర్ణే జాతీఫల వసంతయోః । గంధోపలే సౌరభేయ్యాం వల్లకీ మాతృభేదయోః । సుగంధేచ మనోజ్ఞేచ వాచ్యవ త్సురభి స్మృతం. అని విశ్వ నిఘంటువు.) నిజసంతతి హితార్థిని = తనబిడ్డల యొక్క క్షేమము గోరినది, ఐ = అయి, ప్రార్థింపన్ = కోరఁగా, నిలింపవిభుండు = దేవేంద్రుడు, అమృతంబు+ఇడుట = అమృతమిచ్చుట, ప్రత్యక్షంబు = కంటికిఁ గనబడునట్టిది (గా) అయ్యెనోయనన్ = అయినదా యను నట్లు, - 'పూర్వ మింద్రుఁడు గోమాత యగుసురభిని ప్రార్థించి సకలశుభములను, యజ్ఞమునకు వలయు పయోఘృతనవనీతాదిగవ్యములను బొంది, యామె తన సంతానమున కమృత మొసఁగఁ గోరుచున్నదని తెలిసి వాని యాహార మమృతమయ మొనర్చె' నను బ్రహ్మవైవర్త పురాణగాథ యిట ననుసంధింపఁదగును.) దట్టంబు, అగుచున్, శాద్వల ప్రదేశంబులన్ = పచ్చిక బీళ్లయందు, ప్రకాశించు, ముక్తా...బృందంబు - ముక్తాఫల = ముత్యములవలె, స్థూల = పెద్దవైన - (ముత్యములంతేసి పరిమాణముగలవైన వని భావము) ప్రాలేయబిందు బృందంబు = మంచు బిందువులగుంపు - పశ్చిమరాత్ర ... విసరంబులచేతన్ - పశ్చిమ రాత్ర = రాత్రి చివర భాగమున, తెల్లవాఱుజామున - అని భావము. గోచర - పచ్చిక బీళ్లయందు, ప్రచార్యమాణ = మేపఁబడుచున్న (లేక, మేపునకై త్రిప్పఁబడుచున్న అని కాని యర్థము. అభ్ర, వభ్ర, మభ్ర, చర, గత్యర్థాః. చరతి ర్భక్షణేపి - అని పాణినీయ ధాతుపాఠము) పశువిసరంబుచేతన్ = గోమహిషాది జంతువుల మందలచేత, కసవుతోఁగూడన్ = పచ్చికతోఁగూడ, గ్రసింపఁబడుచునుండన్ = (మంచుబిందువులు) తినఁబడుచుండఁగా, గగన ... పారీణంబులు + ఐ = గగనముకుర = ఆకాశమను

నద్దఃమునందు, పరిదృశ్యమాన = చూడఁబడుచున్న, తదీయ = (తినఁగామిగిలి విరళముగానున్న) ఆ మంచు బిందువుల సంబంధమైన, ప్రతిబింబ విభ్రమ = ప్రతిబింబముల విలాసముయొక్క, దృఢీకార=స్థిరపఱుచుట యందు, పారీణులు + ఐ = (తుదముట్టినవి) సమర్థములై, తారకంబులు = నక్షత్రములు, (ఈ యర్థమున తారకాశబ్దము నపుంసకముగూడ నగును. తారకా ప్యుడు వాస్త్రియాం అని అమరము. కనీనికార్థమున మాత్రము 'తారకా' అని స్త్రీలింగమాత్రమే. 'తారకాక్ష్ణః కనీనికా' అని యభిహితము.) కాన, క్రమం బునన్ = వరుసగా, పలుచగాఁ దొడంగెన్ = విరళము కాఁజొచ్చెను, అటనట నొక్కొకటి కనఁబడు చుండెనని భావము.

తాత్పర్యము:—పూర్వము గోమాత యగుసురభి కోరఁగా నింద్రుఁడు వర్షించిన యమృతబిందువులా యనునట్లు పచ్చికకొనలందు ముత్యములంతేసి మంచుబిందువులు ప్రకాశించుచుండెను.

అలం:—ఉత్ప్రేక్ష. ఆ మంచు బిందువులను పచ్చికతోఁ గూడ, తెల్లవాఱుకట్టఁ మేపఁబడుచున్న పశువుల మందలు కొన్నిటిని మాత్రమే తినఁగా మిలిగిన మంచుబిందువు లాకస మను నద్దమునందు ప్రతి ఫలించిన సొగసును స్థిరపరచుచున్నవై నక్షత్రములు పలుచ గాఁజొచ్చెను. నక్షత్రములుప్రతిఫలించిన మంచు బొట్లవలె విరళములై కనఁబడె ననిభావము.

అలం:—గగనమను నద్దమను తావున రూపకము. దానియందు ప్రతిఫలించిన మంచుబిందువుల సొగసును తారక లనుకరించుచున్న వనుటచే రూపకానుప్రాణితమగు నార్థియగు నుపమ. 'తస్యచానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః, ఉపమాయా మిమే ప్రోక్తాః' అని కావ్యాదర్శము. ఈ రూపకాను ప్రాణితమగు నుపమకును, మీఁదఁజెప్పిన వస్తూత్ప్రేక్షకును సంసృష్టి.

వ్యా. వి. :—పశ్చిమరాత్రి యని యొక ప్రతియందును, 'పశ్చిమరాత్ర' అని యొక ప్రతియందును విభిన్నపాఠములు గనఁబడుచున్నవి. అందు 'పశ్చిమరాత్రి' యనుట మల్లినాథసూరిమతము. ఆయన 'ఉపారతాః పశ్చిమరాత్రి గోచరాత్' అను కిరాతార్జునీయ శ్లోకవ్యాఖ్యయందు 'పశ్చిమా చాసౌ రాత్రి శ్చేతి విశేషణసమాసః. అపరరాత్ర ఇత్యర్థః 'పూర్వా దిక్ పశ్చిమం నభ' ఇత్యాదివ దేకదేశిశబ్ద స్యైకదేశశబ్దసామానాధి కరణ్యా దేకదేశే పర్యవసానాత్. నతు పశ్చిమంరాత్రే రిత్యేకదేశిసమాసః. తద్విధాయకే 'పూర్వాపరాది' సూత్రే పశ్చిమ శబ్దాఽగ్రహణా, దతఏవ 'అహః సర్వైకదేశ' ఇత్యాదినా న సమాసాంతోఽపి తస్యాపి పూర్వాపరాది సూత్రోక్త సమాస విషయత్వాదితి. ప్రకాశవర్షస్తు, ఏకదేశి సమాసమే వాశ్రిత్యసమాసాంత మాహ. తన్మృగ్యం' అని (పశ్చిమరాత్రి యనునది ఏకదేశి సమాసము కాదు. 'పశ్చిమ యగు రాత్రి' అని విశేషణసమాసము. అపరరాత్రమని యర్థము. పూర్వ యగుదిక్కు, పశ్చిమ మగునభము వంటిది. ఏకదేశి శబ్దమున కేకదేశశబ్దసామానాధికరణ్యమువలన నేకదేశమం దు పర్యవసించుట కారణము. అంతియ కాని రాత్రికి పశ్చిమము అను ఏకదేశి సమాసము కాదు. తద్విధాయక మగు 'పూర్వాప'రేత్యాది సూత్రమున పశ్చిమ శబ్దము గ్రహింపఁబడలేదు. కాన 'అహస్సర్వైకదే' శేత్యాది సూత్రవిహిత మగు సమాసాంతము రాదు. అచటి సమాసాంతవిధి 'పూర్వాప' రేత్యాది సూత్రోక్త సమాస మును గూర్చియే చెప్పఁబడుట కారణము. మఱియు ప్రకాశవర్షుఁడు ఏకదేశిసమాసమునే యాశ్రయించి సమాసాంతము చెప్పెను. కాని యది మృగ్యము. 'పశ్చిమరాత్రియే' కాని 'పశ్చిమరాత్రము' కానేర దని ఖండితముగాఁ జెప్పెను.

ఇఁక సిద్ధాంతకౌముది యందు భట్టోజీదీక్షితులు - 'పూర్వాపరాధరోత్తర మేకదేశినైకాధికరణే (2. 2. 1) అను సూత్ర వృత్తియందు తొలుత పశ్చిమశబ్దము ఏకదేశిశబ్దముతో సమసించునా లేదా యనియు సమసించినను అహన్ శబ్దముతోవలెను, రాత్రిశబ్దముతోఁగూడ సమసించి సమాసాంతము (అప్రత్య యము నొందునా లేదా యని విచారణ మొనర్చుచు 'సర్వో ప్యేకదేశో హ్నా సమస్యతే. సంఖ్యావిసాయేతి జ్ఞాపకాత్ - మధ్యాహ్నః, సాయాహ్నః. కేచిత్తు సర్వో ప్యేకదేశః కాలేన సమస్యతే నత్వహ్నైవ. జ్ఞాప కస్య సామాన్యాపేక్షత్వాత్. తేన మధ్యరాత్రః 'ఉపారతాః పశ్చిమరాత్రగోచరాః' ఇత్యాది సిద్ధమిత్యా

హుః. రాత్రియొక్క పశ్చిమ భాగము అని యేకదేశసమాసమై అచ్ప్రత్యయరూప సమాసాంతము నొంది పశ్చిమరాత్ర మగును. సంఖ్యావిసాయేత్యాది సూత్రముచే జ్ఞాపకసిద్ధమగుటచే పూర్వాపరేత్యాది సూత్రమున పశ్చిమ శబ్దము లేకున్నను మధ్యపశ్చిమాద్యేకదేశశబ్దములతో సమాసము కలుగును. కావున 'మధ్యాహ్నము' ఇత్యాదులు సిద్ధించినవి. మఱియు కొందఱు 'జ్ఞాపకము సామాన్యాపేక్షము కావున సకలమగు నేకదేశశబ్దములును కాలవాచకములతో సమసించును. ఒక్క 'అహన్' శబ్దముతోనే కాదనిరి. దానిచే మధ్యరాత్రః, ఉపారతాః పశ్చిమరాత్ర గోచరాత్' అనునవి సిద్ధించినవిఅని. పశ్చిమరాత్ర శబ్దము సాధించెను. ఇందు త్తరోత్తరము బలీయ మని 'పశ్చిమరాత్ర' మను పాఠమే గ్రహింపఁబడి వ్యాఖ్యానింపఁబడెను.

ప్రాబోధికంబులు = మేలుకొలుపునవి, ఐన = అయినట్టి, భూపాల ........ రవంబులు, భూపాలదేవగాంధారి ప్రముఖ = భూపాల, దేవగాంధారి, యనుపేళ్లుగలవి మొదలుగాఁగల, రాగ = రాగముల యొక్క, ఆభోగ = పరిపూర్ణత యనెడు, సౌగంధ్య = పరిమళముతో, బంధుర = రమ్యమైన - (ని. బంధూర బంధురౌ రమ్యేనమ్రే హంసేతు బంధురః. అని విశ్వనిఘంటువు.) గాంధర్వనాద = సంగీతధ్వనిచేత, మేదుర = దట్టమైనట్టియు, మృదు = సుకుమారమగు, వాద్యవిశేష = వీణ, మద్దెలమున్నగు వేఱువేఱువాద్యములచేత, పోషిత = పెంపొందింపఁబడిన, సూత = రాజులయొక్క పరాక్రమమును బొగడువారు, మాగధ = పూర్వులయొక్క, తండ్రితాతలయొక్క శౌర్యమును బొగడువారు, ఆది = మొదలగు వందిజనముచేత, క్రియమాణ = చేయఁబడుచున్న, స్తుతిపాఠ = స్తోత్రములను జదువుట యొక్క, రవంబులు = ధ్వనులు, ప్రభుద్వారంబులన్ = ప్రభువులవాకిళ్లయందు, తోరంబులై, సొంపు మీఱెన్ = ప్రకాశించెను. భూపాలాది రాగములకు పరిమళమును జెప్పు సౌగంధ్యశబ్దము ప్రమాదపతితము కావలెను. 'సాగంధ్యము' అనినచో, నుచితముగానుండును. సగంధుఁడు = సంబంధి - 'గంధోగంధక ఆమోదే లేశే సంబంధగర్వయోః' అని విశ్వనిఘంటువు. 'సర్వ స్సగంధేషు విశ్వసితి ద్వావపి ఖ ల్వత్రా రణ్యకౌ వితి' అని అభిజ్ఞానశాకుంతలము - సగంధునియొక్కభావము. సాగంధ్యము. ఇచట భూపాలాదిరాగ ముల సంబంధిత్వముచేత సంగీతము రమ్యముగానున్న దనుట సమంజసము.

తాత్పర్యము:—ప్రాతఃకాలమున మహారాజులను మేల్కొల్పుటకై, వందిమాగధులు భూపాల, దేవ గాంధారి మున్నగురాగములతో సంబంధించిన వేణువీణామృదంగాది సుకుమారవాద్యములతో మేళవించి మేలుకొలుపులను ప్రభువులద్వారములందుఁ బాడనారంభించిరి. భూపాల దేవగాంధారి మున్నగు కొన్ని రాగములు వేకువజామునఁ బాడఁదగిన వని దీనివలనఁ దెలియుచున్నది.

అపరరాత్ర...స్థానంబులను - అపరరాత్ర = రాత్రికడపటి భాగమునందలి, స్వాధ్యాయ=వేదము యొక్క, అధ్యయన = పఠించుటయందలి, శబ్ద = ధ్వనులయొక్క, స్థానంబులన్ = ప్రదేశములందు, ఐన ఆదేశంబులుంబోలెన్ = వచ్చిన యాదేశంబులువలె - అర్ధరాత్రముమొదలు తెల్లవాఱుజాము వఱకు వేద విద్యార్థులు వేదములు చదివి చదివి యుషఃకాలమున స్నానాదికాల్యకృత్యములకు అధ్యయనము మానిరి. ఆవెంటనే గోవులు మేల్కాని యంభారావములు చేయుచుండుటచే అధ్యయనశబ్దములకు గోవులయంభా రవము లాదేశములుగా నున్న వని భావము. (ఒకదానిని బోఁగొట్టి యాస్థానమున వచ్చినది యాదేశమనఁబ డును.) నిర్భర ... రవంబులు - నిర్భర = (భరింపరాని) అధికమైన, క్షీరభార = పాలబరువుచేత, భిద్య మాన = బీటలువాఱుచున్న, లేక-చేఁపువచ్చిన, పీన = బలిసిన, ఆపీన = పొదుఁగులచేతను, స్మార్యమాణ= తలపింపఁబడుచున్న, తర్ణకోపసరణ=లేఁగలయొక్క చేరుటయందలి, రణరణక = ఉత్సాహమువలన (ప్రేమ) గలిగిన, సంభ్రమ = తొట్రుపాటుచేత, సముదిత = పుట్టిన, సముత్థాన = లేచుటగల - లేచినిలుచున్న అని భావము. ధైనుక = పాఁడియావుల సమూహముయొక్క, గంభీర = పెద్ద వగు, హంభారావంబులు = అంబా యనెడుధ్వనులు, విజృంభించెన్ = అతిశయించెను.

తాత్పర్యము:—రాత్రి రెండుజాములు గడచినది మొదలు వేదవిద్యార్థులు వేదమును జదువుకొని విరమింపఁగా పాఁడియావులు దూడలను దలంచుకొని పాలు చేఁపు వచ్చుటచే హంభా యని యఱవఁ

జొచ్చెను. వేదపాఠకుల పాఠధ్వనిని పోఁగొట్టి దానిస్థానమున ఆదేశముగా వచ్చినధ్వనులవలెఁ బాడియావు లంభా యని యఱచుచుండెను. అలం. :—స్మృతి.

అర్థము:—చంద్రాస్తమయ...ధ్వానంబు, చంద్ర = చంద్రునియొక్క, అస్తమయ = అస్తమించుట వలన, సంభవ = కలిగిన, క్లేశ = దుఃఖముచేత, భవ = పుట్టిన, పరిఘూర్ణ = తిరుగుడు, కలఁతగలిగిన, అర్ణవ = సముద్రముయొక్క, ధ్వానంబుపెక్కువను = ధ్వనియొక్క పెంపును, వెక్కిరించినట్లు, మిక్కిలి, అక్కజంపు = వింతయగు, బాహుళ్యంబు=అతిశయమును, నెరపు=వ్యాపింపఁజేయు, మాహా-ఘోషంబులు మాహా = గోవులయొక్క, సందోహ = సముదాయముయొక్క, దోహన = (పాలను) పితుకుటవలనఁ గలుగు, నిస్వాన = ధ్వనులయొక్క, సాహచర్య = కూడనుండుటచేత (పితుకుటయొక్క ధ్వనులతో కలిసిపోయె నని భావము) సమధిక=హెచ్చైన, దధిమథనవిధి = పెరుఁగు త్రచ్చుట యనుపనిచేత, విహిత= ఏర్పడిన, ఘుమఘుమఘోషంబులు = గుబగుబయను ధ్వనులు, ఘోషంబులందున్ = గొల్లపల్లెలయందు, గండూషిత దిక్కంబులు = పుక్కిలించిన దిక్కులుగలవి, అగుచున్, పిక్కటిల్లెను = అతిశయించెను. అప్పుడు.

తాత్పర్యము:—చంద్రాస్తమయమున నుప్పొంగు సముద్రధ్వనిని పరిహసించుచున్నట్లు, గొల్లపల్లె లందు ఆవులను బాలుపితుకుధ్వనితోఁ గలిసిన పెరుఁగుత్రచ్చు గుబగుబధ్వని యెల్లదిక్కులందు నిండఁ బొచ్చెను. అలం. :—ఉత్ప్రేక్ష, సహాలంకారము, అతిశయోక్తి.

సీ. మును విలూనంబైన దినపాదపము మొదల్, మగుడఁ జిగిర్చిన చిగు రనంగ
గతనిద్ర శక్రేభ కర్ణతాళానిలే, రిత కుంభసిందూర రేణు వనఁగ
ధ్వాంతజాలము మీఁద దండెత్తుభానుమం,తుని వెలిగొల్లెనతోఁ పనంగ
మార్తాండపథరోధి మందేహబల పదో, ద్ధుత పూర్వనగధాతుధూళి యనఁగ

గీ. వనజరంగస్థలిని నాట్యమునకు వచ్చు, సిరికిఁ బట్టినకెంబట్టుతెర యనంగ
బ్రాగ్దిశాలిప్తఘుసృణాంగరాగ మనఁగ, మెఱసె నరుణోదయపుదీప్తి మింటికెలన.

అర్థము:—మును = అంతకుమునుపు, విలూనంబు = నఱకఁబడినది, ఐనదినపాదపముమొదల్ = అయినట్టిపగ లనెడుచెట్టుయొక్క, మొదల్, మగుడన్ =మరల, చిగిర్చినచిగురు, అనంగన్ = అనునట్లును, గత...రేణువు - గతనిద్ర=పోయిననిద్రగల - నిద్రనుండి మేల్కొనిన, శక్ర+ ఇభ=ఇంద్రునియేనుఁగు - ఐరావతము యొక్క, కర్ణ = చెవులయొక్క, తాళ = చఱచుటలచేతఁ (తాళము - అన ఏనుఁగుచెవుల చఱపులకు ప్రత్యేకసంజ్ఞ) గలిగిన, అనిల=వాయువుచే, ఈరిత= ఎగురఁగొట్టఁబడిన, కుంభ=కుంభస్థలము లందలి, సిందూరరేణువు=చెందిరపుధూళి, అనంగన్=అనునట్లును, ధ్వాంతజాలముమీఁదన్ = చీఁకట్లగుంపు మీఁద, దండెత్తు = (యుద్ధమునకు) సేనలతో వెడలు, భానుమంతుని = సూర్యునియొక్క, వెలిగొల్లెన= (పట్టనమునకు) వెలుపల వేయునట్టి గుడారముయొక్క, తోఁపు = ఎఱ్ఱనిబట్ట, అనంగన్ = అనునట్లు, మార్తాండపథ = సూర్యునియొక్కమార్గమును, రోధి = అడ్డగించుస్వభావముగల, మందేహ=మందేహులను రాక్షసులయొక్క, బల = సేనలయొక్క, పద = కాళ్లచే, ఉద్ధుత = ఎగురఁగొట్టఁబడిన, పూర్వనగ = తూరుపుకొండయొక్క, ధాతు = గైరికధాతువులయొక్క - (జేగురుమున్నగు కొండసంబంధములగు ద్రవ్యములయొక్క), ధూళి = దుమ్ము, అనంగన్ = అనునట్లును, వనజరంగస్థలిని = తామరపువ్వు అను నాట్యవేదికయందు, నాట్యమునకున్, వచ్చు = వచ్చుచున్న, సిరికిన్ = లక్ష్మికి, పట్టు = ఎత్తిన, కెంబట్టు తెర = ఎఱ్ఱనిపట్టుతెర, అనంగన్, ప్రాగ్దిశాలిప్త...రాగము - ప్రాగ్దిశా = తూరుపుదిశ (అనెడుకాంత) ఆలిప్త = మేనంతటపూసికొన్న, ఘుసృణ=కుంకుమపువ్వుయొక్క, అంగరాగము = మైపూఁత, అనఁగన్,

మింటికెలనన్ = ఆకాశపార్శ్వమున, అరుణోదయపుదీప్తి = ప్రొద్దుపొడుపునందలి కాంతి, మెఱసెన్ - ప్రకాశించెను.

తాత్పర్యము:—ఇంతమున్ను నఱికివేయఁబడిన పగలనుచెట్టు మరలఁ జిగిరించిన లేఁతచిగురాకో, లేక, నిద్రమేల్కొనిన యింద్రునియైరావతము చెవులచే నెగురఁగొట్టుకొన్న కుంభస్థలమందలి సిందూరపు ధూళియో, లేక, చీఁకటిగుంపులపై దండెత్తిన సూర్యునిగుడారపు టెఱ్ఱగుడ్డయో, లేక, ఉభయసంధ్యలయందు సూర్యుని ప్రతిఘటించు మందేహరాక్షసుల సేసల పాదఘట్టనమున నెగసిన యుదయాద్రిమీఁది గైరిక ధాతువులదుమ్మో, లేక, తామరపూవులనెడి రంగస్థలమున నాట్య మొనర్పవచ్చు లక్ష్మికిఁ బట్టిన యెఱ్ఱని పట్టుతెరయో, లేక, తూర్పుదిక్కనుకాంత పూసికొనిన కుంకుమపువ్వు మైఁపూఁతయో యనున ట్లుదయించుచున్న సూర్యునియెఱ్ఱనికాంతిపుంజ మాకసమున నలమెను. అలం:—రూపకము, ఉత్ప్రేక్ష.

వి. :—ఉదయించునప్పుడును, నస్తమించునప్పుడును మందేహులను రాక్షసులు సూర్యునితోఁ బోరుట కెదుర్కొందు రనియు, సంధ్యావదనమున నిచ్చు అర్ఘ్యోదకములు వజ్రాయుధరూప మొంది యామందేహులను (మందేహ) అరుణద్వీపమునఁ బాఱవేయు ననియు వేదము చెప్పుచున్నది. ప్రాగ్దిశా శబ్దము స్త్రీలింగ మగుటచే స్త్రీగా భావింపఁబడినది.

చ. అనుదితసూర్యహోము లగు యజ్వల ప్రజ్వలదగ్నిదీప్తు లో
ద్ద నమరుసోమిదమ్మల మిథఃకషణోల్లసిత స్తనంబులన్
తనరుచు గేలిసేసెఁ గడుఁ దత్సమయాత్తపరస్పరోపగూ
హన రసరంగదంగక రథాంగపతంగ తతారుణద్యుతిన్. 59

అర్థము:—అనుదితసూర్యహోములు - ఉదయించినసూర్యుఁడు లేనికాలమున హోమముగలవారు - సూర్యుఁ డుదయింపకమున్నే హోమము (వేలిమి)చేయు నియమముగలవా రనిభావము, అగు=ఐన, యజ్వల= (శాస్త్రమందుఁ జెప్పఁబడిన రీతిని) యాగము లొనర్చిన వారియొక్క, ప్రజ్వలత్ = మండుచున్న, అగ్ని = శ్రౌతాగ్నుల (దక్షిణాగ్ని, గార్హపత్యాహవనీయముల) యొక్క, దీప్తులు = కాంతులు (కర్తలు) ఒద్దన్ = చేరువను, అమరు = ఒప్పుచున్న, సోమిదమ్మల = సోమయాజుల భార్యల యొక్క, మిథః = ఒండొంటితో, కషణ = రాసికొనుటచే, ఉల్లసత్ = ప్రకాశించుచున్న, స్తనంబులన్ = కుచములందు, తనరుచున్ = వ్యాపించుచు, తత్సమయా...ద్యుతిన్ - తత్సమయ = ఆ సమయమందు (వేకువను) ఆత్త= పొందఁబడిన, పరస్పర = ఒండొంటి యొక్క, ఉపగూహన = కౌఁగిటి యందలి, రస = రుచిచేతను, ప్రీతిచేనని భావము, రంగత్ = కలిసికొనుచున్న, అంగక = దేహములుగల, రథాంగ పతంగ = చక్రవాక పక్షులయందు, తత = వ్యాప్తమైన, అరుణ = సూర్యునియొక్క, ద్యుతిన్ = కాంతిని లేక - రథాంగ = చక్రవాకములుగల, పతంగ = సూర్యుని యొక్క, తత = విస్తృతమైన, అరుణ = ఎఱ్ఱని, ద్యుతిన్ = కాంతిని, అనియుఁ జెప్పవచ్చును. (ని. పతంగౌ పక్షి సూర్యౌచ - "అవ్యక్తరాగ స్త్వరుణః" అనియు అమరము.) కడున్ = హెచ్చుగా, గేలిసేసెన్ = పరియాచకము చేసెను, అనఁగా పోలెను.

తాత్పర్యము:—సూర్యుఁ డుదయింపక మున్నే హోమము చేయు నియమముగల యాగదీక్షితుల యొక్క మండుచున్న శ్రౌతాగ్నుల కాంతులు, తమ చేరువనున్న యాదీక్షితుల భార్యల యొక్క క్రిక్కిఱిసిన చన్నుదోయిపై వ్యాపించుచు, వేకువనే కలియుచున్న దేహములు గల చక్రవాకములపై వ్యాపించుచున్న సూర్యుని కాంతివలె మెఱసెను. అలం. :—ఉపమ (గేలిసేసె ననుటచే ఆర్థి ఉపమ)

వి. :—'ఉదితేజుహోతి' అను ప్రమాణము ననుసరించి సూర్యోదయమైన పిదప హోమము చేయువారు కొందఱు. 'అనుదితేజుహోతి' యను ప్రమాణము ననుసరించి సూర్యోదయమునకు ముందే హోమము

చేయువారు కొందఱు యజ్ఞ్వలయం దుందురు. ఇందు రెండవ పక్షమువారు వర్ణింపఁబడిరి. చక్రవాకముల మిథునములకు రాత్రి వియోగమును పగలు కలయికయును కవిసమయము. మఱియు స్త్రీకుచముల కుప మానముగా గ్రహించుటయు కవి సమయము.

ఉ. ఏఁగలలోన నొండెఱుఁగ, నీవె విభుండవు, సందియంబు నా
పైఁ గలదేని చూడు మని ప్రాగ్దిశ గౌతమ దారజారునిన్
దాఁ గడు నమ్మఁజేయుటకుఁ ద్రాఁగఁగ నెత్తెడునట్టి యెఱ్ఱగాఁ
గ్రాఁగిన మడ్డుచంద మెసఁగన్ గనుపట్టె నినుండు నుష్ణతన్. 60

అర్థము:—ప్రాగ్దిశ = తూర్పు దిక్కు (అను స్త్రీ), కలలోనన్ = కలలోఁగూడ, ఏన్ = నేను, ఒండు = నీవుకాక యితరమును, ఎఱుంగన్ = ఎఱుఁగను, నీవె, విభుండవు = (నా) భర్తవు, నాపైన్, సందియంబు, కలదేని, చూడుము, అని, తాన్, గౌతమ దారజారునిన్ = అహల్యకు విటుఁడైన యింద్రుని, కడున్, నమ్మఁజేయుటకున్ = నమ్మించుటకై, త్రాగఁగన్, ఎత్తెడునట్టి=ఎత్తినట్టి, ఎఱ్ఱఁగాన్, క్రాఁగిన, మడ్డుచందము = కరఁగినదైన యుక్కు గుండు విధము, ఎసఁగన్ = కలుగునట్లు, ఇనుండును = సూర్యుఁడు, ('ను' వాక్యాలంకారము.) ఉష్ణతన్ = వేఁడితో, కనుపట్టెన్ = గోచరించెను.

తాత్పర్యము:—తూర్పు దిక్కను స్త్రీ తన ప్రవర్తన విషయమున నింద్రుఁడు సందేహింప నీవే నా భర్తవు. నిన్నుఁ గాక యన్యుని గలలో నైన నెఱుంగను. నాయందలి యీ సత్యము చూడఁ దలఁతువేని ఇదిగో చూడు మని యా యింద్రునకు నమ్మకము గలిగింప, యితరసాక్ష్యము లేమియు దొరుకనపుడు చేయు దైవప్రమాణముగా త్రాగుటకు రెండు చేతులతో నెత్తి పట్టుకొనినట్టి, ఎఱ్ఱగాఁ గాలికరఁగిన యినుపగుండో యనునట్లు వేఁడిని జిమ్ముచు సూర్యుఁడు తూర్పుదిక్కునఁ గానఁబడెను.

అలం:—ఉత్ప్రేక్ష, గౌతమదారజారుఁడను విశేష్యము సాభిప్రాయ మగుటచే 'పరికరము' ను గూడఁగలదు.

వి. :—అహల్యాజారుఁడయ్యు నింద్రుఁడు దోషలేశమును లేని తన్ననుమానించుటచే ప్రాగ్దిశా రమణి యాయవమానము భరింపలేక మానుషము లగు పత్త్రము వ్యక్తులసాక్ష్యము విడిచి దైవమును సాక్షిగా చూపుచున్నది. దీనిని దైవప్రమాణ మని స్మృతులు దెలుపుచున్నవి.

క. ఆగమపత్త్రము సాక్షియు। భోగంబు ప్రమాణ మెదియుఁ బొసఁగనిచో ను। ద్యోగించి దైవమగు క్రియ। వేగమె చేయింపవలయు విధివంతముగన్. విజ్ఞానేశ్వరీయము - వ్యవహారకాండము 30. దీనినిబట్టి లోక సంబంధమగు పత్త్రము, సాక్షి, భోగము (అనుభవము) అనునవి లేనప్పుడు ధర్మనిర్ణయము దైవప్రమాణము ననుసరించి చేయవలెను. ఆ ప్రమాణము లేవియనిన:- క. తులయును నగ్నియు విషమును। జలమును గోశంబు ననెడి సత్యము లెల్లన్। వలయును సాక్షియుఁ బత్త్రము। దెలుపఁగ లేకున్నఁబాడి దీర్చెడుచోటన్. విజ్ఞా. వ్యవహార. 113. త్రాసు, అగ్ని, విషము, జలము, కోశము అనివానిచేఁ జేయఁదగు ప్రమాణ పరీక్షలో - నిది యగ్నిప్రమాణము. క. ఇనుమున నేఁబదిపలముల, నెనిమిది వ్రేళ్లాయతముగ నేర్పడ గుండై, నునుపై యుండఁగఁ జేసిన, మనమున నిది మడ్డునకుఁ బ్రమాణంబయ్యెన్. (మడ్డు = కాలినయినుపగుండు) విజ్ఞా. వ్యవ-118. అగ్నిప్రమాణమున - ఏఁబదిపలముల తూనికగలిగి యెనిమిదియంగుళముల వైశాల్యముగల్గి నున్ననై ఎఱ్ఱగాఁగాలిన యినుపగుండు రెండుచేతులతో నెత్త వ్రేళులు కాలకున్నచో వ్యవహారవిషయమున నాతఁడు నిర్దోషుఁ డగును. ఆక్రమమునుగూడ నిట్లువివరింపఁబడెను. సీ. పదియాఱువ్రేళుల పఱపు మండలములై యంతియ వెడలుపు లైనదాని। భక్తితో నర్చించి ప్రాచీముఖంబు గాఁ బడమట శోధ్యునిఁ బరఁగనిలిపి, యాతనిదోయిట నశ్వత్థపర్ణంబు లే డిడిప్రోగు లేడింటఁ జుట్టి। పరఁగ నక్షతలు పై నెరపి క్రాఁగినమడ్డు కాఱున నిఱికించి కడఁగి తెచ్చి। ప్రాడ్వివాకుండు మంత్రపూర్వకముగాఁగఁ, బెట్టుటయు మండలము లేడు

మెట్టి కడచి, పోవ వైచినఁ జేతులు పొక్కనేని। శోధ్యుఁ డెల్లరు నెఱుఁగంగ శుద్ధుఁడయ్యె.' 119. అని. ఇట చేతులతోఁ బట్టుకొనుటయేకాదు. కరఁగిన దానిని ద్రాగుటయే చెప్పఁబడెను.

వ. అప్పుడు. 61

సీ. బిగువుఁ గౌఁగిళ్లచేఁ బ్రియు బాహుపురు లొత్తి, కుమ్మెలు వోయినకుచతటములు
వరుమేన నొఱసి పోవఁగఁ జిట్లినట్టి గం, దపుఁ బేంట్లతో నొప్పు నఖపదములు
రమణు కుండలపీడనముల రేఖలు మాయ, కలరుచున్న కపోలఫలకములును
బ్రాణేశదశనకోరక శిఖాసంసర్గ, మునఁ గందినట్టి కెమ్మోవి సిరులు

నిలువుటద్దాల చేరువ నిలిచి నిలిచి, పలుమఱును జూచుకొనుచు నాబాగు సడలఁ
జేయఁజాలక తడసె దైతేయకన్య, ప్రాతరుచితాంగ సంస్క్రియాపరత లేక. 62

అర్థము:—దైతేయకన్య = వజ్రనాభరాక్షసుని కూఁతురు, ప్రభావతి, ప్రాత ... పరత - ప్రాతః = ప్రొద్దుటికి, (అనఁగా ప్రొద్దుట నిద్రనుండి లేచినప్పటికి.) ఉచిత = తగిన, అంగసంస్క్రియా = శరీరమును బాగుపఱచుకొనుటయందు, పరత = ఆసక్తి, లేక, బిగువుఁగౌఁగిళ్లచేన్, ప్రియు బాహుపురులు = మగని (భుజాలంకారములు) భుజకీర్తులు, ఒత్తి=గ్రుచ్చుకొని, కుమ్మెలు + పోయిన=నొక్కులువడిన, గంట్లుపడిన, కుచతటములు=స్తనప్రదేశములును, వరుమేనన్=ప్రియుని శరీరముతో, ఒఱసిపోవఁగన్=రాచుకొనఁగా, చిట్లినట్టి = చిటిలిపోయిన, బీఁటలుతీసిన, గందపు + పేంట్లతోన్ = చందనపు బెత్తికలతో, ఒప్పు, నఖపదములు = నఖక్షతములు, గోళ్లనొక్కులును, రమణు ... రేఖలు, రమణు = భర్తయొక్క, కుండల= చెవి కమ్మలయొక్క, పీడనముల = రాయిడివలని, రేఖలు = గీఱలు, మాయక = చెదరక, అలరుచున్న = ప్రకాశించుచున్న, కపోలఫలకములును=పలకలవంటి చెక్కిళ్లును, ప్రాణేశ ... సంసర్గమునన్ - ప్రాణేశ = భర్తయొక్క, దశనకోరక = మొగ్గలవంటి దంతములయొక్క, శిఖా = కొనలయొక్క, సంసర్గంబునన్ = సంబంధముచేత, కందినట్టి = వివర్ణమైన, కెమ్మోవి = ఎఱ్ఱనిపెదవియొక్క, సిరులు = కాంతులును, నిలువు + అద్దాల = మనుజుని ప్రమాణము గల యద్దములయొక్క, చేరువన్ =సమీపమున, నిలిచినిలిచి = (వేడుకచే) అత్యంతము నిలిచియుండి, పలుమఱును, చూచుకొనుచున్ = (తనివినొందక) పెక్కుమాఱులు చూచుకొనుచు, ఆబాగు = ఆసొగసు - (ప్రియుని సంసర్గము వలనఁ గలిగిన వగుటచేత - నవి వికారములైనను కోరుకొన్నవే యగుటచేతను సొగసుగా పరిణమించె నని భావము), సడలన్ + చేయన్ + చాలక = పోఁజేయలేక, తడసెన్ = ఆలసించెను.

తాత్పర్యము:—ప్రభావతి చెదరిన యావేషమును సరిదిద్దుకొనుట గాని, పతివలనఁ దనశరీరమునఁ గలిగిన చిహ్నములను మాటుకొనుట గాని లేక వానిని మరల మరల నద్దాలయందుఁ జూచుకొనుచు, దంతధావనాది ప్రాతఃకాల కృత్యములనే మఱచినది.

వి. :—ఇంతకు మును పననుభూతమైన సుఖము తనశరీరమందు ప్రియునివలనఁ గలిగినచిన్నెలవలన మనస్సున స్ఫురించు చుండుటచే - నదే పనిగా నద్దములయొద్ద నిలిచి చూచుకొనుచుండెను. ఇందు తనభర్తయొక్క రత్యుత్కంఠయు, ప్రభావతియొక్క రతిపారవశ్యమును వ్యంగ్యములు. వానినే చూచుకొనుచు మురియుటచే ముగ్ధాత్వము గూడ ధ్వనించుచున్నది. అలం:—స్వభావోక్తి.

వ్యా. వి. :—కెంపు + మోవి - ప్రాఁతాదిసంధి కార్యము. నిలువుటద్దాలు - కర్మధారయ, టుగాగమము. అద్దములన్ = అద్దాలన్ - సూ. 'లు, ల, న' లు పరంబగునపుడు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబునువిభాష నగు. బాల. తత్సమ. 43.

వ. అంత నచ్చటికి శుచిముఖీరాగవల్లరు లరుగుదెంచి యా చంచలాక్షి యున్నచెల్వు దవ్వుదవ్వుల నవలోకించి నవ్వుచు. 63

అర్థము:—అరుగుదెంచి = వచ్చి, చంచలాక్షి = చలించుచున్న చూపులు గలది యగు ప్రభావతి యొక్క, ఉన్నచెల్వు = ఉన్న సొగసైనస్థితి, దవ్వుదవ్వులన్ = మిగుల దూరమందు, అవలోకించి=చూచి.

ఉ. పుక్కిటితమ్మలం బుమియు ǂ ప్రొద్దును గాదొకొ దమ్మ నేఁడు మా
యక్కకు, నిప్పు డిట్లిటఁ బ్రి ǂ యంబునఁ జూడఁగఁ గల్గెఁ జాలు మా
కిక్కడ కేఁగుదెంచుట న ǂ భీష్టరతిన్ వసివాళ్లువాడు నీ
చక్కనిరూపమున్ నిదుర ǂ చాలని కన్నులుఁ జిట్లుగందమున్. 64

అర్థము:—మా యక్కకున్ = మా సోదరికి (ప్రేమద్యోతకము), నేఁడు = ఈ దినమందు, పుక్కిటి తమ్మలంబు = బుగ్గ (లోపలి) తమ్మ, (చర్విత తాంబూలము, నమలిన తాంబూలము) ఉమియు = ఉమ్మి వేయునట్టి, ప్రొద్దును = సమయము గూడ, కాదొకదమ్మ = కాదేమోకదా, ఇక్కడకున్, ఏఁగుదెంచుటన్ = వచ్చుటచేత, ఇప్పుడు, ఇట్లు, అభీష్టరతిన్ = కోరఁబడిన సురతముచేత, వసివాళ్లువాడు = మిక్కిలి వాడిపోయిన, ఈ చక్కని రూపమున్=సొగసైన యిట్టి యాకారమును, నిదురచాలని కన్నులును= పూర్ణముగా నిద్రలేక మూఁతలువడుచున్న కన్నులును, చిట్లుగందమున్= బీఁటలు వాఱిన మైపూఁతయును, ఇటన్ = ఇచట, ప్రియంబునన్ = ప్రీతితో, చూడఁగన్ + కల్గెన్= చూచుభాగ్య మబ్బినది, మాకున్, చాలున్ = ఈ భాగ్యము చాలును.

తాత్పర్యము:—మా యక్కకు నీవేళ పుక్కిటితాంబూలపుఁదమ్మ గూడ నుమ్మివేయు సమయమే కాలేదు కాఁబోలును. ఇట్టి సమయమున మేము వచ్చుటచేత వాడిపోయిన యాకారమును, నిద్రచాలని కన్నులును చెదరిపోయిన గందపుఁబూతలును చూచుభాగ్యము మాకుఁ గల్గినది. ఇది మాకు నెంతయు తృప్తిని గల్గించినవి. (అని నర్మముగా ననిరి.)

వి. :—నిదురనుండి మేల్కొనఁగానే పుక్కిటితమ్మలం బుమియవలసినదే. కాని ప్రభావతి యట్లు చేయలే దనుటలో రాత్రి యామె పొందినయానందపారవశ్య మింకను దొలఁగలే దని వ్యంగ్యము. వాడిపోయిన యవయవములును, చెదరిపోయినమైఁపూఁతలును నాయకునివలనఁ గలిగిన సురతోపమర్దనమునకు వ్యంజకములు, ఆ సురతోపమర్దన మొక్కుమ్మడిని గాక రే యెల్ల సుకుమారక్రీడలచే జరిగిన దనుభావము 'నిదురచాలనికన్నులు' వ్యక్త మొనర్చినవి. కాన నాయకునిరసికతయు వ్యంగ్య మగుచున్నది.

వ. అనుచు డగ్గఱ నేఁతెంచి. 65

అర్థము:—డగ్గఱన్ = సమీపించునట్లు, (చేరువకు అనిభావము).

వ్యా. వి. :—డగ్గఱు - రూ. దగ్గఱు - సూ. దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు బాల. ప్రకీర్ణ. 14.

సీ. పలుగఱసేయక ǂ పసుపును నలిపించు, కొనక మొగంబు మ ǂ జ్జనము లేక
పరిశుద్ధవస్త్రంబు ǂ ధరియింపక కచంబు, లొగిఁ జిక్కుపుచ్చి క్రొ ǂ త్తగ ముడువక
ప్రత్యగ్రతిలకధా ǂ రణ మొనర్పక నవీ,నముగఁ గాటుక లోచ ǂ నముల నిడక
తగునట్టిసొమ్ములు ǂ దాల్పక దినముఖ, నియమపుణ్యంబు లె ǂ వ్వియుఁ జలుపక

నీవు తడయుట చోద్యమో నీరజాక్షి, ఘనము గాఁబోలు శ్రమమట్లుగాక రతుల
చిన్నె లింపునఁ జూచుకొంచున్నదాన, వేమొ విఘ్నమై వచ్చితి మెఱుఁగకేము.

అర్థము :—ఓ నీరజాక్షి = తామరలవంటి కన్నులుగలదానా, పలుఁగఱసేయక = దంతధావనము చేయక, (పల్లు + కఱ్ఱ = పలుగఱ) మొగంబు = ముఖమందు - (సప్తమ్యర్థమునఁ బ్రథమ), పసుపునఁ, నలిపించుకొనక = పూయించుకొనక ('పసుపునన్' అనిపాఠమైనచో లెస్సగ నుండును. మొగంబు, పసుపునన్, నలిపించుకొనక, అని యీపక్షమున నర్థమును సరళమగును) పరిశుద్ధవస్త్రంబు = ఉదికి నిర్మలమొనర్చిన బట్టను, ధరియింపక, కచంబులు = తలవెంట్రుకలను, ఒగిన్ = చక్కఁగా, చిక్కు, పుచ్చి = పోఁ జేసి, క్రొత్తగన్, ముడువక = ముడివేయక, ప్రత్యగ్ర ... ధారణము - ప్రత్యగ్ర = క్రొత్తదియగు, తిలక = బొట్టుయొక్క, ధారణము = ధరించుట, ఒనర్పక = చేయక, కాటుక, లోచనములన్ = కన్నులయందు, నవీనముగన్ = క్రొత్తగ, ఇడక, పెట్టక, తగునట్టిసొమ్ములు = అర్హమైన నగలు, తాల్పక, దినముఖ = ప్రాతఃకాలమునందలి, నియమ = ఏర్పాటుగల, పుణ్యంబులు = పుణ్యకార్యములు - ప్రాతఃకాలమునఁ దప్పక చేయఁ దగిన దేవపూజాది పుణ్యకార్యములను, ఎవ్వియున్, చలుపక = చేయక, నీవు, తడయుట = ఆలసించుట, చోద్యము = వింత - (ఏలన నింతకుఁ బూర్వ మెన్నఁడీవేళ కిట్లుండలేదు కావున.) శ్రమము = (రాత్రి పొందిన) ఆయాసము, ఘనము = అధికము, కాఁబోలున్ = అయియుండును, అట్లుగాక = అట్టిదిగాక, రతులచిన్నెలు = సంభోగచిహ్నములను, ఇంపునన్ = సంతోషముతో, చూచుకొంచున్ + ఉన్నదాన వేమొ = పరిశీలించుకొను చుంటివేమోకదా, ఏము = మేము, ఎఱుఁగక = ఈసంగతి తెలియక, విఘ్నమై = ఆటంకముగా, వచ్చితిమి.

అలం. :—అనుమానము.

వి. :—ప్రభావతిని నిమిత్తముగాఁ జేసికొని సువాసినికి విహితమగు కార్యకరణీయములను కాంతా సంమితముగాఁ గవి యిందుఁ బేర్కొనెను.

వ. అని పరిహాస గర్భంబుగాఁ బలుకుచు లజ్జారోష భూషితంబు లయిన యాయోషా రత్నంబు చేతి యదరువ్రేతలు తమకు నూతనోత్సవంబు లగుచుఁ గౌతుకం బొనరించుచుండఁ బ్రవర్తిల్లుచున్నంతఁ జంద్రవతీగుణవతు లటమున్న నిజవల్లభ సమాగమంబునకు నుపాయంబు గానక, శుచిముఖితోడి విచారంబు గోరుచు నుండుటం జేసి యమ్మరాళిఁ దమనిలయంబున కెలయించుకొని పోవుటకు నుద్యోగించి ప్రభావతీ దర్శనమిషంబున. 67

అర్థము:—పరిహాసగర్భంబుగాన్ = పరిహాసములోపలఁగలదిగా, (పైకి పరిహాసము కనబడని యట్లు అని భావము.) లజ్జా ... భూషితంబులు - లజ్జా = సిగ్గుచేతను, రోష = కోపముచేతను, భూషితంబులు = అలంకరింపఁబడినవి - (మృదు వగు సిగ్గును కోపమును వెల్లడించునవి అనిభావము.) అయిన, ఆ యోషా రత్నంబు = ఆ యన్నులమిన్న (ప్రభావతి) యొక్క, చేతి యదరువ్రేతలు = చేతితోనదరునట్లు కొట్టు దెబ్బలు, తమకున్ = శుచిముఖీరాగవల్లరులకు, నూతనోత్సవంబులు = క్రొత్తయుత్సవములు, అగుచున్, కౌతుకంబు = వేడుక, ఒనరించుచుండన్ = చేయుచుండఁగా - (పరిహాసముగా నట్లనుచున్నా రని తెలిసికొని సిగ్గుపడియు, మాఱు పలుకఁ జాలక కోపము సూచించుచుఁ జేతితో నదరునట్లు ప్రభావతి కొట్టఁగా,-శుచిముఖిరాగవల్లరు లాదెబ్బలు తమ కొకక్రొత్తవేడుక గూర్ప నలరుచుండిరి అని భావము) ప్రవర్తిల్లుచున్, ఉన్నంతన్ = ఉన్నసమయమున, చంద్రవతీగుణవతులు, నిజ ... సమాగమంబునకున్, నిజ = తమయొక్క, వల్లభ = ప్రియులయొక్క, సమాగమంబునకున్ = రాకకు (లేక కలయికకు), ఉపాయంబు, కానక, విచారంబు = ఆలోచనమును, ఎలయించుకొనిపోవుటకున్ = తీసికొనిపోవుటకు, ఉద్యోగించి = యత్నించి, ప్రభావతీ దర్శనమిషంబునన్ ప్రభావతిని చూచుట యను నెపముతో (మీఁది కన్వయము).

తాత్పర్యము:—అని పరిహాసము పైకిఁగనరాకుండునట్లు పలుకుచు శుచిముఖీ రాగవల్లరు లా ప్రభావతి చేతితోఁగొట్టు నదరు వ్రేతల కానందించుచు నుండిరి. అంతలో చంద్రవతీ గుణవతు లిరువురును తమ ప్రియుల సమాగమమున కుపాయ మడుగుటకై శుచిముఖిని దీసికొని పోనెంచి, ప్రభావతిని జూచుట కను నెపమున - (అచటికి వచ్చిరి అనుమీఁదిపద్యములోనిదానితో నన్వయము.)

క. లలిత ప్రియ సంభోగా,కులవేషము చక్క దిద్దుకొన నెడ లేమిం
గళవళపడుచుఁ బ్రభావతి, యలుక నతర్క్యగతి వచ్చి రచటి కిరువురున్. 68

అర్థము:—ప్రభావతి, లలిత...వేషము, లలిత = అందమైన, ప్రియసంభోగ = ప్రియునితోడి సురతముచేత, ఆకుల = కలఁగిపోయిన, వేషము, చక్కదిద్దుకొనన్ = సరిగాఁ సవరించుకొనుటకు, ఎడ = అవకాశము, లేమిన్ = లేకపోవుటచేత, కళవళపడుచున్ = తొట్రుపడుచు, అలుకన్ = భయపడఁగా, ఇరువురున్ = చంద్రవతీ గుణవతు లిద్దఱును, అతర్క్యగతిన్ = ఊహింప నవకాశములేని విధమున (అదాటుగా నని భావము) అచటికిన్, వచ్చిరి.

తాత్పర్యము:—ప్రియుని కూటమివలనఁ గలఁగియు సుందరమైన యావేషమును సరిచేసికొన నవకాశములేక ప్రభావతి తొట్రుపడుచు భయపడునట్లు నాకస్మికముగా చంద్రవతీ గుణవతు లచటికి వచ్చిరి.

సీ. ఈ తెఱంగున వచ్చి యాతరుణీమణి, చందంబునకుఁ గొంత సందియంబు
మదిలోనఁ గందళింపఁగఁ గ్రమంబున విమ, ర్శించి తదాకార చేష్టితముల
కతమునఁ బురుషసంగతి కల్మిఁ బదిలంబు, గా నిశ్చయించి య క్కాంతమీఁద
భావ సంసూచన పాండిత్య గంధి వి,లోల కటాక్షావలోకనముల

ఆ. కలిమి మొలకనగవుతళుకుతోఁ బలుమఱు, నగుచు నొకరొకళ్ల మొగము చూచి
యంతఁ గనిన యర్థ మాఁపలే కిట్లని, పలికి రాసఖి విన జలజముఖులు. 69

అర్థము:—జలజముఖులు=చంద్రవతీ గుణవతులు (తామరలవంటి మొగము గలవారు), ఈ తెఱంగునన్ = ఈరీతిగా, వచ్చి, ఆతరుణీమణి చందంబునకున్=పడుచులలో మిన్న యగు నా ప్రభావతియొక్క యునికిని, మదిలోనన్ = మనస్సునందు, కొంత = కొంచెము, సందియంబు, కందళింపఁగన్ = అంకురింపఁగా, పుట్టఁగా (కలుగఁగా అని భావము.) క్రమంబునన్ = వరుసగా, విమర్శించి = పరిశీలించి, తత్ + ఆకారచేష్టితముల = ఆమెయొక్క రూపముయొక్కయు, వ్యాపారములయొక్కయు, కతమునన్= కారణముచేత, (ఆప్రభావతి రూపమునందును చేష్టలయందును గనవచ్చిన వికారముల కారణమున నని భావము.) పురుషసంగతి కల్మిన్ = మగవానితోడి కలయిక కలుగుటను, పదిలంబుగాన్ = బాగుగా, నిశ్చయించి, అక్కాంతమీఁదన్=ఆప్రభావతిపైని, భావ...లోకనములు-భావ=(తమ) అభిప్రాయమును, సంసూచన=తెలుపునట్టి, పాండిత్య=తెలివిని, గంధి=తెలుపునట్టి, విలోల= చలించుచున్న, కటాక్ష=క్రేఁగన్నులయొక్క, అవలోకనములు = చూపులు, పొలయన్=వ్యాపింపఁగా, మొలకనగవు తళుకుతోన్ = లేఁతనవ్వుకాంతితో, పలుమఱు = పెక్కుమాఱులు, నగుచున్ = నవ్వుచు, ఒకరు, ఒకళ్ల మొగము = ఒండొరుల ముఖములను, చూచి, అంతన్ = పిదప, కనిన యర్థము=చూచి (తెలిసికొని)న వృత్తాంతమును, ఆఁపలేక = మనస్సునందు నిలుపుకొనలేక, ఆ సఖి = ఆ ప్రభావతి, వినన్ = వినునట్లు, ఇట్లు, పలికిరి.

తాత్పర్యము:—ఇట్లువచ్చిన చంద్రవతీగుణవతులు ప్రభావతి య ట్లుండుటకు కొంచెము సంశయించి, ఆమెయొక్క యాకులమైనరూపమును, కలఁకతోడిపనులను బట్టి మగవానిసంగమము కలిగి యుండు నని బాగుగా పరిశీలించి తెలిసికొని, తమమనస్సులోని భావమును సూచించు కడగంటిచూపుల నామెపైని

ప్రసరింపఁ జేయుచు, చిఱునవ్వుతో నొకరిమొగ మొకరు మూచుకొనుచు, తెలియవచ్చినవిషయమును మనసున నిలుపుకొనలేక యా ప్రభావతి విను నట్లు తమలోఁ దా మిట్లనుకొనిరి. అలం:—స్వభావోక్తి.

వ్యా. వి. :—పలుమఱు - పలు + మాఱులు. సూ. ఆచ్ఛికసమాసంబులం దఱచుగ వర్ణలోపాగమాదేశాది వికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి. ప్రౌఢ. సమాస. 26 చే వికారము నొందిన రూపము.

ఉ. ఎంతయు మేన వింతపస ♦ లేర్పడుచున్నవి యప్ప గంటె య
త్యంతము నిద్ర చాలమియు ♦ నక్షులు తెల్పెడు రాత్రి యెద్దియో
కొంత విశేష మబ్బినది ♦ కోమలికిన్ మము బోంట్లకున్ గడున్
సంతసమే కదా తనదు ♦ జవ్వన మెవ్వలనన్ ఫలించినన్. 70

అర్థము:—అప్ప = జ్యేష్ఠసోదరీ! కంటె = (ప్రభావతిని) చూచితివా, మేనన్ = (ఈమె) శరీరమందు, వింతపసలు = అబ్బురమగుసొగసులు, ఏర్పడుచున్నవి = కనఁబడుచున్నవి, అక్షులు = కన్నులు, అత్యంతము=మిక్కిలిగ, నిద్ర + చాలమియున్ = నిద్రలేకుండుటనుగూడ, తెల్పెడున్ = తెలుపుచున్నవి, రాత్రి, కోమలికిన్ =(ఈ) కొమ్మకు, కొంతవిశేషము = (ఇంతకు ము న్నెఱుంగనట్టి) ఆధిక్యము, కొంచెము, ఎద్దియో = ఏదో, అబ్బినది = కలిగియున్నది, తనదుజవ్వనము = తనయొక్కయౌవనము, ఏ + వలనన్ = ఏ విధమున నైనను, ఫలించినన్ = పండినచో - (సార్థక మైనయెడల అని భావము.) మముబోంట్లకున్ = మావంటిజవ్వనులకు, కడున్ = మిగుల, సంతసమేకదా = సంతోషమేకదా!

తాత్పర్యము:—అక్కా! ప్రభావతిని జూచితివా? ఈమెదేహమున చిత్రమైన (కాంతులు) సొగసులు కనఁబడుచున్నవి. కన్నులు నిద్రలేమిని తెలుపుచున్నవి. గడచినరాత్రి యేకొ కొంతవిశేషము కలిగియుండవచ్చును. తనజవ్వన మేరీతిగా ఫలించినను మనవంటివారికి సంతసమేకదా!

వి. :—కోమలి శబ్దము ఆచ్ఛికము. 'కోమల' శబ్దము సంస్కృతమున నుండుటచే ఇదియును సంస్కృత మని భ్రాంతి గొల్పుచున్నది. సంస్కృతమున స్త్రీలింగ మైనపుడు 'కోమలా' అని ఆకారాంత స్త్రీలింగ మగును. స్త్రీ యను నర్థమున రూఢియు లేదు. పైదలి, ఉగ్మలి, తొయ్యలి, తోయలి - శబ్దములందు 'లి' కాని 'అలి' కాని స్త్రీప్రత్యయ మైనట్లే, కోమ + లి (అలి) అని స్త్రీప్రత్యయాంతమగును. పైదలి మొదలగునవి యవ్యుత్పన్నప్రాతిపదికములుగాఁ గనబడుటచే 'లి' ప్రత్యయమో 'అలి' ప్రత్యయమో నిర్ణయింపరాదు. కాని అం దేదియో యొకటి స్త్రీ ప్రత్యయ మనఁదగును. అచ్చతెనుఁగు నిఘంటు వైన ఆంధ్రభాషార్ణవము ద్వి. కాం. 104. లో. సీ. ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁదుక మెలఁతుక వెలఁది మెలఁత. అనియు, అచ్చతెలుఁగు కావ్యమైన యయాతి చరిత్రము 4. 104. లో. ఉ. తామరకెంపు లంతటను దాఁచిన ముక్కలి పీఁట మీఁదటన్ । గోమలు లంతఁ బెండ్లికొడుకున్ దగ నుంచిన... అనియు, నీలాసుందరిపరిణయము. 2.95 లో 'కోమలి' అనియు నుండుటచేత నీపద మచ్చతెలుఁగుమాట నిస్సంశయము.

ఇట్లుండ భారత మారణ్యపర్వము 5 ఆ. 11 పద్యమునందు 'పడిచినపిమ్మటన్ గుసుమకోమలి విస్తృత సంస్తరంబుగా, నొడికపుసెజ్జఁ జేసి' అని ముద్రితములం దన్నిటఁగలదు. 'కుసుమకోమల విస్తృత సంస్తరంబుగా, నొడికపు సెజ్జఁజేసి' యని యుండఁ దగును. పతివ్రతకథలోని దీ ప్రయోగము. ఆ పతివ్రత భర్తకు భోజనము పెట్టి, తినిన పిదప పూలచే మెత్తనిదియు విరివిగలదియు నగు పక్క గలుగునట్లు శయ్యను చక్కఁ బఱచి అని ప్రాకరణికార్థము. 'మదిరేక్షణ' అని వేఱ కర్తృపదమున్నది. అనన్వితముగా 'కుసుమకోమలి' అని సంస్కృతపదముగా పరిష్కరించుట భ్రాంతిమూలక మనఁ దగును.

వ. అని మర్మంబు దాఁక నాడుచు నా వ్రీడావతి మొగంబుఁ జూచి, 71

అర్థము:—అని = ఇట్లుపలికి, మర్మంబు = ఆయమును, దాఁకన్ = సోఁకునట్లు, మనస్సు నొచ్చునట్లు అనిభావము. ఆడుచున్ = పలుకుచు, ఆవ్రీడావతిమొగంబున్ =(సిగ్గుగలదియగు) ఆ ప్రభావతి యొక్క ముఖమును, చూచి. అలం.—వ్రీడావతి సాభిప్రాయ విశేష్యము కావున 'పరికరాంకురము.'

క. ఏమైన నయ్యె నిఁక నే, లా మీఱినపనికి నిట్టి యంతిపురములో
నో ముద్దరాల యేగతి, నీమహిమ గడించుకొంటి విది వెఱఁగు కడున్. 72

అర్థము:—ఏమి + ఐనన్ + అయ్యెన్ = ఎంతపనియైనను జరిగినదిలే, మీఱినపనికిన్ = దాఁటిపోయినపనికై, ఇఁకన్ + ఏలా = ఇఁక నెందులకు ? ఓముద్దరాల = ఓయమాయికురాలా !, (సోల్లుంఠన మగు సంబోధనము) ఇట్టి యంతిపురములోన్ = పోఁతుటీఁగ కైనను చొరరాని నగరులో, ఈ మహిమన్= ఈ గొప్పతనమును (భర్తృసంయోగమును) ఏగతిన్ = ఏవిధముగా, గడియించుకొంటి = సంపాదించుకొన్నావు, ఇది, కడున్ = మిగుల, వెఱఁగు = ఆశ్చర్యము (అగుచున్నది అధ్యాహారము)

తాత్పర్యము:— ఏదియో జరిగినది జరిగిపోయినది లే. అయినదానికై యాలోచన మెందులకు ? కాని నీవు వట్టియమాయికురాలవే. ఇంతటి నిర్బంధములు గల యంతిపురములో ప్రియాసమాగమరూప మగు నీ గొప్పతన మె ట్లందితివే? అత్యాశ్చర్యముగా నున్నది. అలం:—పరికరాంకురము, విషమము.

సీ. అని యుల్లసము దోఁప నాడుమాటలకు వె,ల్వెలఁ బాఱుచును దైత్య విభుతనూజ
కలఁగి రహస్యభంగభయంబుచేతఁ బ్ర,త్యుత్తరం బేమియుఁ దోఁప కునికి
నిట్టటు గ్రుక్కుచున్నట్టి లా గరసి యా,యతివకుఁ దనచెలి యంద్ర గుట్టు
బయలు సేయకయున్నఁ బాయ దీ వెడఁగుఁబా,టనియు, వారికి నిది యభిమతార్థ

ఆ. సిద్ధిహేతు వనియుఁ జిత్తంబులోపల, నీతిసరణిఁ బరిగణించి చూచి
యా సునాభసుతల కంచపడంతి యి,ట్లనియె నుచితఫణితి నతిశయిల్ల. 73

అర్థము:—అని, ఉల్లసము = మనసునొచ్చునట్టి పరిహాసము, ఉత్ప్రాసము, తోఁపన్ =స్ఫురించునట్లు, ఆడుమాటలకున్ = పలుకునట్టి పల్కులకు, దైత్యవిభుతనూజ = రాక్షసరాజపుత్రి - ప్రభావతి, వెల్వెలఁబాఱుచును = తెల్లఁబోవుచు, కలఁగి = కలఁత నొంది, రహస్యభంగభయంబుచేతన్ = దాఁపఱికము చెడుటవలని భయముచేత - (ఎవ్వరికిఁ దెలియకుండఁ జరిగిన ప్రియసమాగమవార్త బయ లయ్యెనే యను వెఱపుచేత నని భావము) ప్రత్యుత్తరంబు = తిరుగఁ జెప్పఁదగు సమాధానము, ఏమియున్ = ఏదియును, తోఁపక = స్ఫురింపక, ఉనికిన్ = ఉండుటచేత, ఇట్టు + అటు + గ్రుక్కుచున్ = (ఏమియుఁ జెప్పఁజాలక) తొట్రుపడుచు, ఉన్నట్టిలాగు = ఉన్నట్టి స్థితిని, అరసి = చూచి, ఆ యతివకున్ = ఆ ప్రభావతికి, తన చెలియంద్రగుట్టు = తన చెల్లెండ్రగు చంద్రవతీ గుణవతులయొక్క రహస్యమును, బయలు + చేయక యున్నన్ = వెల్లడింపకున్నచో, ఈ వెడఁగుఁబాటు = ఈ మ్రాన్పాటు. పాయదు = (ప్రభావతికి) పోవదు, అనియున్, వారికిన్ = ఆ చంద్రవతీ గుణవతులకును (గూడ) ఇది = ఈ బయలుసేఁత, అభి... హేతువు - అభిమత = కోరఁబడిన, అర్థ = ప్రయోజనముయొక్క, సిద్ధి = నెఱవేఱుటకు, హేతువు = కారణము (అగును) అనియున్, అంచపడంతి = శుచిముఖి, చిత్తంబులోపలన్ =మనస్సులో, నీతిసరణిన్= నీతిమార్గముచేత, పరిగణించి = సాధకబాధకములను లెక్కించి, చూచి = ఆలోచించి, ఉచితఫణితి = తగిన పద్ధతి, అతిశయిల్లన్ = పెంపొందఁగా, ఆ సునాభతనయలకున్ = ఆ చంద్రవతీ గుణవతులతో, ఇట్లు, అనియెన్ = పల్కెను.

తాత్పర్యము:—అని యెత్తిపొడుపుగా చంద్రవతీ గుణవతు లనఁగా - ప్రభావతి వెలవెలఁ బోవుచు, తన రహస్యము బయలైనందులకు భయపడుచు, మాఱుమాట చెప్పఁజాలక, తికమకపడుచున్న స్థితిని శుచిముఖి చూచి, యీ యిరువుర గుట్టును ప్రభావతికిఁ జెప్పనిచో నీమె కలఁతయు భయమును పోనేరదనియు, అట్లు చెప్పుటవలన వారికోరికయు తీఱుటకు సాధనమగు ననియును, నీతివిధానముచేత మనసున బాగుగ నాలోచించి, చంద్రవతీ గుణవతులతో నిట్లనెను. ఇందు ప్రభావతి నిరుత్తరయై కలఁత నొందుట ముగ్ధాలక్షణము.

క. ఇది యెంత పేర్చెదరు మీ, చదివినయాకుననె తానుఁ జదివినయది మా
సుదతియు; మొదల ఫలించెన్, దదభీష్టము పెద్దపిన్న తరములవరుసన్. 74

అర్థము :—ఇది = ప్రభావతి ప్రియసమాగము మొందినదను విషయమును, ఎంత = ఎంతపెద్దదిగా, పేర్చెదరు = పెంచుచున్నారు, (పరిహాసగర్భితముగా ఎంత తతిమితిపిలి యగుచున్నారని భావము) మీచదివినయాకునన్ + ఎ = మీరు చదువుకొనిన పుస్తకపుఁ బత్త్రమునందే, మాసుదతియున్ = మాచెలికత్తెయును, తానున్, చదివినయది = చదువుకొన్నది (ఇతరులు చొరశక్యమైన యంతిపురమునకు మీరు మీప్రియులను రప్పించుకొన నెట్లు యత్నించుకొనుచున్నారో యీమెయు నట్లే యత్నించినది. అని వ్యంగ్యము.) పెద్దపిన్నతరములవరుసన్ =వయసుచేత గలిగిన పెద్దపిన్నతనముల క్రమమున, మొదలన్= (పెద్దది కావున ప్రభావతికి) ముందుగా, తదభీష్టము = ఆమెకోరిక, ఫలియించెన్ = నెఱవేఱెను.

వి. :—పెద్దది కౌన ప్రభావతికోర్కి ముందు ఫలించె ననుటచే, తరువాత పిన్నలగు మీకోర్కులును నెఱవేఱఁగలవు అని వ్యంగ్యము. కావున మీరు నావంటి వారలై యుండి, యామెను పరిహసించుచున్నారే యని వారలగుట్టు ప్రభావతి తెలిసికొన బయలుచేసినది. ఈబయలుసేఁతతో ప్రభావతి భయము తీఱిపోయిన దను ధ్వని ముందుపద్యమున స్పష్టమగును. మీచదివిన యాకుననె చదివినది = మీరు నేర్చిన విద్యయే యీమెయు నేర్చినది అని భావము జాతీయము. అలం. :—లోకోక్తి.

వ. అనుటయుఁ దెలివొందినమొగంబుతోఁ బ్రభావతి యావిహంగిం జూచి. 75

అర్థము :—అనుటయున్ = అనిసపిదప, ప్రభావతి, తెలివి = వికాసమును, ఒందినమొగంబుతో= పొందినట్టిముఖముతో, ఆవిహంగిన్ = ఆ యాఁడుపక్షిని, శుచిముఖిని, చూచి,

క. ఎట్టెట్టూ మును వీరల, గుట్టును నీపోఁగునకుఁ దగుల్పడినదియే
యెట్లుండె నట్లె చెప్పుము, గట్టిగ నావుడు మరాళకామిని నగుచున్. 76

అర్థము :—ఎట్టెట్టూ = ఏవిధముగా నైనది (ఆశ్చర్యార్థకము) - మును = ఇంతకు ముందే, వీరల గుట్టును=వీరిరహస్యముగూడను, నీపోఁగునకున్ = నీత్రాటికి, వేఁటాడునట్టిచోటికిఁ జుట్టును అందలి జంతువులు దాఁటిపోకుండఁ గట్టెడుత్రాటికి 'పోఁగు' అని వ్యవహారము - (పోఁగువాఱించి - అని మను చ. 4-37) తగుల్పడినదియే=చిక్కుకొనినదా, వీరిరహస్యముగూడ నీకు వశమై యున్నదా అనిభావము. ఎట్టు = ఏరీతిగా, ఉండెన్ = జరిగియుండెనో, అట్టె = జరిగినట్లే, చెప్పుము, నావుడున్ = అనఁగా, మరాళకామిని = అంచ పడఁతి, శుచిముఖి, నగుచున్ = నవ్వుచు.

తాత్పర్యము :—ఏమి టేమిటి ! వీరిరహస్యముగూడ నీచేతిలోనిదే యైనదా యేమి? ఎట్టుల జరిగెనో యట్టుల చెప్పుము. అని ప్రభావతి యనఁగా శుచిముఖి నవ్వుచు.

వ్యా. వి. :—ఎట్టూ + ఎట్టూ - దీర్ఘమగు ఊకారము కాన సంధికారాదు. కాని ఆమ్రేడితము పరమైనది కావున దీర్ఘమైనను సూ. అచ్చున కామ్రేడితము పరమగునపుడు సంధి తఱచుగ నగు. బాల. సంధి 10. చే సంధికలిగి - 'ఎట్టెట్టూ' అని సిద్ధించినది. వి. :—పోఁగుననుఁ దగుల్పడినది - జాతీయము.

వ. తను నధికభయ లజ్జా సమాకులచిత్త లగుచుం గనుసన్నల వారించుచున్న చంద్రవతీ గుణవతులవంకం గనుంగొని చెప్పం గొంచించుటయు, నక్తంచరరాజ నందనయుం దనమీఁద నాన లిడుచు నడిగినం బులుఁగుపడంతి తదనుజల నవలోకించి. 77

అర్థము:—తనున్ = తన్నును, అధిక ... చిత్తలు - అధిక = హెచ్చైన, భయ = వెఱపుచేతను, లజ్జా = సిగ్గుచేతను, సమాకుల = మిగుల కలఁగిన, చిత్తలు = మనస్సు గలవారు, అగుచున్, కను సన్నలన్ = కంటిసంజ్ఞలతో, వారించుచున్న = అడ్డుకొనుచున్నట్టి - (వలదని మాటలతో చెప్పక, ప్రభావతి చూడనట్లు కనుసంజ్ఞలచే వారించుచున్న-యని భావము.) చంద్రవతీ గుణవతులవంకన్, కనుంగొని, చెప్పన్ = చెప్పుటకు, కొంచించుటయు = సంశయింపఁగా, నక్తం...నందనయున్ - నక్తంచర=(రాత్రి చరులగు) రక్కసులకు, రాజ = రాజగు వజ్రనాభునియొక్క, నందనయున్ = కూఁతురగు ప్రభావతికూడ, (రాత్రి యనునర్థమున = 'నక్తం' అనునది యవ్యయము. నందన రూపాంతరము నందిని.) తనమీఁదన్ ఆనలిడుచున్ = ఒట్లుపెట్టుచు - చెప్పకున్న నాతోఁడే సుమీ యనుచు, అడిగినన్ = అరహస్య మేదో చెప్పు మని యడుగఁగా, పులుంగుపడంతి = ఆయాఁడుపక్షి (శుచిముఖి) తదనుజలన్ = ఆప్రభావతియొక్క చెల్లెండ్రను, విలోకించి = చూచి.

ఆ. మీర లూర కుండ రీరు దువ్వఁగఁ బేను, వచ్చు ననుట వినరె వనితలార !
యానవెట్టి యడుగ మానరాఁ దిఁకఁ జెప్పు, వలసె మీరహస్యవర్తనములు. 78

అర్థము:—వనితలార = చెలువలార, మీరలు, ఊరకుండరు, ఈరు = ప్రేనుగ్రుడ్డు, (లీఖు), దువ్వఁగన్ = దువ్వితీయఁబోఁగా, పేను = గ్రుడ్డు వెట్టిన పెద్దపేనే, వచ్చును = బయటికి వచ్చును - (ఈరు తివ్వఁగన్ అనుపాఠమున ... ఈరును, తివ్వఁగన్ = ఆకర్షింపఁగా, పైకిఁ దీయఁబోగా - అని యర్థము) చిన్నసంగతి తెలిసికొనఁగోరి కొంచెము ప్రశ్నింపఁగా నడిగినవారి గుట్టంతయుబయలుపడు నను నర్థమున నీ సామెత వాడఁబడును-అనుట, వినరె = వినియుండలేదా, ఆనవెట్టి=తనపై నొట్టుపెట్టుకొని, అడుగన్ = (ప్రభావతి) అడుగఁగా, మానరాదు = మానుటకు వలను గాదు, మీరహస్యవర్తనములు= మీ యేకాంతపు నడతలు, చెప్పవలసెన్ = చెప్పక తప్పని దాయెను.

వి. :—ఈరు దువ్వఁగఁ బేను వచ్చును. 'తీఁగ లాగిన డొంకంతయు కదలును' వంటి సామెత.

అలం. :—లోకోక్తి.

ఇప్పుడు శుచిముఖి వారిగు ట్టెల్లను ప్రభావతితోఁ జెప్పి, ప్రద్యుమ్నునివలన గదసాంబులను దెప్పింప నిశ్చయించుకొనియు, అది తెలుపక - చంద్రవతీ గుణవతులమీఁదనే నేరము మోపి, తాను జెప్పక తప్పనట్లు నటించుటచే శుఖముఖి యొక్క గడుసుఁదనము వ్యక్త మగుచున్నది.

వ. అని పలికి ప్రభావతితోడం బ్రద్యుమ్న లేఖాహరణం బొనర్చిన చిలుక సుద్దులు మొదలుకొని వారి ప్రయత్నంబు సకలంబునుం జెప్పిన నవ్వుచు నా పువ్వుఁబోఁడి వ్రీడావనత వదన లైన యమ్ముద్దియల నీక్షించి. 79

అర్థము:—ప్రద్యుమ్న లేఖాహరణంబు = ప్రద్యుమ్నుఁ డంపిన కమ్మను దెచ్చుట, ఒనర్చిన = చేసిన, చిలుక సుద్దులు = చిలుక విషయములు, మొదలుకొని - (అట్లు మొదటి నుండియుఁ జెప్పుట వలనఁ బ్రభావతి గుట్టంతయుఁ జంద్రవతీ గుణవతులకుఁ దెలిసి, వారి భయము కొంత తగ్గిన దని యూహింపఁ దగును.) వారి ప్రయత్నంబు = గదసాంబులను రావించుకొన వారిచుపుచు చేయు యత్నము, సకలంబును= అంతయును, చెప్పినన్ = చెప్పఁగా, ఆ పువ్వుఁబోఁడి=పువ్వువంటి మేనుగల యా ప్రభావతి, నవ్వుచున్ = వారు గూడ తనవంటివారే యని తెలియుటచే భయము విడిచి నవ్వుచు, వ్రీడావనత వదనలు = సిగ్గుచే వంపఁబడిన ముఖములు గలవారు, ఐన, ఆ + ముద్దియలన్ = ఆయింతులను, ఈక్షించి = చూచి.

తాత్పర్యము:—అని శుచిముఖి ప్రభావతితో ప్రద్యుమ్నునిలేఖను దెచ్చిన చిలుక వృత్తాంత మెత్తుకొని, వారు చేయు యత్నము నంతయును దాఁపక చెప్పినది. ఆ మాటలకు సిగ్గుచే తలలు వంచుకొని యున్న చంద్రవతీ గుణవతులను జూచి నవ్వుచు ప్రభావతి యి ట్లనెను.

క. మునిముచ్చులార మీ చే, సినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా
ననుఁ దఱిమితి ? రిఁక నేమియు, ననకుఁడు నాతోడి దొంగలై తిరి మీరున్. 80

అర్థము:—ముని ముచ్చులార = మునుల రూపముతో నున్న దొంగలార - పైకి మునులవలెఁ గనఁబడుచు దొంగపనులు చేయు వారని భావము. కపటాత్ములార, మీచేసినపని = మీరు చేసిన రహస్యపుఁ బని, అటు = ఆ విధముగా, కట్టిపెట్టి=దాఁచి యుంచి, చేకొని = పనిఁబూని, ననున్, ఏలా, తఱిమితిరి= తొందర పెట్టితిరి. లేదా అలజడి పెట్టితిరి, మీరును, నా తోడి దొంగలు = నే నెట్టిదొంగనో అట్టి దొంగలే, ఐతిరి, ఇఁకన్ = ఇటుమీఁద, ఏమియున్, అనకుఁడు=మాటాడకుఁడు. అందఱము సమానలమే యైతిమి గాన నొకరి నొక రేమియు ననుకోఁదగ దని తాత్పర్యము.

వ్యా. వి. :—మీ చేసినపని. సూ. ధాతుజ విశేషణ భావార్థక పూర్వవ్యవహితావ్యవహిత కర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠి యగు. యొక్కకు లోపంబుబహుళంబు. ప్రౌఢ. కారక. 15,16. చేత, మీ యొక్క + చేసినపని, మీ చేసిన పని అయినది.

నా తోడన్ + దొంగలు - సూ. చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులం దగు. బా. సంధి. 43 చే 'నాతోడి దొంగలు' అయినది.

వ. అనిన నాయింతికి శకుంతకాంత యి ట్లనియె. 81

అర్థము:—శకుంతకాంత = పక్షివనిత, ఆఁడుపక్షి, (శుచిముఖి)

వి. ఆకసమున నెగుర శక్తి గలది అని వ్యుత్పత్తితో, శకుంతము, శకుంతి, శకునము, శకుని అని నాల్గు రూపములు సిద్ధించినవి.

తే. గీ. లలన యెంతవారు గావలయు నెందు, నైన నీతోడివారు గానంత కిపుడు
ప్రియునితోఁ జెప్పి నీవు రప్పింప కున్న, వీరలకు నెక్కడది నిజవిభులరాక ? 82

అర్థము:—లలన = ఓయింతి, ఎందున్ + అయినన్ = ఏవిషయమునందునుగూడ, నీతోడివారు= నీతోడసమానులు, కాన్ = అగుటకు, ఎంతవారు = ఎంతగొప్పవారు (లేదా ఎంతయదృష్టము గలవారు) కావలయును, అంతకున్ = నీతోడివా రైనందులకుఁగాను, ఇపుడు, ప్రియునితోన్ = నీమగనితో, నీవు, చెప్పి, రప్పింపక+ఉన్నన్ = (వీరి ప్రియులను) రావింపక యూరక యున్నయెడల, నిజ విభులరాక = తమభర్తల సమాగమము, వీరలకున్ = వీ రిద్దఱకు, ఎక్కడది = లభింపనిది అని భావము.

తాత్పర్యము:—నాతోడి దొంగలైతిరి అని నీవనుటచే దొంగతనమందైనను నీతో సాటివారగుట కెంత యదృష్టవంతులు కావలయును? అట్టి యదృష్టము గల్గిన వీరికి వీరిప్రియులతో సమాగమము కలిగి నప్పుడే కదా నీవలె నదృష్టవతు లగుదురు. కాన నీభర్తతోఁ జెప్పి వీరిప్రియులను నీవు రప్పింపవలయును. లేకున్న ప్రియసమాగమము వీరికిఁ గలుగదు. అలం. :—కావ్యలింగము.

ఉ. ఎల్లియు నేఁడు నీకు హృదయేశ్వరు నెద్దియుఁ బల్కసిగ్గుచే
నుల్లము గొల్పదేని వికచోత్పలలోచన యేన నేఁడు నీ
వల్లభుతోడఁ జెప్పెద నవశ్యము నీచెలియండ్రకోర్కి సం
ధిల్లెడునట్లు గాఁగ భవదీయ నియోగ మహత్త్వశక్తిచేన్. 83

అర్థము:—వికచోత్పలలోచన=వికసించిన కలువలవంటి కన్నులుగలదానా (ప్రభావతీ) ఎల్లియున్= రేపును, నేఁడున్ = ఈదినమును, హృదయేశ్వరున్ = నీమగనిని - మగనితో నని యర్థము, ఎద్దియున్= ఏవిషయమును, పల్కన్, సిగ్గుచేన్, నీకున్, ఉల్లము = మనస్సు, గొల్పదేని = సమ్మతింపని దైనచో, అవశ్యము తప్పకుండ, నీచెలియండ్రకోర్కి నీచెల్లెండ్ర యిష్టము, సంధిల్లెడునట్లుగాఁగన్ = చేకూరునట్లు, భవదీయ...శక్తిచేన్ - భవదీయ = నీసంబంధమైన, నియోగ = ఆజ్ఞయొక్క, మహత్త్వ = గొప్పతనమందలి, శక్తిచేన్ = బలముచే, ఏను + అ=నేనే, నేఁడు, నీవల్లభుతోడన్ = నీప్రియునితో, చెప్పెదన్ = చెప్పుదానను.

తాత్పర్యము:—ఓప్రభావతీ! రేపు గాని యీదినమునఁ గాని నీమగనితో నేదేని చెప్పుటకు సిగ్గుచే నీమనస్సు సమ్మతింపదేమో! కావున నీవనుజ్ఞ యిచ్చినచో నీప్రియునితో నేనే వీరలకోర్కి తప్పక నెఱవేఱు నట్లు చెప్పెదను.

వి. :—ముగ్ధ వగుటచే నీ వెట్లును వీరల పతిసమాగమమును గూర్చి భర్తతో సిగ్గు విడిచి చెప్పఁ జాలవు. నేను జెప్పవలసినదే యని యనక శుచిముఖి నీవు చెప్పఁజాలవేని యనుజ్ఞ యిచ్చినచో యనుజ్ఞా బలమున నేను జెప్పెద నని తనవిధేయత బయలు పడునట్లును, చంద్రవతీ గుణవతులకుఁ దమప్రియుల సమాగమము ప్రభావతి చేతిలోని దని స్ఫురించునట్లు చతురతతోఁ జెప్పినది. దీనిచే చంద్రవతీ గుణవతులకు తొలుతఁ గలిగిన తేలికచూపు పోయి ప్రభావతియెడ గౌరవము కలుగుటయే కాదు హెచ్చు ననియు శుచిముఖి యాశయము.

వ. అని తన్నయన చేష్టావిశేషంబున నంగీకారంబు వడసినదియై, సునాభతనయల నభివీక్షించి యీప్రభావతికిం బతి యైనవాఁ డతిలోకమహిమ మహనీయుం డైన యొక్కదివ్యపురుషుండు గావునఁ దదనుగ్రహంబునం దక్కఁ దక్కినయుపాయంబుల నీయంతఃపురంబు మీవరులకుం జొర నలవి గా దని తలపోసి యిట్టి నీతి నిశ్చయించి పలికితి నని పలికి యి ట్లనియె. 84

అర్థము:—తన్నయన...విశేషంబునన్ - తత్ = ఆప్రభావతియొక్క, నయన = కంటియొక్క, చేష్టావిశేషంబునన్ = ఒకానొకచేష్టచేత, అంగీకారంబు = సమ్మతిని, పడసినదియై = పొందినదై, సునాభ తనయలన్ = సునాభుని కూఁతు లగు చంద్రవతీ గుణవతులను, అభివీక్షించి = చూచి (అభి + వి + ఈక్షించి) అతిలోక...మహిమన్ - అతిలోక=లోకము నతిక్రమించిన,-లోకుల కెవరికిని సాధ్యము కాని అని భావము, మహిమన్ =గొప్పతనముచేత, మహనీయుఁడు = పూజింపఁదగినవాఁడు, ఒక్క దివ్యపురుషుఁడు= ఒక దేవతాసంబంధి పురుషుఁడు, కావునన్, తత్ + అనుగ్రహంబునన్ = అతనిదయచేత, తక్కన్ =

తప్ప, మీవరులకున్ = మీపతులకు, చొరన్ = ప్రవేశించుటకు, అలవి = శక్యము, కాఁగ, ఇట్టిసీతి = ఇట్టిపద్ధతి - అనఁగా - ప్రభావతి యనుమతి నొంది యామె ప్రియునితోఁ జెప్పి యాతనిచే మీభర్తల నిటకు రావించునుపాయ మని భావము - నిశ్చయించి, పలికితిని, అని, ఇట్లు, అనియెన్ = పల్కెను.

క. మది తహతహ విడిచి యిఁకన్, ముదమున సతులార కొంగు ♦ ముడివేసి కొనుం
డిదె నేఁటిమాపటికిఁ గూ, ర్చెద వాలాయముగ నేను ♦ బ్రియులను మిమ్మున్. 85

అర్థము:—మదితహతహ=మనస్సునందలి తొట్రుపాటు, ఇఁకన్ = ఈమీఁద, విడిచి, సతులార = ఓచంద్రవతీ గుణవతులార, కొంగు = పైఁట కొంగు, ముడివేసికొనుండు = తప్పక మీకోరిక తీఱు నని నిశ్చయించుకొనుఁడు అనిభావము. ఇదె = ఇదిగో, నేఁటిమాపటికిన్ = ఈదినము సాయంకాలమునకు, మిమ్మును, ప్రియులను, నేను, వాలాయముగన్ = నిశ్చయముగా, కూర్చెదను = కలిపెదను.

అలం. :—లోకోక్తి.

వి. :—కొంగు ముడివేసి కొనుఁట జాతీయము - ముందు కాఁదగిన కార్యము తప్పక ఫలించు నను ధైర్యముతో చెప్పునపు - 'డిదిగో ముందటికార్యఫలమును కొంగున నిప్పుడే ముడివేసికొను' మను భావము సూచించును.

వ్యా. వి. కూర్చెదన్. కూడు ధా. ప్రేరణరూపము. సూ. 'ఆడోడుకూడుల డకారంబునకుం జుక్కు పరంబగు నపుడు రేఫంబగు.' బాల. క్రియా. 80. చే - కూడు + చు - కూరుచు - అయి, పిదప - 'కూర్చు' అగును.

క. అని హంసి మృదుస్మిత శో, భన లజ్జా వనత వదన ♦ పద్మంబులతోఁ
గనుపట్టువారి నిండ్లకు, ననిపించె నిశాచ రేశ్వ ♦ రాత్మజచేతన్. 86

అర్థము :—అని, హంసి, నిశా ... చేతన్ - నిశాచర = రేఁద్రిమ్మరు లగు రక్కసులకు, ఈశ్వర= ప్రభువగువజ్రనాభునియొక్క, ఆత్మజచేన్ = కూఁతు రగుప్రభావతిచేత, మృదు ... పద్మంబులతోన్ - మృదుస్మిత = చిఱునగవుచేత, శోభన = అందమైనట్టియు, లజ్జా = సిగ్గుచేత, అవనత = వంపఁబడిన, వదనపద్మంబులతోన్ = తామరపువ్వులవంటి ముఖములతో, కనుపట్టు = కనఁబడుచున్న, వారిన్ = ఆ చంద్రవతీ గుణవతులను, ఇండ్లకున్ = వారిగృహములకు, అనిపించెన్ = పంపునట్లుచేసెను.

తాత్పర్యము :—అని శుచిముఖి చిఱునగవుతో నందమై సిగ్గుచే వంపఁబడినముఖములుఁ గల యా యిరువురను ప్రభావతిచేత వారియిండ్ల కనుపునట్లు చేసెను.

వి. :—తాను పొం డని పలుకక, ప్రభావతిచేఁ జెప్పించుటచే భయము లేకుండ వా రిరువురును వెడలుదు రనియు, ప్రభావతికిఁ గూడ వారిప్రియులతోఁ గలుపుట సమ్మతమే యని వారు ధైర్యముతో నుందురనియు శుచిముఖి దూరముగా నాలోచించినదని యూహింపఁదగును.

వ. ఇవ్విధంబున నవ్వధూమణుల నమ్మించినదియై, యంచబోటి నాఁటిరాత్రి యాద
వుల విడిదికిఁ బోయి, యేకాంతంబునఁ బ్రద్యుమ్నగదసాంబుల మువ్వురం గూర్చి.87

అర్థము :—అవ్వధూమణులన్ = ఆ యన్నుల మిన్నలను, ఇవ్విధంబునన్ = ఈరీతిగా - నేఁటి మాపటికి గదసాంబులను దెత్తు నని నమ్మించినది, ఐ, అంచబోటి = శుచిముఖి, నాఁటిరాత్రి = ఆ నాఁటిరాత్రియందు, యాదవులవిడిదికిన్ = యదువంశజు లగు ప్రద్యుమ్నాదుల బసకు, పోయి, ఏకాం

తంబునన్ = రహస్యస్థలమందు, ప్రద్యుమ్న, గద, సాంబులన్, ముప్వురన్ = ముగ్గురను, కూర్చి = సమావేశపఱచి.

వ్యా. వి. :—ముప్వురు - మూఁడు + రు - సూ. సంఖ్యావాచకంబులకు విభక్తిపరంబగునపుడు కొన్నింటియంత్యాక్షరంబులకు లోపంబగు. ప్రౌఢ. శబ్ద. 92 చే డు వర్ణము లోపించుటయు సూ.-రు ర వర్ణకంబులు పరంబగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు. ప్రౌఢ శబ్ద. 91 చే మూగురు - అని సిద్ధించి - (క్వచిద్గకారోవః) అనుదానిచే -గకారము వకారమై 'మూవురు - విభక్తిపరంబగుచో మూఁడు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబుగానగు. ప్రౌఢ. శబ్ద. 99 చే 'మువురు'అయ్యెను. పిదప సూ. ప్రాప్తహ్రస్వంబగు మూఁడేలమీఁది వర్ణంబులకు ద్విత్వంబు బహుళంబుగానగు. ప్రౌఢ. శబ్ద. 100 చే 'ముప్వురు' అయినది. (ఇట్లే ముప్వురన్, మువురన్ - మొదలగునవి.)

క. సాకల్యంబున మీప్ర, త్యేకపుఁ బను లైనఁ గాని ◌ యెద్దియు నాకున్
బై కార్యము దెలియదు నా, కౌకస్స్వామికిని జెప్పి ◌ యనుపుట కనుడున్. 88

అర్థము:—సాకల్యంబునన్ = సంపూర్తితో - పూర్ణముగా నని భావము, మీప్రత్యేకపుఁబనులు= మీలో నొక్కొక్కనికి సంబంధించిన పనులు, ఐనన్ = అయినప్పటికిని, నాక + ఓకః + స్వామికిని = దేవేంద్రునకు, చెప్పి, = వజ్రనాభవధను గూర్చి చెప్పి, అనుపుటకున్=వార్త యంపుటకు, పైకార్యము= ఇచట నీమీఁద జరుగఁదగు పని, ఎద్దియున్ + కాని = ఏమియుఁగూడ, నాకున్, తెలియదు = తెలియకున్నది, అనుడున్ = అనుటయును.

తాత్పర్యము:—మీలోనొక్కొక్కరికిఁ గలపనులు పూర్తిగా నెఱవేఱుచున్నను ఈ మీఁద జరుగఁదగు వజ్రనాభవధవిషయమై యింద్రునకు వార్తనంపుటకు నాకేదియుఁ గాని తెలియకున్నది. అని హంసి పలుకఁగా .

వి. :—ఇంద్రకార్యమునకై యిచటికి వచ్చినట్లు చెప్పుచున్న యాముగ్గరకును తల కొక వేఱు వాంఛితము గల దని యిందు హంసి సూచించెను. ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని, గదుఁడు చంద్రవతిని, సాంబుఁడు గుణవతిని, పొందఁగోరి వచ్చి రనువిషయము ధ్వనింపఁ బలికిన దని భావము.

ఉ. అందఱకున్ దలాయొకటి◌స్వార్థము కల్గుట దోఁపబల్కె- సం
క్రందనకార్యవర్తనము◌గాకయు నాకును బోలె నెవ్వియే
నిందు నిజార్థముల్ కడమ◌యిద్దఱకుం గల వేమొ యంచు నా
త్మం దలపోఁత పూనిరి స◌మంబుగ నప్పుడు వారు ముప్వురున్.

అర్థము:—అందఱకున్ = మా కందఱకును, తలాయొకటి=ఒక్కొక్కని కొక్కొక్కటిగ, స్వార్థము= (స్వ + అర్థము) తమతమపని, కల్గుట, తోఁపన్ = స్ఫురించునటు, పల్కెన్ = (హంసి) పల్కినది, సంక్రందన కార్యవర్తనము = ఇంద్రునియొక్క ప్రయోజనము విషయమున సంచరించుట, కాకయున్ = (ఒకటే) కాక, నాకును బోలెన్ = నాకువలెనే, కడమ యిద్దఱకున్, ఇందున్ = ఇచ్చట, నిజార్థములు = సొంతమగుపనులు, కలవేమొ = ఉన్న వేమో, అంచున్, అప్పుడు = శుచిముఖి యట్లు పలికినప్పుడు, వారు, ముప్వురున్, ఆత్మన్ = మనసునందు, సమంబుగన్, తలపోఁత = ఆలోచనను, పూనిరి = వహించిరి.

తాత్పర్యము:—శుచిముఖి యట్లు పలికినప్పుడా ముగ్గురును తమ మనస్సులందు 'ఈహంసి మాముప్వురకును దేవేంద్రుని కార్యప్రవర్తనముగాక తలకొక స్వకీయ కార్యమున్నట్లు పలికినదే కడమ యిద్దఱకుఁ

గూడ నాకిచట స్వకార్యమున్నట్లే వేఱువేఱు కార్యములు కలవా యేమియని సమానముగాఁ దలపోయఁ జొచ్చిరి.

వ్యా. వి. :—'తలాయొకటి' - 'రోళ్లాగోళ్లా' వంటి జాతీయము అనుకోఁదగును. లేకున్న సాధుత్వము మృగ్యమగును.

వ. శుచిముఖియు వారిభావంబు భావించి, 90

అర్థము:—వారి భావంబున్ = ఆ మువ్వుర యభిప్రాయమును, భావించి = ఊహించి.

క. మీమీప్రత్యేకార్థము, లేమియు నొకరొకరెఱుంగరేమొకొ వినుఁ డం
చామువ్వురకు మువ్వురకుఁ గల, ప్రేమవతుల తెఱఁగు వారిప్రేమలు దెలిపెన్. 91

అర్థము:—మీమీ ప్రత్యేకార్థములు = మీయొక్క ప్రత్యేకపుఁ బనులను, ఏమియున్ = ఏకొంచె మును, ఒకరొకరు = పరస్పరము, ఎఱుంగరు+ఏమి+ఒకొ = ఎఱిఁగినవారు కారేమో, వినుండు, అంచున్, మువ్వురకున్ = ప్రద్యుమ్నగదసాంబులకు, కల ప్రేమవతుల తెఱఁగున్ = ఉన్న ప్రియురాండ్ర విధమును, వారి ప్రేమలు = ఆ ప్రభావతీ చంద్రవతీ గుణవతులకుఁ గల గాఢానురాగములును, ఆ మువ్వురకున్, తెలిపెన్ = తెలియఁజెప్పెను.

వ. తెలిపి ప్రద్యుమ్నునిం జూచి. (స్పష్టము.) 92

క. నీ వొకఁడవు మాయావివి, గావునఁ బ్రియఁబొందఁగంటి గాని యితరు ల
త్యావిలధృతి నున్నారి,ష్టావాప్తికిఁ ద్రోవ గానక యాత్మలలోనన్. 93

అర్థము.—నీవు, ఒకఁడవు, మాయావివి = మాయకలవాఁడవు, కావునన్, ప్రియపొందు = ప్రియురాలి సాంగత్యమును, కంటి = పొందితివి, కాని, ఇతరులు = మిగిలిన యిరువురును, ఇష్టా వాప్తికిన్ = కోరికను పొందుటకు, ఆత్మలలోనన్ = మనస్సులందు, త్రోవగానక = ఉపాయము తెలియక' అత్యావిలధృతిన్ = మిక్కిలి కలఁగి పోయినధైర్యముతో, ధైర్యము చెడి యని భావము - ఉన్నారు.

తాత్పర్యము:—నీవు మాయగలవాఁడవు కావున నీ ప్రియురాలిని బొందఁ గల్గితివి. తక్కిన వీ రిరువురును మనసున నుపాయము తోఁపక, ధైర్యము కోల్పోయి యున్నారు.

వ్యా. వి. :—మాయావి. (మాయా + వి.) మాయలు గలవాఁడు. మతుబర్థమున విన్ ప్రత్యయము.

వ. కావున వీరల యభిమతసిద్ధియు భవదధీనంబ యిందులకుఁ దగిన యుపాయం బూహింపు మనియె నప్పు డామువ్వురుం బరస్పర రహస్యకార్య ప్రకటనంబునకు నవ్వుచు సుహృద్భావ సుభగంభావుక నర్మసంవర్మిత వచనంబులతో నొండొరు మొగంబులు గనుంగొనుచు. 94

అర్థము:—అభిమత సిద్ధియున్ = కోరిక నెఱవేఱుటయును, భవదధీనంబు+అ = నీవశమైనదే - నీవు చేయవలసినదే యని భావము. పరస్పర ... ప్రకటనంబునకున్ - పరస్పర = ఒండొరులయొక్క, రహస్యకార్య = ఏకాంతపుఁ బనియొక్క, ప్రకటనంబునకున్ = బయలు పడుటకు, సుహృ...వచనంబులన్ - సుహృద్భావ = (స్నేహము) చెలిమిచేత, సుభగంభావుక = మనోహరమైన, నర్మ = పరిహాసముచేత,

సంవర్మిత = కప్పఁబడిన, వచనంబులతోన్ = మాటలతో, ఒండొరుమొగంబులు, కనుంగొనుచున్ = చూచుచు. ముందుపద్యముతో నన్వయము.

తాత్పర్యము:—తమతమ రహస్య వ్యాపారములు బయలుపడినందులకు నవ్వుకొనుచు, మైత్రిచే మనోహర మగు పరిహాసవాక్కులతో నొకరి నొక రిట్లనుకొనిరి.

వ్యా. వి. :—వర్మము = కవచము - వర్మము కలది - వర్మితము - సమ్యక్ వర్మితము - సంవర్మితము అని గతిసమాసము.

క. నీవచ్చుతీవిఁ గని యౌరా, వాసవకార్యపరత ఁ యనుచుంటిఁ గటా!
నీ వీతెఱఁగే యన మఱి, నీవో యన నీవొ యనఁగ ఁ నిగిడెన్ నగవుల్. 95

అర్థము:—నీ వచ్చుతీవిన్ = నీవువచ్చునట్టిసొగసును లేక విధమును, కని = చూచి, ఔరా - (ప్రశంసార్థకము) వాసవకార్యపరత = ఇంద్రునియొక్కపని (నెఱవేర్చుట) యందలిశ్రద్ధ, అనుచున్ = అనుకొనుచు, ఉంటిని = ఉన్నాను, కటా = అయ్యో (తాను మోసపోయినందులకు సంతాపసూచకము.) నీవు, ఈతెఱఁగే=ఈవిధమే (ప్రియురాలిని గలియఁగోరియే అనిభావము) అనన్ = అని ప్రశ్నింప, నీవో+అనన్, నీవొ + అనఁగన్, నగవుల్ = నవ్వులు, నిగిడెన్ = హెచ్చెను.

తాత్పర్యము:—నీవు వచ్చునప్పటితీవి చూచి యిది యంతయు నింద్రునికార్యము నిర్వర్తించుశ్రద్ధ యనుకొన్నాను. నీవును, శుచిముఖి యనినట్లు ప్రియురాలి సమాగమమునకే వచ్చితివా యన నీవో నీవొ యనుచు పెద్దగా వారుముగ్గురు నవ్వుకొనిరి.

వ. అంతఁ బ్రద్యుమ్నుండు శుచిముఖిం జూచి నీవు సునాభతనయలకడకుం జని, తమ హృదయేశ్వరు లిదె వచ్చెద రని యూఱడింపు మని పనిచి, తానును గదసాంబుల కిష్టసిద్ధి యగునట్లుగ నాత్మకల్పిత భూ వివరద్వారంబున దానవేశ్వర కన్యాంతఃపుర ప్రవేశంబు గలిగించి, నిజాంగనం గూడి రమియించుచుండె నప్పుడు. 96

అర్థము:—సునాభతనయలకడకున్ = చంద్రవతీగుణవతులయొద్దకు, తమహృదయేశ్వరులు = తమ ప్రాణనాథులు, ఇదె = ఇదిగో, వచ్చెదరు = వచ్చుచున్నారు, సన్నిహితభవిష్యదర్థమున తద్ధర్మక్రియ, ఊఱడింపుము = అనునయింపుము, అని, పనిచి = పంపి, ఇష్టసిద్ధి = కోరికనెఱవేఱుట, అగునట్లుగన్ = జరుగువిధమున, ఆత్మ...ద్వారంబునన్-ఆత్మ=తనచేత, కల్పిత = రచింపఁబడిన - త్రవ్వబడిన, భూవివర = భూమియందలి సొరంగముయొక్క, ద్వారమునన్=వాకిటినుండి, దానవేశ్వర...ప్రవేశంబు - దానవేశ్వర= రాక్షసరాజుయొక్క - సునాభునియొక్క, కన్యా = కూఁతులయొక్క, అంతఃపుర = అంతిపురమందు ప్రవేశంబు = చొచ్చుట - లేదా - దానవేశ్వర = రాక్షసరాజగు వజ్రనాభునియొక్క, కన్యాంతఃపుర = కన్యకలుండుటకై వేఱుగాఁ గట్టించిన నగరిలోన, ప్రవేశంబు, కలిగించి, నిజాంగనన్ = తనప్రియురాలిని- ప్రభావతిని, కూడి = కలిసికొని, రమియించుచుండెన్ = క్రీడించుచుండెను, అప్పుడు.

సీ. ఆననాంభోజ వ్యాఁపావర్తనా ముహు,ర్వ్యాఘ్నితాధరపాన ఁ విలసనంబుఁ
•గరకృతాంతర్ధి భంఁగురిత కపోలచుం,బన రణరణక సంఁభ్రమభరంబుఁ
బ్రసభాపహృత కుచఁప్రావర ణాంశుక,స్థా నాభిషిక్త దోఁస్స్వస్తికంబుఁ
సమపోఢ జఘనవఁస్త్రప్రయోజన సమా,దిష్టోరుయుగ మిథోఁవేష్టనంబు

నగుచుఁ దనసిగ్గుపెక్కువ న్ యవిరతంబుఁ, గరకరి యొనర్ప రాయిడిఁ గరము గెరలు
నతనురాగవేగంబున న్ నతిశయిల్లు, రమణురతి నొప్పె నొకకొన్ని రాత్రు లబల. 97

అర్థము:—కొన్ని రాత్రులు, ఆననాం ... విలసనంబున్ - అననాంభోజ = పద్మము వంటి ముఖము యొక్క, వ్యాపావర్తనా = ప్రక్కకుఁద్రిప్పుటచేత, ముహుః = మాటిమాటికి, విఘ్నిత = ఆటంకము గలదిగాఁజేయఁబడిన (అడ్డగింపఁబడిన) అధర=మోవి, క్రింది పెదవి (యందలి యమృతము యొక్క) పాన = త్రాగుటయను, విలసనంబున్ = విలాసము గలదియును - ప్రభావతియొక్క సిగ్గుపెక్కున (కర్త) భర్త యధరపానము చేయఁబోవ మాటిమాటికి ముఖము నిటునటు త్రిప్పి విఘ్నము కలిగించుచుండెను అని భావము - కర...భరంబున్ - కర = చేతులచే, కృత = చేయఁబడిన, శ్రద్ధ = దాఁపటికముచేత, భంగురిత = అడ్డు పెట్టఁబడిన, కపోల చుంబన = చెక్కిళ్ల యొక్క ముద్దాడుట యందలి, రణరణక = ఉత్కంఠ (తహతహ) చేతనైన, సంభ్రమభరంబున్ - అధికమగు తొట్రుపాటు గలదియును - ప్రియుఁడు చెక్కులు ముద్దాడఁబోవ రెండుచేతులతోఁ గప్పివైచి ఎట్లైన ముద్దిడు తహతహను ప్రియుఁడు చూపింపఁగా, తాను తొట్రుపాటొందు చుండెనని భావము. ప్రసభా...స్వస్తికంబున్ - ప్రసభ = బలాత్కారము చేత, అపహృత = తొలఁగింపఁబడిన, కుచ = స్తనములందలి ప్రావరణాంశుక = కప్పుబట్ట (పయఁట) యొక్క, స్థాన=ప్రదేశమందు - (పైఁట) యుండెడు తావున - అభిషిక్త నిల్పఁబడిన, దోః స్వస్తికంబున్ =భుజముల యొక్క బంధవిశేషము గలదియును-కుడిమూఁపున నెడమచేతిని, ఎడమ మూఁపునఁ గుడిచేతిని కత్తెరవలె నడ్డముగా వైచి నిల్పుట దోస్స్వస్తికము - ప్రియుఁడు కుచముల మీఁది పయ్యెద లాగి వేయఁగా - కుచముల కాచ్ఛాదనముగా స్వస్తికముద్ర నిలుపుట గలదియు - నని భావము. సమపోఢ ... వేష్టనంబున్ - సమపోఢ = (ప్రియునిచే) తీసివేయఁబడిన, జఘనవస్త్ర = కటియందలి వస్త్రము యొక్క, ప్రయోజన = కార్యమునకై, సమాదిష్ట = విధింపఁబడిన, ఏర్పఱుపఁబడిన, ఊరుయుగ = రెండు తొడలయొక్కయు, మిథః = ఒండొంటితో, వేష్టనంబున్ = మెలివేయుట గలదియును - కటివస్త్రమును, ప్రియుఁడు తొలఁగింపఁగా రెండు తొడలను నొండొంటితో మెలివైచి వస్త్రమువలని ప్రయోజనము నిర్వహించు చుండెనని భావము - అగుచున్, తన సిగ్గు పెక్కువ = తనయొక్క లజ్జాభరము - అధికమగు లజ్జయనిభావము. అవిరతంబున్ = ఎడతెగకుండఁగ, కరకరి = వైరమును, ఒనర్పన్ = చేయుచుండుట వలన, రాయిడిన్ = సంఘర్షణముచే, కరము=మిక్కిలి, తెరలు = విజృంభించునట్టి, అతనురాగవేగంబునన్ = మన్మథునివలని ప్రేమాతిశయముచేత, అతిశయిల్లు = హెచ్చునట్టి, రమణురతిన్ = మగనికూటమియందు, అబల = ప్రభావతి, ఒప్పెన్ = ప్రకాశించెను.

వి. :—ఇందు లజ్జావిజిత మన్మథ యగు ముగ్ధప్రౌఢ సంభోగము వర్ణింపఁబడెను. సీసమందలి నాలుగు పాదములను లజ్జకు విశేషణము లొనర్చి కవి లజ్జకు ప్రాధాన్య మిచ్చెను. దోఃస్స్వస్తికము:— అన్ని వ్రేళ్లను చాచి బొటనవ్రేలిని వంచిపట్టినచో పతాకాహస్త మగును. (అంగుల్యః కుంచితాంగుష్ఠా స్సంశ్లిష్టా ప్రసృతా యది, సపతాకా కరః ప్రోక్తో నృత్యశాస్త్రవిశారదైః.అని అభినయ దర్పణము)అట్టి రెండు పతాకా హస్తములందలి మణి బంధములను (వ్యత్యాసముగా) చేర్చి పట్టినయెడల స్వస్తికహస్తమగును. (పతాకయోః సన్నియుక్తః కరయో ర్మణి బంధయోః, సంయోగేన స్వస్తికాఖ్యో మకరార్థే నియుజ్యతే - అభినయ దర్పణము) అట్టి స్వస్తికహస్తము భుజములం దనుసంధించినచో 'దోస్స్వస్తికము' అగును. నాయిక లజ్జచే నిరోధ మొనర్చినకొలఁది నాయకునకు కూటమియం దుత్కంఠ హెచ్చుట కామశాస్త్రాను గతిని నిందు సూచింపఁబడెను.

ఉ. సిబ్బితి మాని నేఁటినిశఁ ✽ జిత్తము లోపలి కాంక్ష దీఱఁ జ
న్గుబ్బల నొత్తి యేనె మును ✽ గ్రుచ్చి కవుంగిటఁ జేర్చెదన్ విభున్
గొబ్బునఁ బట్టి దంతశిఖ ✽ నొక్కెద మోవియు నంచుఁ గోరు నా
గుబ్బెత రేపు లెల్లఁ దటిఁ ✽ గొంకు నిరంకుశలజ్జ పెంపునన్. 99

అర్థము:—ఆగుబ్బెత = ఆయువతి (ప్రభావతి) సిబ్బితి = సిగ్గును, మాని = విడిచి, నేఁటినిశన్ = ఈనాఁటిరాత్రియందు, చిత్తములోపలికాంక్ష = మనసునఁగలకోరిక, తీఱన్ = పూర్తియగునట్లు, ఏను+ఎ = నేనే, చన్గుబ్బలన్ = వట్రువయగు చన్నులచేత, (లేదా ! కొండలవంటి చన్నులచేత) ఒత్తి = నొక్కి, గ్రుచ్చి = గాఢముగా నదిమి, కవుంగిటన్ = కౌఁగిటియందు, మును = తొలుతగా, విభున్ = ప్రియుని, చేర్చెదన్, గొబ్బునన్ = త్వరగా, దంతశిఖన్ = పంటిమొనతో, పట్టి = పట్టుకొని, మోవియున్ = అధరమును, నొక్కెదన్, అంచున్ = అనుచు, రేపులు + ఎల్లన్ = పగటిభాగములందెల్లను, కోరున్ = అభిలషించును, తటిన్ = (కలిసికొనిన) వేళయందు, నిరంకుశలజ్జ పెంపునన్ = అడ్డులేని సిగ్గుయొక్క యతిశయముచేత, కొంకున్ = సంకోచించును, వెనుదీయును.

తాత్పర్యము:—యువతి యగు నాప్రభావతి పగటివేళలం దెల్లప్పుడును నేఁటిరాత్రి సిగ్గు విడిచి, మనసునందలి కోర్కి దీఱునట్లు నేనే విభుని చెకొని గుబ్బచన్నులచే నొత్తి గాఢముగాఁ గవుఁగిలించికొందును. పంటిమొనచే ప్రియుని యధరమును దటుక్కున నొక్కెదను' అని తలఁచుకొని సమయము వచ్చినపుడు లజ్జాభారముచే ననుకొనినట్లు చేయుటకు వెనుదీయును.

వ్యా. వి. :—గుబ్బెత-సూ. యువతి విటీ రజస్వలలు గుబ్బెత, మిండత ముట్టుతలు నాఁబడుదురు. బాల. తద్ధి. 21. (ఇచటి 'త' ప్రత్యయము ప్రశంసాద్యోతకమతుబర్థమున వచ్చినది.)

క. యాదవుఁ డంతట రతుల వి, భేదములు క్రమక్రమాభ్యు ✽ పేతములుగ నా
పైదలికిఁ గఱపి చిత్రా, పాది సురతరాజ్యమునకుఁ ✽ బట్టము గట్టెన్. 100

అర్థము:— యాదవుఁడు = యదువంశజుఁడగు ప్రద్యుమ్నుఁడు, ఆ పైదలికిన్ = ఆ యింతికి, రతులవిభేదములు = సంభోగమునందలి విశేషములను, క్రమక్రమ = నానాఁటికి, అభ్యుపేతములుగన్ = అంగీకరింపఁబడిన వానినిగా, కఱపి = నేర్పి, చిత్రా......రాజ్యమునకున్ - చిత్ర = ఆశ్చర్యమును, ఆపాది = కలిగించునట్టి, సురత = సంభోగమనెడి. రాజ్యమునకున్, పట్టము గట్టెన్ = ప్రభువుగా నొనర్చెను, సురతక్రియలందు స్వతంత్రురాలినిగాఁ జేసెనని భావము.

వి. :—వెనుకటి పద్యమునందును, నీపద్యమునందును సిగ్గును, కామమును, సమానముగఁ గల దను సూచనచే ప్రభావతి మధ్యానాయిక యని వ్యక్త మగుచున్నది.

వ. అందు. 101

అర్థము:—అందున్ = ఆ సురతక్రియలందు.

క. ఏవిధిఁ బతి వేడినఁ బుం,భావాదిని లజ్జఁ దొట్రు ✽ పడుఁ గాని తుదిన్
యౌవనపుంజిందఱ గొని, భావజుసివ మెత్తి యతివ ✽ ప్రౌఢిమ నెరపెన్. 102

అర్థము:—పతి = భర్త, ఏవిధిన్ = ఏరీతిగా, వేడినన్ = బతిమాలుకొన్నను, అతివ = ప్రభావతి, పుంభావాదిని = ఈపరతియొక్క యారంభమునందు, లజ్జన్ = సిగ్గుచేత, తొట్రుపడున్ = తడఁబడును,

కాని, తుదన్ = చివరకు, యౌవనపుంజిందఱ = పడుచుందనమువలని యుద్రేకమును, కొని = పూని, భావజునివము = మన్మథావేశము, ఎత్తి = కలుగఁగా, ప్రౌఢిమన్ = నేర్పును, ప్రౌఢాత్వమును, నెరపెన్ = ప్రకటించెను.

తాత్పర్యము:—భర్త యేవిధముగా బతిమాలినను సిగ్గుచే నారంభమున నుపరతియొనర్పఁ దడఁబడును. కాని తుట్టతుదకు పడుచుందనపు టుద్రేకమును వహించి, మన్మథావేశ మొంది, నేర్పు ప్రకటించెను.

వి. :—ఇందు నాయిక మధ్యావస్థ నతిక్రమించి ప్రౌఢావస్థ నొందుట వర్ణింపఁబడెను. 'స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా' అని ప్రౌఢాలక్షణము.

వ్యా. వి. :—యౌవనము + చిందఱ - సూ. కర్మధారయములందు మువర్ణమునకుఁ బుంపు లగు. బాల. సంధి. 62. చే - కర్మధారయము గాకున్నను - 'కర్మధారయంబుల' అను బహువచన ప్రయోగముచే షష్ఠీసమాసమందలి మువర్ణకమునకును పుంపులాదేశమై - 'యౌవనపు + చిందఱ' అని యయి, సూ. సమాసంబుల పదంబె ద్రుతప్రకృతిసమంబులకును, బుంపులకును, బరుషసరళంబులు పరం బగునపుడు నుగాగమంబగు. బాల. సంధి. 25. చే. 'యౌవనపు + ను + చిందఱ' అయి, ద్రుతసంధిచే 'యౌవనపుంజిందఱ' యను రూపము సిద్ధించినది. 'ప్రౌఢిమ' ప్రౌఢునియొక్క భావము 'ప్రౌఢి' అనియే కాని 'ప్రౌఢిమ' యనఁదగ దని, 'దృఢాదిష్వేమనిజ్ మృగ్యః' దృఢాదిషు ప్రౌఢి మేత్యాదిషు ఇమనిజ్ మృగ్యః అన్వేషణీయ ఇతి' అని వామనుడు కావ్యాలంకారసూత్రవృత్తియందుఁ జెప్పెను. కాని 'ప్రౌఢిమ' ప్రయోగ మాంధ్రకావ్యము లందుఁ బెక్కుటఁ గనఁబడుచున్నది.

ఉ. ఆచనుద్రేఁగు నట్టి జఘనాతిభరంబు విరోధి గాక తో
డై చపలాక్షి కింపొసఁగె నప్డు సముద్గమవేగ నున్నమై
ఖేచరచక్రసామ్యధృతికిన్ దగ నొక్కటి మీఁదికిం దివన్
భూచరచక్రసామ్యమునుఁబొందెఁ దదన్యము క్రింది కీడ్చుచున్. 103

అర్థము:—ఆ చను ద్రేఁగను = అట్టి కుచములబరువును, అట్టి జఘనాతి భరంబును = అటువంటి పిఱుఁదులయొక్క పెద్దబరువును, (రెండు బరువులు గూడ) చపలాక్షికిన్ = మెఱుపుతీఁగలవంటి - కన్నులుగల ప్రభావతికి, విరోధి = బాధకము, ఆటంక మొనర్చునది, కాక = కాకుండ, అప్డు = ఆయుపరతికాలమున, సము ... నున్నమై - సముద్గమ = (సమ్ + ఉత్ + గమ) ఎగరోయుటయందలి, వేగ = వడిచే, నున్నము + ఐ = తోలఁగింపఁబడినవై, (కుచభర, జఘనభరములకు రెంటికి విశేషణము) ఇంపు = సంతసమును, ఒసఁగెన్ = కలిగించెను, ఒక్కటి = స్తనభారము, ఖేచర = ఆకాశమునఁ దిరుగు, చక్ర = చక్రవాకపక్షుల యొక్క, సామ్య = సాటిని, ధృతికిన్ = ధరించుటకు, తగన్ = తగినట్లు, మీఁదికన్ = పైభాగమునకు, తివన్ = లాగుచుండఁగా, తదన్యము = కుచభారముకంటె వేఱయిన జఘనభారము, క్రిందికిన్, ఈడ్చుచున్ = లాగుచు, భూ ... సామ్యమును - భూ = భూమియందు, చర = సంచరించునట్టి, చక్ర = బండికంటియొక్క, సామ్యమును = సాటిని, పొందెను.

తాత్పర్యము:—మగపోఁడిమి సమయమున నా ప్రభావతియొక్క యధికమైన కుచభారమును, జఘనభారమును, బాధకములు కాకపోవుటయే కాదు. ఎగయుట యందలి వేగముచే రెండుబరువులును దొలఁగింపఁబడినవై యొకటి యాకసమునఁ దిరుగు జక్కవలసాటిదై మీఁదికి లాగుచుండ, రెండవది యగు కటిభరము భూమియందుఁ దిరుగు బండిచక్రమువంటిదై క్రిందికీడ్చుచు నామెకు మిగుల సంతసమును గలిగించెను. కాని యా యాసము కలిగింప లేదు.

అలం:—విషమము, కావ్యలింగము, శ్లేషమూలక సంబంధాతిశయోక్తి, పరికరాంకురము.

వి. :— చపలాక్షి మెఱుపుతీఁగలవలెఁ దళతళమను కన్నులుగలది యనుటవలననే యామె సంతసమును, ఉత్సాహమును స్ఫురించుచున్నది. అలసినచో కనులందు బడలికయే కాని, వికాస మసంభవ మగును. కావున సాభిప్రాయ విశేష్యము.

వ. తదనంతరంబ. 104

సీ. గుబ్బపాలిండ్లు గన్గొను వేడుకను మించు, గాఢ పరీరంభ • కౌతుకంబు
గాఢపరీరంభ • కౌతుకంబును మించు, జఘన లోలుప హస్త • చాలనంబు
జఘనలోలుపహస్త • చాలనంబును మించుఁ, దిలక మంటినకురుల్ • దిద్దుతమియుఁ
దిలక మంటినకురుల్ • దిద్దుతమిని మించు, వాతెఱ చవులాను • వలపుపెంపు

ఆ. వాతెఱచవు లాను • వలపుపెంపును మించు, రతులరహియు, • రతుల రహిని మించు
నధరరసము–విఘటి • తాన్యోన్యముగఁ దత్త, ఱిలుచుఁ బతి రమించెఁ • జెలువఁ గూడి.

అర్థము:—గాఢ...కౌతుకంబు - గాఢ = దృఢమైన, పరీరంభ = కౌఁగిలింతయందలి, కౌతుకంబు = ఉత్కంఠ, తహతహ, గుబ్బపాలిండ్లు = వట్రువలైన పయోధరములను (కుచములను), కన్గొను వేడుకను = చూచునుత్సాహమును, మించున్ = అతిశయించును, జఘన...చాలనంబు - జఘన (స్త్రీ) కటియొక్క ముందు భాగమునందు, (ని. పశ్చాన్నితంబః స్త్రీకట్యాః క్లీబేతు జఘనం పురః, అని అమరము). లోలుప=ఆసక్తమైన, హస్త = చేతియొక్క, చాపలంబు = చాంచల్యము, గాఢ ... కౌతుకంబును = గట్టికౌఁగిలింతయందలి వేడుకను, మించున్ = అతిశయించును, తిలకము = బొట్టు, అంటిన = (చెమటచే) అంటుకొనిన, కురుల్ = ముంగురులను, దిద్దు = చక్కఁజేయు, తమియున్ = ఉత్కంఠ, జఘన ... చాపలంబును = జఘనమం దాసక్త మగుచేతియొక్క చాంచల్యమును, మించున్ = అతిశయించును, వాతెఱచవులు = క్రింది పెదవియందలి రుచులను, ఆను = త్రాగుటయందలి, వలపుపెంపు = కోరికయొక్క యాధిక్యము, తిలకమంటినకురుల్ దిద్దుతమిని, మించున్ = అతిశయించును, రతులరహియున్ = సంభోగముల వలని యానందము, వాతెఱచవులాను వలపు పెంపును, మించున్ = అతిశయించును, అధరరసము = అధరామృతపానమందలిరుచి (మాధుర్యము), రతులరహిని = సంభోగానందమును, మించున్ = అతిశయించును. (ఇట్లు) విఘటిత = విడఁదీయఁబడిన, అన్యోన్యముగన్ = ఒండొండుకలుగునట్లుగా, పైని జెప్పఁబడినకృత్యములలో నొకదానిచే నొకటి విడివడఁజేయునట్లుగా – అని భావము. పతి = మగఁడు (ప్రద్యుమ్నుఁడు) తత్తఱిలుచున్ = తొందరపడుచు, (సంభ్రమించుచు) చెలువన్ = అందకత్తెయగు ప్రభావతిని, కూడి, రమించెన్ = క్రీడించెను.

వి. :—ముద్రితములందుఁ బాఠ మట్లుండుటచే నట్లే వ్యాఖ్యానింపఁబడినది. కాని, మించున్ అనునది క్రియాపదముగాఁగాక, మించు = 'మించునట్టి' యనునర్థము గలధాతుజవిశేషణముగా గ్రహించిన యెడల మీఁదివ్యాఖ్యకంటెను సరళమగు నన్వయమును, సామంజస్యమును గలుగును. అప్పుడు 'తమియున్, రహియున్' అను వానియందలి 'ఉను' వాక్యాలంకారముగాక, సముచ్చయార్థకమై ప్రకృతమునకుఁ జక్కఁగ సరిపడును. గుబ్బ ... కన్గొనువేడుకను మించునట్టి, గాఢ ... కౌతుకంబును, ఆ కౌతుకమును మించునట్టి హస్తచాపలమును, ఆ చాపలమును మించునట్టి కురులు దిద్దుతమియును, అట్టి తమినిమించునట్టి వలపు పెంపును, ఆ పెంపును మించునట్టి రతులరహియును, ఆ రహినిమించునట్టి యధరరసమును, తమలో నొండొంటిని ద్రోసిపుచ్చునట్లుగా, ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని గూడి క్రీడించెనని స్వారసికమగు నర్థము కుదురును. ముద్రితప్రతులయనురోధమున సవరింపఁబడలేదు. వ్రాఁతప్రతు లరయఁదగి యున్నది.

అలం :—స్వభావోక్తి, ఏకావళి.

గీ. 'అలరుచు గృహీతముక్తరీత్యర్థపంక్తి, యగుచు నేకావళియనంగ నఖిలకృతుల' ఆంధ్రచంద్రాలోకము 92.

వ్యా. వి. :—పరిరంభము - అమనుష్యవాచకమును, ఘ ఇంతము నగుటచే నుపసర్గమునకు దీర్ఘము వచ్చి 'పరీరంభము' అయినది. 'ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహుళమ్' (6. 3. 122) ఉపసర్గస్య బహుళం దీర్ఘఃస్యాద్ఘఞంతేపరే నతు మనుష్యే అని పాణినీయము. పాలిండ్లు = పాలకుఇండ్లు - స్థానములు, అనివ్యుత్పత్తి. పయోధరము అను సంస్కృత పదమునకు సరియైనది. ఇది నిత్యబహువచనము.

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశిని హృదయేశు చిత్తంబు రంజిల్ల నుల్లసిల్లెఁ జంద్రవతీ గుణవతులుం బతులచేత నతులానురాగపూర్వక నిర్వర్తిత గాంధర్వవివాహ లగుచుం గ్రమప్రవర్థమాన నానారతిప్రాగల్భ్య నిర్భరంబులగు విహారంబుల నతిశయిల్లి రివ్విధంబున. 106

అర్థము:—ఇత్తెఱంగునన్ = ఈ విధముగా, అమ్మత్తకాశిని = (మత్తేవకాశతఇతి - మత్తకాశిని, మదము = కైపుగలదివలెఁ బ్రకాశించునది. అనివ్యుత్పత్తి) ఆ ప్రభావతి, హృదయేశుచిత్తంబు = మగని మనస్సు, రంజిల్లన్ = రాగిల్లఁగా, అనురక్తముకాఁగా, ఉల్లసిల్లెన్ = ప్రకాశించెను, లేక సంతసిల్లెను, చంద్రవతీగుణవతులున్, పతులచేతన్ = తమప్రియులగు గద సాంబులచేత, అతులాను...వివాహలు - అతుల = సాటిలేని, అనురాగ = ప్రేమ, పూర్వక = తొలుతగలుగునట్లు, నిర్వర్తిత = నెఱవేర్పబడిన - కావింపబడిన, (నివర్తిత పప్పుపాఠము. 'మరలింపఁబడిన' అని దానికర్థమై ప్రకృతమునకు విరుద్ధమగును. ముద్రితములం దిట్లేయున్నది) గాంధర్వవివాహలు = గాంధర్వవివాహములుగలవారు. (వధూవరు లొండొరులు వలచి, యమంత్రకముగా నితరు లెఱుంగకుండఁ గావించుకొనెడి వివాహము.) అగుచున్, క్రమ...నిర్భరంబులు - క్రమ = క్రమముగా, ప్రవర్థమాన = పెరుఁగుచున్న, నానా = అనేకవిధములగు, రతి = సంభోగములందలి, ప్రాగల్భ్య = దిట్టతనముచే, నిర్భరంబులు = నిండినవి, అగువిహారంబులన్ = అయినక్రీడలచే, అతిశయిల్లిరి, ఇవ్విధంబునన్ = ఈ రీతిగా.

తాత్పర్యము:—ప్రభావతివలెనే చంద్రవతీగుణవతులును బ్రియులతోఁ గ్రీడించుచుండిరి.

సీ. అతియత్నరుద్ధ లబ్ధాశ్లేషచుంబన, కుచపీడనాద్యమై కొన్నినాళ్లు
మందమంద క్రియమాణ నానాప్రాతికూల్యాభిరామమై కొన్నినాళ్లు
కృతకప్రమాదానుమతసముల్లసదసం, కుచిత క్రియాకమై కొన్నినాళ్లు
విరళత్రపా తిరస్కారిణీ పరిస్ఫుర, త్కౌతుకసంరంభమై కొన్నినాళ్లు

ప్రకటముఖరిత మేఖలాకరణిత గుణిత, మణిత ఘంటారవాఘోష్యమాణ మసృణ
కుసుమసాయ కౌద్ధత్యమై కొన్నినాళ్లు, రతి జరుగఁ జల్పి రతివలు పతులసేవ.

అర్థము:—అతి...నాద్యమై - అతియత్న = మిక్కిలిపూనికతో, రుద్ధ = (నాయికచే) నివారింపఁబడినవయ్యును, లబ్ధ = (నాయకునిచేత) పొందఁబడినవగు, ఆశ్లేష = కవుఁగిళ్లు, చుంబన = ముద్దులు, కుచపీడన = కుచమర్దనములు, ఆద్యమై=మున్నగునవి కలదియై, కొన్నినాళ్లు=కొన్నిదినములును, మంద... రామమై - మందమంద = మెలమెల్లగా, క్రియమాణ = చేయఁబడుచున్న, నానా = పెక్కుతెఱఁగులైన, ప్రాతికూల్య=అడ్డగింతలచేత, అభిరామమై=మనోహరమైనదై, కొన్నినాళ్లు=కొన్నిదినములును, కృతక... క్రియాకమై - కృతక=కృత్రిమమైన - (కల్పితమైన) ప్రమాద=పొరపాటుచేత, అనుమత=అంగీకరింపఁబడిన,

సముల్లసత్ = ప్రకాశించుచున్న, అసంకుచిత = సంకోచమునొందని (వెనుదీయని) క్రియాకమై=పనులు గలదియై, కొన్నినాళ్లు, విరళ...సంరంభమై - విరళ=పలుచని (అల్పమైన) త్రపా=సిగ్గనెడి, తిరస్కరిణీ = తెరనుండి, పరిస్ఫురత్ =ప్రకాశించుచున్న, కుతుక=వేడుకవలని, సంరంభమై=వేగిరపాటుగలదియై, కొన్ని నాళ్లు,ప్రకట...ఔద్ధత్యమై-ప్రకట=స్పష్టముగా, ముఖరిత=ధ్వనించునదిగాఁజేయఁబడిన, మేఖలా=గంటల యొడ్డాణముయొక్క, రణిత = ధ్వనులచే, గుణిత = ఎక్కువచేయఁబడిన, మణిత = రతికూజితమనెడు - (సురతవేళ పారవశ్యమునొందిన స్త్రీలకంఠమునఁబుట్టు ధ్వనివిశేషము మణిత మనఁబడును. 'మణితంరతి కూజితమ్' అని అమరము.) ఘంటారవ = జేగంట ధ్వనిచేత, అఘోష్యమాణ = చాటింపఁబడుచున్న, మసృణ = దట్టమగు - అధికమైన అని భావము. కుసుమసాయక + ఔద్ధత్యము + ఐ = మన్మథోద్రేకము గలదై, కొన్నినాళ్లు = కొన్నిదినములును, రతి=సంభోగము, జరుగన్ ప్రవర్తిల్లగా, ఆతివలు = ప్రభావతీ, చంద్రవతీ, గుణవతులు మువ్వురును, పతులసేవన్ = తమప్రియులకు నుపచారములను, చల్పిరి=చేసిరి.

తాత్పర్యము:—ఈవిధముగా - తాము తొలుత మిగులయత్నముతో నిరోధించినను నాయకులు బలిమిని గౌఁగిలించి, ముద్దాడి, కుచస్పర్శమొనర్పఁగాఁ గొన్నాళ్లును, కొంచెముగ నడ్డగించుచు నాయకు లకు మనోహర మగునట్లు వశమగుచు కొన్నాళ్లును, పరాకుగా నున్నట్లు తామునటించుచు నాయకుని యిష్టానుసారము వర్తింపఁగా కొన్నాళ్లును, క్రమక్రమముగా సిగ్గువీడి తామే వేడుక (లమి) చూపఁగ కొన్నాళ్లును, ప్రౌఢలై గంటలయొడ్డాణము ధ్వనులు రతికూజితముల ధ్వనిని హెచ్చింపఁగా మన్మథో ద్రేకము ప్రకటింపఁగా కొన్నాళ్లును, రతికేళిజరుపుచు - నాముప్పురు కొంతలును, తమతమ ప్రియులను సేవించిరి.

వి. :—ఇందు మొదటిపాదమున నాయికలయొక్క ముగ్ధాత్వమును, రెండుమూఁడు పాదములందు మధ్యాత్వమును, నాల్గవపాదమునను, తేటగీతియందును, ప్రౌఢాత్వమును వ్యంజ్యమానము లగుచున్నవి.

అలం:—సారము. 'రణిత గుణిత మణిత' అననపుడు వృత్త్యనుప్రాసము.

వ. అందు నొక్కనాఁడు. 108

అర్థము:—అందున్ = ఆదినములలో, ఒకనాఁడు, అనఁగా వా రట్లుపతులతో యథేష్టముగా క్రీడించు నాదినములలో నొకనాఁడు అన్నమాట.

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీ రతివిహార ప్రౌఢి సారస్యసం
పద్యుక్తిన్ గడుఁ జొక్కి దక్కితి రతీ ! మత్ప్రాణమా నీకు నం
చుద్యత్ప్రేమ సమృద్ధిఁ బల్కె,నది యా యోషాలలామన్ శ్రవ
స్సద్యఃపాత నిశాత శూలసమమై చాలంగ నొంచెన్ వెసన్. 109

అర్థము:—ప్రద్యుమ్నుండు, ప్రభావతీ...యుక్తిన్ - ప్రభావతీ=ప్రభావతియొక్క, రతివిహార= సురతకేళి యందలి, ప్రౌఢి = నేర్పుయొక్కయు, సారస్య = సరసత్వము యొక్కయు, సంపత్=సమృద్ధి యొక్క, యుక్తిన్ = కలయికచేత - ప్రభావతి రతికేళియందుఁ జూపిన యత్యధికమగు నేర్పుచేతను, సర సత్వముచేతను అని భావము. కడున్ = మిక్కిలి, చొక్కి = పరవశుఁడై, మైమఱచి, మత్ప్రాణమా = నాప్రాణమైన, రతీ, నీకున్, దక్కితిని=వశమైతిని, అంచున్ = అనుచు, ఉద్య...సమృద్ధిన్-ఉద్యత్= ఉదయించుచున్న - పొంగి పొరలుచున్న, ప్రేమ = అనురాగముయొక్క, సమృద్ధిన్ = అతిశయముచేత, పల్కెన్ = అనెను. రతీ! అనునది ప్రభావతియొక్క సంభోగమునకును, వెనకటి జన్మమందలి తనప్రియు రాలగు రతీదేవికిని గూడ సంబోధన మగు నట్లుపలికెను. అది = రతీ ! అను నాపిలుపు, శ్రవ...సమమై - శ్రవః = చెవులయందు, సద్యః=అప్పుడు, (తత్క్షణమునవే అని భావము.) పాత=ప్రవేశముగల (చొచ్చిన యని భావము) నిశాత = వాఁడియైన, శూల=ఇనుపగసికతో, సమమై=సాటియై, ఆ యోషాలలామన్ =

స్త్రీలలో శ్రేష్ఠురాలగు నా ప్రభావతిని, చాలంగన్ = అధికముగా, వెసన్ = వెంటనే, నొంచెన్ = నొప్పించెను, బాధించెను అని భావము.

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁ డిట్లు క్రీడించుకాలమున నొకనాఁడు రతికేళియందు ప్రభావతి చూపిన యధికమగు నేర్పునకును, రసికతకును పరవశుఁడై రతిదేవితో క్రీడించుచున్నట్లు భ్రమపడి, పరాకున నా ప్రాణమైన రతీ! నీకు వశుఁడ నైతి నని పలుకఁగా - ఆరతిదేవి సంబోధనము చెవులలోఁ దటాలున గ్రుచ్చిన యినుపశలాకవలె నా ప్రభావతికి వెంటనే మితిలేని వెత కలిగించెను.

క. ధాత్రిఁ జిరార్జిత తాదృ,క్చిత్రమిథఃప్రేమ నుల్లసిలుచో బెరు కే
మాత్రము లే కెనసినప్రియు,గోత్రస్ఖాలిత్య మోర్వఁ గోమలి వశమే. 110

అర్థము:—చిరా...ప్రేమన్ - చిర = పెద్దకాలమునకు, ఆర్జిత = సంపాదింపఁబడిన, తాదృక్ = అట్టి, చిత్ర = అపూర్వమైన, మిథః = ఒండొరులకుఁగల, ప్రేమన్ = అనురాగముతో, ఉల్లసిలుచోన్ = సంతోషించుసమయమున, బెరుకు = భేదము, ఏమాత్రము, లేక, ఎనసిన = పొందినట్టి, ప్రియగోత్ర స్ఖాలిత్యము = వలపుకానియొక్క పేరు తబ్బిబ్బును (మగఁడు తనపేరు మఱచి సవతిపేరు పలుకుటను) ఓర్వన్ = విని సహించుట, ధాత్రిన్ = భూమియందు, కోమలి వశమే = ఆఁడుదానికి శక్యమగునా? కాదని భావము.

తాత్పర్యము:—చిరకాలమునకు లభించినదియు, ఆ ప్రభావతీ ప్రద్యుమ్నుల ప్రేమవంటిదియు నపూర్వము నగు నొండొరుల ప్రేమలో మునిఁగి, యాల్మగలు సంతసించువేళ - ఏకొంచెమును భేదభావము లేక మెలఁగుప్రియుఁడు తబ్బిబ్బుగా సవతిపేరఁ దన్నుఁ బిలిచినచో భూమియం దేకాంతయైనను విని సహింపఁగలదా? అలం:—అప్రస్తుత ప్రశంస.

వి. :—ఇట్లు లోకసామాన్యముగాఁ గాక కోమలి యన ప్రభావతియే యని యర్థము చెప్పినచో 'ధాత్రిన్' అనునది వ్యర్థము ననన్వితము నగును. కాన 'కోమలి వశమే' (లోకమందలి) ఏస్త్రీ కైనను శక్యమా అని యన్వయింపవలసి వచ్చెను - గోత్రము = పేరు, అనుటకు ని. గోత్రం నామ్ని కులే క్షేత్రే కాననే విత్తవర్త్మనోః, సంభావనీయబోధేపి గోత్రః క్షోణిధరే మతః. అని విశ్వనిఘంటువు.

ఉ. ఏ మని చెప్ప నప్పు డసురేంద్రసుతన్ సకలాంగసంప
దుద్దామ రతోత్స వానుపమ తత్ప్రథమక్షణ సంభవ త్సుఖ
శ్రీమయ మూర్ఛ చేడ్పడఁగఁ జేసెను దుఃఖపుమూర్ఛయై కడున్
భామల కట్టిచో సవతినామము మారణమంత్ర మౌఁ జుమీ. 111

అర్థము:—ఏమి+అని+చెప్పన్ = ఆపయిని జరిగినసంగతి ఏమియైనది అని చెప్పవచ్చును? చెప్ప వీలుకా దనిభావము. అప్పుడు, సకలాంగ...మూర్ఛ - సకల = సమస్తమైన, అంగ = (రతికేళియొక్క), అవయవము (అంగము)లైన యాలింగన చుంబన దంత నఖక్షతాదులయొక్క, సంపత్ = అతిశయముచే, ఉద్దామ = బంధనరహితమైన - (యథేష్టముగాఁ గొనసాగుచున్న అని భావము) రతోత్సవ = సంభోగ మనునానందము కలిగించు కార్యముచేత, అనుపమ = సాటిలేని, తత్ప్రథమక్షణ = దానికంటె ముందటి క్షణమందు (రతీ! యని ప్రద్యుమ్నుఁడు పలుకుటకు ముందటిక్షణమందు) సంభవత్ = కలుగుచున్న, సుఖశ్రీమయ = సౌఖ్యాతిశయ వికారమైన, మూర్ఛ = సొమ్మసిల్లుట (కర్త) దుఃఖపుమూర్ఛ = దుఃఖాతి శయముచేఁగలుగు సొమ్మగా, ఐ = పరిణమించి, మాఱి, అసురేంద్రసుతన్ = రాక్షసరాజు కూఁతురగు ప్రభావతిని, చేడ్పడఁగన్ = కలఁత నొందునట్లు, లేదా బాధపడునట్లు, చేసెను. ఇఁక చెప్పుట కేమున్నది.

అప్పుడు చుంబనాలింగనాది సర్వాంగసుఖములతోఁ బరిపుష్టమై గోత్రస్ఖలనము కలుగుటకు ముందటిక్షణము దాఁక ననుభవించుచున్న ప్రభావతియొక్క యానందపారవశ్యము ఒక్కమాఱుగా దుఃఖపుమూర్ఛగా మాఱిపోయి ప్రభావతిని బాధపడునట్లు చేసినదై చెనని భావము. అట్టిచో = అట్టితన్మయావస్థయందు, సవతినామము = (భర్తచే నుచ్చరింపఁబడిన) సవతియొక్కపేరు, భామలకున్ = స్త్రీలకు, మారణ మంత్రము = చంపునట్టిమంత్రము – అత్యంతబాధకము, ఔఁజుమీ = అగును జుమా.

అలం. :—పరిణామము, అర్థాంతరన్యాసము.

వి. :—అర్థాంతరన్యాసమునందు 'ఔఁజుమా' అని యుండుటకంటె 'ఔఁగదా – అని యుండుట సమంజసము. చుమీ – 'చూడుమీ' అను పదమునకు రూపాంతర మగుటచే కవివాక్యమునం దంతగా పరిపక్వమైనట్లు కనఁబడదు. ముద్రితపాఠములందు 'ఔఁజుమీ' అనియే కలదు. ఈపద్యమునఁ బ్రభావతికిఁ గలిగిన యీర్ష్యామానము వర్ణింపఁబడినది. దానిలక్షణము భరతరసప్రకరణమున నిట్లు చెప్పఁబడినది. 'ఈక్షణాలింగనాదీనాం నిరోధో మాన ఉచ్యతే, ప్రణయేర్ష్యా ప్రభేదేన ద్వివిధః సోఽభిధీయతే' అనఁగా– దర్శన, స్పర్శనాలింగన చుంబనాదులను నిరోధించుట 'మాన'మనఁబడును. అది ప్రణయమానము, ఈర్ష్యా మానము అని రెండు విధములు. 'ఈర్ష్యామానస్తుయఃకోపః ప్రియేజ్ఞాతాన్యసంగమే, అభాషణ ముపాలంభో భర్త్సనం తాడనం తథా, వైముఖ్య మశ్రు చామర్ష ఇత్యాద్యై రనుభావ్యతే, తద్ జ్ఞానం శ్రవణా ద్దృష్టే రనుమానాచ్ఛవా భవేత్' అన్యస్త్రీసంగమము నాయకుఁ డొనర్చినట్లు తెలియుటచే నాయికకుఁ గలుగు కోప మీర్ష్యామాన మనఁబడును. మాటాడకుండుట, నిందించుట, బెదరించుట, కొట్టుట, పెడమొగమగుట, కన్నీరు, కోపము మున్నగువానిచేఁ దెలియఁదగును. ఎవరివలననైన వినుటచేఁగాని, అన్యస్త్రీతోడిరతి చిహ్నములు చూచుటచే గాని అనుమానప్రమాణముచేఁగాని నాయకుని శాఠ్యమును నాయిక తెలిసి కొనును – 'శ్రవణం దూతికాదిభ్యో దృష్టిః సాక్షాద్విలోకనం, అనుమానం స్వప్నగోత్రస్ఖలనాదిభి రుచ్యతే' శ్రవణమనునది దూతికాదులవలన వినుట, దర్శన మనునది ప్రత్యక్షముగాఁ జూచుట, అనుమానమనునది పరకాంతతో నాయకుఁడు క్రీడించుచున్నట్లు కలగనుట, పేరు తబ్బిబ్బుగా పిలుచుట మున్నగువానిచే నూహించుట – అని భావము.

ఇందు ప్రద్యుమ్నుఁడు పరవశుఁడై సవతియగు రతిపే రుచ్చరించుట గోత్రస్ఖాలిత్యము. దానివలన నీతనిమనస్సు రతిదేవియందే కాని నాయందు లే దని యనుమాన మూని యీర్ష్యామానము వహించినట్లు స్పష్టము. ఈర్ష్యామానవతికిఁ గలుగు మౌన, నిందా, వైముఖ్య, బాష్పమోచనాదు లగు లక్షణములు మీఁది పద్యములందు విపులముగా వర్ణింపఁబడును. నాయిక ఖండిత. "జ్ఞాతేఽన్యాసంగవికృతే ఖండి తేర్ష్యా కషాయితా, నిశ్వాస కంప ఖేదాద్యైః ఖండి తేత్యభిధీయతే." అని ఖండిత నాయికా లక్షణము. అందును మధ్య, అధీర.

తే. ఆప్రభావతి కొంత సే పవ్విధమున, మానదుఃఖనిశ్చేష్టిత యైన వెనుక
నుస్సురనుచును వేఁడినిట్టూర్పు నిగుడ, వగలఁ బొగులుచుఁ బొరలెమాఱుమొగము గాఁగ.

అర్థము:—ఆప్రభావతి, కొంతసేపు, అవ్విధమునన్ = ఆప్రకారముగా, మానదుఃఖనిశ్చేష్టిత = కోపముచేఁ గలిగిన దుఃఖముచేత చేష్టలు లేనిది, ఐనవెనుకన్ = అయినతరువాత, ఉస్సురు, అనుచున్, వేఁడినిట్టూర్పు = వెచ్చని దీర్ఘనిశ్వాసము, నిగుడన్ = వ్యాపింపఁగా, వగలన్ = మనోవ్యథలచేత, పొగులుచున్ = కుములుచు – (లోలోన తపించుచు, అని భావము.) మాఱు+మొగము = పెడమొగము గలది, కాఁగన్ = అగునట్లు, పొరలెన్ = ప్రక్కపై దొర్లెను. అంతదాఁక ప్రియుని కభిముఖియై యున్నయామె వెనుకవైపుమొగ మగునట్లు ప్రక్కపై దొరలినదని భావము. ఇందు నీర్ష్యామానవతికిఁ గలుగు వైముఖ్యము చెప్పఁబడెను.

తే. గీ. అరిగె శయ్యాంతరమునకు నంతలేచి, యతివరో యిది యేమి నాయందుఁదప్పు
గలిగెనో యంచుఁ దోన రాఁగడఁగు విభుని,నట్లు రాకుండ ఘనమైనయాన వెట్ట. 113

అర్థము:—అంతన్, లేచి = (పరుండియున్న పాన్పునుండి) లేచి, శయ్యాంతరమునకున్ = వేఱొక పాన్పునకు, అరిగెన్ = వెళ్లెను, అతివరో, ఇది = ఇట్లులేచి వెడలుట, ఏమి, నా యందున్, తప్పు, కలిగెనో = కలిగినదా? అంచున్, తోన = వెంబడిన్; రాన్ = వచ్చుటకు, కడఁగు = యత్నించునట్టి, విభునిన్ = భర్తను, అట్లు = తన దగ్గఱకు, రాకుండన్, ఘనము = గొప్పది, ఐనయాన = అయినట్టి యొట్టు, వెట్టన్ = పెట్టఁగా.

తాత్పర్యము:—అట్లు ప్రభావతి మాఱుమొగము వెట్టుకొని, కొంతసేపటికి లేచి మఱొక పానుపున కేఁగెను. ఏఁగు సమయమున 'అతివరో యిదియేమి? నేనేమేని తప్పుచేసితినా' అనుచు వెంట రా నెంచు మగనిని రాకుండునట్లు పెద్ద యొట్టుపెట్టఁగా - మీఁది పద్యముతో నన్వయము.

క. ప్రద్యుమ్నుఁడు తా నటు చను, నుద్యోగము దక్కి యుస్సురుస్సు రనుచు నా
హృద్యతరాంగి వియోగము, సద్యఃపరితాప మొసఁగ సందేహమునన్. 114

అర్థము:—ప్రద్యుమ్నుఁడు, తాను = స్వయముగ, అటు = ఆరీతిగా, చను నుద్యోగము = వెళ్లునట్టి యత్నమును, తక్కి = విడిచిపెట్టి - వెళ్లుట మాని యని భావము, ఉస్సురుస్సురు, అనుచున్, ఆ... వియోగము - ఆ, హృద్యతరాంగి = మిక్కిలి సొగసైన శరీరముగల యా ప్రభావతి యొక్క, వియోగము = ఎడఁబాటు, సద్యః పరితాపము = తత్క్షణ బాధను, ఒసఁగన్ = కలిగింపఁగా - వెంటనే బాధను కలిగింపఁగా నని భావము, సందేహమునన్ = సంశయముతో - మీఁది పద్యముతో నన్వయము.

వ. తనకుఁ గొంతసమీపంబున నొక్క పర్యంకంబున నవ్వలి మొగంబుగా శయనించి యున్న యా ప్రభావతికిఁ గర్ణగోచరం బయ్యెడుపాటి పరిమిత స్వరంబున నిట్లనియె.

అర్థము:—ఒక్క పర్యంకంబునన్ = వేఱుమంచమునందు, అవ్వలి మొగంబుగాన్ = వెనుకవైపు మొగము పెట్టుకొని, శయనించి = పరుండి, కర్ణగోచరంబు = చెవిసోఁకు నది (వినిపించునట్టిది), అయ్యెడు పాటి = అగుమాత్రము, పరిమిత స్వరంబునన్ = కొంచెమగు కంఠధ్వనితో ఇట్లు, అనియెన్.

తాత్పర్యము:—అట్లు సమీపముననె వేఱొక మంచముపై యవ్వలి దిక్కు మొగముగా పరుండిన ప్రభావతికి మాత్రమే వినఁబడునట్టి చిన్నగొంతుతో ప్రద్యుమ్నుఁ డిట్లనెను.

ఉ. తామరసాక్షి నావలనఁ దప్పొక టెయ్యది యైనఁ గల్గెనో
నామది తాల్మి చూడఁగ మనంబునఁ గోరియొ, యల్గి కూడినన్
బ్రేమలు వింతయింపు సవరించు నటంచునొ యుల్కుచొప్పు గా
కే మయినన్ నిమిత్త మొకయించుక కల్గెనొ లేచి పోవఁగన్. 116

అర్థము:—తామరసాక్షి = పద్మములవంటి కన్నులుగలదానా! ఓ యింతీ, నావలనన్ = నావైపున, నాయెడ - (వలనన్ అనునది యిట పంచమీ విభక్తి ప్రత్యయము గాక, 'వలను = వైపు అనుపదమునకు సప్తమ్యంత రూపము.) తప్పు, ఒకటి, ఎయ్యదియైనన్ = ఏదైనను, కల్గెనో = కల్గినదా, (లేక) నామది తాల్మి = నా మనసునందలి ధైర్యమును, చూడఁగన్ = పరీక్షింపఁగా, మనంబునన్ = నీ మనస్సునందు, కోరియొ =

వాంఛించితివో, అల్గి = కోపగించి, కూడినన్ = (పిదప) రతియందుఁ గూడినచో, ప్రేమలు, వింతయింపు= అపూర్వమగు రుచిని, సవరించున్=తొల్చును (లేక-పొందును) అటంచునో, అల్క చొప్పుగాక=కోపగించు విధమగునేమో - అలిగితివేమో కాని యని భావము. లేచి = నా ప్రక్కనుండి లేచి, పోవుటకున్ = మఱొక సెజ్జకు వెళ్లుటకు, ఏమి + అయినన్ = ఏ కొంచెమైనను, నిమిత్తము = కారణము, కల్గెనో= ఉన్నదా? ఏదియు లేదని భావము.

తాత్పర్యము:—ఓ తమ్మికంటీ! ఎన్నఁడైనను నాయెడ చిన్న తప్పేదియైనఁ జూచితివా? ఎడఁబాసినచో నే నెంతవఱకుఁ దాళియుండఁగలనో యని నన్నుఁ బరీక్షింపఁగోరి కాని, పొలయలుక తీఱిన పిదపఁ గల్గుకూటమియందుఁ బ్రేమ పొంగి, యపూర్వసుఖ మిచ్చు నని తలంచి కాని, యలిగితివేమో యను కొనుచుంటిని. అంతియ కాని పాన్పు విడిచి వెడలిపోవుటకు కారణ మే కొంచెమైన నున్నదా? (ఏమియు లేదు.)

వి. :—ప్రణయకలహము తీఱిన తరువాతి సంభోగ మమితసుఖ మిచ్చునందురు.

క. పలుదోమిసేయు విడియము। తలగడిగిననాఁటినిద్ర, తరుణులయెడలన్, బొలయలుకనాటి కూటమి। వెల యిం తని చెప్పరాదు వినురా సుమతీ. సుమతిశతకము. 77

వ్యా. వి. :—కంటివో, కోరియో, అటంచునో, కల్గెనో వీనిలోని ఓకారము సంశయ సూచకమగు ప్రశ్నార్థకావ్యయము. 'ప్రేమలు' అధికార్థమున బహువచనాంతరూపము, అలుక - 'అలుగుట' భావార్థమున వచ్చిన కృత్ప్రత్యయము.

క. అనుటయు ఘనదుఃఖవశం,బున నొకయుత్తరము నీక పొలఁతుక నిట్టూ
ర్పు నిగిడ్చి యూరకుండిన, దనుజారి సుతుండు ప్రచలితం బగు మదితోన్. 117

అర్థము:—అనుటయున్ = ఇట్లు ప్రద్యుమ్నుఁడు పలుకఁగా, పొలఁతుక = ఆ ప్రభావతి, ఘనదుఃఖ వశంబునన్ = అధిక మగుదుఃఖమునకు లోఁగిన హేతువుచేత, ఒకయుత్తరమును = కొంచెము సమాధానమును, ఈక = ఈయక (కొంచెమైనను మాఱుపల్కక,) నిడు + ఊర్పు - నిట్టూర్పు = దీర్ఘ నిశ్వాసమును, నిగిడ్చి = ప్రసరింపఁజేసి - విడిచి యని భావము. ఊరక + ఉండినన్ = మిన్నకుండఁగా, దనుజారిసుతుండు = రాక్షసవిరోధియగు కృష్ణుని కొడుకు - ప్రద్యుమ్నుఁడు, ప్రచలితంబు = మిగుల కంపించుచున్న. (కలఁతనొందిన, అనిభావము.) మదితోన్ = మనస్సుతో - (మీఁదికన్వయము.)

వ్యా. వి. :—పొలఁతి - పొలఁతుక. సూ. ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు. బాల. తద్ధిత. 10. నిడు + ఊర్పు - నిట్టూర్పు-సూ. కుఱుచిఱు కడునడు నిడు శబ్దంబుల రడలకచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు. బాల. సంధి. 12. ఒక యుత్తరము - ఒక= అల్పము. సూ. ఒకశబ్దం బొక్కచో నల్పార్థకం బగు. ప్రౌఢ. శబ్ద. 84.

శా. నాయం దేయది తప్పు దోఁచినది యోనారీమణీ నీకు? దుః
ఖాయత్తత్వము చూడ నిక్క మిది, మత్ప్రాణంబ వీ వెందునున్
జేయ న్నేర్తునె తప్పు నీకు, నిది నీచిత్తంబు రాఁ దెల్పుకో
డాయన్ వచ్చెద, నాకు రా ముదల పెట్టంగాఁ దగున్ సత్కృపన్. 118

అర్థము:—ఓ నారీమణీ = ఓ స్త్రీరత్నమా, అన్నులమిన్నా, నీకున్, నాయందున్, తప్పు = అపరాధము, ఏయది = ఏది, తోఁచినది = కనఁబడినది?, దుఃఖాయత్తత్వము = దుఃఖమునకు (నీవు) అగ్గల మగుటను, చూడఁగ్ = పరిశీలింపఁగా, ఇది = నాయం దేదో నీవు తప్పును గాంచుట, నిక్కము =

నిజము, నీవు, మత్ప్రాణంబవు = నాప్రాణమవు (గదా), ఎందున్ = ఏవిషయమందైనను, నీకున్=నీయెడ, తప్పు, చేయన్ నేర్తునె = చేయఁగలనా? నీ చిత్తంబు = నీ మనస్సు, రాన్ = నావంకకు వచ్చుటకు, (నాపై ప్రేమగలుగుట కని భావము.) ఇది = 'నాయందుఁ దప్పున్నట్లు నీవు భ్రమపడితివి' అను నీసంగతి, తెలుపుకోన్ = తెలియఁజెప్పుకొనుటకు, డాయన్ వచ్చెదను = దగ్గఱకు వచ్చెదను, సత్కృపన్ = స్థిరమగు దయతో, రాన్ = నీదగ్గఱకు వచ్చుటకు, నాకున్, ముదలపెట్టంగాఁ దగున్ = (ఒట్టును దీసివేసి) ఆజ్ఞ యీయవలెను.

తాత్పర్యము:—ఓయన్నులమిన్నా! నాయం దేమితప్పును జూచితివి! ఇట్లు నీవు ఖేదపడుట చూడఁగా నేదియో నాయందు నీకుఁ దప్పుగాఁ గనఁబడుట నిజము. కాన నీకు నాయెడ దయ గలుగు నట్టివిషయము నీకుఁ దెలియఁజెప్పుటకు నీదగ్గఱకు వత్తును. దయ యుంచి యొట్టును దీసివైచి నిన్ను సమీపించుటకు నా కాజ్ఞయిమ్ము.

వి. :—ఇందలి 'నారీ' శబ్దము స్త్రీమాత్రపరము. 'నృనరయోర్వృద్ధిశ్చ' అనుగణసూత్రముచే 'నృ, నర'. శబ్దములకు స్త్రీత్వవివక్షయందు 'నారీ' అని యైనది. నరస్త్రీ యనియర్థము చెప్పవలయును. కాని యిట నీయర్థ మవివక్షితము. స్త్రీమాత్రమే వివక్షితము.

వ. అట్లుం గాదేని. 119

తాత్పర్యము:—వెనుకఁ జెప్పిన దేదియుఁ గాదు. తప్పే యున్న దందువా.

తే. వనిత యిటు వచ్చి నీవు నీకవలయు సోదె,
గొనుము దప్పున్న మఱి నాకుఁ గప్పెనఁగఁ జోటు
గలదె నీమొలనూలునఁ గట్టువడుదుఁ,
బూనుదును నీవు మెడఁ బెట్టు పొగడదండ. 120

అర్థము:—వనిత = ఓయింతీ, నీవు, ఇటు = నాశయ్యమీఁదికి, వచ్చి, నీవలయుసోదె = నీకుఁ గావలసినట్టి ప్రశ్నము, కొనుము = స్వీకరింపుము, వేయుము, నన్నుఁ బ్రశ్నించి నాయుత్తరములను సమగ్రముగా వినుము. అని కాని-ముందుగా నిటకు రమ్ము. తరువాత - (రాఁగలకీడు మేళ్లను దెలుపునట్టి దైవజ్ఞలను) సోదెకత్తెల నడిగి వాస్తవము తెలిసికొనుము - అనికాని భావము, తప్పు = నాఅపరాధము, ఉన్నన్ = సోదెకత్తెలపలుకులందుఁ దోఁచినయెడ, పెనఁగన్ = తప్పు లే దని పేఁకులాడుటకు, చోటు= అవకాశము, నాకున్, కలదె = ఉండునా? (అట్లపరాధినే యైనయెడల) నీమొలనూలునన్ = నీకటి సూత్రముచేత, కట్టువడుదును = బద్ధుఁడనగుదును, నీవు, నామెడన్ = నాకంఠమునందు, పెట్టు=తగుల్చు, పొగడదండన్ = కాలికిని మెడకును నంటఁదీసి కట్టెడుశిక్షాసాధనమును, పూనుదును. 'సంభోగేచ్ఛచే నీమొలనూలియందుఁ బద్ధుడనైయుందును. ప్రేమచే నీవువేయునట్టి పొగడపువ్వులదండను కంఠమున ధరింతు' నని యర్థాంతరము. అలం. :—శ్లేషము.

వి. పొగడదండ - మెడకు మోఁగాలికిఁబుడమికిఁ గొనసేయఁ బొగడదండలతోన పొలియువారు. రామాభ్యుదయము. 8. 16. ఇంద్రజిత్తుమింటనుండి భూమిపై నున్నవానరులపై బాణము వేయఁగా - ఆబాణములు కపులమెడకును మోఁగాలికి నొకటిగా గ్రుచ్చుకొని భూమియందు నాటుకొన - పొగడదండ శిక్షయైన దనియు, ఆపొగడదండతోనె భూమిపైఁ బడి కొందఱుకపులు మరణించి రనియు చేసినవర్ణనమును బట్టి కాలికిని మెడకును బిగియ నంటఁగట్టెడు సాధన మని తెలియుచున్నది.

క. నావుడును గంఠగద్గద, కావికృతి యడంచుకొంచు ఘనయత్నత వ
ర్ణావళి యేర్పడఁ బలికెఁ బ్ర, భావతి చెవి యొగ్గి తనదు పతి యాలింపన్. 124

అర్థము:—నావుడును = అనిపలికిన యనంతరము, ప్రభావతి, కంఠగద్గదికావికృతి = కంఠమునఁ దోఁచుగజగజ మనుధ్వనివికారమును, అడంచుకొనుచున్, ఘనయత్నతన్ = పెద్దప్రూనికకలవాని ధర్మముతో- అనఁగా పెద్దయత్నముతో, వర్ణావళి = అక్షరముల వరుస, ఏర్పడన్ = వే అగునట్లు, స్పష్టముగా - దుఃఖాతిశయముచే నెమ్మదిగా నొక్కొక్కయక్షరము నుచ్చరించుచు నని భావము, తనదుపతి=తనమగఁడు, చెవియొగ్గి, ఆలింపన్ = వినుచుండఁగా, పలికెన్ = చెప్పెను.

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁ డిట్లు పలుకఁగా ప్రభావతి గొంతునఁదోఁచు గజగజ మనుధ్వని నణంచుకొనుచు, మగఁడు శ్రద్ధగ వినుచుండ, దుఃఖాతిశయమున విడివిడిగా నొక్కొక్కయక్షరము వినఁబడ నీవిధముగాఁ బల్కెను.

చ. అనఘుఁడ నిన్ను సోదెగొను నంతటిదాననె యేను? దప్పు లే
దును దలపోయ నీవలన, దోసమె యాత్మను బాయకున్న వా
రిని బలు కొక్కమా అనుసరించుట? మే నది వించు నేఁ దొఱం
గని పెనుతప్పు నాయదియ కాక పదింబదిగాఁగ నెంచినన్. 122

అర్థము:— అనఘుఁడ = పాపరహితుఁడా, (ఏపాప మెఱుఁగనివాఁడా అని సోల్లుంఠనము) నిన్నున్ = నిన్నుద్దేశించి, ఏను = నేను, సోదెగొనునంతటిదాననె = సోదెకత్తెలను ప్రశ్నించి తెలిసికొను పాటి దాననా? (కానని భావము) ఆత్మను = (నీ) మనస్సును, పాయక = విడిచిపెట్టక, ఉన్నవారిని, పలుకు - (నీ) మాట, ఒక్కమాఱు, అనుసరించుట = అనువర్తించుట, (వెంబడించుట) దోసమె = తప్పా? (తప్పు గాదు. కావున) నీవలనన్ = నీయెడ - తప్పు + లేదు + ఉను - తప్పును = తప్పు అను మాటయును, లేదు, (ఇట 'ఉను' అను నవ్యయము స్వతంత్రమై 'తప్పు' అనుపదము ననుసరించుట ప్రయోగవిశేషము) ఎంచినన్ = ఆలోచించినచో, పదింబదిగాగన్ = పెక్కుమాఱులు, బాగుగా, - ఎంచినన్ = పరిశీలించినచో, అది = రతీ! యని నీవు పలికిన యాపలుకును, వించున్ = వినుచు, (వినుచుండఁగనే అని భావము) - మేను = శరీరమును, నేను, తొఱంగని = విడువ నట్టి, పెనుతప్పు = పెద్దతప్పు, నాయదియ కాక = నాదియే కాని - నీది కాదని వెనుకటి వాక్యముతో నన్వయము.

తాత్పర్యము:—ఎట్టిపాపము లేనివాఁడా! నిన్నుద్దేశించి సోదెకత్తెలను ప్రశ్నించి నీహృదయము తెలిసికొను నంతటిదాననా? రతీ! యని యన్యకాంతను పిలిచిన పిలుపును వినుటతోడనే దేహమును విడువని పెద్దతప్పు నాదే కాని బాగుగా నాలోచింప నీయం దెట్టితప్పును లేదు. మనసునం దున్నవారిని పలు కనుసరించుట తప్పగునా? అనఁగా నీ మనసునందు 'రతి' యున్నది. నీ వనుకొనకున్నను నీ వాక్కే పేరు వెలువరించినది. అలం. :—వ్యాజస్తుతి.

'మే నదివించు నేఁ దొఱంగని' అనుపాఠము దూరాన్వయమగుచున్నది. 'ఏ నది వించు మేఁ దొఱఁగని' అని కవిపాఠమై యుండు నని తోఁచుచున్నది. పరిశీల్యము.

వి. :—'అనఘుఁడ' అని సంబోధించుటలో కుటిలచిత్తుఁడ వని వ్యంగ్యము. 'నిన్ను సోదెగొను నంతటిదాననె' అనుటలో నీవు పాపచింత గలవాఁడ వని తెలియుచుండ సోదెకూడ నెందులకు? అని వ్యంగ్యము. 'నీయెడఁ దప్పేదియును లేదు.' అనుటలో ఎంత తప్పైనను నీయందే కలఁ దనియు, 'ఆత్మను బాయనివారిని పలు కొకసారి యనుసరించుట తప్పా' యనుటలో నీమనసున నెవతో కతెను ధ్యానించుచు

నేఁడుగాక యెన్నఁడైనను మాటవరుస కావెను గూర్చి తెలుపఁ వైతి వనియు, 'అట్టికుటిల మగు నీమనస్థితి తెలిసిన నేను దేహత్యాగము చేయనితప్పు నాదే' యనుటలో – వినినవెంటనే చావవలసినదే, కాని యీ విషయ మంతయు నీకుఁ దెల్పకయే వచ్చినయెడల నా తప్పగు నని యింతదాఁక జీవించి యుంటి ననియు, నీవలె హృదయము దాఁచికొనక చెప్పివైచితిని గాన నిఁక నేను జీవింపను జుమా యనియు – వరుసగా వ్యంగ్యములు గలవు. ఇట్లు వ్యంగ్యప్రధానము కాన నియ్యది యుత్తమకావ్యమై 'ధ్వని' యని పేర్కొనఁ బడును. 'వ్యంగ్యస్య ప్రాధాన్యే ఉత్తమం కావ్యం ధ్వని రితి వ్యపదిశ్యతే' అని ప్రతాపరుద్రీయము. కావ్యప్రకరణము – వ్యాజస్తుతియందు భాసిల్లు నిట్టి వ్యంగ్యము 'వాచ్యసిద్ధ్యంగరూప వ్యంగ్య' మనియు, నుత్తమకావ్యమనియు, జగన్నాథపండితరాజమతము. వ్యంగ్యమనఁగా :— వాక్య మంతయు, జక్కఁగ నన్వయించినపిదప చమత్కారకారియై తోఁచు వేఱర్థము. అట్టివ్యంగ్యము కావ్యమునకు జీవితవైభవము ('వ్యంగ్యంజీవితవైభవమ్') అని వ్యంగ్యమునకుఁ బ్రాధాన్య మీయఁబడినది.

ఉ. అట్టిమదీయ మైన వపురాశ్రయలోభమహాపరాధమే
గట్టిగ లేచి వచ్చుటకుఁ గారణ మైనది, నాకు దోసముల్
గట్టెడు నీమృషాచటు వికారముఁ జూడఁగఁ జేసి యిప్పుడున్
దిట్టును రట్టు నర్హ మగు దీనికి నిన్ననఁ జెల్ల దేమియున్.

అర్థము:—అట్టి = అటువంటి, (ఇది 'అపరాధము'నకు విశేషణము) మదీయము = నాది, ఐన... రాధమే – ఐన = అయినట్టి, వపుః = శరీరముయొక్క, ఆశ్రయ = అవలంబించుటయందలి, లోభ = ఆశయనెడి, మహాపరాధమే=గొప్ప దగుతప్పే, లేచి=పానుపుపైనుండిలేచి, వచ్చుటకున్ = (ఈపాన్పునఁ బరుండఁగా) వచ్చుటకు, గట్టిగన్ = పూర్ణముగా (లేక నిశ్చయముగా), కారణము = హేతువు, ఐనది, దోసముల్ = తప్పులను, కట్టెడు=కూర్చుచున్నట్టి – 'నాయందే తప్పు లున్నట్లారోపించుచున్న' అనిభావము. నీ...వికారమున్ – నీ = నీయొక్క, మృషా=అసత్యమైన, చటు = ప్రియవచనములయొక్క, వికారమున్= మార్పును, చూడఁగఁజేసి = చూచుటచేత, ఇప్పుడున్ = ఈ సమయమునఁగూడ, తిట్టును = నిందయును, రట్టును = అల్లరియును (లేక అపకీర్తియును), నాకున్, అర్హమగున్ = తగును, దీనికిన్ = ఇట్టినింద్యావస్థకు, నిన్నున్, ఏమియున్ = కొంచెమును, అనన్ = అనుట, చెల్లదు = తగదు.

తాత్పర్యము:—శరీరము నాశ్రయించి జీవింప నాశించుట యను తప్పే నేను నీపాన్పువదలి వచ్చుటకు హేతు వైనది. అట్టియాశయే లేనిచో నాపాన్పుమీఁదనే మరణించి యుందును. అట్లు జీవితాశచే నివ్వలకు వచ్చినను నాయందే తప్పుల నారోపించుచు నీవు చెప్పు నసత్యమగు ప్రియవాక్కులవికృతిని చూచుట గల్గుచున్నది. దీనివలన లోకమున నాకు నిందయు నపకీర్తియుఁ దప్పునవికావు. ఈ విషయమున ని న్నేమియు ననఁగూడదు. (ఈ లోపమంతయు నాదే యనిభావము.) అలం:—కావ్యలింగము.

వ్యా. వి. :—చూడఁగఁజేసి – హేత్వర్థమున నన్నంతక్రియలకుఁ బట్టి వర్ణకాను ప్రయోగము కల దని ప్రౌఢవ్యాకర్త చెప్పియున్నాఁడు. కాని చేతవిభక్త్యర్థకమగు 'చేసి' యనుప్రయుక్తమగుట చెప్పలేదు. 'చూచుటఁజేసి' అని యిచటఁ బఠింపవచ్చును. కాని ముద్రితములందు చూడఁగఁజేసి అనియే పాఠము కనఁబడుచున్నది. 'చూడఁబట్టి, చూడఁగఁబట్టి' వంటివి శ్రీనాథాది మహాకవుల ప్రయోగములు గలవు. ఇట 'చూడఁగఁబట్టి' అని కవియాశయమేమో యనియు సంశయము కలుగుచున్నది. చూడఁగఁజేసి = చూపి యనుపేరణార్థ మిచటఁ బొసఁగునట్లు కనఁబడదు. కాన నీ ప్రయోగము విచార్యము.

తే. దూఱుఁ దగు నిన్ను నొకటికిఁదొంటియట్లు, కల్లకూరిమి నెరపు వాక్యముల నన్ను
నిప్పుడును బయ లీఁడించె దిదియు కాదె, కుటిల! తడిపాఁతఁ గుత్తుక కోయు టనఁగ.

అర్థము:—కుటిల = ఓ మోసగాఁడా, ఒకటికిన్=ఒకదానికి (మాత్రమే) నిన్నున్, దూఁఱదగున్= నిందింపవలెను. అది యే మందునా? తొంటియట్లు + అ= వెనుకటివలెనే, కల్లకూరిమి = అసత్యప్రేమను, నెరపు = ప్రకటించునట్టి, వాక్యములన్=మాటలచేత, నన్నున్, ఇప్పుడును = (వేఱొకప్రియురాలు నీకుఁ గల దని నేను దెలిసికొనిన) ఈసమయమునఁ గూడ, బయలు = ఆకాశమందు, ఈఁదించెదవు=నీటియందు నీఁదునట్లు చేయుచున్నావు. (ప్రేమ లేకున్న నున్నట్లు నటించుచు నా కేదో యున్నతస్థానము గూర్చెదనని చెప్పుచున్నావు అని భావము.) తడిపొఁతన్=తడిగుడ్డతో, కుత్తుకన్=గొంతుకను, కోయుట, అనఁగన్ = అనఁగా, ఇదియ కాదె = ఇదే కదా! (ప్రియ మగుమాటలను జెప్పుచు నపకారము చేయుట కీసామెతను వాడుదురు.)

అలం:—లలితము (బయలీఁదించెదు) గీ. ప్రస్తుతం బగుచుండ వర్ణ్యవచనార్థ। మపుడు ప్రతిబింబ వర్ణనం బయ్యెనేని । లలిత మన నలరుచున్నందు జలముతొలఁగఁ। గట్ట గట్టెడు నిది యను కరణి ధరణి. ఆంధ్రచంద్రాలోకము. 118.

ఉ. వట్ట్రిప్రియోక్తు లెందుఁ దగవా మిముబోంట్లరసజ్ఞ కాత్మ ను
న్నట్టివ కాక యిప్పు డివియట్టివ యైనను నీకు మోహపుం
బట్టపుదేవి యైన రతిభ్రాంతిన పల్కెద వేమొ నాథ! యే
గట్టిగ నారతిప్రమదఁగాను ప్రభావతి యంద్రు న న్నిలన్. 125

అర్థము:—ఎందున్ = ఏవిషయమందైనను, మిము బోంట్లరసజ్ఞకున్ = మీవంటివారి నాలుకకు, ఆత్మన్ = మనస్సునందు, ఉన్నట్టివి + అ + కాక=ఉన్నట్టిభావములనే కాని, వట్ట్రిప్రియోక్తులు = నిస్సారము లగు నిచ్చకము (పలుకులు,) లాడుటలు తగవా = ధర్మమా? (ధర్మము కాదు.) ఇప్పుడు, ఇవి = నీవు పలికినపలుకులు, అట్టివి + అ=మనసునందలి యభిప్రాయముతోఁ గూడి యున్నవే, ఐనను = అయిన యెడల, నీకున్, మోహపుంబట్టపుదేవి = వలపు గలిగించు ప్రధానభార్య, ఐన రతిభ్రాంతిన్+అ=అయిన రతిదేవి యను భ్రమచేత, పల్కెదవు + ఏమొ = అంటివి కాఁబోలును, నాథ, ఏన్ = నేను, గట్టిగన్= నిశ్చయముగా, ఆరతిప్రమదన్ (నీహృదయమం దున్న) రతిదేవిని, కాను, ఇలన్=భూమియందలి, (జనులు- అధ్యాహార్యము) నన్నున్, ప్రభావతి, అంద్రు = అందురు. అలం:—ప్రతిషేధము.

తాత్పర్యము:—నాథ! మనసునఁ గలభావములనే చెప్పుట మీవంటి గొప్పవారి నాలుకకు తగును గాని భావశూన్యము లైన యిచ్చకములాడుట ధర్మము గాదు. ఇప్పుడు నీవు పలికినమాటలు నీహృదయము లోనివే యైనచో నీకు వలపులరాణి యగు రతిదేవి యను భ్రాంతిచే పలికితివి కాఁబోలును. నిశ్చయముగా నే నారతిదేవిని గాను; లోకులు నన్నుఁ బ్రభావతి యని యందురు. (నా పేరు ప్రభావతి యని భావము.)

వి. :—మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం దురాత్మనాం । మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం (దురాత్ములకు మనసునం దొకటి, వాక్కునం దొకటి, క్రియ(చేయుట) యం దొకటియై యుండును. మహాత్ములకు మనస్సునందు నొకటియే వాక్కునందు నొకటియే క్రియయందు నొకటియే యుండును-) అను నార్యోక్తి ననుసరించి నీవాక్కును, నీమనస్సును వేఱైనచో దురాత్ముఁడవగుదువు, కాని, మహాత్ముఁడ వగుని వట్లుగాక త్రికరణశుద్ధిగానే పల్కియుందువు. అట్లైనచో రతిదేవి గానట్టి నన్నును రతీ యని నీవు పిలుచుటలో కారణము భ్రాంతి కావచ్చును. ఎంతవారి బుద్ధికిని భ్రాంతి సహజము. నేను నీ వనుకొనిన రతిని గాను. 'జనులు నన్నుఁ బ్రభావతి యందురు.' అనినది కాని నేను ప్రభావతిని అని చెప్పలేదు. ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్యచ, శ్రేయస్కామో నగృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్య కళత్రయోః । అను ధర్మశాస్త్రముఁ బట్టి తనపేరు తాను జెప్పఁగూడదు. కావునఁ గర్తృత్వము ప్రజల కాపాదించి పలికినది. దీనిని బట్టి ప్రభావతియొక్క ధర్మజ్ఞత్వము వ్యక్త మగుచున్నది.

వ్యా. వి. :—అట్టి + అవి = అట్టివి. సూ. అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు. బాల. సంధి. 45. చే 'అవి'లోని అకారము లోపింపఁగా నైనరూపము. పిదప అట్టివి+అ అనియుండ సూ. ఏమ్యాదుల యిత్తునకు సంధి వైకల్పికముగా నగు. బాల. సంధి. 5 చే 'అట్టివ' అని సిద్ధించినది. మోహపుం బట్టపుదేవి. పట్టము + దేవి - సూ. కర్మధారంబులందు మువర్ణంబునకుఁ బు,ంపులగు, బాల. సంధి. 32. చే - 'కర్మధారయంబుల' అను దానిలోని బహువచన జ్ఞాపకముచే, షష్ఠీ సమాసమందును పువర్ణము ప్రాప్తించి, పట్టపుదేవి యైనది. పిమ్మట మోహము+పట్టపుదేవి అనునప్పుడును పై విధముననే పువర్ణక ప్రాప్తియు, సూ - సమాసంబుల నుదంత స్త్రీ సమంబులకును బుంపులకును... ఇత్యాది బాల. సంధి. చే నుగాగమ కలిగి ద్రుతసంధి కార్యములు కలుగఁగా సిద్ధించిన రూపము. అంద్రు, అను+దు+రు. సూ. తి, దు, ట, లు పరంబగునపు డన్వాదుల ను స్థానమున సున్నయు, నుండు డులోపంబును విభాష నగు.' బాల. క్రియా. 58 చే. 'అందురు అయి' సూ. 'ఇట బిందువుమీఁది త,ద లకు నిత్యవైకల్పికంబులై ట డ లగు' బాల. క్రియా. 59 చే అంటురు. అయి సూ. రువర్ణకంబు పరం బగుపునడు సున్నమీఁది తదడలయుత్వంబునకు లోపంబు విభాష నగు. బాల. క్రియా. 62 చే - అంద్రు - అని సిద్ధించినది.

క. అని మానదుఃఖ ముద్దీ,పన మొందఁగ నవ్వధూటి ప్రక్క లెగయ నే
డ్చెను వెక్కి వెక్కి లోలో,ననె యకటా! యిదియు జీవనమె నా కనుచున్. 126

అర్థము:—అని = ఇట్లు పలికి, ఆవ్వధూటి = ఆ ప్రభావతి, మానదుఃఖము = కోపమువలని దుఃఖము, (నాయకుని యన్యకాంతాసక్తి మున్నగువానిచె నాయికకుఁ గలుగుకోపము "మానము" అని ఇట విశేషార్థము) ఉద్దీపనము + ఒందఁగన్ = ప్రకాశము నొందగా - (బయలుపడఁగా నని భావము.) ప్రక్కలు, ఎగయన్ = ఎగసిపడునట్లు, లోలోనను+ఎ = లోపల లోపలనే, మెల్లగా నని భావము. అకటా, నాకున్, ఇదియు, జీవనమె = ఇదిగూడ నొక బ్రదుకా - (ఇట్టి యవమాన మొంది బ్రదుకుట మృతిసమమే అగును అని భావము) అనుచున్, వెక్కి వెక్కి, ఏడ్చెను.

వి. :—ఈర్ష్యామానమున నేడ్చుట నాయికా లక్షణము. చూ. 5. 111 పద్య వివరణము.

క. నాయకుడును దాను మును ర,తీ యని తద్రతులసంగతిన పల్కిన ప
ల్కాయింతికిఁ గోపము రాఁ, జేయుట తద్వచన రీతిచేఁ గని నగుచున్. 127

అర్థము:—నాయకుఁడును = ప్రద్యుమ్నుఁడును, తద్వచనరీతిచేన్ = ఆమె మాటల ధోరణిచేత, తాను, మును = ప్రభావతి వేఱు శయ్యకేఁగక పూర్వము, తద్రతుల సంగతిన్ + అ = ఆమె యొక్క పెక్కు విధములగు సంభోగముల సంబంధముచేతనే, రతీ, అని, పల్కిన పల్కు, ఆ యింతికిన్, కోపము, రాఁజేయుట = వచ్చునట్లు చేయుటను, కని = తెలిసికొని, నగుచున్ = నవ్వుచు.

తాత్పర్యము:—అంతటఁ బ్రద్యుమ్నుఁడును, ఆమె మాటలను బట్టి తాను ము న్నామెరతులకు వివశుఁడై రతీయని పల్కినపలు కామె కోపకారణముగా గ్రహించి నవ్వుచు నిట్లనెను.

క. రమణీ! యిందాఁకను దెలి,యము నీ యల్కకు నిమి త్త మదియే? భవదు
త్తమరతి నేఁ గరఁగుచు మె,చ్చమరఁగ న ట్లంటి దాని నది త ప్పగునే. 128

అర్థము:—రమణీ = ఓ సుందరీ, నీయల్కకున్ = నీ కోపమునకు, నిమిత్తము = హేతువు, ఇందాఁకను = ఇప్పటిదాఁక, తెలియము = తెలిసికొన లేకపోతిమి (పూజ్యార్థమున బహువచనము) అదియే = రతీ! నీకుఁ దక్కిలి ననువాక్యమా హేతువు? - అట్లయిన వినుము. భవ దుత్తమరతిన్ =

నీ యొక్క ప్రశస్తమగు సురతము చేత, నేన్=నేను, కరఁగుచున్ = పరవశుఁడ నగుచు, దానిన్ = ఆరతిని గూర్చి, మెచ్చు + అమరఁగన్ = పొగడ్త కలుగునట్లు, అంటిని, అది = అట్లు నీరతిని శ్లాఘించుట, తప్పు+ అగునే = నేర మగునా ?

ఇందాఁకను, తెలియను, నీయల్కకున్, నిమిత్తము, అదియే, అనియు నన్వయింపవచ్చును. ఇందు నాయకుఁడు ధృష్టుఁడు. 'కృతాగా అపి నిశ్శంకస్తర్జితోఽపి న లజ్జితః। దృష్టదోషోఽపి మిథ్యా వాక్కథితో ధృష్టనాయకః' అని సాహిత్య దర్పణము. అపరాధి యయ్యును జంకనివాఁడు తర్జించినను లజ్జింపనివాఁడు, దోష మగపడుచున్నను బొంకువాఁడు ధృష్టుఁడు.

క. అనుటయు భవదుత్తమ రతి, యను పలు కొక్కటియె యాత్మ నంటె సతికి నా
థునిపలుకులలో రతి యీసున - దృఢవాసిత మితరముఁ జొరనీదు మదిన్. 129

అర్థము:—అనుటయున్, నాథుని పలుకులలోన్ = మగని మాటలనడుమ (వెలువడిన), భవదుత్తమరతి, అను పలుకు, ఒక్కటియె, రతి యీసునన్=రతియందుఁ (తనకు) గల యీర్ష్యచేత, సతికిన్ = ప్రభావతికి, ఆత్మన్ = మనసునందు, అంటెన్ = హత్తుకొనెను. మదిన్ = మనస్సునందు, దృఢవాసితము=గట్టిగా వాసింపఁబడిన (అంటుకొని యున్న అని భావము) విషయము, ఇతరమున్ = మఱొక విషయమును, చొరనీదు = ప్రవేశింపనీయదు.

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁ డట్లు పలుకఁగా సవతి యగురతియందుఁ దనకుఁ గల యోర్వలేని తనముచే మగని పల్కుల నడుమ వినవచ్చిన 'భవదుత్తమరతి' యను నొక పలుకు మాత్రమే యాప్రభావతి మనసున హత్తుకొనెను. మనస్సునఁగట్టిగా నంటుకొనిన సంస్కారము మఱొక విషయమును మనస్సులోఁ బ్రవేశింప నీయదుగదా. అలం. :— అర్థాంతరన్యాసము.

క. ఉవిదయు భవదుత్తమ రతి, భవదుత్తమ రతి, యటంచుఁ బతిపలు కీర్ష్యా
వివశతఁ బలుమఱు దడవుచు, నవివేకంబునఁ దదర్థమరయుచుఁ దనలోన్. 130

అర్థము:—ఉవిదయున్ = ప్రభావతియును, భవదుత్తమరతి, అను మాటను, భవదుత్తమ - రతి, అటంచును, పలుమఱు = పెక్కుమాఱులు, పతి పలుకు = మగని వాక్యమును, ఈర్ష్యావివశతన్=ఓర్వలేని తనమునఁ గలిగిన మైమఱుపుచే, తడవుచున్ = ఉచ్చరించుచు, అవివేకంబునన్ = ('నీ యుత్తమ మగు సంభోగముచేత' అనునర్థమునఁ బ్రియుఁడు పలికె' నని తెలిసికొను) తెలివిలేమిచేత, తదర్థము = ఆమాట కర్థమును, తనలోన్=తన మనస్సునందు, అరయుచున్=ఆలోచించుచు.

తాత్పర్యము:—ప్రభావతియును నీసుచేఁ గలిగిన మైమఱుపునం బడి, పతి పల్కినట్టి 'భవదుత్తమరతి' యనుమాటను 'భవదుత్తమ - రతి' యనుచు పలుసారు లుచ్చరించుచు ఆమాటకు నీయుత్తమరతి యను నర్థమును గ్రహించు తెలివిలేక, తనమనస్సునం దాలోచించుచు.

క. నాకంటె నకట యుత్తమ, యాకె యగుట చెప్పవలయునా యీగతి నీ
వాకున నీదగు ప్రేమో, త్సేకమె చాటంగ ననుచుఁ జింతిలుచుండెన్. 131

అర్థము:—అకట = అయ్యో (సంతాప సూచకము), నీవాకునన్ = నీపలుకుచేత, నీదగు ప్రేమోత్సేకమే = నీ ప్రేమయొక్కయతిశయమే, ఈగతిన్ = ఈవిధముగా, చాటంగన్ = చాటిచెప్పుచుండఁగా, నాకంటెన్, రతి, ఉత్తమ = శ్రేష్ఠురాలు, అగుట, చెప్పవలయునా ?, అనుచున్, చింతిలుచుండెన్ = దుఃఖించుచుండెను. 'వాక్కు' అనుదాని రూపాంతరము వాకు.

తాత్పర్యము:—అయ్యో! నీవు రతీదేవియందుఁ గల ప్రేమాతిశయమే యీ విధముగా నీ నోటితో చాటిచెప్పుచుండఁగా నాకంటె రతిదేవి యుత్తమ యనుట వేఱ చెప్పవలయునా అనుచు పతి పలికిన సమస్తపదమును 'భవదుత్తమ - రతి' యని విడఁదీసి 'రతి నీకంటె యుత్తమురా' లను నర్థము దానఁగల దని విపరీతార్థము నూహించిన దగుటచే మిగుల వగచుచుండెను.

అలం:— వక్రోక్తి. గీ. అవుసు వక్రోక్తిశ్లేషకాకువులచేత, నమరనపరార్థకల్పనం బయ్యె నేని" ఆంధ్ర చంద్రాలోకము - 136.

వ. ఇట్లు తద్దయుం బ్రొద్దు చింతాక్రాంతయైయున్న ప్రభావతికిం బ్రద్యుమ్నుం డిట్లనియె.

అర్థము:—తద్దయున్ + ప్రొద్దు = అధికమగుకాలము, చాలసేపు, చింతాక్రాంత = దుఃఖముచే నాక్రమింపఁబడినది. దుఃఖమునకు వశమైనదని భావము.

వి. :—తద్ద, తద్దయున్ అనునవి యవ్యయములుగాని విశేషణములుకానేరవు. 'పెద్దయుం బ్రొద్దు' అని బహుళప్రయోగములుగలవు. కాని యిట్టిప్రయోగము కానరాదు. 'పెద్దయుంబ్రొద్దు' అనుదానికిఁగాని 'తద్దయుం ...ద్దయుంబ్రొద్దు' అనుదానికిఁగాని యిది ప్రమాదమున వచ్చిన పాఠమాయని సందేహము కలుగుచున్నది. ఇంకను విచార్యము.

క. పలుక వొకింతయు నాతోఁ, జిలుకవు కరుణామృతంబుఁ జినుకొకటియు లో
నులుకవు నాదగు దైన్యపుఁ, బలుకవగణనమున వినుచుఁ బద్మదళాక్షీ. 133

అర్థము:—పద్మదళాక్షీ = తామరరేకులవంటి కన్నులు గలదానా, నాతోన్, ఒక + ఇంతయున్, పలుకవు = మాటాడవు, కరుణామృతంబు చినుకు=దయయను నమృతపుబొట్టు, ఒకటియును, చిలుకవు = చల్లవు - అమృతసమ మగు నీదయ కొంచెమును నాపైఁ జూపకున్నా వని భావము. అవగణనమునన్ = తిరస్కారముచేత, నాది+అగుదైన్యపుఁ బలుకు = గర్వరహిత మగు నామాటను, వినుచున్, లోన్ = మనసునందు, ఉలుకవు = భయపడవు.

తాత్పర్యము:—ఇంతీ! నాతో నించుకయు మాటాడవు. కొంచెమేని దయ చూపవు. నేను దీనముగాఁ బ్రార్థించుచుండఁ దిరస్కారముతో వినుచున్నావు కాని ప్రియుఁడేమైపోవునోయని బెదరవు.

వి. :—'పలుకవు, చిలుకవు, ఉలుకవు, పలుకవ' అని యున్నదికాన, ఈపద్యము త్రిప్రాసము.

క. చేరక యుండఁగ నా కొక, ఘోరపుటూన యిడి నీవు కూరిమి కెడయై
కారుణ్య మెడలి నావెత, చేరువనే వినుచు నునికి చిత్రము తరుణీ!

అర్థము:—చేరకయుండఁగన్ = దగ్గఱకు రాకుండునట్లు, నాకున్, ఘోరపుటూన = భయంకర మగు నొట్టు, ఇడి = పెట్టి, నీవు, కూరిమికిన్ = ప్రేమకు, ఎడయై = దూరమై, కారుణ్యము = దయను, ఎడలి = విడిచిపెట్టి, నావెతన్ = నాదుఃఖమును, చేరువనే = సమీపముననే, వినుచున్, ఉనికి = ఉండుట, చిత్రము = ఆశ్చర్యము (గానున్నది.)

క. దానవునకు నుదయించిన, దానవు గావున లతాంగి దయ చాలదు నీ
మానసమున నీ విలఁ బ్రథ, మానసమస్తోరుగుణసమంచిత వైనన్. 135

అర్థము:—లతాంగి = తీఁగవంటి దేహము గలదానా! నీవు, ఇలన్=భూమియందు, ప్రథమాన... సమంచితవు - ప్రథమాన = పెరుఁగుచున్న, సమస్త = ఎల్ల, ఉరుగుణ = ఉత్తమగుణములచేత, సమంచితవు = ఒప్పుచున్నదానవు, ఐనన్ = అయినప్పటికిని, దానవునకున్ = రాక్షసునకు, ఉదయించిన

దానవు = పుట్టినదానవు, కావునన్ = కాఁబట్టి, నీమానసమునన్ = నీమనస్సునందు, దయ, చాలదు = వలసినంతలేదు.

తాత్పర్యము:—తీవబోఁణీ! నీవు సమస్తసద్గుణములు గలదాన వయ్యును, రాక్షసునకుఁ బుట్టిన కారణమున నీమనసునందు చాలి నంత దయ లేదు.

వి. :—'నీవు కఠినురాలవు' అనక 'నీకు చాలినంత దయ లేదు' అను ప్రద్యుమ్నుని యనురాగముతోఁ గూడిన కోపమును సూచించు సుకుమార ప్రయోగము.

ఉ. నీ విపు డింతపేరలుక - నెట్టుకొనన్ ధరియించి యున్కి నా
కోవనజాక్షి! మందపవ - నౌషధినాయకముఖ్యు లుగ్రతా
పావహు లౌట చిత్రమె? నిజాత్మ యనంగుఁడు నొంచుచున్నవాఁ
డేవిధిఁ బ్రేమపాత్రుఁ గినిసేయించినవారికి శత్రు వాత్మయున్. 136

అర్థము:—ఓవనజాక్షీ = తామరపువ్వులవంటి కన్నులదానా! ఇపుడు, నీవు, పేరు + అలుకన్ = సుదీర్ఘమగు కోపమును, నెట్టుకొనన్ = స్థిరపడునట్లు, ధరియించియున్కిన్ = వహించి యుండుటచేత, మంద...ముఖ్యులు, మందపవన = చిఱుగాలులు, ఓషధినాయకముఖ్యులు = చంద్రుఁడు మున్నగువారు, నాకున్, ఉగ్రతాపావహులు = తీవ్రమగు బాధ కలిగించువారు, ఔట = అగుట, చిత్రమే=వింతయా? కాదనిభావము. నిజాత్మ = నాయొక్క స్వరూపమగు, అనంగుఁడు = మన్మథుఁడు, నొంచుచున్నవాఁడు=బాధించుచున్నాఁడు, (తాను మన్మథునియవతారమే యైనను తన్నుఁగూడ అనిభావము) ఏవిధిన్ = ఏరీతిగానైననుసరే! ప్రేమపాత్రున్ = ప్రేమ చూపఁదగువ్యక్తిని, కినియించినవానికిన్ = కోపింపఁ జేసినవానికి, (కోపించునంత యపరాధముచేసిన వానికి అని భావము) ఆత్మయున్ = తనమనస్సుసైతము, శత్రువు (అగునుగదా).

తాత్పర్యము :—ఓకాంతా! నీ వింత దీర్ఘకోపము పూని యుండుటచేత నాకు మందమారుత చంద్రాదులు తాపము గల్గించుట వింతకాదు. సాక్షాత్తు నాస్వరూప మైన మన్మథుఁడే - నీకోపమునకు హేతువైన నన్ను బాధించుచున్నవాఁడు. కారణ మే మన - ప్రేమింపఁదగ్గవారినిఁ గోపింపఁజేసినచో - కోపహేతు వగు తమకుఁ దమయాత్మయే శత్రు వగును.

అలం. :—1. కావ్యలింగము, 2. కావ్యార్థాపత్తి 3. అర్థాంతరన్యాసము - మొదటి రెండింటికి సంకరము, మూఁడవదానితో సంసృష్టి.

వ్యా. వి. :—పేరలుక - పేరు + అలుక. సూ. కర్మధారయంబులం బేర్వాదిశబ్దంబుల యుత్వమున కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు. బాల. సంధి - 29 చే - పేరుటలుక, పేరలుక అగును. నొంచు, నొప్పించు - నొచ్చుధాతువునకుఁ బ్రేరణార్థమున నిపతింపఁబడిన రూపములు -

గీ. ఆన విడువు మచ్చటికి నే - నరుగుదెంచి, యలుకఁ దీర్చెదఁ గాదేని - జలరుహాక్షి
యానవిడువు మిచ్చటికి నీ - వరుగుదెంచి, నీదుమధురంపు మోవి తేనియలు నాకు.

అర్థము :—జలరుహాక్షి = తామరలవంటి కన్నులుగలదానా! ఆన = ఒట్టును, విడువుము = వదలుము - ఒట్టు తీసివేయుము అని భావము. అచ్చటికిన్ = నీవు పరున్న యాపాన్పుమీదికి, నేను, అరుగుదెంచి = వచ్చి, అలుకన్ = (నీ) కోపమును, తీర్చెదన్, కాదేని = అట్లుకానిచో, ఇచ్చటికిన్ = నే నున్నయీపాన్పుపైకి, అరుగుదెంచి = వచ్చి, నాకున్, నీదుమధురంపుమోవితేనియలు = తియ్యని

నీయధర మందలి తేనెలను, ఆనన్ = గ్రోలుటకు విడువుము, = (చూడగా) విడువుము=యథేచ్ఛముగా ననుభవింపనిమ్ము - అనిభావము. అలం. :—వికల్పము. శబ్దాలంకారము - యమకము.

శ్లో. అనర్థకా వా భిన్నార్థాః సార్థకానర్థకాశ్చ వా
ఆవర్త్యంతే క్రమా ద్వర్ణా యదా స్యా ద్యమకం తదా.

అని యమక లక్షణము. ఇట "ఆనవిడువుము, ఆనవిడువుము" అని భిన్నార్థకములగు వర్ణసముదాయము గల పదద్వయ మావృత్తి నొందినది. కావున పైనూడువిధములలో, నిదియొకవిధమగు యమకము.

వ. అని యంతకంతకుఁ బెరిఁగెడు తత్పరిరంభరాగతత్పరతావశంబున.

అర్థము :—అని, అంతకంతకున్ = క్రమక్రమముగా, పెరిఁగెడు = అధికమగుచున్న, తత్పరి... వశంబునన్, తత్ = ఆమెయొక్క, పరిరంభ = ఆలింగనమందలి, తత్పరతావశంబునన్ = ఆసక్తికి లోఁగుటచేత.

తాత్పర్యము:—క్రమముగా నామెను గౌఁగిలింపవలె ననుకోరిక హెచ్చుగా త్రిప్పుకొనఁజాలక -.

ఉ. రాఁగదె యో సుధాంశుముఖి ♦ రాఁగదె యో కఠినోన్నతస్తనీ !
రాఁగదె యో విలాసవతి ! ♦ రాఁగదె యో కలకంఠభాషిణీ !
రాఁగదె యో కళావిదుషి ! ♦ రాఁగదె యో కలహంసగామినీ !
రాఁగదె యో గుణైకనిధి ! ♦ రాఁగదె యో లలితాంగి ! డగ్గఱన్. 139

అర్థము :—ఓసుధాంశుముఖి = చంద్రునివంటి ముఖముగలదానా; డగ్గఱన్=సమీపించునట్లు, రాఁగదె= రమ్మ, (ఇట్లే పై వాక్యములందు) ఓకఠినోన్నతస్తనీ = గట్టివి యెత్తైనవియు నైన కుచములు గలదానా, విలాసవతీ = శృంగారచేష్టలు గలదానా ! కలకంఠభాషిణీ = కోయిలవలె పలికెడుదానా ! (కోయిల పలుకులవంటి పలుకులుగలదానా !) కళావిదుషి = సంగీతాది విద్యలందుఁ బండితురాలా ! (పుం. విద్వాన్. స్త్రీ. విదుషి.) కలహంసగామినీ = రాజహంసవలె నడచెడిదానా - (రాజహంస నడకవంటి నడకగలదానా) గుణ + ఏకనిధి = మంచిగుణములకు ముఖ్యస్థానమైనదానా ! లలితాంగి = మృదువగు దేహము కలదానా ! (ఈ పద్యము త్రిప్రాసము).

క. కలికీ ! రాఁగదె చిలుకల, కొలికీ ! రాఁగదె లతాంత ♦ కోదండుని పూ
ములికీ ! రాఁగదె యూరక, యలికీరార్భటుల నేల ♦ యలఁచెదు నన్నున్. 140

అర్థము :—కలికీ = అందమైనదానా, సుందరీ, చిలుకలకొలికీ = చిలుకలయొక్క కనుఁగొలుకుల వంటి కొలుకులు గలదానా, లతాంతకోదండుని = పూవిల్కాని (మన్మథుని) యొక్క, పూములికీ = పుష్పబాణమా, రాఁగదె, ఊరక = వ్యర్థముగా, అలికీర + ఆర్భటులన్ = తుమ్మెదలయొక్కయు, చిలుకలయొక్కయు, ఆర్భటులన్ = ధ్వనులచేత, నన్నున్, ఏల, అలఁచెదవు = బాధపడఁజేసెదవు, నీవు నన్నేలకుండుటచే తుమ్మెదలయు, చిలుకలయొక్కయు రొదలు నాకు బాధకము లగుచున్నవి అని భావము,

అలం. :—యమకము,

వి. :—139 పద్యమున సంస్కృతమునను, ఇం దచ్చతెలుఁగునను సంబోధించుట విశేషము. 'రాఁగదె' అని పెక్కుమాఱులు పలుకుట అత్యంతాదరమును సూచించుచు, ప్రద్యుమ్నుని విరహపీడాభరమునకు వ్యంగ్య మైనది. ఈ పద్యము - కలికీరా, కొలికీరా, సులికీరా - ములికీరా-అని త్రిప్రాసము. (ఇట్టి శబ్దాలంకారములు గలతావులందు రసపుష్టి యంతగా నుండకున్నను రుచిభేదము ననుసరించి, రచించుట కవుల యాచారము.)

వ. అని వేఁడుకొనుచున్నంతం బట్టణంబులోనం దనవిడిదివాకిటం బ్రాబోధికంబులైన వాద్యస్వనంబులు వినంబడుటయు, వజ్రనాభుపడవాళ్లు పిలువవచ్చువేళ యయ్యెఁ గావలయు, నింతటం బోకయున్నఁ గార్యంబు తప్పు ననుచు లేచి యాత్మకల్పిత భూవివరద్వారంబునకై చనియె నప్పుడు. 141

అర్థము :—తనవిడిదివాకిటన్ = తాను బసచేసిన యింటివాకిటియందు, ప్రాబోధికంబులు = నిద్ర నుండి మేలుకొలుపునవి, ఐన వాద్యస్వనంబులు = వీణామృదంగాదులయొక్క ధ్వనులు, పడవాళ్లు = సేనానాయకులు, ఆత్మ ... ద్వారంబునకై - ఆత్మ = తనచేత, కల్పిత = త్రవ్వఁబడిన, భూవివర = నేలసొరంగముయొక్క, ద్వారంబునకై = ద్వారమువంకకు, చనియెన్ = వెళ్లెను, అప్పుడు (పైకినన్వయము.)

వి. :—వాద్యములు-తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అని నాలువిధములు. 'తతము' అనఁగా : వీణ, తంబుర మొదలగు తంత్రీవాద్యము. 'ఆనద్ధము' అనఁగా : మద్దెల, డోలు మున్నగు చర్మబద్ధమగు వాద్యము. 'సుషిరము'అన : పిల్లనగ్రోవి మున్నగు చిల్లులు గలవాద్యము. 'ఘనము'అన : తాళము మున్నగు కంచువాద్యము.

క. వెఱపింపఁ బోయి వెఱచిన, తెఱఁగునఁ దాఁ వేఁడుకొనఁ బతిన్ వెనుకొనియెన్
దెఱవ తనయల్క కడుఁ గీడ్పఱచి విజృంభించువిరహపరితాపముచేన్. 142

అర్థము:—(అప్పుడు = ఆసమయమున) తెఱవ = ప్రభావతి, వెఱపింపఁబోయి = (ఇతరులను) భయపెట్టఁబోయి, వెఱచినతెఱఁగునన్ = (తాను) భయపడినవిధమున, విజృంభించు = అతిశయించుచున్న, విరహ = ఎడబాటువలని, పరితాపముచేన్ = సంతాపము (వేఁడి) చేత, తనయల్క = తనకోపమును, కీడ్పఱచి = అణఁచుకొని, వేఁడుకొనన్ = ప్రార్థించుటకు, తాన్ = (ఎంత వేఁడికొన్నను ప్రసన్న కాని) తాను, పతిన్ = భర్తను, వెనుకొనియెన్ = వెంబడించెను. అలం:—ఉపమ.

క. తనరమణి యిట్లు తను వెనుకొనుట యెఱుంగఁడు మురారికొడుకు కడుఁ బ్రయో
జనవశతఁ జనియె నతిరయమున నాత్మనివాసమునకు భూవివరమునన్. 143

అర్థము:—అపుడు, మురారికొడుకు=ప్రద్యుమ్నుఁడు, తనరమణి=తనప్రియురాలు, ఇట్లు, తనున్, వెనుకొనుట, ఎఱుంగఁడు, అతిరయమునన్ = మిగులవేగమున, భూవివరమునన్ = నేలసొరంగమునందుండి, ప్రయోజనవశతన్ = (వేఱు) కార్యమున కధీనుఁడగుటచేత, ఆత్మనివాసమునకున్ = తనవసించువిడిదికి, చనియెన్ = వెళ్లిపోయెను.

క. ఆవనితయు వడివడిని బిలావధిగా నరిగి, యంత నవ్వల నరుగం
గా వెఱచి తిరిగి వచ్చెను, భావము కలఁగంగ విభుని పానుపు కడకున్. 144

అర్థము:—అవనితయున్ = ఆ ప్రభావతియును, వడివడిని = వేవేగ, బిలావధిగాన్ = సొరంగము పర్యంతము, అరిగి = పోయి, అంతన్ = అక్కడనుండి, అవ్వలన్ = అవ్వలికి, అరుగంగాన్ = పోవుటకు, వెఱచి = (ఎవరికంటనైనఁ బడుదు నని) భయపడి, తిరిగి = మరలి, భావము = మనస్సు, కలఁగంగన్ = కలఁత నొందఁగా, విభునిపానుపుకడకున్ = మగఁడు పరుండిన శయ్యయొద్దకు, వచ్చెన్. (ని. భావః స్వభావేఽభిప్రాయే చేష్టాసత్త్వాత్మజన్మసు' అని విశ్వనిఘంటువు.)

వ. అట్లు వచ్చి. (సుగమము) 145

చ. తనవిభుపాదసంగతిని ♦ ధన్యము లైన సువర్ణపాదుకల్
చనుఁగవ నొత్తుకొంచు మఱి ♦ శయ్యను రాలిన తద్విలిప్త చం
దనలవముల్ శరీరమునఁ ♦ దాల్చుచుఁ దత్పరిభుక్తముక్త మా
ల్యనికర మక్షియుగ్మమున ♦ నద్దుచు నించుక సేపు రంజిలెన్. 146

అర్థము:—తన...సంగతిని - తనవిభు = తనమగనియొక్క, పాదసంగతిని = అడుగులకలయికచే - అడుగుల సంపర్కముచేత నని భావము, ధన్యములు = పుణ్యవంతములు, (అదృష్టవంతములు అని కాని చెప్పనగును) ఐనసువర్ణపాదుకల్ = బంగారు పాదరక్షలను, చనుఁగవన్ = రెండు స్తనములందును, ఒత్తుచున్ = అద్దుకొనుచు, మఱి, శయ్యను = పాన్పునందు, రాలిన, తద్విలిప్తచందనలవముల్ = అతనిచేఁ బూసికొనఁబడిన మంచిగంధపునలుసులను, శరీరమునన్ = దేహమునందు, తాల్చుచున్ = ధరించుచు, తత్పరి...నికరము, తత్ = ఆతనిచే, పరిభుక్త = అనుభవింపఁబడినవియు, ముక్త = విడువబడినవియు నగు, మాల్య = పువ్వుదండలయొక్క, నికరమున్ = సముదాయమును, అక్షియుగ్మమునన్ = కన్నుల జంటయందు - రెండుకన్నులయందు, అద్దుచున్ =(భక్తితో) అదుముకొనుచు, ఒత్తుకొనుచు, ఇంచుకసేపు, కొంచెముసేపు, రంజిలెన్ = రాగిల్లెను.

తాత్పర్యము:—అట్లు వచ్చి తనమగఁడు ధరించుటచే ధన్యము లైన బంగరుపాదుకలను జనుదోయి కద్దుకొనుచును, మగని దేహమునం దాల్చిన మంచిగంధపు నలుసులు పానుపుపై రాలినవి తన దేహమున ధరించుచును, భర్త ధరించి విడిచిపెట్టిన పువ్వుల దండలను రెండుకనుల కద్దుకొనుచును గొంతసేపు సంతసించెను.

చ. తదనుభవోదిత స్మృతికతంబున నవ్విభురామణీయకా
భ్యుదయము చర్చసేయు, సురతోత్సవచాతురి యెంచుఁ, బ్రేమసం
పద గణియించు, లాలనలభంగులు భావన సల్పు, మిక్కిలిన్
హృదయమునందు రాగిలుచు ♦ నింద్రవిరోధితనూజ మాటికిన్. 147

అర్థము:—ఇంద్రవిరోధితనూజ = ఇంద్రునకు వైరియగు వజ్రనాభుని పుత్రి యగు ప్రభావతి, మిక్కిలిన్ = మిగుల, హృదయమునందున్ = మనస్సునందు, రాగిలుచున్ = అనురక్తి కలది యగుచు, మాటికిన్ = పెక్కుమాఱులు, తదను...కతంబునన్ =తత్ = మగనియొక్క యాచక్కఁదనము మొదలగు వానియొక్క, అనుభవ=ప్రత్యక్షాది జ్ఞానము (ఎఱుక) చేత, ఉదిత=పుట్టిన, స్మృతికతంబునన్ = తలంపను కారణముచేత (అనుభవముచేత పుట్టిన జ్ఞానము స్మృతి యనఁబడును.) అవ్విభు...దయము - అవ్విభు = ఆ మగనియొక్క, రామణీయక = సొగసుయొక్క, అభ్యుదయము = అతిశయమును, చర్చసేయున్ =విచార మొనర్చును, సురతోత్సవచాతురి = సంభోగోత్సవమందలి నేర్పును, ఎంచున్ = తలఁచుకొనుచు, ప్రేమ సంపద = (ఆతనికిఁ దనయెడఁగల) ప్రేమయొక్క పెంపును, గణియించున్ = స్తుతించును, లాలనల

భంగులు = (అతఁడు తన్నుఁజేయునట్టి) బుజ్జవములరీతులను, భావనసల్పున్ = భావించును - ధ్యానించును 'భావననిల్పున్' అనుపాఠమున - మనస్సునందు నిలుపును అని యర్థము.

తాత్పర్యము.—ప్రభావతి మనసునం దనురాగము హెచ్చఁగా - పలుమఱు తన భర్తయొక్క సౌందర్యాదులను ప్రత్యక్షముగా ననుభవించుటచేఁ గలిగిన స్మరణమువలన నాతని యపారమగు సౌందర్యమును చర్చించుకొనును. రతియం దాతఁడు చూపెడి నేర్పును ప్రశంసించును. తనయెడఁ జూపు ప్రేమాతిశయమును స్తుతించును. త న్నెట్లు బుజ్జగించెనో య వ్వెల్లఁ దలంచుకొనును.

వి. :—వెనుకటిపద్యమున బాహ్యముగఁ గనవచ్చిన మగనిసంబంధమగు వస్తుసందర్శనమునఁ బుట్టు నభిలాషయు, ఈపద్యమున నాతనితోఁ దాను క్రీడించుటవలనఁ గలిగిన-(యాంతరమైన) యపూర్వానుభవముల స్మరణమును వర్ణింపఁబడినవి.

ఉ. అక్కట యిట్టివల్లభునియందును గోపము పుట్ట నాకుఁ ద
ప్పొక్కటి యేల తోఁచె, నదియున్ మఱి మ్రదతిఁ గూర్చి యంటఁగాఁ
దక్కక తెల్పె వల్లభుఁడు దానికి నర్థము నప్పు డేను వే
ఱొక్కటిగాఁ దలంచి విడనొల్లన కోపము దైవవంచనన్. 148

'అల్కఁ నధిపుఁ దెగడి । యనుశయముఁ జెందుసతి కలహాంతరిత, నరసభూ. 2.40' కోపా త్ప్రియం పరాణుద్య పశ్చాత్తాప సమన్వితా । కలహాంతరితానామ...ప్రతాపరుద్రీయము. ఈలక్షణము ననుసరించి, ఈపద్యము మొదలు మీఁది మూఁడుపద్యములదాఁక ప్రభావతి పశ్చాత్తాపము వర్ణింపఁబడుటచే కలహాంతరితా నాయిక యగుచున్నది.

అర్థము:—అక్కట = అయ్యో! ఇట్టి వల్లభునియందును = రసజ్ఞశేఖరుఁ డైనయిటువంటి ప్రియుని యెడల, కోపము, పుట్టన్ = కలుగఁగా, తప్పు = అపరాధము, ఒక్కటి, ఏల = ఎందులకు, నాకున్, తోఁచినది = కనఁబడినది, అదియున్ = 'రతీ మత్ప్రాణమా' అని పలుకుటయును, మఱి = మరల మరల, మ్రదతిఁ గూర్చి=నాకూటమి నుద్దేశించి, యంటఁగాన్=అనుటనుగా, వల్లభుఁడు = ప్రియుఁడు, తక్కక = మోసముచేయక, తెల్పెన్ = చెప్పెను, దైవవంచనన్ = పూర్వకర్మముయొక్క మోసముచేత, అప్పుడు, ఏను=నేను, దానికిన్ = పలిపల్కునకు, వేఱొక్కటిగాన్ = నాసవతి యగు రతి నుద్దేశించిన మాటగా, అర్థమును, తలంచి = భావించి, కోపమున్, విడనొల్లను + అ = విడుచుట కిష్టపడనే పడనైతిని.

తాత్పర్యము:—అయ్యో! మీఁదఁ జెప్పిన లక్షణములు గల ప్రియునియెడల కోపము పుట్టునంతటి తప్పేల నాకు గోచరించెను? 'రతీ మత్ప్రాణమా' అని యనుటయుఁ గూడ నారతిని గూర్చియే యంటినని మర్మము లేకుండ భర్త చెప్పగా - అప్పుడు నా దురదృష్టముచే దాని కర్థము నాసవతి యగు రతిదేవిని గూర్చి యని తలఁచి వచ్చిన కోపమును విడువ నిష్టపడనైతినే.

వి. :—విడనొల్లను+అ - ఇందలి యవధారణార్థకమగు అకారమునకు, అత్యంతము (విడువనొల్లను) అను నర్థము విశేషము.

ఉ. ఆయనఘుండుదాఁ దొలుత నంపినపత్త్రికలోన నున్న య
త్యాయతరాగభంగు లరయంగ ననన్యసమానభాగ్యఁ గా
నా? యది చూడ -నా దయిన యల్కయ మూలము కాక యున్నె? నా
నాయకుఁ డట్లు ప్రార్థన మొనర్పఁగ నే వినకుంటి యొప్పునే. 149

అర్థము:—ఆయనఘుండు = అపరాధములేని నాప్రియుఁడు, తాన్ = తనంతఁదాను, తొలుతన్ = ముందుగా, అంపిన పత్త్రికలోనన్ = పంపిన జాబులో, ఉన్న, అత్యా...భంగులు - అత్యాయత = మిగుల నధికమగు, రాగ = (నాయందలి) అనురాగముయొక్క, ప్రేమయొక్క, భంగులు = రీతులు, అరయంగన్ = పరిశీలింపఁగా, అనన్యసమానభాగ్యన్ = అన్యసమానము కాని - ఇతరముతో సాటికాని, భాగ్యన్ = అదృష్టముగలదానను, కానా ? అగుదును. అట్టి యదృష్టవతి నయ్యుఁ గూడ, అది = ఆ జాబును, లేదా జాబునందలి విషయమును, చూడన్ = (మగనియెడ కోపము కల్గినప్పుడు) చూడనైనఁ జూచితినికాదు, అట్లు చూడకుండుటకు - నాది + అయిన + అల్కయ = నాకోపమే, మూలము = కారణము, కాక యున్నె = కాకుండునా - తప్పక యదియే యగును అని భావము, ఒకవేళఁ గోపము వచ్చిన వచ్చుఁగాక ఆ కోపమును దీర్చుటకై - అట్లు = అన్నివిధములుగా, నానాయకుఁడు = నామగఁడు, ప్రార్థనము + ఒనర్పన్ = బతిమాలుకొనఁగా, నేన్ = నేను, వినక + ఉన్కి = వినకుండుట, ఒప్పునే తగునా ? - తగదని భావము.

తాత్పర్యము:—నిరపరాధుఁ డగునాప్రియుఁడు తనంతఁదాను మొట్టమొదటఁ బంపినజాబునందలి యమిత ప్రేమరీతులను బరిశీలించినయెడ నావంటి యదృష్టవతి యెవ్వతెయు నెందును లేదుగదా ! అప్పుడా జాబునుగాని యందలి విషయమునుగాని చూడనైతిని. చూడకుండుటకుఁ బ్రియుని తప్పేమున్నది ? నాకోపమే దానికి గారణము. నా నిర్హేతుక మగుకోపమునకు భర్తవిరక్తుఁడై వెడలిపోయె నేమోయనుకొన - వెడలిపోక యెన్నోవిధముల బతిమాలఁగా నప్పటికైనను కోపము విడిచి యాతనిమాట విననైతిని, ఇది నాకుఁ దగునా ?

వి. :—భర్తవలన అపరాధము లేకయే కోపించుట, యొకతప్పు. ఆతనికిఁ దనయెడఁ గలప్రేమ నంతయు జాబున వ్రాసి యిచ్చియుండ నాజాబును చూడకుండుట యొకతప్పు. కోపోపశాంతికై భర్త పరిపరివిధముల బతిమాలుచుండఁ బెడచెవిని బెట్టుట మఱొకతప్పు. అని తప్పులన్నియుఁ దనవే యని తెలిసికొని పశ్చాత్తాపమునొందుటచే నాయిక కలహాంతరిత యైనది.

వ్యా. వి. :—ఉన్నె - 'ఉను' అనుప్రచారములోలేని ధాతువుయొక్క తద్ధర్మార్థకరూపముపై ప్రశ్నార్థకమగు ఏకారముగలియఁగా - 'ఉనునే = ఉన్నె' అగుచున్నది - 'ఉను' ధాతువుయొక్క విధ్యర్థక రూపము - ఉనుసది - అనుదాని రూపాంతరమగు ఉన్నది ( = ఉండునది) అనుపదము నన్నయ తిక్కనలచే ప్రయుక్తమగుటచేతను, విను - ధాతువు కృదంతరూపము 'వినికి' వంటిదేయగు 'ఉనికి' అను రూపముండుట చేతను, ఉండు అను నర్థముగల "ఉను" అను నొకధాతు వుండినట్లు గ్రాహ్యము.

క. మగవాఁడుఁ దుమ్మెదయు సరి, జగతి నదియుఁ గాక నాఁటి చాటూక్తుల ప్రే
మగురుత్వము నలపత్త్రిక, యు గణింపఁగ నతనియందు నొదవునె తప్పుల్. 150

అర్థము :—జగతిన్ = లోకమున, మగవాఁడును, తుమ్మెదయున్, సరి = సమానము, క్రొత్తగ వికసించిన పెక్కుపూవులందలితేనెఁ గ్రోలఁగాఁ దుమ్మెద వానియందుఁ జొచ్చునట్లు, పెక్కురు జవ్వనులను పురుషుఁడు వలచి వారికి వశుఁ డగుట లోకస్వభావము. అదియుఁగాక, నాఁటిచాటూక్తుల = వజ్రనాభుని సభయందు నాట్యమొనర్చుచు నాఁడు పలికినప్రియవచనములందలి, ప్రేమగురుత్వమున్ = ప్రేమాతిశయమును, అలపత్త్రికన్ = ఆయుత్తరమును, గణింపఁగన్ = పరిశీలించినయెడ, అతనియందున్ = ప్రియునియందు, తప్పుల్ = అపరాధములు, ఒదవునె = కలుగునా ? కలుగవని భావము.

అలం. :—తుల్యయోగిత, కావ్యలింగము, మగవాఁడు పెక్కుజవ్వనులను, తుమ్మెద పెక్కుపూవులనుజేరి రమింతు రనునది వ్యంగ్యము.

వ. అని విరహావేదనం బొరలుచుండఁ బ్రభాతం బగుటయుఁ బ్రభావతి తనగృహదేవతయుంబోలెఁ బూజ లందుచు ననన్యవిదితగుప్తంబై యున్న యాపత్త్రికం బుచ్చుకొని శృంగారంపుఁ దోఁటలోనికిఁ జని, యొక్కవివిక్తస్థలంబునం గూర్చుండి, మున్ను రాగవల్లరి చదువఁగా మిగిలిన పత్త్రికాభాగంబు తనచేత నటమున్ను బహువార పఠితం బయ్యు నవోత్కంఠఁ గలుగఁ జేయుచుండ నల్పస్వరంబునఁ దనలో ని ట్లని చదువం దొడంగె.

అర్థము :—విరహావేదనన్ = ఎడఁబాటువలని బాధచేత, ప్రభాతము = వేకువ, గృహదేవత = ఇలువేల్పు, పూజలు + అందుచున్ = పూజింపఁబడుచు, అనన్యవిదిత = అన్యులచేఁ దెలియఁబడనిదియు, గుప్తంబు=దాఁపఁబడినదియు - ఇతరు లెఱుఁగకుండ దాఁచి యుంచుకొనినది అనిభావము - ఆపత్త్రికన్= ప్రద్యుమ్నుఁడు తొల్లి యంపినలేఖను, శృంగారంపుఁదోఁటలోనికిన్ = ఉద్యానవనములోనికి, వివిక్తస్థలంబునన్ = విజన మగుచోట, పత్త్రికాభాగము = లేఖయొక్క యంశమును, బహువారపఠితంబు + అయ్యున్ = పెక్కుసారులు చదువఁబడిన దైనను, నవ + ఉత్కంఠన్ = క్రొత్తవేడుకను, అల్పస్వరంబునన్ = (ఇతరు లెవరైన వినుచున్నారేమోయని) చిన్నగొంతుతో -

ద్వి ర ద గ తి ర గ డ

ఓహంసి నీచేత నున్నయది నా బ్రతుకు
నాహృదయ మింతి డెందము నేకముగ నదుకు
కరుణ నిది పదివేలు కమ్మలుగఁ గైకొనుము
పరఁగ సతితోడ నా పలుకుగా నిట్లనుము
"విద్యున్నిభాంగిరో వినుము నీకృపఁ గన్నఁ
బ్రద్యుమ్నుఁ డనుపేరు ఫలిత మగు నా కెన్నఁ
త్రైలోక్య నిత్య సామ్రాజ్య వైభవ మైనఁ
బోల నొకలేశమును బోలఁది నీకృపలోన
గరిమ నెల్లెడల, నీ కనుసన్నలో వత్తు
హరిమధ్య! యేపాస యైన దీనికి నిత్తు
నేణాక్షి! విను నీయుపేక్ష నాచెవిఁ బడినఁ
బ్రాణము హరించు విరహలావార్త వెంబడిన
నీ మోవి చిగురు తేనియ లానునాస
నీ మొలక నవ్వు వెన్నెల చలువ గొనునాస
నీ మృదుకపోల సన్నిధిని మోమిడు నాస
నీ మోహన శ్రోణి నిమురఁ గలిగెడు నాస
నీదు పాలిండ్ల నానెడు వక్షమను నాస
నీదు శృంగారకళ నెలవు లంటెడి యాస
నీదు మణితామృతము నింతుఁ జెవి నను నాస

నీదు లలితోరువు లెమ్మి నొత్తెడి యాస
నొడలిలోఁ బ్రాణవాయువులు నా కిందాఁక
వెసల నుండఁగ - నిట్లు విన్నవించెదఁ గాక
యీ కమ్మ పూఁదోట యీ తేనియల జల్లు
నీకోమలపు గాడ్పు లీ వెన్నెల బయళ్లు
తను వైదుపాళ్లు నింకతక పంచి లోఁ గొనవె
యనయంబు నివి విరహి కపకారు లన వినవె
నింపు చందురుఁడు నీ నెమ్మొగంబు సుహృత్తు
గండుఁగోయిల ఫణితి కలభాషలకుఁ దొత్తు
మెఱుఁగుఁ దీఁగెలు నీదు మృదు తనూలత యంట్లు
కఱకుఁ బాయపుఁ దేంట్లు కచభరశ్రీ బంట్లు
కెంజిగురు చాయ నీ కెమ్మోవికిని దాసి
కంజవైభవము కన్గవకు నంతేవాసి
యివి యెల్ల నా కింపు లిల నీవు చేపట్ట
నివియె పెనుమృత్యువు లోకకింత నీ వెడపెట్ట
నని తన్నుఁ గూర్చి నే నాడుట చెవిం జొనుపు
వనిత యే మనియె నది వ్రాసి వేగమె యనుపు
మోరాజహంసి! నీ యుల్ల మెందు నహేతు
కారుణ్య మని గట్టి గాఁగ నారసి చూతు
నని చదువుకొన వినియె నటమున్న యేఁతెంచి
వెనుకనుండి తదీయవిభుఁ డాత్మ హత్తించి. 152

అర్థము:—ఓహంసి = ఓశుచిముఖీ, నాబ్రదుకు = నాజీవనము, నీచేతన్ + ఉన్నది = నీవశమై యున్నది, నాహృదయమును, ఇంతిడెందమును, ఏకముగన్, అదుకుము, మాయిరువుర మనస్సులలోని తలంపులను నొండొరులకుఁ దెలిపి భేదము లేనట్లు కలుపుము అని భావము. ఇది = ఒక్క యీ లేఖను, కరుణన్ = దయతో, పదివేలకమ్మలుగన్ = పదివేల యుత్తరములుగా, కైకొనుము = తెలిసికొనుము. అంత విలువగలదిగా భావింపు మని భావము - సతితోడన్ = ప్రభావతితో, పరఁగన్ = అనుకూలించు నట్లు, నాపలుకుగా = నామాటగా, ఇట్లు = ఈచెప్పఁబోవు విధమున, అనుము, విద్యుత్ + నిభ + అంగిరో = మెఱుపుతో సరియగు దేహము గలదానా! వినుము, నీకృప = నీయనుగ్రహము, కన్నన్ = పొందినయెడ, ఎన్నన్, నాకున్, ప్రద్యుమ్నుఁడు = ప్రకృష్టమగు ద్యుమ్నము గలవాఁడు - అధికమగు ధనముగలవాఁడు- (ధన్యుఁడు, లేక - భాగ్యవంతుఁడు) అను పేరు = అను నాపేరు, ఫలితము = ఫలము గలది - (సార్థక మైనది యని భావము. అగును, త్రైలోక్య...వైభవము, - త్రైలోక్య = మూడు లోకముల యొక్క, నిత్య = శాశ్వతమైన, సామ్రాజ్య = చక్రవర్తిత్వము యొక్క, వైభవము = సంపద, ఐనన్ = అయినను - (సంపద సైతము.) ఓలంతి = ఓయింతీ, నీకృపలోనన్ = నీదయ యందలి, గరిమన్ = గొప్పఁదనముతో, ఒక లేశమును, ఎల్లెడలన్ = ఎందును, పోలదు, - (త్రిలోకాధిపత్యము గూడ నీ దయలోని గొప్పఁదనముతో కొంచెమును పోలదు. అంతకంటెను గొప్పది నీదయ యని భావము.) నీ కనుసన్నలోన్ = ర మ్మని నీవు

కంటికొన సంజ్ఞచేసిన (జాలును) వత్తును, హరిమధ్య = సింహము యొక్క నడుము వంటి నడుము గలదానా! దీనికిన్ = నీ కనుసన్నమాత్రమున వచ్చెద నను మాటకు, ఏబాస + ఐనన్, ఇత్తున్ = ఏయొట్టయినను బెట్టుకొందును, ఏణాక్షి = లేడికన్నులవంటి కన్నులు గలదానా, వినుము, నీ యుపేక్ష = (నేను కోరిన విషయమందు) నీ యొక్క యనాదరము, నాచెవిని బడినన్ = నేను వినిన యెడల, ఆ వార్త వెంబడిన్ + అ = నీ వనాదరము చేసితి వను వార్త తోడనే, విరులు = వికసించిన పూవులు - (మన్మథ బాణములు గాన) ప్రాణము హరించున్ = నా ప్రాణములు గొనును, (పువ్వు లుద్దీపన విభావములలో నొకటి. ఉద్దీపన విభావ మనఁగా:- నాయికా నాయకులకుఁ బరస్పరము గలుగు ననురాగము నధికము చేయునది.) నీ మోవి చిగురు తేనియలు = చిగురాకువంటి నీయధరము నందలి మధువులను, క్రోలెడి యాసన్ = త్రాగుదు ననెడి ఆశచేతను, నీ మొలకనవ్వు వెన్నెల చలువ = నీయొక్క చిఱునవ్వనెడి వెన్నెల చల్లఁదనమును, కొనునాసన్ = సేవించుట యందలి యాశచేతను, (వెన్నెలయు నుద్దీపన విభావమే.) నీ మృదు కపోల సన్నిధిని = మెత్తని నీ చెక్కిలి యొద్ద, మోము = ముఖమును, ఇడు + ఆసన్ = (నుద్దిడఁగా) ఉంచెడి యాశచేతను, నీ మోహన శ్రోణిన్ = వలపు గొలుపునట్టి నీ పిఱుఁదును, నిమురన్ = చేతితోఁ దడవుటకై, కలిగెడు + ఆసన్ = పుట్టుచున్న యాశచేతను, నీగుబ్బలింబ్లన్ = నీ స్తనములను, వక్షము = నా ఱొమ్ము, ఆనెడున్ = (బిగికౌఁగిటియందు) క్రమ్ము, అగు + ఆసన్ = అనునట్టి కోర్కిచేతను, నీదు శృంగారకళ సెలవులు = నీయొక్క మన్మథకళ లుండెడు తావులను, అంటెడు + ఆసన్ = స్పృశించి నిన్నుఁ గరఁగింపవలె ననెడి కోర్కిచేతను, నీదు మణితామృతంబున్, నీయొక్క రతికూజితము అనెడి యమృతమును, చెవిని = చెవియందు, నింతున్ = నింపుదును, (వినెదనని భావము) అను + ఆసన్ = అనెడి కోర్కి చేతను, నీదులలిత + ఊరువుల్ = నీ సుకుమార మగు తొడలను, నెమ్మిన్ = ప్రేమతో, ఒత్తెడియాసన్ = ఒత్తుదు నను కోర్కిచేతను, నాకున్, ఒడలిలోన్ = దేహమందుండి, ప్రాణవాయువులు = వాయురూపము లైన యయిదు ప్రాణములును, ఇందాఁకన్ = ఇంతదాఁక, వెడలక = పోవక, ఉండంగన్, = ఉండుటచేత - మీఁదఁ జెప్పిన యాశ లన్నిటిచేతను మేనినుండి ప్రాణములు పోకుండ నిల్చియున్న కారణమున ననిభావము. ఇట్లు = ఈ రీతిగా, విన్నవించెదన్ + కాక = తెలుపుకొను చుంటినే కాని, ఈకమ్మపూఁదోఁట = పరిమళించు పూలతోఁ గూడిన యీతోఁటయును, ఈ తేనియల జల్లును - ఈ తేనె వానలును, ఈ కోమలపు గాడ్పులును = ఈమృదువగు గాలులును - మందపవనములును, ఈ వెన్నెల బయళ్లును, తనువున్ = (నా) శరీరమును, ఐదుపాళ్లు = అయిదు భాగములుగా, ఇంతకున్ + అ - ఈపాటికే, పంచి = విభాగమొనరించి, లోఁగొనవె = తమలోఁ గలుపుకొనవా? కలుపుకొని యుండును. ఎట్లన:- దేహము పంచభూతముల పాళ్లచే సృజింపఁబడినది. అయిదు భూతముల భాగము లైదుభూతములలోఁ గలియుటయే మరణము. కాఁబట్టి భూత వికారములగు పూఁదోఁట మున్నగునవి యుద్దీపనములు కాన, వెనుకఁ జెప్పినయాశలే లేనియెడల నీపాటికే నాదేహమందలి తమతమ భాగములను దమలోఁ గలుపుకొనియే యుండును అని భావము, ఇవి = ఈ పూఁదోఁట మున్నగునవి, విరహికిన్ = నాయిక నెడఁబాసినవానికి, (ఇట అయోగవిప్రలంభము నొందిన వాఁడు నాయకుఁడు.) అనయంబున్ = అత్యంతము, అపకారులు = హానిచేయునవి, అనన్ = అని విజ్ఞులు చెప్పఁగా, వినవె = వినలేదా?. నిండుచందురుఁడు = పూర్ణచంద్రుఁడు, పున్నమచంద్రుఁడన్న మాట, నీనెమ్మొగంబు సుహృత్తు = నీముఖమునకు మిత్రము, (నాకు బాధకలిగించు చంద్రుఁడు నీ కిష్టుఁడు. కాన నిన్ను బాధింపకున్నాఁ డని భావము. నీ ముఖమునకు పూర్ణచంద్రుఁడుపమాన మగు నని వ్యంగ్యము. ఇట్లే మీఁద జెప్పఁబడు ప్రభావతి యవయవముల కుద్దీపనపదార్థము లుపమానములుగా నగుట ధ్వనించు చుండును.) గండుఁగోయిలఘణితి = మగకోయిలకూఁత, కలభాషలకున్ = నీ యవ్యక్తమధుర మగుపలుకు లకు, తొత్తు = దాసి, (కావున కోయిలకూఁత నీకుఁ గీడు చేయదు. నాకుఁ జేయుచున్నది అనిభావము.) మెఱుఁగుఁదీఁగెలు = తళతళ మని ప్రకాశించు లతలు, నీ మృదుతనూలతకున్ = సుకుమారమై, తీఁగను బోలిన నీదేహమునకు, అంట్లు (చెట్టుకొమ్మను వంచి భూమిలో పాఁతుటవలన పుట్టిన మొక్క, లేదా- ఒకచిన్న మొక్కను చెట్టురివటకొమ్మకు నంటఁగట్టఁగా బయలుదేఱిన మొక్క - 'అంటు' అనఁబడును.) అట్టి వని భావము. (తీఁగలు నీమైఁదీఁగ కంటుకట్టుగాఁ బయలుదేఱిన వగుటచే నీకు బాధకములు

కావనియు, నాకు బాధకము లగుచున్నవనియు వ్యంగ్యము. మేనికిఁ దీఁగ యుపమానము.) కఱకుఁ బాయపుఁదేంట్లు = (కఱకు + పాయము + తేంట్లు) కఠోరయౌవనము - నిండు జవ్వనము - గల తుమ్మెదలు, కచభరశ్రీ = నీపెద్దకొప్పుయొక్క శోభకు, బంట్లు (కాన నీ కనుకూలములు, నాకు ప్రతికూలములు, అనిధ్వని, ఉపమానమునుగూడ.) కెంజిగురుచాయ (కెంపు + చిగురు + చాయ) ఎఱ్ఱని చిగురాకు కాంతి, నీ కెమ్మోవికిని = ఎఱ్ఱని నీపెదవికి, దాసి (కాన నీకు కెంజిగురు లొంగియుండును. కాని నన్ను బాధించును. అధరమునకుఁ జిగురుతోఁ బోలిక) కంజవైభవము = పద్మములయొక్క సంపద, కన్గవకున్ = నీకనుదోయికి, అంతేవాసి = శిష్యుఁడు. ఇవి = ఈవెనుకఁ జెప్పిన చంద్రుఁడు, కోయిల, తీఁగలు, తుమ్మెదలు, లేఁజిగురాకు, తామరపూలును, ఎల్లన్ = అన్నియు, నీవు, చేపట్టన్ = (నన్ను) స్వీకరించినచో, నాకున్, ఇలన్ = ఈ భూమియందు, ఇంపులు = సంతసము కలిగించునవి (అగును) నీవు, ఒకింత=కొంచెము, ఎడపెట్టన్ = అడ్డుపెట్టినచో, ఇవియె = ఈవెనుకఁ జెప్పిన నీ కనుకూలము లగు పదార్థములే, (నాకున్) పెనుమృత్యువులు = నన్ను నాశన మొనర్చు నవి (యగును.) అని, తన్నుఁగూర్చి= ఆప్రభావతి నుద్దేశించి, నేను=(ప్రద్యుమ్నుఁడు)ఆడుట=పలుకుట, చెవింజొనుపుము=వినిపింపుము, వనిత= ప్రభావతి+ఏమి+అనియెన్ = నామాటలు విని యేమిచెప్పినదో, అది, వ్రాసి, వేగమె, అనుపుము = పంపుము, ఓరాజహంసి = ఓశుచిముఖీ, నీయుల్లము = నీమనసు, ఎందును, అహేతుకారుణ్యము= కారణములేనట్టి దయగలది, అని, గట్టిగాన్ = దృఢముగా, ఆరసి = ఆలోచించి, చూతును= చూచుచుందును. నీహృదయ మకారణకృప గల దని దృఢముగా నమ్మికొని యెదురు చూచుచుందును. అని = ఈ రీతిగా, చదువుకొనన్ = (ప్రభావతి) చదువుకొనుచుండఁగా, అటమున్న + అ = అంతకుముందే - ప్రభావతి పూఁదోటలోనికి రాకముందే, తదీయవిభుఁడు = ఆమె మగఁడు, ప్రద్యుమ్నుఁడు, ఏఁతెంచి = వచ్చి, వెనుకన్ = ప్రభావతికి వెనుకభాగమున, ఉండి = నిల్చి, ఆత్మ = తన మనస్సును, హత్తించి = ఆమె చదువు వృత్తాంతమందు గట్టిగా నిలిపి - శ్రద్ధగా నని భావము, వినియెన్=వినెను.

వ్యా. వి. :—పూవు + తోఁట. ప్రాఁతాది సంధికార్యమున 'పూఁదోఁట' - కఱకు + పాయము ఉదంతస్త్రీసమసంధి కార్యమున కఱకుఁబాయము - కఱకుఁబాయము+తేంట్లు = పుంప్వాదేశము - సమాసమున వచ్చు నుగాగమ ద్రుతకార్యములచే కఱకుఁబాయపుఁదేంట్లు - తేఁటి+లు, సూ. ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్త్వంబగు. బాల. తత్సమ. 45 చే 'తేఁటు+లు' అని కాఁగా, సూ. బహువచనంబు పరం బగునపు డసంయుక్తంబులైన డ, ల, ట, ర, ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు. బాల. ఆచ్ఛిక. 12 చే - 'తేఁట్లు' అని యయి సూ. సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందువునకుఁ బూర్ణం బగు. బాల. ఆచ్ఛిక. 55. చే 'తేంట్లు' అనునవి సిద్ధించును - ద్విరదగతి రగడకు, అయిదేసి లఘువులు (మాత్రలు) గల నాలుగు గణములు ప్రతిపాదమున నుండును. మూఁడవ గణముయొక్క మొదటి యక్షరము యతిస్థానము. ప్రతి రెండుపాదములకు ప్రాసము మొదటనుండుటే కాక తుదిని గూడ ప్రాసనియమముగలదు. 'కరమొప్పుఁ బంచలఘుగణ చతుష్టయముచే, విరమంబు రెంటిపై ద్విరదగతి పేరిచే' (అప్పకవీయము. 4 ఆ.) అని లక్షణము.

వ. ప్రభావతియు నిట్లు లేఖ చదువుకొని తదర్థంబు మఱియు భావంబునం బరామర్శించుచు. 153

అర్థము:—తదర్థంబున్=ఆలేఖలోనియర్థమును, భావంబునన్=మనస్సునందు, పరామర్శించుచున్= విమర్శించుకొనుచు.

మ. ఇవి యాదిం గలప్రేమభంగు - లిఁక నా కేయేఁ తెంచుయత్నంబు, న
ట్టివిధిన్ నన్నుఁ బరిగ్రహించుట, నిరూఢిన్ నేఁటిదాఁకన్ రతో

త్సవసౌహార్దర (గ?) తుల్ శతోత్తరత మించఁ జల్పు, టా భవ్యప్రా
భవరూపాది గుణవ్రజం బరయ నా కీ భాగ్యంబె భాగ్యం బిలన్. 154

అర్థము:—ఇవి = ఈ జాబునందలివి, ఆదిన్ = మొదట గల, ప్రేమభంగులు = వలపుయొక్క రీతులు, ఇఁకన్ = తరువాత, ఆయేఁతెంచుయత్నంబును = (ఇచటికి) వచ్చుటకై చేసినయత్నమును, అట్టివిధిన్ = రహస్యమార్గమున వచ్చి గాంధర్వవివాహవిధిచేత, నన్నున్, పరిగ్రహించుట = స్వీకరించుటయును, నిరూఢిన్ = స్థిరముగా, నేఁటిదాఁకన్ = ఈ దివసమువఱకు, రతోత్సవ...రతుల్ - రతోత్సవ = సంభోగోత్సవములును, సౌహార్ద = స్నేహముతోడి, రతుల్ = క్రీడలును, (లేక, సౌహార్దగతుల్ = స్నేహముయొక్క రీతులును, అనుపాఠమైనచో సమంజసముగానుండును.) శతోత్తరతన్ = నూఱురెట్లధికముగా, మించన్ + చల్పుట = మించునట్లొనర్చుటయును, ఆభవ్య...వ్రజంబు - ఆభవ్య = అదృష్టవంతుఁడగు నాప్రియునియొక్క, ప్రాభవ = దొరతనము, రూప = ఆకారమును, ఆది = మొదలగు గుణవ్రజంబున్ - గుణసముదాయమును, అరయన్ = ఆలోచింపఁగా, ఇలన్ = భూమియందు, నాభాగ్యమే = నాయదృష్టమే, భాగ్యంబు = అదృష్టము. అలం:—విధి.

తాత్పర్యము:—ఈయుత్తరమున వ్రాసినయీవిషయము లాదిని నాథునకు నాయందుఁ గలప్రేమ రీతులుగదా! ఇఁక నన్నుఁ గలియఁగోరి వచ్చుటకై చేయుయత్నమును, వచ్చి నన్నారీతిగా గాంధర్వవిధిని స్వీకరించుటయును, నేఁటిదాఁక సంభోగోత్సవములు, స్నేహముతోడిక్రీడలును, పెక్కుమడుంగుల హెచ్చునట్లు సలుపుటయును, ఆ యదృష్టశాలియొక్క దొరతనము, చక్కఁదనము మొదలగు నుత్తమగుణ సముదాయమును బరిశీలింపఁగా - అట్టివాఁడు నాకు ప్రియుఁ డగుటచే లోకములో నాభాగ్యమే భాగ్యము.

వి. :—నిరూఢిన్ నేఁటిదాఁకన్ నాభాగ్యమే భాగ్యము. అని యన్వయించినచో ముందటిపద్యముతో స్వారసికముగా నడుచును. కానియాపక్షమున 'నేటిదాఁకన్' అనుపదమునకు దూరాన్వయము కలుగును. - 'రతోత్సవము నందలిసౌహార్దగతులు' అనుటయు మేలుగా నుండును. కాని ముద్రితములందు 'రతోత్సవసౌహార్దరతులు' అనియే యుండుటచే నట్లే వ్యాఖ్యానింపఁబడినది.

క. ఈరాత్రి యకారణపుం, బేరలుకఁ దదాత్మ కెడసి కీ పిరువీఁకగు చొ
ప్పారయ భాగ్యవిహీనలు, లే రెవ్వరు నవనిమండలిన్ ననుఁ బోలన్. 155

అర్థము:—ఈరాత్రి = ఈగడచినరాత్రియందు, అకారణపుంబేరలుకన్ = కారణములేని పెద్ద కోపముచేత, తదాత్మకున్ = అతని మనస్సునకు, ఎడసి = దూరమై, పిరువీఁకు = పీఁకులాట, అగుచొప్పు = అయినవిధము, (పెనఁగులాట యైన విధము.) ఆరయన్ = విచారింపఁగా, అవనిమండలిన్ = భూవలయమున, ననున్, పోలన్ = పోలుటకు, భాగ్యవిహీనలు = అదృష్టములేనివారు, ఎవ్వరును = ఏయొకరును, లేరు = కలుగరు.

తాత్పర్యము:—నేను ఈరాత్రి కారణములేనిదే తీఱనికోపము వహించుటచేత నాతని మనసు విఱిగి పోవుట, నేను బీఁకులాడుట, వీనినిగూర్చి యాలోచింపఁగా భూమండలమున నావంటి యదృష్టశూన్యలెవ్వరును కలుగరు. నిన్నటిదాఁక నాయంతటిభాగ్యవతులు లేరు. ఇప్పుడు నాయట్టి భాగ్యహీనులు లేరు.

వి. :—వెనుకటిపద్యమునఁ దనంతఁదానే వలచి వియోగతాప మొంది కష్టపడి వచ్చి, కలసికొని, వివిధక్రీడల నానందపఱిచినవాఁడు ప్రద్యుమ్నుఁడే కాన నప్రయత్నముగా నంతటిప్రభువు, సొగసు కాఁడు, సుగుణరాశి తనకు లభించుటచే ప్రభావతిదే యదృష్టము - అనిపించియు; తనకోపముచేత-అదియును తగినకారణము లేనిది-అట్టిదానిచే నటువంటిభర్త యెన్నివిధములుగా ప్రార్థించినను వినక పీఁకులాడి

నది కావున ప్రభావతియంతటి యభాగ్య నేఁడు లోకమున లేదు. అని తన్ను నిందించుకొనినది. (నాయిక కలహాంతరిత.)

వ. అని చింతించుచుండ.

తే. రాగవల్లరి యంత నా ◊ రమణికడకు, నరుగుదెంచి యాసఖి వెన్క ◊ నచలవృత్తిఁ
బొంచి యున్నట్టి ప్రద్యుమ్నుఁ ◊ గాంచి యతని, యక్షిసంజ్ఞచేఁ గానని ◊ యట్లయుండె.

అర్థము :—రాగవల్లరి, అంతన్ = ఆ సమయమందు, ఆ రమణికడకున్ = ఆ ప్రభావతియొద్దకు, అరుగుదెంచి = వచ్చి, ఆ సఖివెన్కన్ = ఆ ప్రభావతికి వెనుకదిక్కున, అచలవృత్తిన్ = చలింపనివర్తనముతో, పొంచియున్నట్టి = డాఁగి కాచికొని యున్న, ప్రద్యుమ్నున్, కాంచి = చూచి, అతనియక్షిసంజ్ఞచేన్ = ఆతనికనుసన్నచేత - తా నచట నున్నట్లు తెలుపవలదని కనుసన్న చేయఁగా నని భావము - కాననియట్ల = చూడనట్లే, ఉండెన్ = ఉండెను.

తాత్పర్యము :—అంతలో రాగవల్లరి యచటికివచ్చి ప్రభావతికి వెనుకదెసఁ గదలకుండ పొంచి యున్న ప్రద్యుమ్నుని చూచి, ఆతని కనుసన్నచే - చూడనట్లే యుండెను.

వ. తదనంతరంబ యా యంబుజాక్షిచందం బభివీక్షించి. 158

అర్థము :—తదనంతరంబ = దాని కనంతరమందే, ప్రద్యుమ్నుఁ డట్లు కనుసన్న చేసిన వెంటనే, ఆ యంబుజాక్షిచందంబు = తామరలవంటి కన్నులుగల యా ప్రభావతియొక్క యునికి, అభివీక్షించి = బాగుగఁ జూచి.

తాత్పర్యము :—ప్రద్యుమ్నుఁడు పొంచియుండుట, ప్రభావతి యాతఁడు వెనుక నున్నట్లు తెలియక, యేదియో చింతించుచున్న ట్లుండుట - బాగుగా, నాలోచించి - వీరి కేదో భేదభావము కలిగియుండునని యూహించి.

చ. పయిదలి నేఁ డిదేమి ముఖ ◊ పాండిమ యున్నది మీఱి, ప్రత్యుషః
క్రియలఁ బరాకు మాన్చినది, ◊ కృష్ణచతుర్దశినాఁటి చంద్రరే
ఖయుఁ బలె మేను చిక్కినది, ◊ కాటుకక ప్పదె యొప్పెడుం గుచ
ద్వయిఁ, బికరాజిమ్రోఁతఁ గయి ◊ వ్రాలెదు, సోలెదు చల్లగాడ్పులన్. 159

అర్థము :—పయిదలి = ఓయింతీ! ముఖపాండిమ = ముఖమునందలి వెల్లఁదనము, మీఱి + యున్నది = అతిశయించి యున్నది, పరాకు (కర్త), ప్రత్యుషఃక్రియలన్ = దంతధావనాదు లగుప్రాతఃకాలకృత్యములను, మాన్చినది = మాన్పివేసినది, కాల్యకృత్యములను బరాకుపడితి వని భావము, మేను, కృష్ణచతుర్దశినాఁటి = బహుళచతుర్దశినాఁటి, అమావాస్యకు పూర్వదినమునందలి - అని యర్థము. చంద్రరేఖయుఁబలె = నెలవంకవలె, ఒక్కకళతో (రేఖామాత్రమై) దృశ్యాదృశ్యముగ నుండు చంద్రస్వరూపమువలె నని భావము, చిక్కినది=కృశించినది, అదె=అదిగో, కాటుకకప్పు=కాటుకయొక్క (నలుపు) నీలిమ, కుచద్వయిన్ = చనుదోయియందు, ఒప్పెడున్ = గోచరించుచున్నది, పికరాజిమ్రోఁతన్ = కోయిలగుంపుయొక్క రొద, (వినుట) చే, కయివ్రాలెదు = తూలిపడిపోవుచున్నావు, చల్లగాడ్పులన్ = చల్లనిగాలుల (వీచుట) చేత, సోలెదు = సొమ్మసిల్లి పోవుచున్నావు, నేఁడు=ఈ దినమందు, ఇది = ఈఘూర్ణు, ఏమి = ఏమికారణమున వచ్చినది.

తాత్పర్యము:—ఓయింతీ! నేఁడు ముఖవైవర్ణ్యము మిక్కిలిగ నున్నది. కౌల్యకృత్యములు పరాకు పడితివి. దేహము బహుళపక్షచతుర్దశినాఁటి నెలవంకవలెఁ జిక్కిపోయినది. కన్నీరు గాఱుటచేఁ గాఁబోలును కౌటుకనలు పదుగో చనుదోయినంటియున్నది. కోయిల కూఁతకు, చల్లనిగాలికి సొమ్మసిల్లిపోవుచుంటివి. నేఁ డీమార్పువచ్చుటకుఁ గారణ మేమి ?

వ్యా. వి. :—పయిదలి, పైదలి - రూ. 'వాయిరవు ర్వ్యక్రతమూ' ఆంధ్ర శబ్ద చింతామణి.

ఉ. లోలతరాక్షి యాపయిఁట ! లోనిది యెక్కడిలేఖ ? యల్లనాఁ
డేలిక యంపినట్టిదియె ? ! యెయ్యది యైనను సిగ్గు లేల ? నేఁ
డాలిఖితార్థ మేమయిన ! నట్టిటు గెంటినఁ జూచె దేమొ ? యూఁ
బోలిక చూడ నట్ల, యధిపుల్ సతులందును సత్యసంధులే ? 160

అర్థము:—లోలతర + అక్షి = మిక్కిలి చలించుచున్న కన్నులు గలదానా ! ప్రభావతీ ! ఆపయిఁటలోని + అది = ఆ నీపయ్యెదయందు దాఁచియుంచినది, ఎక్కడిలేఖ = ఎచటనుండి వచ్చినజాబు, అల్లనాఁడు = ఆనాఁడు, ఏలిక = నీభర్త, అంపినట్టిదియే = చెలికత్తెచేత పంపినది కాదా ? ఎయ్యది యైనను = అదిగాక మఱేదియైనను, సిగ్గులు = మిక్కిలి బిడియము, ఏల = ఎందులకే ? బిడియపడ నక్కఱ లేదని భావము. నేఁడు = ఈదినమున, ఆ లిఖితార్థము = అందు లిఖించిన విషయము, ఏమి + అయినన్ = ఏకొంచెమేని, అట్టిటు గెంటినన్ = కొంచె మిటు నటు త్రోసిపుచ్చఁగా, - (నీమగఁ డందు వ్రాసిన దానికి వ్యత్యాస మొనర్పఁగా - అని భావము.) చూచెదు + ఏమొ = చూచుచుంటి వేమోకదా, నీ పోలిక = (చెప్పినట్లు ప్రియుఁడు చేయనియెడ పరితపించెడి నాయికల) సామ్యమును బట్టి, చూడన్ = ఆలోచింపఁగా, అట్ల = ఆరీతిగానే, ఔను = అయి యుండును, అధిపుల్ = భర్తలు, సతులందును = స్త్రీల విషయమున, సత్యసంధులే = సత్యప్రతిజ్ఞ గలవారా ? (కారు అని భావము.)

తాత్పర్యము:—ఓయింతీ ! పయ్యెదలో దాఁచితివి, వాయుత్తర మెక్కడిదే ? ఆనాడు నీప్రభువు పంపినదే కాదా ? అదిగాక మఱొక్కటి యైనప్పటికి నంత సిగ్గెందులకు ? అందు ప్రియుఁడు వ్రాసిన దాని కీనాఁ డేమయిన భేదము కలుగఁగా దానిని జూచుచుంటివా యేమి ? పోలికను బట్టి చూఁడగా - ప్రియుఁడు చెప్పినదానికి విరుద్ధముగాఁ బ్రవర్తించినపుడు నాయికలందుఁ జూపట్టు పరితాపమే నీకును గలిగినది అని నిశ్చయ మగుచున్నది. పతులు స్త్రీల యెడ (సత్యప్రతిజ్ఞ) మాట దిరుగని వారలే ?.

అలం:—అర్థాంతర న్యాసము.

వి. :—సిగ్గులు 'అను బహువచనము అతిశయార్థమునఁ బ్రయుక్తము.

క. అని నడుమ నడుమఁ బ్రద్యుమ్నుని వదనముఁ జూచి నగుచు ముద్దియ తల్లో
చనసంజ్ఞాప్రేరణమున, దనుజేశ్వరసుతకు మఱియు ! దా ని ట్లనియెన్. 161

అర్థము:—అని, నడుమ నడుడున్, ప్రద్యుమ్నుని వదనమున్ = ప్రద్యుమ్నుని యొక్క ముఖమును చూచి, నవ్వుచున్ = నవ్వుచు, ముద్దియ=అరాగవల్లరి, తల్లోచన...ప్రేరణమునన్ - తత్ ఆ ప్రద్యుమ్నుని యొక్క, లోచనసంజ్ఞా = కనుసన్నచేనైన, ప్రేరణమునన్ = ప్రోత్సాహముచేత, దనుజేశ్వరసుతకున్ = రాక్షస రాజపుత్రియగు ప్రభావతికి, మఱియున్, తాను, ఇట్లు, అనియెన్.

తాత్పర్యము:—అని పరిహాసగర్భముగా పలికి, రాగవల్లరి నడుమ నడుమ ప్రద్యుమ్నునిమోము చూచి నవ్వుచు, 'ఇంకను బ్రశ్నించి యామె కోపహేతువు కనుగొను' మని యాతఁడు కనుసన్నలచేఁ జేయు ప్రేరణమున మరల ని ట్లనియెను.

క. ఈ రేయి రమణుఁ డెంతయుఁ, గారించినవాఁడు నిన్నుఁ గట్టిగఁ దెలిసెన్
నారీమణి మానునె మదిఁ, గూరిమి దాఁచుకొని యలుగఁగూడదు నీకున్. 162

అర్థము:—నారీమణి = ఓ యింతులమిన్నా, ఈరేయి = ఈ (కడచిన) రాత్రియందు, రమణుఁడు= ప్రియుఁడు, నిన్నున్, ఎంతయున్ మిగుల, కారించినవాఁడు = బాధించినాఁడు, (అని) గట్టిగన్ = నిశ్చయముగా, తెలిసెన్, మానునె = నీ వెంతగాఁ జెప్పకున్నను దెలియ కుండునా? మదిన్ = మనస్సునందు, కూరిమిన్ = ప్రేమను, దాఁచుకొని, అలుగన్ = అలుగుట, నీకున్, కూడదు.

తాత్పర్యము:—ఓ చెలియా! ఈ కడచినరాత్రి నీ ప్రియుఁడు నిన్నెంతయు బాధించినాఁ డని దృఢముగాఁ దెలియుచున్నది. నీవు చెప్పకున్నను దెలియక మానునా? మనస్సులోఁ బ్రేమ దాఁచుకొని యలుగుట నీకుఁ దగదు.

వి. :—అట్లు నిన్నాయన మాపెట్టుట నీవు కోరుకొన్నదై యుండ దానిని గప్పిపుచ్చి కోపించుట తగదు, అని స[illegible].

క. నీ వలిగెడుదాఁకను లే, దో వనితా! యాట మాని యొడ్డించుకొనం
గావలసె, విభుని యలుకల,చే విరహాకులితవై కృశించితి విదిగో. 163

అర్థము:—ఓ వనితా = చెలియా, నీవు, అలిగెడుదాఁకను = కోపించెడుదాఁక, లేదు, నీవు ముందుగా కోపించుట కవకాశమే లేదు. ఇదిగో, విభునియలుకలచేన్ = విభుఁ డెన్నియో విధములఁ గోపించుటచేత, విరహాకులితవు + ఐ = ఎడఁబాటువలనఁ గలఁత నొందినదానవై, కృశించితివి = చిక్కిపోయితివి. నీ వలుగవలసిన దాన వయ్యు నలుగనేరక, విభునియలుకచే నిట్లు విరహార్తవై కృశించిపోయితివి. ఈ కార్శ్యము చూడఁగా - ఆటమాని = జూదమాడుట తాను మానివేసి, ఒడ్డించుకొనంగావలసెన్ = తన్ను జయింప నెదిరిపందెగానిచే పందెను నొడ్డునట్లు తానే చేసికోవలసివచ్చిన ట్లున్నది. ఎదిరి నోడింప నవకాశము వచ్చినను దా నాట మానివేసి, తా నోడిపోయినట్లు తనపై పందెము నొడ్డుట కవకాశ మిచ్చినవిధమున, తా నలుకఁబూనవలసిన ఘనవతి యయ్యు, ప్రియుఁడు తనపై నలుగుట కవకాశమిచ్చి, దాన నెడఁబాసిన ఖేదముచేఁ గృశించిపోయెనని అనిభావము. అలం:—నిదర్శనము.

వి. :—వెనుకటిపద్యమున 'నీవే యలిగితివి' కాఁబోలును. అది కూడ'దని చెప్పి -ఇందు'నీ వలుగునంతటి ప్రౌఢవు కావని దానిని బూర్వపక్షము నొనర్చి, నీవు కోపించుటకు మాఱు నీ ప్రియుఁడే కోపించెనని తెలియవచ్చుచున్న దని నేరము నాయకునిపై మోపఁ బలికినది. నాయికానాయకులలో కోపించిన వా రెవ్వరో ప్రభావతిముఖముననే తెలియగోరి చెలికత్తె వికల్పించి పలికినది.

ఉ. తా నటు లల్క తెచ్చుకొని ధైర్యబలంబున రాక తక్కె, నీ
దైన వియోగతాప మృదితాకృతి చూడఁగ నప్పు డిష్టమో
మానిని తాను నోర్వఁ డతిమాత్రవియుక్తికి, నిష్ఠ మాన్చు నీ
కా నెఱజాణ యోగ్యకరుణామృతవృష్టి నయోగఖేదమున్. 164

అర్థము:—నీదు + ఐన ... కృతిన్ - నీసంబంధమగు, వియోగ=ఎడఁబాటువలనఁ (గలుగు) తాప = వేఁడిమిచే, మృదిత = నలఁగిపోయిన, ఆకృతి = రూపమును, అప్పుడు = ఆసమయమున, చూడఁగన్ = చూచుటకు, ఇష్టము=కోరఁబడినది (కావచ్చును. కావుననే) తాను = స్వయముగా, అల్క=కోపమును, తెచ్చుకొని = కలిగించుకొని, ధైర్యబలమునన్ = తాలిమి (ధృతి) యొక్క శక్తిచేత, రాక తక్కెన్ =రాకుండ

మానినాఁడు. (కాని) ఓ మానినీ = అభిమానము గలదానా! అతిమాత్ర వియుక్తికిన్=అధికమైన యెడఁబాటునకు, తానును, (నీవలెనే) ఓర్వఁడు = సైఁపఁడు, సహింపఁ జాలఁ డని భావము. ఆ నెఱజాణ = గొప్ప నేర్పరి యగు నా నీప్రియుఁడు, యోగ్య ... వృష్టిన్ - యోగ్య = తగినట్టి, కరుణ = దయ యనెడి, అమృత = అమృతముయొక్క, వృష్టిన్ = వర్షముచేత, నీకున్, అయోగఖేదమున్ = ఎడఁబాటువలని వెతను, ఇప్డు + అ = ఇప్పుడే, మాన్పున్ = పోఁగొట్టును.

తాత్పర్యము:—ఆసమయమున నీప్రియుఁడు వియోగబాధచే నలఁగిన నీరూపమును జూడ నిచ్చగించి, లేనియల్క తెచ్చుకొని మనస్థైర్యముచే రాక మానినాఁడు. ఓ మానవతీ! అధిక మగు నెడఁబాటున కాతఁడును సైఁపజాలఁడు. ఆ నెఱజాణ తనదయామృతమును వర్షించి యెడఁబాటువలన నీకుఁగలిగినవ్యథ నిప్పుడే పోఁగొట్టును.

వి. :—వియోగతాపమునే నిప్పటికే నాయిక నలఁగి పోయినది. వేగవచ్చి యామెను దేర్పు మని పొంచియున్న ప్రద్యుమ్నుని కాజ్ఞాపించుటయు నిందు సూచితము.

వ్యా. వి. :—ఇప్పుడు - ఇప్డు. సూ. అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు. బాల. ప్రకీర్ణ. 19. చే. 'ఇప్పడు' అనినై, 'హల్మధ్యగంబున కన్యతరసవర్ణంబునకు లుక్కగు.' శబ్దలక్షణ సంగ్రహము 5. 30 చే రెండవ పకారము లోపించి ఇప్ + డు = 'ఇప్డు' అగును.

వి. :—ఆలంకారికులు 'విప్రలంభము' అయోగ, విరహ, మాన, ప్రవాస, శాపములు కారణములుగా నైదువిధములుగా నుండుననియు, అయైదిటిలో - అంతకుమున్న కలిసికొనియుండని నాయికా నాయకుల కనురాగ మున్నను, పారతంత్ర్యము మున్నగువానిచే కలియలేకపోవుట- (అన్యోన్య గుణ శ్రవణాదికములవలన నాయికా నాయకు లొండొరులను వలచి, కలసికొను నవకాశము కలుగకుండుస్థితి యని భావము.) అయోగ మనియుఁ జెప్పిరి. 'అయోగో విరహోమానః ప్రవాస శ్శాప ఇత్యపి, విప్రలంభస్య పంచైతే హేతవః పరికీర్తితాః। ప్రాగసంగతయో ర్యూనో రనురాగేఽపిజాగ్రతి। అయోగః పారతంత్ర్యాద్యై ర్విప్రలంభో భిలాషజః' - అని. భరతరస ప్రకరణము. కాని యిట వియోగ మను సామాన్యార్థముననే అయోగము అనుపదము వాడఁబడినది. నాయికా నాయకులు కలసికొని మానహేతువగు విప్రలంభము నొందుటచే - పై జెప్పిన అయోగ విప్రలంభ మిట సరిపడదు.

వ. అనిన రాగవల్లరికిఁ బ్రభావతి యి ట్లనియె. 165

సీ. అట్టి యసత్యంపు నటలుకలు కల్పించుకొని వియోగవ్యథఁ గుందఁ జేసి
కాంతల యారూపు గనుఁగొను వేడ్కలు, రాగుండెతోడి నిర్దయులయందు
సంభవించునొ కాని సత్కృపారాశి మత్ప్రాణేశుఁ డెవినోదమునకైన
ననుఁ జిన్నపుచ్చి కన్గొనఁజాలఁ డొక నిమేషార్ధ మాత్రంబు నోయంబుజాక్షి!

గీ. నేఁటిరాత్రి తెఱంగు నానేరమున జనించె, నది యొక్కమాట కే నెమ్మనమున
నలిగి తేఱన యే - నెన్ని ప్రార్థనముల, దానిచే నెంత యెడసెనో ధవుని మనము.

అర్థము:—అట్టి యసత్యంపుటలుకలు = అటువంటి కల్లకోపములు, కల్పించుకొని = తెచ్చిపెట్టుకొని, వియోగవ్యథన్ = ఎడఁబాటువలని దుఃఖముచేత, కుందన్ + చేసి = బాధపెట్టి, కాంతలయారూపు = ప్రియురాండ్రయొక్క దుఃఖముచే నవసిన యట్టి యాకారమును, కనుఁగొనువేడ్కలు = చూడ నుత్సాహపడుట, రా + గుండెతోడి = రాతిగుండెతో నుండునట్టి - కఠినహృదయులై నట్టి అని భావము. నిర్దయులయందున్ = జాలిలేని వారియందు, సంభవించును + ఒ + కాని = కలుగునేమో కాని, ఓ యంబు

జాక్షి = తామరలవంటి కన్నులుగలదానా! మత్ప్రాణేశుండు = నాభర్త, సత్కృపారాశి = ఉత్తమ మగు - లేక ప్రశస్తమగు దయయొక్క ప్రోవు, (కాని) ఏవినోదమునకున్ + ఐనన్ = ఎట్టి కాలక్షేపమున కైనను, నన్ను, చిన్నపుచ్చి = లెక్కచేసి, అవమానపఱచి, ఒకనిమేషార్థమాత్రంబును = ఒక యఱ నిముసము సేపైనను, కన్గొనంజాలండు = చూడలేడు, నేంటిరాత్రి తెఱంగు = ఈనాంటిరాత్రి జరిగిన విధము, నాచేరంగునన్, జనించెన్ = కలిగెను, అది ఆనేరమును, ఒక్కమాటకే = ఒకమాటవలననే కలిగినది, ఏను = నేను, (భర్తయనిన యామాటకు) నెమ్మనమునన్ = మనసునందు, అలిగి = కోపించి, ఎన్నిప్రార్థనలన్ = భర్తయెన్నివిధముల బతిమాలినను, తేఱము + అ = కోపమును విడువనైతిని, దానిచేన్ = ఆకారణముచేత, ధవునిమనము = ప్రియునిమనసు, ఎంత, ఎడసెనో = దూరమైనదో - ఎంతగా విముఖమైనదో కదా అని భావము.

తాత్పర్యము:—'వియోగతాపముచే వాడియున్న నీరూపము చూడవలె నని కోరి నీప్రియుం డట్లు వెడలెను' అను రాగవల్లరితో ప్రభావతి యి ట్లనెను. చెలీ! అటువంటి లేనికోపము తెచ్చుకొని ఎడంబాసి, దుఃఖించుచున్న ప్రియురాండ్ర కృశించినరూపము చూచుకోర్కులు పాషాణహృదయు లగు నిర్దయు లందుం గలుగ నేమో కాని మహాప్రియాపుంజ మైన నాపతి వినోదమునకైనను నట్లునన్ను చిన్నంబుచ్చండు. చిన్నబుచ్చి యొకనిముసమైనను చూడం జాలండు. ఈరాత్రి జరిగిన దంతయు నాతప్పువలననే జరిగెను. పతి నొకమాట యనెను. దానికే నే నలిగితిని. నీవు భ్రాంతిపడితి వని చెప్పి యెన్నివిధముల నతండు బతిమాలినను నేనే కోపము విడనైతిని. అందుచే ప్రియునిమన స్సెంత విరక్తమైపోయినదో కదా!

వ్యా. వి. :—అసత్యము+అలుక - సువర్ణకమునకుం బుంప్వాదేశమును, టుగాగమమును వచ్చి - 'అసత్యపుటలుక' యైనది. రాగుండెతోడన్+నిర్దయులు - సూ. చేత, తోడ, వలనల కిత్త్వంబు సమాసంబునం దగు. బాల. స ధ. 43. చే ఇత్త్వము రాంగా 'రాగుండెతోడి నిర్దయులు' అయినది. నెఱ + మనము. ప్రాంతాదిసూత్రసంధి. ప్రాంతాదిగణమున సూరి యిచ్చిన యుదాహరణములం దాచ్ఛికపదములే యుండుటచే సంస్కృతమైన మనశ్శబ్దము మున్నగువాని నిమిత్తమై, సూ. 'కొత్తాదులు లుప్తశేషంబులు దేశ్యశబ్దంబులతోడం బలెందత్సమంబుతోడం గొన్నియెడలం గర్మధారయంబగు (ప్రౌఢ. సమాస. 7.) అని ప్రౌఢవ్యాకర్త విశేషించి తెలిపెను. ఈ ప్రకరణమున నాయిక కలహాంతరిత. సీ. ... అల్కానధిపుం దెగడి యనుశయముం జెందుసతి కలహాంతరిత. నరసభూపాలీయము. 2-40.

వి. :—చిన్నపుచ్చి, చిన్నవుచ్చి అని ముద్రిత పాఠములందుం గలదు. కాని సూర్యరాయ నిఘంటువున 'చిన్నంబుచ్చి' యని ద్రుతసంధితోంగలదు. 'చిన్నంబోవు' అనుపదమున 'క. విని చిన్నంబోయె దైత్యవిభుడు' అను దశావతార చరిత్ర 5-32 ప్రయోగము చూపంబడెను. దాని ననుసరించి, పోవు ధాతువు నకు ప్రేరణార్థక రూపమే పుచ్చు కావున - 'చిన్నంబుచ్చు' అని గ్రహించుటయే యుచితముగా నున్నది.

చ. అన విని రాగవల్లరి సకేమంకురితస్మిత కోమలావలో
 కనముల నాప్రభావతిని కన్గొనునట్ల తదీశ్వరుం గనుం
 గొని బళి! గోపపుత్ర! రసికుండవు నీ దగు ధౌర్త్య మింతిపై
 ఘన మనమా నవీనసుధ గాంచి చవుల్ గొనుకోర్కి కోర్కియే. 167

అర్థము:—అనన్ = ప్రభావతి యట్లు పలుకంగా, రాగవల్లరి, విని, సమంకురిత ... లోకనములన్ - సమ్ + అంకురిత = మొలచుచున్న - కలుగుచున్న, స్మిత = చిఱునగవుచే, కోమల = మృదువైన, అవలోకనములన్=చూపులచేత, ఆప్రభావతిని, కన్గొనునట్లు + అ=చూచుచున్నట్లే (నటించుచు), తత్ + ఈశ్వరున్ = (ఆమెకు వెనుకనే నిలిచియున్న) ఆమెయొక్క భర్తయగు ప్రద్యుమ్నుని, కనుంగొని = చూచి, బళి=బాగు! (నిందాగర్భితమగు ప్రశంసార్థకము) గోపపుత్ర = గొల్లపిల్లవాండా, రసికుండవు=

రసజ్ఞుఁడవు, నీది + అగు ధౌర్త్యము = నీ యొక్క వంచన, ఇంతిపైన్ = ఈచిన్నదానియెడ, ఘనము = అధికము,అయ్యో, అనమా = అని నిన్ను నిందింపమా ? నిన్నే నిందింతుము (ఏమన) నవీనసుధ = క్రొత్త యమృతమును, (క్రొత్తస్త్రీల యధర సుధలను - అని భావము.) కాంచి = చూచి, చవుల్ + కొనుకోర్కి = రుచిచూడఁ గోరువాంఛ, కోర్కియె = న్యాయమగు వాంఛయా - కాదని భావము.

తాత్పర్యము:— ప్రభావతికి వెనుక ప్రద్యుమ్నుఁడు పొంచియున్నాఁడు. రాగవల్లరి ప్రభావతికి నెదుట నున్నది. ప్రభావతి మాటలను విని రాగవల్లరి చిఱునగవుతో నల్లన ప్రభావతి మొగమువంకఁ జూచు దానివలె నటించుచు, వెనుక నున్న ప్రద్యుమ్నుని జూచి 'గొల్లపిల్లవాఁడా! మంచి సరసుఁడవు. ముద్దరాలగు నీమెయెడ నీవింత మోసము చేసితివి' అని నిన్ను దూఱుదుము. ఏమన క్రొత్తగా నెవతెయో కనఁబడ దాని యధరామృతమునకు నీ వాసచేసి యుందువు. అట్లాసించుట తగు నయ్యా ! అని ఆకాశభాషితమువలెఁ బలికెను.

వి. :— గోపపుత్ర అనుటవలన పసులకాపరి కొడుకవనియు, రసికుండవు - అనుట వలన విపరీతలక్షణచే అరసికుఁడ వనియు భావము. వ్యాజస్తుత్యలంకారము. అనమా = నిందింపమా. అనుటకు - 'అను' ధాతువునకు 'నిందించు' అను నర్థము గలదు 'అని యనిపించుకొనుట యత్తగారా నీ స్వభావమా' అని సామెత.

క. నా విని యోసి తుటారి! ద,యావారిధి నధిపుఁ గూర్చి యనకు మొకటియున్
నావెట్టికినుక యింతకుఁ, దావల మని చెప్ప వినవె తరుణీ యనియెన్. 168

అర్థము:— నాన్ = అనఁగా, విని, ఓసితుటారి = ఓసివదరుఁబోతా !, దయావారిధి = కరుణకు సముద్రమైన - (అపారమగు కరుణగలవాఁ డని భావము.) అధిపుఁగూర్చి = పతి నుద్దేశించి, ఒకటియున్, అనకుము = నిందింపకుము, తరుణీ = ఓ జవ్వనీ, ఇంతకున్ = ఈ వియోగదుఃఖమున కంతకును, నావెట్టికినుక = మతిమాలిన నాకోపము, తావలము = ఆధారము - (హేతువు అని భావము) అని, చెప్పన్ = (నేను) చెప్పఁగా, వినవే = వినియుండలేదా, అనియెన్ = అని పల్కెను.

వ. అని యోరాగవల్లరీ నీవు నాకు బహిఃప్రాణంబవు గాని సఖీమాత్రంబవు కావు నీకు దాఁపురంబు సేయ నేల మాతెఱంగు వినిపించెద విను మని తనకోపనిమిత్తంబును, ప్రియుండు తనతోడన రాకుండ నానవెట్టి తాను శయ్యాంతరంబున కరుగుటయు, మొదలుకొని ప్రియనిర్గమపర్యంతంబుగాఁ దమవృత్తాంతంబు సకలంబునుం జెప్పఁ దగినప్రకారంబునఁ జెప్పి యిట్లనియె. 169

అర్థము:— బహిఃప్రాణంబవు = వెలుపల నున్న ప్రాణమవు, సఖీమాత్రంబవు = కేవలముచెలికత్తెవు, దాఁపురము = దాఁచుట, కోపనిమిత్తంబును = అలుగుటకు హేతువును, ఆన+పెట్టి=ఒట్టిడి, శయ్యాంతరంబునకున్ = వేఱుపాన్పునకు, ప్రియనిర్గమపర్యంతంబుగాన్ = భర్తయొక్క వెడలిపోవుట యవధియగునట్లు- భర్త వెడలుదాఁక - అని భావము. చెప్పఁదగిన ప్రకారంబునన్ = చెప్పుట కెంతవఱ కుచితమో యట్టి విధమున - చెప్పఁదగని కొన్నిరహస్య విషయములు మాటుచేసి - అని భావము.

వ్యా. వి. దాఁపురము:— సూ. 'పుర' వర్ణకంబు 'కాఁచు, దాఁచు, దాయ్యాదుల కగు. ప్రౌఢ. కృదంత. 4 చే - దాఁచు+పురము - దాఁపురము. అని రూపసిద్ధి. 'దాయు' ధాతువున కగుచో నరసున్న యుండక 'దాపురము' అని యగును.

క. కాంతుం డాగతి నాయ,త్యంతకఠోరతకు నాత్మ(యందు విఱిగి యో
వింత యగు విరహదశ కుప,శాంతి యరసికొననొ లేచి (చనియెన్ బెలుచన్. 170

అర్థము:—కాంతుఁడు = ప్రియుఁడు, ఆగతి = ఆ రీతియైన, నా + అత్యంతకఠోరతకున్ = నాయొక్క ఓపదలేని కాఠిన్యమునకు, ఆత్మయందున్ = మనస్సునందు, విఱిగియో = విరక్తినొందియో, వింత యగు విరహదశకున్ = (హేతువు లేకయే కలుగుటచే) ఆశ్చర్యకరమగు వియోగావస్థకు, ఉపశాంతి = ఊఱట, అరసికొనన్+ఒ = పొందుటకొఱకో కాని, పెలుచన్ = శీఘ్రముగా, లేచి, చనియెన్ = వెడలిపోయెను.

క. తఱి నంత వేఁడుకొన విన,నెఱుఁగని నానిష్ఠురతకు (నేడు విఱుగులన్
విఱిగెనొకొ ప్రియునిచిత్తము, విఱుగకయున్నం ద్యజించి (వెస నేల చనున్. 171

అర్థము:—తఱిన్ = అట్టి యుచితసమయమునందు, అంత = అంత యెక్కువగా, వేఁడుకొనన్ = బతిమాలుకొనఁగా, వినన్+ఎఱుఁగని = వినుటయే తెలియని, నా నిష్ఠురతకున్ = నా (మనః) కాఠిన్యమునకు, ప్రియుని చిత్తము = పతిమనస్సు, ఏడువిఱుగులన్ = మరల నతుక వీలుగాకుండ పెక్కు ముక్కలుగ, విఱిగెనొకొ = భిన్నమైనదేమో - మరల నెన్నఁడు ప్రేమ కలుగనట్లు విరక్తి నొందినదేమో అని భావము. విఱుగక యున్నన్ = (మనసు) విరక్తమే కానియెడ, త్యజించి = నన్ను విడిచి, వెసన్ = శీఘ్రముగా, ఏల, చనున్ = వెళ్లును, వెళ్లకయే యుండునని భావము.

వి. :—ఏడు విఱుగులు విఱుగుట - జాతీయము.

ఉ. వ్రీడను మానసంపదకు (వెల్తిగదా యిది యంచు నెంచ కేఁ
గూడఁగఁ బాఱి పట్టుటకు (గొబ్బున నప్పుడ సాహసించితిన్
జేడియ! దాఁపనేర కిది(చెప్పెదఁ బ్రాణము నీవు గావునన్
గూడఁగలేక యంతఁ గడుఁ(గుందితి ఘోరవియోగవేదనన్. 172

అర్థము:—చేడియ చెలియా (చేటికాశబ్దభవము.) వ్రీడకున్ = సిగ్గునకును, మానసంపదకున్ = అభిమానాధిక్యమునకు, మనసుగొప్పతనమునకు, ఇది = ఇట్లు వెంబడించుట, వెల్తిగదా = లోపనుగునుగాదా, అంచున్ = అనుచునుగూడ, ఎంచక = గణింపక, ఏన్ = నేను, అప్పుడ = ఆసమయమందే, కూడఁగఁబాఱి = (ఆయనను) దగ్గఱునట్లు పరువెత్తి, గొబ్బునన్ = వేగముతో, పట్టుటకున్ = పట్టుకొనుటకు, సాహసించితిన్ = చొరవచేసితిని, అనఁగా సిగ్గును, అభిమానమును విడనాడి మగనిని త్వరగాఁ బట్టుకొని యాఁపుటకు వెంట సాహసించి పరుగెత్తితిని అనిభావము. నీవు, ప్రాణము = (నా) ప్రాణమువంటిదానవు, కావునన్, దాఁప నేరక = దాఁచుకొనఁజాలక, ఇది = ఈ మీఁదజరిగినట్టిసంగతిని, చెప్పెదన్ = చెప్పుచుంటిని, అంతన్ = అప్పుడు, కూడఁగలేక = పరువెత్తి పతిని గలిసికొనలేక, ఘోరవియోగవేదనన్ = భయంకరమగు నెడఁబాటు వలని బాధచేత, కడున్ = మిగుల, కుందితిన్ = దుఃఖించితిని. (అనఁగా చెలియా! చెప్పఁదగినది కాదు కాని నీవు నా ప్రాణమువంటిదానవు కానఁ జెప్పుచున్నాను. పరువెత్తితినే కాని పట్టుకోలేక, ఘోరమైన వియోగబాధచే నెంతయు దుఃఖించితిని.)

వి. :—అవమానము చెప్పకొఁదగనిది యైనను జెప్పుచుంటిని అని యామె భావము. 'ఆయు ర్విత్తం గృహచ్ఛిద్రం మంత్ర మౌషధ సంగమౌ, దాన మానావమానాశ్చ నవ గోప్యాః ప్రకీర్తితాః.' అని నీతిశాస్త్రము.

అలం:—కావ్యలింగము.

ఉ. ఆపరిపాటి కంతఁ గడు నల్గుచు నట్టి తథావిధా
లాపవిచిత్రతం దురపిలంగ వియోగదవాసహత్వమున్
జూపుచుఁ జేర వేఁడు విభుం గయికోక కఠోరవృత్తిఁ బె
న్పాపము గట్టుకొన్నగతభాగ్యకు నా కివి పాట్లు నెచ్చెలీ! 173

అర్థము:—నెచ్చెలీ = ప్రాణసఖీ, అంతన్ = ఆసమయమునఁ, ఆపరిపాటికిన్ = ఆపద్ధతికి, కడున్ = మిక్కిలి, అల్గుచున్ = కోపించుచు, తథా...చిత్రతన్ - తథావిధ = అట్టిదైన - (నేను నీతోఁ జెప్పిన-) ఆలాప = మాటలయొక్క, విచిత్రతన్ = వేఱువిధమగుటచేత, దురపిలంగన్ = దుఃఖపడుచుండఁ, వియోగ... సహత్వమున్ - వియోగ = ఎడఁబాటనెడు, దవ = కార్చిచ్చునకు, అసహత్వమున్ = సైఁపలేకుండుటను, చూపుచున్ = ప్రకటించుచు, చేరన్ = నాపొంతఁ జేరుటకు, వేఁడుకొనఁగన్ = ఒట్టును దీసివేయు మని పరవశుఁడై ప్రార్థించుచున్న, అట్టివిభున్ = మనసారఁగోరిన భర్తను, కయికోక = లెక్కింపక, కఠోరవృత్తిన్ = క్రూరవర్తనముచేత, ఏమియు దయ చూపక అని భావము, పెన్పాపము = పెద్దపాపమును, కట్టుకొన్న = నాకై నేను దెచ్చుకొన్న, గత భాగ్యకున్ = అదృష్టము పోయినదాననైన, అదృష్టహీన నని భావము. నాకున్, ఇవి, పాట్లు = బాధలుగదా (ఇచట - 'ఇవి పాట్లే' అని పాఠమున్నచో సంగతము సమంజసముగ నుండును. అప్పుడు 'నేను బొందుచున్నవి యివి బాధలా ? కావు. ఇకను నేను చేసిన పాపమునకు ఫలముగా నెన్ని బాధలు పొందనుంటినో యను వ్యంగ్యము స్ఫురింప నవకాశముండును. కాని సర్వప్రతులయం దిట్లే యున్నది.)

తాత్పర్యము:—సఖీ! ఆరీతి భర్త రతీ యని పిలిచిన మాత్రమునకు మిగులఁ గోపించి నీతోఁ జెప్పినయట్టి సంభాషణము చేయుచు, నేను దుఃఖపడుచుండ దవాగ్నివలెఁ దాప మొదవించు నెడఁబాటును సైఁపలేక, యొట్టు తీసివేయుమని వేఁడిన యట్టి నాభర్తను లక్ష్యపెట్టక, మహాపాప మొనరించిన నిర్భాగ్యురాల నగు నాకు నిట్టిపాట్లే కదా కలుగవలసినవి ? కలిగినవి, అనుభవించుచున్నాను.

వ్యా. వి. :—పెను+పాపము = పెన్బాపము, 'పెను' అను దానియంత్యోకారము లోపింపఁగా మిగిలిన నకారము ద్రుతము కానప్పుడు పాపములోని పకారమునకు సరళాదేశము ప్రాప్తింపదు. కాని ప్రయోగములందిట్టివే 'కన్గవ' మున్నగునవి యుండుటచే చిన్నయసూరి తన సూత్రాంధ్ర వ్యాకరణమున 'కన్వాదీనా మంత్యలోపే కపానాంతు గబామతాః' అని సరళాదేశము నిపతించి వానికిఁగూడ సాధుత్వము చేకూర్చినాఁడు.

సీ. నెఱప కే లున్నవి ♦ నెత్తలిరీకెలు, తమవాఁడి యెల్లఁ నా ♦ తనువుమీఁదఁ
బఱప కే లున్నవి ♦ పరభృతశ్రేణులు, శ్రుతులలోఁ దమపల్కు ♦ సూదు లెల్ల
నుఱుపకే లున్నవి ♦ నెఱయ ధైర్యంబును, గంధంపుమల కోడె ♦ గాడ్పుగములు
విఱుపకే లున్నవి ♦ వెస నంటఁబొదివి వ, పుష్పమహోళిఁ బరాగ ♦ ముష్టిమములు
నన్ను నొకభూమిలోపలి ♦ నాతిగాఁగఁ, దలఁచి వే చంపకిట్లోర్వఁ దాఁచినవియొ
తెగి తెగని చిఱుకత్తి కోఁతగ వధించు, టుచితమని యోలి నిల్పఁజూచుచున్నయవియొ.

అర్థము:—నెత్తలిరు + ఈకెలు = చిగుళ్లనెడి బల్లెములు, తమవాఁడి = తమయొక్కపదను, ఎల్లన్ = అంతయును, నాతనువుమీఁదన్ = నాదేహముపైని, ఏల = ఎందుచేత, నెఱపక + ఉన్నవి = వ్యాపింపఁజేయకున్నవి, పరభృతశ్రేణులు = కోయిలల గుంపులు, శ్రుతులలోన్ = (నా) చెవులలో, తమపల్కుసూదులు = తమయొక్క కూఁత లనెడిసూదులను, ఎల్లన్ = అన్ని

యును, ఏల, పఱపఁ, దొడఁగె = చొప్పించుచున్నవి, గంధవహ ... ములు - గంధవహములు = మలయ గిరిసంబంధమైన, కోడె = లేఁతవగు, గాడ్పుగములు = గాలులగుంపులు, ధైర్యంబునకున్ = (నా) ధృతిని, మనోనిశ్చలతను, ఏల, నెఱయన్ = పూర్తిగా, నుఱుపక = ఉన్నవి = మూర్ఛలు చేయుచున్నవి, పరాగ సుర్మురములు = పుష్పోద్భవములనెడు కుసుమ్మనిప్పులు, వెసన్ = త్వరగా, అంటన్ = అంటుకొనునట్లు, పొదివి = క్రమ్మి, వపుః + మహాశనే = శరీరమనెడు వలెగొప్పయాశను, ఏల, విడుపకయున్నవి=విడుఁగఁ జేయ కున్నవి, నశింపఁజేయ కున్నవి, నన్నును, ఒకభూమిలోపలినాతిగాఁగన్=భూమిలో నుండు నొక స్త్రీ మాత్రముగా, తలఁచి, వే = శీఘ్రముగా, చంపక, ఇట్లు, ఓర్పు, తాల్చినవియె = పూనినవి కాఁబోలును, లేక, తెగితెగని, చిఱుకత్తి కోఁతగన్ = చిన్నకత్తికోఁత కలుగునట్లు, (కసుగు కోఁత లన్నమాట.) వధించుట = చంపుట, ఉచితము = తగినది, అని = అనియెంచి, ఓలిన్ = వరుసగా, ఇట్లు, ఏఁచుచున్నవియో = బాధించుచున్నవో. (చిత్రవధచేయుచున్నవి అని భావము.)

తాత్పర్యము :—ఈచిగురాకు లను బల్లెములు తమకుఁగల పద నంతయు నాదేహముపై నేల ప్రసరింపఁజేయుచున్నవి ? కోయిలలు తమకూజితము లను సూదులను నాచెవులం దేల గ్రుచ్చుచున్నవి ? మందమలయానిలములు నాధైర్యము నేల చూర్ణము చేయుచున్నవి ? పుష్పపరాగము లనెడి కుసుమ్మనిప్పులు దేహము మీఁదికురిసి గుప్పుమనునట్లు ఏల నశింపఁజేయుచున్నవి ? నన్ను భూమిలోనుండెడు నొక స్త్రీమాత్రముగా భావించి (స్త్రీహత్యాదోషము కలుగునని) చంపక యోరిమిపట్టినవో, లేక ఒక్కమాఱువధించుట తగ దని తెగితెగనట్టి చిన్నకత్తికోఁతలతో దీనిని వధించుట యుక్త మని యిట్లు బాధించుచున్నవా? నేనుభర్తయెడలఁ జేసిన పెద్దపాపకృత్యమునకు మన్మథసంబంధులగు చిగుళ్లు, కోయిలలు, మలయానిలములు, పుష్పపరాగములు, వరుసగాఁ జిత్రవధ చేయుచున్నవి. ఒక్కమాఱు వధించిన లెస్సగా నుండునే యని యాశయము.

అలం:—రూపకము, వికల్పము, నిదర్శనము.

వి. :—పైని జెప్పఁబడిన నాలుగును మన్మథోద్దీపకము లగుటచే ప్రభావతి కవి దుస్సహములైన వన్నమాట.' 'నన్నును' 'అను నప్పుడు' పతియెడ నే స్త్రీయును చేయని మహాపరాధ మొనర్చిన పాపాత్మురాలను గూడ' అని వ్యంగ్యము.

వ్యా. వి. :—తలిరు + ఈటెలు - సూ. కర్మధారయంబునందుఁ బేరాది శబ్దముల యుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. బాల. సంధి. 29 చే. 'తలిరు టీటెలు, తలిరీటెలు'అగును. నెఱ+తలిరులు - సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు (ప్రాంతాది సంధికార్యములు) కొండొకచోఁ గానంబడియెడి. బాల. సంధి. 39. చే. నెఱశబ్దములోని తొలియచ్చు మీఁది వర్ణంబులకు లోపమును, మీఁది హల్లునకు ద్విత్వంబును గా 'నెత్తలిరులు'అయ్యెను. నెఱయు, పఱచు, నుఱియు, విఱుగు ధాతువులకుఁ బ్రేరణార్థమున వచ్చిన చుగాగమ సహిత రూపములు - నెఱచు, పఱచు, నుఱుచు విఱుచు, అనునవి.

చ. అని విరహంబు పేరలఁత కాశ్రిత చంద్ర శిలాతలంబు మీఁ
ద నొరగుచున్ సఖిం దిగిచెఁ దన్వి శిరోదిశకై తదంకముం
దనకుఁ దలాడగాఁ గొనఁగఁ, దద్‌జ్ఞత బోటియుఁ దత్క్రియా ప్రవ
ర్తనకుఁ దదీశుఁ డాకొలిపికేతాఁ దనయింటికిఁ బోయె నవ్వుచున్. 175

అర్థము:—అని, విరహంబు = ఎడబాటు వలనఁ గలిగిన, పేరు + అలఁతన్ = పెద్ద యాయాసము చేత, ఆశ్రిత ... మీఁదన్ - ఆశ్రిత = ఆశ్రయింపఁబడిన, 'అంతకు ముస్సు తా నాధారముగాఁ జేసికొని కూర్చున్న' అని భావము - చంద్రశిలా తలంబు మీఁదన్ = చంద్రకాంతమణి ప్రదేశము పైని, ఒరగుచున్ = వ్రాలుచు, తన్వి = ఆప్రభావతి, తదంకమున్ = ఆరాగవల్లరి యొక్కతొడను, తలాడగాన్ = ఉపధానముగా, కొనఁగన్ = చేసికొనుటకై, సఖిన్ = రాగవల్లరిని, శిరోదిశకై =

తలదెసకు, తిగిచెన్ = లాగెను, ఆకర్షించెను, బోటియును = చెలికత్తెయు, తద్‌జ్ఞతన్ = ఆయమయమునకుఁ దగినకార్యము నెఱిఁగిన దగుటచేత, తదీశున్ = ఆ ప్రభావతికి మగఁడగు ప్రద్యుమ్నుని, తత్ ... వర్తనమున్ - తత్ర్కియా=ఆపనియందు, ప్రవర్తనమున్=ప్రవర్తించుటకు, తొడను తలగడగా నుంచుటకు, దాకొలిపి = (దాపు + కొలిపి) చేర్చి, తాన్, నవ్వుచున్, తనయింటికిన్, పోయెన్.

తాత్పర్యము:—అని విరహాయాసముచేఁ దాను గూర్చుండిన చంద్రకాంతశిల మీఁద నొరగుచు నా ప్రభావతి తనకుఁ జెలికత్తె తొడను తలగడగఁ జేసికొన నాశించి తనతలవైపునకు లాగెను. ఆచెలియయు తలవైపునకు వచ్చి యప్పటి కుచిత మగుట యెఱింగినది కావున నాపనికై ప్రద్యుమ్నుని దగ్గఱగాఁ జేర్చి నవ్వుచుఁ దనయింటికిఁ బోయెను.

అలం. :—యుక్తి. 'యుక్తిః, పరాతిసంధానం క్రియయా మర్మగుప్తయే' అని చంద్రాలోకము. ('నర్మగోపనమునకునై కర్మచతురతను బరుల వంచనము సేఁత తనరు యుక్తి')

గీ. ప్రాణసఖి యిట్లు పన్నినకపన్నుగడలు, తెలియమింజేసి యపుడు దైతేయకన్య
తనకు నంకోపధాన మట్లనువుపఱచి, యాలతాంగియ యున్నది యను తలఁపున.

అర్థము:—అపుడు, దైతేయకన్య = రాక్షసుఁడగు వజ్రనాభుని కూఁతురు, ప్రభావతి, ప్రాణసఖి= ప్రాణసమురాలగు చెలికత్తె (రాగవల్లరి), పన్నినపన్నుగడలు = కూర్చిన (కపటపు) ఏర్పాటులు, తెలియ మింజేసి=తెలియక పోవుటచేత, తనకున్, అంక+ఉపధానము=(పతియొక్క) తొడయనెడి తలగడను, అట్లు, అనువుపఱచి = సమకూర్చి, ఆ లతాంగియ=లతవంటి యవయవములు గలది యగు ఆ చెలికత్తెయే, ఉన్నది, అను తలంపునన్ = అనెడి భావముతో, పైపద్యములో నన్వయము.

ఉ. ప్రాణసఖీ నినున్ నెరయఁబాసి చనన్ దఱి వచ్చె నాకుఁ గ
ల్యాణి! తలంపుమీ సుసమయంబుల నన్నని ప్రేమపెంపునన్
బాణి మెడం దగిల్చి తనపైకిఁ దదాస్యము వంపఁ బూని సు
శ్రోణి నిజేశుమో మగుట చూచి త్రపాద్భుతమోదమగ్నతన్. 177

అర్థము:—ప్రాణసఖీ =ప్రాణముతో సాటియగు చెలియా (మధ్యమపదలోప సమాసము) నినున్, నెరయన్ + పాసి పూర్తిగావిడిచి, చనన్ = పోవుటకు, చచ్చిపోవుటకు అని భావము, నాకున్, తఱి = కాలము, వచ్చెన్ = వచ్చినది, కళ్యాణి = శుభాస్పదమైనదానా! సుసమయంబులన్ = మంచి వేళలయందు, నన్నున్, తలంపుమీ = స్మరింపుమా, అని, ప్రేమపెంపునన్ = ప్రేమాతిశయముచేత - ఎక్కువ ప్రేమచే అని భావము, పాణిన్ = తనచేతిని, మెడన్ = (ప్రద్యుమ్నుని) మెడయందు, తగిల్చి = తగిలించి, తదాస్యము = వాని ముఖమును, వంపన్ = వంచుటకు, పూని = ఉద్యమించి, సుశ్రోణి = ప్రభావతి (మంచిపిఱుఁదులు గలది.) నిజేశుమోము = తనపతియొక్క ముఖము, అగుట, చూచి, త్రపా... మగ్నతన్ - త్రపా=సిగ్గునందును, అద్భుత=ఆశ్చర్యమందును, మోద=సంతసమందును, మగ్నతన్ =మునిఁగిన దాటచేత - పైపద్యముతో నన్వయము.

[illegible]యము:—చెలియా! నినుఁ బూర్తిగా విడిచి పోవు కాలము నాకు వచ్చినది. కల్యాణి ! మంచి వేళలందు నన్నుఁ దలఁచుచుండుమా యని తాను మరణోద్యుక్త యైనట్లు పలుకుచు, ప్రేమాతిశయముచే చెలికత్తె మెడయనుకొని, తనచేతిని భర్తమెడయందుఁ దగిలించి, తనమీఁది కాతనిమోమును వంపఁబోయి, పతిముఖమగుట చూచి, సిగ్గును, ఆశ్చర్యమును, సంతసమును దన్ను ముంచివేయఁగా.

అలం.—స్వభావోక్తి.

క. ఒక్కింతతడవు చేష్టలు,దక్కి కనంబడియెఁ జిత్రగతతనువును బోలెన్,
మిక్కిలి కమనీయత సతి,దక్క కురు స్తంభ సంగతత్వము కతనన్. 178

అర్థము:—సతి = ఆ ప్రభావతి, తక్కక = విడువక, ఉరు...తత్వముకతనన్ - ఉరు = అధికమగు స్తంభ = ప్రమాన్పాటుతో, సంగతత్వము కతనన్ = కలసికొనిన కారణముచేత, ఒక్కింత తడవు = కొంచెముసేపు, చేష్టలు = ఇంద్రియ వ్యాపారములు, తక్కి = ఉడిగి, మిక్కిలికమనీయతన్ = అధికమగు సొగసుచే, చిత్రతనువుంబోలెన్ = చిత్తరువునందలి శరీరమువలె (పటమందలి బొమ్మవలె ననిభావము) కనంబడియెన్ = కనిపించెను. అలం. :—ఉపమ.

వ. అప్పుడు ప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డిట్లనియె. (స్పష్టము) 179

చ. వెఱఁగుపడంగ నేల యలివేణి భవత్పతిఁ గానె యేను నీ
విరసత మాన్పలే కపుడు వీఁగుచు నంతటిలోఁ బ్రయోజనాం
తరమతి నేఁగి, నేఁటికిని దాని ప్రసంగము లేమి వచ్చితిన్
దిరిగి వసించితిన్ వెనుక దిక్కున నీవిధ మెల్లఁ జూచుచున్. 180

అర్థము:—అలివేణి = తుమ్మెదల (చాలు) వంటి జడగలదానా! ప్రభావతీ, వెఱఁగు పడంగన్ = అచ్చెరు వొందుట, ఏల = ఎందుచేత - ఏను = నేను, భవత్పతిన్ = నీపెనిమిటిని, కానె - (కాను+ఎ), అపుడు = ఆసమయమున, నీవిరసతన్ = నీవైరస్యమును, కోపము నని భావము, మాన్పలేక = తీర్పఁజాలక, వీఁగుచున్ = చలించుచు (వేఁగుచున్ = బాధనొందుచు, అని పాఠాంతరము ఇదియే సమంజసముగాఁ దోఁచుచున్నది.) అంతటిలోన్ = ఆనడుమ. ప్రయోజనాంతరమతిన్ = మఱొక కార్యమందలి తలంపుచేత, అనఁగా మఱొకముఖ్యకార్యము జ్ఞప్తికిరాఁగా, ఏఁగి = వెళ్లి, దాని ప్రసంగము = ఆముఖ్య కార్యము యొక్క ప్రస్తావన, నేఁటికిని = ఈదినమువఱకు, లేమిన్ = లేకపోవుటచేత, తిరిగి, వచ్చితిన్, (అట్లు వెంటనే వచ్చి) నీవిధము+ఎల్లన్=నీవైఖరి నంతను, చూచుచున్, వెనుకదిక్కునన్=నీవెనుకవైపున, వసించితిన్ = నిలిచియుంటిని.

తాత్పర్యము:—ఓకాంతా! అట్లచ్చెరుపడెద వేల? నేను నీప్రియుఁడనే కాదా? మనసు కలఁత నొంది నీ కప్పుడు కలిగినకోపము దీర్పలేక కలఁగుచుండఁగా వేఱొకముఖ్యకార్యము జ్ఞప్తికి వచ్చి, వెడలి పోయి, ఈనాఁటికిని నాకార్యప్రసంగము లేకుంటచే వెంటనే తిరిగి వచ్చితిని. వచ్చి వియోగదశ నేవేవో పలుకుచున్న నీవైఖరి నంతయుఁ జూచుచు నీవెనుకవైపుననే యున్నాను.

చ. అని యిరుగేలఁ గ్రిందటిగ నాసతి బాహులు పట్టి యెత్తి వె
న్వెనుకకు రా వెసన్ దిగిచి వేడుక నంకకృతోపవేశఁ జే
సి నెఱులు దువ్వెఁ, జెక్కిటను జెక్కిలి చేర్చెను, మోవి చుంబనం
బొనరిచెఁ, జన్ను లంటెఁ, గర యుగ్మము ప్రక్కలఁ బాఱఁజొన్పుచున్. 181

అర్థము:—అని = ఇట్లు పలుకుచు, క్రిందటిగన్ = క్రిందగునట్లు, ఇరుగేలన్ = తనరెండు చేతులచేతను, ఆసతిబాహులు=ఆ ప్రభావతియొక్క రెండుభుజములను, పట్టి = పట్టుకొని, ఎత్తుచున్ =లేవనెత్తుచు, వెన్వెనుకకున్ = (ఆమెయొక్క) వెనుక వెనుకకు - రాన్ = వచ్చునట్లు, తనతోడదగ్గఱకు వచ్చునట్లుగా అనిభావము - వెసన్ = వేగముగా, తిగిచి= లాగుకొని, వేడుకన్ = ఉత్కంఠతో, అంక+కృత +

ఉపవేశన్ = తొడయందుఁ గూర్చున్నదానినిగా (తొడయందుఁ జేయఁబడిన కూర్చుండుట గలది యని శబ్దార్థము.) చేసెన్, నెఱులు = ముంగురులను, దువ్వెన్, చెక్కిటను = ఆమెచెక్కునందు, చెక్కిలిన్ = తనచెక్కును, చేర్చెను, మోవి = అధరమును, చుంబనంబు + ఒనరించెన్ = ముద్దిడుకొనెను, కర యుగ్మము = తనచేతులజంట - రెండుచేతులను, ప్రక్కలన్ = ఆమె రెండుపార్శ్వములందుండి, ప్రాఁకన్ + చొన్పుచున్ = బాగుగా ప్రసరించునట్లు చొప్పించుచు, చన్నులు, అంటెన్ = తాఁకెను, స్పృశించెను.

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁడు తనతొడపైఁ దల నిడి మెడకు రెండుచేతులను దవిలించి నివ్వెఱ పడియున్న ప్రభావతిని వెనువెనుకకు లాగి తొడపైఁగూర్చుండఁబెట్టుకొను వ్యాపారము నిందుఁ గవి చెప్పుచున్నాఁడు. అనిపలుకుచు ప్రద్యుమ్నుఁడు తనరెండుచేతులను నామెబాహులక్రిందికి పోనిచ్చి పట్టుకొని పరుండియున్న ప్రభావతిని లేవ నెత్తి, వెనుకవెనుక కామె వచ్చునట్లుగా తనదగ్గఱకు లాగుకొని, తొడపైకూర్చుండబెట్టుకొని, వేడుకచే ముంగురులు దువ్వెను. ఆమెచెక్కుపై తనచెక్కు చేర్చెను. అధరము ముద్దిడుకొనెను. ఆమె కిరుప్రక్కలనుండి తనచేతులను జొన్పి కుచములు స్పృశించెను.

అలం. :—స్వభావోక్తి.

'ఇరుకేలన్, ఇరుఁగేలన్' అని వేర్వేఱుపాఠము లగపడుచున్నవి. కాని 'యిరుగేలు' అనుటయే లెస్స. ఇట్టికర్మధారయ (ద్విగు)సమాసములందు గసడదవాదేశము ప్రాచీనకవులప్రయోగములందు గనఁబడు టయు 'ఇరుంగేలు' వంటి ప్రయోగములు కనఁబడమిచేతను 'ఇరుగేలు' అని గ్రహింపఁబడినది.

మ. సుముఖీ యెన్నఁడు నింక నల్గ నను మంచుచున్ నొక్కి పట్టెన్ నఖా
గ్రములన్ దంతశిఖన్ గుచాధరము లా కాంతుండు, తత్కాంతయున్
సుముఖా యెన్నఁడు నల్గఁజేయ నను మంచుచున్ మోవి తా నట్ల నొ
క్కి మనోనాథు వరిష్ఠనిష్ఠురకుచక్లిష్టాంగుఁ జేసెన్ దుదిన్. 182

అర్థము:—ఆ కాంతుండు = మనోహరుఁ డగు నాప్రద్యుమ్నుఁడు, సుముఖీ = శుభకరమగు మొగముగలదానా, కాంతా, ఇంకన్, ఎన్నఁడున్ = ఇఁక నెప్పుడును, అల్గను కోపింపను, అనుము, అంచున్. నఖాగ్రములన్ = గోళ్లకొనలచేతను, దంతశిఖన్ = పలుకొనలచేతను, (శిఖన్ జాత్యేకవచము) వరుసగా - కుచాధరములు = స్తనములను, క్రిందిపెదవిని, - గోళ్లకొనలచేత స్తనములను, పలుకొనలచేత నధరమును - అని భావము. నొక్కి = గ్రుచ్చి, పట్టెన్ = పట్టుకొనెను, తత్కాంతయున్ = సుందరి యగు నాప్రభావతిగూడ, సుముఖా = శుభకరమగు మొగము గలవాఁడా - లేక పండితుఁడా! ఎన్నఁడును, అల్గఁ జేయను = (నిన్ను) కోపింపఁజేయను, అనుము; అంచున్; తాను, అట్లు + అ = మగఁడు నొక్కిపట్టి నట్లే, మోవి = (ప్రియుని) క్రిందపెదవిని, నొక్కి, తుదన్ = తుదను, మనోనాథున్ = హృదయేశ్వరుని (మగనిని), వరిష్ఠ ... ష్టాంగున్ - వరిష్ఠ = మిగులగొప్పవియును, నిష్ఠుర = కఠినములు నగు, కుచ = స్తనములచేత, క్లిష్ట = పీడింపఁబడిన, (క్లిశవిబాధనే - చురాది) అంగున్ = దేహముకలవానినిగా, చేసెన్ = చేసెను.

తాత్పర్యము:—ఆ ప్రద్యుమ్నుఁడు సుముఖీ! యెన్నఁడునింక 'నలుగను' అనుమనుచు కొనగోళ్లతో స్తనములను, పలుమొనలచే నధరమును నొక్కి పట్టుకొనెను. ప్రభావతి సుముఖా! ఎన్నడును 'నిన్నుఁ గోపింపఁజేయను' అను మనుచు - తానుగూడ దంతాగ్రములచేత ప్రియునిమోవి నొక్కి, తుదకు తనకఠిన ములు నున్నతములు నగుకుచములచే ప్రియునిదేహమును నలిగిపోవఁ జేసెను. దృఢాలింగన మొనర్చుకొనెను అని భావము. అలం. :—యథాసంఖ్యము, స్వభావోక్తి.

వి. :—ఇందలి నాయికానాయకుల వ్యాపారము వారిరువుర హృదయమునఁ గల యుత్కంఠాతిశయమునకు వ్యంజకములు. ఆ యిరువురిలోను నాయిక యుత్కంఠ మిక్కిలి హెచ్చు అనుటకు నాయకుఁడు కుచక్లిష్టాంగుఁడనని వ్యంజక మగుచున్నది. ఇందలి సుముఖీసుముఖ శబ్దములకుఁ గేవలము చక్కని మొగము గల స్త్రీపురుషులు అనుమాత్రమే యర్థముకాదు. శాస్త్రము తెలిసినవారు. అనఁగా పండితులనియు ధ్వని కలదు. కళాపూర్ణోదయమున 'సుముఖాసత్తి' నామనిర్వచనమునందు 'సుముఖులన శాస్త్రవిదులు - నిత్యమును వత్సలాసక్తిన గలిగి యే మెలఁగుచునికి, నా కపుడు సుముఖాసత్తి నామ మొదవె' అని 4. 148 లో ఏతత్కవిప్రయుక్తమై యుండుట యిందుల కుపష్టంభకము గావచ్చును.

చ. అలుక యొకింతకాలము మహోత్తరసేతువురీతి నాఁగి భే
దిలి తొలఁగన్ సహస్రముఖ తీవ్రత చూపెను దొంటికంటె వా
రల యసమాన మానిత పరస్పర కేళిరసప్రవాహ మ
గ్గలికఁ దదుత్తరంగరతి కర్మవిచిత్రతఁ జెప్ప శక్యమే. 183

అర్థము:—అలుక = కోపము, మహత్తరసేతువురీతిన్ = మిగులగొప్పదియగు నడ్డకట్టవలె, ఆఁగి =, (కేళియందలి యనురాగ మను ప్రవాహమును) ఆఁపి, భేదిలి = పగిలిపోయి, తెగిపోయి, తొలఁగన్ = తొట్టుకొనిపోవఁగా, (కేళియందలిప్రీతి నడ్డగించిన ప్రణయకోపము పైవిధమున పోవఁగా - అనిభావము.) వారల...ప్రవాహము - వారల = ఆదంపతులయొక్క, అసమాన = సాటిలేనట్టియు, మానిత = పూజింపఁబడినట్టి, పరస్పర = ఒండొరులయొక్క, కేళిరస = క్రీడయందలియనురాగమనెడి, ప్రవాహము = వెల్లువ, తొంటికంటెన్ = మునుపటికంటె, సహస్రముఖతీవ్రతన్ = వేయిముఖములచేత నైన వేగాతిశయమును, చూపెను = ప్రకటించెను, అగ్గలికన్ = ఉత్సాహముచేతను, తదుత్తరంగ...చిత్రతన్ - తత్ = ఆ యనురాగప్రవాహమునందు, ఉత్తరంగ = మీఁదికిలేచినకెరటములుగల (అనఁగా ఉప్పొంగిన), రతి = సంభోగమందలి, కర్మ = వ్యాపారములయొక్క, విచిత్రతన్ = వైచిత్ర్యమును, వింతను, చెప్పన్ = చెప్పుటకు, శక్యమే = సాధ్యమా? కాదనిభావము.

తాత్పర్యము:—పెద్దప్రవాహమున కడ్డముగా వేసినగట్టు తెగిపోయినపు డాప్రవాహము వేయిముఖముల మహావేగముతోఁ బెద్దపెద్ద తరంగములతో నడ్డము లేకుండ నెట్లు ప్రవహించునో యట్లే యాదంపతుల కిరువురకుఁ గలక్రీడయందలియనురాగము ప్రణయకోపముచే నాఁపఁబడి, యిప్పు డాకోపము పోవుటచేత క్రీడానురాగము పట్టశక్యముగాక పొంగి తరంగములవలె విజృంభించుచున్నచేష్టల వైచిత్రిచేత చెప్ప నలవికాకుండెను.

అలం. :—ఉపమానుప్రాణిత, రూపకము.

వి. :—రతియందలి వారిచేష్టావిశేషములు 'ఉత్తరంగములు' అయిన వనుటచే - తరంగము క్రిందికి వ్రాలి మీఁదికి లేచుచుండునట్లు ఒకమాఱు కొంచెముతగ్గుచు మరల విజృంభించుచు వారి సంభోగమందలి చుంబన నఖ దంతక్షతాది చేష్టావిశేషములు సాగె నన్న మాట.

వ. ఇవ్విధంబునఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం గూడి బహుకాలంబు యథేష్టభోగంబు లనుభవించుచు నప్పటప్పటికి వజ్రనాభుని నపూర్వనర్తనప్రవర్తనంబుల వశవర్తిం జేసికొనుచుఁ బ్రవర్తిల్లె. గదసాంబులును జంద్రవతీగుణవతులతోడం గూడి రాత్రు లెల్ల రమించుచు నాట్యసమయంబులఁ బ్రద్యుమ్ననకు విదూషక పారిపార్శ్వ కాది కృత్యంబుల సహాయత్వంబు నడపుచు దైత్యవిభుని చిత్తంబు వడసి రంత. 184

అర్థము:—బహుకాలంబు = చాలకాలము, (ని. ప్రభూతం ప్రచురం ప్రాజ్య మదభ్రం బహుళం బహు అని అమరము.) యథా + ఇష్ట + భోగంబులు - యథేష్ట = ఇష్టానుసారములైన. భోగంబులు = సుఖములను, అప్పటప్పటికిన్ = నానాఁటికి, అపూర్వ...వర్తనంబులన్ - అపూర్వ = పూర్వమువికాని - క్రొత్తవగు, వర్తన = నాట్యములయొక్క, ప్రవర్తనంబులన్ = ప్రయోగములచేత - ఇంతకు మున్ను చూపిన రీతిగాక యేదినమున కాదినమే క్రొత్తరీతి నాట్యమును ప్రదర్శించుచు అనిభావము. వశవర్తి = తనువశమం దుండువానిని, లోఁగినవానిని, రమియించుచున్ = క్రీడించుచు, విదూషకపారిపార్శ్వకాదికృత్యంబులన్ = విదూషకుఁడు, పారిపార్శ్వకుడు మున్నగుపాత్రల ధరియించి నటించువ్యాపారములందు, సహాయత్వంబు = తోడ్పాటు, సాహాయ్యము - అంతన్ = ఆసమయమున.

చ. రమణ దలిర్పఁగా ఋతువురాకలు దక్కెఁ, నొడళ్లు చిక్కెఁ, జి
ట్టుము లుదయించె, వేవిళులు లగ్నూనత మించెఁ, గపోలసీమఁ బాం
డిమ గనుపట్టెఁ, జన్మొనల నీలిమ పుట్టె, వలగ్నముం గురు
త్వము పొరసెన్, వళుల్ విరిసె దానవకన్యలకున్ క్రమంబునన్. 185

అర్థము:—రమణ = ప్రీతి. దలిర్పఁగాన్ = ఎక్కువగునట్లు. దానవకన్యలకున్ = ప్రభావతికిని, చంద్రవతికిని, గుణవతికిని (ముగ్గురకును) క్రమంబునన్ = వరుసగా - ఋతువురాకలు = రజోదర్శనములు, అంటుసెలలు, తక్కెన్ = ఉడిగెను, ఒడళ్లు = దేహములు, చిక్కెన్ = కృశించెను, చిఱు + ఊములు = చిన్నయుమ్ములు - గర్భిణులకరుచిచే నోటినుండి వచ్చునీళ్లు, అన్నమాట - ఉదయించెన్ = కలిగెను, వేవిళులు = వేఱు వేఱు పదార్థములను దినవలె ననుకోరికలు, అగ్లానతన్ = అత్యధిక ముగా, మించెన్ = కలిగెను, కపోలసీమన్ = చెక్కిళ్లయొక్క ప్రదేశములందు, పాండిమ = తెల్లఁదనము, కనుపట్టెన్ = కనఁబడెను, చను + మొనలన్ = చూచుకములందు, నీలిమ = నల్లఁదనము. పుట్టెన్, కల్గెను, వలగ్నమున్ = నడుమును, గురుత్వము = గొప్పఁదనమును, పొరసెన్ = పొందెను, వళుల్ = పొట్టపైనుండు ముడుతలు, విరిసెన్ = తొలఁగిపోయెను. ఈ లక్షణము లన్నియు గర్భిణులకు సర్వసాధారణము.

వ్యా. వి. :—చిట్టుములు - చిఱు + ఊములు అని చిన్నయసూరిమతము. చిట్టి + ఊములు = అని ప్రౌఢవ్యాకర్త మతము. సూరి. సూ. కుఱు, చిఱు, కడు, నడు, నిడు, శబ్దముల ఱడల కచ్చు పరంబగునపుడు ద్విరుక్తటకారం బగునని చెప్పుటచే చిట్టు + ఊములు = చిట్టుములు అగును, చిట్టిశబ్దము వేఱుగా నుండుటచేత 'చిట్టడవి చిట్టి' యని ప్రౌఢవ్యాకర్త - చిట్టాముద మిత్యాదుల కిది యుపలక్షణం బనినాఁడు. అట్లయిన సూరిమతమున 'చిట్టి' శబ్ద మెట్లు సాధువగు నని శంక గలుగవచ్చును. ఆయన యాంధ్రశబ్దానుశాసనమున సూ. చిన్నాదుల కిత్వంబు మంజిమాదిబోధకంబు - అను సూత్రముచే చిన్నాదులకు విధించిన ఇకారము - చిన్న + ఇ - చిన్ని (వెన్నెల) పిన్న + ఇ = పిన్ని (పినతల్లి) పెద్ద + ఇ = పెద్ది (పెదతల్లి) మున్నగు వానివలెనే 'చిఱు' శబ్దమునకు మంజిమాద్యర్థబోధకముగా ఇకారము పరముకాఁగా - బాల వ్యాకరణ సూత్రముచే ఱకారమునకు ద్విరుక్తటకార మాదేశమై - చిట్టు + ఇ - అనియై, ఉత్వసంధిచే 'చిట్టి' అని యగుచున్నది. కావున సూరి 'చిట్టి' శబ్దమును గూర్చి వేఱుగాఁ జెప్ప నావశ్యకత లేకపోయినది. పాండిమ, నీలిమ, సూ. ఆత్మేమనిజంతంబులకు నాంతంబులగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు. బాల. తత్సమ. 77. చే. ఇమనిచ్ ప్రత్యయాంతములగు నీరెండు శబ్దములు స్త్రీత్వంబు నొందినరూప ములు. బహుళము గాన పాండిమము, నీలిమము అనురూపములును గల్గును.

క. నవమాసానంతరమునఁ, బ్రవిమల శుభదినమునం బ్రభావతి గాంచెన్
శివ గుహునిఁ గాంచు కైవడి, నవనిఁ బ్రభావంతుఁ డనఁగనమరెడు తనయున్,

అర్థము:—ప్రభావతి, నవమాస + అనంతరమునన్ = తొమ్మిదినెలల తరువాత, అనఁగా తొమ్మిది నెలలు నిండి పదియవ నెల రాఁగానే, ప్రవిమల శుభదినమునన్ = స్వచ్ఛమై, మంగళప్రదమగు దినమందు, శివ = పార్వతి, గుహునిన్ = కుమారస్వామిని, కాంచుకైవడిన్ = కనినవిధమున, అవనిన్ = భూమియందు, ప్రభావంతుఁడు, అనఁగన్ = అనుపేరితో, అనురెడు = ప్రసిద్ధికెక్కినట్టి, తనయున్ = కొడుకును, కాంచెన్ = కనెను (ప్రసవించెను).

తాత్పర్యము:—పార్వతీదేవి కుమారస్వామిని గన్నరీతిని దోషరహితమైన శుభదినమునఁ బ్రభావతి ప్రభావంతుఁ డని భూలోకమున ప్రసిద్ధి నొందఁగల పుత్రుని కనెను.

అలం. :—ఉపమ.

క. ప్రణుతగుణ చంద్రవతి దిన,మణినిభుఁ జంద్రప్రభుం గుమారునిఁ గాంచెన్
గుణవతియుఁ గాంచె నిరువుర, గుణవంతుం గీర్తిమంతుఁ గొడుకులు పొదలన్.

అర్థము:—ప్రణుతగుణ = కొనియాడఁబడిన గుణములుగలది యగు, చంద్రవతి, దినమణినిభున్ = సూర్యునితో సముఁ డగు, చంద్రప్రభుం = చంద్రప్రభుఁ డనుపేరుగల, కుమారునిన్ = కొడుకును, కాంచెన్ = కనెను, గుణవతియున్, గుణవంతున్, కీర్తిమంతున్ = గుణవంతుఁడు కీర్తిమంతుఁడు అను పేళ్లుగల, ఇరువురన్ = ఇద్దఱు కొడుకులను, కాంచెన్ = కనెను.

తాత్పర్యము:—చంద్రవతి 'చంద్రప్రభుఁ'డను కొడుకును, గుణవతి 'గుణవంతుఁడు, కీర్తిమంతుఁడు' అను నిద్దఱుకొడుకులను కనిరి.

వ. ఇట్లు గాంచినకుమారు లుదయించుచుం, దోడన పరిపూర్ణయౌవనులును సకలవేద వేదాంగ పారగులును ధనుర్విద్యా సంపన్నులు నగుచుం గన్యాంతఃపురంబునఁ బ్రవర్తిల్లుచున్నంత నొక్కనాఁడు తద్రక్షణాధికారులవలన వారల యునికి నిశ్చితంబుగా విని వజ్రనాభుం డాగ్రహోదగ్రుం డగుచుం దనసభాసదులఁ గలయం గనుంగొని.

అర్థము:—ఇట్లు, ఉదయించుచున్ = పుట్టుచు, తోడన్ + అ = వెంటనె (పుట్టినవెంటనే అని భావము) పరిపూర్ణయౌవనులును = నిండు జవ్వనము గలవారును, సకల...పారగులును - సకలవేద = అన్ని వేదములకును, వేదాంగ = వేదమున కంగములగు శిక్షాదులకును, పారగులును = కడముట్టినవారును - నాల్గు వేదములును ఆఱువేదాంగములును పూర్ణముగా నేర్చినవారును అని భావము. ధనుర్విద్యాసంపన్నులును= విలువిద్యచే నిండినవారును, కన్యాంతఃపురంబునన్ = రాచకన్నెలగు ప్రభావతి మొదలగువా రుండెడు నంతిపురమున, ప్రవర్తిల్లుచున్ = సంచరించుచు, ఉన్నంతన్ = ఉండుసమయమున, తద్రక్షణాధికారులవలనన్ = ఆకన్యాంతఃపురముల రక్షించుటయందు (నియమింపఁబడిన) యుద్యోగులవలన, వారల యునికి = ఆబాలు రుండుట, నిశ్చితంబుగాన్ = నిశ్చయింపఁబడినదిగా, విని, ఆగ్రహోదగ్రుఁడు - ఆగ్రహ = కోపముచే, ఉదగ్రుఁడు = భయంకరుఁడు.

వి. :—ఋగ్యజుస్సామాథర్వణము లని వేదములు నాలుగు. శిక్షావ్యాకరణచ్ఛందో నిరుక్తజ్యోతిష కల్పములని వేదాంగము లాఱు.

ఉ. కంటిరె కాలవక్రత ప్రకారము దానవముఖ్యులార ! నా
యింటికి ద్రోహముం దలంచి ✽ యిష్ట సుఖాప్తికి ముచ్చు లిట్లు నూ
ల్కొంట దలంప శేషఫణి ✽ కోఱల ప్రేలిడి గోఁకు కోఁగ, ము
క్కంటి వెలుంగుకంటఁ జణకంబులు వేఁచుకొనంగఁ బూనరే. 189

అర్థము:—దానవముఖ్యులార=రాక్షసులలో శ్రేష్ఠులారా ! కాల...రము-కాల=కాలముయొక్క, వక్రత=వంకరయొక్క, ప్రకారము = విధము, నిదానముగా నడచుచున్న కాలమునఁ గలిగిన వంకరవిధము, కాలముమార్పు-అని భావము. కంటిరె=చూచితిరా ? ముచ్చులు=దొంగలు, నాయింటికిన్=నాకుటుంబమునకు, ద్రోహమున్=చెఱుపును, తలఁచి (చేయ)నెంచి, ఇట్లు = ఈ విధముగా, ఇష్టసుఖాప్తికిన్=కోరఁబడిన సుఖమును పొందుటకు, నూల్కొంట=పూనుకొనుట, తలంపన్=ఆలోచింపఁగా, శేషఫణికోఱలన్=శేషాహియొక్క (విషపూరితమగు) కోఱలయందు, ప్రేలు+ఇడి = ప్రేలుంచి, గోఁకుకోఁగన్ = (ప్రేలిని) గోఁకుకొనుటకును, ముక్కంటి = త్రినేత్రుఁడగు శివునియొక్క, వెలుంగుకంటన్ = అగ్ని నేత్రమునందు, చణకంబులు = సెనగలను, వేఁచుకొనంగన్ = వేఁచుకొనుటకును, పూనరే = యత్నింపరా ? యత్నింతురని భావము.

తాత్పర్యము:—రాక్షసోత్తములారా ! కాల మెట్లు మాఱినదో చూచితిరా ? దొంగలు నాయింటికే హాని చేయనెంచి, ఈ విధముగా ఇష్టమగు సుఖమును బొందఁ బూనిరి. ఇది యాలోచింప నాదొంగలు గోఁకుకొన శేషాహికోఱలయందు ప్రేలుంప యత్నింపరా ? శివుని యగ్నిమయమగు మూఁడవకంటియందు సెనగలను వేఁచుకొన యత్నింపరా ? వారికిఁ గలుగు హానిని దలఁపక యెంతటి సాహసమొనర్చినారో చూచితిరా అని భావము.

అలం:—నిదర్శనము.

వి. :—నాయింటికిన్ - అను దానియందలి 'నేను' అనఁగా మూఁడు లోకములను శిక్షించి వశము చేసికొనిన 'నేను' అని వ్యంగ్యము. 'ఇంటికి' అనఁగా గృహమున కని కాదు. ఇంటఁగలవారికి, అనులక్షణచే, ఇంటనున్న యెల్లరకుఁగాక, తనకుటుంబమున కాధారభూత లగుకూఁతులకు అని మఱొకవ్యంగ్యము. 'ఇట్లు' అనఁగా - తన కూతులయందు సంతతి గనునంతకాలము స్వేష్టముగ క్రీడించుట అని యింకొక వ్యంగ్యము.

గీ. వాండ్రు సురవంశభవు లైన ✽ స్వర్గమునకుఁ బ్రళయసమయమిప్పుడు, నాగ ✽ కులజులైన
నాశకాలంబు తద్భువ ✽ నమున కిదియ, నరులైన నంత్యదశ నేఁడ ✽ ధరణికెల్ల 190

అర్థము:—వాండ్రు = ఆ ముచ్చులు, సురవంశభవులు = దేవవంశములందుఁ బుట్టినవారు, ఐనన్=అయినయెడల, ఇప్పుడు = ఈసమయము, స్వర్గమునకున్, ప్రళయకాలము = నాశనకాలము - నేఁడే స్వర్గమునందలి యెల్లరను నాశన మొనర్తు నని భావము, నాగకులజులు = సర్పకులములందుఁ బుట్టినవారు, ఐనన్ = అయినయెడల, తద్భువనమునకున్=ఆ సర్పములయొక్క జగమునకు-పాతాళలోకమునకు, ఇదియ= ఈ సమయమే, నాశకాలంబు, నరులు = మనుజులు, ఐనన్, నేఁడు+అ = ఈదినమే, ధరణికిన్+ఎల్లన్= భూలోకమున కంతకును, అంత్యదశ = తుది యవస్థ - అనఁగా నాశనము.

అలం:—నిదర్శనము, అతిశయోక్తి.

గీ. ప్రాణములతోడ నిట వాండ్రఁ ✽ బట్టి తెచ్చి, తెలిసి తల్లోకమును గడ ✽ తేర్పవలయు
నీవు చని పట్టి తెమ్మని ✽ నిజపురంబు, పెద్దతలవరిఁ దాఁ బంచె ✽ భీమబలుని. 119

అర్థము:—చాంద్రడన్ = ఆదొంగలను, ప్రాణములతోడన్, పట్టి = పట్టుకొని, తెచ్చి, తెలిసి = వారేలోకులువారో తెలిసికొని, తత్+లోకమును = ఆలోకమును, కడతేర్పవలయున్ = నశింపజేయవలెను - (కొన) నీవు, చని, పట్టితెమ్ము, అని, భీమబలుని = భయంకరమగు బలము గలవాఁడగు, నిజపురంబు పెద్దతలవరిన్ = తనపట్టణము కాచుచుండు తలారుల నాయకుని, తాన్ = తాను, పంచెన్=ఆజ్ఞాపించెను.

వి. :—తలవరి, తలారి. గ్రామములందు దొంగతనములు మున్నగునవి జరుగకుండ రాత్రులందు గస్తు తిరుగుచుండు రక్షకుఁడు.

గీ. వాఁడు చని తిరుగక యున్న ♦ వరుస దండ, నాయకోత్తములను దళవాయిఁ బనిచె
వారు దిరుగ కుండినఁ దదవస్థఁ దెలిపె, నరులు కోటకొమ్మలఁ గట్టి ♦ నట్టితలలు.

అర్థము:—వాఁడు = ఆపెద్దతలవరి, చని, తిరుగకయున్నన్=మరలి రాకుండుట చేత, (మడియుట చేత) వరుసన్ = ఒకరివెంటనొకరుగా, దండనాయక + ఉత్తములను = అపరాధికి శిక్ష విధించెడి యధికారులలో శ్రేష్ఠులను, దళవాయిన్=సేనాధిపతిని, పనిచెన్=పంపెను, వారు, తిరుగక+ఉండినన్ = మరలిరాకయుండఁగా, అరులు = శత్రువులు, కోటకొమ్మలన్ = కోటశృంగములందు, కట్టినట్టి = (తెగనఱకి) కట్టిన, తలలు = (ఆపెద్దతలారియొక్కయు, దండనాయకసేనాధిపతులయొక్కయు) తలలు, తదవస్థన్ = వారియొక్కస్థితిని - అనఁగా వారిమరణమును, తెలిపెన్ = ప్రకటించెను, శత్రువులగు ప్రద్యుమ్నాదులు వెళ్లినవారి యందఱతలలను నఱకి కోటకొమ్మలకుఁ గట్టిరి. దానిఁజూచి వారందఱు చచ్చి రని తెలియ వచ్చినది యని భావము.

వ. వజ్రనాభుండు తా నత్యంత కోపాటోప దీపితముఖుం డగుచుఁ దనతమ్ముండు సునాభుండును సకలమిత్రామాత్యవర్గంబులును రథతురంగమాతంగపదాతివ్రాతపాద ఘాతంబులచేత భూతలంబు వడవడవడంక నద్భుతోత్సాహంబునం బేర్చి కొలువ నలువు మిగిలి కన్యకాభవనప్రాకారంబు చుట్టు ముట్టుకొనియె నప్పుడు తమవిడుదుల నున్న ప్రద్యుమ్నగదసాంబులు మన మింతట నంతఃపురప్రవేశంబు సేయక తడసిన నీబెడిదంపురక్కసుని యక్కజంపువిక్రమంబు కుమారులకు నోర్వశక్యంబు గా దని పూర్వవిహితమహీవివరద్వారంబున నాక్షణంబ ప్రవేశించి, భీతివశంబున నొక్క చోటనే చేరియున్న తమకళత్రంబుల యుత్తలపాటు దీర్చి తత్పూర్వకృత్త దైత్య గాత్రంబుల నెత్తుటం జొత్తిల్లిన యాయుధంబులు తమచేతులన యుండ సంభ్రమంబునం జనుదెంచి యున్న కుమారుల సంశ్లాఘావచనంబుల నలరించి రట్టియెడఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం జూచి యి ట్లనియె. 193

అర్థము:—అత్యంతకోపా...ముఖుండు - అత్యంత = ఎక్కువయిన, కోప = కోపముచేఁ (గల్గిన) ఆటోప = తొట్రుపాటుచేత, (లేక - కోపముయొక్క విజృంభణముచేత) దీపిత = ప్రకాశించుచున్న, ఎఱ్ఱవాఱిన, ముఖుండు = మొగము గలవాఁడు, సకల...వర్గంబులును - సకల = సమస్తమైన, మిత్ర = చెలికాండ్రయు, అమాత్య=మంత్రులయొక్కయు, వర్గంబులు=సముదాయములు, రథ...ఘాతంబులచేత, రథ = రథములయు, తురంగ = గుఱ్ఱములయు, మాతంగ=ఏనుఁగులయు, పదాతి=కాలిబంట్లయొక్కయు, వ్రాత = సముదాయముయొక్క, పాద = కాళ్లయొక్క, ఘాతంబులచేతన్ = తాఁకుడులచేత, భూతలంబు = భూభాగము, అద్భుతోత్సాహంబునన్ = వింత యగువేడుకతో, పేర్చి = చెలరేఁగి,

కొలువన్ =(తన్ను) సేవించివచ్చుచుండ, నలువుమిగిలి = ఒప్పి, కన్యకా...రంబు - కన్యకా = కన్య లగు ప్రభావతిమున్నగువా రుండెడు, భవన = యింటియొక్క, ప్రాకారంబును = కోటను, చుట్టుముట్టు కొనియెన్ = చుట్టును ముట్టడివేసెను, (వజ్రనాభుఁడు కోపముచే మండిపడుచు తమ్ముఁడు సునాభుఁడును మిత్రులు మంత్రులు త న్ననుసరింప చతురంగసేనలతో వచ్చి కన్యకాంతఃపురప్రాకారము చుట్టు ముట్టడించె నని భావము.) అప్పుడు, తమవిడుదులన్ = తమబసలయందు, (విడిది. బ. వ. విడుదులు. సూ. వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగు నపు డుత్వంబగు. బాల. తత్సమ. 46. చే. డకారముమీఁది యికారమునకు ఉత్వము ప్రాప్తించినది.) అంతఃపుర ప్రవేశంబు = (ప్రభావతి మున్నగు వా రుండు) అంతిపురముఁ జొచ్చుట, చేయక, తడసినన్ = ఆలసించినచో, ఈబెడిదంపు ... విక్రమంబు - బెడిదంపు రక్కసుని = భయంకరుఁడగు నీ వజ్రనాభునియొక్క, (బెడిదము + రక్కసుఁడు - మహద్విశేషణంబు సమాసంబున ముువర్ణకాంతంబు గలదు. ఆంధ్ర శబ్దానుశాసనము. ప్రకీర్ణ. చే - అమహద్విశేషణముతో మహద్విశేష్యమునకు సమాస మైనది. పిదప పుంపులు) అక్కజంపు విక్రమంబు=అపారమగు పరాక్రమము - (అక్కజము - అక్షయ శబ్దభవము.) కుమారులకున్ = తమకొడుకు లగుప్రభావంతుఁడు మున్నగువారలకును, ఓర్వన్ = ఓడించుటకు, శక్యంబు=సాధ్యము, కాదు, అని, పూర్వ ... ద్వారమునన్ - పూర్వ=అంతకుమున్ను, విహిత=ఏర్పఱిచిన (త్రవ్విన యని భావము.) మహీ = భూమియందలి, వివర = సొరంగముయొక్క, ద్వారంబునన్ = ద్వారమందుండి, ఆక్షణంబ, ప్రవేశించి. (అంత తమబసలయం దున్నప్రద్యుమ్నాదులు కన్యాంతఃపురముఁ బ్రవేశింపక యాలసించినచో నీఘోరరాక్షసునిప్రతాపము బాలురగు తమకొడుకులకు సాధ్యము కా దని మున్ను త్రవ్విన సొరంగమునుండి యప్పుడే యంతిపురముఁ జొచ్చిరి యని భావము.) భీతివశంబునన్ = భయమునకు లోఁగుటచేత, ఒక్కచోటన్ + ఏ, తమకళత్రంబుల = తమభార్యలయొక్క, ఉత్తలపాటు= క్షోభమును, తీర్చి = పోఁగొట్టి, తత్పూర్వ ... గాత్రంబుల - తత్పూర్వ = అంతకుఁ బూర్వమే, కృత్త= నఱుకఁబడిన, దైత్య = రాక్షసులయొక్క, గాత్రంబుల = శరీరములందలి, నెత్తుటన్ = రక్తముచే, జొత్తిల్లిన = ఎఱ్ఱవాఱిన, ఆయుధంబులు, తమచేతులన్ + అ = తమచేతులయందె, కుమారులన్ = ప్రభావంతుఁడు మొదలగు పుత్రులను, సంశ్లాఘావచనంబులన్ = మిక్కిలి స్తుతివాక్యములచే, అలరించిరి = సంతోషపెట్టిరి. (ప్రభావతీ, చంద్రవతీ గుణవతులు భయపడి యొక్కచోటనే చేరియుండ వారిపరితాపమును ప్రద్యుమ్నాదులు తీర్చిరి, అంతకుఁ బూర్వమే రాక్షసులను నఱికిన యాయుధములు వీడకయే నమస్కరించిన తమకొడుకుల సాహసమునకు మెచ్చుకొని వారలను సంతోషపఱిచిరి. అని భావము.) అట్టియెడన్ =ఆ సమయమున, ప్రద్యుమ్నుండు, ప్రభావతిన్, చూచి, ఇట్లు, అనియెన్ = పలికెను.

ఆ. మగువ వినుము మిగులఁ దెగి విక్రమింప మీ, తండ్రి కదలివచ్చెఁ దర్ప మెసఁగ
మనకు వచ్చుఁ గడుఁ బ్రమాద మే మింతట, యుద్ధమునకుఁ దెగక యూరకున్న.

అర్థము:—మగువ = ఓయింతీ, వినుము, మీతండ్రి, మిగులన్, తెగి = సాహసించి, విక్రమింపన్= పరాక్రమింపఁగా - శౌర్యము చూపఁగా - అనిభావము. దర్పము = గర్వము, ఎసఁగన్ =అతిశయింపఁగా, కదలివచ్చెన్ = బయలుదేఱివచ్చెను. ఏము=మేము, ఇంతటన్=ఇప్పట్లు, యుద్ధమునకున్, తెగక=తెగింపక, ఊరక + ఉన్నన్ = మిన్నకున్నయెడల, మనకున్, కడున్, ప్రమాదము = హాని, వచ్చున్ = కలుగును.

వి. :—'ప్రమాదము' అను సంస్కృతపదమునకు 1. ఏమరుపాటు 2. అధికమగుమత్తు అను రెండర్థములే సంస్కృతమునఁ గలవు. కాని, 'హాని, ఆపద' యనునర్థము (లాక్షణికము) తెలుఁగుననే కనఁబడుచున్నది.

క. కుడుములవేట్లాటలు గా, వుడురాజానన ! రణంబు లూహించిన వెం
బడి రావే మటు తొడరినఁ, దొడిఁబడ నెవ్వాఁడు బిట్టుగ్రుంగునొ మాచేన్. 195

అర్థము:—ఉడు రాజానన - ఉడు = నక్షత్రములకు, రాజ = ప్రభువగు చంద్రునివంటి, ఆనన = ముఖము గలదానా! రణంబులు = యుద్ధములు (అవి) కుడుముల వేట్లాటలు = ఉండ్రములతో వినోదముగాఁ గొట్టుకొనుచు నాడునట్టి యాటలు, కావు, ఊహించిన వెంబడిన్ = మన యూహల వెంట నంటి - మన మనుకొనునట్లుగా - అని భావము. రావు=తటస్థింపవు, ఏను, అటు = వజ్రనాభుని వలెనే, తొడరినన్ = ఎదిరించిన యెడల, మాచేన్, ఎవ్వాఁడు, తొడిఁబడన్ = చెదరునట్లు, బిట్టు = వెంటనే, త్రుంగునో = చచ్చునోకదా. (తొడిఁబడన్ = వ్యత్యాసముగా, ఎవ్వాఁడు, బిట్టు త్రుంగునో కదా, మేము చంపఁదలఁచు కొనినవాఁడు గూడ రణరంగమునఁ జావవచ్చును గదా అనియు నన్వయింపవచ్చును.)

అలం:—ప్రతిషేధము. గీ. కృతిఁ బ్రసిద్ధ నిషేధాను కీర్తనంబు, వసపడిన యేని ప్రతిషేధ మనఁగఁ బరఁగుఁ, గితవ! యతిశిత సాయక క్రీడనంబు, గాని కాదిది జూద మక్కరణి శర్వ. ఆంధ్రచంద్రాలోకము. 142.

వ్యా. వి. :—వేటు - వేయుధా. కృదంతము సూ. టు వర్ణకంబు పడ్వాదుల కగు, నగుచో నయ్యావి యాద్యక్షర శేషంబులై దీర్ఘంబు నొందు. బాల. కృదంత. 8 చే సిద్ధము. వేటు+లు - సూ. బహువచనంబు పరంబగునపుడు డ, ల, ట, ర, ల యుత్వంబునకు లోపఁబు బహుళంబుగా నగు. బాల. ఆచ్ఛిక. 12 చే. ఉత్వలోపమున వేట్లు అగును.

ఆట. ఆడు, ధా. కృదంతము. సూ. టవర్ణకం బాడ్వాదులకగు, నగుచో నంత లోపం బగు. బాల. కృదంత. 7. చే సిద్ధము. వేట్ల + ఆటలు. సూ. అత్తునకు సంధిబహుళము. వేట్లాటలు.

ఉ. చేడియ! నీమనంబునకుఁ జింత యొకింత జనించెనేని నేఁ
జూడఁగఁ జాల, నీజనకు చొప్పు దలంప హతుండు గాక తాఁ
గీడు చలంబు మానఁ, డనికిన్ జొర కొండొక త్రోవ ద్రొక్కఁగాఁ
గూడద - యేమి సేయుదును ఘోరవిచారము పుట్టె నాత్మలోన్. 196

అర్థము:—చేడియ = ఓయింతీ, నీమనంబునకున్, చింత = దుఃఖము, ఒక+ఇంత, జనించెనేని = కలిగిన యెడల, నేన్, చూడఁగ జాలన్, నీజనకు చొప్పు = నీ తండ్రియొక్క పద్ధతి (లేక, కృత్యము) తలంపన్ = ఆలోచింపఁగా, హతుండు = వధింపఁబడినవాఁడు, కాక = కాకుండ, తాన్, కీడు = అపకారమును, చలంబున్ = మచ్చరమును, మానఁడు, అనికిన్ = యుద్ధమునకు, చొరక = ప్రవేశింపక - పూనుకొనక, ఒండొక త్రోవ త్రొక్కఁగా = మఱియొక త్రోవ నరుగఁగా - (దండముగాక సామాద్యుపాయములందు వర్తిల్లుటకు అని భావము.) కూడదు + అ = ఘటిల్లదు కదా? ఏమి, చేయుదును, ఘోరవిచారము = భయంకరమగువగపు, ఆత్మలోన్ = మనసునందు, పుట్టెను.

తాత్పర్యము:—నీ మనసున రవంత వగపు కల్గినఁ జూడలేను. నీ తండ్రి విధము చూడ చావనిదే యపకార బుద్ధియు మచ్చరమును వీడఁ డనిపించుచున్నది. యుద్ధమునఁ జొరక వేఱొక యుపాయ మాశ్రయించుట కిపు డది కుదురదు. ఏమి చేయువాఁడ. మనసున ఘోరమగు విచారము కలుగుచున్నది.

చ. అని తనుఁ గూర్చి దానవకులాధిపుపైఁ దెగలేని చింత సే
యునధిపుఁ గోట లగ్గలకు నుగ్రత డగ్గఱు భూరిసైన్యుఁ దం
డ్రిని బరికించి యింతి విభునిం దముఁ గాచికొనంగ వేఱ త్రో
వ నెమకి కాన కంతఁ బితృవత్సలభావముఁ బాఱ నూకుచున్. 197

అర్థము:—అని = ఇట్లు పలికి, తనున్ + కూర్చి = తన్ను (ప్రభావతిని) నిమిత్తముగాఁ జేసికొని, దానవకుల + అధిపుపైన్ = రాక్షసవర్గమునకుఁ బ్రభువగు వజ్రనాభునిమీఁద, తెగలేని = సాహసింపఁజాలని, చింత = ఆలోచనము, చేయునధిపున్ = చేయుచున్నమగనిని, కోటలగ్గలకున్ = ముట్టడించి కోటగోడలపై కెగఁబ్రాఁకుటకు, ఉగ్రతన్ = తీవ్రత్వముతో, డగ్గఱు = సమీపించుచున్న, భూరిసైన్యున్ = పెక్కుసైన్యములుగలవాఁడగు, తండ్రిని, పరికించి = చూచి - ఒకవంకభర్త, రెండవవంక తండ్రి, ఇరువురను జూచి అనిభావము. ఇంతి = ఆ ప్రభావతి, విభునిన్ = మగనిని, తనున్ = తన్నును చెలియండ్రను కొడుకులను, కాచికొనంగన్ = రక్షించుకొనుటకు, వేఱు + అ, త్రోవ = వేఱే యుపాయము (ఏదియేని దొరకునేమో యని) వెమకి = వెదకి, కానక = కనలేక, అంతన్, పితృవత్సల భావమున్ = తండ్రికి (తనయెడఁ గలప్రేమమును) పాఱనూకుచున్ = పూర్తిగా విసర్జించుచు. (ముందున కన్వయము.)

క. తాన చని మూల నున్నయ, నూనతదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కిన యను, మానము మాను మని పలికె మానవతి పతిన్. 198

అర్థము:—మానవతి = అభిమానముగల ప్రభావతి, తాను + అ = తానే, చని, మూలన్, ఉన్న, అనూనతదీయాసిన్ - అనూన (న + ఊన) తక్కువకాని, అనఁగా గొప్పదియగు, తదీయ - అతని సంబంధమైన, - ప్రద్యుమ్నునిదగు, అసిన్ = ఖడ్గమును, తెచ్చి, ఒసఁగి = ఇచ్చి, దానవపతిన్ = రాక్షసరాజును, గెలువుమీ, తక్కినయనుమానము = మిగిలిన (నా కిష్టము కలుగదేమో యను) సందేహమును, మానుము = విడువుము, అని, పతిన్ = మగనిని, పలికెను.

వ్యా. వి. :—'పలుకు' ధాతువు సకర్మకము కావున 'కర్మంబున ద్వితీయ యగు' అను సూత్రమున సామాన్యముగా ముఖ్యాముఖ్యకర్మంబులకు ద్వితీయ వచ్చుచుండగా 'వచ్యర్థానుఖ్య కర్మంబులకుఁ దోడ, కువర్ణకంబులు ప్రాయికంబుగా నగు'నను సూత్రముచే వచ్యర్థమగు 'పలుకు' ధాతువునకు అముఖ్యకర్మవాచకమగు'పతి' శబ్దమునకంటె తోడ, కువర్ణకంబులు రా 'పతితోడన్, పతికిన్' అని తెలముగా రావలెను. అందు ప్రాయోగ్రహణముచే 'పతిన్'అని ద్వితీయాంతరూప మాత్సర్గికము కావున నదే యిందుఁ బ్రయుక్తమైనది.

చ. పలికిన సంతసిల్లి హరిపట్టి గదాదుల నార్వురన్ వధూ
నిలయములోని కావలికి నిల్పి రయంబున నొక్కరుండుఁ దా
వెలువడి కోట కుగ్రబల వేష్టనమున్ విడిపించుచున్ నిర
ర్గళగతిఁ జుట్టునుం దిరిగె ఖడ్గవిహారపటుత్వదీప్తుఁడై. 199

అర్థము:—పలికినన్ = అట్లుప్రభావతియనఁగా, హరిపట్టి = శ్రీకృష్ణునికొడుకగు ప్రద్యుమ్నుఁడు, సంతసిల్లి = సంతోషించి, గదాదులన్ = గదుఁడు మొదలగువారిని, ఆర్వురన్ = ఆఱుగురను (గదుఁడు, సాంబుఁడు ప్రభావంతుఁడు, చంద్రప్రభుఁడు, గుణవంతుఁడు, కీర్తిమంతుఁడు అనువారార్వురను), వధూనిలయములోని కావలికిన్ = స్త్రీలయొక్క గృహమును కాపాడుటకు, నిల్పి = ఉంచి, రయంబునన్ = వేగముతో, తాన్, ఒక్కరుండున్, వెలువడి = బయటికివచ్చి, ఖడ్గ... దీప్తుఁడై, ఖడ్గ = కత్తియొక్క, విహార = సంచారమండలి, పటుత్వ = సామర్థ్యముచే, దీప్తుఁడై = ప్రకాశించుచున్నవాఁడై- కత్తిని త్రిప్పుటయందలి సమర్థతచే మెఱయుచున్నవాఁడై, కోటకున్ = కోటకుఁ (గల్గిన), ఉగ్ర = భయంకరమగు, బల = సేనలయొక్క, వేష్టనమున్ = చుట్టుకొని యుండుటను, అనఁగాముట్టడిని, విడిపించుచున్, చుట్టునున్ = కోటచుట్టును, తిరిగెన్ = సంచరించెను.

ఉ. కాంచనదీప్తిచేఁ బసిఁడికొండగట్టు తెఱంగు నగళ్లకోట సూ
చించఁగఁ దాను భాస్కరుని చెన్ను వహించెను దానిఁ జుట్టి రా
సంచరణంబొనర్చుచును శౌరితనూజుఁడు కోటచుట్టునున్
డించిన దైత్యసైన్యము వడిం దమమున్వలె విచ్చి పాఱఁగన్. 200

అర్థము:— నగళ్లకోట = రాజభవనములచుట్టునుండుకోట, కాంచనదీప్తిచేన్ = బంగారుకాంతిచే, పసిఁడికొండగట్టు తెఱంగు = బంగరుకొండ (మేరువు) విధమును, సూచించఁగన్ — తెలుపుచుండఁగా, శౌరితనూజుఁడు = కృష్ణునికొడుకగు ప్రద్యుమ్నుఁడు, దానిన్ = ఆకోటను, చుట్టిరాన్ = చుట్టివచ్చునట్లు, సంచరణంబు = సంచారమును, ఒనర్చుచును = చేయుచు, కోటచుట్టునున్, డించిన = నిల్పిన, దైత్యసైన్యము = రక్కసిబలము, వడిన్ = శీఘ్రముగా, తమమున్ వలెన్ = చీఁకటివలె, విచ్చి = విడిపోయి, చెదరి, పాఱఁగన్ = పరువెత్తఁగా (పోఁగాఅనియు నర్థము) భాస్కరుని చెన్ను = సూర్యునియొక్కయందమును, వహించెన్ = పొందెను.

తాత్పర్యము:— సూర్యుఁడు, గ్రహములు, నక్షత్రములు మేరుపర్వతముచుట్టును దిరుగుచుండు నని పురాణప్రసిద్ధి. రాజభవనములకుఁ జుట్టియున్న బంగరుకోట మేరువువలెనుండ, దానిని జుట్టివచ్చు ప్రద్యుమ్నుఁడు సూర్యునివలె నుండెను. సూర్యరశ్మికిఁ జీఁకట్లు చెదరిపోయినట్లు కోటచుట్టును యుద్ధమునకు నిల్పిన వజ్రనాభునిసేనలు ప్రద్యుమ్నునిధాటి కాఁగలేక చెల్లాచెదరైనవి.

అలం. :— నిదర్శనము, ఉపమ.

వ్యా. వి. :— సూచించఁగ – సూ. ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు ప,వ లగు. బాల. క్రియా. 88 చే పకారమువచ్చి 'సూచింపఁగన్' అనవలసియున్నను, కళాపూర్ణోదయము 2. 4. లో 'ఎవ్వారినిబోధించని క్షణమొక్కటియుఁ దరియఁగ వశమే'అనియు 'ఊహించ నొకనాల్గడియల సంచారము' అని యుండే. 3. 63 లోను నీకవిచేఁ బ్రయోగింపఁబడుటచే నీతనిమతమున జీత్తు పరమగునపుడు పత్వము వికల్పమని తెలియవచ్చుచున్నది.

క. లగ్గలకు నట్లు కోటకు,దగ్గఱు తనమొనల నెల్లఁ దఱిమి తఱిమి పే
రగ్గలిక చూపు మరుపోటగ్గించుచు వజ్రనాభుఁ డతని నెదిర్చెన్. 201

అర్థము:— వజ్రనాభుఁడు, లగ్గలకున్ = లోపలఁ జొచ్చుటకై కోటగోడ కెగఁబ్రాఁకుటకు, అట్లు, కోటకున్, దగ్గఱు = సమీపించుచున్న, తనమొనలన్ + ఎల్లన్ = తనసేనల నన్నిటిని, తఱిమి, తఱిమి = మిగుల నుత్సాహపఱచి, పేరు + అగ్గలిక = గొప్పశౌర్యమును, చూపు = ప్రదర్శించుచున్న, మరుపోటు = ప్రద్యుమ్నుని యుద్ధమును, అగ్గించుచున్ = ప్రశంసించుచు, అతనిన్, ఎదిర్చెన్ = ఎదిరించెను, ప్రతిఘటించెను.

తాత్పర్యము:— వజ్రనాభుఁడు తనసేనలను కోటగోడల కెగఁబ్రాఁకునట్లు నుత్సాహపఱచి పఱచి, గొప్పశౌర్యమును చూపుచున్న ప్రద్యుమ్నుని యుద్ధనైపుణిని మెచ్చుకొనుచు నాతని నెదురుకొనెను.

వి. :— శత్రువుసైతము మెచ్చుకొనునట్టి శౌర్యముగలవాఁడగుటచే ప్రద్యుమ్నుని శౌర్యాతిశయము సూచింపఁబడుటయేకాక, వజ్రనాభుని గుణగ్రహణశక్తికూడ సూచింపఁబడుచున్నది.

వ. ఎదిర్చి యిట్లనియె. (స్పష్టము) 202

ఉ. ఎవ్వఁడ వీవు ? నాముదలన్ యించుక లేక చొరంగరాదు వీ
డెవ్వరికైన, బ్రహ్మవరన్మిట్టిది, యేగతిఁ జొచ్చి తీవు, తా
నివ్విధి నాకుఁ గల్లవరన్ మిచ్చినబ్రహ్మకు శిక్ష సేసెదన్
గ్రొవ్వడఁగించి ని న్నిపుడన్ కొట్టెద, నీకుల మెల్ల రూపఱన్. 203

అర్థము:—ఈవు, ఎవ్వఁడవు, వీడు = (ఈ) పట్టనము, నాముదల = నాయాజ్ఞ, ఇంచుక=కొంచెమైనను, లేక, ఎవ్వరికిన్ + ఐనన్ = ఎంతవారికైనను, చొరంగరాదు = ప్రవేశింపరాదు. బ్రహ్మవరము = బ్రహ్మ నాకిచ్చినవరము, (దేవతలు అనుగ్రహించి యిచ్చువాంఛితము వర మనఁబడును) ఇట్టిది=ఇటువంటిది గదా, ఏగతిన్ = ఏరీతిగా, ఈవు, చొచ్చితివి = ప్రవేశించితివి, ఇవ్విధిన్ = ఈరీతిగా, నాకున్, కల్లవరము = అసత్యపువరము, ఇచ్చిన బ్రహ్మకున్, శిక్ష = దండనము, చేసెదన్, నీకులము + ఎల్లన్ = నీవంశమంతయు, రూపు + అఱన్ = స్వరూపము లేకుండునట్లు, నశించునట్లు, క్రొవ్వు = కండకావరము, అడఁగించి = పోఁజేసి, నిన్ను, ఇపుడు + అ = ఇప్పుడే, కొట్టెదన్ = సంహరింతును.

తాత్పర్యము:—ఓరీ ! నీ వెవ్వఁడవు. బ్రహ్మ నాకిచ్చినవరముప్రకారము నాయాజ్ఞ లేనిదే యీ పురమునఁ బ్రవేశింప నెవ్వరికిని సాధ్యము కాదు. ఎట్లు చొచ్చితివి ? ఈరీతి నసత్యపువర మిచ్చిన బ్రహ్మను బట్టి శిక్షింతును. నిన్నును, నీ వంశమును నాశ మొనర్తును.

వ. అనుటయు నతండు. (స్పష్టము) 204

క. నిను నేఁడు తిరిగి చన ని, చ్చినఁ గద బ్రహ్మకును శిక్షన్ సేయుదు ? నీదు
ర్జనతలె కావే మిముఁ జెఱి,చినవి యసత్యోక్తి బ్రహ్మజిహ్వకుఁ గలదే ? 204

అర్థము:—నేఁడు, నిన్నున్, తిరిగి = మరలి, చననిచ్చినఁగద = వెళ్లనిచ్చినఁగాదా, బ్రహ్మకున్, శిక్షచేయుదు=చేసెదవు, బ్రదికి నీవు వెళ్లుటయు లేదు, బ్రహ్మను శిక్షించుటయుఁ గలుగదు అని భావము. మిమున్ = మీరాక్షసులను, చెఱిచినవి = నాశము చేసినవి, మీదుర్జనతలు + ఎ = మీదౌర్జన్యములే, మీచెడ్డపనులే, కావా ? మీచెడ్డతనముచేతనే మీ రందఱు చెడినారు (కాని) బ్రహ్మజిహ్వకున్ = బ్రహ్మనాలుకకు, అసత్య + ఉక్తి = కల్లమాట, కలదే = ఉన్నదా - లేదనిభావము.

క. మొదలను బురిఁ జొచ్చితి నీ, ముదలన భద్రనటవేషన్మున హరిసుతుఁడన్
యదుకులజుఁడఁ బ్రద్యుమ్నుఁడ, మదిచ్ఛఁ గైకొంటి నీకౌన్మారితపొందున్. 205

అర్థము:—మొదలను = ముందుగా, నీముదలన్ + అ = నీయాజ్ఞచేతనే, భద్రనటవేషమునన్ = భద్రుఁడను నటునియొక్క వేషముతో, పురిన్ = నీ పట్టనమందు, చొచ్చితిన్ = ప్రవేశించితిని, హరిసుతుఁడన్ = శ్రీకృష్ణుని కొడుకను, యదుకులజుఁడన్ = యాదవవంశమునఁ బుట్టినవాఁడను, ప్రద్యుమ్నుఁడన్, నీ కౌమారిత పొందున్ = నీ పుత్రియగు ప్రభావతితోడి సాంగత్యమును, మదిచ్ఛన్ = నాయొక్క కోరికచేత - (లేక ఆమెకు నాయందుఁగల కోర్కెచేత, అని కాని యర్థము) కైకొంటిన్ = పొందితిని.

తాత్పర్యము:—మొట్టమొదట నీయాజ్ఞచేతనే భద్రుఁడను నటుని రూపముతో నీ పట్టనము చొచ్చితిని. కృష్ణుని పుత్రుఁడను. యదువంశపు వాఁడను. ప్రద్యుమ్నుఁడను. నాకోరికచేతను (లేక యామెకు నాయందుఁగల కోరిక చేతను) నీ కూఁతు సాంగత్యము నొందితిని.

వి.:—'మదిచ్ఛన్' అనునపుడు, నా కోరికచేతను, నా యందలి కోరికచేతను, అను రెండు విధము లగు నర్థములు సమంజసముగానే యుండును. 'ఒండొరులను గామించుకొని చేసికొనిన పొందు' అని యర్థ విశేషము కలుగుచున్నది. కవి హృదయ మిదియే కావచ్చు ననిపించుచున్నది.

ఉ. కోరికఁ దావకానుజునికూఁతులకున్ బతులైనవారు మా
వారలె నాకు వారికి నవార్యబలుల్ సహజాత యౌవనో
దారులు గల్గి రాత్మజులు తల్లుల రక్షకు నున్నవారు ప్రా
కారములోన నీ దొరల గణ్యులఁ బల్వురఁ దిన్న మృత్యువుల్. 207

అర్థము:—ఈ పద్యమునందలి 'కోరిక' శబ్దముగూడ వెనుకటి పద్యములోని 'మదిచ్ఛ'శబ్దము వంటిదే. కోరికన్ = ఉభయ పక్షముల కోరిక చేతను, తావక + అనుజుని కూఁతులకున్ = నీతమ్ముఁడగు సునాభుని కూఁతు లిద్దఱకును, పతులు ... భర్తలు, ఐనవారు, మావారె = మా యాఁడువుటె, నాపిన తండ్రియు, నా తమ్ముఁడును, నాకును, వారికిన్, అవార్యబలుల్ = వారింపరాని శక్తిగలవారును, సహ...దారులు-సహజాత= కూడఁబుట్టిన, జన్మము తోడనే కలిగిన, యౌవన = పడుచుదనముచేత, ఉదారులు=గొప్పవారు (అగు) ఆత్మజులు = కొడుకులు, కల్గిరి=పుట్టిరి, తల్లుల రక్షకున్, ప్రాకారము లోనన్ = కోటలో, ఉన్నవారు, గణ్యులన్ = (ప్రతాపాదులచే) లెక్కింపఁ దగినవారు, అనఁగా - శ్రేష్ఠులైన, పల్వురన్ = పెక్కురగు, నీ దొరలన్ = నీ వంపిన దండనాథాదు లగు నధికారులను, తిన్నమృత్యువుల్ = మ్రింగిన మృత్యుదేవతలు, (వారే సుమా) శ్రేష్ఠు లగు నీ భృత్యులను పెక్కురను చంపినవారు సుమీ అని భావము.

తే. హరికిఁ దేవేంద్రునకు నీవు శరణు చొచ్చి, తేని నీ ప్రాణముల కెందు నేను దెగను
శరణు చొరవేని నావాలుకరుణ గిరుణ, యెఱిఁగినది కాదు నీ వది యెఱిఁగె దిపుడ. 208

అర్థము:—హరికిన్ = శ్రీకృష్ణునకును, దేవేంద్రునకున్, నీవు, శరణుచొచ్చితి+ఏని = శరణాగతి నొందితివేని - అనఁగా రక్షింపుమని యాశ్రయించితివేని, నేను, ఎందున్ = ఏసమయమందును, నీ ప్రాణములకున్ + తెగను = నీ ప్రాణములు తీయసాహసింపను, 'నిన్ను చంపను' అని భావము. శరణు చొరవేని = శరణాగతి నొందవా, నావాలు = నా ఖడ్గము, కరుణగిరుణ = హీనమగు జాలిని, యెఱిఁగినది = తెలిసినది, కాదు, కరుణ యనుమాట లేనిది యని భావము. నీవు, అది, ఇపుడు+ఎఱిఁగెదు= తెలిసికొందువు.

వ్యా. వి. :—'శరణు' 'శరణము'నకు రూపాంతరము. రక్షకుఁడు, రక్షకము అని యర్థము (ని. 'శరణం గృహరక్షిత్రోః' అని యమరము) సూ. చరిత్రాదుల మువర్ణకంబునకు, లోపంబు బహుళంబుగా నగు. బాల. తత్సమ. 58 లోని బహుళముచే మువర్ణకలోపము మాత్రమే కాక తుది యకారమునకు ఉత్త్వము కలుగును. సూ. అర్ఘాదులకడయచ్చున కుత్వంబును వువర్ణకంబును వైకల్పికముగా నగు. ప్రౌఢ. శబ్ద 25. అనుదాని కిది లక్ష్యము కానేరదు. ఆసూత్రవృత్తియందుఁ జూపఁబడిన 'వర్గు, వర్గువు' వంటిది కాదు. 'శరణువు' అనురూపము లేదు. మఱియు సూత్రమున బహుళము అని లేక వైకల్పిక మని యుండుటచే దీని కాధారము కాదు. కావున బాలవ్యాకరణ సూత్రమందలి బహుళమే దీనికి శరణ్యము.

గీ. అనిన విని యోరి! నీ వేమి యనినఁ జెల్లు, నేను నాదృష్టియెదుర నిన్నింతతడవు
పెట్టుకొని యుండుటకు, ననిఁ బెట్టిదంపు, టంపవానలు గురిసె భయంకరముగ.

అర్థము:—అనినన్ = ప్రద్యుమ్నుఁ డట్లు పలుకగా (వజ్రనాభుఁడు అధ్యాహారము) విని, ఓరి, నేను, నాదృష్టియెదురన్ = నాచూపున కెదుటిభాగమున, నిన్నున్, ఇంతతడవు=ఇంతసేపు, పెట్టుకొని= (చంపివేయక) నిలుపుకొని, ఉండుటకున్ = ఉన్నట్టి నాయవివేకమునకు, నీవు, ఏమి, అనినన్, చెల్లును, అని = అనిపలికి, భయంకరముగన్ = భయము కలిగించునవిగా, బెట్టిదము + అంపవానలు = ఘోరమగు బాణవర్షములు, కురిసెన్ = కురియించెను. (ఇట 'కురియు' అంతర్భావిత ప్రేరణార్థము.)

వ్యా.వి. :—అమ్ము+వానలు, సూ. కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల మువర్ణంబులు 'పజ్, ప' వర్ణంబు లగు. బాల. సమాస. 19. చే నామ్వాదులలోనిదగు అమ్ములోని మువర్ణంబు పజ్ వర్ణమై, జిత్తుగావున - తొలిహ్రస్వముమీఁద వచ్చుటంజేసి పూర్ణబిందువే పూర్వమందుఁ గలదై 'అంప' సిద్ధించి, వానలు శబ్దముతోఁగూడి అంపవానలు అయినది, బెట్టిదము + అంపవానలు, కర్మధారయముగాన పు, ంప్వాదేశ, టుగాగమములు రాఁగా 'బెట్టిదంపు టంపవానలు' అయినది.

క. తనవాలునఁ దచ్ఛరములు, దునుముచుఁ బ్రద్యుమ్నుఁ డతనిఁ దునుముకడంకన్
ఘనరయమునఁ జనఁ దాఁకిరి, సునాభముఖ్యు లగు రాక్షసులు బలములతోన్.

అర్థము:—ప్రద్యుమ్నుఁడు, తనవాలునన్ = తనకత్తిచేత, తత్ + శరములు ఆవజ్రనాభుని బాణములను, తునుముచున్ = నఱకుచు, అతనిన్ = ఆవజ్రనాభుని, తునుముకడంకన్ = నఱకుయత్నముతో, ఘనరయంబునన్ = ఎక్కువ వేగముతో, చనన్ = మీఁది కేఁగఁగా, సునాభముఖ్యులు = సునాభుఁడు మొదలుగాఁ గలవారు, అగురాక్షసులు, బలములతోన్=సేనలతో, తాఁకిరి =(ప్రద్యుమ్నుని) ఎదుర్కొనిరి.

వ్యా. వి. :—వాలునన్ - సూ. ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు. బాల. కారక. 23. చే తృతీయకు నవర్ణకము కల్గెను. తత్ + శరములు - శ్చుత్వసంధిచే, తచ్+శరములు, అయి, సూ. శశ్ఛోటి - 8-4-63 పాణినీయముచే, శవర్ణమునకు ఛకారమాదేశముకాఁగా - 'తచ్ఛరములు' అయినది. ఈ యాదేశము వైకల్పికము. కావున తచ్శరములు అనియు నగును.

క. అది యంతయుఁ గని మనముల, గదసాంబులు గినిసి కోట గవఁకులు దెఱపిం
చి దురాధర్షాటోపత, నెదిర్చిరి సునాభముఖుల నింద్రాహితులన్. 211

అర్థము:—గదసాంబులు = (కోటలోనున్న) గదుఁడును, సాంబుఁడును, అది, అంతయున్ = సునాభాదు లందఱు ప్రద్యుమ్నుని దాఁకినస్థితినెల్ల, కని, మనములన్, కినిసి = కోపించి, కోటగవఁకులు = కోటవాకిళ్లను, తెఱపించి, దురా...టోపతన్ - దురాధర్ష = తిరస్కరింపరాని - వారింపరాని, ఆటోపతన్ = వేగిరపాటుతో, సునాభముఖులన్ = సునాభుఁడు మొదలుగాఁ గల, ఇంద్ర + అహితులన్ = ఇంద్రశత్రువు లగు రాక్షసులను, ఎదిర్చిరి = ప్రతిఘటించిరి.

వ్యా. వి. :—గవను - బ. వ. గవఁకులు. సూ. కలన్వాదుల నువర్ణంబు కు జ్జగు, బహు వచనంబు పరం బగునపుడు నిత్యంబుగా నగు. బాల. ఆచ్ఛిక. 18. దుర్ + అధర్షము-దురాధర్షము - దురాధర్షమగు ఆటోపము గలవాఁడు - దురాధర్షాటోపుఁడు. అని బహువ్రీహి. అట్టివాని భావము. దురాధర్షాటోపత= వారింపరాని వేగముగల వానిధర్మము - అనఁగా వారింపరాని వేగము. అని భావము.

శా. అంతం గేశవుఁ డంచవేగరులచే నాదైత్య సంగ్రామ వృ
త్తాంతంబున్ విని తార్క్ష్యవాహనుఁడు చక్రాద్యాయుధ ప్రోల్లస
త్కాంతి క్రాంత దిగంతరుం డయి వడిన్ దా వచ్చె నచ్చోటికిన్
సంతోషంబున వజ్రి సత్వరగతిన్ సంధించి సేవింపఁగాన్. 212

అర్థము:---అంతన్ = అప్పుడు, కేశవుఁడు = శ్రీకృష్ణుఁడు, అంచవేగరులచేన్ = చారులుగా పనిచేయుచున్న శుచిముఖి మొదలగు హంసలచే, ఆదైత్యుపగ్రామ వృత్తాంతంబున్ = అవజ్రనాభుని యొక్క యుద్ధవార్త, విని, తార్క్ష్య = గరుత్మంతుఁడు, వాహనుఁడు = వాహనముగాఁగలవాఁడును, గరుత్మంతునిపై నెక్కినవాఁడై - అని భావము, చక్రకౌ...దిగంతరుండు - చక్ర = సుదర్శనము చక్రకౌ యుధము, ఆది = మొదలగు, ఆయుధ = యుద్ధసాధనములయొక్క, ప్ర+ఉత్+లసత్-ప్రోల్లసత్= మిగుల వెలుఁగుచున్న, కాంతి = తేజస్సుచేతను, క్రాంత = ఆక్రమింపఁబడిన, దిగంతరుఁడు=దిక్కుల యొక్క మధ్యభాగము గలవాఁడును, అయి, సంతోషంబునన్ = (తన శత్రువు నశింప నున్నాఁడను) సంతసముచే, వజ్రి=వజ్రాయుధముగలవాఁడు, ఇంద్రుఁడు, సత్వరగతిన్=వేగముతోఁ గూడినగమనముచే - వేగముగా నని భావము, సంధించి = కలిసికొని, సేవింపఁగాన్ = కొలిచివచ్చుచుండఁగా, అచ్చోటికిన్= ఆరణరంగమునకు, వడిన్ = త్వరగా, వచ్చెన్ = వచ్చెను.

తాత్పర్యము:---అప్పుడు శ్రీకృష్ణుఁడు శుచిముఖి మొదలగు హంసచారులచేత నారాక్షసుని యుద్ధవార్త విని గరుడారూఢుఁడై, చక్రాదు లగు నాయుధములకాంతు లెల్లదిక్కులనిండఁగా - సంతోషముతో దేవేంద్రుఁడు వేగముగా వచ్చి తన్నుఁగలిసికొని, కొలుచుచుండ క్షణకాలములో నారణరంగమును చేరెను.

:--- వేగు = రాజ్యసమాచారము, దానిని గొనిపోవువాఁడు - వేగరి, సీ...చారసమాఖ్య వేగులవాఁ డన, వగివి లన. ఆంధ్రభాషార్ణవము. 2. 184 - సూ. అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు. బాల. లద్ధి. 17 - వేగు+అరి. వేగరి.

కేశవుఁడు-ప్రశస్తమగు కేశములు గలవాఁడు. అని కాని, (కశ్చ +ఈశశ్చ, పుత్రపౌత్రౌ స్తోఽస్య) బ్రహ్మయును, శివ్వుఁడును కొడుకుగాను మనుమఁడుగాను గలవాఁడు. కేశాద్వః. 5. 2. 109. పాణినీ యసూచ - 'వ' వచ్చి, 'కేశవ' అని ఐనదని, కాని వ్యుత్పత్తి యనియు - 'శంభోః పితామహో బ్రహ్మ పితా ప్రకీర్త్యధీశ్వరః' అని పద్మపురాణమునఁ గలదనియు అమరసుధా వ్యాఖ్య. (బ్రహ్మకు తండ్రియును, శివునకు పితామహుఁడును కాన కేశవుఁ డయ్యెనని భావము).

వ. అప్పుడింద్రుండు ధనురాదిసకలహేతి సమేతంబును మాతలిసారథికంబును నైన తన దివ్యరథంబు ప్రద్యుమ్నునకు నొసఁగి, గదసాంబులకు ననన్యదుర్జయంబు లైన దివ్యస్యందనంబులఁ బనిచె. దాన నపూర్వోత్సాహంబునం బొదలియు యదు కుమారులు ప్రతిభటుల మించం జాలక సత్వరంబునఁ బోరుచుండి రయ్యవసరంబునఁ గృష్ణుండు. 213

అర్థము:---ధనురా...సమేతంబును - ధనుః + ఆది = విండ్లు మొదలుగాఁగల, సకల = ఎల్ల, హేతి = ఆయుధములతో (ని. రవే ర్రశ్మిశ్చ శస్త్రంచ వహ్నిజ్వాలాచ హేతయః. అని అమరము) సమేతంబును = కూడినదియును, మాతలి సారథికంబును = మాతలి సారథిగాఁ గలదియును, ఐన తన దివ్యరథంబును = (ఇంద్రుని) స్వర్గసంబంధమగు తేరిని, అనన్యదుర్జయంబులు = ఇతరులకు జయింప సాధ్యముకానివి, దివ్యస్యందనంబులు = స్వర్గసంబంధమగు రథములను, అపూర్వ + ఉత్సాహంబునన్ = ఇంతకు మున్ను లేని యుత్సాహముతో, పొదలియున్ = విజృంభించియును, యదుకుమారులు = ప్రద్యుమ్నాదులు, ప్రతిభటులన్ = ఎదిరి యోధులను, మించంజాలక = అతిక్రమింపలేక, సత్వరంబునన్ = వేగముతో, పోరుచుండిరి, అయ్యవసరంబునన్ = ఆ సమయమందు, కృష్ణుండు (మీఁది కన్వయము.)

క. సాహసము నాహత ప్రత్యాహతనైపుణము నొక్కయంతగ సుతుతో
నాహవ మొనరించు మహోత్సాహనిధిన్ వజ్రనాభదైత్యుని జూచెన్. 214

అర్థము:—సాహసమును = తెగువయును, ఆహత...నైపుణము - ఆహత = (తాను శత్రువును) కొట్టుటయందును, ప్రత్యాహత = శత్రువులు ప్రయోగించిన (వానిని) తిరుగఁగొట్టుట యందును (గల) నైపుణమును = నేర్పును, ఒక్కయంతగన్ = సమాన మగునట్లు, సుతుతోన్ = తనకొడు కగు ప్రద్యుమ్నునితో, ఆహవము = యుద్ధమును, ఒనరించు = చేయుచున్న, మహోత్సాహనిధిన్ = గొప్పదగు వేడుకకు స్థానమైన, వజ్రనాభుని, చూచెన్ = చూచెను.

తాత్పర్యము:—యుద్ధమున నెక్కువ చొరవగలిగి, శత్రువును గొట్టుటయందును, శత్రుప్రయుక్తము లగు నాయుధములను దిరుగఁగొట్టుటయందును గల నేర్పు సమముగాఁగలిగి, తనకొడు కగు ప్రద్యుమ్నునితో పోరుచు నుత్సాహముతో నొప్పు వజ్రనాభుని జూచెను.

గీ. చూచి యిట్లైన నెన్నండు సులభ మగును, విజయ మని మరుచేతికి విష్ణుఁ డనిపెఁ
దనదుచక్రము నతఁడును దత్ప్రయోగ, మునను ఖండించె వజ్రనాభుని శిరంబు.

అర్థము:—చూచి, ఇట్లు = ఈరీతి (రక్కసుఁడతిశయించినవాడు), ఐనన్ = అయినయెడల, విజయము = గెలుపు, ఎన్నండు = ఎప్పటికి, సులభము = సుఖముగా పొందఁదగినది, అగును - అనఁగా నెన్నఁటికిని గా దన్నమాట, అని = అనితలఁచి, తనదుచక్రమున్ =తనచక్రాయుధమును, మరుచేతికిన్ = ప్రద్యుమ్నునిచేతికి (దొరకునట్లు) అనిపెన్ = పంపెను, అతఁడును, తత్ప్రయోగమునన్ = ఆ చక్రము యొక్క యేయుటచేత - దానిని శత్రువుపై నేయుటచేత, అని భావము. వజ్రనాభుని శిరము = వజ్రనాభుని తలను, ఖండించెన్ = నఱకెను.

తాత్పర్యము:—కృష్ణుఁడు వజ్రనాభునియుద్ధనైపుణి చూచి, యీరీతిగా జరుగుచున్నచో ప్రద్యుమ్నునకు జయ మెన్నఁటికిని లభింప దని యెంచి, తన చక్రాయుధము నాతనిచేతి కందీయఁగా, దానిని ప్రయోగించి ప్రద్యుమ్నుఁడు వజ్రనాభునితలను నఱకెను.

క. గదసాంబులు తద్విజయాభ్యుదయముఁ గని పొంగి బహువిధోగ్రాస్త్రములన్
జిదురుపలుగ నొనరించిరి, కదిసి సునాభాదిదనుజగణదేహంబుల్. 216

అర్థము:—తద్విజయాభ్యుదయమున్ =ఆప్రద్యుమ్నునియొక్క గెలుపనెడిమంగళమును, బహువిధ + ఉగ్ర + అస్త్రములన్ = పెక్కు తెఱఁగులై, తీవ్రములైన యాయుధములచే, సునాభాదిదనుజగణ దేహంబుల్ = సునాభుఁడు మున్నగురాక్షసులగుంపుయొక్క మేనులను, చిదురుపలుగన్ =ముక్కలగునట్లు, ఒనరించిరి = చేసిరి.

తాత్పర్యము:—ప్రద్యుమ్నుఁడు వజ్రనాభుని జంపి విజయము నొందుటచూచి, గదసాంబులు పొంగి, భయంకరమగు నస్త్రశస్త్రములఁ బ్రయోగించి సునాభుఁడు మొదలగు రాక్షసవీరుల దేహములను నలినలి గావించిరి.

వ. అప్పుడు. 217

శా. మందారద్రుమ పుష్పవృష్టితతులన్ మంద్రస్ఫురద్దేవతా
దుందుభ్యారవసంప్రవర్తనలు నస్తోకాప్సరోనర్తనా

మంగోల్లాసము దివ్యగాయకుల సన్మాధుర్యగానంబు నా
నందోత్సేకము నిచ్చె లోకులకు మింటన్ జాల దీపించుచున్. 218

అర్థము :—మందార...తతులున్ - మందారద్రుమ = కల్పవృక్షపంచకములో నొకటి యగు మందార మను వృక్షముయొక్క పుష్ప = పూలయొక్క, వృష్టితతులున్ = వానలయొక్క సముదయములును, మందారపుష్పముల యొక్కజడివానలును, అనిభావము. మంద్ర ... వర్తనలును - మంద్ర = గంభీరములై, స్ఫురత్ = ప్రకాశించుచున్న, దేవతాదుందుభి = దేవతలభేరులయొక్క, ఆరవ = ధ్వనులయొక్క, (దుందుభి + ఆరవ - దుందుభ్యారవ - యణాదేశసంధి.) సంప్రవర్తనలున్ = సంచారములును - (ప్రసారములును.) అస్తోక...ఉల్లాసమున్ - అస్తోక=అధికమైన, అప్సరః = (రంభాది) దేవవేశ్యలయొక్క, నర్తన = నాట్యసంబంధమైన, అమంద = తక్కువకాని, అధికమైన, ఉల్లాసమున్ = ప్రకాశమును, దివ్యగాయకుల = స్వర్గమందుండు పాటగాండ్రగు గంధర్వులయొక్క, సన్మాధుర్యగానంబున్ - సత్ = స్థిరము, చలింపని, మాధుర్య = తియ్యందనముగల, గానంబున్=సంగీతమును, మింటన్ = ఆకసమునందు, చాలన్ = అధికముగా, దీపించుచున్ = ప్రకాశించుచు, లోకులకున్=జనులకు, ఆనంద+ఉత్సేకమును= సంతోషాతిశయమును - ఎక్కువసంతోషమును, ఇచ్చెన్ = ఇచ్చెను - కలిగించెననిభావము.

తాత్పర్యము :—అప్పు డాకసమునుండి మందారపుష్పవర్షము కురిసెను. దేవదుందుభులు మ్రోగెను. అప్సరలు నాట్య మొనర్చిరి. గంధర్వులు మధురముగా పాడిరి. జగము లన్నియు నిష్కంటక మగుటచే లోకులంద ఱమితానంద మొందిరి.

వి. :— కల్పవృక్ష పంచకము - (ని. పంచైతేదేవతరవో మందారః పారిజాతకః, సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్.) అమరము. 1. మందారము 2. పారిజాతము 3. సంతానము 4. కల్పవృక్షము 5. హరిచందనము అని.

వ. అంత నచ్యుతుం డనాథత్వదైన్యదశాపన్ను లగుపౌరజనుల ననేకవిధ లాలనా చాతుర్య శీతలవచనామృతంబున నపగతాశేషశోకపరితాపుల నపూర్వసంభృతా నందవిశేషులఁ గావించి, వజ్రనాభునిరాజ్యంబు సర్వంబును జతుర్భాగంబులుగా విభజించి, తదాధిపత్యంబునకుఁ బ్రభావంతునిఁ జంద్రప్రభుని గుణవంతునిఁ గీర్తి మంతునిం బట్టాభిషిక్తులం గావించి, కొడుకులం గోడండ్రనుం దమ్ముని మఱిదలిని నత్యంతవిభవంబు మెఱయం దోడ్కొనుచు ద్వారకానగరంబున కరుగుదెంచి, దేవేంద్రునిఁ దదీయస్థానంబున కనిచి సకలసామ్రాజ్యవిభవంబు లనుభవించుచు నిరంతరకరుణావలోకనంబుల భక్తజనంబుల నవలోకించుచు మహానందంబునం బొలుపొందుచుండె నప్పుడు. 219

అర్థము:—అచ్యుతుండు = నాశములేనివాఁ డగుశ్రీకృష్ణుఁడు, అనాథత్వ... పన్నులు - అనాథత్వ = రక్షకుఁడు లేమిచేఁ గల్గిన - (అరాజకత్వముచేఁ గల్గిన) దైన్యదశా = దీనభావముతోడి యవస్థను, ఆపన్నులు = పొందినవారు, అగుపౌరజనులన్ = అయినవజ్రపురవాసులను, అనేక ... అమృతంబునన్ - అనేకవిధ = పెక్కుతెఱంగులగు, లాలనా = బుజ్జవంబులందలి, చాతుర్య = నేర్పుచేత, శీతల = చల్లనైన, వాగమృతంబునన్ = అమృతమువంటి పలుకులచేత - చల్లని తియ్యనిమాటలచే పెక్కుతెఱంగుల లాలించి, అనిభావము. అపగతా ... తాపులన్ - అపగత = తొలఁగిపోయిన, అశేష = సమస్తములగు, శోక = దుఃఖములవలని, పరితాపులన్ = బాధకలవారినిగాను - ఎల్లవెతలను విడిచిన వారిఁగాను

అనిభావము, అపూర్వసంభృతానందవిశేషులన్ - అపూర్వసంభృత = పూర్వ (మొన్నడును) పొందనియుండనట్టి, ఆనందవిశేషులన్ = క్రొత్తసంతోషముగలవారినిగా, కావించి = [illegible]. వజ్రపురిపాలకుల తల్లిదండ్రులను పొంది బలికి మున్నెన్నఁడు నెఱుఁగని సంతసమును గలిగించినారై [illegible], చతుర్భాగంబులుగాన్ = నాలుగుపాళ్లు అగునట్లు, విభజించి = పంచి, తత్ [illegible] రాజ్యముల ప్రభుత్వమునకు, పట్టాభిషిక్తులన్ = [illegible] పుణ్యాజల [illegible] లచే సమంత్రకముగా నభిషేక మొనర్పఁబడినవారినిగా, కావించి, [illegible] = ప్రద్యుమ్నుని [illegible] [illegible] = ప్రభావతిని గుణవతిని, తమ్మునిన్ = గదునిని (గదాగ్రజో [illegible] [illegible] వసుదేవ [illegible]. అని అమర మందలి యధికపాఠము ననుసరించి కృష్ణుఁడు గదుని కన్న యని యుండుటచేత నిట తమ్ముఁడు [illegible] గదుఁడు) మఱఁదలిని = గదునిభార్యయగు చంద్రవతిని, అత్యంతవిభవంబు=అధికమగుసంపద, [illegible] = ప్రకటము కాఁగా, తోడ్కొనుచున్, ద్వారకానగరంబునకున్, అరుగుదెంచి = వచ్చి, దేవ + ఇంద్రుని = వేల్పుగా యని, తదీయస్థానంబునకున్ = అతనిస్థానమునకు, స్వర్గమునకు, అనిచి = పంపి, సకల ...విభవంబులు - సకల = సమస్తమైన, సామ్రాజ్య = చక్రవర్తిత్వమునకుఁగల్గు, విభవంబులు = సంపదల ను, అనుభవించుచున్, నిరంతరకరుణావలోకనంబులన్ = ఎడతెగని దయతోడి చూపులచే, భక్తజనంబులన్ = తన్ను సేవించువారిని, అవలోకించుచు = చూచుచు-రక్షించుచు అనిభావము. మహానందంబునన్ = గొప్పసంతసముతో, పొలుపొందు చుండెను = ప్రకాశించుచుండెను, అప్పుడు.

క. వావిరిఁ బ్రద్యుమ్నుండు ప్ర, భావతితో నిష్టకేళి ♦ పరిపూర్ణత నిం
పావహిలఁగ వర్తిల్లెను, శ్రీవరుఁ దమతండ్రిఁ దగ భ ♦ జించుచు ఘనుఁడై. ౨౨౦

అర్థము:—ప్రద్యుమ్నుండు, శ్రీవరున్ = లక్ష్మికి భర్తయైన, తమతండ్రిన్ = తమకుఁ దండ్రియగు శ్రీకృష్ణుని, తగన్ = తగినవిధముగా, భజించుచున్ = కొలుచుచు, ఘనుఁడై = గొప్పవాఁడై (పితృభక్తులలో మిన్నయై), వావిరిన్ = అధికముగా, ప్రభావతితోన్, ఇష్టకేళిపరిపూర్ణతన్ = ప్రియమైన క్రీడలయొక్క పూర్ణత్వముతో, పూర్ణముగా ప్రియ మగు క్రీడలఁ దేలుచు అని భావము, ఇంపు = సంతోషము, అవహిలంగన్ = కలుగఁగా, వర్తిల్లెను = ఉండెను.

తాత్పర్యము:— ప్రద్యుమ్నుఁడు లక్ష్మీపతి యగు తండ్రిని సేవించుచు, ప్రేయసి యగు ప్రభావతితో నిష్టవిహారము లొనర్చుచు నానందించుచుండెను.

వి. :—ఇది కావ్యమునకుఁ దుద కావున నీపద్యమున శ్రీ శబ్దప్రయోగరూపమగు మంగళము 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే.' అనుసూక్తిచొప్పున కవి యొనరించెను.

గీ. అఘహరణ హరివంశ కథా ♦ శ్రయంబు, నాత్మపుత్ర గుణ స్తవ ♦ నాంకితంబు
నైన యీకావ్యమునకు మహా ♦ ప్రసిద్ధి, నిచ్చుఁగావుతఁ గరుణ ♦ లక్ష్మీశ్వరుండు. ౨౨౧

అర్థము:—అఘ ... శ్రయంబు - అఘ = పాపములను, హరణ = పోఁగొట్టునట్టి, హరివంశకథ = హరివంశమునందలికథ, ఆశ్రయంబు=ఆధారముగా గలదియు, ఆత్మ ... అంకితంబు - ఆత్మ=తనయొక్క, పుత్ర = కొడుకగు ప్రద్యుమ్నునియొక్క, గుణ = గుణములయొక్క, స్తవన = స్తుతిచేత, అంకితంబును = చిహ్నితమును, ఐన యీ కావ్యమునకున్ = అయినట్టి యీ కబ్బమునకు, లక్ష్మీశ్వరుండు = లక్ష్మికిఁ బతియగు శ్రీకృష్ణపరమాత్మ, కరుణన్, మహాప్రసిద్ధిన్ = గొప్పదియగు ప్రఖ్యాతిని, ఇచ్చుఁగావుతన్ = ఇచ్చునుగాక.

తా. :—ఈ కావ్యమందలి యితివృత్తము పాపహర మనుహరివంశకథ ననుసరించినది. తనకొడుకగు ప్రద్యుమ్నుని గుణకీర్తనము కలది. కావున శ్రీపతి యగు కృష్ణుడు కరుణించి లోకమున దీనికి గొప్ప ప్రఖ్యాతి గూర్చుంగాక- యని కవి తన వాంఛితము నుగ్గడించి ధన్యుడయ్యెను.

వి. :—ఈ పద్యమునందు గూడ మంగళవాచకమగు 'లక్ష్మీ' శబ్దప్రయోగము నున్న, అదియుం జెప్పచివర పదముగా నుండుటయుం గవియొక్క శాస్త్రసంప్రదాయానుసరణము వ్యక్తము చేయుచున్నది.

## ఆశ్వాసాంతము

శా. శ్రీరాజేంద్రగురూత్తమాన్వయుడు జనుస్సంఖ్యాత సౌభాగ్య సో
మారాధ్యప్రభు సత్కృపా చతురమత్యానీత గౌరీశ భ
క్త్యారబ్ధ వ్యపగూహనాతి సుఖితాత్మాప్త క్షమాశాంతి స
ద్వైరాగ్యోదయ బోధముఖ్య బహుసంతాన ప్రసిద్ధిం డిలన్. 222

అర్థము :—ఇలన్ = భూమియందు, శ్రీరాజేంద్ర...ప్రసిద్ధుడు - శ్రీ = శోభాయుక్తుడైన, రాజేంద్రగురుడు = రాజేంద్రగురుడు అనెడువానియొక్క, ఉత్తమాన్వయ = ఉత్తమమైన వంశమందైన, జనుః = పుట్టుకచేత, సంఖ్యాత = ప్రసిద్ధమైన, సౌభాగ్య = మంగళకరమైన సోమారాధ్యప్రభు = సోమారాధ్యుండను గురుశ్రేష్ఠునియొక్క, సత్కృపా = స్థిరమగు దయచేత, చతుర = నిపుణమైన, మతి = బుద్ధిచేత, ఆనీత = పొందింపబడిన, గౌరీశభక్తి = శివునియందలి భక్తిచేత, ఆరబ్ధ = ఆరంభింపబడిన, వ్యపగూహన = వ్యాపారములచేత, అతిసుఖిత = మిక్కిలి యానందము గల, ఆత్మ = మనస్సు (బుద్ధి)చేత, ఆప్త = పొందబడిన, క్షమా = ఓర్పు, శాంతి = అంతరింద్రియ నిగ్రహము, సద్వైరాగ్య + ఉదయ = స్థిరమగు వైరాగ్యప్రాప్తి, బోధ = జ్ఞానము, ముఖ్య = మొదలుగాగల, బహుసంతాన, పెక్కురు బిడ్డలచే, ప్రసిద్ధుడు = ఖ్యాతి కెక్కినవాడు.

తాత్పర్యము:—రాజేంద్రగురువంశమునం బుట్టిన సోమారాధ్యునివలన నమరామాత్యునకు శివభక్తి కలిగి, భక్తి శబ్దము స్త్రీలింగము కాన భక్తి యను స్త్రీచే వ్యామోహముగా కౌగిలించుకొనబడి యమితానందమున మునిగిన యాత్మయందు క్షమా, శాంతి, వైరాగ్యోదయ, బోధ ప్రముఖములైన పెక్కు సంతతులు (బిడ్డలు) కలిగినవాడై లోకమున ఖ్యాతి నొందెను.

అలం. :—రూపకము.

వి. :—సోమారాధ్యునివలన శివమంత్రమో, శైవమతదీక్షయో స్వీకరించి, అపార శివభక్తితో నిండిన మనస్సుగలవాడై దానికి ఫలముగా, క్షమా, శాంతి వైరాగ్యబోధములు బొంది యమరయమంత్రి ప్రసిద్ధి కెక్కెను అనిభావము.

క. వరచామర మిషవృత దిక్కరటి శ్రుతి కీర్తి సామ్యకామ్యత్కృతి గో
చరి తాఖిలవిద్వత్కుంజరకర్ణుడు కర్ణుం డీగిచాతుర్యమునన్. 223

అర్థము:—వర = శ్రేష్ఠమైన, చామర = వింజామరలనెడు, మిష = నెపముచేత, వృత = ఆవరింపబడిన, దిక్కరటి = దిగ్గజములయొక్క, శ్రుతి = చెవులుగల, కీర్తి = యశస్సు - (అమరామాత్యుని కీర్తి వింజామర లనెడి మిషమున దిగ్గజముల చెవులను గప్పుకొనినది యని భావము) అట్టి యశస్సుతోడి, సామ్య = సాటిని, సమత్వమును, కామ్యత్ = కోరుచున్న, కృతి = ప్రబంధములచేత, గోచరిత = విషయముగా జేయబడిన, అఖిల = ఎల్ల, విద్వత్కుంజర = విద్వాంసులలో శ్రేష్ఠులనెడు ఏనుగులయొక్క, కర్ణుడు =

చెవులుగలవాఁడు - తనకీర్తి దిగ్గజముల చెవుల కెక్కినట్లే, తనకృతులు పండిత దిగ్గజముల చెవుల కెక్కినవి. అనఁగా దిగంత విశ్రాంత కీర్తియు, పండితు లత్యాదరమున వినఁ నభిలషించు ప్రబంధ రచనయుఁ గలవాఁడని భావము. ఈగి చాతుర్యమునన్ = దాననైపుణి విషయమున, కర్ణుఁడు = కర్ణునివంటివాఁడు.

అలం:—అపహ్నవము, అతిశయోక్తి, ఉపమ, శ్లిష్ట రూపకము.

వనమయూరము. భృత్యజన పోషణుఁడు పింగళి పురాంకా
మాత్యకుల భూషణుఁడు మార్దవమహీయః
సత్యశుచి భాషణుఁడు సాధుజనతాసం
పత్త్యుదయపోషణుఁడు భవ్యకృపపేర్మిన్. 224

అర్థము:—భృత్యజనపోషణుఁడు = సేవకజనులకుఁబోషకుఁడు - సేవకులనుపోషించువాఁడని భావము, పింగళి...భూషణుఁడు - పింగళిపుర = పింగళియనుపురము, అంక = చిహ్నముగాఁగల - పింగళి యను నింటిపేరు గల - అమాత్యకుల = మంత్రులవంశమునకు, భూషణుఁడు = అలంకారమైనవాఁడు, మార్దవ...భాషణుఁడు - మార్దవ = మృదుత్వముచే, మహీయః = మిగులఁబూజనీయములును, సత్య = వాస్తవములును, శుచి = పవిత్రములు నగు, భాషణుఁడు=వాక్కులుగలవాఁడు, భవ్యకృపపేర్మిన్ = యోగ్యమగుదయయొక్క పెంపుచేత, సాధు...పోషణుఁడు - సాధుజనతా=యోగ్యులైన జనసమూహాయము యొక్క, సంపత్తి=సంపదలయొక్క, ఉదయ = అభివృద్ధికి, పోషణుఁడు - యోగ్యులగు వారి సంపదలను వర్ధిల్లఁ జేయువాఁడు. (అగు పింగళియమరామాత్యుఁడు శాశ్వతానందము నొందుఁ గాక, అని యధ్యాహారము.) పోషణుఁడు, భూషణుఁడు, భాషణుఁడు, పోషణుఁడు. అను నంత్యానుప్రాసము గలదు.

## గద్యము

ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వవైభవ, పింగళి యమరనార్యతనూభవ, సౌజన్యజేయ, సూరయనామధేయ ప్రణీతంబైన, ప్రభావతీప్రద్యుమ్నం బను మహాప్రబంధంబునందుఁ బరిపూర్ణభావభాసురం బైనపంచమాశ్వాసము

ప్రభావతీ ప్రద్యుమ్న వ్యాఖ్యానము

సంపూర్ణము.